# విషయసూచిక.

# పరిషత్ప్రయోజనములు.

తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడుచున్నవి :—

i. తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వంకష మగునిఘంటు వొకటి రచించి ప్రచురించుట ,

ii. తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణమును రచించి ప్రచురించుట ;

iii. ఆధునికశాస్త్రగ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట ;

iv. ఆంధ్రదేశ ప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యము లయినవానిలో మిక్కిలి విశ్వసనీయము లైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగుదేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుటయు ;

v. సర్వవిషయములనుగుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట ;

vi. ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట ;

vii. తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొకపత్రికను బ్రకటించుట ;

viii. తెలుఁగువాఙ్మయమునకు సంబంధించినవిషయములనుగుఱించి చర్చించుటకుఁ గాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట ;

ix. తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను, నొసంగుట ;

x. ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట. ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగుగ్రంథము లుండవలయును ; వ్రాఁతప్రతులుగూడ నుండవలయును ;

xi. తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపచరించు నన్ని కార్యములను జేయుట.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

సంపుటము. ౧౬. { ప్రభవనామసంవత్సరము. చైత్ర వైశాఖ మాసములు. } సంచిక ౧.

## విజ్ఞప్తి.

భాషాభిమానుల యాదరము నపేక్షించుచు, భారతీకటాక్షమునఁ బరిషత్పత్రిక యిప్పటికిఁ బదేనేండ్లు గడపినది. ప్రభవసంవత్సరముతోఁ బదాఱవ వత్సరము ప్రారంభించినది. పాఠకమహాశయుల భాషాభిమాన మింకను బరిషత్పత్రికపై వెల్లివిరిసినట్లు తోఁపదు. పాఠకుల యాదరములేనిదే పత్రిక యిఁకెంతకాలము వెలువడునో, యెంతకాలమునకుఁ బాఠకుల కభిమానము వృద్ధియగునో, భాషయెప్పుడు పెంపొందునో యూహింపరాకున్నది. కేవల పండిత సాహాయ్యము చాలదు. భాషాభిమానులగు పాఠకులు తోడ్పడవలయును. వెనుకటి సంవత్సరములంబట్టి చూచినఁ బత్రికకుఁ బుష్టికలుగుచున్నట్లగపడదు. ఏవిధముగా దీనికిఁ బోషణము కలుగు నని పలువిధముల యోజించుచున్నారము. లోకము యొక్క యభిప్రాయము నాకర్షింప ననేకయత్నము లొనర్చితిమి. ఏయత్నమును సాయపడుటలేదు. భాషాభిమానులకుపయోగించునవియగు శివరాత్రిమాహాత్మ్యము, చంపూరామాయణము మొదలగు ప్రబంధములను, బెక్కుశాసనములను, చారిత్రకవిమర్శనములను, సాహిత్యపోషకములగు వ్యాసములను బత్రికాముఖమునఁ బ్రచురించితిమి; ప్రచురించుచున్నారము. అయినను, ప్రకాశకులవలన నన్నికార్యములును గానేరవు. పత్రిక తనపొట్ట తాను బోషించుకొనుటకైన నీపదాఱేండ్లనుండి సామర్థ్యమును సంపాదింపలేకపోవుట యనునది ప్రకాశకుల లోప మన సాహసించువా రుండరు. పాఠకుల నిరాదరణ మని కాని భాషాభిమానుల కొఱఁత యనికాని యనుట

యపచారము. పదేపదే మరలమరల బాలకలోకమును హెచ్చరింపవలసియున్నది. అనేకులు తమతమ చందాధనమును బంపుటలో నలసభావముం గనఁబఱుచుచున్నారనుట నిర్వివాదము. అట్టివారు మాప్రార్థనము చేరినతోడన తామసింపక ధనము నంపవలయును. తమ మిత్రులఁ జందాదారులుగఁ జేరఁ బ్రోత్సహింపవలయును. ఇంతవఱకు నీపత్రికవలనఁ గలిగినమేళ్లను బ్రకటించుచుండవలయును. ఈపత్రికలోఁ బ్రకటింపఁబడిన పూర్వకవికృత గ్రంథములను గొనవలయును, జదువవలయును, బరులచేఁ జదివింపవలయును. సాహిత్యపోషకములును జారిత్రికవిషయములు నగు వ్యాసములను వ్రాసి పంపవలయును. అప్పుడుగాని పరిషత్పత్రిక సర్వజనాంగీకారముం గాంచదు. కేవల వార్తాపత్రికలవలెఁ సర్వజనులు దీనిం జదువ నవస్థపట్టుట వట్టిమాట. భాషావిదులలో నల్పసంఖ్యాకులైన దీనికిఁ దోడుపాటొనర్చినచో భాషకుభావికాలమున నత్యంతసహకారియై వఱలఁగలదు. ధనము లేనిదే యేకార్యమును సాగదు. ఈయవలసినవారు తమతమచందాల నిచ్చిన నదిమొదటి తోడ్పాటగును. క్రొత్తగాఁ బాలకబృందముంగూర్చిన నది రెండవతోడ్పాటగును. రెండునుంగావించినఁ జెప్పనేల. ప్రతిపాలకమహాశయుఁడు నీయుద్దేశములను మనంబుననుంచికొని పరిషత్పత్రికపై నభిమానముంచునట్లు సరస్వతి వారినారి యుదారాశయముల నెలకొని తాండవించుంగాత! ప్రభవసంవత్సరము పరిషత్తునకు, బరిషత్పత్రికకు సుముఖమగుంగాత!



# కావ్యభాష.

—అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.—

పూర్వులచరిత్రము లన్నియుఁ జక్కఁగాఁ దెలియవచ్చుటయే కావ్యములకుఁ బ్రయోజన మని దండికవి చెప్పె. యశస్సు, అర్థము, వ్యవహారజ్ఞానము, అమంగళములుపోవుట, పరమానందము, మనోజ్ఞముగ నీతినుపదేశించుట, అను నీయాఱును గావ్యఫలము లని ముమ్మటభట్టాచార్యుఁడనియె. సదాచారోపదేశద్వారమున జనులను వినీతుల నొనర్చుటే కావ్యప్రయోజన మని యానందవర్ధనాచార్యు లనిరి. ధర్మార్థకామమోక్షములు పడయుటయే కావ్యఫల మని విశ్వనాథకవిరాజు సాహిత్యదర్పణమున వ్రాసినాఁడు. ధనము మున్నగునవి ముఖ్యఫల మని చెప్పుటకన్న వినీతి గలిగించుటే ఫల మనుమాట యుక్తముగ నున్నది. పురాణములు మొదలైనవి యున్నను రంజనపూర్వకముగ ధర్మమునఁ బ్రవర్తింపఁ జేయఁగలశక్తి కావ్యములకే కలదు. వేదశాస్త్రపురాణాదులు రసప్రధానములు కావు కావునఁ బరిణతమతులైనవారికే వానివలనఁ గష్టముమీఁదఁ బురుషార్థము సిద్ధించును. పరమానందసందోహమును గల్గించునది యగుటచే సుకుమారబుద్ధులకు సైతము సుఖముగఁ బురుషార్థప్రాప్తి కావ్యమువలననే కలుగవలె నని విశ్వనాథకవిరాజుగారు సాహిత్యదర్పణమునఁ జేసినవిమర్శ మీయంశమును దృఢపఱుచుచున్నది.

మఱియు సదాచారము నుపదేశించుటకొఱకే యేర్పడిన నాటకాదిగోష్ఠి వినీతిని గల్గింపవలసిన జనులహితముకొఱకే మునులచే లోకమునఁ బ్రవేశపెట్టఁబడినది. శృంగారము మొదలయిన రసముల యంగములచేత విముఖులు సైతము సున్ముఖులై సుఖముగ నీతిబోధను గ్రహింతురు. అనియెడి యానందవర్ధనాచార్యులవారి పరిశీలనము సైతము కావ్యబోధలోని వైలక్షణ్యము నిట్లే సిద్ధాంతీకరించుచున్నది.

"కృశే కవిత్వేఽపి జనాః కృతశ్రమా విదగ్ధగోష్ఠీషు విహర్తుమీశతే" అని దండిపల్కెను. మహాకవికావ్యార్థానుసంధానము సరసకవితకుఁ గారణమైనట్లే కవిత్వమునకు సంబంధించిన పూర్వవాసన లేనివారియెడ వినీతిని గల్గించి విదగ్ధతను గలిపి జగదుపకార మొనరించెడి నని యాచార్యాశయము. సంకల్పవికల్పాత్మకము మనస్సు. నిశ్చయాత్మకబుద్ధి జ్ఞానాంశము బుద్ధి కెక్కి

నం గాని యాచరణ ప్రచారణములచేఁ గృతార్థము గాదు. బుద్ధి యన విజ్ఞానమయకోశము. దీని కంగములు సత్యము, ఋతము, యోగము నై యున్నవి. ఋత మనఁగా శాస్త్రమున నిది చెప్పఁబడిన దని తెలిసికొనుట. సత్య మన న ట్లాచరించుట. ఇట్టి యంగములు గలబుద్ధి కెక్కినంగాని మనుజుఁ డాచరణమునకు దిగఁ డనుట నిశ్చితముగాదు. ఏకాగ్రత యెఱుఁగని స్వల్పబుద్ధులగు వారికి అన్నాదికోశములవీడి నాల్గవకోశముఁ జేరుట కెంతటి చమత్కారప్రాబల్యమో కావలెఁ గాన కావ్యసృష్టి కిట్టివిసయాధానము ఫలమనుట యుక్తము.

మఱియుఁ గబ్బ మనునది యొకకళ గాన రసాస్వాదద్వారమున 'రసో వై సః'అని చెప్పఁబడిన పరమపురుషార్థమునకు సైతము స్వాయముగఁ జీలుత్రోవను జూపఁగల దని తోఁచెడిని. ఇదియే ముమ్మటభట్టాచార్యులవారిచేత "సద్యః పరనిర్వృతయే" అని చెప్పఁబడినది. విషయానందములకన్న మిన్నయై బ్రహ్మానందసహోదర మైనయొకమహానందము కావ్యరసాస్వాదపరాయణులకు సద్యస్కాలమున గోచర మగునని యాచార్యాభిప్రాయము. ఈ యసంలక్ష్యక్రమానందానుభూతి జూఱగొనువారియెడ నీతిమొదలైన చిన్నచిన్నఫలములు కావ్యమహాలక్ష్మికిఁ జెప్పఁ దగవు. కావుననే "విశ్వశ్రేయః కావ్యమ్"అని నన్నయభట్టారకుఁడు మురిసికొనెను.

వెనుకఁ జెప్పినరీతిని, ఎంతటిచంచలచిత్తుల కైనను, ఎంతటివిషయలోలుర కైనను హృదయకుహరములలోనికిఁ జమత్కారద్వారమున బలాత్కారముగఁ జ్ఞేయాంశములను జొనుపవలసినవి కావ్యములు. తమస్వాదుత్వబలమున జ్ఞాతాంశము లాచరణప్రచారణములచే సార్థకము లగునట్లు చేయవలసినవి కావ్యములు. అట్టి పెద్దభారము వహించియున్న కావ్యములకుఁ బలముగఁ జమత్కారపుష్టి యుండవలెను. ఆచమత్కారము సిద్ధింపఁజేయుటకే రసములు, గుణములు, అలంకారములు, వృత్తులు, రీతులు, పాకములు, శయ్యమున్నగు నామములతోఁ గావ్యోపస్కారము లేర్పడినవి. కావ్యముల కందము గూర్చునవి కావున నివి యెల్ల నలంకారము లనియు నుపస్కారము లనియుఁ జెప్పఁబడును. అయుపస్కారములచే నలంకరింపఁబడినదే కావ్య మగును గాని యతిప్రాసలు గూర్చిన పద్య మెల్లఁ గావ్యము కానేరదు.

ఈవిషయమునఁ బెద్దల యాశయము లి ట్లున్నవి. పరిష్కృతేస్తు

లయిన—(పూర్వోక్తగుణాలంకారాదులతో నిండిన) శబ్దార్థములు కావ్యము. రసవంతమైనసూక్తియే కావ్యవాక్కు. అని నన్నయభట్టాచార్యులవారు చెప్పిరి.

రమణీయములయిన యర్థములచే నలంకరింపఁబడిన పదావళియే కావ్యమని యాచార్యదండి వాకొనెను.

దోషములు లేక గుణము లుండి యలంకారలోప మెక్కువ లేకుండెడి శబ్దార్థములు కావ్య మని మమ్మటభట్టాచార్యులు సెలవిచ్చిరి.

రసాత్మక మైనవాక్యము కావ్య మని విశ్వనాథకవిరాజుగారు వ్రాసిరి.

రమణీయార్థమును జెప్పుశబ్దము కావ్య మని పండితరాయలవారు నిర్వచించిరి.

ఇట్లు లక్షణకర్త లగుపరిశీలకులు పెక్కురకములఁ గావ్యస్వరూపనిర్ణయము చేసియుండినను సహృదయహృదయంగమ మగుటకుఁ గావలసినచమత్కారపరికర మంతయు సంపూర్ణముగాఁ గావ్యమున నుండితీరవలయు ననుట యెల్లరయాశయము నైయున్నది. చూడుఁడు, ప్రబంధము వ్రాయుకవి సర్వవిధముల రసపరతంత్రుఁడుగావలెను. కావ్యకర్త కథను మాత్రము రచించిన నొకింతయుఁ బ్రయోజనము లేదు. ఇతిహాసములవలన నది సమకూడదా ? అని ధ్వన్యాలోకము నియమించుచున్నది.

భగవద్గీతలలో స్థితప్రజ్ఞుని లక్షణములు చెప్పపట్టున శ్రీశంకరాచార్యులవారు వైరాగ్యము సర్వసమత మొదలైన యీసుగుణము లన్నియు సాధకున కభ్యసింపఁదగిన వగుచు సిద్ధునకు సిద్ధములయిన సిద్ధలక్షణ లగుచున్నవని వ్రాసినారు. అట్లే కావ్యమునకు సొగసుఁ దెచ్చెడి సముచితగుణాలంకారవృత్తిరీతి పాకాదు లన్నియు రససిద్ధుఁడై మహాకవిపదము నధిరోహించిన శబ్దబ్రహ్మవేత్తవాక్కులకు సహజలక్షణములై ప్రయత్నము నపేక్షింపక దొరలుచుండును.

కావ్యజ్ఞశిక్ష లోకజ్ఞానము శాస్త్రజ్ఞానము మున్నగువాని నపేక్షించియుండును. "సాధ్యోహి రసో యథాతథం కవిభిః" అనునన్నయభట్టారకుని యనుశాసనమువలనను "రసాదిషు వివక్షాతు స్యాత్తాత్పర్యవతీ"అని ధ్వన్యాలోకమున నుండుటంజేసియు మహాకవి యగువాఁడు రససిద్ధియందు మాత్రము దత్తదృష్టియైన మిగిలిన కావ్యోపస్కారము లన్నియు స్వాయముగ సముచితముగా సమకూడుచుండు నని సూచితమగుచున్నది.

శ్రీమద్రామాయణమహాకావ్యములో మొట్టమొదటి ప్రస్తావన మహా కవిలక్షణమునే సూచించుచున్నది.

క్రౌంచపక్షులజంట వియోగమును జూచుటవలన మనసు కరఁగి శోకించెడి వాల్మీకివాక్కునుండి యయత్నముగ

మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః

య త్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్

అనుపద్యము వెలువడినట్లు చెప్పఁబడినది. ఇది మహాకవికి ముఖ్యలక్షణ మయిన యార్ద్రహృదయత్వమును జూపుటకై యున్నది దీనినే—

ఆదికవేః పురా

క్రౌంచద్వంద్వవియోగోత్థః, శోక శ్లోకత్వ మాగతః

అని యానందవర్ధనాచార్యులవారు ప్రశంసించినారు. ఎల్లకథలలోని యంశములు నేవో రసములకు విభావములు గాకపోవు కావున గావ్యము సరసమగుటకుఁ గావ్యకర్తయొక్క తత్పరత్వముతోఁ గూడికొనిన రసాదివివక్షయే కారణ మనినారు. ఆతత్పరత్వము తన్మయత్వమే. అది యీయాదికవివంటి యార్ద్రహృదయులకుఁ గాని యొనగూడదు. "తేన వ న్నా రసచ్యుతః" అనెడి రసోచితశబ్దప్రస్తావమును "వస్తున్యపి రసస్థితిః" అని దండిచూపిన రసాశ్రయము లయినయుదారార్థములు నిట్టితన్మయీభావయోగ్యత గలసరసుల క ప్రయత్నముగఁ జేకూరుటయం దచ్చెరువు లేదు. క్రుద్ధుఁడై పోట్లాడునప్పుడు మృదుశబ్దార్థములును శాంతుఁడై యుండునప్పుడు కర్కశము లైనమాటలతోఁ గర్కశార్థసందర్భములును మనుజునినోటినుండి రావుకదా. అట్లేకదా నిబద్ధులలో లీనమైనకవికి నిట్లే.

కవి శృంగారి యైనచో జగమంతయు రసమయ మగును. కవి విరక్తుఁడైన జగము నీరస మగును. అపార మయినసృష్టిలోఁ గవియే బ్రహ్మ యనియెడి యానందవర్ధనుని శ్లాఘయు బ్రహ్మసృష్టికంటెఁ గవిసృష్టి గొప్పది యనెడి మమ్మటభట్టాచార్యులవారి ప్రశంసయు నీకవిబ్రహ్మకే చెల్లును.

సోర్థ స్తద్వ్యక్తిసామర్థ్యయోగీ శబ్దశ్చ కశ్చన-

అనున ట్లేయర్థ మేభావమును వ్యక్తపఱుపఁగలదో, ఏశబ్దమున నేయర్థము ధ్వనించునో, అది యిట్టిమహాకవికే గోచరము. ఈవాగ్విదుఁడే " నాటకాంతం కవిత్వం" అనినట్లు కవితాపరమావధి యగునాటకకర్తృత్వమున శోక

సంగ్రహ మొనరింపఁగలుగును. ఈపండితకవికే పౌరాణికగాథలను మార్చి రసానుగుణముగఁ గథాసృష్టిఁ జేయుస్వాతంత్ర్య మీయఁబడినది. వీరిపోకడలను జూచియే నాటకాదులందు లక్షణకర్త లభ్యాససౌకర్యమునకై ముఖాది సంధులు, సంధ్యంగములు, మున్నగువానిని లక్షణములతోఁ జూపుటయు రసపరతంత్రు లగుసత్కవులు రసముకోసము వాని నుల్లంఘించుటయు సంస్కృతవాఙ్మయమునఁ గన్పట్టెడి.

ఇట్టిమహాకవి యైనకతముననే భవభూతి తన్నుఁగూర్చి "శబ్దబ్రహ్మవిదః కవేః పరిణతాం, వాగ్వశ్యైవానువర్తత, వాచమర్థోనుధావతి" అని యుద్ధతోక్తులు పల్కుట లోకమునకు ముద్దుగొల్పుచు మహాకవిలక్షణము నెఱుకపఱుచుచున్నది.

ఇట్టిధ్వనికావ్యకర్తలు గావుననే తిక్కన, నాచనసోముఁడు మున్నగువారు తమయశఃపతాకలచేత నంధ్రభూమి నిప్పుడు నలంకరించుచున్నారు. ఇట్టికవిసార్వభౌముఁడు కావుననే "పగులఁగొట్టించితి—అనియు— దివిజకవివరు గుండియల్ దిగ్గురనఁగ" మొదలైన శ్రీనాథుని యుద్ధతవాక్యములు సొంపు నింపుచున్నవి. చూడుఁడు

సీ. పాదంబు లిరుచేతఁ బట్టి గుంజుండు జర్జరితంబుగా వీనిఁజట్టుతాఁత
మెడ మెట్టి గోర్గాండి మెటికిపుచ్చుఁడు వీనిగ్రుడ్లు చెక్కుల నెత్తురులు స్రవింప
గడికండలుగ వీనికంఠంబు వేయుండు గరసానవట్టినఖడ్గధార
బలుత్రాళ్ళ బంధించి తలక్రిందుగా వ్రేలఁగట్టుఁడు వీనివృక్షంబుకొమ్మ
గీ. అంపమున వీని కంఠంబు ద్రెంపి విడుఁడు
మడమతాపుల వీనిమర్మముల నొంపుఁ
డెఱ్ఱగా నగ్నిఁగాఁగినయినుపయినుకఁ
గులికి పోయుఁడు వీనిముక్కుననుఁ జెవుల.
"తఱిగె నెవ్వఁడు ఖడ్గధారాంచలంబున నగ్నినాలుక లేడు నంటగట్టి
గీ. మోదె నెవ్వాఁడు ముప్పదిమూఁడుకోట్ల
వేలుపులఁ బాఱఁబాఱ వెన్నంటఁ దగిలి
అట్టి శ్రీవీరభద్రుండు".—రౌద్రము.
గీ. భాస్కరుం డనుమాణిక్యపదకభూష
యఱుతధరియించి దేవి గాయత్రి యొప్పు,
గడుపుచల్లంగ వేదాలఁ గన్నతల్లి.—భక్తి.

వాత్సల్యము.

గోష్ఠీనాగ్రంబున లేఁగపెయ్యయదె కంటే కామధేనూద్భవం
బానందంబున డెందముబ్బఁగ జనన్యాపీనవాపీసుధా
పానోత్పుచ్ఛమనూన మా చటులఝంపాతాండవాటోపముల్.
నీవిటంచీలలితారవామృతము చిత్తముసోఁకినవార లీకళా
శాలినిఁ జూచి దీవెనలొసంగకపోవరు సుమ్ము నావుడున్
వనితాజనతావినుతాభిధేయుఁడై.—ధ్వని.

శబ్దాలంకారములు.

హితసుమనోమనోరథము లెల్లఘటింపఁగఁజాలు లోక
సన్నుతునకు నీకు నిత్తు సుమనోరథమొక్కటి గొమ్మటంచు దై
వతపతి రాజవర్యున కవార్యమహార్యమహార్యభీశుసం
యుతమణిభాసమాన మగునొక్కవిమానము చూపి యిట్లనున్.

అర్థాలంకారము.

సీ. మోహోపదేశతమోముద్రితములైన, కనుదమ్ములహిమాంబులునుపరాదు
పటుతాపపుటపాకపరిహీణతనుహేమమింకఁ బల్లవపుటార్చిడఁగరాదు
శ్రమబిందుతారకాగమఖిన్నకుచకోకములఁ జంద్రనామంబుఁ దలఁపరాదు
శీర్యదాశాన్య[illegible]తాంత మసియాడ వీవనల్ విసరరాదు
గీ. లలన కాం[illegible]కలాప, సంతతాలీఢహృదయపాత్రాంతరాళ
పూరితస్నేహపూరంబు పొంగిపొరలఁ, జల్లనిపటీరసలిలంబుఁ జల్లరాదు.
బలవదనేకపతుల నానుగుణ్యంబు జగదుపశ్లోకితంబుగ భజించె
మహితనయ, కృష్ణమృగనేత్ర మంజుగాత్ర.—శ్లేష.

భావకవిత్వము.

ఉ. ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటిఁ జరించె దోటలే
కివ్వనభూమి భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవదప్పితిం
గ్రొవ్వున నిన్నగాగ్రమునకుం జనుదెంచి, పురంబుసేరనిం
కెవ్విధినేర్తుఁ దెల్పఁగదవే తెరువెద్ది శుభంబు నీకగున్.
ఉ. ఎంతకులేఁడు నారదమునీశుఁడు శౌరి వినంగ రుక్మిణీ
కాంత వినంగ నేను వినఁగాఁ బలికెం బతిగూర్చుదాన నా
యంతటివారులే రని యహంకరణంబున విఱ్ఱవీఁగుచున్
వంతుకువచ్చు సత్యగరువం బికఁ జెల్లదటంచు మానినీ !

ఇట్టికవిత యెట్లు లభించు ననునది విచారాంతము.

శ్లో. నైసర్గికీ చ ప్రతిభా, శ్రుతం చ బహునిర్మలమ్
అమంద శ్చాభియోగోఽస్యాః, కారణం కావ్యసంపదః.

శ్లో. శక్తి ర్నిపుణతా లోకశాస్త్రకావ్యాద్యవేక్షణమ్
కావ్యజ్ఞశిక్షయాఽభ్యాస ఇతి హేతు స్త దుద్భవే
కవిత్వం జాయతే శక్తేః వర్ధతేఽభ్యాసయోగతః
తస్య చారుత్వనిష్పత్తౌ వ్యుత్పత్తిస్తు గరీయసీ.

లోకోవిద్యా ప్రకీర్ణం చ కావ్యాంగాని

అని వామనుఁడు చెప్పె. ప్రకీర్ణ మనఁగా—లక్ష్యజ్ఞత్వ మభియోగః ప్రతిభానం వృద్ధసేవావేక్షణం అవధానం చ ప్రకీర్ణం, అనియెను. కావ్యపరిచయః లక్ష్యజ్ఞత్వం అనినారు. కావ్యపరిచయము కవితను గూర్చి కారణ మని వామనోక్తులవలనఁ దెలియవచ్చెడిని. కావ్యములను సావధానముగ సాదరముగ రసానుభవసర్వస్వముఁ జదువుచుండుటయే కావ్యపరిచయము. మహాకవుల సరసకవిత్వమును జదువుట మొదట నేర్చుకొనవలెను. పిదప దానియందు రుచి యేర్పడవలెను. తర్వాత నాయానందములోఁ దన్మయుఁ డగుట సమకూడవలెను. అప్పు డాభావములు రసములతోఁ గూడ మతికెక్కును.

కవిత్వము చెప్పవారేకవిప్రబంధములను సాదరముగఁ జదువుచుందురో, ఆకవిపోకడలే వారికబ్బములందుఁ బడుచుండును. దానివలన భాషద్వారమునఁ గవీశులభావప్రపంచ మంతయుఁ బాఠకులమనోదర్పణములలోఁ బ్రతిఫలించి యామానసదర్పణముల స్వచ్ఛతాబలమున నచట నిలిచిపోవుచుండు నని యూహింపవచ్చును. "అత ఏవ చ నిత్యత్వమ్" అనుసూత్రముచే వ్యాసులవారు, వేదవాక్కులకు నిత్యత్వము సాధించుచు సృష్టిలో నభివ్యక్తస్వరూపమునను బ్రళయమున ననభివ్యక్తరూపమునను వేదవాక్కుండు ననినారు. "యుగాంతేం తర్హితాన్ వేదాన్" అట్లే మహాకవివాక్కులకు నైతె మమృతత్వము చెప్పఁదగియున్నది. మహాకవి సరసహృదయమున సూక్ష్మరూపమున నపాయములేనిదై యుండెడి వాగ్దేవి వైఖరిరూపమున బయలువెడలి నాదలిపిరూపములు వహించి లోకయాత్ర నడపుచు రసికులగుపాఠకులహృదయములలోనికి సూక్ష్మరూపమై దీపము దీపాంతర మైనట్లు చేరును. మరల వారు కవులైన వారినోటినుండి వైఖరినై బయలుదేఱి గ్రంథప్రపంచ

మగుచుండు. ఇవియే వ్యాకృతావ్యాకృతావస్థలు వాక్ప్రపంచమునకు స్థూలసూక్ష్మరూపముగఁ బేర్కొనఁదగియున్నవి. తైత్తిరీయోపనిషత్తు మనోమయకోశమునకు ఋగ్యజుస్సామాదివేదము లంగములుగఁ జెప్పె. దీనిచే మనస్సు వాక్సూక్ష్మమూర్తి కావునఁ గవిత్వమునకై చేసెడి పురుషప్రయత్నములలో "లక్ష్యజ్ఞత్వం" అని వామనాచార్యులవారు చెప్పిన సత్కావ్యార్థానుసంధానము కవితాభ్యాసకులచే ముఖ్యతమముగఁ జేకొనఁబడవలెను.

అనౌచిత్యాదృతే నాన్యద్ రసభంగస్య కారణమ్
ప్రసిద్ధౌచిత్యబంధ స్తు రస స్యోపనిష త్పరా.

అని ధ్వన్యాలోక ముపదేశించుచున్నది కదా. ఈయౌచిత్యజ్ఞానమెంతదుర్లభమో చూడుఁడు. పాత్రౌచిత్యము, ప్రసంగౌచిత్యము, రసౌచిత్యము, పదౌచిత్యము మున్నగునవి వేనవేలుకలవు. వీనినిలక్షణములద్వారమున నెఱింగి కవితనిర్వహింపఁగలుగుటయసంభవము. రసమొకటేవిధముగ దీర్ఘముగఁ బ్రస్తుతించిన విసువు గలుగును. పరిపూర్ణపుష్టి నందుదాఁక రసము వర్ణింపకపోయిన నది పచ్చికాయవలెఁ జేదు వేయును. పరిపుష్టమైనరసమును మరలఁ జర్వితచర్వణముగ నడపిన వెగటు కలుగును. విరుద్ధరసములకుఁ బ్రసక్తి గలిగినప్పుడు నడుమ ననుకూలరసముల నడ్డమునుంచుచు నిట్లు రసౌచిత్యముఁ జెడనీయకుండుట కవిపని. అని యేమేమో త్రోవలను ధ్వన్యాలోక మాలోకింపఁ జేయుచున్నది. ఇవి యిట్లు తెలిసికొని రచనకుఁ గడంగుట యనుభవమునం జూచిన దుష్కరముగఁ గన్పట్టెడి.

కావున స్వాధీనవాక్కులై శబ్దబ్రహ్మవేత్తలయిన మహాకవిబ్రహ్మల కావ్యార్థముల సరసహృదయములతో నాస్వాదింప నేర్చి తన్మయీభావపరిపాకమున కాస్పదము లగుచు భావసృష్టియందును బదగుంభనాదు లగుసర్వవిషయములందును వారి ననుసరించుట, తానుగూడ రససిద్ధుఁడై మహాకవి యగుదాఁకఁ గవి కాఁబోవు వానికి సులభమును యుక్తము నైనయుపాయమై యున్నది.

కవి స్వతంత్రుఁ డగుటయే సమ్మతము కాని వాక్పరిపాక మెఱుంగనివాని కాస్వతంత్రత యిచ్చుట సామురానివానిచేతికిఁ గత్తి యిచ్చుటవంటిదై భాషాప్రపంచమునకు ముప్పు గల్గించునేమో. ఇట్టిహేతువు లుండుటఁబట్టియే యీమహాకవి ప్రయోగానుస్మృతిని "కావ్యజ్ఞశిక్షయాభ్యాసః" అని మమ్మటభట్టాచార్యులు నొప్పుకొనిరి.

మహాకవి కాళిదాసుగారి కవిత్వమున శివపురాణపు పోలిక లున్నవి.

తురాసాహం పురోధాయ-

పురోధాయ తురాసాహం-

ఇట్టి భేదములతోఁ గూడఁ గొన్ని శ్లోకములున్నవి.

ఇది కాళిదాసుకవిగారి కావ్యజ్ఞశిక్షాభ్యాస మనుకొనవలె. మున్ముందు వృత్తములపోకడ కుదురుటకు టంటంటటంటం టటటంటటంటః అని యల వాటు చేసెనఁట. తర్వాత, పూర్వకవిపద్యము కొంతపెట్టుకొని పూరణము లును, పూర్వకవిపద్యములకే ప్రతిపదములును పూర్వకవిపద్యములకే పదవ్య త్యాసములును జేయుచు ని ట్లభ్యసించెనఁట. ఇట్టియభ్యాసరీతు లన్నియుఁ గాళిదాసమహాకవిగారి శివపురాణానుసరణములలోఁ జూపట్టెడి.

శ్రీనాథమహాకవిగారి కవనమందలి ఛాయలు పెద్దనకవిగారి పద్యము లలోఁ గన్పట్టినను పెద్దనకవిగారి కబ్బపువిధములు వసుచరిత్రములోఁ గన్పట్టి నను మఱియు వసుచరిత్ర యనుసరణము లితరకవులరచనలలోఁ గన్పట్టినను, అది కావ్యవిదులమార్గములలో నడచుచుఁ గవిత్వకై చేసెడియభ్యాసమేకాని గ్రంథచౌర్యము కాదు. మొదటినుండియు స్వయముగ నభ్యాసముచేసెడి కవికిని బూర్వగ్రంథానుసరణముగఁ గృషిచేయు కవికిని గవితామార్గములో మిగుల భేదము గన్పట్టు. గ్రంథానుసరణపూర్వకముగఁ గృషిచేసిన యల్లిక లందముగ నుండును.



# అఱవమునందలి వింతయక్కఱము తెలుఁగునఁ గలదా

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

---

ఈవిషయమున గతసంచికలో బ్రహ్మయ్యశాస్త్రులు గారు ప్రకటించిన వ్యాసములోని సారాంశము లన్నింటికిని సమాధానము నాప్రథమవ్యాసమందే యున్నది. వాని నిచట నుదాహరించుట పిష్టపేషణ మగును గావున నట్లుచేయక వారివ్యాసమందలి పొరపాటులను గొన్నింటిని గనఁబఱిచి విరమించెదను.

(1) "పేర లీవింతయక్కఱమును ధ్వనియును తెనుఁగులో యుద్ధమల్లు శాసనమునాఁటి కుండె ననియుఁ దరువాత మాఱిపోయిన వనియు నప్పటినుండియు నీవింతయక్కఱము డకారధ్వనిని తెలుపునదిగా నుండెడి దనియు లిఖించిరి" అని యొకచోటను, "పంతులవారు సరిగ యుద్ధమల్లశాసనమువఱకే యీయక్కఱము నిల్చినదని సిద్ధాంతము చేయుట వింతను బుట్టించుచున్నది. ఈయక్కఱ మీశాసనము పుట్టువఱకు నెట్టెట్లో కొనయూపిరితో నిలిచిన దఁట. అది మైనవెంటనే గతించిన దఁట. ఈవింతయక్కఱ మీవింతశాసనముకొఱకే పుట్టియుండనోపు" నని యింకొకచోటను. శాస్త్రులుగారు వ్రాసిరి. ఈరెండువ్రాఁతలకుఁ గలపరస్పరభేదమును బాఠకులు గ్రహింతురుగాక. ఈరెండునుగూడ నావాదమునకు సరియయిన యనువాదములు కావు. యుద్ధమల్లశాసనమునందును, అంతకుఁబూర్వము పుట్టిన కొన్ని శాసనములలోను మాత్రమే యీయక్షరము కనఁబడుచున్న దనియు, యుద్ధమల్లశాసనకాలము పిదపఁ బుట్టిన శాసనములలో నెచ్చటను గానవచ్చుట లే దనియు, కావున నన్నయభట్టారకునినాఁటి కది యంతరించి యుండు ననియు నావాదము. ఈవాదమును బాధించు ప్రమాణములు నాకుఁ గనఁబడలేదు. కనఁబడినచో వానిని బరిశీలింప వలసియుండును.

(2) "అడ్డుగీటులేని శకటరేఫాకృతి గల యీయక్కఱము యుద్ధమల్లుని శాసనమున కీవలిశాసనములలో వింతయక్కఱపుధ్వనిని దెలుపుటకుఁ గాక డకారధ్వనిని దెలుపుటకై వాఁడబడిన దని పంతులవారే యంగీకరింపవలసివచ్చినది" అని యొకచోట వ్రాసి దానికిఁ బ్రమాణముగా నామాటలు

మూఁడింటి నుదాహరించినారు. వానిలో మొదటి రెండువాక్యములును బ్రహ్మయ్యశాస్త్రులుగారి సిద్ధాంతమునకుఁ బ్రమాణములు కానేరవు. వింతయక్కఴమునకు డకారధ్వని కలదని వానిలో లేదు. మూఁడవవాక్యము నేను లక్ష్మణరావుగారిపేర వ్రాసినయుత్తరములోని మాట కనువాద మని లక్ష్మణరావుగారు వ్రాసినట్లు వీరభద్రరావుగారు వ్రాసినదానిని శాస్త్రులుగా రుదాహరించినారు. నేను లక్ష్మణరావుగారిపేర వ్రాసినయుత్తర మాంగ్లభాషలో వ్రాయఁబడినది. దానికిఁ బ్రతిని నే నుంచుకొనలేదు. ఆయుత్తరములోని వాక్యమును లక్ష్మణరావుగారే తెనిఁగించివ్రాసిరో లేక వీరభద్రరావుగారు తెనిఁగించిరో తెలియదు. యుద్ధమల్లునినాఁటికే వింతయక్కఴమునకు డకారోచ్చారణము వచ్చిన దని నేనునిశ్చయించివ్రాసినట్లు జ్ఞప్తి లేదు. అట్లువ్రాసియుండనని నానమ్మకము. అట్లు నిశ్చయించుట కిప్పుడుఁ గూడ నాధారములులేవు. అప్పు డెట్లు నిశ్చయింప నగును. ఆయక్షరము ధ్వని మాఱిన మాఱియుండవచ్చు నని వ్రాసియుందును. శకటరేఫమును మన మిప్పుడు లఘురేఫమువలె నుచ్చరించుచున్నాము. ఆలాగుననే ఴకారమును డకారమువలె యుద్ధమల్లుని కాలమందుఁ గాని వేఱొకకాలమందుఁ గాని జను లుచ్చరించియుండవచ్చును. కాని యట్లుచ్చరించి రని సిద్ధాంతీకరించుట కాధారములు లేవు. కాకపోయినను, ఆయక్షరమున కుచ్చారణము కాలక్రమమున మాఱిన దన్నమాత్రమున శాస్త్రులుగారి వాదమునకు వచ్చినలాభమును లేదు. పిదప మాఱినను దొలుత నాయక్షరమునకు విశేషోచ్చారణ మున్నదనియే గదా దానిభావము. దీనికి శాస్త్రులుగా రంగీకరింతురా?

(3) వింతయక్షరము గలశబ్దము లయి దని శాస్త్రులుగారు వ్రాసినారు. వారుదాహరించిన శబ్దములలో బెడంగు, వేరెఴు అను రెండుశబ్దములలోను వింతయక్షరము లేనేలేదు. బెడంగులోనిది డకారమే. ఇది షకారమా వకారమా యని సందేహించుట కవకాశ ముండిన నుండవచ్చును, గాని డకారమా ఴకారమా యని సందేహించుట కవకాశము లేదు. ఈసందేహము బెజవాడలో నున్న శిలాశాసనమును గాని Epigraphia Indica యనుపత్రికలోని శాసనప్రతిబింబమును గాని చూచినయెడలఁ దీఱును. అట్లు చేయక యెంతవాదించినను ఫలములేదు.

పరిషత్పత్రికలో నేను వెరెఴు అను దానిని వేరడు అనివ్రాసినమాట సత్యమే. కాని పుటయడుగున "ఈశబ్దము సందేహాస్పదముగా నున్న" దని

కూడ వ్రాసినాను. పరిశీలించిచూడ నీశబ్దము స్వరూపము వేరెఱు అని యు న్నట్లు కనఁబడుచున్నది. చివరియక్షరము శకటరేఫముగాని ఱకారముకాదు.

(4) "ఇయ్యొట్టుఁ ఱస్సి మలినుఱై" యన్నచోట ఱస్సి యనునది. "డయ్యు" అను సకర్మకధాతువు క్త్వార్థకరూప మనియు, నది హేతుక్త్వార్థకముగాఁ జక్కఁగా నన్వయించు ననియు వ్రాసి శాస్త్రులుగారు హేతుక్త్వార్థకమునకు రెం డుదాహరణము లిచ్చినారు. వానిలో "పొత్తముల్ చదివి ప్రాజ్ఞుఁడాయె" నను వాక్యములో సమాపకాసమాపకక్రియలు రెండు నేకకర్తృకములు. పొత్తము చదివిన వాఁడును, ప్రాజ్ఞుఁడైనవాఁడు నొక్కఁడే కావున నీయుదాహరణ మిచ్చుటఁ బనికిరాదు. "వాఁడుజ్వరము వచ్చి చచ్చె" ననువాక్యములోని క్రియలు భిన్నకర్తృకములే గాని జ్వర మెవనికి వచ్చినదో వాఁడును, చచ్చినవాఁడు నొక్కఁడే యగుటచేత నాకార్యములు రెంటికిఁ గార్యకారణసంబంధము కలిగినది. "ఇయ్యొట్టు ఱస్సిమలినుఱై" యన్నచోట నట్టి సంబంధము లేదు. ఱస్సినది యొట్టు, మలినులైనవారు జనులు, అది డయ్యుటకును వీరు మలినులగుటకును సంబంధ మేమిటి ? వీరివలన నాయొట్టు డస్సిన చో సంబంధమేర్పడును. కాని వాక్య మట్లన్వయింపదు. కాఁబట్టి ఱస్సియను క్రియాపదమును సకర్మకముగానే యన్వయింప వలసియున్నది.

(5) గుణగవిజయాదిత్యునినాఁటి యొకానొక తరువోజశాసనములో కొండశబ్దము ఱకారయుక్తముగా నున్న దని లక్ష్మణరావుగారు వ్రాసి రనియు నాయక్షరమే గాని ఱకారము కాదనియు, నేనాశబ్దమును గూర్చి యేమియు వ్రాసియుండ లే దనియు "ఇట్లు గచ్ఛద్విమర్శనములఁ జేయుటవలన సత్యము తేలఁజాలదు" అనియు శాస్త్రులుగారు వ్రాసిరి. నాప్రథమవ్యాసములో "పండరంగుని యద్దంకిశాసనములో" గొఱలిచి శబ్దమందు ఱవర్ణ మున్న దని వ్రాసినాను. శాస్త్రులుగారు స్మరించిన తరువోజశాసనము నిదియు నొక్కటే. తరువోజపద్యములో నుండుటచేత తరువోజశాసన మయినది. అద్దంకిగ్రామమం దుండుటచేత నద్దంకిశాసన మయినది. పండరంగునిధర్మమును బ్రకటించుటచేత పండరంగునిశాసన మయినది. ఈశాసనమం దున్నశబ్దము గొఱలిచి గాని కొండయుఁగాదు, కొండశబ్దమును గాదు. ఈశాసనము మూలపాఠమును పరిషత్పత్త్రిక ౧౫ సంపుటము ప్రథమసంచికలో నేను బ్రకటించినాఁడను. శాస్త్రులుగారు చూడవచ్చును.

(6) ఱకారోత్పత్తిని గుఱించి కర్ణాటశబ్దమణిదర్పణకారుని మతము ననువదించుటలో, నేను బొరపడి తప్పువ్రాసినా నని శాస్త్రులుగారు వ్రాసినారు. నేను వ్రాసినదానిలో "ఱకారస్థానమందు డకారమును" అనునది "డకారస్థానమందు ఱకారమును" అనుటకు అచ్చుతప్పు. ప్రక్రమమును బట్టియు వాదసందర్భమును బట్టియు నిది కేవలప్రమాదమని గ్రహింపఁదగి యుండినను శాస్త్రులుగా రట్లు గ్రహింపక యది నాయజ్ఞానముచేఁ గలిగిన దోషముగాఁ బరిగణించిరి. అట్లు పరిగణించుటచేత హారివాదమునకుఁగలిగినపుష్టియుఁగనఁబడదు.

(7) "దీనింబట్టి చూడ డకారమే కన్నడములో నొత్తి పలుకుటచే వింత యక్కరమైనట్లు తేలుచున్నది. కావునఁ దెలుఁగునందుఁ గల కోడి, ఏడు ను న్నగునవియే మూలపదములు. అవి క్రమముగాఁ గొన్నినాళ్ళకు కోఱి, ఏఱు అను రూపములై యటుపిమ్మట కోళి, ఏళు మున్నగు రూపములు గన్నడమున నందినవి. తెలుఁగులో మొదటినుండియు మొదటిరూపమే నిల్చి యున్నది" అని శాస్త్రులుగారు వ్రాసిరి. ఇది వింతవాదము. డకారము పుట్టినచోటనే యధికప్రయత్నముచేత ఱకారముపుట్టిన దనఁగాఁ దొలుత డకారము పుట్టి యదికొంతకాల మయినపిదప ఱకారముగా మాఱిన దనియా? లఘ్వలఘువులలో లఘువులు ముందును, అలఘువులు తరువాతను బుట్టిన వని యెట్లు చెప్పవచ్చును?

అన్యభాషాసామ్యముచేత నాంధ్రశబ్దరూపనిష్పత్తి చేయఁగూడ దను శాస్త్రులుగా రీసందర్భమం దాంధ్రకర్ణాటకముల సాజాత్యసంబంధము నంగీకరించుట విశేషమే.

(8) ఆంధ్రసారస్వతము ఱకారవాదమునకు బాధకముగానుండుటచేత నావర్ణము సారస్వతము పుట్టుటకుఁ బూర్వమే యంతరించిన దన్నవాదమునే "నభినవముగాఁ దెచ్చిపెట్టితి" నని శాస్త్రులుగా రనుచున్నారు. ఈయక్షరము యుద్ధమల్లశాసనమందు నంతకుఁ బూర్వము పుట్టినశాసనములందును మాత్రమే యగపడుచున్నది. ఈశ్వరభట్టసోమయాజిశాసనములోనిది డకారము కాని ఱకారముకాదు. దీనికిఁ గలయుపపత్తుల నిదివఱకే తెలిపియున్నాఁడను. యుద్ధమల్లశాసనము నన్నయభట్టుకాలమునకుఁ బూర్వపుదని నేను డకారవాదినిగా నున్నప్పుడే చెప్పితిని. కాఁబట్టి "అభినవముగా" నేను దెచ్చిపెట్టిన దేదియు లేదు.

(9) చోడ, మేడమాంబ మొదలగు సంజ్ఞావాచకశబ్దములలోనున్నది డకారమా టకారమా యని చర్చించుచు "కాన పంతులవారు పురుషాది నామములు గలశాసనముల లెక్కలోనికిఁ దీసికొనుటవలన విశేష మేమి యును లేదు" అని శాస్త్రులుగారు వ్రాసినారు. సంజ్ఞావాచకములఁ దొలుతఁ బేర్కొనినది శాస్త్రులుగారే. దానికి నేను సమాధానము చెప్పవలసివచ్చినది.

(10) "ఇట్లే కొన్ని యనవసరవిమర్శనములఁ గూడ వారు కావించిరి. వానికి సమాధానము చెప్పుటకూడ నవసరముకాదు." అని శాస్త్రులుగా రొకచోట వ్రాసిరి. నేను చేసిన "యనవసరవిమర్శనము" లేవియో చెప్పఁబడక పోవుటచేత శాస్త్రులుగారు చేసినదోషారోపణము సరియగునో కాదో నిర్ణయించుట కవకాశము లేకున్నది.

అనవసరప్రసంగము లెవరుచేసినను తప్పే. సత్యనిర్ణయమే వాదము యొక్క ముఖ్యప్రయోజన మనినమ్మి వివాదాంశమునువదలి యప్రస్తుతప్రశంసల జోలికిఁ బోక, సభ్యరీతిని నడిపినచోఁ జర్చలు పండితసమ్మతము లగు ననియే నామతము.



# సాముద్రిక శాస్త్రము

—:మల్లాది దక్షిణామూర్తిగారు :—

మనము సాముద్రికశాస్త్రమునుగూర్చి ముచ్చటించుటకు మున్ను సాముద్రికశాస్త్రముయొక్క యుత్పత్తినిగూర్చి నేర్చుకొనవలసి యున్నది. ఈ శాస్త్రము మిగులఁ బ్రాచీన మైనది. ఈశాస్త్రము జ్యోతిషశాస్త్రమున కాధారముగఁ బరఁగు చున్నది. ఈశాస్త్రము జ్యోతిషశాస్త్రమున కెట్లాధారమో నేను రచియించిన సాముద్రికశాస్త్రమునందు విపులముగ వ్రాసియున్నాఁడను. క్లుప్తముగా నే నిచ్చటఁ బండితమండలిలో నాగ్రంథములోనున్న కొన్ని భాగములను బ్రత్యేకముగ నొకవ్యాసపూర్వకముగఁ జదువ నిశ్చయించుకొన్నాఁడను. సమస్తమైన గ్రహమండలములు తారకాశ్రేణులు మానవునిహస్తము లోనే వెలుఁగొందుచుండ వానిని మనము గుర్తెఱుంగకయుండుట మన మూఢీంభావమును దెల్పుచున్నది. శాస్త్రాంశములనుగూర్చి విచారింతము.

శాశ్వతమైనసత్యమును గూర్చి ప్రబోధించునది- శాస్త్రము. భరతఖండ మట్టిశాస్త్రములకుం బుట్టినిల్లు. సమస్తశాస్త్రములు హిందూదేశములో నభివృద్ధినొంది దేశక్షేమమునకుఁ దోడ్పడఁగల్గెను. భరతఖండ మనుకల్పవృక్షమునకు శాస్త్రములు కూఁకటివేళ్లు. ఎంతవఱకుఁ గూఁకటివేళ్ళకుఁ బోషణ యుండెనో యంతవఱకును వృక్షము తేజరిల్లినది. పోషణకారణము లగు రాజపోషణయు, ప్రజాదరణయు నశించినతోడనే కల్పవృక్షము ఫలపత్రపుష్పవర్జితమై నిర్జీవముగ నుండెను. శాస్త్రము లెంతకాల మభివృద్ధ్యవస్థను బొందియుండునో, అంతకాలము దేశమునకు మోసము వాటిల్లదు. దేశౌన్నత్యమునకుఁ గారణ మగుశాస్త్రాదరణ తొలఁగినతోడనే దేశము హైన్యస్థితిని బొందును. దేశము నుద్ధరించుట యనఁగా శాస్త్రముల నుద్ధరించుటయే.

భరతఖండము మహాఋషులకు మాతృసీమ. అరణ్యగర్భములలోనికిఁ జొచ్చి కందమూలాదులను భుజించుచు మనోనైర్మల్యమున కాకర మగు కొండసెలయేళ్ళ ప్రవాహధ్వనుల కలరుచు, బుద్ధి కాటపట్టైన ప్రకృతిసౌందర్యమును దిలకించుచు, ఏకాగ్రచిత్తములతో నుండి యేదియో యొక శాస్త్రమును దమ బుద్ధిశక్తిచేత వృద్ధిచేయుటకుఁ దమ యోగచ్ఛక్తిని వినియోగించుచుండెడివారు.

అట్లు, అరణ్యప్రాంతములయందుఁ గాలమును గడపుచు శాస్త్రములను బెంపొందించినవారలలో మునిముఖ్యులు, భరతుఁడు, అంబరీషుఁడు, మాణి క్యుఁడు, గౌతముఁడు, గర్గముని, పరాశరుఁడు మొదలుగాఁ గలవారు. వీరు సాముద్రికజ్యోతిష శాస్త్రములను రచించి లోకమునకు మహోపకారమును గావించిరి. శాస్త్రములు ఋషిభాగ్యములు-ఋషులు దేశోద్ధారకులు-వీరిమూలమున సర్వశాస్త్రములు నభివృద్ధి నొందినవి. కావుననే వీరు నారదనాడి, మార్కండేయనాడి, సుబ్రహ్మణ్యనాడి, మొదలైన నాడీగ్రంథములను రేఖాశాస్త్రముమీఁద నాధారపడునట్లు రచియించిరి. కావున నేఁడు జాతకములు లేనివారు హస్తములోనుండు రేఖలను గుర్తించి జాతకములను నిర్మించుచు నాడీగ్రంథములనుండి ఫలములను జదివి చెప్పుచున్నారు. దీనిని బట్టి చూడ సాముద్రికశాస్త్రము ప్రాచీనశాస్త్రమైన దనియుఁ జాతకశాస్త్రమున కాధారమనియుఁ దేలుచున్నది.

జ్యోతిషశాస్త్రములోఁ జెప్పఁబడిన Longitudes, Latitudes భాగలు నాడులు మొదలైన వన్నియు హస్తములోనే యున్నవి. నవగ్రహములను ద్వాదశభావములను హస్తములోఁ గాంచుచున్నాము. ఇటువంటి మంచి ప్రత్యక్షశాస్త్రమెట్లు నీచావస్థలోనికి వచ్చెనో విచారింపవలసి యున్నది.

ఈశాస్త్రము నశించుట కనేకకారణములు గలవు. అన్నిటిలోను మూఁడు ముఖ్యకారణము లీశాస్త్రము నడు గంటించినవి. అందుచేత నీశాస్త్రము నీచావస్థను బొంది యున్నది. మనము ప్రస్తుత మాకారణములను విచారింతము.

భరతఖండములోఁ బుట్టి భరతవర్షమునఁ బెరిఁగి నివసించుచున్న ప్రతి వ్యక్తికిని సాముద్రికశాస్త్రము దెలిసియుండును. సాముద్రికశాస్త్ర మన్నమాట వినినతోడనే మానవులు హస్తములోనున్న పురుష స్త్రీ రేఖలను విద్యారేఖను, కళత్రరేఖను, సంతానరేఖను, ధనరేఖను జూపెంతురు. ఆరేఖ లున్నచోఁ బూర్ణఫలితములను జెప్పుచుందురు. కూలివాని హస్తములో ధనరేఖను జూపించుచు నీకేమియు భయములేదు పొమ్మని చెప్పుచుందురు. ఫలములు తప్పుచున్నచో రేఖలు మాఱుచుండు ననియు, కుత్తుక లోభాగమునను, దంతముల పైనను, మర్మస్థానములయందును శ్రీమంతరేఖలు గాని శంఖచక్రములుగాని యుండు ననియుఁ జెప్పి దాఁటుచుందురు. హస్తములో జాతకమే తేలుచున్న

ష్వ డిమాటలు పాటిచేయుట తప్పుగఁ దోఁచును. అందుచేఁ బండితప్రశస్త్యాల మూలమున నీశాస్త్రము నిగూఢరూపమును దాల్చినది.

ఇఁక రెండవకారణమును విచారించి చూతము. సంసారమునుండి విముక్తులై ఋషులయొద్ద శాస్త్రములనభ్యసించి యనుభవముల నార్జించునిమిత్తమై దేశాటన మొనర్చి తీర్థయాత్రలను జేయుచు, మార్గమధ్యములఁ బ్రజలహృదయములను దమ శాస్త్రజ్ఞానములచే రంజిల్లఁజేయుచుఁ గాలము గడుపుచుండినవారు పూర్వము కొందఱుండిరి. (వారే విరాగులు, బైరాగులని వ్యవహరింపఁబడుచున్నారు.) ఈయాచార మిప్పటికిని బ్రచారములోనే యున్నది. పూర్వపు భారతీయప్రజకు వీరనిన మిక్కిలి యాదరము. వీరింత ముఖ్యులుగ నుండుటకుఁ గారణమేమన:—అనుభవశాస్త్రములకుం బడికట్టగు దేశాటనము వీరికి లభ్యమగుచుండెడిది. ఇందుచేత వీరంత చక్కఁగ శాస్త్రములను గ్రహింపఁగల్గిరి. కాని రానురా నహంభావపూరితులుగను దురభ్యాసకులుగ నుండుటచేతను వీరు సహజబుద్ధిమంతులు కాకపోవుటచేతను శాస్త్రమును వృద్ధిచేయలేక, మహాఋషులచేఁ బెంపొందింపఁబడిన శాస్త్రములను మిగుల సూక్ష్మరూపములోనికిం దెచ్చిరి.

మూఁడవకారణమును గూడ విచారించిచూతము. ఋషులరణ్యములలో నుండుట యాచారముగదా. అటువంటి సమయములయందుఁ గొందఱాటవికులు వారలకు సేవఁజేయుచు వారి (ఋషుల) నుండి కొంత శాస్త్రజ్ఞానమును బడసిరి. ఈతెగవారిలోఁ బ్రత్యేకముగ స్త్రీల మనస్సును రంజిల్లఁజేయు మహాస్వరూప మొకటి గలదు. అది యెఱుకలది. అనఁగా నెఱుకలు గలది. ఎఱుకయనఁగా జ్ఞానము, తెలివి. భూతభవిష్యత్తులను సూచించు జ్ఞానము గలది గావున యెఱుకల దని వ్యవహరింపఁబడుచున్నది. కాని యెఱుకల కుల మునందలిస్త్రీ కాకపోవచ్చును. సాముద్రికవేత్తలు గాని ఎఱుకలవాండ్రుగాని మానవస్వభావమును బూర్ణముగా నెఱింగినవారై యుండవలయును. కావుననే యట్టివారు యెఱుకగలవారు. సంస్కృతాభ్యాసకుల హృదయములను సహితము రంజింపఁజేయుజ్ఞానము వీరికి పూర్వము గలదు.

ప్రస్తుతపు యెఱుకలవారిని గూర్చి యొకఁ క్షణము విచారింతము. యెఱుకగల దానికి మఱియొకకేరు గల్లదు. సోదె చెప్పునది, కావున మనము సోదెన్ను యందము. ఆమె యూరూరూఁటనకు వచ్చి యేవియో రెండుమాటలు

చెప్పి సఫలమనోరథురాలై పోవుచుండును. ఈమొసవ్యాపమును జూచినతో డనే స్త్రీలమన స్సువ్వొంగిపోవుచుండును. సేరుబియ్యము నొక యర్ధణాడబ్బులు నొడిలోఁబోసి సోదెను జెప్పుమందురు. స్త్రీలకేమియుఁ దోఁపనప్పు డీవిధముగఁ గాలయాపన చేయుదురు.

. ఇఁక సోదెమ్మగారి మెలుకను గూర్చి విచారింతము. బుట్టలో బియ్యమును డబ్బులను వేసికొని ప్రారంభించును. ప్రార్థన నభినయించుచు, నిటునటుఁ జూచుచు; "కాలంటే కాననివాఁడమ్మ" చెవియంటే సోదరుఁడమ్మ" "దేవుఁడమ్మా నీపట్టున్నాఁడంటే" అని రెండువాక్యములను యుక్తాయుక్తముగ సోదెమ్మగారు పల్కుచుందురు. సోదెమ్మగారి పల్కులలో లోకమంతయు నున్నది. కాలు, (వస్తువులు) కాననివాఁడు,. దొంగ, చెవి—వస్తువులు, సోదరుఁడు, దేవుఁడు, మొదలైనపదములు వారియనుమానము సూచించును. సోదెమ్మగారికంటెఁ దమరే తమప్రాఁతదొంగతనములను బయలుచేయుదురు. కాలంటే కాననివాఁడమ్మ, అన్నప్పుడు కాలిబొట్టన వ్రేలిమట్టెలు పోయినవి, కాననివాఁడు గనుక దొంగయెత్తుకొనిపోయినాఁడు. అని గ్రహింతురు. సోదెమ్మగారు వారియూహల నాధారముగాఁ దీసికొని సోదెను బలనలచిలవలతోఁ బెంపుచేయును.

ఇట్లు సాముద్రికశాస్త్రముయొక్క ప్రాముఖ్యత మెలుకలవారిస్వాధీనమై క్రమక్రమముగా సాంప్రదాయవిరుద్ధము గాఁజొచ్చెను. విరాగులమూలఁమున నెలుకలవారిమూలమున బండితవ[illegible]మూలమున నీశాస్త్ర మింతనీచావస్థను బొందినది.

ప్రస్తుతము సాముద్రికశాస్త్రమున కాధారమగుహస్తమునుగూర్చియు దానిప్రాముఖ్యతను గూర్చియు విచారింపవలసియున్నది.

హస్తమే మానవునిజీవితచారిత్రమున కాధారము. పరమేశుని సృష్టిలోనికెల్ల మానవునకే దైవము హస్తము నొసంగియున్నాఁడు. జీవరాసులలోనికెల్ల మానవునకే హస్తస్ఫూర్తి స్ఫుటముగ (Symmetrically proportioned) గూర్పఁబడియున్నది. లౌకికపారమార్థికమోక్షపరమార్థజ్ఞానములకుం గారణమైన బొటనవ్రేలు (Thumb) మానవునకు బాగుగ నొసంగఁబడియున్నది. కావుననే Newton says "Thumb alone proves the existence of God" పూర్వ్యేదశే పుణ్యామలి నైరుతిపాపమసీమా తత్పురీయాతీతం భవతి" అనునుపనిషద్వాక్యమువలన నీసంగతి స్పష్టమగుచున్నది.

జ్ఞానముగల జీవులకెల్లను హస్తము లుండియే తీరును. గ్రీసుశాస్త్రజ్ఞుఁడగు ప్లీని (Pliny) హస్తముగల ప్రతిజీవియు జ్ఞానముగలదిగానె యుండునని బోధించుచున్నాఁడు. మఱియొక సుప్రసిద్ధుఁడైన గ్రీసుశాస్త్రజ్ఞుఁడగు అరిస్టాటిల్ (Aristotle) ఈసందర్భమున జ్ఞానము గలజీవులకెల్లను హస్తముండునని యభిప్రాయపడుచున్నాఁడు. దీనినిబట్టి చూడ జ్ఞానమునకును హస్తమునకు నవినాభావసంబంధ మొకటి యేర్పడుచున్నది. హస్తభాగములలో బొటనవ్రేలు ముఖ్యము. ఈసంబంధ మిట్లుండ హిందువులకు వందనీయ మైనవేదము నరవానరకుంజరచిక్రోడములకు సాముద్రికశాస్త్రము వర్తించుచున్న దని ప్రభోధించుచున్నది.

మనము ప్రస్తుతము హస్తముయొక్క ప్రాముఖ్యతను జర్చింతము. అద్వైతమువలన బోధపడుసిద్ధాంతమునకు మానవునిహస్తమే సాక్షి. ప్రకృతి యంతయు మానవునిహస్తములోనే యున్నది. తన్నుఁ దాఁ దెలిసికొనవలెనను సిద్ధాంతిసూక్తికి హస్తమే సాక్షి. సర్వప్రపంచములు, నదులు, పర్వతములు, సర్వఖగోళసముచ్చయములు హస్తములోఁ బ్రకాశించుచున్నవి. హస్తమీశ్వరసృష్టికి దర్పణము. హస్తము జ్ఞానసూత్రములకుం దావు. హస్తమీశ్వరసంకల్పమున కద్వితీయ మయినది. వేదాంతశాస్త్రములయొక్క ఫక్కులను సూత్రములను హస్తము ప్రత్యక్షముగ స్థిరపఱుచుచున్నది. సకలసృష్టిసౌష్ఠవమునకును హస్తము కేంద్రస్థానము. Consciousness mirrors in the universe. The outer world is reflected in man. He will be a perfect representation of the universe in which he moves. కాని యీసూత్రము హస్తమునకు బాగుగ వర్తించుచుండును. మానవదేహములో హస్తము మాత్రమే ప్రకృతిని బ్రతిఫలింపఁ జేయుచున్నది. సృష్టివిలాస మంతయు హస్తములో బోధపడుతఱి హస్తములో నుండు రేఖలు మాఱుచుండునని యు, నందుచే ఫలితములు నమ్మఁదగినవి కావనియు వచించుట యజ్ఞులసాహస మనియే నానమ్మకము. "హాత్తే దున్యా మోజుదు హై" హాజిలుగారు సాముద్రికశాస్త్రమును గూర్చి గ్రంథములను అరబ్బీభాషలో వ్రాసినారు. కాని యీయనకుఁ బుట్టుమచ్చ (తిలి) శాస్త్రము అనఁగా ఎక్కువ అభిమానముగఁ బరిణమించినది. మనవారల యభిప్రాయము లిట్లుండఁ బాశ్చాత్యులయభిప్రాయమును విచారింతము.

Anaxagoras has said. ' ;This superiority of man is owing to his hands. Charles Bell says, we ought to define the hand as belonging exclusively to man, corresponding, in its sensibility and motion to this endowment of his mind. Sir Richard Owen గారిట్లభిప్రాయపడుచున్నారు. " In the hand every single bone is distinguishable from another; each digit has its peculiar character."

మన మిప్పుడు హస్తములోనున్న రేఖలనుగూర్చి విచారింపవలసి యున్నది. హస్తములో రేఖలు రెండువిధములుగ నుండును. స్థూలరేఖ లనియు సూక్ష్మరేఖ లనియు రెండుతరగతులుగ నున్నవి. మఱియు స్థూలరేఖలలో స్థిరరేఖల నస్థిరరేఖల గ్రహింపవలయును. వీనికే యిుంగ్లీషులో (Principal lines and chance lines) అని వాడుచున్నారు.

సమస్తాంగములకుఁ జెందుచున్న ప్రతినిధిరేఖలు హస్తమునఁ దేలుచుండును. హృదయరేఖ (Heart line) శిరోరేఖ (Head line) మొదలైన ప్రతిభాగమునకును ప్రతిరేఖయు హస్తములో నుండును. ఏ యంగమునకు హాని వాటిల్లిన నారేఖకుఁ గత్తెర లుండును. [illegible] ద్వాదశభావము లను గ్రహింపఁగలము. ఈరేఖ లెన్నఁటికి మాఱవు. వీనికే స్థిరరేఖలని పేరు. ఈరేఖలలోఁ గొన్ని కొంతకాలము వఱకు నస్ఫుటముగనుండి యాఫల మనుభవించుకాలము వచ్చుసరికి స్ఫుట పడుచుండును. ఇంతియే గాని నూతనముగ నెన్నఁటికిని బుట్టవు, మాఱవు. కాని బయలుపడు చుండును. ఇందుచేతనే రేఖలు పుట్టిన వని యెన్నఁటికి వచింపరు. ఈరేఖలు స్ఫుటపడుటయు నస్పష్ట మగుటయుఁ గూడ తటస్థించును.

ఇఁక సూక్ష్మరేఖలనుగూర్చి నేర్చుకొందము. హస్తములో సన్నని దారములను బోలియుండునవి సూక్ష్మరేఖ లనఁబడును. మిక్కిలి చిన్నవగు రంధ్రములచే నీరేఖ లేర్పడినవి. చెమట సాధారణముగ నీచిన్న చిన్న బెజ్జములనుండియే వెలువడును. బాగుగఁ బరీక్షించినఁ జిన్న రేణువులయొక్క శ్రేణులు కాన్పించును. చిఱుపూసల సరులమాదిరి ముద్దుగ గోచరించును. ఈరేఖాపంక్తులు మానవుని హస్తములో నీశ్వరుని చిత్రలేఖననైపుణ్యమును జాటుటకో యనునట్లందమగు నావర్తములుగఁ దీర్పఁబడి రాజిల్లుచున్నవి. కమలముల కోమలతను వాని రంగును ధిక్కరించుచుండు మానవుని హస్త

ముఃలో నల్లని మిసమిసలాడు రేఖలమధ్య గడుంగడుఁ జన్నముత్యాల సరుల మాడ్కి సూక్ష్మరేఖలు గ్రహగోళగతులను జూపించుచున్నవి. ఈసన్నని గీతలయొక్క చాలు ననుసరించి వెంబడించిన ద్వాదశభాగములుగ విభాగింపఁబడిన వియత్తలమంతయుఁ దారామండలముల నన్నిటిని కక్ష్యాంతరముల నన్నిటిని, ఖగోళసముచ్చయము లన్నియుఁ జూడఁగల్గుదుము. బ్రహ్మాండవ్యాప్తమై నిశ్శబ్దముగ గాఢముగను నిద్రించుచున్న యాకాశమాత స్వరూప పరిమాణమంతయు మానవుని చిన్నిహస్తమున గోచరించుట విచిత్రము గదా! మానవుని హస్తములో నుండు యీరేఖలద్వారా సమస్త జ్యోతులును వెలుఁగుచున్నవి. మహాతేజోరూపుఁడై నట్టియుఁ గాలస్వరూపుఁడై నట్టియుఁ, బరంధాముఁడు మానవుని హస్తములో దాఁగి నవగ్రహములద్వారా ప్రకాశించుచున్నాఁడు. "నతత్ర సూర్యోభాతి నచంద్రతారకం నేమావిద్యుతోభాన్తి కుతోయమగ్నిః తమేవాభాన్తమనుభాతి సర్వం తస్యభాసాసర్వమిదంవిభాతి" యను నుపనిషద్రహస్య మీశాస్త్రసూత్రముగఁ బరఁగుచున్నది. పాశ్చాత్యులలో ముఖ్యుఁడగు Alan Leo పాశ్చాత్యసముద్రతీరమునుండి యిట్లెలుగెత్తి చాటుచున్నాఁడు. Our visible sun is the shadow of the central sun acting as a concrete symbol of the eternal point from which emanates and around which it moves in a cycle of thousand years.

మొదటిప్రభువు సర్వాధికారి. ఆసర్వరక్షకుఁ డీజగమును గ్రహములద్వారా పరిపాలించుచున్నాఁడు. ఆప్రభువున కనుచరులు తొమ్మండుగురు కలరు. వారే నవగ్రహములు. Revenue dept. న కధిపతి గ్రహము Mars కుజుఁడు "[illegible]సుజః" అని ప్రాగ్దేశశాస్త్రము- మతమున కధిపతిగ్రహము గురుఁడు. Jupiter for religion. ఇట్లే ప్రపంచమంతయుఁ గర్మాధీనమై కర్మ నడపుచున్న నవగ్రహములకు స్వాధీనమై యున్నది. ఇన్ని గొప్ప సంగతులు హస్తమునుండి తెల్లమగుచుండ, హస్తములలో నుండుముడుతలకును, ఆయదృష్టమునకు నేమిసంబంధ మని యాక్షేపించుచున్నారు. వానియదృష్టము వాని హస్తములో నున్న రేఖలే; వానిగుణాతిశయములు వానిముఖమే. కర్మములో నెట్లుండునో యట్లే జరుగుచుండుననియు నీశాస్త్రముప్రకారము కా నేరదనియు వచించుచున్నారు. కర్మ కనుసారిణులు జ్యోతిషసాముద్రికాదిశాస్త్రములు. "జ్యోతిష సాముద్రికశాస్త్రములను నమ్మవలసినదే గాని, ఎవరును సరిగఁ జెప్పలేరు. అదిగాక చాలినంతశాస్త్రము లేదు" అని వచించుటచేత

నీశాస్త్రపటుత్వము పోవుచున్నది. కొందఱీశాస్త్రమున కాధారముగ గ్రంథములులేవని యును, అందుచేత నీశాస్త్రము క్షీణించిన దనియు వచించుచున్నారు. గ్రంథములు లేకపోయినచో నీశ్వరునిచేత లిఖింపఁబడిన జీవచారిత్రాత్మక మైనగ్రంథము మానవునిహస్తమే గదా. ఈగ్రంథమును నన్వయించుట కేల శాంతమనస్కులై యానందచిత్తములతోఁ జదువుటకుఁ బ్రయత్నింపరు. హస్తమును బరీక్షించినకొలఁదియు, నూతనమార్గములు గోచరించుచుండును. నూతనపద్ధతులు పొడకట్టుచుండును. ఉపనిషద్రహస్యము లర్థమగుచుండును. అద్వైతసూత్రము లన్వయ మగుచుండును. దివ్యతేజస్సు హస్తమునఁ దరంగములుగ మాఱి యల్లకల్లోలము లేక శాంతముగఁ జలించుచు శోకతరంగములో మఱియొక తేజస్తరంగము లీనమగుచు నిర్మలానందమును వెదచల్లుచుండును. పూర్వు లఱచేతిలోనే గదా వైకుంఠమును జూచి యానందించిరి. ఇతరులకు వైకుంఠమును జూపించుచు నానందించిరి. అట్టిమహాఋషు లీశాస్త్రములకుఁ గావలసినంతసామగ్రి నిచ్చియేయుండిరి.

| | |
|---|---|
| వరాహమిహిరుఁడు | గర్గమహాముని |
| పరాశరుఁడు | సీతాలలామ |
| గౌతముఁడు | పార్వతీసాముద్రికశాస్త్రము. |
| భరతమహాముని | సావిత్రీ ,, |

ప్రహ్లాదసాముద్రికము, శెంటూల వేంకటసుబ్బారావుగారిచే భాషాంతరీకరము. మహాఋషు లీశాస్త్రమును గూర్చి గ్రంథములను వ్రాసియున్నారు. నేను భరతసాముద్రికశాస్త్రమును భద్రాద్రిలోఁ జూచియుంటిని. తిరునాన్కారులో సీతాలలామ యనెడి సాముద్రికశాస్త్రమును జదివియున్నాను. ఇఁక పాశ్చాత్యులగ్రంథములను గూర్చి ప్రసంగింతము. పాశ్చాత్యగ్రంథములే యిప్పుడు ప్రతివానిహస్తమును నలంకరించుచున్నవి. స్విట్జర్లాండు, జర్మనీ, అమెరికా, యింగ్లాండు, ఫ్రాన్సు గ్రీసు, అరబ్బీ, స్పెయినుదేశముల గ్రంథకర్తలను పేర్కొందును. Aristotle, Lord Belham, Knowles, Dibrolis, Anaxagoras, Anaximander, Ali Husain of Persia, Pythogaras, Lilu, Chiero, Saint Husain, Crown, Ruskin Lawrence, మొదలైన పాశ్చాత్యశాస్త్రప్రముఖులు గొప్ప గ్రంథములను రచించిరి. కాని యీ గ్రంథములలో విషయపరిజ్ఞాన ముండదు. ప్రాగ్దేశశాస్త్రములు స్థిరపదార్థములను గూర్చి యెక్కువగాఁ జెప్పుచుండును. పాశ్చాత్యశాస్త్రము కృశించి

చలించుచు నశించుపదార్థసముదాయములనుగూర్చి చెప్పును. కొన్నటికే వాటికిని మనకును జాలఁ దారతమ్యము ఉన్నవి. వారు హస్తములను జూచి నీ విన్నవసంవత్సరమున నిల్లు గట్టినావు. ఇన్నవసంవత్సరమున భూమి కొందువు. నీవు దత్తుఁడ వగుదు. మొదలైన ద్వాదశభావములను గూర్చి చెప్పలేరు. You are fond of fame love of luxury మొదలైనవానితో నిండియుండును. ఇవన్నియు దంపుడుమాటలే కాని స్వభావమును గ్రహింపఁగల్గుశక్తిని వీరి గ్రంథములు చాటుచుండును. రెండుపద్ధతుల నేకపద్ధతిలోనికి మార్చినచోఁ జక్కఁగ శాస్త్రమును వృద్ధిపఱుపవచ్చును.

ఎఱుకలవారిస్వాధీనమై బైరాగులపాలై పాడుపడినశాస్త్రమునుగూర్చి విచారింతము. ఏశాస్త్రముద్వారా మహాతేజోనిధి నిండువెలుంగున వెలుఁగొందుచున్నాఁడో, ఏశాస్త్రము మానవజీవితచారిత్రమున కాధారమో, ఏశాస్త్రము మూలఁబడి ముక్కుచున్నదో యట్టిశాస్త్రమును గూర్చిచర్చింపవలసియున్నది.



# అలంకారప్రాచీనత.

—:మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు:—

---

మనుష్యజాతి యెంతప్రాచీన మయినదో కవనము కూడ నంతప్రాచీన మయినది. మనుష్యజాతివారి ప్రాచీనతమగ్రంథము లన్నియుఁ గవితామయములు. కవితానిబద్ధ మగుభాషలో నలంకారము లుండకమానవు. హిందువుల వేదము, ఉపనిషత్తులు, పురాణములు, ఇతిహాసములు, క్రైస్తవుల బైబిలు, పారశీకుల ఛందోవస్థానము (Zend Avesta) మహమ్మదీయుల ఖురాను మొదలగు ప్రాచీనగ్రంథము లత్యుత్కటసారస్వతావేశము గలమహాప్రతిభాశాలుల ముఖములనుండి నిరర్గళధారగా స్వయంప్రవృత్తము లైనకవితాస్రోతోరూపములు. వీనియం దచ్చటచ్చట నలంకారములు గానవచ్చుచున్నవి. ఇందుకు నిదర్శనముగా మనఋగ్వేదము, ఉపనిషత్తులు, పురాణములు మొదలగువానిని బరీక్షించినయెడల నిపుడు మన మెఱింగిన యలంకారము లన్నియుఁ గానరాకపోయినను ఉపమ, రూపకము, అతిశయోక్తి మొదలగు నల్పసంఖ్యాకము లైన యలంకారములు విరళముగాఁ గానవచ్చుచున్నవి. ఉపమ, రూపకము లేకుండ నేభాషయు వృద్ధినొందఁజాలదు. రూపకాలంకారము భాషాభివృద్ధికి ముఖ్యహేతు వని బహుగ్రంథకర్త యగు కార్లైల్ (Carlyle) అను నాంగ్లేయగ్రంథకర్త వ్రాసియున్నాఁడు.

1 ఋగ్వేదమం దుపమాలంకారములు I—124-7. అభ్రాతేవ పుంస ఏతి ప్రతీచీ గర్తారుగివ సనయే ధనానామ్। జాయేవ పత్య ఉశతీ సువాసా ఉషాహస్రేవ నిరిణీతే అప్సః.

టీక॥ సోదరులు లేనిస్త్రీ తండ్రి మొద లగువారికడ కెట్లు పోవునో మగఁడు లేనియాఁడుది తనకు రావలసినధనమును రాఁబట్టుకొనుటకు న్యాయస్థానమున కెట్లు పోవునో, కామము గలస్త్రీ వస్త్రాభరణాదులచే దేహము నలంకరించుకొని భర్తృసమీపమున కెట్లు చనునో హాసము దంతపంక్తి నెట్లు ప్రకాశింపఁజేయునో యట్లు సకలపదార్థములను బ్రకాశింపఁజేయు ఉషస్సు సూర్యునినివాసస్థాన మగునంతరిక్షమునకుఁ బోవుచున్నది.

ఇందు నాలు గుపమాలంకారము లున్నవి.

VII-33-8. సూర్యస్యేవ వక్షథో జ్యోతి రేషాం సముద్రస్యేవ మహిమా గభీరః। వాతస్యేవ ప్రజవో నాన్యే నస్తోమో వసిష్ఠా అన్వేతవే వః.

టీక॥ ఓవసిష్ఠులారా మీమహిమ సూర్యుని ప్రకాశమువంటిది. సముద్రమువలె గంభీరమైనది. వాయువువలెఁ బ్రకృష్టజవము గలది.

ఇందులో మూఁ డుపమలు.

I-123-10. కన్యేవ తన్వా శాశదానా ఏషిదేవి దేవ మియక్షమాణమ్.

టీక॥ ఓఉషోదేవి కమనీయ యగుకన్యకవలె నీవును నీశరీరముచే స్పష్ట మగుచున్న దానవై యభిమతముల నొసంగు సూర్యునొద్దకుఁ బోవుచున్నావు.

దీనిలో నొక యుపమ.

IV-58 3. చత్వారిశృంగా త్రయో అస్యపాదా ద్వేశీర్షే సప్తహస్తా సో అస్య। త్రిధా బద్ధో వృషభో రోరవీతి మహో దేవో మర్త్యా నా వివేశ॥

ఇందులో రూపకాతిశయోక్తి.

I-164-20. ద్వాసుపర్ణా సయుజాసఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే। తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యో అభిచాకశీతి. (ఇది ముండకోపనిషత్తులోఁ దృతీయముండకమం దున్నది.)

టీక॥ శోభనము లైనఱెక్కలు గలవి, సంతతముఁ గలిసి యుండునవి పరస్పరమైత్రి గలవి యగు రెండుపక్షు లొకచెట్టు నాశ్రయించియున్నవి. ఆరెండుపక్షులలో నొకటి రసవత్ఫలము నాస్వాదించుచున్నది. మఱియొక పక్షి యేమియుఁ దినకుండఁ బ్రకాశించుచున్నది. ఈశ్రుతిని జగన్నాథపండితుఁడు రసగంగాధరములో నలంకారప్రకరణమం దతిశయోక్త్యలంకారమున కుదాహరణముగా నిచ్చెను. విషయిణా విషయస్య నిగరణ మతిశయః తస్యోక్తిః అతిశయోక్తిః, అని లక్షణముఁ జెప్పెను. ఇచట నుపమాన మగు పక్షులచే నుపమేయ మగుజీవాత్మ పరమాత్మలు- ఉపమాన మగువృక్షశబ్దముచే నుపమేయ మగుశరీరమును నిగీర్ణము లైనవి.

కఠోపనిషత్తు-3 వల్లి-10-11.

ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరంమనః। మనసశ్చ పరా బుద్ధి బుద్ధే రాత్మా మహాన్పరః। మహతః పర మవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః। పురుషా న్నపరం కించి

ఇచట "ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవచ। బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహ మేవచ। ఇంద్రియాణి హయా నాహు ర్విషయాంస్తేషు గోచరాన్" అనుశ్రుతిలో నశ్వములుగా రూపితములైన యింద్రియముల కంటె మార్గములు గాఁ జెప్పఁబడిన విషయములు వశపఱ్చుకొనుటయందు కష్టమైనవి. ఏల యనఁగా జితేంద్రియునిగూడ విషయసన్నిధియందు దుర్నిగ్రహము లగునింద్రియములు లోభపెట్టి యాకర్షించును. విషయములకంటె మనస్సు వశపఱ్చుకొనుటయందు హెచ్చుకష్టము గలిగించును. ఎట్లన మనస్సు విషయములఁ గోరునదియై యుండఁగా విషయాసన్నిధానము మనఃప్రవృత్తి నడ్డలేదు. మనస్సు కంటె సారథిగా నిరూపింపఁబడిన బుద్ధిని వశపఱ్చుకొనుట మిక్కిలి కష్టము. బుద్ధికంటెఁ గర్తృత్వము గలవాఁ డగుటచేఁ బ్రధానుఁ డగునాత్మను వశపఱ్చుకొనుట మఱింతకష్టము. జీవుని సకల పురుషార్థసాధనమునకు శరీర మావశ్యకము గావున జీవుని వశపఱ్చుకొనుట కంటె శరీరమును వశపఱ్చుకొనుట కష్టతరము. అంతకంటె సర్వాంతరాత్మ యగుపరమపురుషుని వశపఱ్చుకొనుట హెచ్చుకష్టము. ఇట్లుత్తరోత్తరముగా నొకదానికంటె మఱియొకటి వశపఱ్చుకొనుటయందుఁ గష్టమైన దని చెప్పఁబడినది. దీనికి సారాలంకార మని పేరు. ఉత్తరోత్తర ముత్కర్ష స్సార ఇ త్యభిధీయతే" అని లక్షణము. "విజ్ఞానసారథి ర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః। సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమంపదం॥ ప్రణవో ధను శ్శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే। అప్రమత్తేన వేద్ధవ్యం శరవ త్తన్మయో భవేత్ (ద్వి-ముం-ద్వి-ఖం-4) ఇత్యాదులయందు రూపకాలంకారము. "ఆసీనో దూరం వ్రజతి శయానో యాతి సర్వతః। క స్తం మదామదం దేవం మదన్యో జ్ఞాతు మర్హతి" (ప్రశ్న-ద్వి-అ) దీనియందు విరోధాభాసాలంకారము. (శ్వేతాశ్వతరోపనిషత్తు-ప్ర-అ-4) త మేకనేమిం త్రివృతం షోడశాంతం శతార్ధారం వింశతి ప్రత్యరాభిః అష్టకై షడ్భి ర్విశ్వరూపైకపాశం త్రిమార్గభేదం ద్వినిమిత్తైక మోహమ్) కారణావస్థ యనెడు నొకకమ్మి గలది.

సత్త్వరజస్తమస్సు లనెడిమూఁడుచుట్లతోఁ గూడినది, వికారరూపము లగు పంచభూతములు, ఏకాదశేంద్రియములను బదునాఱంచులు గలది, సాంఖ్యశాస్త్రోక్తము లగుపంచాశత్ప్రత్యయభేదము లనెడు రేకులు గలది, దశేంద్రియములు వానివిషయములు నను నిరువదిపైపూటీలు గలది, అష్టకములతోఁ

గూడినది, నానారూప మగుకామ మనెడుత్రాడు గలది, పుణ్యాపాపములు రెండును నిమిత్తముగాఁ గలమోహమును బుట్టించునది, మూఁడుమార్గ ములయందుఁ బోవునది యగుచక్రమువలె నున్న కారణబ్రహ్మను ధ్యానించు చున్నాము. ఇది సావయవరూపకము.

పైని జూపింపఁబడినట్లు వేదమందు, నుపనిషత్తులయందే గాక స్మృతు లయందుఁగూడ విరళముగా నలంకారములు గానవచ్చుచున్నవి. "యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ। యస్యాం జాగ్రతి భూతాని సానిశా పశ్యతో మునేః" అని భగవద్గీతాశ్లోకమును రసగంగాధరకారుఁ డతిశయోక్త్యలంకారమున కుదాహరణముగా నిచ్చెను. కవికర్మను గురించి శ్రుతియే యిట్లు చెప్పుచున్నది. "ఏకశ్శబ్దస్సుష్ఠు ప్రయుక్తః స్వర్గే లోకే కామధుగ్భవతి" జాతివాచకము లనియుఁ గ్రియావాచకము లనియు, గుణవాచకము లనియు, యదృచ్ఛాశబ్దము లనియు నాలుగుతరగతులుగా విభజింపఁబడినశబ్దములను జక్కఁగాఁ దెలిసికొని బాగుగఁ బ్రయోగింపఁబడినయెడల నైహికాముష్మికఫలప్రదాయి యగును.

"రసోవైసః", రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వానందీభవతి" ఇత్యాదిశ్రుతులచేఁ గావ్యజీవాతు వగురసముకూడ నుపదేశింపఁబడుచున్నది. అతిప్రాచీన మగువేదమం దీయలంకారము లిట్లు యాదృచ్ఛికముగాఁ జెప్పఁబడియున్నను వీనికి సరియైన లక్షణనిరూపణము వీనిలో నవాంతరభేదములు, వీనివర్గీకరణము (Classification) మొదలగునవి వేదమునకుఁ దరువాత నెంతోదీర్ఘకాలమున కేర్పడినవి. ఇట్లు కాలక్రమమునఁ గావ్యములు వానితో సంబంధించిన యలంకారములు భాషలోఁ బెరిఁగినకొలఁది మనుష్యులు కావ్యలక్షణములను, అలంకారలక్షణములను నిరూపించుటకుఁ దగిననిర్వచనములను రచింపఁ దొడఁగిరి. క్రీస్తుశకమునకు మున్నే యలంకారోత్పాదకబీజములు కొన్ని వాఙ్మయమం దున్నట్లు మనము రుజువు చేయఁగలము.

వ్యాకరణకర్త యగుపాణిని కూడ నొకకవియై యున్నట్లు గ్రంథనిదర్శనమువలనఁ గానవచ్చుచున్నది. ఔచిత్యవిచారచర్చాద్యనేకగ్రంథకర్త యగుక్షేమేంద్రుఁడు తాను రచించిన సువృత్తతిలక మనుగ్రంథమందుఁ బాణినికి, ఉపజాతివృత్తరచనయం దసామాన్యప్రావీణ్యము గలదని చెప్పుచున్నాఁడు. "స్పృహణీయత్వచరితం పాణినే రుపజాతిభిః। చమత్కారైకసారాభి

రుద్యానస్యైవ జాతిభిః" రుద్రటుని కావ్యాలంకారమునకు వ్యాఖ్యానము వ్రాసిన నమిసాధు వను జైనపండితుఁ డొకఁడు పాణిని పాతాళవిజయ మను నొక మహాకావ్యమును రచించె నని చెప్పియున్నాఁడు. మహాకవులు కూడఁ బ్రామాదికముగాఁ దమకృతులయం దపశబ్దములను బ్రయోగింతు రనుసందర్భమం దిట్లు వ్రాసెను. "అపశబ్దనిరాసశ్చ యద్యపి వ్యుత్పత్తిద్వారేణైవ కృతస్తథాపి మహాకవీనా మప్యపశబ్దపాతదర్శనా త్తన్నిరాసాదరఖ్యాపనాయ పునరభియోగః। తథాహి పాణినేః పాతాళవిజయే మహాకావ్యే "సంధ్యావధూం గృహ్య కరేణ భాస్కరః", ఇత్యత్ర క్త్వో ల్యబాదేశః" మఱియొకచోట నీగ్రంథమందే "గతేఽర్ధరాత్రే పరిమందమందం గర్జంతి యత్ప్రావృషి కాలమేఘాః। అపశ్యతీ వత్సమి వేందుబింబం తచ్ఛర్వరీ గౌరివ హుంకరోతి" ఇచట "అపశ్యతీ" యనునది తప్పు. "అపశ్యంతీ" యని యుండవలెను. వల్లభదేవుని సుభాషితావళియందు శార్ఙ్గధరపద్ధతియందుఁ బాణిని రచించిన శ్లోకము లని కొన్ని యుదాహరింపఁబడినవి. "శుద్ధస్వభావా న్యపి సంహతాని నినాయ భేదం కుముదాని చంద్రః। అవాప్య వృద్ధిం మలినాంతరాత్మా జనోభవే త్కస్యగుణాయ వక్రః (సుభాషితావళి Bombay Edition-330 పే-196 శ్లో) ఉపోఢరాగేణ విలోలతారకం తథాగృహీతం శశినా నిశాముఖమ్। యథాసమస్తం తిమిరాంశుకం తయా పురోఽపి రాగా ద్గళితం నలక్షితమ్—సుభాషితావళి—330 పే—1969) వ్యంగ్యముచే ననుగత మగువాచ్యమే ప్రధానముగాఁ బ్రతీయమాన మగు నని చెప్పుట కానందవర్ధనాచార్యుఁడు పైశ్లోకమును ధ్వన్యాలోకమం దుదాహరించెను. "ఐంద్రం ధనుః పాండుపయోధరేణ శర ద్దధానా ర్ద్రనఖక్షతాభమ్। ప్రసాదయంతీ సకలంక మిందుం తాపం రవే రభ్యధికం చకార" ఈశ్లోకమును వామనుఁ డలంకారసూత్రములో నాక్షేపాలంకారమున కుదాహరణముగా నిచ్చెను. అమరకోశవ్యాఖ్యానములో రాయముకుటుఁడు "పయః పృషంతిభి స్స్పృష్టా వాంతి వాతా శ్శనై శ్శనైః" అనుశ్లోకము నుదాహరించి యిది పాణిని వ్రాసిన జాంబవతీవిజయములోని దని చెప్పెను. ఇందువలనఁ బాణిని మఱియొక కావ్యమునుగూడ వ్రాసినట్లు తెలియవచ్చుచున్నది. కాని పదునొకండవశతాబ్దియందుఁ బుట్టిన యీనవీనగ్రంథకర్తలు ప్రాచీనతముఁ డగు పాణినిగుఱించి వ్రాసిన వ్రాఁతలయందు విశ్వాసము గలవార లై యుండుట కొంత సాహసకృత్య

మని నాయభిప్రాయము. వైయాకరణపాణినికంటెఁ గవిపాణిని భిన్నుఁ డనియే
మనము నమ్మవలెను. వైయాకరణపాణినియే పాతాళవిజయ మనుకావ్యమును
వ్రాసినవాఁడైనచో "గృహ్య, అపశ్యతీ;" మొదలగు నపశబ్దములను బ్రయో
గించునా? కావున వీరిద్దఱు నొక్కరు గానేరరు. అయినను నమ్మఁదగినప్ర
మాణము లభించువఱకు వీరుభయులు నొక్కటియే యని మన మొప్పకొం
దము. ఏలయనఁగా నట్లు కానిచో నాప్తతములు విమర్శకులు నైననమిసా
ధుక్షేమేంద్రులు పూర్వోక్తకావ్యకర్తృత్వమును బాణిని కారోపింతురా? సదు
క్తికర్ణామృతమును వ్రాసినరాజశేఖరుఁడు కూడ "స్వస్తి పాణినయే తస్మై
యస్య రుద్రప్రసాదతః। ఆదౌ వ్యాకరణం కావ్య మను జాంబవతీజయమ్।
అనుశ్లోకమందుఁ బాణిని మహావైయాకరణుఁడై వ్యాకరణమును రచించు
టయే కాక మహాకవియై యుండి జాంబవతీవిజయ మనుకావ్యమును రచించె
ననియుఁ జెప్పుచున్నాఁడు. "సుబంధౌ భక్తిర్నః క ఇహ రఘుకారే న ర
మతే। ధృతి దాక్షీపుత్రే హరతి హరిచంద్రోపి హృదయమ్, విశుద్ధోక్తి శ్శూ
రః ప్రకృతిమధురా భారవిగిర। స్తథాప్యంతర్మోదం కమపి భవభూతి ర్వితనుతే॥
అను సదుక్తికర్ణామృతశ్లోకములోఁ జెప్పఁబడిన "దాక్షీపుత్రశబ్దము" పాణి
నినే చెప్పును గావున దీనిచేఁ బూర్వోక్తాంశము కొంత బలపఱుపఁబడు
చున్నది.

కాత్యాయనుని కాలమందుఁగాని యతనికాలముకంటె ముందు గాని
యాఖ్యాయిక లని వ్యవహరింపఁబడు గద్యకావ్యవిశేషము లుండె నని రుజువు
చేయుటకు, కాత్యాయనుని వార్తికములే తగినంతసాక్ష్య మిచ్చుచున్నవి.
"అధికృత్య కృతేగ్రంథే" (4-3-87) అనుసూత్రముతో సంబంధించిన
"లుబాఖ్యాయికాభ్యో బహుళమ్" అనువార్తికమువలన నీయంశము స్పష్ట
మగుచున్నది. వరరుచికాత్యాయను లొక్కటియే యని తెలుపుటకు "తస్యా
హం వసుదత్తాయాం జాత శ్శ్రుతధరాభిధః కాత్యాయనో వరరుచి శ్చేత్యన్వర్థ
కృతాహ్వయః (1-2-15) అనుబృహత్కథామంజరీశ్లోకమే మనకుఁ బ్రమా
ణము. వరరుచి వ్రాసినశ్లోకము లనేకములు సుభాషితావళిలోఁ జూపింపఁబడి
నవి. రాజశేఖరుఁడు తాను వ్రాసిన సూక్తిముక్తావళిలో వరరుచి కంఠా
భరణ మనునొకకావ్యమును రచించె నని చెప్పియున్నాఁడు. "యథార్థతా
కథం నామ్ని మాభూద్వరరుచే రిహ। వ్యధత్త కంఠాభరణం యస్సదారోహ

ణాప్రియః” పైనఁ జెప్పఁబడిన నిదర్శనములవలనఁ గ్రీస్తుశకమునకు మున్ను నాల్గవశతాబ్దము దలంకారనిబద్ధము లైనకావ్యము లున్నట్లు నిశ్చయింపఁబడు చున్నది. క్రీస్తుశకమునకు ముందు రెండవశతకమువాఁడైన మహాభాష్యకారుని (పతంజలి) కాలమందుఁ బ్రజలకుఁ గవనమం దుత్సాహము మెండుగా నున్నట్లు కానవచ్చుచున్నది. పతంజలి, మహాభాష్యమందు “లుబాఖ్యాయికాభ్యో బహుళమ్” అను వార్త్తికమునకు వ్యాఖ్యానము వ్రాయుచు వాసవదత్తా, సుమనోత్తరా, భైమరథీ, అనుమూఁడాఖ్యాయికల నుదాహరించెను. “అధికృత్యకృతేగ్రంథే” ఇత్యత్ర ఆఖ్యాయికాభ్యో బహుళం లుబ్వక్తవ్యః” వాసవదత్తా,సుమనోత్తరా, నచ భవతి భైమరథీ–పతంజలిమహాభాష్యములో కంసవధ, బలిబంధము నను రెండుకావ్యములఁజెప్పెను. మహాభాష్యమందు పతంజలి తనకంటెఁ బ్రాచీనులైన కవులు వ్రాసినగ్రంథములనుండి వందల కొలఁది శ్లోకముల నుదాహరించెను.

పతంజలికిఁ దరువాతఁ జెప్పఁదగిన మహాకావ్యములు రామాయణము మహాభారతము. వీనిప్రణయనకాలనిర్ణయమును గుఱించి వాదివిప్రతిపత్తి బహుళముగా నున్న నివి క్రీస్తుశకప్రారంభమందు రచింపఁబడిన వని చెప్ప వచ్చును.

ఈ రెండుకావ్యములలోఁ గవితారామణీయకపరసీమ లై విలసిల్లు శ్లోకము లనేకము లున్నవి. ఆనందవర్ధనాచార్యుఁడు మొదలగు నాలంకారికులు రామాయణమహాభారతశ్లోకములను దమ యలంకారగ్రంథములయం దనేకస్థలముల నుదాహరించియున్నారు. రామాయణమం దతిరమ్య మయినవర్ణనలు మెండుగా నున్నవి. కిష్కింధాకాండములో వర్షర్తుశరదృతువుల వర్ణనము, సుందరకాండలో, చంద్రవర్ణనము, యుద్ధకాండలో నాల్గవసర్గలో సముద్రవర్ణనము నతిమనోహరములై యున్నవి. ,,హసంత మివ ఫేనాఢ్యై ర్నృత్యంత మివ చోర్మిభిః। చంద్రోదయసముద్ధూతం ప్రతిచంద్రసమాకులమ్। పినష్టీవ తరంగాగ్రై స్సముద్రః ఫేనచందనమ్। తదాదాయకరైరిందు ర్లింపతీవ దిగంగనాః॥ ఈశ్లోకమును కువలయానందకారుఁ డుత్ప్రేక్షాలంకారమున కుదాహరణముగా నిచ్చెను. ,,హంసో యథారాజత పంజరస్థ స్సింహోయథా మందర కందరస్థః। వీరో యథా గర్వితకుంజరస్థ శ్చంద్రో విబభ్రాజ తథాంబరస్థః॥ స్థితః కకుద్మానివ తీక్ష్ణశృంగో మహాచల శ్శ్వేత ఇవో

చ్ఛ శృంగః| హస్తీవ జాంబూనదబద్ధశృంగో రరాజచంద్రః పరిపూర్ణశృంగః|
శిలాతలం ప్రాప్య యథామృగేంద్రో మహారణం ప్రాప్య యథా గజేంద్రః| రాజ్యం
సమాసాద్య యథానరేంద్ర స్తథా ప్రకాశో విరరాజ చంద్రః (సుందర-5 స
ర్గ) వాల్మీకికి రూపకాలంకారమందు మిక్కిలి ప్రీతి. రామాయణమం దంతట
నీయలంకార మనేకశ్లోకములయందుఁ గానవచ్చుచున్నది. ఎట్లనఁగా :—వృ
తోహి బాహ్వాంతరభోగరాశి శ్చింతావిష స్సుస్మితతీక్ష్ణదంష్ట్రః| పంచాంగు
ళీ పంచశిరోతికాయ స్సీతామహాహి స్తవ కేన రాజన్ (యుద్ధకాం- 14-2.)
మమచాపమయీం వీణాం శరకోణైః ప్రవాదితాం। జ్యాశబ్ద తుములాం
ఘోరా మార్త భీతమహాస్వనామ్ । నారాచతలసన్నాదాం తాం మమా
హితవాహినీం । అవగాహ్య మహారంగం వాదయిష్యా మ్యహం రణే॥ ఇట్టి
లోకోత్తరవర్ణనాలంకృత కవితామయములగు నీభారతరామాయణములే
తరువాతఁ బుట్టిన కాళిదాసాది మహాకవుల కాదర్శకము లైనవి. "ఇతి
హాసోత్తమా దస్మా జ్జాయంతే కవిబుద్ధయః । అస్య కావ్యస్య కవయో
నసమర్థా విశేషణే । ఇదం కవివరై స్సర్వై రాఖ్యాన ముపజీవ్యతే"
(భా'ర-ఆది-ప) అని భారతమును గుఱించియు, "కావ్యం రామాయణం
కృత్స్నం సీతాయా శ్చరితం మహత్ । రసై శ్శృంగార కారుణ్య హాస్యవీర
భయానకైః । రౌద్రాదిభిశ్చ సంయుక్తం కావ్య మేత దగాయతామ్॥
(బాల-4 సర్గ) అని రామాయణమును గుఱించియుఁ జెప్పఁబడియున్నది.
దశరూపకకారుఁ డగుధనంజయుఁడు రామాయణము బృహత్కథ మొదలగు
వానినుండి కథలను దీసికొని నాటకములను వ్రాయుఁడని కవుల కుపదేశించు
చున్నాఁడు. "ఇత్యా ద్యశేష మిహ వస్తువిభేదజాతం రామాయణాది చ వి
భావ్య బృహత్కథాంచ| ఆసూత్రయే త్తదను నేతృరసానుగుణ్యా చ్చిత్రాం
కథా ముచితచారువచఃప్రపంచైః (దశరూ-1 పరి- 61 శ్లో)

ఇట్లు క్రీస్తుశకమునకు ముందువెనుక శతాబ్దములయం దలంకారశాస్త్ర
మను నొకనూతనశాస్త్రము నేర్పాటుచేయుటకుఁ దగినంతకావ్యసామగ్రి వృద్ధి
నొందిన దని పూర్వోక్తాంశములవలన స్పష్ట మగుచున్నది. కావ్యలక్షణము,
వాని నియమములు, వాని విధులు, అలంకారలక్షణము, వాని నియమములు
మొదలగు వానిని బరిష్కరించి వ్రాయుట క్రీస్తుశకప్రారంభమందు మొదలయి
న దని చెప్పవచ్చును. నూతనకావ్యరచన, యట్టికావ్యమునకు లక్షణమును
జెప్పుసూత్రములు, ఏకకాలమందే బయలువెడలినవి.

మొట్టమొదట యాస్కుఁడు నిరుక్తమం దుపమ కిట్లు లక్షణముఁ జెప్పి యున్నాఁడు. అథాత ఉపమా, యదతత్, తత్సదృశ మితి గార్గ్య స్తదాసాం కర్మజ్యాయసా వా, గుణేన ప్రఖ్యాతతమేన వా కనీయాంసం వా ప్రఖ్యాతంవా ఉపమిమీతే అథాపి కనీయసా జ్యాయాంసమ్ (నిరుక్తమ్- 3) ఇది కావ్యప్రకాశకారుఁ డగుమమ్మటభట్టు చెప్పిన ,,సాధర్మ్య ముపమాభేదే" అను లక్షణముతోఁ దుల్యముగా నున్నది. ఉపమానము సుప్రసిద్ధ మయినది గాను, గుణబాహుళ్యము గలది గా నుండవలయు నని సాధారణముగా నొకనియమము కలదు. ఉపమేయముకంటె నుపమానము తక్కువది యై యుండుట దోషము. యాస్కుఁడు ,,జ్యాయసా కనీయాంసమ్ (పెద్ద వస్తువుతోఁ జిన్న వస్తువును బోల్చుట) అని సామాన్యనియమమును జెప్పి వేదమం దుపమానముపమేయముకంటెఁ దఱచుగాఁ దక్కువది యై యుండు నని తెలుపుటకు ఋగ్వేదశ్రుతి నొకదాని నుదాహరించెను. ,,తనూ త్యజేవ తస్కరా వనర్గూ రశనాభి ర్దశభి రభ్యధీతామ్ ఇయంతే అగ్నే నవ్యసీ మనీషా యుక్ష్వా రథం నశుచయద్భి రంగైః (10-4-6) పాణిని" ఉపమితం వ్యాఘ్రాదిభి స్సామాన్యాప్రయోగే (2-1-56) ఉపమానాని సామాన్యవచనైః (2-1-55) అనుసూత్రములయం దుపమానోపమేయ సామాన్య ధర్మములను జెప్పెను. బాదరాయణుని వేదాంతసూత్రములయం దుపమ, రూపకము గానవచ్చుచున్నది. ,,అత ఏవ చోపమా సూర్యకాదివత్ " (3-2-18) పరబ్రహ్మము నానావిధస్థానములయం దున్నను, జలమం దున్నసూర్యునికివలె నాయాయిస్థానములయం దున్నదోషము లాతని కంటవు. అని సూత్రార్థము. ఆనుమానికమ ప్యేకేషా మితి చే న్నశరీరరూపకవిన్యస్తగృహీతే ర్దర్శయతిచ (1-4-1) ఈసూత్రమునకు విషయవాక్యమైన ,,ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ చ" అను నుపనిషద్వాక్యమం దాత్మను రథికునిగాను శరీరమును రథముగాను, బుద్ధిని సారథిగాను, మనస్సును బగ్గముగాను నిరూపించి యొక రూపకము చెప్పఁబడెను. భరతుఁడు నాట్యశాస్త్రమం దుపమ, రూపకము, దీపకము, యమకము నని నాలు గలంకారములనే చెప్పియున్నాఁడు. ,,ఉపమా రూపకం చైవ దీపకం యమకం తథా । కావ్యస్యైతే హ్యలంకారా శ్చత్వారః పరికీర్తితాః" (నాట్యశాస్త్రము 16-41) భరతముని క్రీస్తువెనుక పంచమశతకమువాఁ డని నిర్ణయింపఁబడినది. అశ్వఘోషుని బుద్ధచరిత్ర మలంకారశా

త్రనియమములు కొన్ని యేర్పడినతరువాత రచింపఁబడినట్లు కానవచ్చుచున్నది. ఏలయనఁగా „సర్గాంతే భిన్నవృత్తైశ్చ" అను మహాకావ్యలక్షణము ననుసరించి కవి ప్రతిసర్గాంతమందు భిన్నవృత్తముల నుంచుటయే కాక „హరితురగతురంగవత్తురంగః" ఇత్యాద్యనుప్రాసములను దఱచు వాడుక చేసియున్నాఁడు. ఈయశ్వఘోషుఁడు యథాసంఖ్యాలంకారమందు మిక్కిలి యభిలాష గలవాఁడు. ఈతని బుద్ధచరిత్ర మయిదవశతాబ్దములో చైనాభాషలోను, ఏడవశతాబ్దమందు టిబెట్భాషలోను అనువదింపఁబడెను గావున నిది యయిదవశతాబ్దముకంటె ముందు వ్రాయఁబడినదియై యుండవలెను. సుబంధుఁడు వాసవదత్తలో శ్లేష, విరోధాభాస, ఉత్ప్రేక్ష మొదలగు నలంకారములను వ్రాసెను. „ప్రత్యక్షరశ్లేషమయప్రబంధవిన్యాసవైదగ్ధ్యనిధి ర్నిబంధనమ్" అను శ్లోకముచే సుబంధుఁడు శ్లేషయందుఁ దన కతిప్రౌఢి గల దని వెల్లడించెను.

సుబంధునికాలమునకుఁ గొన్నియలంకార విశేషములు, వానిలక్షణములు, కావ్యలక్షణములు కొంతమట్టు కేర్పడినవి. ఇతఁడు సత్కావ్యలక్షణ మిది యని తనగ్రంథములో నిట్లు చెప్పెను. „సత్కవికావ్యలక్షణఇవా నాబద్ధతుహినపాతః దీర్ఘోచ్ఛ్వాసరచనాకులం, సుశ్లేషవక్త్రఘటనాపటు సత్కావ్యవిరచన మివ (పాదపూరణార్థమై వాడుక చేయఁబడు తు,హి మొదలగు నిపాతలు లేనిది, ఉచ్ఛ్వాసము లనఁబడు గ్రంథవిచ్ఛేదములు గలది శ్లేషతోఁ గూడిన వక్త్ర మనువృత్తవిశేషము గలది) శృంఖలాబంధము ఉత్కలిక మొదలగుశబ్దచిత్రము లీసుబంధునినాఁటి కేర్పాటైనట్లుగ, ఈతని గ్రంథమువలననే తెలుచున్నది. „శృంఖలాబంధో వర్ణగ్రథనాసు" అని చెప్పియున్నాఁడు. సుబంధుఁడు వాసవదత్తలో ముఖ్యముగా పరిసంఖ్య, విరోధాభాస, ఉత్ప్రేక్ష, శ్లేష మొదలగునలంకారములను జెప్పెను. „కవీనా మగళ ద్దర్పో నూనం వాసవదత్తయా। శక్త్యేవ పాండుపుత్రాణాం గతయా కర్ణగోచరమ్" అని యేడవశతాబ్దమువాఁడైన బాణుఁడు తనహర్షచరిత్రోపోద్ఘాతయందు సుబంధుని గొనియాడియుండుటచే నీతఁ డాఱవశతాబ్దమం దుండె నని మన మూహింపవలెను. బాణుఁడు కాదంబరిలో నక్షరచ్యుతకము, మాత్రాచ్యుతకము, బిందుమతి, ప్రహేళిక మొదలగు వానిని జెప్పుటచే నీతనికాలమున కలంకారశాస్త్రము పూర్ణముగాఁ జెరిఁగిన దని నిశ్చయింపవచ్చును.

---

# మహాభారతమీమాంస.

—: చన్ల నారాయణశాస్త్రిగారు :—

(౧౫ సంపుటము ౪ సంచిక ౫౬ పుట శేషము.)

(5) దుర్వాసుఁడు పాండవులను బీడించిన కథయుఁ దరువాతఁ జేసినదే. దానికి సౌతి మహాభారతమందు స్థాన మిచ్చెను. (అధ్యాయము 261). (6) యుద్ధసమయమున సేనానాయకుఁడు ముందే "నే నీయాకార్యములను జేయుదును" మఱియు "నే నీవిధముగాఁ జనిపోయెదను" అని చెప్పుట యాశ్చర్యకరముగా నున్నది. ఇదేప్రకారముగా యుద్ధమునందలి పరాక్రమముయొక్క వర్ణన యతిశయోక్తులచేతఁ జేయఁబడినది. ఉదాహరణము:—భీముఁడు ద్రోణుని రథము నేడుపర్యాయములు పైకెత్తి విసరివైచె ననుకల్పన పిదపఁ జేయఁబడిన దని తెలియుచున్నది. అర్జునునియొక్క రథముగుఱించి చేసినకల్పనయు నిట్లే పిమ్మటఁ గావింపఁబడి యుండును. శ్రీకృష్ణుఁడు పార్థుని దివ్యరథమునుండి క్రిందికి దుమికినంతనే యది మండి భస్మమయ్యె నన్న పుక్కిటిపురాణము నిజముగాఁ జమత్కారముగ నున్నది. ఎందుచేత ననఁగా, శ్రీకృష్ణుఁడు ప్రతిదినము రథమునుండి క్రిందికి దిగుచునే యుండెను. చమత్కారయుక్తము లైన యిట్టికథలు మహాభారతమున ననేకము లున్నవి. ఈకథలన్నిటియందు మూలకథ లేవియో సౌతిసమయమునఁ గ్రొత్తగాఁ బ్రచలితము లైన కథ లేవియో యీవిషయము నిర్ణయించుట కష్టము.

## (3) జ్ఞానసంగ్రహము.

మహాభారతమునఁ బుక్కిటిపురాణముల నేవిధముగా సౌతి సంగ్రహించెనో, యావిధముగానే యతఁడు సర్వవిధములైన జ్ఞానములనుగూడ నీగ్రంథమున సంగ్రహించెను. రాజనీతి, ధర్మశాస్త్రము, తత్త్వజ్ఞానము, భూగోళము, జ్యోతిషము, మున్నగా శాస్త్రవిషయములయొక్క సంగతుల నొకచోఁ గూర్చుటయు నతని యుద్దేశమై యుండె ననుటకు సందియము లేదు. ఉదాహరణము. భూగోలసంబంధమగు జ్ఞానము భారతవర్షమున భిన్నభిన్న దేశములయు నట్లే నదులయు జ్ఞానము భీష్మపర్వమునకు మొదట నీఁబడియెను. కౌరవులుఁ బాండవులును భూమికొఱకు యుద్ధము చేయునపుడు ధృతరాష్ట్రుఁడు సంజయుని "ఈభూమి యెంత పెద్దదియో, సమస్తభూలోక మెట్టు

వంటివో, నేను తెలిసికొనవలయు నని యున్నది" యని యడిగెను. నిజముగా నీప్రశ్నమే చమత్కారయుక్తముగా నున్నది. యుద్ధసంబంధమగువిషయములను జర్చింపక ధృతరాష్ట్రుఁ డేదో మఱియొక విషయమును దెలియఁగోరుట యిది యాశ్చర్యము కాదా? భూగోలసంబంధిజ్ఞాన మెచ్చటనో యిచ్చుట యావశ్యకమై యుండెను, కాఁబట్టి సౌతి దాని నిచ్చటఁ గలిపియున్నాఁడు. ఇందుఁ బూర్వాపరసంబంధమునకు విచ్ఛేదముకూడఁ గలిగెను. పండ్రెండవయధ్యాయమునకుఁ జివర ధృతరాష్ట్రుఁడును సంజయుఁడును బరస్పరము సంభాషించుచున్నారు; కాని, రాఁబోవునధ్యాయమునకు మొదటనే సంజయుఁడు యుద్ధభూమినుండి యాతురతతో వచ్చి భీష్ముని మరణవృత్తాంతమును వినిపించుచున్నాఁడు. కాని సంజయుఁడు యుద్ధభూమియొద్దకు నెపుడు వెళ్ళియుండెనో దీని జాడ యగపడదు. రెండవ యుదాహరణము సభాపర్వములోని "కచ్చిత్" అధ్యాయమునం దున్నది. యుధిష్ఠిరుఁడు సభయందుఁ గూర్చుండఁగా నచ్చటికి నారదఋషి వచ్చి రాజ్యమునందలి యేర్పాటులఁగూర్చి యతనిఁ గొన్ని ప్రశ్న లడిగెను; ఎట్లనఁగా—"నీవు నీసైనికులకు సమయము మించకుండ జీతము లిచ్చుచున్నావా, లేదా? ప్రతిదినము ప్రొద్దుట లేచి రాజ్యముయొక్క యాయవ్యయములు పరీక్షించుచున్నావా, లేదా?" ఈప్రశ్నలన్నిటివలన నారదుఁడు యుధిష్ఠిరుని బరీక్షించుచున్నాఁ డనునట్లు తెలియుచున్నది. ఈయధ్యాయమందు నుత్తమమైన రాజ్యముయొక్క ప్రబంధము బందోబస్తునుగూర్చిన నియమముల నన్నిటిని మిగుల మర్మములఁ దెలిసి యొకచోటఁ జేర్చియుండెను. ఇదేవిధముగా జ్యోతిషసంబంధులగు విషయములను వనపర్వమునందు శాంతిపర్వమునందును జెప్పియున్నాఁడు. అక్కడ నీవిషయము లన్నిటికి నేదో విశేషమైన యావశ్యకతయుండెనని చెప్ప వలనుపడదు. భీముఁడును హనుమానుఁడును గలిసికొనినపుడు, భీముఁడు నాలుగుయుగములకు సంబంధించిన విషయము లడుగఁగా హనుమంతుఁడు వానిని వర్ణించెను. సాంఖ్యయోగతత్త్వజ్ఞానములలోని యభిప్రాయముల వర్ణన ప్రతిచోటను. విశేషముగా శాంతిపర్వమున, సవిస్తరముగా మాటిమాటికిఁ జేయఁబడెను. వక్తృత్వశాస్త్ర (Rhetoric) సంబంధులగు కొన్నితత్త్వములను సులభాజనకసంవాదమునఁ జెప్పెను. అవి నిజముగా మనోరంజకములై యున్నవి. న్యాయశాస్త్రములోని కొన్ని నియమములు కూడ నీసంవాదమువల్లనే నిష్ప

న్నము లగుచున్నవి. సారాంశము, సౌతి తన గ్రంథమందు ననేక శాస్త్రవిష యకములైన సంగతుల నొకచోటఁ జేర్పుటకుఁ బ్రయత్నము చేసెను.

(4) ధర్మమును, నీతిని శిక్షించుట.

సౌతి మహాభారతమున సనాతన ధర్మమును సంపూర్ణముగాఁ బ్రక టించుటకు యత్నించెను. మునుపు చెప్పిన కారణముచేతనే మహాభారత మొక ధర్మశాస్త్రము లేక స్మృతి యనియె యెంచవలసి యున్నది. ఇందు సనాతన ధర్మము నందలి ముఖ్యసత్యములు చెప్పఁబడినవి. ఈతత్త్వములు విస్తారముగా విశేషించి యనుశాసనపర్వమందును శాంతిపర్వ మందును దిలకింపఁ బడుచు న్నవి. అన్యస్థానములయందును వీనిచర్చ చేయఁబడి యున్నది. ఉదాహర ణార్థము, ఆదిపర్వములోని యుత్తరయయాత్యాఖ్యానమును (అధ్యాయ ము 86–93) తరువాత సౌతి కలిపియున్నాఁడు. ఇందలి శ్లోకములు పెద్దవృ త్తములై యున్నవి. ఆఖ్యాన మంతయును ముఖ్యకథతో సంబంధించి లేదు. కాని యిందు సనాతనధర్మతత్త్వములయొక్క వర్ణన సంక్షేపముగా మర్మజ్ఞత తోఁ జేయఁబడి యున్నది ; కనుక నీయాఖ్యాన మభ్యసింపఁ దగియున్నది. నీతితత్త్వములు కూడ స్థానమున స్థానమునఁ దెలుపఁబడినవి. దీనికి విదురనీతి యుదాహరణము. ఉద్యోగపర్వము (అధ్యా. 32–39) నందు విదురునిసంభా షణము కలదు. అది పూర్వాపరకథలతో విశేషముగా సంబంధము కలిగి యుండలేదు. అయినను విదురనీతి యున్నయధ్యాయములు మర్మముల నెఱిం గించు నవిగను వ్యవహారచాతుర్యముతో నిండినవిగను నున్నవి. సారాంశము ధర్మము, నీతియు నీగ్రంథమున సారెసారెకు ననేకస్థానములయందు నుపదే శింపఁబడినది ; కాబట్టి యీ గ్రంథమునకు నపూర్వమహత్త్వము ప్రాప్తించెను.

(5) కవిత్వము.

మహాభారతము కేవల మితిహాసము, ధర్మగ్రంథము మాత్రము కాదు. ఇఁక నేమంటే అయ్యది యొకానొక యుత్తమమహాకావ్యము కూడ నగు చున్నది. అందఱు సంస్కృతకవులును వ్యాసమహర్షికి నాదికవి యగువాల్మీ కితో సమాన మైనస్థానము నిచ్చియుండుట ప్రసిద్ధమై యున్నది. వ్యాసమహ ర్షియొక్క మూలభారతమునందలి రసమయమైన కవిత్వముచేతఁ బ్రేరితుఁడై సౌతియుఁ దనకావ్యకరణశక్తిని బ్రకటించుటకు ననేకము లైనమంచి మంచి

ప్రసంగములను గావించెను. సృష్టివర్ణన, యుద్ధవర్ణన, శోకప్రసంగము నీమూఁడే కవికిఁ గలస్ఫూర్తిని బ్రదర్శించుటకుఁ బ్రధానవిషయములుగానున్నవి. సౌతి మహాభారతమున యుద్ధవర్ణనలను జాల హెచ్చుచేసెను; ఇంతయే కాదు; అప్పు డప్పు డీవర్ణనలవలనఁ బాఠకులమనసు విసుగుచున్నది. సృష్టిసౌందర్యవర్ణనఁగూడ సౌతి ప్రతిస్థలమునఁ జాలఁ బెంపుచేసెను. విశేషముగా వనపర్వమునఁ జేయఁబడిన హిమాలయపర్వత దృశ్యములయొక్క వర్ణనయు, గంధమాదనపర్వతముయొక్క వర్ణనయు స్మరింపఁదగియున్నవి. శోకవర్ణనయందు స్త్రీపర్వము ప్రాయికముగా నంతయు సౌతిదై యుండవలయును. ఇచ్చటఁ గవి దివ్యదృష్టిప్రాప్తిచేత గాంధారి భారతయుద్ధముయొక్క సమస్తభూమిని జూడఁగలిగిన దనియు, సమరభూమియందు సమసిన వీరులయొక్క స్త్రీలు తమతమ భర్తలయొక్క శవములను నొడిలోఁ బెట్టుకొని శోకించుచున్నారనియు వర్ణించియున్నాఁడు. ఈచమత్కారిక మైనవర్ణన మహాకవికి శోభావహాము కాదు. గాంధారీముఖమున నిట్టిశోకవర్ణనఁ గావించుట యయోగ్యముగా నగపడుచున్నది. పదునెనిమిదిదినములదాఁక యుద్ధము జరిగినమీఁద జిందరవందరగాఁ బడియున్న వీరులశవములు గుర్తింపఁబడఁగల్గుటయు సంభవము కానేరదు. భారతయుద్ధభూమి యేదో సాధారణమైన యుద్ధభూమివలె గాక చాలకోసులదూరమువఱకు వ్యాపించి యుండె ననువిషయముమీఁద ధ్యాన ముంచితిమేని యపుడు, ఈదృశ్య మంతయు నసంభవ మని చెప్పవలసియున్నది. యుద్ధభూమికి స్త్రీలు చనుటయు ననుచితముగా నగపడుచున్నది. కావ్యాలంకారగ్రంథమున నుదాహరణముకై యీయఁబడిన "అయం సరశనోత్కర్షీ" యను ప్రసిద్ధశ్లోకముకూడ నీస్త్రీపర్వమందుఁ గలదు. ఇది యాధునికకవులయొక్క యశ్లీలవర్ణనకు నమూనా. ఈశ్లోకము సౌతిదే యగునని స్పష్టముగాఁ దెలియుచున్నది. అది మహాకవి యగువ్యాసునిది కాఁజాలదు. యుద్ధభూమియందుఁ బడియుండుటచేత హింస్రములైన పశువులును బక్షులుఁ గీఁకి యస్తవ్యస్తము చేసిన వీరులశరీరములు సుందరములు వర్ణనీయములు నెట్లు కాఁగలుగును ? అప్పటికి నాలుగైదు దినములకు మునుపే యుద్ధమునఁ బాలవీరుఁ డగునభిమన్యుని యవసరము కలిగెను. అట్టిచో నతనిముఖము మనోహరమును బ్రఫుల్లమునై యెట్లు కానిపింపఁగలదు? ఆతనిబాలస్త్రీ యతనిముఖము నెట్లు ముద్దుపెట్టుకొనఁగలుగును ? సారాంశము- ఈ స్త్రీపర్వమం

తయు సౌతి క్రొత్తగా రచించెను. ఇది యనేకములైన యప్రయోజకపు దృశ్యములతోడను నట్టికల్పనలతోడను నిండియున్నది. అయినను గవిత్వదృష్టిం బట్టి యది యేమాత్రముం గొంచెపుదరగతిలోనిది కాదు. సౌతియొక్క కవిత్వశక్తి యాలోచింపఁగా వ్యాసునిశక్తికి సమానము కాకపోవచ్చును. అయిన నయ్యది చాల గొప్ప తరగతిలోనిది యై యున్నది. ఈవిషయము విరాటపర్వమున నున్న యనేక మనోహరవర్ణనలచేత సిద్ధమగుచున్నది. కాని స్త్రీపర్వమందువలెనే మనుష్యస్వభావముఁబట్టి చూచినయెడల నచ్చటిదృశ్యములుకూడ నసంభవములుగాఁ దోఁచుచున్నవి. ఉదాహరణార్థము, ఉత్తరుఁ డొకపిఱికి యగుపిల్లకాయగా నుండెను; వాఁడు పరుగెత్తినప్పు డర్జునుఁడు వాని జుట్టుపట్టుకొని వానిని వెనుకకుఁ దీసికొనివచ్చెను; కాని యాపిల్లవాఁడే పిదప నొకమహాఘనుఁడైన కవి యగుటయుఁ బంచపాండవుల ధనుస్సులను మిక్కిలి చిత్తాకర్షకముగ వర్ణించుటయుఁ జిత్రముగా నున్నవి. ఈ వర్ణన యందుఁ గొన్ని కూటశ్లోకములు సయితమున్నవి, యనువిషయముమీఁద నేకాగ్రతతో మనస్సు నుంచి యాలోచించినచో నిదంతయు సౌతియొక్క రచనయే యని స్పష్టముగాఁ జెప్పకతప్పదు. కూటశ్లోకములరచన నిజముగా నెవరు చేసియుందు రన్నప్రశ్న యిచ్చట విచారింపఁదగియున్నది. సాధారణముగా నత్యుత్తమకవి కేవలము శబ్దాలంకారములతోఁ దనకావ్యము నలంకరించుటకుఁ బ్రవర్తింపఁ డనువిషయమునందు ధ్యాన ముంచెదమేని, ఈకూటశ్లోకములు సౌతివే యగునని నుడువకమానము. వ్యాసుని మూలభారతమం దప్పుడప్పుడు స్వచమత్కృతి యగుపడుట బొత్తిగా నసంభవము కాదు ; కాని దీనిపరిమాణ మేమియు నధికము కానేరదు. కర్ణపర్వముయొక్క 90వ యధ్యాయమునకుఁ జివర నొక్కశార్దూలవిక్రీడితశ్లోకమున్నది. అందు 'గో' శబ్దమును భిన్నభిన్నార్థములయందు మాటికి మాటికి నుపయోగించి యది కూటశ్లోకముగాఁ జేయఁబడెను. ఇది సౌతిదికూడఁ గాఁబోదు. శబ్దచిత్రకావ్యమును రచించు మఱియొకకవి యెవరో యిశ్లోకమును దరువాత నిచ్చటఁ దూర్చియున్నాఁడు. ఆలోచింపఁగాఁ గూటశ్లోకములయొక్క 8800 సంఖ్య గర్వోక్తులతోడను నతిశయోక్తులతోడను గూడినదిగాఁ బొడకట్టుచున్నది. అయినను మహాభారతమునందు నిట్టిశ్లోకములకుఁ గొంచెమును గొఱంత లేదు. దీనికిఁ గొంచెముగా నంచనా క్రింది వివేచనచేత వేయఁబడఁగలదు.

మహాభారతమునం దక్కడక్కడ, మిక్కిలి గూఢమైన యర్థముగలవి లేక సరలమైనరీతిని దెలియరాని యర్థము గలవి యింతే కాక భ్రామకమైన మఱియొక యర్థమును బుట్టించునట్టి యేకార్థకశబ్దప్రయోగములు కలవు, దీని వలన యథార్థమగు జ్ఞానము నెడల నాటంకము కలుగుచున్నది. శాంతిపర్వమును జూచునపుడు కొద్దియధ్యాయములయం దిట్టిశ్లోకము లగపడును. అవి క్రింద నీయఁబడును. ధ్యానపూర్వకముగాఁ జదివెడువారికి దీనివల్లఁ గొంత లాభము కలుగును.

1. చతుర్థోపనిషద్ధర్మః సాధారణ ఇతి స్మృతిః। సంసిద్ధై స్సాధ్యతే నిత్యం బ్రాహ్మణై ర్నియతాత్మభిః॥ (శాంతి.అ. 170, 30)

2. శ్వేతానాం యతినాంచాహ ఏకాంతగతి మవ్యయాం(శాం,అ,349)

3. సేవాశ్రితేనమనసా వృత్తిహీనస్య శస్యతే।ద్విజాతిహస్తాన్నిర్వృత్తా నతు తుల్యా త్పరస్పరాత్॥ (శాం. అ. 291)

4. యః సహస్రాణ్యనేకాని పుంసా మావృత్య దుర్దృశః। తిష్ఠత్యేకః సముద్రాంతే సమే గోప్తాస్తు నిత్యశః॥ (శాం. అ. 284)

5. గృహస్థానాంతు సర్వేషాం వినాశ మభికాంక్షతాం। నిధనంశోభనం తాత పులినేషు క్రియావతాం॥ (శాం. అ. 297)

6. మాతా పుత్రః పితా భ్రాతా భార్యా మిత్రం జనస్తథా। అష్టాపద పదస్థానే దక్షముద్రేవ లక్ష్యతే॥ (శాం. అ. 278)

ఈప్రకారముగా సంకను వేఱువేఱు స్థానములయందు ననేక శ్లోకములను జూపవచ్చును. ఇవి గాక, యనేకాఖ్యానములందుఁ బూర్ణశ్లోకములే కూటములుగా నున్నవి. ఉదాహరణార్థము సనత్సుజాతాఖ్యానము చూడఁదగియున్నది. అచ్చటచ్చటఁ జాఠకులను సుడివడఁజేయునట్టి యేకార్థకములైన విలక్షణనామములుకూడఁ దటస్థించుచున్నవి; ఏవిధముగా ననఁగా-ఆశ్రమవాసిపర్వమందు "ఇయం స్వసా రాజచమూపతే శ్చ" అను శ్లోక మున్నది. అనేక స్థానములయందు జ్యోతిషవిషయమునను మఱియు నంకములవిషయమునను నేయుల్లేఖములు కలవో వానియందుఁ గొంచెమో గొప్పయో కూట మవశ్యముగా నుండును. దానిఁ దెలిసికొనుటకుఁ బ్రయత్నించుట యప్పుడప్పుడు వ్యర్థ మగుచున్నది. మహాభారతమునఁ గూటములు లేక గూఢార్థశ్లోక

ములు హెచ్చుగా నున్నవనుటయే మనయంచనా. తెలుచు ప్రతియధ్యాయమున నిట్టిస్థానము లగపడుచున్నవి. అక్కడక్కడ నిట్టిస్థానములసంఖ్య చాల నధికముగానే యున్నది. మహాభారతమున మొత్త మధ్యాయముల సంఖ్య యించుమించుగా 2000 అగుచున్నది ; ఇట్టియవస్థయందుఁ గూటశ్లోకముల సంఖ్య చాలవే లుండవచ్చును * అగుఁగాక ! ఈకావ్యచమత్కృతి మూలమున వ్యాసునిదే యై యుండుట యు దానిని సౌతి తన చాతుర్యముచేత మిక్కిలి యధికముగా వృద్ధి చేసియుండుటయుఁ గూడ సంభవ మగుచున్నది. దీనిఁబట్టి మనము చెప్పవలసియున్నది సౌతి యెవఁడో యొక చిన్నతరగతిలోని సామాన్యకవి కాఁడనియే.

* కూటశ్లోకములకుఁ గూటశబ్దములకు మఱికొన్ని యుదాహరణము లీయవచ్చును, ఎట్లనగా :—

(1) యత్ర సాబదరీరమ్యా హ్రదోవైహాయస స్తథా॥ (శాంతి. 127. 3)
వైహాయసః (మందాకిన్యాః) హ్రదః

(2) నశంఖలిఖితాం వృత్తిం శక్య మాస్థాయ జీవితుం॥ (శాంతి, 130–29)
శంఖే లలాటాస్థిః.

(3) నాసతో విద్యతేరాజ్ఞ సహ్యరణ్యేషుగోపితః॥ (శాంతి135–26)

(4) పారావత కులింగాక్షాః సర్వేశూరాః ప్రమాథినః॥ (శాంతి, 101–7)
కులింగోభూమి కూష్మాండే మతంగజభుజంగయోః । ని॥కులింగః సర్పః

(5) విరమే చ్చుష్కవైరేభ్యః కంఠాయాసంచవర్జయేత్॥ (శాంతి, 103–10)
కంఠాయాసం ముఖరత్వం.

(6) తైక్ష్ణ్యం జిహ్మత్వ మాదాల్భ్యం సత్యమార్జవమేవచ। (శాం, 120–5)
ఆదాల్భ్యం అభయం.

(7) శ్లక్ష్ణాక్షరతనుః శ్రీమాన్భవే చ్ఛాస్త్రవిశారదః॥ (శాంతి,120–7)

(8) లోకేచాయవ్యయౌ దృష్ట్వా బృహద్వృక్షమివాస్రవత్॥(శాంతి,120–9)

(9) శాంతిపర్వమునందు 120 వ యధ్యాయమంతయుఁ గూటశ్లోకములతో నిండియున్నది.

(10) కావ్యాని వదతాం తేషాం సంయచ్ఛామి వదామిచ॥ (శాంతి124–34)
కావ్యాని శుకప్రోక్తాని నీతిశాస్త్రాణి.

(11) స తస్యసహజాతస్య సప్తమీం నవమీం దశాం। ప్రాప్నువంతితతః పంచ న భవంతి గతాయుషః॥ (శాంతి, 331-28)

(12) త్యజ ధర్మమధర్మంచ ఉభే సత్యానృతే త్యజ। ఉభే సత్యానృతేత్యక్త్వా యేన త్యజసి తం త్యజ॥ (శాంతి. 329-40)

(13) విచార్య ఖలు పశ్యామి తత్సుఖం యత్రనిర్వృతిః॥ (శాంతి, 111-32) సుఖం స్వర్గః॥

(14) మనుష్యశాలావృకమప్రశాన్తం జనాపవాదే సతతం నివిష్టం॥ (శాంతి, 114-17) మనుష్యశాలావృకం మనుష్యేషు శ్వా.

(15) అధ్వానం సోతిచక్రామ ఖచరః ఖేచరన్నివ॥ (శాంతి, 325-16)

కవిత్వప్రదర్శనమునకు భిన్నభిన్న ప్రసంగములను సమావేశపఱిచి సౌతి స్థానమునస్థానమున మహాభారతమును విస్తరించె ననుటకు సంశయము లేదు. స్త్రీపర్వమునందును విరాటపర్వమునందును నీవిషయము స్పష్టముగా నగపడుచున్నది. ఇతరపర్వములందును, విశేషించి యుద్ధపర్వమున, నీవిధముగా మిలితము చేయఁబడిన ప్రసంగములకు లోప మేమియును లేదు. సారాంశ మేమనఁగా, (1) ధర్మమతముల యైక్యము, (2) కథాసంగ్రహము, (3) జ్ఞానసంగ్రహము, (4) ధర్మము, అట్లే నీతి, వీని నుద్దేశించి సౌతి భారతముం దనేకనవీనప్రసంగములను గలిపి దానికిఁ జాల మంచిస్వరూపము నిచ్చి సనాతనధర్మముయొక్క సంరక్షణమునకును దార్ఢ్యమునకు నత్యంతము ప్రశంసనీయమైన ప్రయత్నము చేసెను. కవిత్వప్రసంగముల సాహాయ్యమునం జేసి సౌతి యీగ్రంథమును సర్వోత్తమమైన కావ్యముగా నిర్మించెను. కాని, దీనికిఁ దోడ్తోడనే సౌతి యిటువంటి యుపాఖ్యానములను జేర్చి గ్రంథము విరివి యగునట్లు చేయుటవలన మహాభారతమునకుఁ గొన్ని విషయములలో రమణీయస్వరూపము ప్రాప్తము కాలే దని కూడ నంగీకరింపవలసివచ్చుచున్నది. ఇంతియేకాక కొన్ని యంశములయందు దాని కస్ప్రాధాన్యము కూడఁ బ్రాప్తించినది. కనుక నముఖ్యతను బోధమించునట్టి విషయములనుగూర్చ విచారించుట యావశ్యకమై యున్నది.

## (6) పునరుక్తి.

అనేక ప్రసంగముల పునరుక్తివలన గ్రంథము విస్తరిల్లినది. ఏదే నొక విషయమును జనులకుఁ బలుమాఱు తెలుపవలెనని యెపుడు దానియొక్క

పునరుక్తి చేయఁబడునో, యపు డది ప్రశంసనీయమగుచున్నది. కాని, యట్లు కానినాఁడు పునరుక్తిదోషము చదువరులమనసు నొప్పించుచున్నది. ఇటువంటిపునరుక్తి యీ గ్రంథమునఁ దఱచుగానంతట నగపడుచున్నది. అచ్చటచ్చట నీపునరుక్తి గ్రంథమునం దధికాంశమై తరువాత, నడుమనే యగపడుచున్నది. ఇందు కనేకోదాహరణము లీయవచ్చును. ఆదిపర్వమునం దాస్తికునికథ రెండుమాఱులు వచ్చినది ; రెండవమాఱు ఆకథ వర్ణింపఁబడినపుడు ముందటిదానికంటెఁ జాలఁ బెరిఁగిపోయినది. కాశ్యపతక్షకులకథయును రెండుమార్లు చెప్పఁబడెను. వనపర్వమునఁ దీర్థములవర్ణన రెండుమార్లు చేయఁబడినది. వైశంపాయనునిసమయమునఁ బ్రసిద్ధములైన తీర్థములకంటె సౌతిసమయమున మఱికొన్ని ప్రసిద్ధములై యుండుట సంభవము ; ఎందుచేత ననఁగా, అతనిసమయమున నార్యులవ్యాప్తి దక్షిణమున మిక్కిలి యెక్కు వయ్యెను. ఈపునరుక్తికి స్వరూపము తఱచుగా నియ్యదియై యున్నది—పూర్వపు కథలను గొంచెము విరివియగునట్లు చెప్పుటకై జనమేజయుఁడు ప్రార్థింపఁగా నదేకథను వైశంపాయనుఁడు మఱల వినిపించుచున్నాఁడు. కాని, యచటచట నీస్వరూపముకూడ గోచరము కాదు. ఉదాహరణార్థము, అభిమన్యుని వధప్రసంగమున శోకసాంత్వనమునకై వ్యాసమహర్షి యుధిష్ఠిరునికి షోడశరాజీయాఖ్యానము నుడివెను. ఆయాఖ్యానమునే కృష్ణుఁడు యుధిష్ఠిరునిచేత శాంతిపర్వమునఁ దిరిగి చెప్పించెను. ఇట్టియవస్థయం దీపునరుక్తి క్షంతవ్యము కానేరదు.

## (7) అనుకరణము.

అనుకరణము రెండవవిధమైన దోషము. ఏదో యొకమనోహరప్రసంగమును జూచి మఱియొకకవికి "నేనుఁగూడ నదే ప్రకారముగా మఱియొక ప్రసంగమును గావింతు" నని ప్రవృత్తి కలుగుచున్నది. ఉదాహరణార్థము, కాళిదాసుయొక్క సుందరమైన మేఘసందేశకావ్యమునకుఁ బిమ్మట నితరకవులు హంససందేశము మొదలుగా మఱికొన్ని కావ్యములను రచించియుండి రనుట ప్రసిద్ధము. ఈ ప్రకారముగా ననుకరించు తలంపుతో వ్యాసవర్ణితములైన భారతములోని కొన్ని ప్రసంగములను సౌతి యనుకరించియున్నాఁడు. దీనికి ముఖ్యమైనయుదాహరణము వనపర్వముయొక్క చివరఁ జేర్చిన యక్షప్రశ్ననామకమైన యాఖ్యానము. సౌతి యీయాఖ్యానమును నహుషప్రశ్నము (వనపర్వము అధ్యాయము 195) యొక్క ననుకరించి గావించెను.

ఇందును యుధిష్ఠిరునిద్వారా యతనిసోదరులవిముక్తిని దెలుపుకథ యున్నది. ఈయక్షప్రశ్నాఖ్యానమును సౌతి తరువాతఁ గల్పించెనని యనుమాన ము గావించుటకై కొన్ని కారణములు చూపఁబడుచున్నవి. మొదటికారణ ము—ఎపుడు సహదేవుఁడు, అర్జునుఁడు, భీముఁడును, వారిపూర్వపురుషునికిఁ గలిగినదశను బ్రత్యక్షముగా నెఱిఁగియుండిరో, ఎపుడు యక్షుఁడు వారిని స్ప ష్టముగా సావధానులఁ గావించియుండెనో, అపుడు వారును సరోవరములోని యుదకము త్రాగి మరణించు రనుటకు నిజముగా నాశ్చర్యపడవలసిన పని యేమున్నది? రెండవకారణము—యక్షుని ప్రశ్నలుగూడ నెప్పటియట్లే య గపడుచున్నవి. అవి యేమహాకవికిని శోభాదాయకములు కావు. మూఁడవ కారణము—ప్రశ్నోత్తరానంతరము యక్షుఁడు యుధిష్ఠిరునితో నీవు నీ య జ్ఞాతవాసదినములను విరాటనగరమునఁ గడుపు మని చెప్పియున్నాఁడు; ఇం త జరిగినతరువాతఁ గూడ నెదుటి పర్వమునకు మొదట నజ్ఞాతవాసదినముల ను గడుపువిషయమున యుధిష్ఠిరునికిఁ జాలఁ జింత గలిగె నని చెప్పఁబడియు న్నది. నాల్గవకారణము—యుధిష్ఠిరుఁడు బ్రాహ్మణు లందఱను బంపి ధౌమ్యు నొకని దనయొద్ద నుంచుకొనియె నని కథయందున్నది. ఇట్లయినపిదపఁగూడ, విరాటపర్వారంభమున, యుధిష్ఠిరునొద్ద నందఱు బ్రాహ్మణులుఁ గల రని మ నము చూచుచున్నాము. సారాంశము, యక్షప్రశ్నోపాఖ్యానము మూలభా రతమున లేకుండె ననియు, సౌతిచేత నయ్యది తరువాతఁ జేర్పఁబడిన దనియుఁ దెలియుచున్నది. అనుకరణమునకు రెండవయుదాహరణ ముద్యోగపర్వము నందు వర్ణింపఁబడిన విశ్వరూపదర్శనము. భగవద్గీతయం దేవిశ్వరూపదర్శన మున్నదో, యది యచట నుచితమైన స్థానమున నీయఁబడినది. అది వ్యాసు ని మూలభారతములోని యంశముకూడ నై యున్నది. కాని దాని ననుకరిం చి సౌతి యుద్యోగపర్వమున నేవిశ్వరూపదర్శనమునకు స్థానమిచ్చెనో, యది యప్రాసంగికముగా నగపడుచున్నది. దానియొక్క పరిణామముకూడ ధృతరా ష్ట్రదుర్యోధనుల మనస్సులం దిసుమంతయుఁ గాలేదు.

(8) భవిష్యత్కథనము.

గ్రంథకారులు రాఁబోవువిషయములను ముందే భవిష్యరూపమునఁ జెప్పుచున్నారు లేక వానికిసంబంధించిన కొన్నియభిప్రాయములను ముందే సూచించుచున్నారు. వారి కిదియొకసాధారణమైన యుక్తిగా నున్నది. ఈప్ర

కారముగాఁ గొన్ని భవిష్యత్కథనములు తరువాత సౌతి చేతఁ గలుపఁబడినవిగా విదితము లగుచున్నవి. ఉదాహరణార్థము, స్త్రీపర్వమున గాంధారి శ్రీకృష్ణునికిఁ మీారందఱు యాదవులుఁ బరస్పరము కలహించి మరణింతు రని శాపమిచ్చెను. [illegible] తఱు చెంతటను గనుపట్టుచున్నవి. కర్ణుని, కతని రథచక్రము యుద్ధసమయమున గోతిలో దిగఁబడు నని శాపముం[illegible]ను. ఈశాపము లన్నియుఁ దఱచు తరువాతనుండి కల్పింపఁబడినవని చెప్పవచ్చును. ఉద్యోగపర్వములో నెనిమిదవయధ్యాయమునం దున్న శల్యయుధిష్ఠిరసంవాదము, శాపములు లేకయే తరువాత రాఁబోవువిషయములను ముందుగాఁ గల్పించుట యొక్క చమత్కారమైయుండె ననుటకు మఱియొక యుదాహరణము. శల్యుని దుర్యోధనుఁడు సంతోషపఱిచి తనపక్షమునఁ జేర్చికొనెను. ఈసమాచారము శల్యునివలనఁ దెలిసినపుడు యుధిష్ఠిరుఁ డిట్లు ప్రార్థించెను. "నీవు కర్ణార్జునులయుద్ధసమయమునఁ గర్ణునికి సారథి వయ్యెదవు, అపుడు కర్ణునికిఁ దేజోభంగమును గావింపవలయును." శల్యుఁ డిట్లుత్తరమిచ్చెను.— "నేను గర్ణునికి సారథ్యముచేయుట తటస్థించునేని యపుడు నే నతనియుత్సాహమునకు భంగము గావింతును, అపుడు నీ వతని బరిమార్పఁగలవు." భీష్మద్రోణులిరువురు మరణింతు రనియుఁ, గర్ణార్జునులకు భయంకరసంగ్రామ మగు ననియు నాసమయమునఁ గర్ణుఁడు శల్యునినే తనసారథిగాఁ జేసికొను ననియు నీవిషయముల కల్పన ముందే యెట్లు చేయఁబడఁజాలును? ఇదిగాక యీప్రకారముగ విశ్వాసఘాతము లేక మిత్రద్రోహము యొక్క యుపదేశము యుధిష్ఠిరుచేతఁ జేయఁబడుట యతనికి శల్యునికిఁ గూడ లజ్జావహమైయున్నది. సారాంశము—ఈప్రకారముగా భవిష్యత్కథనమునకు సౌతి చేసిన యీప్రయత్న మనుచితముగా నున్నది. ఇదిగాక మఱియొక సంగతి కలదు. శల్యుఁడు దుర్యోధనుని పక్షమునఁ గలియుట కొక కారణ మున్నది. అతఁడు అర్థస్య పురుషో దాసః యను నీతి ననుసరించి దుర్యోధనుని కాశ్రితుఁడయ్యెను. యుధిష్ఠిరుని యొద్దకు వచ్చుచుండఁగా నడుమనే యతని సంతుష్టుఁజేసి దుర్యోధనుఁడు తనపక్షమునఁ గలుపుకొనియె నని వర్ణింపఁబడినది, యది యసంబద్ధము. కర్ణునికిఁ దేజోభంగ మయ్యె ననియు నీకారణముచేతనే యతఁడు హతుఁ డయ్యె ననియు నీవిషయముకూడఁ దరువాత నగపడదు. ఈ తేజోభంగకారణమునఁ గర్ణునిశౌర్యమునకు న్యూనత వాటిల్లెనని గ్రంథమునందు వర్ణిం

పఁబడలేదు. దీనికి మాఱుగా శల్యుఁ డుచితసమయమునఁ గర్ణుని కిట్లుసూచిం చెను. "గుఱి సరిగా లేనికారణముచేత నీబాణము తగులదు కాఁబట్టి సరిగా శరసంధానము గావింపుము, అనఁగా శల్యుఁడు మిత్రద్రోహము చేయలే దనియే వర్ణింపఁబడియున్నది. యథార్థమున నీభవిష్యకథనభాగమును సౌతి వ్యర్థముగాఁ బెంచియున్నాఁడు. ఇందు కింకను నుదాహరణములు ముందు నకుఁ బోయి యియ్యఁబడును. సారాంశము, అప్రబుద్ధము లైనను ప్రచలితము లైన యనేకకథలను సౌతి మహాభారతమునఁ బిమ్మటఁ గలిపివైచెను.

## (9) కారణముల దిగ్దర్శనము.

కారణములదిగ్దర్శనము చేయుట యంతిమ మగుదోషస్థానము. పూ ర్వకాలమునందలి ప్రసిద్ధపురుషులు సదోషాచరణముల నెందుకు నెట్లుకా వించిరో, దీనివిషయమునఁ గొన్ని కారణములను జూపుట యావశ్యకము. ఎట్లనఁగా, పంచపాండవు లొక్క ద్రౌపదినే యెట్లు వివాహము చేసికొనిరి. భీముఁడు దుశ్శాసనునిరక్తము నెట్లు త్రాగెను. ఇవి మొదలుగాఁ గొన్నికార్య ములు దోషార్హములై యున్నవి. వానిఁగూర్చి కొన్నికారణములను జూపుట యత్యంతావశ్యకము. వేనియందీఘటనలకుఁ గొన్నికారణములు గ్రథితములై యున్నవో, యిట్టి వుక్కిటిపురాణములను సౌతి మహాభారతమునఁ జేర్చెను. ఒక్కొక కథాభాగములోని ప్రసంగమున స్వయముగా వ్యాసుఁ డచ్చటికి వచ్చి వేఱువేఱు వ్యక్తుల కుపదేశించుచున్నాఁడని లేక వారికి రాఁగలవిషయ ములు కొన్ని సూచించుచున్నాఁడని కూడఁ జూడఁబడుచున్నది. ఏయే స్థాన ములయందు నిట్టివర్ణనలు కనఁబడుచున్నవో, అవి వ్యాసునిమూలభారత మందుఁ గాక సౌతిచేతఁ దరవాతినుండి కలుపఁబడినవి. ఒకప్రసంగమున వ్యాసమహర్షి వచ్చి ధృతరాష్ట్రునితో దుర్యోధనుఁడు పుట్టియుఁ బుట్టఁగనే యత నిని గంగలో విడువవలయు నని చెప్పుచున్నాఁడు. ఈ ప్రసంగముకూడఁ బిమ్మట రచించిన దని తెలియుచున్నది. కానిమ్ము: ఈప్రకారముగా మూఁడు నాలుగు కారణములచేత సౌతి మహాభారతమును విస్తీర్ణముఁజేసెను. అయ్యది విశేషరమణీయముగా నగపడదు. మహాభారతమున నీవిధముగాఁ బిదపఁ జేర్పఁబడిన స్థానము లన్నియు నేవేవో నిర్ణయించుట కఠిన మని మన మొ ప్పుకొనక తప్పదు. అయినను భారతములోని 24000 శ్లోకములస్థానమున మహాభారతమునందు నొక్కలక్షశ్లోకము లున్న వనువిషయము మీఁద ధ్యాన

ముంచినయెడల నీప్రకారము క్రొత్తగాఁ జేర్పఁబడినవియు, వృద్ధిచేయఁబడినవియు నగుభాగములు మిక్కిలి యధికమై యుండవలయు ననుటకు సందేహము లేదు. సౌతి యీభాగము నేల పెంచెనో, అనఁగా మహాభారతము నేమిటికి విస్తరించెనో, ఈసంగతి ప్రకటించుట యావశ్యమై యుండెను. కనుక నీసంగతి యిచ్చట విస్తరించి ప్రతిపాదింపఁబడినది. సౌతికృతమైన మొత్తము గ్రంథముయొక్క యుదాత్తస్వరూపమునకు నీవిస్తారము వలనఁ గొంచెమును గొఱత రా లేదనియుఁ గాఁబట్టి యీసమస్తగ్రంథమును వ్యాసకృతముగాఁ దలఁచుట యెట్లును ననుచితము కాఁబో దని చెప్పవచ్చు ననియు జ్ఞప్తియుంచుకొనవలయును. ఆలోచింపఁగా 24000 శ్లోకములభారతముయొక్క రూపాంతరము లక్షశ్లోకములమహాభారతమునందుఁ గలదు. అయినప్పటికి దానియందు నసంబంధము లేక పరస్పరవిరోధము తఱచు లేదు. ఈవిషయమున సౌతియొక్క చాతుర్యము నిస్సందేహముగా వర్ణింపఁదగియున్నది. సౌతియొక్క కవిత్వముకూడ నేవిధమునను జిన్నతరగతిలోనిది కాదు. అందు వ్యాసమహర్షియొక్క కవితాశక్తి ప్రతిబింబించినకతమున గ్రంథ మంతయు నత్యంతరమణీయమైయున్నది. సౌతియొక్కమహాభారతమున దూషించుటకుఁ దగినస్థానము లంత యెక్కువ లేవని సంక్షేపముగాఁ జెప్పవలసియున్నది. నిస్సందేహముగా రెండుస్థానములయం దతనిపొరపాటు స్పష్టముగా నగపడుచున్నది. యుధిష్ఠిరుఁడు భీష్మపర్వమునఁ గర్ణునియొక్క యుత్సాహభంగము చేయుటను గూర్చి శల్యునిం బ్రార్థించునపుడు, 'ఉద్యోగము'న నీవు నాకు మాట యిచ్చితివి దాని నిపుడు పూరింపు మని చెప్పుచున్నాఁడు.

స శేషము.

శ్రీ

# నూపురమహిమ లేక కన్నకి చరిత్రము.

(ద్రావిడసిలప్పధికారముయొక్క తెలుఁగుభాషాంతరము.)

—: తి. సు. మురుగేశపిళ్లెగారు :—

## I పుహార్ కాండము.

### 1. కావేరీనది యుత్పత్తి.

శ్రీవాణీశాది బృందారకసందోహంబులును, సకలసురాసురదేవయోనులును బ్రణమిల్లుటచేఁ దమ కోటీరాగ్రమణులయం దెవ్వాని పదనఖద్యుతి ప్రతిబింబించుటవలనం బ్రాప్తమాన చంద్రార్కశేఖరులై తమ్ము శివసారూప్యుల నుగా భావించి ప్రమోదాంతరంగులై విజృంభించుచుందురో! సపార్శ్విక తుహినకర భగణంబు లెవ్వాని యక్కునం దరలదామం బగునో! పర్వతచక్రవర్తి యెవ్వానిఁ జామాతగాఁ బడయుటకుఁ బవనాశనుఁడై యొంటికాలునం దప మొనర్చెనో! సకలాండకోటులుం బొడచూపి యొదిగి యడఁగుటకు నెవ్వాఁడు మూలకారణం బగునో! అట్టి పరాత్పరుఁడైన సదాశివుఁడు సకల బృందారక బృందంబులచేఁ బ్రార్థింపఁబడి ప్రాలేయాచలకన్యకం బరిణయంబున నర్ధాంగినిగాఁ జేయఁ జిత్తగించి సకలసురాసుర భూతమునిగణజేగీయమానుండై భూతగణసమేతుండై మహాకార్యంబునకు విచ్చేసెను. అట్టి పరిణయ మహోత్సవముఁ దర్శించి ధన్యులగుటకై సకల హరిదంతరంబులనుండి దేవదానవ మునిగణంబులును మానవానీకంబులును దుహినాద్రి మధ్యంబున గుమిగూడి యొక్కచో విడిసిరి. అందువలన బరువు మోపనోపక యుత్తర భూమి క్రిందికొరఁగి దక్షిణభూమి మీఁది కెగసినది. అట్టి భూమి నిమ్నోన్నతములకుఁ దలఁకి దేవదేవుని దివ్యసన్నిధిం జేరి, సకలాశావాసులును దమ యెడఁద నడరిన యెడమడుపుల నొడయనియడుగుల నడఁకువతో మొఱయిడుకొనిరి. వారి కుయ్యి నాలించి కొండవిల్తుఁడు గూరిమితో నిట్లని వ్యాహరించెను:—"జీవరాసులందఱు నొక్కచోటన చేరినందునం బరువు మిగిలి యీడాకడనేల యొక్కగిల్లి, వలకడ పల్లటిఁగొన్నది. ఇట్టి యొడ్డగెడవుల మట్టు మొనర్చుటకు నేనైన, నాయంతటివాఁ డెవఁడైన వలకడకుం జనవలయును. మీ రేమనుచున్నారు?" ఇది విన్న యమరు లందఱు సాగిలఁబడి జోహా

కొనవచ్చి, కేలుదోయి నొసలందాల్చి, 'పెండ్లియాడి యింటిపట్టొందిన యింటి కవత్తై వారా యందఱి కన్నులయం దిమ్ము నెమ్ముకొను నమ్మృతముం గురియం జాలిన దేవర బహుట్టుదేఱుట యొకతేనియుం బొసఁగదు ; దేవరం బోలినవారి నటకుం బుత్తెంచుటయ కర్జ'మని విన్నవించిరి. అట్లైన నఱవనిరాబారి యటకేగుట లగ్గగు నని, మున్నీటిం బుడిసిటం గొన్న నిరాబారిచిహ్నం దిలకించి 'నాకుమాఱుగా దక్షిణంపునేలకు నీవేగి నేల యొడ్డగెడపుగా సమ మొనర్పు'మని చిచ్చుకంటి మచ్చికతోం గట్టడ యిడెను. తోడన, పరంటిపుట్టువుగూసాల ఘాలిగొని 'దేవరా! దేవరవారి చెట్టవట్టు పండుగం గన్నులార దర్శించి తనియుటకై తమకపడుచుండు నే నెంతటి కావల మొనర్చియున్నను సైరించుట నుజ్జగించి యీ లాగునం బుత్తెంచుటల్ దగ వగునా? ఇదిగాక, వలనేల యఱవనాఁడగును ; అందేగి యే నేమిసేయువాఁడ? కనికరించి నన్నంపుట మ్మానవలయు' నని కూఱుకొనెను. వలిమలల్లుం డుల్లమునం దక్కటికమూని యగస్త్యవాచంయమీంద్రుం బొడగాంచి 'నీ ఘోక్కరుఁడ, నాయంతటి మేలిమినందిన, యఱవపలుకుం జక్కగ నెఱిఁగినవాఁడవు ; గీర్వాణభాషను వ్యాకరణసహితముగాం బాణినికి ననుగ్రహించిన చందంబున దాని కెనగా ద్రావిడభాషను శబ్దశాస్త్రసహితముగాం గాంచీపురములో నెఱుకపఱుపనట్లే నీ కొదవియున్నాను ; ఇందువల్లనేకదా వలకడనేలయంతయు నీ కసివాఱుసేలగా నుండుచున్నది! నీ వచ్చటి కేగి, యచట సంకరములేక స్వచ్ఛముగాం బిసాళించుచుండు నట్టి యఱవభాషను సవరణలతో సంస్కరించి 'అగస్త్యము' అను ద్రావిడవ్యాకరణమును బాణిని యట్లీశ్వరుసేవకొనర్చి పెద్దఱిక మొంది పిసాళింపుము; నీ కచ్చటను దక్షిణకాంచియను నగరముం గలిగించి యందున నాపెండిలి పండుగ నాలుమగలుగా దరిసనమిచ్చి నిన్నుం దనిపింపఁగలను. నీ వందునం దమిళమున కొజ్జవై యా పలుకుం బలుదోవలం బెంపెసలారంజేయుము. అందువలన లోకోపకారివియు నగుదు'వని యానతిచ్చి పుత్తెంచెను. అఱవనిరాబారియైన మఱువకందు యేలినవాని పనుపుం జవదాటుట కంజి, చలికొండ నుజ్జగించి చనుదెంచుం గైలాసగిరీంద్రముననుండిన కావేరీనదినిం దన కమండలములో నిముడ్చుకొని వచ్చుచుం గుడగునాఁటికుటంగటశయ్యాపర్వతములో విడిసియుండెను. ఇదియిటులుండ.

ఆఖండలుండు వృత్రుఁడను పొలదిండిం బొలియించినందున నడరిన గొడవల వడఁగించుకొనుట కొంకెు యీ మర్త్యలోకమునకుం దొతెంచి చోళదే

శములోని బ్రహ్మపురి యను తీర్థక్షేత్రమందు గుడిగొని బెడగారు దేవ-
దేవుండైన బ్రహ్మపురీశునిం బూజించుచుండెను. అట్టి శివపూజకై విరులకొఱ-
కు నందనవనమొక్కటి యేర్పఱిచి పూలపాదులం బెట్టి పెంచుచుండెను. నంద-
నమున నీటికఱవునం బాదలన్నియుఁ జేవచెడి వాడఁబాఱుటం గని వేల్పుఱేఁ-
డు వందురి, వెనకయ్య యజ్జుటసల్పుట్టువలయుందుం దన కోఱగాముల మొఱ-
వెట్టుకొనియెను. పనిచెఱుపులదొర కనికరించి శయ్యాపర్వతమునకు విచ్చేసి
కాకిరూపముతో నగస్త్యుల కమండలముపైఁ గూరుచుండి కుండను దొర్లించి
కావేరీనదిని విచ్చలవిడి పెచ్చుపెరిఁగి పఱ్ఱొడ్డి పాఱునట్లొనర్చెను. అట్టికావేరి-
నది తూర్పుమోముదారి వఱ్ఱొడ్డుచు ననేకోపనదులం దనలోఁ గలపుకొ-
ని చోళదేశమం దంతటం బలుకాలువలుగాఁ బాయవాఱి నీళ్ళవసతిం గలిగిం-
చుచుఁ గ్రుంకులిడినవారి కావలములం గసిమసఁగించుచు నందఱికిం బెంపెరు-
వొసంగి విఱ్ఱవీఁగుచు పఱదవారి తీర్థాళిలోని పురందరుని పూఁదోఁటలం
జక్కఁగ నెదిగి ననిపించుచు బంగాళాఖాతములోఁ గలియుచున్నది.

కావేరిపూంబట్టనము.

ఇట్టి కావేరినీటి వసతిచేఁ జేవ గలిగి గొప్ప చదువరుల పొగడితల
కగ్గమైన కూర్పునేర్పుల కిమ్ముసొమ్మై యొనకమెసఁగియుండునట్టి చోళమండల
ములోఁ గావేరీనది కడలిం గలయు ముఖద్వారంబునందుఁ గావేరిపూంబట్టన
మని పొగడికకెక్కు చరిత్రాంశములకుం బ్రాణరూపమైన పట్టణమొండు వెల
రారుచుండెను. అలపట్టణమునకు పూం బుహార్, పుహార్ అనియెడినామాం
తరములు గలవు. కడలి యొడ్డున సంగముఖమనియెడి రేవుగట్టొండుగలదు.
ఆ పట్టణము దరతరముగాఁ జోళమహామండలేశులకుఁ బురాతనరాజధానిగాఁ
బొనరువడియుండినదియు, వాగింద్రియ పాటవులైన చరిత్రకారకుల వర్ణనా
రూపమైన సన్నుతిం గన్నదియు, నెల్లసిరులకు నాటపట్టయిన నేల యనియుఁ
బెడగారునట్టి యా మహానగరీమహిమల వర్ణించుటకు వలనుపడక మహాకవు
లందఱు దఱతఱలాడుచుందురు.

కరికాలచోళమహేంద్రుఁడు.

ఇంచుమించుగాఁ బదునేనువందల యేండ్లక్రిందటఁ దన యశశ్చంద్రిక
చే దిక్కుడ్యంబులకు వన్నె వెట్టఁజూడిన * కరికాలచోళ సార్వభౌముఁడు కావి-

* ఈకరికాలచోళ సార్వభౌముని ముమ్మనుమఁడే. కుమారసంభవమును రచియించిన నన్నెచోడుఁడగును. నన్నయభట్టారకునికి రెండువందలయేండ్లకుఁ బూర్వమందీరాజ్యమునేలినవాఁడు. ఈనన్నెచోడుని ముమ్మనుమఁడు రాజరాజనరేంద్రుఁడు.

రిపూంబట్టణమును రాజధానిగాఁ గొని యీ భరతఖండమును భానుమంతు నివలె భాసమానుండై పాలించుచుండెను. అప్పు డతని రాజ్యము త్తరమందు మహాకాంతారముఁ బొట్టి దక్షిణమందుఁ గన్యాకుమారివఱకుం బర్వియుండెను. అరిగాపులైన సామంతరాజుల కోటీరాగ్ర మణిద్యుతులు కరికాలచోళ విశ్వం భరాభరణుని యంఘ్రియుగంబుల కరుణరుచిం బూఁతవెట్టుచుండెను. కావే రిపూంబట్టణము రేవుగట్టుగా నుండినందునఁ బలురకములైన బేరములు పెచ్చుపెరిగి సేరిమిపేరిమితో జరగుచుండెను.

ఆ నగరి వెలిప్రోలు, లోఁబ్రోలని రెండువిడుగాఁ బాయువాఱియుండెను. వెలిప్రోలికి మరువూర్పాక్కమనియు, లోఁబ్రోలికి పట్టినప్పాక్కమనియుఁ బేళ్లుగలవు.

వెలిప్రోలు:—వెలిప్రోలైన మరువూర్పాక్కమందు జాబిలిడాల చుట్టు కొల్లారువులును, నగ సేయఁబడిన సరకుగదులును, లేడికన్నులంబోనిసొరణగండ్లు మెండుగాఁ గల మాడువులును మిక్కుటముగా నెక్కొనుచుండును. చూపరుల కన్నులు మిఱుమిట్లుగొలుపఁజాలిన మెంచలతావులు తీవిమెఱయుచు వరుస తీరి యిరవారి యుండును. వీటివీదులయందు బగ్గాడి, బుక్కాము మొదలైన వన్నెపొడులును, నలుగు మొదలైన సున్నివాళ్లును, చాఁదు, లత్తుక మొదలైన బచ్చెనలును, నస్సేసములు, దావిసరకులు మొదలైనవాని నమ్మువారలు దారాడుచుందురు. అలవెలివీటియందొక్కప్రక్క పట్టుపోఁగులచేతను, ఎలుక వెండ్రుకలతోను, ప్రత్తిపోఁగులచేతను నున్నగనేయఁజాలిన పట్టుసాలెవాండ్ర నెట్టులు పఱ్ఱుమిఱ్ఱి యుండును. ఒకచోట గందము, అగురు, పట్టు, పవడము, ముత్తెము, పుటంగుపచ్చ, తమ్మికెంపు, మూలతాలు, కప్పుటాలు, పిల్లి కప్రోసము, పలుగు మొదలగు ముత్తిగమిన్నలను, బలుతెఱఁగుల తొడవుల నమ్ముచు లెక్కింప నలవిగాని కలిమి బలిమిని వెలరారు బచ్చులు పెచ్చుపెరిగి పిచ్చలించుచుందురు. ఒకచెంగట వడ్లు, సజ్జలు, ఆరుగలు, కొఱ్ఱలు, చామలు, జొన్నలు, కందులు, పెసరవడ్లు మున్నగు దచ్చిదవసముల నమ్మెడు కొలుచుబేహారులు గొమరారుచుందురు. ఒకవంకఁ బిండివంటల నమ్మెడు వారలు, నొకయోర మేఁకలను, మేఁకయెఱచులనమ్మెడి కటికవాండ్రును, ఒకత్రోవ నుప్పమ్మెడివారలు, నొక్కెడ నూనె మొదలగు చముకుదినుసుల నమ్మెడి తెలికవాండ్రును. నొకకడఁ జెనాయపోఁకల నమ్మెడి బొగాలవారలు

ను, మనుచుందురు. ఒకచక్కిఁ గంచరవాండ్రును, నొకక్రేవ రాగిపనిసేయు వారలును, నొకచెంత వడ్రంగియు, నొకసీమఁ గరుమలియు, నొకచెంగట సూసపలుసు, నొకవెసఁ జకిలికాండ్రును, నొకదారిఁ బంచాణమువాండ్రును, నొక్కతిలమున సంచులవాండ్రును, నొకమోరఁ గరఁగించిపోయుఁ గమసాలియు, నొకవంక రతనాలపనిసేయు నగసాలియు నుక్కుమిగిలి పెంపెక్కియుందురు. ఒక్కనలనునఁ జిప్పవాండ్రును, నొకచో ముచ్చివాండ్రును, నొక్కెక బుట్టములచేతను, జీలుగుచేతను బువ్వులుఁ బూలదండలు, కల్లకొప్పులు మొదలగువానింజేసి యమ్మెడి మాలకరులును మనుచుందురు. ఒక్కనేల బెజ్జపు జంత్రములను, నరముజంత్రములను వినువార లింపుకడలినోలలాడి చొక్కునట్లు మిక్కిలి యింపుసొంపుగాఁ బాటమేర కెంతేనియు నోటువారక వాయించి చూపవలఁతులగు వాసెగ్రోలూఁదువారలును, వీణె వాయించువారలు మొదలైన గాణలు గారవముతోఁ గాలము గడపుచుందురు. కడలియొడ్డునం బీలికాండ్రయిన లాతివిలాతివార లాప్రోలివారలతోఁ నారజముగాఁ గలసి మెలసి పొలయుచుందురు.

లోఁగ్రోలు :— లోఁగ్రోలైన పట్టణప్రాక్కము దొక్కచోట రాచవారలు సంచరించెడి రాజవీథులును, ఉత్సవ వీథులును, పణ్యవీథికలును, వణిజుల హరువైన హర్మ్యసౌధము లసంఖ్యాకములై పఙ్క్తిపఙ్క్తిగానమరిన వణిగ్వీథులును, బంచగ్రాముల నివేశచయంబులును, వదాన్యశీలురైన శైవ వెల్లాలజాతివారలు వసించునట్టి చంద్రశాలాసహిత హర్మ్యసందోహ విరాజమానసాలంకార వీథికానికరములును విలసిల్లుచుండును. ఒకచెంగట నగదంకార కార్తాంతిక [illegible] , ఒకసీమ మౌక్తిక వ్యాపారులును, గాంబవికులును వసించువీథులు వఱలుచుండును. సూత, మాగధ, వంది, గాయక, వైతాళిక, ఘటికాగణకులును, లాస్యతాండవాది నర్తనములు సేయఁజాలిన నర్తక నర్తకీ భ్రుకుంసాదులును, తతానద్ధ సుషిర కాంస్యాది వాదిత్రముల వాయించు చతురుల తౌర్యత్రిక నిక్వాణపూర్ణ [illegible] , లఘువిద్యల వారలు వసించునట్టి వీథులును పాంథుల లోచనానందదాయినులుగాఁ బరఁగుచుండును. రాజప్రాసాదము నుపవేష్టించి విస్తారమైయుండునట్టి పరిసర శల్య బహిఃప్రదేశములందు రథిక, నిషాది, యాశ్వీక పదాతులైన చతుర్విధవాహినీపతులును, గాండపృష్ఠులును బరివేష్టించి కొలుచుచుందురు.

నాళంగాడి :—మండలాధిపతులిర్వు రనేకాక్షౌహిణీసమేతులై విచ్చేసి విడిసి యుండు శిబిరముల మధ్యప్రదేశంబులంబోని విశాలమైన మధ్యస్థభూమి యొక్కటి గలదు. అది నాళంగాడి యని పేర్కొనంబడును. అందులో ననేక నిష్కుటములు పొలుపారుచుండును. అట్టి నిష్కుటావళిలో బంతిబంతిగా వరుసదీరియుండు వనస్పతీ వానస్పత్యాద్యనోకహానీక ప్రకాండంబులనే స్తంభంబులుగాఁ గొని నిర్మింపఁబడిన యంగళ్లు పెక్కు లమరియుండును. అచ్చట సరకుల నమ్మువారల విలుచువారల యలబలము లశ్రాంతము వినఁబడుచుండును. అల నాళంగాడిలో ముచికుందుఁ డను రారాజునకుం బోరయఁగల యెడరుల నడఁగించుటపొంటె మొగిలురాతుచేఁ బెరరేచఁబడి తోతెంచి బసగొని బలినందుచుండు భూతం బొక్కటి యాటపట్టు గొని యుండును. ఏనాదిజాతి గుబ్బెత లా భూతంబునకు బలిపీఠమునం దోరెము, సిమ్మిలి, పొలసుబోనము, సరకములో మైరేయ మార్ద్వీకాది యాసవములు మొదలగు వానిని నివేదించి, విరులదండ లిడి, సజ్జరసముతోనైన ధూప మిచ్చి సేవించి 'మారాజుగారి విశాలరాజ్యమంతట నాఁకటిదప్పులును, బలుదెగల తెవులును నీఁగుఁగాక; వానయు, సంపదలును మిటిమీటి వర్ధిల్లుఁగాక' యని బలిసి వేఁడుచు బజ్జన్ప్రొక్కి బవినీలాడుచుఁ బరఁగుచుందురు.

చౌవంచరచ్చలు.

1. మొదటిరచ్చ :— అల నగరమం దందఱుం గొనియాడఁదగిన, పెరిమె పెరిఁగిన ఐదు రచ్చలు సాలుపుదీరి సొరారుచుండును. వానిలో మొదటిది పట్టిమండప మనియెడి రచ్చకొట్టము. అట్టి రచ్చకొట్టము పూంబుహారిలో రారాజుగా రాణించుఁ గరికాలచోళసార్వభౌమునికి బవరమునం బన్నపడిన మగధదేశపురాజు భక్తిపూర్వకముగా సమర్పించిన యుప్పనము. అది మయుండను నసురశిల్పిచే నవరత్నఖచితమై మహావినోదముగాఁ జేయఁబడినది. ఆమండపములోఁ గవిసార్వభౌమ పండిత పౌరాణిక భరతజ్ఞ దైవజ్ఞ వాగ్గేయకారక సందోహము లనారతంబును విరాజమానములై వాహాదోనర్ప నానందించుచుఁ గరికాలచోళమన్నీఁడు పేరోలగము సేయుచుండును.

2. రెండవరచ్చ :— రెండవరచ్చపట్టు బట్టబయలైన యొక్కచోట నెలకొనియుండును. అట్టిరంగములో నూతనులైన యన్యదేశీయులు కొలత, లెక్క, తూనిక మొదలగువాని యుంకెల నిడఁబడిన గోతాములంముఁ దమ

తమ పేరుల నుచ్చరించి యేగుచుందురు. ఆరచ్చకొట్టముయొక్క స్వభావము నెఱుఁగని క్రొత్తమానిసు లెవ్వరైన యా మాటల నుచ్చరించినయెడల, వారల పెడతలలు విఱుగునట్లా పూబల వాని తలలయందు మోపి యూరి చుట్టును వారలఁ దిరుగాడించి వడవడ వడంకునట్లొనర్చును. కాఁబట్టి యా రంగమం దొక్కరుఁడును దోఁపుడుపనులం గలలోనైనఁ దలఁపఁజాలఁడు.

3. మూఁడవరచ్చ:—మూఁడవరచ్చకొట్టములోఁ గోనేఱొండు గలదు. అందులో *నవిటియు, గూనివారలు, మూఁగలు, చీకులు, ‡లవిటులు †పిచ్చికుంటులు, బులుసు తెవులు గలవారలును గ్రుంకులిడినచోఁ దమతమ తెవులుడుగఁబడి సొబగైన మేలుగలవారలుగాఁ బొడచూపఁగలరు. కాఁబట్టి యట్టి కొలనునం దందఱుఁ దోతెంచి వలగొని చెంగనాలిడి చెంగలించుచేగుచుందురు.

4. నాలుగవరచ్చ:—నాలుగవరచ్చపట్టులో నాతికంబ మొక్కటి అలరిల్లుచుండును. కటువులచే మందిడఁబడి కలగుండుపడువారలును, వసనాభిం దిని వందురువారలును, చిలువకాటునం జేడ్పాటొందినవారలును, డగరపాల్పడి డయ్యువారలును దీండ్రించునట్టి యా కంబము నొకసారి వలగొని జోహారొనర్చినంతనె వారి గోహరులన్నియుఁ గొటువడి కొమరారుచుందురు.

5. ఐదవరచ్చ:—ఐదవది బొమ్మరచ్చపట్టనం బొగడ్తఁజెందియుండును. అట్టి పుత్తళిక రంగములో రాజులు రాచఱికపుటాలుడిదప్పి మేరమీఱినను, మానిసులు ధర్మమార్గముఁ దలఁగి పక్షపాతము నవలంబించి పాడి దప్పినను వారి చెయ్యుల నోటనోడువకఁ గంటం గన్నీరొలుకుచుఁ గనుసన్నల నెఱిఁగించునట్టి బొమ్మ యం దుండుటంజేసి యారచ్చకాపేరు పొనరువడియుండెను.

బూచిచదుకము.

ఇట్టి యాలుడి గల రచ్చకొట్టములై దుండుటయకాక భూతచతుష్కమను పేరొందిన శృంగాటక మొక్కటి గలదు. తాపసవేషముఁబూని కైలాటమొనర్చునట్టి టకటొంకులను, ఈలువుసెడి జాగరైన చెడిపెలను, దమరాజులపై లవ్వాడుచుండు టాటోటుపెగ్గడలను, గల్లసాకిరినుడువు కైలాటకాండ్రను, గానక యెగ్గాడు గట్టిడివాండ్రను, 'నాచేతివస్త్రాటిచేఁ గట్టి నేలం బడఁగొట్టి పొరిమాల్చి మెసవఁ గల'నని యా యూరి నాలుగామడ

*అవిటి = పోఁగండుఁడు. ‡లవిటి = బధిరుఁడు. †పిచ్చికుంటు = అనూరుఁడు.

దవ్వునకు వినునట్లు దన బెట్టిదపు గొంతుచే బొబ్బరించి, యట్లు చేయు టాలా టోలితనముగలవారల నట్టే పొలివుచ్చి మెసప్రునట్టి బూచియొక్కటి యందు నెలకొని యుండుటంబట్టి యా రచ్చకొట్టమునకు బూచిచదుక మని పే రల వడినది. పట్టిమండపము మున్నగు చౌవంచ రచ్చలయందును, బూచిచదుక మంమును నందఱును బలివెట్టి మన్నినిం దీవించుచుందురు.

## గోపిల కన్నకుల పుట్టుక,

ఇట్టి దివ్యమహిమలతో దేదీప్యమానముగాఁ దేజరిల్లునట్టి యల కావిరి పూం బట్టణమందు ఇప్పర్, కవిప్పర్, పెరుంగుడియ రను తిగతెగల బేరులు పలువెరవులగు బేరము లొనర్చుచు లెక్కకు మిక్కుటంబైన కలుముల గడించి యిమ్ముగా మనుచుండిరి. వారలలోఁ బెరుంగుడియ రను వంగడములోఁ బొడచూపిన మానాత్తుఁ డనుపేరిబేరి యొక్కరుఁడు బేరులందఱిలోఁ గలిమి బలిమిని నందఱికంటె మేలిమినందినవాఁడై బేరుల వంగడమునకుఁ బెత్తనగాఁడుగా బెంపెసలారుచుండెను. అతనికి జోఅజొడాపాదుసా సోయగము న్నాయించునట్టి సొబగు గొనబారు గోవలుఁ డను పేరి కొడుకొకఁడు పుట్టి సుగుడియై నెగడుచుండెను. ఆసంతుననే పొడమిన మానాయకుఁ డను పేర యొకనికి నందముల మందిరముఁ గుందనపుం బొమ్మయగుఁ గన్నకియను నన్నులమిన్న యొకరిత కొమరితగా నవతరించియుండెను. అల విరిఁబోణి చెలిమెక్క విదియ నాఁటి జాబిలిచందంబున నానాఁటికిం బెచ్చు పెరిఁగి సోయగంపు మిటారములకుం గొటారములగు బోటుల నీటుల సూటిసేయని మేటిదైన జవ్వనురాలై నివ్వటిల్లుచుండెను.

(సశేషము.)

# విమర్శనములు

దేవేంద్రవర్మ చీడివలసశాసనము (Chidivalasa plates of Devendra-varma) :— పరిషత్పత్రిక క్షయసంవత్సరమునఁ బ్రకటింపఁబడిన 5, 6 సంచికలలో బ్రహ్మశ్రీ విద్వాన్ కట్టి సాంబమూర్తి శాస్త్రులుగారు చీడివలస శాసనము ప్రచురించియున్నారు. వారు గాంగశకము క్రీ. శ. 270 నుండి మొదలనియు, చీడివలసశాసనము గాం.శ. 397 లోని దగుటచే క్రీ. శ. 667 లోని దగుననియు వ్రాసియున్నారు. ఈనిర్ణయమునందు వారి కాంధ్రపత్రిక ఉగాదిసంచిక శాస్త్రి పు 217-224 లోని ఉర్లామశాసనము ప్రకటించినవారి వ్రాఁత లాధారము లైనవి. ఉగాదిసంచికయందలి కాలనిర్ణయము ప్రమాదభూయిష్ఠమై యుండుటచే, శాస్త్రిగా రొనర్చిన కాలనిర్ణయముకూడ నాప్రమాదములకు లోనైనది. వానిలోఁ గొన్నియిట సూచింపఁబడినవి.

(1) గంగవంశమునకు మూలపురుషుఁ డగు ప్రథమకామార్ణవుఁడు బాలాదిత్యునిం జంపి కళింగరాజ్యమును గైకొనియె నని, స్టీబుదొరగారు వ్రాయఁగా, నది సరి యని ఉగాదిసంచికవ్యాసమునందు బాలాదిత్యుఁ డెవరో నిర్ణయించుటకు యత్న మొనర్పఁబడినది. కామార్ణవుఁడు జయించిన రాజు శబలాదిత్యుఁడు (శబరాదిత్యుఁడు) గాని బాలాదిత్యుఁడుగాఁడు. కొన్ని శాసనములను బ్రచురించిన మ. రా. శ్రీ గిడుగు వేంకటసీతాపతిగారు స్టీబుదొర గారు శాసనమును సరిగఁ జదువలే దనియు, శబలాదిత్యుఁడే సరియగుపాఠమనియు వ్రాసియున్నారు. (Refer Journal of the Andhra Historical Research Part III. P. 108)

(2) ఉగాదిసంచికయందు గాంగులపరిపాలనము సుమారు 350 సంవత్సరము లని గైకొనఁబడినది. అప్పటికి సత్యవర్మశాసనము (గాం. శ. 351) మాత్రమే ప్రకటింపఁబడి యుండుటవలన నా కీప్రమాదమునకు లోనైరి. చీడివలసశాసనము (గాంగ. శ. 397) ప్రకటింపఁబడుటచే నీప్రమాదమును బూర్వపక్ష మొనర్చుచున్నది.

(3) గాంగగంగవంశజుల కంతరము సుమారు 50 సంవత్సరము లని గైకొనఁబడినది. ఇదియును సరిగాదు.

(4) కామార్ణవుఁడు క్రీ. శ. 725 లో రాజ్యమునకు వచ్చె నని చెప్పుటకు వీలులేదు. శా. శ 1040 లోని విశాఖపట్టణపు శాసనమును శా. శ. 1034 లోని కొర్ని శాసనమును బరీక్షించిన నిది వ్యక్తమగును. వంశక్రమమునఁ గొన్నివ్యత్యాసములు గలవు. శా. శ 1034 లోని శాసనమున పోత్తాంకుశ, కళింగాంకుశుల ప్రశంస గానరాదు. మఱియు గుండమరాజు వినయాదిత్యుఁడు మధుకామార్ణవుఁడు వజ్రహస్తుని ప్రపౌత్రు లని యున్నది. 1040 లోని

శాసనమున వారు గుణార్ణవ [illegible] పాలనకాలములు సరిపోవుట లేదు. ఇట్టియాధారములతో నొనర్పఁబడిన కాలనిర్ణయము సరిగా దని చెప్ప నవసరము లేదు. చరిత్ర-పరిశోధకులింకను గాంగశకనిర్ధారణ మొనర్పవలసియున్నది.

పత్త్రికా స్వీకారము.

(1) Journal of the Cama Oriental Institute, Bombay. కామాప్రాచ్యపరిశోధన సంఘమువారి పత్త్రిక 8వ సంచిక మాకార్యస్థానము నలంకరించినది. ఈపత్త్రికయందు మహాపూర్ణా హోదివాలా ఎం. ఏ. గారిచేత పార్శీచరిత్రము ముద్రితా ముద్రితగ్రంథములలోని యాధారముల ననుసరించి అయిదువ్యాసములలోఁ దెల్పఁబడియున్నది. ఆపత్త్రికను మాకార్యస్థానమునకుఁ బంపిన పత్త్రికాధిపులకు మేమెంతయుఁ గృతజ్ఞులము.

(2) జయంతి :—ఈ పత్త్రిక రెండుమాసముల కొకసారి మచిలీపట్టణమున బ్ర॥ విశ్వనాథ సత్యనారాయణగారిచేఁ బ్రకటింపఁబడుచున్నది. ప్రభవసంవత్సరమున గ్రీష్మసంచిక మా కార్యస్థానము నలంకరించినది. నేటివ్యావహారిక భాషావాదుల వాదముల కనుగుణముగా ఖండకావ్యములు, చారిత్రకవిషయములు మొదలగునవి గ్రామ్యభాషాసంకలితమై విలసిల్లుచున్నవి. స్థానిక చరిత్రనుండి కైకొనఁబడిన ముర్తాజాన్నగర్ సర్కారు, రాజమహేంద్రవరము సర్కారు యేలుబడి మొదలగు వ్యాసములు గలవు. నేటినవలల దుస్థితిని, దెలియఁబఱుచు 'తెనుగునవల' యనువ్యాసమును, ఎట్టనశిల్పము, సంజయరాయభారము అనుసారస్వతవ్యాసములును, కొన్ని ఖండకావ్యములునుగలవు.

సంవత్సరపు చందా రు 4. వలయువారు,

మ॥ రా॥ రా॥ శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు బి. యే., బి. యల్ మచిలీపట్టణము అను చిరునామాకు వ్రాయవలెను.

# గ్రంథవిమర్శనము.

౧. ఆంధ్రవీరులు :—ఈ గ్రంథము శేషాద్రి రమణకవులచే రచింపఁబడినది-గ్రంథకర్తలు ఆంధ్రవీరరత్నావళి యని రచింపఁబూనిన గ్రంథమున నిది ప్రథమభాగము. ఇందు గౌతమీపుత్త్ర శాతకర్ణి కులోత్తుంగచోడుఁడు, ప్రతాపరుద్రుఁడు, బాలచంద్రుఁడు, కృష్ణరాయలు, రామరాజు మొదలగు నాంధ్రవీరులచరిత్రములు మృదుమధురగ్రాంధికశైలితో రచియింపఁబడి పాఠకులకు వీరావేశము గొల్పుచు నాంధ్రులఘనతను, శౌర్యమును వేనోళ్లఁ జాటుచున్నవి. గ్రంథకర్తలు మిగిలిన భాగములఁగూడఁ ద్వరలో రచియించి దేశోపకార మొనర్తు రని నమ్ముచున్నారము.

ప్రతి 1 కి వెల 0—8—0. తెనాలి వేంకటరామ్ అండుకోవారి యొద్ద దొరకును.

౨. వేంకటేశ్వరశతకము:—అమలాపురవాస్తవ్యులగు మ॥ నల్లా చినరెడ్డి నాయఁడుగారిచే రచియింపఁబడి "వేంకటేశ యనంతరవిప్రకాశ" యనుమకుటమును గల్గిన సీసపద్యశతకము. అమలాపురమున వెలసిల్లిన శ్రీ వేంకటేశ్వరుని తిరునాళ్లవర్ణనమును, బాలకృష్ణుని లీలావర్ణనమును గ్రంథాంతమునం బురుషోత్తముని యనంతకల్యాణగుణకీర్తనమును నొనరింపఁబడినది. శైలికై రెండు పద్యములు—

సీ. మణిమయమంజీరమంజుప్రభలు సరోఘ్రి కంజరాగద్యుతుల్ గలసిమెలఁగఁ
జిరతరరత్నకాంచీరోచు లుజ్జ్వల కాంచనాంబరమునకైఁ గడలుకొనఁగ
శస్తకౌస్తుభగభక్తిస్తోమములు భుజాంతరమసారవితర్దిఁ బర్ఘవిల్ల
మణికుండలంబుల ఘృణిమండలంబులు గండదర్పణములఁ దాండవింపఁ
జారుకోటీరమణిరుచి సారపూర,మఖిలహారిదంతరంబుల నలము నలరు
కాంతికాంతత్వదీయవిగ్రహము దలఁతు, వేంకటేశ యనంతరవిప్రకాశ.

సీ. సవ్వళింపఁగ మేలిపాను పొక్కటిలేక యొకచిన్నియాకుపై నొఱఁగినావు
కొమరాలినటఁజేర్చికొనఁజోటు చాలక గట్టిఱొమ్మునఁ బండఁబెట్టినావు
మురువుబిడ్డనికి బంగరుడోల గానక యొకపువ్వుడొప్పలో నునిచినావు
అతని యర్ధాంగికి నచటదావమరక బెనిమిటిమొగముఁ జూపించినావు
ఆదిమధ్యాంతములు లేనిపేదతికము, కసిచిమెసునసు నాశ్రితకోటివాంఛ
లెట్టు లొనఁగూర్పఁగలిగెదో యెఱుఁగరాదు, వేంకటేశయనంతరవిప్రకాశ
వలయువారు గ్రంథకర్తగారికి వ్రాసికొనవలయును.

3. భగవద్గీత-సాంధ్రగీతావళి.

ఇందు భగవద్గీతాశ్లోకములును వానికి శ్రీరాజా మంత్రిప్రగడ భుజంగరావు బహదరవారు రచించిన తెనుఁగు గీతపద్యములును గలవు. భారతాన్తర్గత మగుభగవద్గీతాభాగమును తిక్కన్న సోమయాజి యతిసంగ్రహముగా నాంధ్రీకరించెను. తర్వాత దత్తోజీ మొదలగువారు కొందఱు గద్యపద్యాత్మకముగా నాంధ్రీకరించిరి. ఆధునికకవులలోఁ గూడఁ గొందఱాంధ్రీకరించినవారు గలరు.

ఈయాంధ్రగీతావళి నవీనముగాఁ బ్రకటింపఁబడినది.

శైలి:—భగవద్గీత సంస్కృతభాషలో సుబోధశైలిని చిన్నచిన్నశ్లోకములలో వ్యాసునిచే రచింపఁబడినది. దానికిఁ దగినట్టు ఆంధ్రభాషలో గీతపద్యములలో సుబోధ మగుశైలిని రచించుట యెంతయుఁ బ్రశంసనీయము. భగవద్గీతకువ్యాఖ్యానసంధానము చేయఁదలఁచిన యాంధ్రుల కను వగునట్లు

భగవద్గీతాస్వరూప మంతయు నీగీతావాక్యములో నిమిడ్చఁబడినది. భాషయుఁ, బద్యములశైలియుఁ జదువరివారి కుత్సాహము గలిగించునట్టివి. మచ్చునకుఁ గొన్ని శ్లోకములు వాని యాంధ్రపద్యములు నిందుఁ బొందుపఱుపఁబడు చున్నవి.

౨వ అధ్యాయము. ౩౨వ శ్లోకము. యదృచ్ఛయోపపన్నం, స్వర్గద్వార మపావృతమ్। సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధమీదృశమ్. గీ॥ తలుపుఁ దెఱచిన సురపురద్వార మగుచు, నప్రయత్నముగ లభించి నట్టి యిట్టి, భండనము పూర్ణముగ భాగ్యవంతులైన, రాజులకుఁ గాని యొరులకుఁ బ్రాప్త మగునె.

౩౩వ శ్లో. అథచేత్త్వ మిమం ధర్మ్యం, సంగ్రామం నకరిష్యసి। తతః స్వధర్మం కీర్తించ హిత్వా పాప మవాప్స్యసి॥ గీ॥ పార్థ! కులధర్మమైనయీ భండనంబుఁ, జలుపమానితివేని యశంబునకును, స్వకులధర్మంబునకు దూర మగుదు వదియుఁ, గాక పాపమ్మునుం జెందఁగలవుసుమ్ము.

౧౧వ అధ్యాయము. ౪౧వ శ్లోకము. సఖేతి మత్వా ప్రసభం యదుక్తమ్ హేకృష్ణ హేయాదవ హేసఖేతి। అజానతా మహిమానం తవేదం మయా ప్రమాదా త్ప్రణయేనవాపి.

౪౨వ శ్లో. యచ్చావహాసార్థ మసత్కృతోఽసి విహారశయ్యాసనభోజనేషు। ఏకోఽథవా ప్యచ్యుత తత్సమక్షం తత్క్షామయే త్వా మహ మప్రమేయమ్॥

ఈ రెండుశ్లోకములకు సరియగుపద్యములు.

గీ. ఇట్టి నిను నేను సఖునిగ నెంచి నీదు
మహిమ నెఱుఁగక కూర్మినో మాంద్యముననొ
ఓయి కృష్ణ! యోయాదవ! యోవయస్య!
యనుచు నేఁబల్కినది యు నాహారశయన

గీ. విహరణాసనవేళల వేడ్క నేక
తమున నో నలుగురిముందొ త్వత్సమక్ష
మందు కోడిగమునఁ దూలనాడినదియు
నేరమెన్నక నన్ను మన్నింపుమయ్య.

అర్థగాంభీర్యభావగాంభీర్యములు :—భగవద్గీత యెంతసులభశైలిలో రచింపఁబడినను, ఆచిన్నచిన్నపదములయం దెంతయో యర్థగాంభీర్య భావ గాంభీర్యములు గలవు. కావుననే భగవద్గీత పుట్టినది మొదలు నేఁటివఱకును గలభిన్నభిన్నమతస్థులు భిన్నభిన్నరీతుల భిన్నభిన్నార్థముల పచించి తమతమమ

వెయిలు ధ్రువపఱచుకొనుట కుదాహరణముగా గ్రహించుటయే కాక తత్తత్సి
ద్ధాంతానుసారముగ గీతలకు వ్యాఖ్యలు గూడ రచించిరి గదా. ఆంధ్రగీతా
వళిలో నట్టిస్థలములయం దర్థగాంభీర్యభావగాంభీర్యములు గొంచెమైనఁ దొ
ఱఁగకుండ నున్నది యున్నట్లే యుంచుటచే మాతృకను బోలెఁ బుత్రికయు
సర్వమతాదరమును బడయఁగలదు.

౪ అధ్యాయము ౧౭ శ్లో॥

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనాకర్మణోగతిః॥

గీ. కర్మనెఱుఁగంగవలయు వికర్మగూడఁ
తెలియవలయు నకర్మయుఁ దెలియవలయుఁ
గర్మవిజ్ఞాన మెంతయు గహన మయ్యా.

౧౮-శ్లో॥ కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః
స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ।

గీ. కర్మయందు నకర్మ యకర్మమందుఁ
గర్మయును నెవ్వఁ డొక్కెడఁ గాంచు నట్టి
మనుజుఁ డందఱిలో బుద్ధిమంతుఁ డగును
ఎల్లకర్మలొనర్చు యోగీంద్రుఁ డగును.

ఆంధ్రీకరణమందలి యందము.

౨వ అధ్యాయము ౫౫-౫౬-౫౭-౫౮ శ్లోకములలో స్థితప్రజ్ఞుని జెప్పి
నపుడు "మనస్థితప్రజ్ఞ స్తదోచ్యతే॥ ౫౬ స్థితధీ ర్మునిరుచ్యతే॥ ౫౭ తస్య ప్రజ్ఞా
ప్రతిష్ఠితా॥ ౫౮ తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ అనువానికి "గీ॥ ఆతఁడే నిశ్చలప్ర
జ్ఞుఁ డనఁగఁ జెల్లు" అనుపాదమును నాలుగుగీతపద్యముల తుదిని జేర్చుట
మూలమునకంటె నెక్కుడు రమణీయముగా నున్నది.

అల్పదోషములు. ౧౮ అధ్యాయము ౬౭ శ్లోకము.

ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన
నచా శుశ్రూషవే వాచ్యం నచ మాం యో భ్యసూయతి.

గీ. భక్తిహీనునికొల్లు కతపస్వికొలఱకు
వినఁగ నభిరుచిలేనివానికి నన్ను
ద్వేషమతిఁ జూచువానికిఁ జెప్పఁజెల్ల(దు)

ఇందు తే—నీకు (చెప్పఁబడినది) అనుభాగ మాంధ్రీకరింపఁబడలేదు.
"ఆతనికి" చూచువానికి" అనునట్లే "భక్తిహీనునకు" అతపస్వికి"అనుటయే
యుచితము. సంస్కృతములోఁ జతుర్థీవిభక్తి యున్నదిగదా యని ఇట"కొఱ
కు" అని యుపయోగించుట యుచితముకా దని తోఁచెడిని.

౩-అధ్యా-౨౨-శ్లో॥ నానవాప్త మవాప్తవ్యమ్, అనుదానికి గీ॥ ప్రాపణీయంబు లేదవాప్తంబు లేదు. అనియాంధ్రీకరణము.

అనవాప్తము=పొందఁబడనిది, అనిమూలమున నుండఁగా అవాప్తము=పొందఁబడినది, లే దనుట సందర్భోచితము గాదు. కావున "అనాప్తము" అనిపఠించి అనాప్తము=అప్రాప్తము అని యర్థము చెప్పికొని సరిపెట్టుకొన వలసియున్నది. కొన్నిచోట్ల "మలినము, కలుషము" అనుపదములు విశేష్యములుగా నుపయుక్తమైనవి. ఇవి గొప్పదోషములలోనివి గాకున్నను స్థాలీపులాకన్యాయముగా గుణదోషములను జూపుట విమర్శకులకు విధిగావున చూపఁబడినవి.

కృతియిచ్చుట—వేదాంతసార మగు ఈ కృతిని కృతికర్తగారు వేదాంతనిష్ఠయు, సర్వదా భగవద్గీతాపఠనాసక్తియుఁ గల తమతల్లిగారికిఁ గృతి యిచ్చి తమకృతిని ధన్యముఁగావించి తామును ధన్యులైరి. మఱియొక్కవిశేషము—మాతృకృతిపద్యములకు ముందు ముఖపత్రము రెండవవైపున "ధ్యానప్రార్థన" అనుశీర్షికతో నొకసీసపద్యము గలదు.

సాధారణముగా భగవద్గీతలకు ముందు గీతల నుపదేశించిన కృష్ణుని, గీతలశ్లోకరూపమున రచించిన వ్యాసుని స్తుతించుటయు సరస్వతీప్రార్థనము న్నగునవి పఠించుటయు సంప్రదాయమై యున్నది. ఇది యట్లుగాక క్రీస్తు (గారు) కొండమీఁదనుండి యుపదేశించిన వాక్యములలో దైవప్రార్థన యిట్లుండవలయు నని చెప్పిన వాక్యరాజముల కిది యనువాదము. ఇది యట్టి క్రీస్తుగీతాభాగమున కనువాద మని సూచింపఁబడకపోవుటచేతను ఇట్టి ప్రార్థనాపద్ధతి మనసంప్రదాయమునఁ బ్రసిద్ధము కాకపోవుటచేతను, క్రైస్తవమత సంప్రదాయ మెఱుఁగనివారి కీదైవప్రార్థన కొంత వింతగా నుండకపోదు. కాని యిది శ్రీరాజాభుజంగరావుబహద్దరువారి సర్వమతసమభావమును, పరమత సహనమును జాటుచున్న దని మాయాశయము. ఇట్టికృతులు రచించి యాంధ్రలోకమునకు మహోపకార మొనర్చుచున్న కృతికర్తగారియెడ నాంధ్రలోకము మిగులఁ గృతజ్ఞత చూపఁదగు ననుట నిర్వివాదము.

చేతిలోఁ బట్టుకొనుటకును, జేబులోఁ బెట్టుకొనుటకును ననువయిన యీసాంధ్రగీతావళీభగవద్గీత ప్రత్యాంధ్రునియొద్దను నుండఁదగినదె.

వలయువారు ఈక్రిందివిలాసమునకు వ్రాయవలెను.

శ్రీరాజా భుజంగరాయప్రచురణశాఖాలయము,

ఏలూరు- పడమరగోదావరి జిల్లా.

శ్రీ॥ ల॥

చ. అరయఁగఁ గామితం బొకటి యైనను గానక యాచకార్థి యై
బరఁగెడు నాదిభిక్షుకుని బంధువు సేదఁడు గాన లుబ్ధతా
పరు నలకాపతిం గుమతిభావనఁ జెందును మమ్ము సంద్రవం
చురతరవర్ధితాఖిలజనోదయు లౌదురు వైశ్యులప్పురిన్.

సీ. నగరాజునైనఁ బన్నగరాజునైనను ధైర్యవాక్పటిమలం డిఱుమఁగలరు
రుద్రుని నైన సముద్రుని నైనను శౌర్యగాంభీర్యాప్తిఁ జరుపఁగలరు
ఇంద్రుతో నైన నుపేంద్రుతో నైనను భోగభాగ్యస్ఫూర్తిఁ బోరఁగలరు
అర్జునితో నైనఁ జిత్రజునితో నైనను నిర్మాణరూపము లెంచఁగలరు
ఘనులు నిర్వక్రవిక్రమక్రమమదారి, చక్రదళనక్రియావక్రజయపరాక్ర
మక్రియామూలుద్రనిర్నిద్రమద్రయశులు, శూద్రులప్పురిఁ గలరు విశుద్ధమతులు.

ఉ. ఏఱులమిన్న నయ్యమున నేరున ఖేదన మాచరించెఁ దా
నేరున దున్ని భూమి ఫలియింపఁగఁ జేయఁగ సీరపాణియు
న్నేరఁ డటంచుఁ గేళిగొని నేర్పలరం గృషిచేసి ధాన్యము
ల్మేరకు మించఁగా ధర ఫలింప నొనర్తురు శూద్రులప్పురిన్.

క. బ్రహ్మపదజనన మొనరుచు, బ్రహ్మనిరూపకపురాణపరత వెలఁగుచున్
బ్రహ్మోరాద్గతి నడసియు, బ్రహ్మోరాద్గతి ఘటిల్లఁ బరఁగిరి శూద్రుల్.

క. మాతోఁ బుట్టిన గంగయు, ఖ్యాతిన్ జనములకు ముక్తి గలిగించెను మా
చేతనె భుక్తియుఁ గలదని, ప్రీతిం జెలఁగుదురు దర్పరింగల శూద్రుల్.

మ. సిరి విద్యుల్లత చంచలత్వ ముడిగెం జెన్నారె నేవేళలం
గర మింద్రోపలనీలకాంతులు నిజాకారంబునన్ మా(కున్)
కరణిం గావలె నంచుఁ గృష్ణఘనముం గాంక్షించి సేవించు న
బ్బురపుంగారుఘనంబులో యనఁగ నొప్పన్ వీట మత్తేభముల్.

చ. జగములు రెంట విష్ణుపదసంగతి గాంచె నిజాధినాథుతో
గగనమువాఁక యవ్విధము గాంచకపోవుట గాదటంచు వే
గగనధునీజలంబు కరకాండములం గొని తెచ్చి నించి ప
ల్దగలగు నేఱులన్ జలనిధిం గనఁజేసె గజంబు లప్పురిన్.

చ. సురధుని నోలలాడుసురశోభనగాత్రులయూరుసౌష్ఠవం
బరుదుగఁ జూచి లజ్జపడి యాత్మకఠోరకరంబు లెల్ల ని
ర్భరముకుళీకృతు ల్గొనఁ దరం బగునే గ్రహియింపఁ దత్పురీ
కరులకు నొప్పు గాని యెడఁ గ్రక్కొసవే యవి సీర మంతయున్.

ఉ. వాచకశబ్దము ల్పరనిపాతముచే విలసిల్లు వాచ్యతన్
రోచిలు మాకుఁ దాదృశత రుచ్యముగా కితరార్థరీతిగా
నౌచితి గాదటంచు మది నారసియో పరపాతనక్రియ
ల్గోచి వసించు నప్పురి నమోఘబలాన్వితము ల్కరీంద్రముల్.
శా. పీటం బాటిలు ఘోటకావళుల యుద్భిన్నాంఘ్రివేగంబుతో
సాటిం జెందఁగ వచ్చి వాయుమనము ల్సత్త్వంబులే కయ్యెడ
న్నీటు ల్పోవఁగఁ దత్పదాహతరజోనీకంబుచే సుళ్లఁ జే
డ్పాటుం జెందె నవేసుమీ భ్రమరజఃప్రాబల్యము ల్వానికిన్.
క. ఏకకచక్రపుఁజక్రిన, నేకత గాంచియు వహింప నేరక పుడమిన్
జోకజి పడు నని నగు నగు, లోకాప్తనివారుల ఫేనరుచుల హయంబుల్.
చ. సురుచిరరాజకన్యకల సోఁకుట నిత్యము రూపభావముం
బొరయుట జన్మసంశ్రయతఁ బూనుట నిక్కముగాఁ బిశాచమై
పరఁగెడుగాడ్పు వేగమునఁ బొల్పడునే సరిగాఁగ మాకు నం
చుపగతివేగసంపదల నొప్పు నదుష్టములై పురిన్‌హరుల్.
క. అరయఁగ నెప్పుడుసత్త్వము, భరియింపదుమనసు లక్ష్యపదమాయణువే
సరి యెట్టు లౌనటంచు, న్వారు లప్పురి మెలఁగుచుండు నతిసత్త్వమునన్.
సీ. క్లిష్టకల్పన లేక కష్టతాదూరమై యసమర్థత నెఱుంగ కప్రతీత
తను మాని యప్రయుక్తతను రోసి పతత్ప్రకర్షనైరర్థ్యఘటన గనక
దృఢపదబంధసంధిస్ఫీతమై సుప్రసాదకాంత్యౌజ్జ్వల్యసమత లలర
వస్త్వలంకృత్యభివ్యక్తులు పొసఁగంగఁ జిత్రవిన్యాసంబు చెలువు గనఁగ
నతులకవిరాజరచితకావ్యములనంగఁ, జెన్నుదైవాఱుచూడ్కికచ్చెరువుమీఱఁ
బుష్యరథము లసంఖ్యము ల్పొలుపు మిగులఁ
బురవతంసము ద్వారకాపురముపోన.
క. అచలత నవరత్నరుచి, ప్రచురత చిత్రప్రకారబహుసురపురస
ద్రచనతఁ బురిలో నరదము, లచలాఖేశ్వరులమాడ్కి నలరుం జాలన్.
సీ. వెలఁది నీకైదండవెల యెంత తెల్పవే యలరునాకైదండవెల సులభమె
చను బంతు లీరెండుఁ గొనవేడ్క చెలువరో చనుబంతులీరెండుగొనఁగలేవు
ఆకాశసుమ మిదెం తబ్రమే కననీయ వాకాశసుమదృష్టి యబ్రమెకద
పలునొక్కులకుఁ బొలుపడెఁగదే చిగురిద్ది పలునొక్కు లిడఁగ నీపాటివారె

వింతతావులు గనఁగ నువ్విళ్లు మాకు, వింతతావులు గనఁగ నీ వెంతవాఁడ
వనుచువిటులకుఁదమకుసయ్యాటమమర, విక్రయింతురుపుష్పలావికలువిరులు

సీ. వలపులీనఁగ సాఁగుఁ జెలువ నీకైదండవెల చెప్పరాదట్టె వలయుమాకు
వనిత పుంసో[illegible] బీనన రుచి చూడనీఁగదే రుచిరగాత్రి
పొలఁతి మాటఁగ నేల పొన్నపువ్విదిమాకుఁ జెన్నారు వన్నె చేమిన్నుముట్టె
వలువలో డాఁచెదు వలుదపూబంతులు పుట్టినయవిగానఁ బుట్టె మనసు
అనుచు నాగరవిటులు నర్మానుబంధ, బంధురంబుగఁ బల్కెడుపల్కులాని
గోముమీఱిన నవ్వులమోముఁ లలర, నమ్ముదురు పువ్వులవ్వీటనలరుఁబోంట్లు

ఉ. పోయినవారిఁ దేవసమె పుత్త్రడిబొజ్జకునైన మాదు చూ
చాయల చాయనే చనిన చక్కెరవిల్తుని చాయ నెన్నికం
బాయఁగఁజేయ లక్షణకుఁ బొల్పడు మాయబలాళిపదం బనం
జాయ విటాళి లోఁగొనుచుఁ జక్కని వేశ్యలు పొల్తు రప్పురిన్.

చ. సతతగిరీశభావమున సమ్మతశుద్ధకళావదాఖ్యసం
గతశివమూర్తియైన నధికస్ఫురదక్షికటాక్షవీక్షణా
చితగతిమాత్రనే రతివిశిష్టపరంపర లీను నిక్కువం
బతిశివమూర్తు లంచు విరులందఁగ వేశ్యలు పొల్తురప్పురిన్.

సీ. చందనాలయమహాచలరాజరాజత్సుగంధచందనగంధకలన మీఱి
నానామహీరుహానూననవ్యామోదసుమగుచ్ఛపరిమళస్ఫూర్తిఁ దనరి
రసరమ్యపద్మినీ*రాగసంగమపరిప్రాప్తంబు మధుసేవఁ బరిఢవిల్లి
సకలవధూటికాసముదయాశ్రయకామసంతతాధారతాసరణి నలరి
మెలఁగుచుండెడు మేనును మేను నెడమ, నతులభీతినిబలెమందగతులుసాగియ
నప్పురంబునఁజరియించు నహరహంబుఁ, బట్టగకొనివృమమనుప్రష్టాచారి

సీ. శక్తిత్రయజ్ఞానసంపత్తి నలరారి పంచాంగనిర్ణయప్రౌఢి మెఱసి
‡యావాప్యతంత్రకార్యక్షమత్వము గాంచి వృద్ధిక్షయంబులవిధము తెలిసి
చతురుపాయవిచారచాతుర్య మిరవొంది షడ్గుణప్రజ్ఞాప్రశస్తి నెరసి
రాజ్యాంగసప్తకరక్షకస్థితు లూని ద్వాదశరూపవిభేద మరసి
మతిబలస్ఫూర్తి నలబృహస్పతికిమించి, యఖిలవిద్యలనెచట†సామ్యంబులేక
యప్పురంబున నలరుదురనుపమాన, మానగుణరత్నఖనులుప్రధానమణులు

---

§పదంబునం—మూ. [illegible]—మూ. ‡ఆవా[illegible]—మూ. †నా[illegible]—మూ.

క. ప్రథమానిర్దిష్టతఁ బ్రా, గ్బృథగణ ముపసర్జనత్వబోధకు నమరుం
గ్రథమానిర్దిష్టత నగు, ప్రథ నుతధన్యత్వ మొనరఁ బరఁగి రమాత్మ్యల్.

వ. ఇట్లు సకలపుర లక్షణలక్షితం బై నిఖిలలోకవీక్షాపేక్షాసేచనకం బగునప్పు
రంబును ధరానుకూలవల్లరీనాయకరత్నం బెవ్వ రనిన.

చ. కలఁగనివాఁ డదెన్నఁటికిఁ గాననివాఁడు జగద్ధితార్థియై
కలఁగనిమానవప్రకృతిఁ గాంచినవాఁడు నిజాశ్రితాభిదా (?)
గలకనియైనఁ గావనను కట్టడిమాటకుఁ గానివాఁడు మే
ల్కలఁగనిచాయ నవ్వఁగనుగల్గిన నిద్దపుమోమువాఁ డొగిన్.

ఉ. తప్పనివాలునాఁ *డనిని దప్పనిమాటలవాఁ డొకప్పుడుం
దప్పనివాఁడు నమ్మికలు దప్పనిబంతి మెలంగువానివె
న్గప్పనివాఁడు తప్పులకుఁ దప్పనివారలఁ బ్రోవనన్నవా
తప్పనివాఁడు ద్వారవతిఁ దప్పనినీతిగ నేలు నెప్పుడున్.

సీ. సచ్చిదానందలక్షణలక్షితుం డౌచు వేదాంతలక్ష్యత వెలుఁగు నెవఁడు
జగదుద్భవస్థితిసంక్షయహేతుత సర్వజ్ఞతాతిప్రశస్తుఁ డెవఁడు
మాయానుబింబితమహనీయతేజుఁడై క్షేత్రజ్ఞవృత్తిచేఁ జెలఁగు నెవఁడు
సేవకాభీష్టార్థసిద్ధ్యర్థమై బహురూపనామముల నిరూఢుఁ డెవ్వఁ
డతఁడుపరముండుసకలలోకానుశాస,నార్థపు...శుభసమృద్ధి వేషార్థియగుచు
గృష్ణుఁ డనునామ మధువనకేలి గాఁగ,నతిముదంబున ద్వారకనధివసించు.

సీ. ప్రామిన్కుఁగమి...పట్టగునంచ యంచతేజీతేనిఁ గాంచువేల్పు
వేల్పురాతాచాయ వెలయు చక్కనితండ్రి తండ్రి నెఱుంగక తనరుప్రోడ
ప్రోడచేరువకాండ్రఁ బ్రోచుమిటారిగిడ్డి గిడ్డిమందలనుండు దొడ్డజంత
జంతరక్కసికానదొంతు లేర్చెడుచిచ్చు చిచ్చుకన్గలవాని నచ్చుజోడు
జోడుకన్నుల సెకఁ జల్వఁ జూపుమేటి, మేటిసుడిపాలుఁ దాల్చినమేలుబంతి
బంతివతె వ్రేల బలుకొండఁ బట్టుదిట్ట,దిట్టముగ నేలు నవ్వీడు తెలివిమీఱ.

సీ. తనసుదర్శనలీల తనసుదర్శనలీలకవచించేఁ బరదానగరిమ మెఱయఁ
దనవిక్రమస్ఫూర్తి తనవిక్రమస్ఫూర్తియనువున జగముల నాక్రమింపఁ
దననేత్రమహిమంబు తననేత్రమహిమంబుపగిదిఁ జిత్రాలోకపటిమ నెఱపఁ
దనకరాంభోజంబు తనకరాంభోజంబుపోల్కి నసాధ్వసామోదము లిడ

---

* దనిన.

ద్వారకాపురికి నేలుచుదారమహిమ, మహిమలయుభారముడుపంగామనుజలీల
నతిపరాయత్తసంరక్షణక్రియాప, రాయణుం డగుచట్టినారాయణుండు.

సీ. నిగమశిఖాపద్మినీగానహంసంబు నిరవద్యసద్గుణనీరరాశి,
నిజదాసఖేదాగ్ని నిరసన‡నాంభోదంబు నిర్మలకీర్తిధునీమహాద్రి
నిఖిలార్థదాననిర్నిద్రభూమీజంబు నిరుపమవైభవనిత్యవసతి
నిరవధికానందనియతినివాసంబు నిటలదృఙ్ముఖసురనికరి నేత
యలరు ద్వారక సర్వలోకాతిశాయి, చాతురీలేశ(హత)బహుళాతతాయి
(సాధు)చేతసమానసోత్సవవిధాయి, మాయిజనమాయివిబుధసన్మానదాయి

సీ. సైంధవజలమధ్యసంచార మందుట గిరిధారణోదీర్ణకీర్తిఁ గనుట
భూదారభావంబుఁ బొందుగాఁ బడయుట నరసింహవేషంబు నలువుకొనుట
బలిదైత్యగర్వసంపత్తి హరించుట రక్తైకతర్పణరతి నెనయుట
ఖరదూషణోద్వృత్తి కలిమి వారించుట నిజకామపాలత నెఱి మెలఁగుట
యతిపరశ్రుతిగతుల సన్నుతి గలుగుట, నతులితంపుఁబ్రసాదిత్వ మానిమనుటఁ
బూర్వపరలీలలప్పుడ పూనికొనుచుఁ, గృష్ణుఁడల రారునధిక రోచిష్ణుఁడగుచు

సీ. నెనరుఁజూపులవాఁడు నీలవానిఁగనువానిఁగనువానిఁగనినరూపొనరువాఁడు
పొనరునవ్వులవాఁడు మొనమించు మొకమించు మొనమించుజిగివల్వ నెన
[యువాఁడు
భంగ మందనివాఁడు రంగారు బంగారు బంగారుఁబోఁడి చేపడినవాఁడు
కడలినుండెడివాఁడుకడపల్లుకడపల్లుకడపల్లుమహిమంబుగాంచువాఁడు
కలఁడు లేఁడను రెండుమాటలకు మించి, వింత యగుకల్మిచే విజృంభిఁగువాఁడు
కృష్ణుఁ డనుపేర నఘు మణఁగించువాఁడు, పురుషుఁ డాద్యుండు ద్వారకాపు
[రికి ఱేఁడు.

వ. వెండి యు జగజ్జన్మాదికారణం బైన యప్పురుషోత్తముండు నిఖిల*విశ్వం
భరాభరోపసంహారార్థంబు గా దేవకీవసుదేవులకుఁ బుత్త్రభావంబున
మాయామానవశరీరం బవలంబించి యతం డునుప నందయశోదానందకం
దంబై నందునిపల్లియందు యశోదాతఘఃస్ఫలాయమాన నిజశిశుశరీర
పోషణుండై వసియించుచుఁ దత్కాలంబునఁ బూతన విగతచేతనం గా
వించి శకటాసురు హరించి తృణావర్తు నడంచి నిజైశ్వర్యజ్ఞాపక విశ్వరూ

‡ నాంభోజంబు—మూ. * విశ్వంభరాభరా శరోషణం—మూ.

పప్రదర్శనాద్యద్భుతంబుల యశోద న్విస్మయానందంబుల నందించి యమ
ళార్జునంబుల భంజించి బృందావనంబున గోపాలబాలకబలరామసహి
తుండై గోవత్సపరిపాలనం బభ్యుపగమించి వత్సాసురు విదారించి బకదై
త్యు మర్దించి యఘాసురు ఖండించి చతుర్ముఖమాయావినిర్మిత గోగోపవ
త్సాపహరణనిమిత్తంబునం దాన గోగోపవత్సరూపంబులు ధరించి విహరిం
చి ధేనుకు మథించి యమునాహ్రదంబున నుండు కాళీయోరగంబు వెడలిం
చి దవానలంబుఁ గబళించి ప్రలంబునకు బలునిచే లయంబు ఘటింపించి గో
పకన్యాసహస్రక్రీడనం బంగీకరించి విప్రభామలఁ గరుణించి గోవర్ధనాచ
లం బుద్ధరించి సుదర్శను శాపవిముక్తుం గా నియమించి శంఖచూడు
జముం జూడం బంచి వృషభాసురు మాయించి కేశిదైత్యు* మాయించి
వ్యోమాసురు నిర్జించి మధురాపురంబునఁ గువలయాపీడమహాగజంబుఁ
ద్రుంచి కుబ్జావక్రతానివారణాద్యద్భుతకృత్యంబులు నిర్వర్తించి బలరామ
సహితుండై ముష్టికచాణూరుల నిగ్రహించి కంసన్యగ్రోధాది నృశంసుల
హింసించి యుగ్రసేనుఁ బట్టాభిషిక్తుం గా ననుగ్రహించి ‡ బ్రహ్మచారితోరీ
కరణపూర్వకంబుగా సాందీపుని సమీపవర్తిత్వం బనుసరించి పంచజనుం
గీటడంచి తద్దేహగతశంఖంబు ధరియించి జమునివలనం దెచ్చి గురునకుం
బుత్త్రు నర్పించి యక్రూరముఖంబున గోపికల ననునయించి జరాసంధుఁ
గాండీకుంగా ఘటియించి కాలయవనపరిత్రస్తమధురాపురజనావనార్థంబు
వార్ధిమధ్యంబున ద్వారకానగరంబు విశ్వకర్మనిర్మాతచే నిర్మింపించి యందుఁ
దనయోగమాయాబలంబున మధురానివాసుల నందఱఁ బ్రవేశింపించి
ముచికుందుచేఁ గాలయవనుసమయసంకల్పించి ముచికుందస్తుతార్థసార్థ
నాహుంగా నభిమతించి జరాసంధుఁ బునర్దండయాత్రానిమిత్తక ప్రవర్షణప
ర్వతారోహణానంతరంబ తద్గిరిదాహంబు గావించి బలరామ సహచరుం
డై ద్వారవతియందు నివేశించి తదనుసమయంబున రుక్మిణీనామంబున
మానుషీవేషంబున దీపించు మహాలక్ష్మి లక్షణవతిం బరిగ్రహించి యాభా
గ్యవతియందుఁ బ్రద్యుమ్నకుమారు నుత్పాదించి జాంబవతివరియించి సత్య
భామం బరిణయించి శతధన్వుని సమయించి దీపించుచు మఱియు ననేక
ధాపన్నం బై యుపమాలంకారంబు ననుకరించుచు ద్వితీయప్రతిభటరహి
తం బై యనన్వయంబు ననుసరించుచు, నేకధర్మాశ్రయం బై యుపమేయో

* ఇఁకూడ మాయించి యనియే యుండును. ‡ బ్రహ్మచారిత్వోరీకృతిఃపూర్వ-మూ.

పమూలంకారంబు హసించుచు భేదాభేదవాదనిదానం బై స్మరణాలంకారంబు నిరసించుచుఁ బ్రకృతోపరంజకం బై రూపకాలంకారంబు ననుగ్రహించుచుఁ బ్రకృతోపయోగిక్రియార్థాప్రాకృతస్వరూపం బై పరిణామంబు నాదరించుచు రసికజనప్రతిభావిలాసగృహీతానుభవం బై భ్రాంత్యలంకారంబు లోఁగొనుచు నిషేధవచనప్రయోగి యై యపహ్నవాలంకారంబుఁ గాదనుచు బహుజనపరికల్పితబహూల్లేఖం బై యుల్లేఖంబుఁ బైకొనుచుఁ ద్రిప్రకారమనోహరం బై యుత్ప్రేక్షాలంకారంబు మార్కొనుచు ననిశ్చయాంతం బై సందేహాలంకారంబుఁ దోడుకొనుచు మహావాక్యప్రతిపాదితైకత్వం బై నిదర్శనాలంకారంబు విడంబించుచుఁ గవిప్రౌఢోక్తివిషయం బై యతిశయోక్త్యలంకారంబుఁ దిరస్కరించుచు నవజ్ఞా‡తవర్ణ్యం బై ప్రతీపాలంకారంబు నిందించుచు బింబప్రతిబింబభావోపేతం బై దృష్టాంతాలంకారంబుఁ బరీక్షించుచు హితాహితతుల్యవృత్తికం బై తుల్యయోగితాలంకారంబు నాజ్ఞసేయుచుఁ బ్రసిద్ధాధిక్యవిలసితం బై వ్యతిరేకాలంకారంబు వంక లెన్నుచు సమాహితసార్థముక్తినిలయం బై సహోక్త్యలంకారంబు నాక్షేపించుచుఁ దత్ప్రతిభటశబ్దార్థసంసేవితం బై వినోక్త్యలంకారంబు ననుగమించుచు నర్థాంతర†సమాక్షేపాధిష్ఠానం బై సమాసోక్త్యలంకారంబు నుల్లసం బాడుచు సద్భావరమ్యం బై పరికరంబుఁ గినియుచు నానార్థనిధానం బై శ్లేషాలంకారంబుఁ జౌకసేయుచుఁ బ్రస్తుతకార్యప్రత్యాయనసమర్థం బై యప్రస్తుతప్రశంసాలంకారంబుఁ జౌకళించుచుం గార్యానుమేయకారణభావం బై ప్రస్తుతాంకురాలంకారంబు నవఘళించుచు వ్యాప్తిసముల్లసితం బై యనుమానాలంకారంబు బెదరించుచు విశేషభావగమ్యం బై పర్యాయోక్త్యలంకారంబు విదళించుచు *విధినిషేధవచనమూలం బై నిషేధాలంకారంబుఁ బ్రతిషేధించుచుఁ బరిహృతవిరోధం బై విరోధాభాసాలంకారంబు విరోధించుచు నకార్యసంబంధం బై విశేషోక్త్యలంకారంబు నవమానించుచు నకారణకార్యవశంగతం బై విభావనాలంకారంబు నిరోధించుచు విలక్షణకార్యోత్పత్తిమంతం బై విషమాలంకారంబు బహూకరించుచు విచిత్రప్రయత్నసంబంధి యై విచిత్రాలంకారంబుఁ బోనాడుచు సూక్ష్మోదారం బై సూక్ష్మాలంకారంబు మన్నించుచుం

---

‡తాపర్ణం బై-మూ.　　†సమాధోపాధిష్ఠాన-మూ.

*విధ్యలంకారవిషయ మిందులోపించినదేమో.

‡గారణమాలాలంబం బై గుంభాలంకారంబు ఘటించుచు గృహీతముక్తం
బై యేకావళ్యలంకారంబుఁ గనుచు దీపకైకావళీయోగం బై మాలా
దీపకంబుఁ గైకొనుచు నుత్తరోత్తరగుణోత్కర్షం బై సారంబు వెలయిం
చుచు మఱియు నుపాదానలక్షణలక్షితం బై జహదజహల్లక్షణావ్యాపార
ద్వయంబు జయించుచు వృద్ధ*నిష్టాపదసర్వనామస్థానం బై సంస్కృతశ
బ్దానుశాసనంబు ననుశాసించుచుఁ జతుస్సాధనాభిగమ్యం బై ప్రమాణ
దర్శనంబుఁ జుంబించుచు, నిశ్చితవేదార్థం బై వాక్యశాస్త్రంబుఁ దెలిసే
యుచు నద్విత్వం బై ప్రాకృతవ్యాకరణంబుఁ గారించుచుఁ బ్రత్యయనుల
భం బై ఛందంబు నపలపించుచు స్థిరప్రాఙ్మ్యపకృతిపదం బై వికృతివ్యాక
రణంబు నపహ్నవించుచుఁ బ్రకృతివికృతిసంశ్రయం బై మహానాటకంబు
నదరించుచు నమితం బై గద్యకావ్యంబుఁ గాకుపఱుచుచు సువృత్తావృతం
బై చంపూప్రబంధంబు ననుబంధించుచుఁ గళాస్వరసహితం బై గాంధర్వ
విద్యం గంపించుచు నస్తోకహస్తలక్షణమధురం బై భరతంబు గనికరించు
చుఁ దనరూపంబు మిగుల వెలుంగ నసముండేని సముం డై యదరుం డ
య్యు నదరుం డై యరిభరణప్రవీణుం డయ్యు నరిహరణప్రవీణుం డై స
విశేషుం డయ్యు నవిశేషుం డై యమానుం డయ్యు సమానుం డై యగ
చుం డయ్యు నగచుం డై వనవిహారశీలుం డయ్యు నవనవిహారశీలుం డై
సోదయుం డయ్యు ననుదయుం డై శేషి యయ్యు నశేషి యై యహీన
నిద్రాముద్రుం డయ్యు నిద్రావేశరహితుం డై యనర్ఘుం డయ్యును నర్ఘ
నాధారత మెఱయుచు లోకబాంధవుండు గావునఁ గమలాలయామోద
ఘటకత్వంబునం దమోహరణపాటవంబునఁ బొటిల్లుచు స్పర్శవిధుండు గా
వునజగదాహ్లాదకరత నమలినతారాపక్షేమనోహరతం బ్రవర్తిల్లుచు సమవ
ర్తిగావునం బ్రియాప్రియతుల్యయోగదండధరత ధర్మనిర్వహణధురంధరత
నాలంబించుచుఁ గాలుష్యంబు పక్షాసరిత్సరజ్జలకుపితాంగనాహృదయంబు
లయందు పదనియమాభావవర్ణవైపరీత్యంబులు ప్రాకృతవ్యాకరణంబునందు
యస్పష్టాలంకారత సురతమృదితముదితాధ్వనికావ్యంబులయందు విరాగత
చుంబితకాంతాధరంబులయందు యసుందరత్వంబు మధ్యమకావ్యంబులంద
నీరసత్వంబు వజ్రాదిమణిచిత్రకావ్యంబులంద నిరర్థకత్వం బపుష్టపదంబులం
ద యకళావత్త్వంబు ద్రుతప్రకృతులయందు వక్రత కాంతాఘాలాలక శరవిశే

‡ ఇందుఁ గారణమాలాసంసృష్టములు తొమ్మిది యినవి. *శిష్టా-మూ.

పార్థచంద్రులయందు ఏర్పత్యాహారవర్ణాకర్ణాకృష్టధనద్రేయందు కఠిన తలలనాకుచకటితటంబులయందు నీరసకావ్యతర్కోక్తికదంబంబులయందు ప్రదోషత రజనీముఖాసంస్కృతంబులందు యర్థభేదంబు శ్లేషయందు వృత్తిభిద యలంకారశబ్దమనంబులందు నిర్దయత మదనకదనకదనంబులందు స్వపక్షాభావంబు కేవలాన్వయిహేతువునందు దారిద్ర్యంబు మృగతృష్ణా మృగేక్షణామధ్యంబులందు కళంకంబు కళానిధియందు చాంచల్యంబు చంచలాక్షీకటాక్షసైంధవఖురాంచలంబులందు యనమ్రత యసజ్యచాపంబులందు యప్రసాదంబు మేఘావృతదినంబులందు యగుణాశ్రయంబు సురత భిన్నహారంబులందు యహింభయంబు పాతాళంబునందు యస్ఫుటత్వంబు వీణా కలకలవాద్యభేదంబులందు మానభంగహేతుత నాయకకృతనాయికాచరణపాతంబునందు పతత్రపక్షత సముద్రతరంగంబులందు యనభిజ్ఞనిబంధనంబులందు యపాత్రత యుపరత నాట్యరంగస్థలంబులయందు మిథ్యావాదిత యద్వైతవాదులందు యప్రకాశత గుప్తవైతానాగ్నులయందు వికృత భావంబు ప్రాకృతాంధ్రభాషలయందు సమాధి పదబంధయోగీంద్రమానసంబులయందు మెలంగ నఖిలజనులు నగ్నిమాడ్కి శుచిమంతు లయ్యుం దాపకారిత్వ మెఱుంగక చంద్రుమాడ్కి నాహ్లాదకరు లయ్యుం గళంకులు గాక రవిభాతి సాభ్యుదయు లయ్యు నస్తంగతిం గొనక మేరువుకైవడి నున్నతు లయ్యుం గాఠిన్యంబు గనక పయోధిచెలువున గాంభీర్యరత్నాకరంబులు గాంచియు భంగంబులు దెలియక కుబేరువడువున నర్థసంపన్నులయ్యు నిరాశ్రయంబు సేయక యింద్రునైఖరి నిరుపమభోగశాలు లయ్యు దృష్టిభేదంబు లధిగమింపక యనుపపన్నఖేదులై యనుగతమోదులై యప్రాప్తాపవాదులై యాశ్రితసాధువాదులై యసురసప్రసాదులై యతిప్రియవాదులై యతిశయితవినోదులై చెలంగం బరిపాలనంబు సంఘటించు సమయంబున.

—: కథాప్రారంభము :—

క. దిక్కులదొరకళ కిది యొక్కుక్కనదే యెంత చెలువ మక్కుక్క యనం జక్కందనంబుల కుప్పగు, నొక్కసరోజాక్షి రవితనూభవ యలరున్.

క. అందముగల తలిదండ్రు ల, మందానందమునఁ బెనుప మందిరమునఁ గాళిందీనామతఁ బెరిగె న, నిందితయమునాతరంగిణీసోదరి యై.

వ. ఇట్లు పెరుఁగుచు నబ్బాల తనశైశవంబున.

సీ. చెలులతోఁ బరివేషములు మేలుతనబొమ్మరిండ్లుగాబొమ్మపెండ్లిండ్లు సేయుఁ
దారకాగ్రహపంక్తి గూడి యొప్పుగా వెన్నెలకుప్ప లాడుఁ
దనరారు పయ్యెంద్రధనువులపై నెక్కి యింతులతోడ నుయ్యాల లూఁగుఁ
గూర్చుకన్నియలతోఁ గూడి కుంభంబునఁ గొమరొప్ప గుజ్జనగూళ్లువండు
మొగులుచాటున*దాఁగిలిమూఁతలాడు,సప్తఋషిబాలికలతోడసరసమాడు
నంచబోదల కెల్ల నాట్యములు గఱపు,బాల నవశైశవారంభవేళలందు.

చ. జలధముమాటునం బొలిచి చాన మెఱుంగయి మిన్నువాఁకయం
‡చలమునదిల్చి యంచయయి, చంద్రుపిఱుందఁ దదీయరేఖ యై
మలయును బువ్వుఁదీఁగియలమాటునఁ గల్పకవల్లి లీల యై
లలిఁ గిఱుకించుఁ దోడిచెలుల న్సతి†దాఁగిలిమూఁతలాడుచున్.

క. నీలాభగవత్యంశజ, బాలిక బాలారవిందపంక్తులు దిశలం
జాలం జాల రచించును, లీలన్ శ్రమపడుచుఁ? దనదు తేజూపుగమిన్.

క. దిన మొక్కచాయఁ బెరుఁగుచు, వనజాయతనయన చూడ వన్నెఁదనర్చెన్
మనసిజుఁ డాడింపఁగ గవిసన దీసిన పసిఁడిబొమ్మచందము మెఱయన్.

చ. మదవతి వాక్యపద్ధతి సమంచితరీతి ఘటిల్లి వర్ణముల్
పదులు గణింప నైదు నొకపట్టున నొక్కొకచోట నాలుగే
పదులు వసించు నొక్క యెడఁ బాయును నాల్గు లిపు ల్మఱొక్కెడం
గదిసి మెలంగెడుం దెలియఁగాఁ బదియు న్మఱి నాల్గువర్ణముల్.

క. వైదర్భిమీఱు నెచ్చెలి, వైదర్భీరీత్యుదీర్ణవైభవరసధా
రోదారకవిత యెట్లు ప్ర, మోదావహ గాదు రసికపురుషుల కెల్లన్.

క. పదచిత్రతార్థచిత్రత, లొదవినకవితయు విచిత్ర మొగిఁ గనుపట్టెం
బదగతుల సోపమం బై,యది నిరుపమ మగుచు మెఱసె నబ్రముచూడన్.

సీ. సుప్తిఙ్శ్లేషసంశోభితత్రివిధశబ్దంబులు దోషసర్వస్వ మెడల
శయ్యా సమర్చుచు సత్పాకశుద్ధిగఁ ద్రివిధగుణంబుల రీతు లమర
వృత్తులు చెలువార వివిధరసానుగపదవర్ణసమసనస్ఫూర్తు లొనర
వ్యంగ్యంబు ముఖ్యమై లమర శబ్దార్థవైచిత్రి విశేషము ల్చెన్నుమిగుల
వాగ్బలం బైనకవిత చెప్పంగ నేర్చెఁ, బ్రాఁతచదువులప్రోవుగారాపుఁబట్టి
విమలతన్త్రీతిమాధురివిన్నయపుడు,కవిగురులుకవితగుఱుతయుఁగాంచఁగలరె.

* దొంగడుమూతలాడు-మూ. ‡ యంచలదమునిల్చి-మూ. † దాగిలిమూచులాడుచున్.

సీ. సంతతసన్మార్గసంచారిణిగఁ జేసె సారసాహితీహంసవ్రజంబు
వీణాక్వణత్పాణి వాణి యంతర్వాణి వాణీవిశేషసర్వజ్ఞఁ జేసె
బంధురగాంధర్వపాండిత్యనిధిఁ జేసె విమలాశ్వవదనసాధ్వీజనంబు
సర్వభారతశాస్త్రగర్వితగాఁ జేసె రమితగీర్వాణపర్వాబ్జముఖులు
కల్పితానల్పసంకల్ప(కావ్య)కథల, లలితకీర్తులు మీఱఁ గల్పనలు చేసి
దిద్దె నద్దివ్యమునిసతీతిలకకులము, వెలయఁ గాళింది సద్బాల్యవేళయందు.
సీ. ఉదయవేళల వాణి యురువృత్తబహువృత్తిబోధకగ్రంధము లొప్పసఁగ నేర్పెఁ
దపరాహ్ణమున ధరాధరరాజనందన మహితాగమోక్తిమర్మములు దెలిపె
దానిపిమ్మట రమాతరళాక్షి రత్యలంకారశాస్త్రములు పొంకముగ నేర్పె
నెపనెప రశ్మిత నెసఁగు పన్నగరాజు శబ్దరహస్యంబు చక్కఁ బలికె
గౌతమవ్యాసకణచరకపిలజైమి, నులు స్వనిర్మితదర్శనంబులు నొడివిరి.
మూఁడుమూర్తులముద్దు యాప్రోడ తండ్రి
యంకమునఁ బ్రోదిగాంచు నియ్యబ్జముఖిక.
క. చదువులగని కన్నెయన, చదువులు గ్రహియింపనేర్చు *సవిత్రతనుజ చాఁ
జదువులు సాకల్యంబుగఁ, జదివె ననుచు వర్ణనంబు చలుపఁగవలెనా.
వ. అంత.
మ. గణుతింపన్ స్మరజీవనౌషధి యనంగ బ్రహ్మాతంత్రాంకురా
ర్పణసర్వంసహ కామదైవతసపర్యావాహనాకారణా
క్షణ మస్త్రాస్త్రజగత్త్రయీవివశకృత్సంమోహనాస్త్రంబు భూ
షణసాకల్యసమానవేష మయి యోషాయౌవనం బొప్పెడిన్.
క. ముంగురులరంగు లలవడె, నంగనపాలిండ్లు మిట్టలై కనుపట్టెన్
అంగముల మెఱుఁగు లెక్కెను, శృంగారముతోడఁ జెలికి సిగ్గును గదిరెన్
సీ. నానాఁట నవయౌవనపుఁబూఁదోఁటలో రహిమించు మదనాంకురంబనంగ
ననుపమనవయౌవనారంభజలరాశి లలిఁదేరు పవడంపులతిక యనఁగ
సరసలావణ్యవర్షాకాలఘనవాటి రఁగుమీఱిన క్రొమ్మెఱుఁగనంగ
సలలితప్రాయంపుసానఁ దేఁటి లసించు ననమాయుధుని మోహనాస్త్రమనఁగ
బాలశశిరేఖ దినదినం బోలి నెగడి, మెఱయఁ గళలంతకంతకు నిక్కటముగ
వరుస సంపూర్ణభావశ వఱలుకరణి, నమరెఁ గాళింది నవయౌవనాగమమున

---

*సరసతినుజ-మూ.

క. పొరలేక సరస తెడలక, వరపల్లవితతితోడ*వర్తింపక యి
ద్ధరపైఁ బడి తలక్రిందై, పరఁగిన సరిరాదు రంభ పదతతితోడలతోన్.

చ. తలవిరియంగఁ బోసికొని తద్దయు నాకులపాటు నొందఁగా
జలములఁ నెప్పుడున్నిలిచి సర్వశరీరము భూతిలిప్తమై
వెలయఁగఁ బంక్తిఁ బూలుఁగొని వేసరకెప్పుడు మోచ దాఁ దపం
బలవడఁ జేయుచున్నయది యర్కసుతోరుతులా‡స్థలాంతరన్.

క. అతిమృదు వగుసతియూరుల, నతికఠినపుఁగరికరంబు లారసి చూడ
స్మృతి రాదయ్యెఁ బ్రతీపమె, హిత మట్లా నుపమ నుడువ నిలఁ బ్రాజ్ఞులకున్.

సీ. పూర్వాపరరూపమంజిమస్ఫూర్తిఁ గాంచి
చెలువకటి పాణిపీయంబు చెన్నుగాంచుఁ
బృథ్వి విపులాతిహృద్యసద్వృత్తమగుచు
వేదపాదం బనా మదివేడ్కఁ జేయు.

క. నీల తానొంట నయ్యాలి, నీలాలక పిఱుఁదురుచిని నిర్జించె నిలన్
వేలాతిగసర్వాంగ, శ్రీలన్ శ్రీగెలిచె సవతిచిట్టక మమరన్.

సీ. దిరదిరం దిరిగెఁ గుమ్మరసారె రవిజాతపిఱుఁదుతో మురిపంబుఁ బెరుఁగవచ్చి
నట్టేటఁ బడియె మానక సైకతంబులు చెలిజఘనంబుతోఁ జెనకవచ్చి
బలుగిరిదుర్గంబుపా లయ్యె ధారుణి పైదలికటి సరిపడఁగ వచ్చి
రారాపిడులఁజెందెఁ దోరంపుటద్దముల్ పొలఁతిశ్రోణిచ్ఛాయఁ బూనవచ్చి
గండ్లఁబడిపోయె నరదంబుగండ్లు మగువ
కాంచికాస్థానగరిమంబు గనఁగవచ్చి
పరుషవిషమత్వములు ప్రానుపాటు తమకు(?)
దలఁపనివి(లేవు) బాలానితంబమునకు.

క. అరుదైన చక్రవర్తిత, సరసుల సహావసతి గలదు చాలుదు మనియో
కరము భ్రమంపడి తిరిగెడు, దరుణీమణినాభిసదృశతకు సుళ్లైపుడున్.

క. లలనామణిపక్షంబునఁ, గలిమియు లేమియును నెఱుఁగఁగానినడుము దాఁ
గలదని తెలియఁగఁజేసెన్, బలునాభిగహ్వరంబు పరిదృష్టంబై.

క. గూఢాగూఢవ్యంగ్యము, రూఢిం గనికనము లమరురుచులు దనర్పం
బ్రౌఢపయోధరమధ్యము, ప్రౌఢులమతి సమ్మదం బపార మొనర్చున్.

---

*వర్తింపగ — మూ.   ‡స్థలాన్వితన్ — మూ.   †కుఁచ్ఛాయసోన — మూ.

ఉ. ఆరమణీశిరోమణికుచాద్రియుగాంతరసీమఁ బుట్టుశృం
గారరసంపుజా లనఁగఁ గానఁగనయ్యెను ముద్దుఁగుల్కు నూఁ
గా రది నిల్వఁగా నయినయవ్భుతనిమ్న మనంగ నొప్పుచె
ల్వారెడు నాభిగహ్వర మయారె మృగీదృశరూపవైఖరిన్.

క. అరయఁగమనమున్ దివియుం,బరమాణువుఁ గలదటంచుఁ బఠించిన వా
హారిమధ్యనడుము సరిశయా,పరహాస్పద మాటనెల్ల పాటిలు నుపమల్.

గీ. చారుతర మైననాభిశృంగారసరసి
రసము వెల్లుబ్బి కుచమహీధ్రములనంటి
పాఱునూఁగారుజాలుపైఁ బయలుపడెడు
కరడు లనమించె మువ్వళుల్కనులముఖికి.

మ. లలితశృంగారరసప్రవాహ మొనరన్ లావణ్యవర్షాగమా
కలనోద్భూతవళీతరంగములు పైకం దాఁకఁ బెల్లుబ్బుచు
జ్జ్వలతేజోమయ బుద్బుదద్వయము నొప్పన్మించె నబ్బాలి మే
ల్వలిచందోయి నెఱుంగు లుల్లసిలు భాస్వద్బాహుమూలాంత మై.

చ. అరయఁ ద్రివేణికాజల మనంగుఁ శృంగకఁగ జన్మపుస్థ మే
ల్సిరి కడు నించి డింప నొగిఁ జెల్వ(గు)పైడి పనంట్లు గుబ్బ లా
సురవడి డించు దోఁ దోడఁక నొప్పెడు జా లనఁ గాన నయ్యెడు
న్వరహారినీలమౌక్తికసువర్ణనిబద్ధవిభూషణప్రభల్.

క. అప్రకృతభూధరాదుల, కప్రకృతం బయ్యెఁ జెలువయుప్రపుగుబ్బల్
అప్రకృతతయునుబ్రకృతత,యిాప్రకృతపుఁజన్నుదోయి నెనయుఁ గ్రమమునన్.

చ. కలయఁ బ్రసాద మొప్ప నధికస్ఫుట మై మధురత్వ మొందఁ గే
వలపరుషస్వభావపటుబంధము మీఱ సమస్తభూషణా
వలులు దలిర్ప సర్వరసవాసితఁ గావ్యమునాఁ జెలంగు నె
చ్చెలిచనుదోయి క్లిష్టతనుఁ జేకొని మానదుమా విసంధితన్.

క. ఉరుకుచభూధరపతికిం, గరిఘటములు మిత్రమయ్యెఁ గనకకలశముల్
పరికింప సమతఁ గైకొనె, నరులును సఖిభావ మందె నరుదు తలంపన్.

క. అరిగజకటదారణమున, నురునుమనఃపంక్తిపోషణోదారతచేఁ
బురణించు మొనలు సూపుచుఁ, దరుణీవక్షోజభూమిధరరాజు కడున్.

ఉ. శంక యొకింత లేక చెలిచక్కని బాహులు సాటి కేగఁగాఁ
బంకముఁ బొంది కంటకులమా లయి లో బలుతేమఁ జొచ్చెఁ గాఁ

బంకజనాళి లట్లగుట వాని హరించు శుచిత్వవృత్తిచేఁ
గొంకక సత్పథంబు గొను కూరిమిగల్గినహంసరాజయుక్.

చ. వననిధిఁ బుట్టి సన్మణినివాసము నై హరికేలు వట్టి యా
ధనపతియిల్లు సొచ్చియు ముదంబున మంగళసూత్రవైభవం
బునఁ దనరారనైతి నని పూనిక శంఖము చామకంఠ మై
ఘనత వహించి కాంచు మణికాంచనమంగళసూత్రసంపదల్.

క. నిటలాక్షుఁడు మూలంబున, నట హరిపత్రంబుమీఁద సమపుటకతన
న్వటఫలము ఫలము గాంచెను, బటుగతి నింతిచుబుకభావముగొనుచున్

చ. సరసిరుహాక్షిదంతములసాటికి వత్తు మటన్నఁ గుందము
ల్వారియునుగా నిరంతరము వేసరి చీఁకటిబందిగంబులం
జొరఁబడి వాడుఁగా మిగులసూత్రముల న్సరిగట్ట స్రుక్కఁగా
పొరిఁబొరిఁ గందుగా నెఱయ భూరికుచాంతరదుర్గసీమలన్.

గీ. *అక్షయంపుగుణస్ఫూర్తియమరెనేని, ఛిద్రములులేనిగుంభంబుఁజెందెనేని
తరణినందనముద్దులదంతపంక్తి, యాభిరూప్యంబు గాంచు ముత్యాలబంతి.

ఉ. పంచము లంట మే నిది యపాత్ర మటంచు వనాగమాంతశా
ఖాంచలవృత్తి నై చివు రుపాశ్రితమాధవసంగతైకర
క్త్యంచిత మై వధూటిమధురాధరతం జని చెందుటం గదా
కాంచెను సద్విజన్మపరికల్పితసంతతసంగసౌఖ్యముల్.

సీ. జలవానతపమై(న)జలజంబులకుఁ గళాధరునిరాకకుఁ బ్రమోదంబు లేదు
లలి నట్టితప ముత్పలంబున కగునేని మిత్రవైముఖ్యంబు మిగులుచుండుఁ
గలదు భిక్షావృత్తి గండుఁదుమ్మెదలకుఁ బాయిత్వ మెన్నఁడుఁ బాయకుండు
గగనస్థితవ్రతం బగుచకోరంబున కెన్న దోషాకరునింపు గదురుఁ
గాన చక్కని కాళిందికన్నుఁగవకు, నెన్న నివి సామ్య మేగతి నెనయఁగలవు
ఎట్టికష్టంపుఁదపమైన నిలవిగుణాత, గన్న ఫలమిచ్చుననుమాటగలుగు టెల్లు.

గీ. నిచులబంధవరాలోకనిస్త్రపమీళ(?),లమలమాధుర్యరసవైభవాస్పదంబు
లగుచుఁజెలువారుకాళిందిసొగసుఁగన్ను,లన్నలోతమ్ములోయవియబ్జములకు.

సీ. చానకన్నులతోడిసాటిఁబూనఁదలంచి భ్రమసి బేడిసలు గాలములఁబడియె
జెలువయక్షులతోడిచెలిమి సేయఁగవచ్చి పొందమ్మిమొత్తముల్బురదబడియె

---

* యక్షయగుణస్ఫూర్తి — మూ.

# విషయసూచిక

# పరిషత్ప్రయోజనములు.

తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమున పరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁబడు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ జూపఁబడుచున్నవి :—

i. తెలుఁగుభాషలోని పదములను వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు నుదాహృతసహితముగ నర్థమును వివరించు సర్వాంగపూర్ణమగు నిఘంటువు నొకటి రచించి ప్రచురించుట ;

ii తెలుఁగుభాషకు సజాతీయేతర భాషలతోఁ గలసామ్యవైషమ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణమును రచించి ప్రచురించుట ;

iii. ఆధునికశాస్త్రగ్రంథరచనయందుఁ బ్రయోగించుటకుఁ దగిన పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధము చేయుట ;

iv. ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యములయిన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగుదేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుటయు ;

v. సర్వవిషయములను గురించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట ;

iv. ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట ;

vii. తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొకపత్రికను బ్రకటించుట ;

viii. తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గురించి చర్చించుటకై గాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట ;

ix. తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను, నొసంగుట ;

x. ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట. ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగుగ్రంథము లుండవలయును ; వ్రాఁతప్రతులుఁగూడ నుండవలయును ;

ix. తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపకరించు నన్నికార్యములను చేయుట.

ఆంధ్రసాహిత్య

పరిషత్పత్రిక.

సంపుటము. ౧౬. { ప్రభవనామసంవత్సరము జ్యేష్ఠాషాఢమాసములు. } సంచిక ౩.

# పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి—శృంగారశాకుంతలము.

—♦ టేకుమళ్ల అచ్యుతరావుగారు, ఎం ఏ., ఎల్.టి. ♦—

— విజయనగరరాజ్య క్షీణదశ —

నారాయణకవియేలిక యగుపూసపాటి బసవరాజునుగుఱించి వ్రాయు నెపుడు విజయనగరరాజ్య మెట్లు సంగమవంశపు కడగొట్టురాజుల యసమర్థత చేత క్షీణదశకు వచ్చినదో తెలియఁబఱిచితిని. ఆకట్టకడపటిరా జగువిరూపాక్షరాయలు స్త్రీలోలుఁడై, మద్యపానవివశుఁడై రాజకార్యములను దన మంత్రిసేనానుల కొప్పగించి స్వైరవిహారుఁడై యుండెను. ఇట్టియరాజకస్థితిఁ జూచి ప్రాంతశత్రువు లైనగజపతులును గోత్రశత్రువు లైనబహామినితురుష్కులును బూర్వనుండియు, నుత్తరదిశనుండియు రాజ్యమును ముట్టడించిరి. సామంతరాజు లందఱు రాజ్యమునకుఁ గలుగఁబోయెడి విప్లవమునకు భీతిల్లుచు రాజ్యమందలి మహాసేనాని యగు సాళువనరసింహరాయలకు సహాయపడిరి.

— సాళువనరసింహరాయలు —

అదివఱకే పరరాజభీకరుఁడై యున్న నరసింహరాయ లితరసామంతుల సాయము బొంది శత్రువులను బాఱఁదోలెను. బోసగిరి, చెంచి, ఉదయగిరి, పెనుగొండ మున్నగుదుర్గములనుండి పగతుఱ వేఁబాడి విజయనగరరాజ్యము శిథిలము కాకుండఁ గాపాడెను. సంగమవంశము నిస్సంతతి యగుటచేతనో, లేక రాజ్యరక్షణకర్త యని సామంతప్రభువులం దేకగ్రీవముగా వీనిని విశ్వసించుటచేతనో, యీమహావీరుఁడు క్రీ.శ. 1487 విజయనగరరాజ్యసింహాసన మెక్కి సాళువవంశమునకుఁ బ్రథమపురుషుఁ డయ్యెను.

— సాళువవంశము —

సాళువవంశము చంద్రవంశము. ప్రథమమున గుండరాజు ; అతనికొడుకు లాగ్గదిలో సాళువ మంగరాజు గొప్పపేరు ప్రతిష్ఠలఁ బొంది దక్షిణాను రతాను నెదిరించి సంపరాయనికి రాజ్యము నిల్పియు, శ్రీరంగనాయకులకు

పఱువదివేలమాడ లుమ్మడి యొసంగియు, మధురాసుర తానునోడించి సాళువ బిరుదమునొందియు, నిట్టి మహోపకారాక్రమాతిశయములగు కార్యములు చేసి విజయనగరరాజ్యచరిత్రలో వాసిగాంచెను. మంగరాజునకు నాల్గురు కొడుకులు. అందులో గోతరాజునకుఁ బుట్టిన పలుగురు పుత్రులలో నగ్రజుఁడగు గుండ్రాజునకుఁ దిమ్మరాజనియు, నరసింహరాజనియు నిద్దఱు కుమారులు. ఈనరసింహరాయలే కులక్రమాగతమైన సేనానిత్వము విజయనగరరాజ్యమునఁ గావించి తుట్టతుదకు సింహాసనము గూడ నెక్కెను.

ఈతనికాలముననే పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁ డనెడి సుప్రసిద్ధ కవీశ్వరుఁ డుండెను. అతఁడు తా వ్రాసిన గ్రంథములలో "జైమిని, భారతము" నీసార్వభౌమున కంకిత మొనర్చెను.

నివసనస్థలము :—పిల్లలమఱ్ఱి యను గ్రామము గుంటూరుమండలములో, [illegible]నా లితాలూకాలో నున్నది. ఇప్పటికాలమునం దున్న పిల్లలమఱ్ఱివారి [illegible]ము లన్నియు వెలనాటిశాఖలోఁ జేరినవి. పినవీరభద్రకవి నియోగి యని మ. రా. రా. శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగారు మున్నగువారు వ్రాసియున్నారు. ఇప్పటికాలపు నియోగివైదికభేదములఁబట్టి యీనిర్ణయముఁ జేయుచుండుట చరిత్రముల యథార్థతకు విరుద్ధ మని నాకుఁ దోఁచుచున్నది. సుమారు రెండుమూఁడుశతాబ్దముల క్రిందటివఱకు నిట్టిభేదము లే దనియు, ప్రాయశః యింత ప్రబలముగా నైనను లేదనియు, చరిత్రవిమర్శకుల యభిప్రాయ మని నొక్కి చెప్పవచ్చును. ఒక కుటుంబమునందుఁ గొందఱు వైదికసాంప్రదాయమున నుండుటయుఁ గొందఱు లౌకికవృత్తులలో మెలంగుటయుఁ దటస్థించుచుండెను. బహుశః యిప్పటి [illegible]మునవలెఁ గాక [illegible] గోండ నుండి యుండవచ్చును. కనుక యీనాఁటికవులు నియోగులే గాని వైదికులు కా రని చెప్పుట నప్పటికి లేనిభేదము నారోపించుట యని యుచితజ్ఞులయభిప్రాయము.

పినవీరభద్రునివంశము పండితవంశము. కవిత్వశైలిఁబట్టి చూచినఁ దనకుఁ బూర్వమే తనవంశము ప్రసిద్ధినొంది యుండె నని తోఁచుచున్నది.

క. తాతయుఁ దండ్రియు నగ్ర, భ్రాతయు నుం డాను భువనభాసుకకృతిని
ర్మాతలు పిల్లలమఱ్ఱివి, ఖ్యాతునిఁ బినవీరుఁ బోలఁ గలరే సుకవుల్.

సీ. అమృతాంశుమండలం బాలవాలముగాఁగ మొలచె నొక్కటి జగన్మోహనముగఁ
జిగిరించె విలయసింధుగతకైతవడింభశయనీయవరపలాశములతోడఁ
బిత్రుదేవతలకు నంచితసత్రశాలయై చెట్టుగట్టెను గయాక్షేత్రసీమ
నిలువనీడయ్యె నిందీవరప్రియకళాకోటీరునకు భోగికుండలునకు
మఱ్ఱిమాత్రంబె పిల్లలమఱ్ఱి పేరు, పేరువలెఁగాదు శారదాపీఠకంబు
వారిలోపలఁ బినవీరువాక్యసరణి, సరసులకు నెన్నఁగన్నరసాయనంబు.

([illegible])

వీరిది కాశ్యపసగోత్రము. తండ్రిపేరు గాదయ్య; తల్లిపేరు నాగమాంబ. పినవీరున కన్నగా రొకరుండెను. ఇవి యింతవఱకు, పినవీరభద్రుని గ్రంథముల నుండి తెలిసినవిషయములు.

ఈవంశస్థుఁడ నని చెప్పికొన్న మఱియొకకవి పెనుమళ్ళ సోమనామాత్యుఁడు తాను వ్రాసిన 'సీమంతినీపరిణయ' మందు పినవీరభద్రునిగుఱించియుఁ దద్వంశమునుగుఱించియుఁ జాల విలువయైన యంశములను వ్రాసియున్నాఁడు. తన్మూలముగా నీమహాకవినిగుఱించి యెక్కుడు సంగతులను దెలిసికొనఁ గలుగుచున్నాము.

గాదయ్యనాగమాంబలకుఁ జాలకాలము సంతానము లేకపోవుటచే దక్షిణమున నున్నయొక శైలగుహలోఁ దపస్సు చేయుచున్న భారతీతీర్థు లనెడు యతివరు నుపాసించి యాతనివలన మంత్రోపదేశము నొంది యిద్దఱుకవల పుత్రులఁ గనిరి. వారిలోఁ బెద్దవాఁడు పెదవీరభద్రుఁడు, చిన్నవాఁడు పినవీరభద్రుఁడు. పినవీరభద్రుఁడు పుట్టుకలోనె యొకజడ ధరియించెనఁట! కాలక్రమమున వీరిద్దఱుఁ బెద్దవారైరి. పెదవీరభద్రుఁడు రాజ్యకార్యదక్షుఁడై కర్ణాటకరాజులకొలువుప్రవేశకుఁ బోయి డెబ్బదివేలసామంతులకు నధికారియై మంత్రివరేణ్యులచే నుతినొంది గొప్పయశస్సు గాంచెను.

రెండవవాఁ డగు పినవీరభద్రుఁడు వీరేశ్వరునియవతారమే యనఁదగినట్లు సకలశాస్త్రంబుల నభ్యసించి కాళిదాసాదిమహాకవులవలెఁ గావ్యరచనఁ జేయఁగల సమర్థుఁ డయ్యె.

పినవీరభద్రున కిద్దఱుపుత్రులు గలిగిరి. (1) వీరన్న (2) మల్లేశ్వరుఁడు. మల్లేశ్వరుఁడు కటకపురిరాజుల, అనఁగా గజపతుల యాస్థానమున నుద్యోగియై తనకార్యదక్షతాఘనతఁ జూపించి యారాజుచేఁ బెనుమళ్ళగ్రామమును బహుమానముగా నొంది యాగ్రామమున నివాస మేర్పఱుచుకొనెను. ఆకారణమునఁ బిల్లలమఱ్ఱి యనునింటిపేరు పోయి పెనుమళ్ళ యని యింటిపేరు వచ్చినది. మల్లేశ్వరున కిద్దఱుకొడుకులు—వీరన్న, సోమేశ్వరుఁడు. వారిలో వీరన్నకు సర్వన్న యను సుతుఁడును, ఆసర్వన్నకు పెద్దాంబయందు సలుగురు

శృంగారశాకుంతలమందలి యాశ్వాసాంతగద్యమున "ఇది శ్రీభారతీతీర్థ గురుశ్రీచరణకరుణాలబ్ధ సిద్ధసారస్వతపవిత్ర......" యని యున్నది. ఈ భారతీతీర్థులవా రెవరో మనకు స్పష్టముగాఁ దెలియదు.

పినవీరభద్రకవి రచియించిన గ్రంథము లీక్రమముగా నున్నవి గాని, వానిలో మన కిప్పటికి లభించినవి రెండుమాత్రమే.

సీ. రచియించినాఁడవు రమణీయవాగ్రీతి *నవరసదర్పణం బభినవముగఁ
బలికినాఁడవు తేటపడఁజేసి నారదీయము సత్కవిశ్రేణి యాదరింపఁ
జెప్పినాఁడవు శేముషీవిశేషంబున మాఘమాహాత్మ్యంబు మంజుఫణితిఁ
గావించినాఁడవు ఘనబుద్ధి మానసోల్లాససారము సముల్లసితశయ్య
భారతీతీర్థయతిసార్వభౌమగురుకృ, పాతిశయలబ్ధకవితావిభూతి గలిగి
గౌరవముగాంచినాఁడవు కవులచేత, విపులచాటూక్తినిర్నిద్ర వీరభద్ర.

ఈపద్యమును, దనశృంగారశాకుంతలమునఁ గవియె చెప్పుకొనెను. దీనియందుఁ బేర్కొనిన †నాలుగు గ్రంథములును నామమాత్రావశిష్టము లైనవి. ఈమహాకవికృతులలో మన కిప్పటికి లభించినవి (1) శృంగారశాకుంతలము, (2) జైమినిభారతమును—బహుశః యీరెండే ప్రౌఢగ్రంథము లగుటచేత విస్మృతిలోకమున సుఖనిద్రఁ జెందక యీనాలు గైదువందలసంవత్సరములనుండియుఁ బాఠకమహాశయులహృదయసీమలయందు గౌరవస్థానము నలంకరించియున్నవి.

## — శృంగారశాకుంతలము —

భారతమందలి శకుంతలాదుష్యంతులకథను 'శృంగారశాకుంతల' మనెడుపేరిడి ప్రబంధరూపముగా విరచించెను.

గీ. కథ ప్రసిద్ధము మిగులశృంగారవతియు, బరిగణింపఁగ శ్రీమహాభారతమునఁ
గథిత మైనశకుంతలాఖ్యానభంగి, నది ప్రబంధముఁ జేయు ప్రఖ్యాతినొంద.

---

* అవతారదర్పణ మని సోమనామాత్యుఁడు చెప్పెను. అదియే సరి యైనపేర మని తోఁచుచున్నది.

† ఇవిగాక 'పురుషార్థసుధానిధి' యను గ్రంథము కూడ రచించెనఁట. అదియును లభ్యముగాలేదు. విద్యారణ్యులు పురుషార్థసుధానిధి యను గ్రంథము రచించిరి. దాని కిది తెనుఁగై యుండునేమో. తైత్తిరీయభాష్యసారమునకు మానసోల్లాస మను పేరు గలదు. దానిసారమే యితనికృతి యై యుండవచ్చును.

గీ. భారతప్రోక్తకథ మూలకారణముగఁ, గాళిదాసునినాటకక్రమముతోఁత
తావకోక్తికి నభినవశ్రీ వహింపఁ, గూర్మికృతియయ్యె నాకు శాకుంతలంబు.

అని కృతిపొందిన విల్లర వెన్నయామాత్యుఁడు కవితోఁ జెప్పెను.

సంస్కృతనాటకములను ప్రబంధములుగా భాషాంతరీకరణము సేయుట.

భారతమందలికథను, కాళిదాసునిప్రసిద్ధనాటకక్రమమునుఁ బాటించి యాంధ్రప్రబంధముగా నితఁడు రచించెను. ఈసాన్నిధ్యమున నొకజటిలప్రశ్నకుఁ బ్రత్యుత్తర మాలోచింతము. సంస్కృతనాటకరాజములను నన్నయపూర్వకవు లాంధ్రప్రబంధములుగా ననువదించిరి గాని, యాంధ్రనాటకములుగాఁ బరివర్తింపలేదు. విద్ధసాలభంజిక యను సంస్కృతనాటకమును మంచనకవి 'కేయూరబాహుచరిత్ర' యను పేరఁ బ్రబంధముగా మార్చెను. నిసురభిప్రనికి సమకాలికు లగు (జంటకవులు) నంది మల్లన్న, ఘంట సింగన్న యను వారు కృష్ణమిశ్రుని ప్రసిద్ధనాటక మగు 'ప్రబోధచంద్రోదయము' నాంధ్రప్రబంధముగా ననువదించిరి. రావిపాటి త్రిపురాంతకుని 'ప్రేమాభిరామము'ను శ్రీనాథుఁడు క్రీడాభిరామ మను ప్రబంధముగాఁ జేసెను. మురారికవి రచించిన యనర్ఘరాఘవమును బిజ్జల తిమ్మకవి ఆంధ్రప్రబంధముగా రచించెను. ఇట్లింకను మఱికొన్ని దృష్టాంతములను గనుపఱుపవచ్చును. ఆంధ్రకవులు సంస్కృతనాటకములను జదివియు నాటకసూత్రములు గ్రహించియు నాటకములుగా వ్రాయక ప్రబంధములుగా వ్రాయుటకుఁ గారణ మేమి ?

ఈవిషయమునుగుఱించి యిదివఱలో నే వ్రాసిన "ఆంధ్రనాటకములు, రంగస్థలములు" అను గ్రంథమునందుఁ గొంతవఱకుఁ జర్చించితిని. ఆభాగము నిచ్చట సందర్భానుసారముగ దెలుపఱచెదను.

సంస్కృతనాటకములు సుమారు రెండువేలసంవత్సరములయి మన దేశమందుండియు, విశేషతః ఆంధ్రదేశమున, పదిపదునైదువందలసంవత్సరములనుండి చదువఁబడుచుండియు నాంధ్రభాషలో మాత్రము ఇప్పటివఱకు నిజమయిన నాటక మొక్కటియుఁ గానరాకుండుట యందఱకు నచ్చెరువు గలిగించుచుండిన విషయమే. సంస్కృతనాటకములను బండితులు చదివి సంతోషించిరే గాని యనుకరణమైనఁ గావింపరైరి. దీనిని గుఱించి పలువురు పలువిధములయిన యభిప్రాయములను జెప్పిరి గాని ముఖ్యముగా నాదృష్టికిఁ దోఁచినకారణ మేమన, మనవాఙ్మయములో సంస్కృతమునందుఁగాని మఱి

యే హైందవభాషయందుఁ గాని పొడసూపని ప్రబంధస్వరూప ముత్పత్తియగుటయే యని చెప్పఁదగియున్నది. మన ప్రబంధములు సంస్కృతనాటకములకును, సంస్కృతకావ్యములకును మధ్యవర్తులు. వీనియందు నాటకముల యొక్కయుఁ గావ్యములయొక్కయు లక్షణములు సామాన్యముగ నుండుటచే వేఱుగా నాటకములు వ్రాయ నవసరము లేకపోయినది. ఇటీవల నాంగ్లేయ వాఙ్మయమునందలి యనుభవము గలిగిన కొలఁది నాభాషయందున్న నవలలను నాటకములను మనవారు చదివి యామూర్తులను బట్టి ప్రతిమూర్తులను సృష్టింపఁజేసిరి.

ఇతర ద్రావిడవాఙ్మయములు, అనఁగా, అఱవమునను, కన్నడమునను బరీక్షించినను, పైఁజెప్పిన సిద్ధాంతము స్థిరమే యైయున్నది. ద్రావిడకర్ణాటక భాషలకంటె మనభాషయం దెక్కుడు సౌకర్య మొకటి కలదు. అదేదన:— ఆభాషలయందు వలెఁగాక మన ప్రబంధములు గీర్వాణనాటకములవలె, నయిదాఱాశ్వాసములతోఁ బూర్తిఁ జెంది కథ యంతయు నాటకసర్ణయపరిమాణములను మించక యుండును. ద్రావిడ కర్ణాటకములలో నట్లుగాక కొన్ని ప్రబంధము లిరువది, ముప్పది యాశ్వాసములవఱకు విస్తరించి, సంస్కృతకావ్యములఁ బోలియుండును. అనఁగా నాంధ్రప్రబంధములు సంస్కృతనాటకములవలెను, ద్రావిడ కర్ణాటక ప్రబంధములు సంస్కృతకావ్యములవలెను నిర్మాణక్రమమును సూచించుచున్నవి. కావున విద్యాభ్యాసు లగువారికి నాటకములకు బదులుగాఁ బ్రబంధములు చేకూర్పఁబడినవి.*

— శృంగారశాకుంతలము —

ఈ పేరునకుఁ గారణము :—కాళిదాసుని శాకుంతలము నాధారముగాఁ గొని పినవీరభద్రుఁడు శృంగారశాకుంతల మను గ్రంథమును వ్రాసెను. ఈ గ్రంథమునకు శృంగారశాకుంతల మనునామ మిడుటకు బహుశః శ్రీనాథుఁడు తాను రచించిన నైషధప్రబంధమునకు శృంగారనైషధ మనిపే రిచ్చియుండుటయే

* పామరజనులకు 'వీధినాటకములు' 'భాగవతములు' రచియింపఁబడినవి, ఈ గ్రంథములు సైతము గొప్పకవులచేతనే వ్రాయఁబడినవి గాని హీనప్రజ్ఞులకు విడిచిపెట్టఁబడలేదు. ఏమహానుభావుఁ డయినను ప్రాచీనకాలమందలి భాగవతము లాడుటయే వృత్తిగాఁగల కూచిపూఁడి, గడ్డిపూఁడి మొదలగు గ్రామములనుండి యీ గ్రంథములను సంపాదించి యాంధ్రనాటకవాఙ్మయచరిత్రమును సవిమర్శదృష్టితో విపులముగా వ్రాసిన నెంతయో దేశసేవ యొనరింపఁగలఁడు.

యని చెప్పవచ్చును. శ్రీనాథుని వెనువెంట వచ్చినకవులలో ముఖ్యముగా పినవీరభద్రుఁడా మేటికవి ననేకవిధములుగా ననుసరించెను. పాండిత్యమునను, కవిత్వశైలిని, శృంగారరసవర్ణనములను, సీసపద్యముల గడనంపుపొందికను నీకవి శ్రీనాథుని జాలవఱకు ననుసరించియున్నాఁడు. శృంగారరసవర్ణనమువిషయములో బహుశః శ్రీనాథునకుఁ దాను సమానుఁడ నయినయట్లు నీతఁడు భావించుకొని యుండె నని యూహించుట పొరపాటుకాదు.

కృతిపతిప్రశంస :— నెల్లూరుజిల్లాలో, కందుకూరుతాలూకాలో నుండు బిట్రగుంటకు సమీపమున నున్న సామరాజుపల్లెవాసు డగుచుండిన వెన్నయామాత్యున కీగ్రంథము కృతి నొసంగఁబడినది. వెన్నయామాత్యుఁడు కవితో నిట్లు ప్రసంగించెనఁట.

గీ. కలదు చాలంగఁ బ్రేమ నీవలననాకు, వేడ్క నరిగెదఁగథపల్కి వేడ్కఁదీర్చి
షట్సహస్రకులోద్భవసచివులందు, సుకృతిగాఁజేయు నాకొక సుకృతిఁ జేసి.

కావున వెన్నయామాత్యుఁ డారువేల నియోగి యని స్పష్టము. అతఁడు కౌండిన్యగోత్రుఁడు. నాగయామాత్యునకును పోలమాంబకును బుత్త్రుఁడు. ఉన్నతరాజకీయోద్యోగము గాని మఱి యేవిధమయిన ప్రతిష్ఠానహముగుపదవి గాని గలిగియుండినట్లు గాన్పింపలేదు. బహుశః గొప్పభూస్వామియై ధర్మకార్యానుష్ఠానపరుఁడై సత్పురుషసమాగమముఁ గావించి తనజీవితముఁ బుణ్యవంతముఁ జేయుకొనుటకు గలిగి యుండెననుకొనుటకు. ఈశ్వరభక్తుఁడును, నిత్యసోమవారవ్రతదీక్షాకలితుఁడు నై బ్రాహ్మణ సమారాధనలు చేయుచుండెను. ఇట్టి శుద్ధచరిత్రున కీగ్రంథము కృతి సమర్పణ చేయఁబడినది. బహుశః యీకృతి సమర్పణకాలమున కింకను పినవీరభద్రకవి గర్ణాటసంస్థానములోఁ బ్రవేశము గలిగి యుండలేదు. అతనియన్న యుద్యోగము చేసినతరువాత నితఁడుగూడ యారాజాస్థానములోఁ గవీశ్వరప్రఖ్యాతి నొందఁగలిగెను. ఆసమయమింకను వచ్చియుండలేదు.

ఈశాకుంతల ప్రబంధకృతిసమర్పణములో నొకచిన్న వింతసంగతి కానఁబడుచున్నది. అది చూడ బహువిచిత్రముగానున్నది కావునఁ గొంతవిపులముగా వ్రాసెదను.

ఈగ్రంథమందలి యాంధ్రకవిస్తుతిలో నన్నయభట్టును, తిక్కన సోమయాజిని మాత్రమే యీకవి పేర్కొనెను. (సశేషము.)

# నవ్యకవిత

— అత్తిలి సూర్యనారాయణగారు —

ఈలోకములో మానవునకుఁ దీప్తతమమయూఖమును, ప్రధానతమాభియోగమును గల్గునప్పు డేకార్య మొనర్చినందున నిట్టివి తటస్థించినవి యని మనస్సు వితర్కించుకొనుట సాజముకదా! సాధారణముగ మనస్సునం దసహిష్ణుత పొడము చుండుటచేతనె యుద్ధము లుద్భవించుచున్నవి. సంసారమునం దెవ్వరు ప్రవేశించుచున్నారో వారి కిది యొకనూతనాంశము గాదు.

మనస్స్థైర్యమహామంత్ర మేమానవునిమానసము నాశ్రయించు, నమ్మానవుని మహాపురుషనామమున వ్యవహరించుచున్నారము. అట్టివానిమానసికక్షమయు, మస్తిష్కశక్తియు సాధారణపురుషుల కగ్రాహ్యమై యుండును. పాండితి యనునది యొకవ్యవస్థ. అది సాధారణధీమంతులకు సహృదయత్వమువలనను, బుద్ధివిశేషమువలనను గలిగెడిది. ఎవ్వరియెడఁ బ్రకృతి, విశ్వలక్ష్మి, కృపణముగా నుండునో వారిని జ్ఞానముసహితము కరుణింపఁజాలదు.

సర్వాంగశిక్షాద్వారమున నెవ్వరిచిత్తము వికసింప దో, వారీధరాతలమున నేవ్యాపారమర్మములను గ్రహింప నేరరు. ఏవిషయసంబంధమునను వారుభయపక్షములఁ జూడ నేరనివారై యుంటచే, నెట్టిన్యాయసిద్ధాంతమును సరళముగాఁ జేయఁజాలరు. జాతీయవిచిత్రభావముల, విచిత్రచింతనల, తెన్నుగా నారయ నేరనివారు సంపూర్ణరూపమున మానవు నెట్లు గ్రహింప నేర్తురు ?

జగత్పరివర్తనశీలము నెవరు చింతామూలమున గ్రహించి, తన్మధ్యమున నిజసంయోగమును సంరక్షించుకొందురో వారు నిర్మలచిత్తముం గలిగి వెలుఁగు చుండ, సంశీర్ణమనస్కులు బాధాజలమున మునింగి యల్పిష్ఠతచే దుర్గంధమును వెలిఁగ్రక్కు చుందురు. మనయాంధ్రభాషాప్రపంచమున, అన్నమయ, మనోమయ, ప్రాణమయ, విజ్ఞానమ యానందమయము లన నొప్పు పంచకోశములలో సాధారణముగా నొక్కొక్కట సంచారముచేసి, తదనుభవములను వెలార్చినమహాకవులు కొందఱు కలరు. అందు, ప్రథమద్వితీయము లైన యన్నమయమనోమయకోశములలో సంచారము చేయఁగలిగి, వర్ణనప్రాధాన్యము లయిన సంబంధములలో స్వకీయకల్పనావిశేషములను మంజు

లక్షణోక్తిని బ్రోదిసేయఁ గల్గినకవిరాజులు కొందఱు కానవచ్చుచున్నారు. మఱికొందఱు ప్రాణమయకోశపరీక్షణమునుసహితము గమనించి, అన్నమయ మనోమయకోశముల సామంజస్యమును స్థాపించియు, ప్రాణసంగ్రహసిద్ధనాడులఁ గొంతవట్టు గ్రహియింప నోపినమహానుభావులు పొడకట్టుచున్నారు. చేతనము లైన, నచేతనము లైన, నొక్కప్రాణములోఁ గట్టుకొనుచు జట్టుమును చుండుటయు, పరస్పరసహానుభూతిచేఁ బరిఢవిల్లుచుండుటయు, మనోవిజ్ఞానమునకును భౌతికవిజ్ఞానమునకును నైతికదర్శనమునకును (Moral Philosophy) సన్నిహితసంబంధము వెలయుటచేత నిత్యసంయోగానుభవము లేర్పడుచుంటయు, విశ్వజనీనమైన బృహదాత్మానుభవములనుబట్టి సకలభేదములు యథాయథలయి సమానములై యొకటి యైక్యమునై పోవుటయు గ్రహించి లోకమును క్రొంగ్రొత్తసరళిమార్గమునఁ బ్రవర్తింపఁజేయఁగల సత్కవులెందఱెందఱో యవసరమై యున్నారు. కృష్ణప్రభువు, దేశనాయకులు, నవనవలాభమును గ్రహింప దక్షులయినసన్న్యాగాయకు లెందఱెందఱో యవసరమై యున్నారు.

విచిత్రతామధ్యమున నైక్యమై, యైక్యమధ్యమున సంసారమును గ్రహించుటయె సర్వధర్మరహస్యము. మానుషాంతఃకరణము వివిధవస్తువులయ ముల వినూతనకల్పనములఁ జేయుచుండుట సాజము. ఇట్లు నవనవసృష్టి విసర్జితమైనదే మనస్సు. ఈయంతఃకరణసంసృష్టసామగ్రిచేతనె, కావ్యసాహిత్యలక్షణము సంక్రామితమై యున్నది. ప్రాచీనకావ్యములను నవ్యకవితను బరికించినచో, నీయంశము స్పష్టపడుటకు సందేహము లేదు. ప్రాచీనకవిత జగదితిహాసమునఁ జాలకాలము స్థాయీభావమును వహించి యున్నదని గ్రహింపఁబడినతోడనే నవ్యకవిత తల యెత్తుచున్నది. చీనాదేశప్రాచీనకవిత దీనికి దృష్టాంతము. ఒకటి యనాదిసము, మఱియొకటి పరిణామము; ఒకటి విశుద్ధము (Classic); మఱియొకటి కల్పితము, ఒకటి యుత్సాహము; మఱియొకటి యుచ్ఛ్వాసము. జర్మనీకవి యొకఁడు పురాతనవిగ్రహవిన్యాసము పరిమితమును మాత్రమే వర్ణింపవలసియుండె ననియు, కవిత్వభావమునకుఁ దుల్యముగానే యది యుండఁగల్గె ననియు, నవ్యకళాకవిత్వము లన్ననో యపరిచ్ఛిన్నము, నాధ్యాత్మికము నగుతత్త్వమును వ్యక్తముచేయవలసియున్న వనియు వచియించియున్నాఁడు. జరిగిన దెల్ల సరిగా వర్ణించుటకు, కవి చరిత్ర

కారుఁడు కాఁడు! పాఠకలోకమున కూహింపఁ దగుబుద్ధిశక్తు లున్నవని యంగీకరించి, కొన్నివిషయములు వారిభావనాశక్తికె విడిచిపెట్టవలయును.

ఇట్టికవిత్వమువలన నధికతరప్రయోజనములు కల వని గ్రహించినమనీషులు మనము ప్రాయికముగా మతముగా భావించుదానియందలి విశేష మెల్ల నం దజ్ఞాతముగాఁ గవిత్వము వెలయుచుండుటే గనుక, నింతవట్టును జనసామాన్యమునకుఁ [illegible] దానికన్న మిన్న యగునుపయుక్తి దాన సమకూడు ననియు, నున్నతగతు లందఁజేయు నది సాధనము గావచ్చు ననియు, నిర్ధారించుచున్నారు. మనము తన్నూతనమార్గములను బ్రదర్శింపవలసియున్నది. ఏనాగరికలోకమందైనను నప్పుడల భావసూచనల వెదచల్లుచు, భావగర్భితమై యనంతవ్యంగ్యమై యుండు నదే యుత్తమకవిత. విశ్వము నెల్ల వెల్లడించుటలో నతిసమర్థమైనది కవిత్వమే గనుక నదియే [illegible] దగ్రగణ్యమైనది. కవినేత్రము దివ్యదృష్టితో రోదసీకుహరాంతరమున దివినుండి భువికిని భువినుండి దివికిని బరిభ్రమించుచుండును. ఇట్లు ద్యావాభూముల నొక్కపెట్టున సమరసభావమున మేళవించు నవ్యకవితయందలిభావములును గవిహృదయమున సమగ్రముగ, సలలితముగ, నైక్యముం బూని నెమ్మది కెంతయు సంతృప్తిఁ గలిగించుచుండును. హృదయరాగములు వక్తృతావిశేషములతో వెల్లడి యగునది కవిత్వమునందే కాని యుపన్యాసకళలందుఁ గాదు. ఎద్దానిని గూర్చినభావమైనను విస్పష్టగతిని బ్రదర్శింపఁగల్గునది కవిత్వమే సుఖప్రదమైనను దుఃఖజనకమైనను, ఉచ్చమైనను, నీచమైనను, మానసము నుప్పొంగించునదియైనను, గ్రుంగించునదియైనను, బ్రతివిషయమునను భావస్ఫురణమును వెలార్చునది కవిత్వమే. దృశ్యమును భావమును సమగ్రముగా నైక్యమందునది కవిత్వమందే. హృదయప్రపూర్ణభావములు కవితారూపమునఁ గాక యన్యవిధమున బయల్పడనేరవు. సద్యస్సంతృప్తి గలిగించున దదియే. జ్ఞానమునకైనను, భావనకైనను, సుఖాంత్యములకైనను దుఃఖాంత్యములకైనను, ప్రసాదమునకైనను విషాదమునకైనను, ఈసహజప్రవృత్తియే మూలకారణముజీవిత సామాన్యవిషయముల నారసి పరమార్థములుగా మార్పఁగల్గువాఁడే మహాకవి. ఆంధ్రవాఙ్మయమున వేమనయోగీంద్రునికవిత్వమహత్వమిట్టిదే. ఆతనిమనశ్శక్తి నానావిషయద్వారమున సూక్ష్మస్ఫురణమొంది వెలుఁగొందుచున్నది. కవిత్వమున కందరానిది లేదని యదియె సూచించుచున్నది.

మున నాటునది గాకయున్న, నింకఁ గవిత్వ మెందునకు ? ఏవో కొన్ని గణములతో బద్ధమై యుండునదే కవిత్వమని పలువురు భావించుచున్నారు. అట్టిది పద్యమగునే గాని కవిత్వ మనిపించుకోనేరదు. ఎచ్చోటఁ బ్రకృతి సామరస్యము వహించి ప్రభాతవేళ విశ్వేశ్వరునకుఁ గుసుమాంజలి యెత్తి కలకలారావముల మంగళగీతములు పాడుచు, దివ్యభానూదయము నాహ్వానముచేయుచుండునో యచ్చోటనే కవిత్వాంకురములు లేకయున్న, మఱి యెందుండఁగల్గును ?

మనోభావమును భావనాశక్తియు సహజగతి నాత్మప్రకటనము గావించుకొను నాత్మరూపభాషయే కవిత్వము. మనమనసునకు సద్యస్సుఖదుఃఖానుభూతి గలిగింప హేతు వగుదాని కెల్ల కవిత్వసంబంధము గలదు. ఎట్టియెట్టి హృదయములు గలవారి కైనను, మఱి యెట్టెట్టి వ్యాపారముల మునిఁగియున్నవారి కైనను మనసున నప్రయత్నముగా నాటునదె గాకయున్న నది కవిత్వమున కెత్తినవిషయమే కాకయుండును. ప్రకృతిని జీవాత్మను నిత్యసంబంధమున నిల్పియుండనేర్చు లోకసామాన్యభాషయే కవిత్వము. ఈకారణమున నె మనలో నెవ్వరేని గవిత్వము నెడ సహజముగా ద్వేషము గలవారుందు రేని వారి కాత్మగౌరవము లేదన్నమాటయే ; మఱి దేవియెడను వారి కాదరము హుళిక్కి యన్నమాటయే.

మానవజీవితమూలనార మంతయు నున్నది కవిత్వములోనే. తక్కిన దెల్ల మిథ్యయే ; నిర్జీవమే. మానవజీవితమునఁ జిరస్మరణీయమైనది జీవనకవితయే కాని మఱి యొండు లేదు. దిగులే కవిత ; ఆసయే కవిత ; ప్రేమయే కవిత ; ద్వేషమే కవిత ; అసూయావిషాదములు, నిరాశాదాక్షిణ్యవిస్మయోన్మాదములు సమస్తము, సమస్తము, కవిత్వమే. స్థూలమైనయీబొందికి సూక్ష్మరూపముఁ బ్రసాదించి మెఱుఁగువెట్టి వియన్మార్గమునకుం గొంపోయి సర్వోన్నతపదవి నందించునది యదే. కవిత్వరహితమైన మనుగడ పశుజీవనతుల్యము. తాను మాటాడునట్టి దేదో యెఱుఁగనేరని యొకమూఢమానవుఁడు, “స్వామీ ! గద్యము, గద్య మనుచంద్రు ఆదేలాటి దని” యడిగినట్లుగా మనలోఁ బల్వురము సాహిత్యశాస్త్రమర్మముల నెఱుఁగకయున్నను, సహజకవితాజీవనమునే గడపుచుందుము. తొల్దొల్త డాఁగురుమూఁతలాడు బాలకుఁడు కవియే ; బకాసురుని వధించినభీమునికథయో హనుమం

నే మనసునఁ దట్టును. కనుకనే యవి కేవలశబ్దాలంకారములతో వెలుఁగు వానివలెఁ గాక, దివ్యఫలప్రదములై యొప్పును. మఱి యీ హేతువుననే, మన లనెన్వరైన నట్టిపద్యమున కర్థ మడుగునప్పుడు, "దాని కదే యర్థ" మనియె మనము చెప్పనేర్తుము.'

సకలకళలందు నాద్యంతములఁ బొల్చునది కవిత్వమె యనుమాట విస్మరింపరాదు. మానవహృదయమువలెనే యదియు నాశరహితమైనది. నవ్యకవీశ్వరుఁడు ప్రకృతిశాస్త్రజ్ఞానానుగామియై యుండియును, ప్రకృతిజన్యపదార్థములకు మఱింత వన్నె వెట్టుచుండును. ఆతనిపద్యములు సుందరములుగా నున్నఁ జాలదు. మఱి మాధుర్యమును గలిగి యుండును. బాహ్యప్రకృతి యిత్తడిగానే యున్న, నవ్యకవి దానిని స్వప్రతిభావిశేషమున పుత్తడిగా మార్పఁగల్గును. ఎవ్వనిసుకోమలమనోవృత్తులు క్రమముగా వీణాతంత్రులనుండి యేక్షణమున వెల్వడ నారంభించునో యాక్షణమునుండియు వానిమనోభావములు మనుష్యమనోరాజ్యమధ్యమున నిర్బాధకరములుగా విహారములు సేయఁజొచ్చును.

"కవిః ప్రశస్తోజ్జ్వలవాక్ప్రయోగవిత్"

అని యొకగీర్వాణకవీంద్రుఁడు వక్కాణించియున్నాఁడు.

కవి, కేవలశాస్త్రాదిపరిజ్ఞానమె కాక విశేషలోకపరిజ్ఞానమును గలిగి యుండును. మఱి, కవీంద్రువాక్యములు మహోజ్జ్వలములై, నిరంతరభాసమానములై యొప్పును. సత్యేతరములు గాకయున్ననె యవి యీగుణములతో వెలయఁగలుగుచు, 'కువలయభాసురత్వమునకుఁ వెలిగాక' యుండును. ఉదారభావములతో నొప్పుచుంటకంటె, విశ్వవిధాతపై నాధారపడియుండుటకంటె మానసమును సత్యధ్రువములపై పరిభ్రమింపఁజేయునేర్పుకంటె, నిహలోకమున మఱి యధికస్వర్గసౌఖ్యము కలదా? ఈగుణాధిక్యముచే నెసఁగు సత్కవులను గూర్చియె షెల్లీమహాకవి 'సాధారణన్యాయాధిపతు లంగీకరింపకున్నను, కవీంద్రులే నిశ్చయముగా విశ్వధర్మనిర్ణేత' లని వక్కాణించియున్నాఁడు.

"Poets are the unacknowledged legislators of the world."

*          *          *          *          *

ఇట్లు నవ్యకవితాగతు లెఱింగినమహాత్ములు సాధారణముగా స్వప్నగతభూములం దవిచ్ఛిన్నసంచార మొనర్చుచు, స్వకీయభావనాశక్తిప్రభావము నగపఱచుచు, నొక్కచోటన యుండియు మానసమును లోకలోకాంత

"చ. జనని సమస్తభాషలకు సంస్కృతభాష ధరాతలంబునన్
ఘనలలితార్థగౌరవవికాసి తెనుం గతిరమ్య మంతకున్ ;
గనుఁగొనఁ జాతబీజమునకంటెను గోమలపత్త్రపుష్పశో
భనమృదుపల్లవాభినవబాలరసాలము సొంపు నింపదే ?

ఇట్లు మనయాంధ్రభాషను దేవభాషనుండి యుదయించినదానిఁ గాఁ జెప్ప నభిలషింతు మేని, దానిమూలమున నాంధ్రులమానసములు ధర్మేతరములు గాని యనురాగములతో నిండి యుండునట్లు చేయఁ గడంగవలయును. వారిచిత్తవృత్తు లెల్లఁ బరమేశ్వరునియందు సంచరించునట్లు చేయవలయును.

స్వేచ్ఛావిలసనము గలవారె సాధారణముగా నపుడపుడు మానవహృదయమునఁ గల్గుచుండు దేవతావిర్భావమును జెడిపోకయుండునట్లుద్ధరించుచుందురు. అట్టిమహోన్నతకవిత్వమునకు 'అలెగ్జాండరుబేన్' నుడివిన చందమునఁ గేవలప్రకృతియె మూలాధార మని కాని, పరమాదర్శమని కాని నిర్ణయింపనేరము. కావుననే కవితామూలములు ప్రకృత్యతీతములై యాత్మగమ్యము లగుచున్నవి. నిగూఢమనీషకు నిమ్నోన్నతప్రమాణము నిర్ణయింపనెవరితరము ? అదిప్రకృతిశాస్త్రపరిశోధనల కందరానిద కదా ? అయినను, దాని మూలమున మనసంతతివారికి యుగాంతరముల నైనఁ బరమధనమును భద్రపఱుపఁగలుగుచున్నాము. వారి ధీశక్తులు వికాసమందఁ దగు తెరువులఁ దెలుపఁ గలుగుచున్నాము. అట్టిశ్రేష్ఠకవిత భావికాలమున సంధుల కక్షీరదానమువంటి దగును. అది యానందమయమై యుండఁగలదు. ఈయంశమును నెమ్మనమ్మున నిల్పుతోడనె షెల్లీమహాకవివిరచితమైన యీపద్యార్థము జ్ఞప్తికి వచ్చును.

> "Sing again with thy sweet voice revealing
> A tone of some world far from ours
> Where music and moonlight and feeling are one",

గీ. అమలగానంబు జ్యోత్స్నయు నమభవంబు
మేళవించెడిలోకంబు నాలపించి
తమకు దవ్వగు నవ్యలోకమును గూర్చి
గానమొనరింపవయ్య ! సత్కవివతంస !

ఈపద్యము నర్థము గ్రహించులె ప్రకృతివిషయఫలము. ఇట్టి "కవితాఖ్యాత గల్గిన రాజ్య మేటికి ? కను నర్థమున భర్తృహరిమహాకవీంద్రుఁడ కదా, సుకవితా యద్యస్తి రాజ్యేన కి"మ్మని వచియించియున్నాఁడు ?

కళలకును సంఘములకును సంకుచితత్వమే యేర్పడి క్షుద్రమానవసంప్రీతియె జీవితాదర్శమై వారిసద్ధర్మము పదటిపాలై పోవును. అంతకంటె ప్రళయము గలుగునని భావింపఁ గలమా ?

మస్తిష్కమండలి సహస్రదళపద్మమునందు రసమె లేకయున్న నంత ర్వీక్షణము నెఱుంగకున్న, భక్తిశూన్య మగుచున్న, బరిణతచిత్తమున నానంద మొక్కటి వంచించుచున్న నింకఁ గవిత్వమెక్కడ ? భక్త్యావేశపరవశు లైన హేతువుననెకదా, విశేషపాండితి నెఱుంగనివా రని యెన్నంబడు బమ్మెరపోతనామాత్యుఁడును వేమనయోగీంద్రుఁడును నిరుపమానకవిత్వముం జెప్పఁగల్గిన వారైరి ? వా రట్టివారు కాఁగల్గుటకును పలువు రితరులు వారిసీడనైన నడుగులిడఁ జాలకుంటకును గారణము వే తెయ్యది కలదు ? మన శతకకవులు కొందఱు చూపిన జీవకవితాగతులు పెక్కండ్రకు లభింపమి కీభక్త్యభావమే హేతువు.

మనభావముల స్వచ్ఛతవలననె మనజీవితమును స్వచ్ఛతరమయ్యెడు నని John Morley యను ధీశాలి Vauvenargues అను పరాసీకవీశ్వరుని గూర్చి వ్రాయుచు, 'It is by our ideas that we ennoble our passions or we debase them ; they rise high or sink low according to the man's soul.'' అని తెల్పినవాక్యమందలి యాథార్థ్యమును గ్రహించి కవీశ్వరులు కాఁగోరువారు పరిశుద్ధాత్మభావములం గలిగియుండవలయును.

సంసారవిషవృక్షమున సజ్జనసాంగత్యము కావ్యామృతరసాస్వాదనము ననునవి రెండే సర్వోత్తమరసవత్ఫలము లని సంస్కృతకవి వచించినాఁడు.

వాగ్మిత గాదు కవిత ; వాచాలతయుఁగాదు కవిత ; రసికతయుఁగాదు కవిత. మనమానసమున నూహింపఁగా, నూహింపఁగా, నుద్భూత యగునదియుఁ గాదు కవిత. ప్రభాకరుఁడు గగనతలమున నెగయువేళ, స్వయంప్రకాశత్వముతో జగత్ప్రకాశత్వమును సమకాలముననె సమకూర్చుచున్నవి కదా! నవ్యకవితయు నట్టిదే.

సహజముగఁ బరిశుద్ధమానవహృదయమునఁ బొడముచుండు భావములవలననె నవ్యకవిత నితాంతసుగమ మై వజ్రసముత్కరభాసమాన మై సుస్థిరమై చిరనూతనజీవనమును బ్రసాదింపఁగలుగుచున్నది.



# కళింగదేశ వృత్తాంతము

—: శ్రీ విక్రమదేవవర్మగారు :—

[౧౯౩౭వ సంవత్సరమున జూను నెల ౧౬-౧౭ తేదులయం దాంధ్రేతిహాసపరిశోధకమండలివారిచే ముఖలింగమున జరుపఁబడిన కళింగదివసోత్సవసమయమునఁ జదువఁబడిన వ్యాసమునుండి యుదాహృతము.]

క్రీస్తు సప్తమశతాబ్దమునందు గాంగవంశజులు మధ్యకళింగమును వశపఱుచుకొని భువనేశ్వరమునందుంబలె నీముఖలింగమునందుఁ బెక్కు శివాలయములను నిర్మించి, పుణ్యక్షేత్రమున సర్వదా నివసించుట యపచారహేతువగునేమో యని శంకించి దీనికి ననతిదూరమున నున్న నగరకటకమునందు వసించుచుండిరి. వారు నిజనగరమునకుఁ దమ ప్రాచీనరాజధానియైన కటకముయొక్క పేరును జేర్చి నగరకటకమను నామమిడుటయును నేఁటికి నేఁటేఁట రెండుమాఱులు శ్రీముఖలింగేశ్వరుఁడు నగరకటకము వెళ్లుచుండుటయును బైని బేర్కొనఁబడిన నానుడులను స్థిరపఱిచెడిని. నగరకటకము వాడుకలో నగరికటకమయినది.

కొన్ని తామ్రశాసనములందు "గాంగవంశ" మనియును మఱికొన్నింటియందు "గంగవంశ" మనియు నుండుటవలనను, "గాంగవంశ" మనియున్న శాసనములలోఁ గొన్నింటియందు గోత్రము లిఖింపఁబడ కుండుటవలన నవి రెండువంశములని కొందఱందురు. కాని, యట్లనుట సరిగాదు.* "గంగవంశ" మనునది కేవలమపశబ్దము. దానిని వినునపుడు పాణినిని స్మరింపవలసియుండును. "గాంగవంశము" లేక "గంగావంశ" మనుట సమంజసము. "గంగవంశ" మని యుండుటకుఁ గారణము తచ్ఛాసననిర్మాతయొక్క మౌఢ్యమేయగును. వంశమును బేర్కొనిసపిమ్మట గోత్రమును నుడువ నక్కఱలేదని వారు దానిని మానియుందురు. అంతమాత్రముచేత వారిని గోత్రహీను లనరాదు. నిజగోత్రమును జెప్పని మహాకవి- కాళిదాసాదులకు గోత్రమే లేదనుట యుక్తముగాదు కదా. కావున మీఁద సూచింపఁబడిన తామ్రశాసనకర్త లందఱు నేకవంశజులనియే యెఱుంగవలెను. గాంగవంశజులలో నాదిమపురుషశివు చంద్రవంశజుం డయినట్లును, ఆతనిని బెంచిన యాత్రేయగోత్రజబ్రాహ్మణుం

---

* ఇదవిమర్శనీయము. ప. అ.

డా శిశువుయొక్క జన్మవృత్తాంతమును బ్రకటించుచుఁ దాను జెప్పినపలుకుల నిజమును బ్రజలకు నమ్మించుటకు నాతనిని గంగానదియందు వైవ నాశిశు వందు మునుంగక తేలుచు నొడ్డునకురాఁగాఁ బ్రజలాతనిని దమరాజుగా నంగీకరించినట్లును, నాఁటంగోలె నాతఁడు నిజపోషక పితృగోత్రమునే గ్రహించి గంగావంశజుఁడను ప్రసిద్ధిని గాంచినట్లును గింవదంతిగలదు. చంద్రుఁ డత్రి పుత్త్రుఁడగుటవలనఁ జంద్రవంశజాతమాత్రము చేతనే యాతనికి నాత్రేయగోత్రము గలిగెననవచ్చును. తత్సత్యము నారయుట పండితులపని.

ఏతదుత్సవమునకు సంబంధించిన కళింగదేశమును గూర్చి కొన్నినుడుల నిపుడు నుడువుట యుక్తమౌఁగదా. వానిని నా "కళింగదేశ" మను వ్యాసమునుండియే గ్రహింతును. కలిం=కలహం ; గచ్ఛతీతి=ప్రాప్నోతీతియను వ్యుత్పత్తి నిబట్టి కళింగదేశము పూర్వకాలమునందుఁ గలహస్థానమయి యుండినట్లనుమేయ మగును. అందలిజను లీర్ష్యాళువులయి చీటికి మాటికి జగడములు సేయుచుండఁబోలు. అట్లయ్యును గళింగపదముయొక్క ప్రతిపదములు "దక్షః; విదగ్ధః" అని యుండుటవలనఁ దద్దేశజులు సమర్థులును నేర్పరులునై యుండవచ్చును. ఇట్లుండ ననువువంశజుఁడయిన బలియొక్క తృతీయనందనుఁడయిన కళింగుఁడు పాలించుటవలన నాతనిపేరు తద్దేశమునకుఁ గలిగె నని మహాభారతాదిపర్వము ౧౦౪ వ యధ్యాయమున నున్నది.

"చాతుర్వర్ణ్యవ్యవస్థానం యస్మిన్ దేశేనవిద్యతే। మ్లేచ్ఛదేశస్సవిజ్ఞేయ ఆర్యావర్తస్తతఃపరం॥" "అంగవంగకళింగేషు సౌరాష్ట్రేమగధేతథా। తీర్థయాత్రాం వినాగత్వా పునస్సంస్కార మర్హతి॥" అను వచనములవలనఁ జాతుర్వర్ణ్యవ్యవస్థగలిగిన తమ నివాసస్థానమే పవిత్రమయిన దనియుఁ దక్షిణ యంగవంగకళింగాదిదేశము లపవిత్రము లయిన వనియు నార్యుల యుద్దేశ మగుట సుస్పష్టము.

మహాభారతారణ్యపర్వమందలి "ఏతే కళింగాః కౌంతేయ యత్రవైతరణీ నదీ॥" అను లోమశమునివచనమువలనఁ గళింగము వైతరణీనది గలిగినదేశమని తెలియును. "వంగానుత్ఖాయ తరసా నేతా నౌ సాధనోద్యతాన్, నిచఖాన జయస్తంభా న్గంగాస్రోతో౽ంతరేషు సః॥". "సతీర్త్వాకపిశాం సైన్యైర్బద్ధద్విరదసేతుభిః। ఉత్కలాదర్శితపథః కళింగాభిముఖోయయౌ॥" "సప్రతాపం మహేంద్రస్య మూర్ధ్నితీక్ష్ణం న్యవేశయత్। అంకుశంద్విరదస్యేవ యంతా గం

భీరవేదినః॥" "తాంబూలీనాందళై స్తత్ర రచితాపానభూమయః। నారికేళాస వంయోధా శ్శాత్రవం చ యశో మధు॥" అను రఘువంశశ్లోకములవలన వింధ్యమున కు దక్షిణమునన్నున్న వంగదేశమున కీవలఁ గపిశానది (మేదినీపురసమీప మునఁ గల కశాయీనది) గలదనియు దాని కీవలనున్న యుత్కలదేశమున కీవల మహేంద్రగిరితో నొప్పెడి కళింగదేశము గలదనియు నందుఁ దములపుఁ దోఁటలు గలవనియుఁ గొబ్బరికల్లు లభించు ననియును గోచరించును. మఱి యును "ససాగరం సమాసాద్య గంగాయాస్సంగమేనృప। నదీశతానాం పంచానాం కృత్వా చక్రే సమాప్లవం॥ తతస్సముద్రతీరేణ జగామవసుధాధిపః। భ్రాతృభి స్సహితోవీరః కళింగా న్ప్రతిభారత॥" అను మహాభారతారణ్యపర్వ మందలి శ్లోకద్వయమువలన గంగాసాగరసంగమమున కీవల సముద్రతీరమునఁ గళింగదేశ మున్నట్లు సూచిత మగును. "జగన్నాథపూర్వభాగా త్కృష్ణా తీరాంతరం శివే। కళింగదేశస్సంప్రోక్తో వామమార్గపరాయణః॥" అను న ర్వాచీనతంత్రగ్రంథములలోని దగు శక్తిసంగమతంత్ర మందలి శ్లోకమువలన జగన్నాథక్షేత్రము యొక్క పూర్వభాగము మొదలు కృష్ణానదీతీరము వఱ కును గళింగదేశ మనియున్నట్లు తెలియును. కళింగదేశము యొక్క దక్షిణసీమ ద్రావిడదేశ మని కొందఱందురు. కళింగదేశము సముద్రతీరస్థ మగుటవలన నే కళింగపదము సముద్రతీరార్థమున వాడంబడి యున్న దని క్రీ॥శ॥ద్వితీయ శతాబ్దమున నుండిన రోమకదేశవాసి-ప్లిని నుడువ సాహసించెను. ప్రతాప రుద్రదేవగజపతికిఁ బ్రతినిధిగ రాజమహేంద్రవరమున రాయరామానందుఁ డుండి పరిపాలించు చుండినట్లు చైతన్యచరితామృతమునందుఁ జెప్పఁబడి యుం డుటవలనను "గంగాగోదావర్యోర్మధ్యే కళింగదేశే" అని యుత్కళులు సం కల్పసమయమున నుచ్చరించు చుండుట వలనను గంగానది మొదలు గోదావ రీనది వఱకుఁ గళింగదేశ మయినట్లు కొందఱ యాశయము. ఋగ్వేదమున నుత్కల నామము లే నట్లును గళింగనామ మున్నట్లును రాజేంద్రలాల మి త్రుని పలుకులవలన విదిత మగును. మనము వినుచుండు దేశములపట్టియందు న ట్లే యున్నది. పాణినిసూత్రము లందును గళింగనామమే గలదు. అయిన నుపరికథిత రఘువంశశ్లోకములవలన వంగకళింగములకు నడుమ నుత్కల దేశ ముండుట స్పష్ట మగుచున్నది. అందుచేత నేకాంబోలు మహానది మొదలు గోదావరి వఱకుఁ గళింగదేశ మని మఱికొంద ఱనుచున్నారు. ఉపర్యుక్తప్ర

మాణములనుబట్టి యాలోచింపఁగఁ గళింగదేశసీమలను సరిగ నిర్ణయించుట సాధ్యాతీత మని తోఁపక మానదు. నాలుగుజిల్లాలుగ నుండి యాఱుజిల్లాలుగ మాఱిన యుత్తరసర్కారులలో నివసించు చున్న మనకు దేశములయెల్లలను బేళ్లు నెల్లప్పుడు నొక్కఫక్కిగ నిలువకుండుట నవీనవిషయముగాదు. బాగుగ భావించినచోఁ బ్రాచీనకాలమున గంగాసాగర సంగమమునకు దక్షిణముగఁ గృష్ణానదీపర్యంతమును సముద్రతీరస్థిత భూభాగము కళింగదేశనామముతో నొప్పుచుఁ గాలవశమునఁ గలిగిన మార్పులవలనఁ గ్రమక్రమముగ ఖండవిఖండములు గాఁగ దాని యెల్లలును మాఱు చుండుటయే కాక, యది దేశైకముగ నుండక దేశసమూహ మయి తుదకుఁ దనపేరును బోఁగొట్టుకొని యున్న దని తోఁచెడిని.

మగధదేశీయుఁడును గుప్తవంశీయుఁడును నయిన భవదేవగుప్తుఁడు "త్రికళింగాధిపతి" బిరుదమును గొనియున్నట్లు క్రీ॥ శ॥ పంచమశతాబ్దపు శాసనములలోఁ గొన్నింటియందుఁ గనంబడుచుండుటవలనను, ఉత్కళింగము (మీఁదికళింగము), మధ్యకళింగము (నడిమికళింగము), తలకళింగము (క్రిందికళింగము) అను నామముల వ్యవహారమువలనను గళింగము గొంతకాలమైనతరువాత మూఁడుభాగములు గల దయి యుండెను. భవదేవగుప్తుఁడు సమగ్రకళింగమును శాసింపకున్నను, గొంతభాగమును మాత్రము శాసించుచుఁ ద్రికళింగాధిపతిబిరుదమును గ్రహించి యుండనోపు. బిరుదము లత్యుక్తిపూర్ణములుగదా !

ఉత్కళింగమే యుత్కలముగాను, తలకళింగమే తెలుఁగుగాను మాఱిన దని కొందఱి యభిప్రాయము. అట్టి యభిప్రాయ మగ్రాహ్యము గాదు. కాళిదాసుని కాలమునకు ముందే యుత్కళింగ ముత్కల మయియుండును. కనుకనే యాయన మధ్యకళింగమునే కళింగమని నిశ్చయించుకొని దానికిని వంగమునకును నడుమ నుత్కల మున్నట్లు వచించెను.

త్రిలింగమధ్యస్థిత కారణమువలనఁ దెలుంగయ్యె ననునూహాభరితహృదయములందుఁ దలకళింగమే తెలుంగయ్యె ననునూహము చోటు నొందకున్నను, మొదటియూహమునకంటె రెండవయూహమే యధికతరయుక్తియుక్తము. చెప్పంబడుచున్న మూఁడులింగములును సృష్ట్యాదిసంభవములు గాని యేకకాలప్రతిష్ఠితములు గాని కావనుట నిక్కము. ఆలింగముల ప్రతి

స్థలకు మునుపు తన్మధ్యదేశము నామశూన్యముగ నుండె ననుట యసమం జసము. మఱి పదములు మాఱునపుడు వర్ణాగమవర్ణలోప వర్ణవ్యత్యయము లు బహుళములే. కాఁబట్టి తలకళింగమే తెలుంగయ్యెనని నానమ్మిక.

మహాభారత శాంతిపర్వ చతుర్థాధ్యాయమునందు "తతః కదాచి ద్రా జాన స్సమాజగ్ముస్స్వయంవరే। కళింగవిషయే రాజ న్రాజ్ఞ శ్చిత్రాంగదస్య చ। శ్రీమ ద్రాజపురం నామ నగరం తత్ర భారత॥" అని యుండుటవలనఁ గళింగదేశపు రాజధాని రాజపుర మైనట్లు విశద మగును. ఆరాజపురమే "యాజపురము" లేక "జాజ్‌పూ"రని తోఁచెడిని. అయినను, క్రీ॥శ॥౪౭౪-౫౨౬ లోఁ బ్రజాపాలన మొనరించిన కేసరివంశ్య యయాతి కేసరి శ్రీజగ న్నాథస్వామి నిర్మాణ ప్రతిష్ఠలును, భువనేశ్వరాలయమునకుఁ బునాది వేయిం చుటయును, కాన్యకుబ్జమునుండి పదివేల బ్రాహ్మణులను రప్పించి వైతరణీనదీతీ రస్థమును దనకు రాజధానియు నయిన "జాజ్‌పూరు" నందలి "దశాశ్వమేధ ఘట్టము" న నొకగొప్పయజ్ఞమును నిర్వర్తించినట్లు దేశచరిత్రమున నుండు టవలనఁ దద్యాజనకారణమునం జేసి యా రాజధాని 'యాజపుర' మయి యి ప్పుడు "జాజ్‌పూ" రని వాడంబడుచున్న దని కొందఱందురు. ఉత్కళింగ దేశజులయిన "ఝ్గాడు ఆ" (ఆరణ్యక) బ్రాహ్మణులు యజన యాజనముల నెఱుంగకుండుటవలనఁ గాన్యకుబ్జ బ్రాహ్మణులను రావించుట జరిగి యుండఁ బోలును. కళింగదేశము మూఁడుభాగము లైనపిమ్మట నుత్కళింగముయొక్క రాజధాని జాజ్‌పూరును, మధ్యకళింగముయొక్క రాజధాని గంజాముజిల్లా లో సముద్రతీరమున నున్నకళింగపట్టణమును, తలకళింగముయొక్క రాజధాని రాజమహేంద్రవరమును నై యుండెను.

సింహభూమి మండలమునఁ బ్రవహించుచున్న సువర్ణరేఖానదీతీరము నందు నుండిన "కర్ణసువర్ణ" మను పురము గొంతకాల ముత్కళదేశమున కు రాజధానిగ నుండెను. అది యిపుడు నామమాత్రావశిష్టమయినది. కా మార్ణవ- ఇంద్రవర్మ క్రీ॥ శ॥ సప్తమశతాబ్దమున ముఖలింగమును రాజ ధానిగఁ జేసికొని పరిపాలించుట వలనను బిమ్మట వచ్చిన గంగానుశాధి పతులు భువనేశ్వరమునందుం బలె దానియందుం బెక్కుశివాలయములను నిర్మించి దానినే రాజధానిగ నంగీకరించుటవలనను ముఖలింగము లేక నగరకటకము గొంత కాలము మధ్యకళింగమునకు రాజధానిగ నుండెను. శిలావంశమువారు మధ్యకళింగమునం గొంతకాల మాధిపత్యముం జేసిరి. అయి నను వారు గంగావంశజులతో నెయ్యము నెఱపుచు సామంతరాజులయి యున్నట్లు తోఁచెడిని. తలకళింగ రాజధానులు మాఱుచుండె నను వృత్తాం తము మనకు నూతనముగాదు.

క్రీ॥ శ॥ ౬౫౭ లో లలాటకేసరి లేక అలాబుకేసరి భువనేశ్వరాలయ నిర్మాణకార్యమును బూర్ణము గావించుటయేకాక, భువనేశ్వరమును నిజరాజధానిగఁ జేసికొనెను. క్రీ॥ శ॥ ౯౪౧-౫౩ నడుమ నృపకేసరి కటకపురమును నిర్మించెను. క్రీ॥ శ॥ ౧౦౩౪-౫౦ నడుమ మత్స్యకేసరి జగన్నాథక్షేత్ర సమీపమున నున్న "అఠరనళా" అను పదునెనిమిది నాళములుగల సెతువును గట్టించెను. క్రీ॥ శ॥ ౧౧౭౫-౧౨౦౨ నడుమ ననంగభీమదేవుఁడు నిజరాజ్యమును గంగానదిమొదలు గోదావరి వఱకును బంగాళాఖాతము మొదలు సోనపురమువఱకును వ్యాపింపఁజేసి, కటకమునఁ గోటను గట్టించి, యిప్పటి జగన్నాథాలయమును నిర్మించి, యనేక సేతుసరోవరాదులను రచించి, పెక్కుగ్రామములను బ్రాహ్మణులకొసంగి, క్రొత్తనాణెములను వెలయించి, వీరశ్రీగజపతి గౌడేశ్వరనవకోటి కర్ణాటోత్కలవర్గేశ్వరాది బిరుదములను దాల్చెను. క్రీ॥ శ॥ ౧౨౦౪-౩౧ నడుమఁ బరిపాలించిన తృతీయానంగభీమదేవుఁడు సైతము "త్రికళింగాధినాథ" బిరుదమును దాల్చెను. క్రీ॥ శ॥ ౧౨౩౧-౫౭ నడుమఁ బరిపాలించిన నరసింహదేవుఁడు "ఉత్కలకళింగసామ్రా" ట్టను బిరుదమును గ్రహించెను. క్రీ॥ శ॥ ౧౨౭౧ లోఁ బరిపాలన మారంభించినట్టియు మొదటి నరసింహదేవునకుఁ బౌత్రుఁడయినట్టియు ద్వితీయనరసింహదేవుఁడే గంగావంశమువారిలో "గజపతి" బిరుదమును మొదటఁ గొనినవాఁడు. ఉత్కలదేశము గజసంకుల మగుటవలన నతఁడు "గజపతి" బిరుదమును గొనియుండును. క్రీ॥ శ॥ ౧౪౭౮-౧౫౦౪ నడుమనున్న పురుషోత్తమదేవుఁడు దండయాత్ర వెడలి, కాంచీపురాధీశు నోడించి, యాతనికూఁతురయిన పద్మావతిని బెండ్లాడెను. మఱియు నితఁడు వీరశ్రీగజపతి గౌడేశ్వర నవకోటికర్ణాటకలబర్గేశ్వరాది బిరుదములను బొందెను. క్రీ॥ శ॥ ౧౫౦౪-౩౨ నడుమఁ బరిపాలించిన ప్రతాపరుద్రదేవుఁడు కృష్ణదేవరాయలకు నోడి తనకూఁతు నతని కిచ్చెను. ఇతని కాలముననే శ్రీమచ్చైతన్య స్వామివారు పురుషోత్తమక్షేత్రమునకు విచ్చేయుటయుఁ దద్దేశమున వైష్ణవధర్మము ప్రబలుటయు జరగెను.

ప్రతాపరుద్రదేవుని కొమకయిన వీరభద్రదేవుని సోదరి ననఁగ బ్రతాపరుద్రదేవుని కూఁతును గొండపేటిలోని కేతవరదుర్గాధీశుఁడును బూసపాటి తమ్మిరాజు తనయుఁడు నయిన చాపిరాజు పెండ్లాడినట్లు కవిజీవితములు ౫౪౪ వ పుటయందు ముద్రింపఁబడి సివర్ణనముకొఱకుఁ గృష్ణవిజయములోని "సవ

భారతాఖ్యాన" మను సీసపద్య [illegible] యున్నది. "కటకేశ్వరుని చేతఁ గని కేతవర మాత్మపురముగ నేలె నేభూవిభుం"డను నాసీసముయొక్క రెండవపాదము రాచిరాజు ప్రతాపరుద్రునివలనం గూఁతునే కాక, కేతవరమును సైతము పొందినట్లు సూచించుచున్నది. రాచిరాజు ప్రతాపరుద్రుని బరాజితునిగఁ జేసిన ట్లాపద్యమునం గనంబడదు. అయినను గజపతులను జయించి వారి 'గజపతి' బిరుదమును బూసపాటివా రొందినట్లు కృష్ణవిజయమునఁ గలదని మన్మిత్రులలో నొకరు నాకుఁ జెప్పిరి. నేనెంత ప్రయత్నించినను నా కాపొత్త ములభింపలేదు. ప్రతాపరుద్రదేవుఁడు కృష్ణదేవరాయలకు మాత్ర మొడి తన కూఁతు నతనికిచ్చినట్టు ఉత్కలదేశచరిత్రమువలన గోచరించును. అంతేకాని యతనికి వేఱొకకూఁతురున్నట్లుగాని యామెను గేతవరసహితముగ రాచిరాజు నకిచ్చినట్లుగాని యుండలేదు. మఱి రాచిరాజు నామముగాని కేతవరనామముగాని యందుఁ గనంబడదు. అంతేకాక వీరభద్రనామధేయుఁడు గజపతి రాజులలో నెవ్వండును లేఁడు. భంజవంశజులలో మాత్రము వీరభద్రభంజ నాముఁ డొకఁడుండెను. జేతలు దమచేత జయింపబడిన వారిని దాము జయించి యున్నట్లు సూచించు బిరుదనామములను ధరించుట స్వాభావికము ; పరాజితుల బిరుదనామములనే తాము ధరించుట యస్వాభావికము. కాన గజపతులను జయించి పూసపాటివారు "గజపతి" బిరుదమును జేకొనిరను సమాచారము చింతనీయము. మాధవవర్మ విశాఖపట్టణమండలమునకు వచ్చి కుమిలిని భోగాపురమును షేర్మహమ్మదుఖానునివలనఁ గొలునకుఁ గొనినట్లును, క్రీ॥ శ॥ ౧౬౯౦లో సీతారామరాజు పర్లాకిమిడి గజపతితో మైత్రిని సలిపినట్లును, క్రీ॥ శ॥ ౧౭౧౩ లో విజయనగరదుర్గమును నిర్మించి యిక్కడకుఁ బొబ్బిలినుండి రాజధానిని మార్చిన విజయరామరాజు క్రీ॥ శ॥ ౧౭౭౧లోఁ బర్లాకిమిడిలోని హీరమండలము హుండాను బ్రతారణముచేతను బలవంతముచేతను గ్రహించినట్లును కార్మైయికలు విశాఖపట్టణమండలపు మాన్యాలునందుఁ గలదు. గజపతులప్రభ యుత్కలమునం బ్రబలినట్లు పూసపాటివారిప్రభ విశాఖపట్టణమండలమున క్రీ॥ శ॥ పదునెనిమిదవ శతాబ్దమునం బ్రబలినట్లు కనంబడును. అప్పుడు వారు "గజపతి" "కళింగాధిపతి" యను రెండు బిరుదులను సైతము చేకొనియుందురు. తలకళింగాధిపతుల చరిత్రములను నాకంటె మఱచ్చోతలే యెక్కువగ నెఱింగినవారను విశ్వాసము గలవాఁడనగుట న్యాని నిట నుడువను.

కళింగరాజయిన చిత్రాంగదుని పుత్రుని దుర్యోధనుడు పెండ్లాడి నట్లు మహాభారతశాంతిపర్వమున నున్నను, మీఁద నుదాహృతమయిన "అంగవంగ కళింగేషు" అను శ్లోకమునుబట్టి కళింగదేశ మపవిత్రమయిన దనియు, నందలి యాదిమవాసులు పతితులుగను మ్లేచ్ఛులుగ నెన్నంబడుచుండిరనియు దోఁపక మానదు. అట్టి యాదిమవాసులలో నోఢ్రులను నొకతెగవా రిప్పటికిని గలరు. వారు తెలివి గలిగి కృషీకులును శూరులునై సర్వవిధములఁ దెలగాలను బోలియుందురు. "శనైకస్తు క్రియాలోపాదిమాః క్షత్రియజాతయః। వృషలత్వంగతాలోకే బ్రాహ్మణాదర్శనేనచ॥ పౌండ్రకాశ్చౌడ్ర ద్రవిడాః కాంభోజా యవనాశ్శకాః। పారదా పహ్లవాశ్చీనాః కిరాతా దరదాః ఖశాః॥" అను మనుస్మృతి దశమాధ్యాయమందలి శ్లోకద్వయమును బట్టి యోఢ్రులు పతితక్షత్రియులయి యనార్యులలోఁ జేరినట్లు కనంబడును. "తథాన్ద్రాన్ద్రావిడాన్పౌండ్రాం శ్చోలాంశ్చైవ సకేరళాః॥" అని రామాయణమందును, "పాండ్యాంశ్చ ద్రవిడాంశ్చైవ సహితాం శ్చోడ్రకేరళైః॥" అని మహాభారతమందును వారుగ్గడింపంబడి యున్నారు. వారుత్కళింగములోని "ఖోర్ధా" ప్రదేశమున వసించుటవలనఁ దత్ప్రదేశము "ఓఢ్రదేశ" మయి; సామాన్య జనవ్యవహారమున "ఒడిశా" యయి, ఆంగ్లోచ్చారణప్రభావమున నిపుడు "ఒరిస్సా" యయినది. ఓఢ్రులనుబట్టి యోఢ్ర దేశమేర్పడినట్లే తెలగాలను బట్టి తెలఁగనాఁడేర్పడెను. ఓఢ్రరాజు గజదంతములను పాండవులకు సర్పించినట్లు మహాభారతసభాపర్వముననుండుటవలన నోఢ్రులలో రాజమంత్ర్యాదు లుండి తమ చిన్న ప్రదేశమును దా మేలుకొను చుండి రని తెలియును. "శవ ఆభీర చాండాల శబర ద్రవి డోఢ్రకాః। హీనా వనేచరాణాంచ భాషా స్నప్త ప్రకీర్తితాః॥" అను భరతముని వచనమువలన నోఢ్రలభాష సవర మొదలగు బాసలను బోలి నీచముగ నెన్నంబడుచుండె ననుట సుస్పష్టము. ఆర్యసంపర్కముచేత నది సంస్కరింపంబడి యుత్కలనామమును బడసి సభ్యతను గాంచెను. ఇపుడు సింహభూమి యని పిలువఁబడు మండలమున కు పూర్వము "హరభంగ" మని వాడంబడుచుండెను. అందు నివసించుచున్న "భూమియా" లేక "భూయా" యనువారే యందలి యాదిమజాతివారు. వారు జన్నిదమును దాల్తురు. భూమియాపదమునకు భూమి గలవా రని యర్థము. ఇప్పటి సింహవంశ క్షత్రియులు భూమియాలను జయించి వారి స్వత్వమును నశింపఁ జేయుట

మే కాక, తత్ప్రదేశనామమును సింహభూమిగ మార్చిరి. మఱి భూమియాలను హీనులుగ గణించిరి. జేతలచేతలను బరాజితుల దుర్గతులను వర్ణింపనక్కఱలేదు గదా. మీఁదఁ బేర్కొనంబడిన యోఢ్రులు, తెలగాలు, భూమియాలు గాక, కోలో, ఖారియా, పురాణో, భూమిజో, పారోజా, (ప్రజా) సాంతాళో, కొంధో లేక కోదు, కోయ, గొండో, ఘూసియా, కొండోరా, కెవుటో, జాలరి, కొదాళో, ఘుషురియా. చామారో, డోమొ, పాణో (పౌండ్రః), బౌరి, బాఘుడి, సవర, బగతా మొదలగు జాతిజులు కళింగదేశాదిమనివాసులు. వీరిలోఁ బెక్కుతెగలవా రిప్పటికిని బ్రాహ్మణుల నపేక్షింపక తమ వివాహాదికృత్యములను దమవారిచేతనే చేయింతురు.

ఆదిని గళింగదేశమునందు ధర్మము లెట్లుండెనో, జనులమతము లెవ్వియో, యేయే దేవత లారాధింపంబడు చుండిరో నిశ్చయింపం జాలము. ఐనను జనులుసేయుపూజలు జీవహింసతోఁ గూడియుండె ననియు నందు "కొంధో లేక కోదు" మొదలగువారు నరబలులను సైత మిచ్చుచుండిరనియు నన నొప్పును. క్రీ॥ పూ॥ తృతీయశతాబ్దము మొదలు క్రీ॥ శ॥ నవమశతాబ్దము వఱకును బౌద్ధమతమును, గొంచెమించు మించుగ బౌద్ధమతముతోడనే కొంతవఱకు జైనమతము నటుతరువాత శైవము నటుపిమ్మట వైష్ణవమును గళింగదేశమున వ్యాపించెను. ఇన్ని సాధుమతములు వ్యాపించిన నేతద్దేశమున నిప్పటికిని జంతుహింస నిలిచియుండుట యత్యంతశోచనీయము.

కళింగదేశమునకు నార్యులు వచ్చినకాలమును నిర్ణయించుట కెట్టియాధారములును లేవు. క్రీ॥పూ॥ బహుశతాబ్దములకు ముందే యార్యాగమనమై యుండును. యయాతికేసరి రప్పించుటవలన బ్రాహ్మణులు కన్యాకుబ్జదేశమునుండి యుత్కళింగమునకువచ్చినట్లు మీఁద నుడువంబడినది. ఆర్యులు మగధమునుండి యక్కడకు వచ్చి నట్లు కొమర్రాజు వేంకటలక్ష్మణరావు వ్రాసెను. ఇట్లు దేశభేదము సూచిత మగుచుండుట వలన నార్యు లుత్తరదిశనుండి యుత్కళింగమునకు వచ్చి రనిన నిర్వివాదముగ నుండును. వా రోఢ్రులను బరాజితులుగం జేసి తద్దేశనామము నయిన నిలుపం దలంపక నిజార్జితదేశమునకు నుత్కల మని పే రిడిరి. ఐన నోడ్రనామము విడువ కుండుటం గాఁబోలు దాని నోఢ్రముగ సవరించిరి. ఇపు డుత్కలమునకు నోఢ్రము పర్యాయపద మైనది. పరాజితు లైనయోఢ్రులు నీచు లైరి. ఆర్యులు మధ్యరాష్ట్ర

ము నిండినపిమ్మట దానికి నంటియుండిన యాంధ్రదేశమున వ్యాపించిరి. ఆంధ్ర దేశము మధ్యరాష్ట్రమును బశ్చిమరాష్ట్రము నొరసియుండి నట్లు తోఁచెడిని. అద్దేశముసైతము వింధ్యదక్షిణ మగుటవలన నదియు నార్యప్రవేశపూర్వ మనార్యజనాకీర్ణముగ నుండె ననుట నిస్సందేహము. ఆదలి జనులుసైతము సమర్థులుగను నేర్పరులుగ నుండిరి. దాని స్థానము సరిగఁ జెప్పుటకు వీలులేదు. దాని యెల్లలును గళింగసీమలువోలె నానావిధములుగ మాఱుచుండెను. ఆంధ్రరాష్ట్రప్రభువులశాసనములు ప్రాకృతభాషయందే యుండుటవలనను, ఆంధ్రకవులచరిత్రము ప్రథమభాగము ౨౬౭ వ పుటయందు "భాతికకళానిధి" లోనిదని యుదహరింపంబడిన యాంధ్రభాగములలోఁ దెలుంగుచేరి యుండక పోవుటవలనను, ఆంధ్రము తెలుంగు గా దని నిశ్చయింపం దగును. ఆంధ్రాగతులయిన యార్యులు తలకళింగమున వ్యాపించి దానిని స్వీయదేశముతోఁ గలిపికొని యుందురు. అప్పటినుండి తెలుఁగుబాస ప్రాకృతసమశబ్దములను బ్రాకృతభవశబ్దములను గలిగి వృద్ధి నొందినది. మఱియు నాంధ్రమును దెలుంగు నుత్కళౌఢ్రములువోలెఁ బర్యాయపదములుగ వాడం బడుచున్నవి. పూర్వ మొకప్పు డొడలు హెచ్చుఁగ న్గపిడుగులు పడుటవలన నగ్నిమిత్రుని కన్నులు పోవఁగ నతఁడు దనకన్నుల కొఱకు సూర్యుని బ్రార్థింప నతఁడు ప్రసన్నుఁడయి యగ్నిమిత్రున కొక భాష నొసంగ దానిమహిమ వలనఁ బోయినకన్నులు మరల రాఁగ నంధతను బాపుటంజేసి యాభాష యాంధ్రనామము గలదయి నట్లు "భాషాముకుర" మను నాంధ్రగ్రంథమందలి రెండుపద్దెము లాంధ్రకవుల చరిత్రము-ప్రథమ భాగము-౨౬౯-౭౦ పుటలలో నున్నది. ఈ యసందర్భపురాణగాథను నమ్ముటకంటె నానార్థరత్నమాలయందు "అకారో బ్రహ్మవిష్ణ్వీశకమఠేష్వంగణే రణే" అని యుండుట వలన "అం=యుద్ధమును; ధ్రః=ధరించునది యగుటంజేసి అంధ్రమై, అంధ్రమే స్వార్థమునందు ఆంధ్రమయ్యె" నని తలంచుట సమంజసము. ఆంధ్రుల శౌర్య మితిహాసప్రసిద్ధమగుటవలన మీఁది నిర్వచనము యుక్తముగ నుండును.

అటుతరువాత నార్యు లుత్కలమునుండి దక్షిణమునకును దలకళింగమునుండి యుత్తరమునకును గ్రమక్రమముగ వ్యాపించి మధ్యకళింగము నాక్రమించిరి. ఇట్లార్యులు ప్రవేశించినపిమ్మటను, జగన్నాథము, భువనేశ్వరము, మహేంద్రగిరి, స్థితగోకర్ణము, ముఖలింగము, శ్రీకూర్మము, సింహాచలము,

ద్రాక్షారామము, కోటిఫలి, మంగళగిరి మొదలగు హరిహరక్షేత్రములు వెలసిన తరువాతను గళింగము పుణ్యదేశములలో నొకటి యైనది. ఉత్కలదేశమునందు వాడంబడు "ఋషికుల్యాం సమాసాద్య యావ ద్వైతరణీనదీ । స ఏవ హ్యుత్కలో దేశః పుణ్యక్షేత్రం ప్రచక్షతే॥" అను శ్లోక మందులకు నిదర్శనము. ఋషికుల్యానది గంజామువద్ద నున్నది.

“కాళింజీ” లేక “కాళింగు” లను నొక తెగవారును, కళింగకోమట్లను మఱొక తెగవారును మధ్యకళింగమునఁ గలరు. వీ రాదినుండియు సభ్యతను గన్నవారు; మఱి యజ్ఞోపవీతముం దాల్చువారు. అందు మొదటి తెగవారు ముఖలింగేశ్వరుని సింహాచలసమీపమున నున్న మాధవస్వామిని బూజించుచున్నారు. ఆలోచింపఁగ నార్యులు మధ్యకళింగమున వ్యాపించువఱకును వా రచ్చోట బ్రాహ్మణ స్థానీయులుగ నుండిరి; రెండవ తెగవా రప్పుడును నిప్పుడును వైశ్యకృత్యమును జేయువారు. కళింగదేశవాసులు సమర్థులును, బండితులును గొన్ని కళలయందు నిపుణులు నై యుండిరి.



# నూపురమహిమ లేక కన్నకిచరిత్రము

— తి. సు. మురుగేశ పిళ్లెగారు —

(గతసంచిక శేషము)

### కన్నకి గోవలుల పెండిలి.

ఇట్లు నానాటికిఁ జెలితెక్కుచుండు చందంబున సుందరంబై పెచ్చుపెరిఁగి విచ్చలవిడి నిద్దఱును బ్రాప్తప్రాప్తవన కౌశకేళిగా వన్నెకెక్కి వొంపిరివోవుచుఁ బదునాఱేండ్లుగల ప్రోడయై గోవలుఁడును బన్నెండేండ్లుగల ప్రోడినై కన్నకియుఁ జెలువారి యుండుటం గని చుట్టలందఱును గన్నకికిం దగినపెనిమిటి గోవలుఁడ యనియు, గోవలునికిఁ దగినయిల్లాలు గన్నకియ యనియుఁ దీర్మానించి వారితండ్రు లగుమాసాత్తువనికిని మానాయకునకినిఁ దమతమయెడఁదలఁగల కోర్కికోలుం దెలిపిరి. చుట్టములమైకోళ్ళ నియ్యకొని యాయిద్దరితలిదండ్రులు నక్లొనర్చుట కుజ్జగొని చేపట్టుసేయించుటకు దిట్టపఱిచి, సోదెగాండ్రచే మంచిమూహుతముపెట్టి, చెట్టపట్టుపండుగకు వలసినబండముల నవ్వారిగా సేకరించి,చుట్టములను, నంటువారలం బిలువంబంచిరి. ఇండ్లు, పందిరి మొదలగువానిని బన్నీటనలికి, ముత్తెపుసున్నముతో మ్రుగులిడి, యరఁటిమ్రాఁకులు, మొసలిబిబ్బీలు,పోఁక,గొబ్బరి పాళలు, విరిదండలు, ఉల్లడములు మొదలగువానితోఁ గైసేసిరి. పెండ్లిచవికలో జలతారుజాలీలు, దోడిగినకుతికిపట్టు, పచ్చనిసకళాతు, చందువాలుగట్టి రంగుటరుంగులం గదంబముతో నలికి, తెలిగంబురాదుమారముచే మ్రుగ్గులువెట్టి, మొలమావిచివుళ్లుఁ, బచ్చనితోమాలికలతోను, మల్లెలు,మొల్లలు, సంపెగలు విరవాది మొగిళ్ళు, కెందమ్మి, చెందొవ, పొన్నలు, పొగడలుమున్నగు వలపులొలయు పువుబెత్తులఁదొడిగి, నిండుకుండలునింపి, సజ్జరసంపుఁబొగలువేసి, పుత్తడివన్నెబురుసాతెవాసియు, జరబొజుదిండ్లు, పిల్లదిండ్లు మొదలగువానితోఁ గైసేసిరి. పెండ్లికొడుకైన గోవలునిం బన్నీట నీరాటయొనర్చి నేరాజువీణాను గట్టనిచ్చి, వెలిపట్టుమత్తాయి దొడిగి, పట్టెమార్పుపచ్చడము గప్పి, గంబూరగందము జవ్వాజుల నునుపుగా నలఁది, నొసట వెలిబూది పూసి, జింకపొక్కిలి చుక్కబొట్టిడి,తలకుఁ బాగాయుంచి,తురాయి సెక్కి మూబజా చౌకట్లు పులుఁగుపచ్చలతావడము దమ్మికెంపులముద్దుటుంగరము, గండపెండేరము మొదలగుతొడ

పులఁ దొడిగి పావణించిరి. ఈలాగునం బెండ్లికూఁతురైన కన్నకిని నిగారపుమిన్నలు దాపఁబడినమేలితొడవులతోను, మాదావళపుఁగంగోరుపావడ, జరబాజుచీర, జాలీలరవికలతోను, మైపూఁతగందముతోను వలపులొలయఁ బలువగల విరులదండలతోను పావణించిరి. మూరుతలగనను దాయఁగా వీణెయు, వాసిగోలు, నాగసరము, డవిణ, డోలు, డంకా, గిడియ, మద్దెల, చుయ్యంకి, వీరాణము, కవడె, కాళె, బూరుగ లనువాయిదములు గొల్లునవాయింప హారువుగా మురువుసేయఁబడిన పెండ్లికొడుకుఁ బెండ్లికూఁతుం దెచ్చి రంగారు పెండ్లియరుంగున గద్దియయందుఁ గూర్చుండఁబెట్టిరి. ఐనువ లైరేనికుండలు దెచ్చియుంచి సేసలిడిరి. నేతిచాలుపులచే సతనాల్కలసామి జక్కఁగా రాజుకొని రగులంజేసి బాఁపనలు దీవనలిడ, బాఁపెతలు సేసలిడ నైదువలు జేజేవెట్ట గోవలునిచేఁ గన్నకిచెట్టవట్టించి, డిగ్గిసాకిరిగాఁ దాలిబొట్టుగట్టించిరి. ఇంటికవ లొండొరులు దలఁబ్రాల్వోసి చెట్టవట్టుకొని చిచ్చుకావలగొని రానిచ్చి కూర్చుండఁబెట్టి పెండ్లిపండుగ గన్నులకుం బండువులుగాఁ జరిగించిరి. పెండ్లికే'అంచిన వారలకు గంబూరముగలిపిన మలాకాగందము, గొజ్జంగిపన్నీరుఁ, దావులీను పూవుబెత్తులు, పండ్లు, గొబ్బెరలు, నెలవత్తిబాగాలు పుట్టములు, సొమ్ములు పసిండినాణెములం జాలుఁజాలు నని తనియున ట్లవ్వారిగా నొసంగిరి. పేదసాదలకుఁ బసిండిజడింగురిసి, లాఁతివిలాతివారల కేరాళముగా నాతములొసంగి త్రుప్పటిలం జేసిరి. పెండ్లికి విచ్చేసి యింటిపట్టైజిగిన కవలం దీవించి, కాయువుతో గారవించిన కరికాలచోళమన్నినికి మత్తుగొరులమొత్తము, గత్తలానిగమి, యరదములు, నండలములు, మిన్నలు, విలువయిడ సలపిగాని రతనంపుఁ దొడవులు, మేలిజరబాజుపట్టుదుప్పటులు, జింకపొక్కిలియుఁ, బచ్చకప్పురముం బన్నీటం గదంబించిన సిరిగందముఁ, గప్రపువీడియము వలపుగులుకు విరులదండలు, వింజామరములు, వెలిపట్టుగొడుగులు కలువకాళంజి మొద లగురాచసొమ్ముల సూడిదవెట్టి సేవించిరి. ఇట్లు గనులకింపుగాఁ బెండిలిపండుగ జరగఁబడి యాలుమగ లల్లారుముద్దుగా మనుచుండిరి. పెండ్లిపండుగయొక్క నిగరంపుఁ బెరిమెం దిలకించి కన్నకీగోవలులతల్లిదండ్రులు పాళిచే సుమాళంపుటింపు కడలినోలలాడిరి.

కన్నకిగోవలుల కాఁపురము :—కన్నకి గొన్నమగనినే కంటఁగన్నదవ్యమని తలంచి మగనికిం జేయవలసిన యూడిగములలో నెఁతేనియుఁ గొ

సుండెను. మహారాజసభలో సమ్మానముగాఁ బొందినబహుమానములంగొని మాధవి తనతల్లితోఁ గూడఁ దనమందిరము సేరి పేరిమితో బెడఁగారుచుండెను.

గోవలుఁడు మాధవి న్వలచుట :—చిత్రాపతి, 'యీపుత్తడిదండకు దరమైన వేయి నెనిమిదిదీనారముల నిచ్చి విలుచువాఁడే నాయనుఁగుంగూఁతురైనమాధవికిం దగినమగఁ డౌఁగాక' యని మందలించి యాదండం దనబానిసయగు గూని యనుదాని కిచ్చి యావీటిపెద్దచదుకమం దుండి యమ్ముదానివలె నాగూనిని బుత్తడిదండం జేతంబట్టుక నిలువంబెట్టి తనయింకి సేరెను. మాధవియొక్క యాటపాటలపాటవములను దానిమురిపెములను దిలకించి తమక మగ్గలమయి కలువనేజాపోరికోహటించి తత్తరపాటుఁ జెందుచుండిన గోవలుఁ డాబంగారుదండను బట్టి గూనితోఁగూడి మాధవియొక్కదీమంబునకు మంతనంబున నేగెను. మాధవి గోవలుని మిక్కుట మగుమక్కువతో నెదురేగి తోడితెచ్చి గారవముతో లాలించి కొలిచి నాఁటిదినము మొదలా గోవలునిఁ దనకు మగనిఁగా వలచి తనవలపుల మెలఁకువతో వెలయించుకొని వెలరారుచుండెను.

మాధవియు గోవలుఁడు నొండొరులు ననుపుగలవారలై మనసొద్దికతో నింపుగా మనుచుండిరి. గోవలుఁడు దనయొద్దనుండిన పలుదినుసులైన బండములనుఁ బైకములను నానాఁటికి నవ్వారిగా నొసంగి, దానియింటనే పోఁబచిగా నుండెను. కన్నకి దన పెనిమిటియొక్క యెడఁబాటు నోర్వఁజాలక యెంతో వంతఁ గుందుచుఁ బొక్కుచుండెను. అట్లు వొగులుచుండినను గన్నకి దనయెడఁద నడరిన యెడఁబాటువంతల నెంతయు వెలిపుచ్చకయుఁ దనయేలినవానిమెడం జాలిగొని విసుఁగకయు నింటిపట్టు నాలుడిం గోలుపోవక మేలిమిగా జరగించుచుండెను.

మణిమేఖలపుట్టుక :—గోవలుఁడు మాధవితో నింపుగాఁ గలసిమెలసి వెలరారుచుండుతఱి గోవలునికి మాధవియం దొకయాఁడుబిడ్డ పుట్టెను. గోవలునివంగసములోఁ దొంటివారలలో నొకరికి మును పొకప్రొద్దున నొక దయ్య ముపకార మొకటింజేసి యుండెను. ఆ బాసవాలపేరు మణిమేఖల. ఆ వేల్పుం బేరునే తనకూఁతునకు నిడుటకు వలచి గోవలుఁడు మాధవికిం జెప్పెను. మాధవియు గోవలునివలపు నియ్యకొని తననిసువునకు మణిమేఖల యనిపేరిడి యింపొందుచుండెను. బుడుత పుట్టినందుకు గోవలుఁ డుప్పొంగుచుఁ బలు

రకములైన యీవుల నేరాళముగా నొసంగెను. అత్తఱి గోవలుఁడయెడ నీవిఁ గొనుటపొంటె బొఁదనముదుకఁ డొకఁ డేతెంచుచుండు వోఁ గ్రైపుటేనుఁగొక్కటి యతనిం దఱిమిపట్టెను. ఇట్టియెడ నుపాటుం గన్నగోవలుఁ డడలి, యుద్ద విడిఁ బరువిడి యాపాఱుని నామత్తగారునుండి విడఁదీసి కాచి కాయుత్రతోఁ గావలసినకలుముల గౌరవముతో నొసంగి సేవించి పిడ్కాలిచెను.

వేలుపుఱేనిపండుగ :—కావిరిపూంపట్టణమం దేఁడాది కొకసారి వేలుపుఱేనికిఁ బండుగసేయుట యలవాటుగా నుండెను. గోవలుఁడును మాధవియు మచ్చికతో మనుచుండునదమున నొక్కయేఁట నెప్పటియట్ల వేలుపుఱేనికిం బండుగ నడిపింపఁగల సావి సంతరించెను. అప్పు డావీటిమానిసు లందఱుఁ దమతమగీములను, వీథులను, దేవళములను, రచ్చలు చావళ్ళు మొదలగువానిని బట్టణమంతయు మిగుల హాళితో హాయువుగా హాలంకరించిరి. పండుగుం గొండాడుటకుఁ డెక్కె మెక్కింపఁబడెను. ఇరువదెనిమిదినాళ్లపనుకఁ బండుగుసాలమేలిమిగాఁ బట్టణంపుమానిసులచే జరిగింపఁబడెను. అట్టియెడనన నెకిమీఁడు దనయేలుకోట్లతో విచ్చేసి వేఁగంటినిలుపునకు నీరాటమానకేక మొదలగువానిని నెంతో వెడఁగుగా నడిపించి మొగిలుఱేతును మ్రొక్క తనకు వలసినయీవుల నొసఁగఁ గనికరింపవలయు నని వేఁడుచు వెన్నెలువెట్టి కైవారముసేసెను. పదంపడి యేలికవాఁడును వానియేలుకోట్లును ముక్కంటిదేవళము, వెన్నునిదేవళము మున్నగుగుళ్లకు నేగి పూజలుసేసి మ్రొక్కిరి. ఇట్లానగరిజను లెంతో హాయిసముగాఁ బండుగుం జరగించుచుండఁ గన్నకి మాత్రము దనయెడఁద నడరినయడలుం దలఁచి తద్దయుఁ గోడాడుచుండెను. మాధవి యెంతో సుమాళముతో సొబగారుచుండెను.

నీర్వామినీరాట :—బౌసవాల్ ఱేనిపండుగ వాసిగా జరగిముగిసినంతనె వీటిమానిసు లందఱు నీర్వామిని నీరాడుట కేగుట యలవాటుగా నుండెను. అట్టియలవాటుమేర కాకొండాటము గొనసాగినంతట నొక్కొక్కరును వాఁటిమాపటివేళలఁ దమతమయెక్కిరింతల నెక్కి మున్నీట మునుఁగలిడ మునుకొనిరి. అట్టినీరాటపుటాటలం దలిరుటకై గోవలుఁడు మేటిజోటియైన మాధవితో బొటువాటిల్లు నీటికుప్పకు నీటుగాఁ బోయెను. అప్పుడు వాఁగరత 'పట్టణమోయిది ?' యని మలికితముపడువ ట్లగపడెను. వేలకొలఁది గొరలు నెక్కంత్ర దాము దెచ్చిన సరకు లన్నింటిని బజారిపెట్టి, దివియలనెల్ల ము

వం బరుండి యుండఁ జూడఁగలవు ; వాని దీసుక నీయిలు సేరి వంతయుడిగి సంతసమడరి మనుమపుగాక' యని మందలించి యోలమాసగొనియెను. సాత్తుఁడు సెప్పినచొప్పున మాతలి యుఁ దాఁ దోతెంచిన దారివెంట నేగుచుండు నెడ నొకచిన్నిపాపవడువున సాత్తుఁడు పరుండియుండెను. ఆబిడ్డం గని యాబిడ యలవిలేని యెలర్పున నలరుచుం జొత్తుపాపం దీసి చంక నిడుకొని తన దీమంబునకు దీమసమున నేగెను.

దేవంతి :—మాతలియింట నాబొట్టెఁ పెల్లాడుచున్నదగా నెమగఁబడి పెండ్లియాడఁ దగినదండిమగం డాయెను. అట్టియదనున వానితలిదండ్రులు దేవంతి యనుపొలంతినిం జెట్టవట్టించిరి. కొన్నాళ్ళకుం బిమ్మట తనతలిదండ్రులు పోలిమాఱంగా సాత్తుఁడు వారకిం జేయవలసిన కడచెయ్వులం గరగరికగాఁ జేసెను. ఆలుమగ లిలువడిం గాఁపురము సేయుచుండి కొన్నాళ్ళకుఁ బిమ్మట సాత్తుఁడు, దాను శాస్తాదేవత యనునేటుం దనబోటికి నూటిగ నుడిసెను.

ఇటీవలఁ గొన్నాళ్ళవనుక సాత్తుఁడు దేవంతితోఁ గలసిమెలసి యింటిపట్టు నంటుతో జరగించుచుండి, తాను మగుడి గుడిసేరవలయు నని నచ్చి మచ్చికతో నిల్లాలిమాటునం బూటకముగా నొడివి యిలువిడిచి కడచి, తాఁ గాశికిం బోవున ట్లాయూరివారికిం జెప్పి యొరు లెఱుఁగనివెరవునం దన గుడిలోనికిం జని యెప్పటియ ట్లుండెను. దేవంతి నాఁటంగోలె సాత్తనిగుడికి నానాఁడునేగి, కాశికిఁ బోయినమగఁడు మగుడి వెడఁగుతోఁ దనకడ కేతేరవలయు నని సాత్తని వేఁడునట్లుగా యాయూరివారికి వేడబనుం జూపి యా వేలుపు న్వేడుకతో వేడించి కొలుచుచుండెను.

దేవంతి కన్నకి నోదార్చుట :—అలదేవంతి పడుచుగా నుండినపుడు కన్నకియొక్క పుట్టినింటనుండి యెదుగుచుండినందున నివ్వడు గన్నకికిం జెలికత్తెగా నమరెను. గోవలుఁడు గన్నకి నెడఁబాసి గడనపడఁతియింటం బెడఁగారుచుండుటకు నడలి దేవంతి యొకనాఁడు సాత్తనిగుడి కేగి 'గోవలుఁడు కన్నకితో మన్ననవడసి చెన్నొంది యుండునట్లు గనికరింపవలయు' నని సాత్తని చిన్నిపువ్వులచేఁ బూజించి చిన్నిపువు లిడి వేఁడెను. 'అట్లే యగుఁగాక' యని సాత్తుఁడు వాక్రుచ్చెను. దేవంతి దావంతము దలఁగి కన్నకికడ కేగి మిక్కిలి మక్కువతోఁ బిలిచి 'అమ్మా! యిటనుండి యీవు నీపెనిమిటితో మునుపటివలె ననువు లెసక మెసఁగ మనఁగల' వని మందలించెను.

కన్నకి నొఱగామికల గనుట :— ఇట్టి పెనఁగుచున్నవ్ర ఉడలుకడలినుం డి కన్నకి న్వొడలించి యింపుసొంపారఁ జేసినందున 'నొకొము ; ఈవు మంచి యాలుడిగల క్రొత్తడి వగుటం జేసి నీనొడి సుడివోవదు. ఇంముంది యే నాపె నిమిటితోఁ బెనఁగి మనఁగల ననుట నిక్కువంబ ; అయిన, నేనొకకొఱగామి కలఁ గంటిని ; దాన నేపాటి చేడ్పాటు వాటిల్లునో యని వాకొని యలమ రుచుండెను. దేవంతి, 'అమ్మా ! ఈవు గన్నకల యిట్టి దని నుడివితివేని దాన నెసఁగు నెసకముల నే వెల్లడించెద' నని మందలింపఁగాఁ గన్నకి యిక్కువెణి చకొణించెను :— "చెలియా ! నామగఁడు నాయొద్దకి సరుదెంచెను. అతఁడు నేనును వేఱొకప్రోలికిం బోయితిమి ; ఆప్రోలివారు నామగనిమీఁద లేనినేర ములు మోపి దొసఁగు వొసఁగించిరి. అట్టిమొదిపపాటు నే నెఱిఁగి యడలు కడలిం బడి, తడవుసేయక యాప్రోలియొడయనికడ కేగి తెగ వాడితిని. నా వలన నాఱేఁడును నాఁడును గీడు మూఁడఁబడి పాడఱెను. వెంబడి నాను ప లువగల లగ్గులు డగ్గఱిల్లెను. కలలో నేనందిన ల్లగఁడిన లగ్గుల నుగ్గడించిన యెడల నీకగ్గలముగ నగవు నిగ్గఁగలదు. పెగ్గల మగనెగ్గు లొందవు కలగనిన యెడలఁ దాని నొరులకు నుడువరా దని పెద్దలు సెప్పుదురు కాఁబట్టి, యేఁ గనినకల నూఁచముట్టుగా నీకిఁకఁ జెప్ప వీలుపడదు' అని మందలించి కొందల మంది మోము గాజువాఱె యొజ్జసెడి రోఁజుచుండెను.

దేవంతి కన్నకికిం గోవలునిఁ బడయునట్టి వెరవు గఱపుట :— దేవంతి కన్నకిం బలువగల నోదార్చి 'తల్లీ ! నీవు గన్నకలవలన నలమటింపవలదు. ఈ వీమగనిచేఁ దెగడఁబడినదానవు గావు. తొలిబాముల నీయొడయనికత మున నొక్కనోమును నోమక యేమఱితివి. అందువల్లనే నీ కీయలజడు లల వడినవి. ఇట్టి యలమటలు దొలఁగుట కొకవెరవు గఱపించెద. దాని న్నిక్కు టంపుమక్కువతో నాలకింతువుగాక :— కావేటియేఱుం గడలిం గలయుచో టను సంగముఖము పేరి రేవుచెంగట జెంగల్వకొలఁకులు రెండు గలవు. వాని నొక్కటికి సోమకుండ మనియు, మఱియొకటికి సూర్యకుండ మనియుఁ బేళ్లు గలవు. అలకొలంకులలోఁ గ్రుంకులిడి, వలఱేని దేవళమున కేగి వలగొని కొ లుచువార లీబాముసం గలకాలముం బెనిమిటితో ననుపునం బెనఁగుచుఁ బ లువగల బులుపు లలవడి బులిముచుండి యీజగంబునం గలయింపుసొంపులం బెంపారం దమమగనితోఁ గుడుచుచుందురు. కావున నీవు వాకొలఁకుల మెల

కునతోఁ బ్రాఁకు లిడి వలఁజేని గొలిచితివేని నీచుమ్మలు వమ్మౌను, యిమ్ము సొమ్ముల కిమ్మవయి, నెమ్మదిం బ్రమ్ముఁగల' వని దేవంతి యనువలంతి వలంతిగ మంతనంబునఁ బంతమాడెఁగ.

దేవంతి గఱపినపెరవులఁ గన్నకి తెగనాడుట :—కన్నకి యీవెడఁగునుడువులఁ బెడచెవి నిడి 'యిట్టిబెట్టిదంపుపుట్టులు మావంగడమున కెంతేనియుఁ దగవు. మాకొలములోఁ బుట్టినవారలకు కోనేటం గ్రుంకులిడి కోవెలకుం బోయి వేలుపులఁ గొలుచుట యిలువడి గాఁజాలదు. మేము గొన్నమగనినే కంటఁ గన్నదైన మని నచ్చియొడయనినే యెడఁద నిడి పొగడి బ్రతుకంగలవారము గావున నీవు నొడివినవడువున నడుచుట నాచేఁ గడఁగనిని' యని కన్నకి దేవంతికిం బదులుసెప్పెను.

(సశేషము)

# మహాభారత మీమాంస.

(గతసంచిక తరువాయి.)

—: చర్ల నారాయణశాస్త్రిగారు :—

ఏసమయమున యుధిష్ఠిరుఁడు రణభూమియందు దీప్రాస్నవ గావించెనో యాసమయమున వ్యాసభారతము లేకుండెనేని సౌతియొక్క మహాభారతము కూడ నుండదు. ఇట్టిచో యుధిష్ఠిరుఁడు ఉద్యోగమున అనఁగా ఉద్యోగపర్వమున నీవు మాటయిచ్చితి వని యేల చెప్పెను? ఇదేప్రకారముగా నశ్వమేధపర్వమునఁ గుంతి శ్రీకృష్ణునితోఁ జెప్పుచున్నది. "ఉత్తరయొక్క గర్భమునుండి మృతపుత్త్రుఁడే పుట్టునెడల నే నతని బ్రతికింతు నని నైషీకపర్వమున నీవు నాకు మాట యిచ్చితివి, కాఁబట్టి యిప్పు డామాట నెఱవేర్పుము" ఇచ్చటఁ గూడ నైషీకపర్వమునకుఁ నే ప్రమాణము కుంతీముఖమున నిప్పింపఁబడినదో యది చమత్కారముగా నున్నది. "ఓయదునందనా! ఐషీకప్రకరణమున నీవిట్టిప్రతినఁ బట్టియే యుంటివి" ఇట్లు చెప్పె కుంతి మహాభారతములోని యైషీకపర్వమునకు నిచ్చిన ప్రమాణము నిజముగా నూహింప శక్యము గాకున్నది. కాని యెపుడు గ్రంథము చాల విరివి యయ్యెనో యపుడు దానిలోని ప్రకరణములప్రమాణము పాత్రములముఖమున నిప్పింపక తప్పినది కాదు. అనఁగా సౌతికిఁ బిమ్మట కర్తృత్వము వ్యక్త మగుచున్న దనియే చెప్పవలయును. అంతమున మనము మహాభారతమునకుఁ గలకావ్యోత్కృష్టత్వము విచారింపవలసియున్నది.

మహాకావ్యదృష్టిచేత భారతముయొక్క శ్రేష్ఠత్వము ఈప్రకారముగా వృద్ధిచేయఁబడిన భాగమును విడఁదీసినయెడల లేక దానికై ధ్యాన ముంచనియెడల వ్యాసమహర్షియొక్క మూలకృతి, యేదో యత్యంతమనోహర మైనమూర్తితో సమానముగా మనకన్నులయెదుర నిలఁబడుచున్నది. ఇచ్చట నీసుందరత్వమును మనోహరత్వమును గొంచెము విచారించుట యనుచితము కాదు. ఈజగమునందు నాలుగై దత్యంతమనోహరములు నుదాత్తములు నగు మహాకావ్యము లున్నవి. వానియందు వ్యాసమహర్షికృత మైనయీమహాకావ్యము చాల శ్రేష్ఠకోటిలోనిది. యూనానీతత్త్వజ్ఞుఁ డైనయరిస్టాటిలు హోమరుయొక్క ఇలియడ్డు నాధారముచేసికొని మహాకావ్యమున కీలక్షణము చెప్పియున్నాఁడు :—"మహాకావ్యమునకు విషయ మొకటి యుండవల

యును, అది చాల ఘనమై యతివిస్తృత మైన మహత్త్వముయొక్క ప్రసంగము కావలయును. అందలిప్రధానపాత్రము లుచ్చవర్ణములలోనివి కావలయును, వారిచారిత్ర ముదాత్తమై యుండవలయును. గ్రంథములోని భాషయు వృత్తమును గంభీరములై యుండవలయును. కావ్యమునందు వివిధము లైన సంభాషణములు నష్టే వర్ణనలు నుండవలయును; పాశ్చాత్యవిద్వాంసులు చెప్పిన యీమహాకావ్యలక్షణము మనయిచ్చటి సాహిత్యశాస్త్రకారులు చెప్పినలక్షణముకంటె నేమియు నెక్కువ భిన్నమైనది కాదు. ఇప్పు డీనాలుగుసంగతులగుఱించి యిచ్చటఁ గ్రమముగా విచారము కావింపఁబడును.

మనమహాకావ్యములోని ప్రధానవిషయము భారతయుద్ధము. భారతవర్షమునందలి ప్రాచీనేతిహాసములలో భారతయుద్ధమును మించిన మఱియొక మహత్త్వవిషయము లేదు. ఆసమయమునందు భారతవర్షములోని ప్రాచీన సంస్కృతియు శిఖరముదాఁకఁ జేరియుండెను. ఆసమయమునకుఁ దరువాతనే భారతవర్షమునకుఁ దగ్గుదల యారంభ మయ్యెను. ఆతగ్గుదల యిప్పటివఱకు మెల్లమెల్లఁగాఁ బెరిఁగిపోవుచునే యున్నది. దీనిఁబట్టి మనవారు భారతయుద్ధము సరిగాఁ గలియుగారంభ మని యూహించుచున్నారు. సారాంశము, భారతయుద్ధముకంటె నధిక మగుమహత్త్వప్రసంగము మఱియొకటి కల్పింపఁగలుగుట యసంభవము. భారతయుద్ధముకన్నఁ బెరిఁగి పెద్దయైనదియు మిక్కిలి చిక్కుగలదియు నగుమఱియొకప్రసంగము దొరకుట కష్టము. ఈప్రసంగములోని యొక్కొకచిన్నభాగము గైకొని సంస్కృతభాషయందలి పంచకావ్యములలో రెండుమహాకావ్యములు రచియింపఁబడియున్నవి. అర్జునునిపాశుపతాస్త్రప్రాప్తికథమీఁద భారవి కిరాతార్జునీయమును రచించెను: మాఘకావ్యము శిశుపాలవధకథమీఁద రచింపఁబడినది. నైషధకావ్యముకూడ మహాభారతాంతర్గత మగునలదమయంత్యాఖ్యానముమీఁద రచింపఁబడెను. సారాంశము, భారతయుద్ధప్రసంగము దీనియొక్క యొక్కొకశాఖమీఁద నొక్కొకసంస్కృతమహాకావ్యము రచింపఁబడఁజాలినంత విస్తృతమై యున్నది. మహాభారతమునఁ గేవలము భారతయుద్ధకథయే కాదు. ఇఁక నేమంటేఁ బాండవుల సంపూర్ణ చరిత్రముకూడ నున్నది యని కొందఱనుచున్నారు. కాని, ఆలోచింపఁగా మహాభారతమునందలి ప్రధానవిషయము భారతయుద్ధమే, అయినను దానియందు నీయుద్ధమునకుఁ గల కారణములయుఁ బరిణామ

ములయుఁ గూడ వర్ణన యుండనగునని యాకాంక్ష సహజముగానే యుత్పన్నమగుచున్నది. కాఁబట్టి దానియందుఁ బాండవుల పూర్వచరిత్రయు నుత్తరచరిత్రయు నీయఁబడినవి. ఈరెండుచరిత్రములు చాలసంక్షేపముగాఁ నీయఁబడినవని జ్ఞప్తియుంచుకొనవలయును; అనఁగా మొదట నున్న యాదిపర్వము, సభాపర్వము చివరనున్న యాశ్రమవాసి మున్నగుపర్వములును జిన్నచిన్నవిగా నున్నవి. నడుమ నున్నయుద్యోగపర్వముకన్నఁ బిమ్మట నగు యుద్ధసంబంధము గలపర్వములు మిక్కిలి విస్తరించి వ్రాయఁబడినవి. భారతయుద్ధమునే మహాభారతమునకుఁ బ్రధానవిషయముగా నెంచవలయు నని తాత్పర్యము. వ్యాసమహర్షి యొక్క శబ్దములయందుఁ జెప్పఁబడినదైతే వారి మహాకావ్యమునకు విషయము నరనారాయణులజయము, అనఁగా శ్రీకృష్ణార్జునుల విజయమే యని చెప్పఁదగి యున్నది. ఈసంగతి నమస్కారశ్లోకము వలనఁ జక్కఁగా వ్యక్తమగుచున్నది.

ఆలోచింపఁగా మహాభారతకథాస్వరూపము చాలవిస్తృతమైయున్నది. ఐనను దానియందు నేకత్వము సంపూర్ణతయుఁ గలవు. అసంబద్ధతయు బొత్తిగా నగుపడదు. ఆయొక్కమహాభారమునందే శేక్స్పియరుయొక్క యనేకనాటకములయందు వర్ణితములైన వ్యక్తులన్నియుఁ గూర్చఁబడియున్న వనునంతటి యధికములును భిన్నస్వభావములు కలవియునగు వ్యక్తులున్నవి. మహాభారతకథ యాలోచింపఁగా నింతవిస్తృతమైనది, అప్పటికిని దీనివిస్తారమింతకంటెను హెచ్చు కాఁదగియున్నది. నిజమైనసంగతి యిది-గ్రంథకారుఁడు తనధ్యానమును దనప్రధానవిషయముమీఁద అనఁగా యుద్ధమునకేసియే యుంచెను. కాఁబట్టి ప్రసంగానుసారము విషయాంతరములఁ జొనుపుటకుఁగాఁ దనధ్యానము నట్టెవెనుకకు లాగఁజాలక యుండెను. ఉదాహరణార్థము దుర్యోధనునివివాహవర్ణన మహాభారతమున నెందును జూడఁబడదు; ఇంతియేకాదు, అతనిస్త్రీయొక్క పేరు మహాభారతమం దెల్ల నగుపడదు. ఇట్టిదశయందు నామెకు సంబంధించిన యనేకములైన చర్చలు లేక సంభాషణములు కార్యములునెట్లు జరుగఁగలవు? ఇది చూచి చదువరు లాశ్చర్యపడుదురు. ఆధునికకవులు దుర్యోధనునిస్త్రీకి భానుమతి, యని పేరుంచిరి. ఆమె విషయమున మూర్ఖతతో నిండిన కొన్నికథలనుగూడ రచించియున్నారు. కాని యివన్నియు సత్యములు కావు. ఎందుచేత ననఁగా మహాభారతమునందు దుర్యోధనస్త్రీ

యొక్క నామముకూడ లేదు. ఇలియడ్ గ్రంథమునఁ బ్రతినాయకుఁ డగు హెక్టరునియొక్క స్త్రీ పేరు ఏండ్రోమకి యని యున్నది. హెక్టరు యుద్ధమునకై వెలుపలికిఁ జనునప్పుడు తనస్త్రీతోడ నతనికిఁ గొంత కరుణాన్విత మగుసంభాషణము నడచెను. అది యిలియాడ్డునందు వర్ణింపఁబడినది. కాని భారతమునందుఁ బ్రతినాయకుఁ డైనదుర్యోధనునిభార్యయొక్క సంవాద మొకటియైనను భారతకారుఁ డిచ్చియుండలేదు. ఇందు భారతకారుని విశేషకుశలత్వ మగుపడుచున్నది. దీనికిఁ గారణ మేమనఁగా వ్యాసమహర్షి దుర్యోధనపాత్రమును మిక్కిలి మూర్ఖపుపట్టు గలవానిగను నభిమానము గలవానిగను జెప్పియున్నాఁడు. దుర్యోధనుఁడు జగడమునకై యరుగునపుడు తనప్రియపత్ని నెడఁబాయువేళ నతనినేత్రములనుండి యొక్కయశ్రుబిందువైనను గ్రిందఁబడినట్లు కవి వర్ణించియుండినయెడల దానిచేత నమ్మానవంత మగుపాత్రము కలంకిత మగును. సారాంశము, ఇక్కడఁ గవియొక్కచాతుర్యమే విశేషముగా దృష్టిగోచర మగుచున్నది. కాని యిందువలన దుర్యోధనుఁడు చాలఁ గ్రూరుఁడు లేక నిర్దయుఁ డనియుఁ దనస్త్రీని బ్రేమింపఁ డనియు ననుమానము చేయుట యుచితముకాదు. ఎప్పుడు గదాయుద్ధమునఁ దొడ పగిలిపోవుటచేత దుర్యోధనుఁడు సమరభూమియందు నవయవముల స్వాధీనత తప్పి యుండెనో యప్పుడు మహాకవి యగువ్యాసమహర్షి యతనివిలాపమునందుఁ దల్లిదండ్రులస్మరణముతోఁ బాటుగ స్త్రీయొక్కసంగతియును మిక్కిలి చాతుర్యముతోఁ జేర్చియుండెను. మఱియు నతనిముఖమునుండి యిట్లు చెప్పించుచున్నాఁడు—"ఓలక్ష్మణమాతా! నాయెడఁబాటున నీకెట్టిగతి పట్టునో గదా!" ఈవివేచనవలన మహాభారతమునందలి విషయము మిక్కిలి పెద్దది యయ్యు, నింకను విస్తృతము కాఁదగియున్న దని చదువరు లూహింపఁగలరు.

మహాభారతకథ యత్యంతవిస్తృత మైనది, అయినను వ్యాసమహాకవి దాని సంకలితముచేసి మఱియొకవైపునకు దనధ్యాన మాకర్షింపఁబడనీయకుండె ననుటకు నింక నొకయుదాహరణము నీయవచ్చును. మహాభారతమునకు ముఖ్యవిషయము భారతయుద్ధమై యున్నది; ఇందువలన భారతయుద్ధముకంటె నతిరిక్తము లగువిషయములయొక్క వర్ణనను బాగుగాఁ బెరుఁగనీయలేదు. ఉదాహరణార్థము శ్రీకృష్ణునిచరిత్ర చూడుఁడు. శ్రీకృష్ణునిచరిత్ర యెంతభాగము భారతయుద్ధముతోఁ గలిసియున్నదో యంతవట్టుమహాభారత,

మున నీయఁబడియున్నది. ఇచ్చట నతనిబాల్యచరిత్రవర్ణన యెచ్చటను గనఁబడదు. సురసమైన రుక్మిణీవివాహకథయు శ్రీకృష్ణుని యితరవివాహవర్ణనలును దీనియందు లేవు. వానియొక్క యస్పష్టోల్లేఖము లక్కడక్కడ సంభాషణమందు నగుపడుచున్నవి. కాని పరిపూర్ణము లైనవర్ణనలు దీనియం దెచ్చటను లేవు. సాధారణపాఠకులకుఁ నియ్యది గ్రంథమునకు లోపమే యని తోఁచవచ్చును. కాని యీవిషయ మట్టిది కానేరదు. ఇందు నిజముగాఁ గవియొక్క కుశలత యున్నది. ప్రధానమగు విషయమును విడిచిపెట్టి యేదేని మఱియొకవిషయమును వర్ణించుటయందుఁ దగులుకొనుట దోషమై యున్నది; గావున వ్యాసమహర్షి తనభారతమున శ్రీకృష్ణునియొక్క చరిత్రమునకు స్థాన మీయలేదు. స్థూలదృష్టి కగుపడుచున్న యీలోపమునకు సౌతి హరివంశనామకమైన ఖిలపర్వమును జేర్చి పూర్తి కావించెను. ఈరీతివలనఁ బాఠకులయొక్క జిజ్ఞాసయుఁ దృప్తి చెందుచున్నది. అదిఁగాక; మహాభారతమునయొక్క విషయము మిగుల విస్తృతమును మహత్త్వము గలదియు నై యున్నది. ఏయుద్ధమున 18 అక్షౌహిణులు అనఁగా 52 లక్షలు వీర లొండొరులతో నొకపక్షమున నేడుగురు రెండవపక్షమున ముగ్గురు మొత్తము కలసి పదుగురువీరులు మాత్రము జీవించియుండి మిగులునంతటితీవ్రతతోడను నిశ్చయముతోడను యుద్ధముచేసియుండిరో, యాయుద్ధము హోమరుయొక్క యిలియడ్డునందలి యుద్ధముకంటె మిక్కిలి పెద్దది యనుటకు సందేహము లేదు.

భారతయుద్ధమునయొక్క మహత్త్వము దీనిఁబట్టికూడ నింకను నధికమైనది. తఱచు భారతవర్షమునం దున్న రాజులందఱు నీయుద్ధమునఁ జేరియుండిరి. ఇంతియే కాదు, ఇఁక నేమంటేని భారతవర్షమున నున్న యిప్పటిరాజవంశములు తమతమవంశముల యుత్పత్తిని భారతయుద్ధవీరులనుండియే ప్రకటించుచున్నవి.ఇందుచేత నీయుద్ధమునకు రాష్ట్రీయమహత్త్వము ప్రాప్తించినది;పశ్చాంతరమున నీమహత్త్వము దానికి మొదటినుండియే ప్రాప్తమైన దని చెప్పవలసి యున్నది.కౌరవులయొక్క సంస్కృతి చాల గొప్పతరగతిలోనిదై యున్నది. కురునామము బ్రాహ్మణగ్రంథముల నాఁటినుండియు వైదికసాహిత్యమునందు మాటిమాటికి వచ్చియున్నది. ఈసంస్కృతిని సౌతి పెంచియుండు నని చెప్పవలనుగాదు. ఈయుద్ధముతో శ్రీకృష్ణుని కెక్కుడుసంబంధ మున్నది. ఈకారణముచేతఁగూడ నీయుద్ధమునకు రాష్ట్రీయమహత్త్వము ప్రాప్తించినది; ఎందు

చేత ననఁగా, ధర్మము, నీతి, తత్త్వజ్ఞానము వీనియొక్క సంబంధమున శ్రీకృష్ణుఁడు రాష్ట్రీయమహత్త్వము గలపురుషుఁడు. వీనివిషయమున ముందు విస్తరించి విచారము చేయఁబడును. ఏప్రకారముగా ట్రోజనయుద్ధము గ్రీకుల యొక్క రాష్ట్రీయయుద్ధమని తెలియుచున్నదో అదేప్రకారముగా భారతయుద్ధము భారతవాసులయొక్క రాష్ట్రీయమహత్త్వము గలది యని తెలియుచున్నది. సారాంశము, ఈమహాకావ్యమునందలి విషయము మిక్కిలి మహత్త్వము గలదియు, విస్తృత మైనదియు రాష్ట్రీయస్వరూపము గలదియు నై యున్నది. ఇప్పుడు మహాకావ్యముయొక్క రెండవముఖ్యాంగము విచారింపఁబడును.

మహాభారతమున వర్ణింపఁబడిన వ్యక్తులచరిత్రము లెంతయు నుదాత్తములైన వని విస్తరించి చెప్పవలసిన యవసరము లేదు. యుధిష్ఠిరుఁడు, భీముఁడు, అర్జునుఁడు, కర్ణుఁడు, ద్రోణుఁడు, సర్వశ్రేష్ఠుఁ డైనభీష్ముఁడును వీరియొక్క చరిత్రములచేత, ధర్మాచరణ నీత్యాచరణముల సందర్భమున నీత్యాచరణము నెదుట జీవనమును గూడఁ గొంచెమును లక్ష్యము చేయరా దని శిక్ష లభించుచున్నది. మఱియు నీతిశిక్షను భారతనివాసు లైనయార్యులహృదయములయందుఁ బ్రతిబింబితము చేయుటకై, యీచరిత్రములు నేఁడు వేలకొలఁది యేండ్లపిమ్మటను సమగ్రము లగుచున్నది. సరే, శ్రీకృష్ణునిచరిత్ర యద్వితీయమే యైయున్నది. అందలి రహస్యము, మహత్త్వము విస్తరించి ముందు వర్ణింపఁబడును. దుర్యోధనపాత్రముకూడ నుదాహరణస్వరూప మగుచున్నది. ఆలోచింపఁగా నతనిచరిత్రముయొక్క వాలు చెడుత్రోవ కేసి యున్నది. అయినప్పటికి నతనిస్థిరనిశ్చయము అతనియభిమానస్వభావము—ఎవఁడు సార్వభౌమత్వమునకును మృత్యువునకు నడుమ నేశ్రేణిని స్పృశించికూడ నెఱుఁగఁడో—అతని మిత్రప్రేమ మఱియు నతనిరాజనీతి మున్నగు నన్నివిషయములు యథార్థమున వర్ణింపఁబడియున్నవి. ఈసందర్భమున వ్యాసకవి హోమరుని పక్షాంతరమున మిల్టనుని గూడ నోడించియున్నాఁడు. హోమరునికిఁ బ్రతినాయకుఁ డగుహెక్టరుఁడు శోచనీయ మగునవస్థయం దున్నాఁడు. నిరూపింపఁగా నతఁడు తనదేశమునకు సేవ చేయుటకై తత్పరుఁడై యున్నాఁడు. అయిన నతఁడు తనప్రియపత్నియొద్ద నెపుడు సెలవుగైకొనుచున్నాఁడో, ఎపుడు తనబాలకుని ముద్దాడుచున్నాఁడో, ఆసమయమునను నతనిధైర్యము శిథిలమైనట్లు లగుపడుచున్నది. మిల్ట

నుయొక్క ప్రతినాయకుఁడు నాయకునికంటెఁ గూడ నధిక తేజస్వి యనుకో నునంత దుష్టుఁడును శక్తిమంతుఁడు నై చూడఁబడుచున్నాఁడు. అప్పుడప్పు డతఁడే కావ్యమునకు నాయకుఁ డని కూడ నూహింపఁబడుచున్నాఁడు. అది యట్లుండనిమ్ము; మహాభారతమందు వర్ణింపఁబడినస్త్రీలు, ఇలియడ్డున వర్ణింపఁబడిన స్త్రీలకంటెఁ జాల గొప్పతరగతిలో నున్నారు. హెలన, ద్రౌపదియొక్క నఖాగ్రముసుగూడఁ బోలఁజాలదు. ఏన్డ్రోమకియును ద్రౌపదికి సమకక్ష కాఁజాలదు. కవిశ్రేష్ఠుఁడైన వ్యాసమహర్షి ద్రౌపదీపాత్రమును నిజముగా నద్వితీయముగాఁ జేసెను. ఆమెయొక్క ధైర్యసంపన్నమును గంభీరము నగుస్వభావము, ఆమెయొక్క పాతివ్రత్యము, ఆమెయొక్క గృహదక్షత మొదలగు సర్వగుణములు నిరుపమానములై యున్నవి. ఇంతవర్ణన యున్నప్పటికి నయ్యది మనుష్యస్వభావమునకు విరుద్ధము గాలేదు. ఆమె తనభర్తమీఁదఁ జూపిన క్రోధము స్త్రీజాతి కుచితముగను శోభాదాయకముగను గూడ నున్నది. ఆమె పతివ్రతాస్త్రీల కుచితమైన విధముగాఁ దనపతితో వివాదము సాగించుచున్నది. ఒక్కొకపుడు మూర్ఖపుపట్టుకూడఁ బట్టుచున్నది. ఆమె యథార్థమున క్షత్రియస్త్రీ యైయున్నది. హెక్టరు యొక్కపత్నివలె నామె గోళ్లు గిల్లుకొనుచుఁ గూర్చుండలేదు. ఇఁక నేమనఁగా రాజపుత్రస్త్రీలకు యోగ్యమైనధైర్యకృత్యములను జేయుచున్నది. కౌరవులసభయందు ద్యూతప్రసంగమున నామెకుఁ గష్టము వచ్చినపుడు ఆమె మనోధైర్యమును బొత్తిగా దిగనాడలేదు. ఆమె సభాసదులను మెదలకుండ నూరకొనవలసినట్లు ప్రశ్నించెను. తరువాతఁ దనపతులను దాస్యమునుండి విముక్తులఁ గావించి యామె వారితోఁ గూడ నానందముతో నరణ్యవాసమునకై యేగెను. కుంతీపాత్రముకూడ నిట్లే యుదాత్తమై యున్నది. పాండవులయరణ్యవాసము ముగియఁగనే శ్రీకృష్ణుఁడు విదురునియింట నున్నకుంతికడకు నరుదెంచినపుడు తనపుత్రులకు నామె యతనిచేతఁ బంపినసందేశము క్షత్రియస్త్రీలకే యుచితముగా నుండెను. విదులాసంవాదరూప మగునీసందేశము మిగుల నుద్దీపకమై యున్నది. ఈసందేశమునందు నామె పాండవులకు "క్షత్రియపుత్రుఁ డగువాఁడు జయించిరావలయును లేక చచ్చియైనఁ బోవలయుఁ గాని యెన్నఁడును దిరిప మెత్తరాదు" అనితీవ్రముగా నుపదేశించెను. ఈయుపదేశము నామె తనలాభమునకై చేసియుండలేదు, ఎందుచేత ననఁగా, పాండవులకు రాజ్యము వచ్చినపిమ్మట నామె

హారియొద్దఁ జాలదినములదాఁక నుండలేదు, ఇఁక నేమనఁగా ధృతరాష్ట్రునితోఁ దపము గావించుటకై వనమునకు నడచెను. ఎపుడు, భీముఁడు కుంతిని “నీవే మమ్ము యుద్ధసన్నద్ధులఁ గావించితివి ; మఱి యిపుడు మాయైశ్వర్యము ననుభవింపక వనమున కేల యరుగుచున్నావు ? అని యడుగుటయు, నపుడామె యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను—“ నేను నాపతియున్నపుడు రాజ్యైశ్వర్యము నెంతేని యుపభోగించితిని. నేను మీకుఁ బంపించిన సందేశము కొంచెము గూడ నాలాభమునకుఁ గాదు. ఇఁక నేమంటేని మీహితముకొఱకే” పాండవుల కామె చేసినయంత్యోపదేశము సువర్ణాక్షరములతోఁ లిఖింపఁదగి యున్నది—

ధర్మే వో ధీయతాం బుద్ధి ర్మనో వో మహదస్తు చ

అనఁగా “మీయొక్క బుద్ధి ధర్మాచరణమునందు స్థిరముగా నుండునది ; మఱియు మీయొక్క మనస్సు సంకుచితముకాక విశాలమై యుండునది” సమస్తమహాభారతముయొక్క తాత్పర్య మేదో యొకయర్ధశ్లోకములో నిముడ్పఁబడినచో నది యిదే.

ద్రౌపది, కుంతి, గాంధారి, సుభద్ర, రుక్మిణి మున్నుగా మహాభారతమందు వర్ణింపఁబడినస్త్రీలు మిగుల నుదాత్తమైన చరిత్రము గలిగి యున్నారు, వారియందు మనుష్యస్వభావముయొక్క తళుకును వ్యాసమహాకవి చూపియున్నాఁడు. ఉదాహరణార్థము, సుభద్రావివాహసమయమున ద్రౌపది యర్జునునిమీఁద దనమత్సరభావము నొకచక్కనివాక్యముచేతఁ బ్రకటించినది.

తత్రైవ గచ్ఛ కౌంతేయ యత్ర సా సాత్వతాత్మజా ।
సుబద్ధస్యాపి భారస్య పూర్వబంధః శ్లథాయతే॥

అనఁగా—“మోపునకు మొదటికట్టెంత గట్టిగా బిగింపఁబడినదియైనను అది రెండవమాఱు బిగింపఁబడినయెడల దానియొక్క మొదటికట్టు కొంచెమో గొప్పయో సడలకమానదు” కర్ణునివిషయమునఁ గుంతియొక్క పుత్రప్రేమ యుద్ధమైనతరువాతఁ గూడఁ బ్రకట మగుచున్నది. ఉత్తర బృహన్నలతో నిట్లు చెప్పుచున్నది—“రణభూమినుండి మంచిమంచి వస్త్రములు నాబొమ్మలకు మఱపుఁ జెందక తెచ్చిపెట్టుము” ఇటువంటి వింకను ననేకోదాహరణము లీయవచ్చును.

(సశేషము.)

శ్రీ

# కవినాథుని వీథినాటకము.

—కొత్తపల్లి సుందరరామయ్యగారు—

## పీఠిక.

సీ. పీతాంబరముఁ బోలుపీతాంబరముతోడఁ బరశుభాస్వత్పుస్తకముతోడ
సరళచంచద్గదాసదృశలేఖినితోడఁ గంబుసమానగళంబుతోడ
వనమాలికాసదృగ్వనమాలికలతోడ సుశ్రీసదృక్షసుశ్రుతులతోడఁ
జక్రసన్నిభవిలసద్వదనముతోడఁ గమలోపమాననేత్రములతోడ
నేను శ్రీనాథుఁడనటంచు నానవాంబుజమునఁ గాన్యాక్షిచిహ్నములఁ సందడింప
నేమియోపల్కఁబోవనేనేమస్కరించియిట్లంటి భక్తిపూరితుఁడనగుచు.
గీ. ఆత్మలోఁ బూర్వపరిచితు నట్లె యెంచి, గౌరవించి క్షేమంబు నింపార నడిగి
పిలువనంపిన నే రానె? పెద్ద లీరు, శ్రమవహించితిరే! కవిసార్వభౌమ! 2
చ. అనిన మహాదరంబు వదనాంబుజసీమ నటింపఁ జెంతకుం
గొని నను వీఁపుదట్టి కనుఁగొంచు వచించెను నవ్వులాలగా
నిను బిలిపించుకాలము గణింపఁగ ముందుననుండె, నేఁడు నా
పని నెఱవేర్ప నీవ తగువాఁడవు గాఁ దలపోసి వచ్చితిన్. 3
సీ. స్వస్థానవేషభాషామతగ్రాహ్యం బటంచు వైయాకరణాళి పలుకఁ
బ్రధ్వంసనత్యాగభావాదివాదముల్ మెలుపునంచునుతార్కికులు వచింప
ఘనపదసత్ప్రయోగఖ్యాతి విలసిల్లు ననుచు మోదమున లాక్షణికు లాడఁ
గాల ప్రమాణవిజ్ఞానప్రదం బంచుఁ జారిత్రికులు ప్రీతి సంస్మరింపఁ
జాలకాలమునుండి ప్రశస్తిఁ గనిన, నాదుపేరిటి నావీథినాటకంబు
పేరుమాయుట నిద్రయు హారముడిగి, చింతిలుచునుంటి నేమని చెప్పవాఁడ. 4
గీ. రాజకవిరాజులునుగవిరాజులెలమి, నిలుపఁదలఁచి ప్రయత్నముల్సలిపి చలిపి
నిష్ఫలంబైన వనట మునింగిరకట! నేనె తెచ్చితినీగోడు నిశ్చయముగ. 5
ఉ. పూర్వకవీశ్వరాత్మలు ప్రపూర్ణముగా భవదాత్మ నిల్చెనో
పూర్వకవీశ్వరాత్మలఁ బ్రపూర్ణముగా భవదాత్మ నిల్చెనో
సర్వకవిత్వజాలములశైలి లిఖింపఁగఁ జాలినాఁడ వీ
పూర్వర వీథినాటకము నొప్పగ వ్రాయుము నన్ దలంపఁగన్. 6
క. అని తప్పదు నీకీపని, యని నవ్వి కరంపుఁదాటియాతులపోత్తం
బును జూపి తొలఁగె నిమురం, గని యే నిట్లంటి తెల్విగడలుకొనంగన్. 7

చంపకమాలిక.

నలువుగ విద్వదౌషధము నైషధముం బొనరించినాఁడ విం
పలర మరుత్తరాట్చరిత నా నని మెచ్చఁగఁ జేసినాఁడ వు
జ్జ్వలతరశాలివాహనసుసప్తశతిన్ రచియించినాఁడ వ
గ్గల మగులోహపిండము నఖండకరండము కాశిఖండమున్
లలితవిలాసమున్ హరవిలాస మజాండము భీమఖండముం
దలఁ బలనాఁటివీరచరితంబు నుతింప నొనర్చి పేర్చి కే
వలరసవత్తర ప్రచురపండితపూజ్యచరిత్ర వ్రాసి పే
ర్వెలనగు దానికంటె శివరాత్రిమహత్త్వము నారచించి భూ
వలయమునందుఁ బేర్వడినవాఁడవు ; పాడవుఁగాక దీనికిం
గలఁగఁగ నేల యల్పతరకావ్యము దీన భవద్యశంబు వీ
థులఁబడనేల పోల దిటు దుఃఖముఁ జెంద మహాకవీశ్వరా ! 8

గీ. నీది కా దని యగు నని వాదులాడు,చున్నవారిద్ది మఱియును గొన్ని పదము
లల్పసంఖ్యాకములగు పద్యములుఁబోవ,నిప్పునీకేమి దీన బుధేంద్రకోటి.

గీ. అనిచుఁజెఱుచప్పనవ్విపైవన్నియునొక, యెత్తుతలపోయనిదియొక యెత్తునాకుఁ
ప్రచురపండితపామరరంజకంబు, దీని నల్పంబుగాఁగ మదింపవలదు. 9

మ. అని యేమేమియొ పల్కఁబోవునెడ శయ్యం దోడ నిద్రించునం
దను నేప్పు న్విని లేచి చూచినను శ్రీనాథుండు లేకుంట, తె
ల్లనివ్రాలం గవినాథనామమును బల్లం గాంచుటం దద్విలా
సనిబద్ధంబుగ వీథినాటకము స్వేచ్ఛం జేయఁగాఁ బూనితిన్. 10

శా. దళ్ళంగట్టితి, గడ్డిమోచితి, ఘనధ్వాంతంబులం జేలలో
మళ్ళం బండితి, బ్రాహ్మణార్థముఖకర్మల్ చేసితిం, బెక్కు లం
గళ్ళం బెట్టితి, నొంటిపూఁటదిని వీఁకం "జాకిరీల్" చేసితిం
దల్లీ! యాంధ్రసురాజ్యలక్ష్మి! దయలేదా! నేను శ్రీరాముఁడన్. 11

సీ. అక్షరలక్షలం చన్పించినావు బందరున దొడ్డమపేఁటధవుని పెండ్లిఁ
గృతినందు వేళ సన్నుతిసేయఁ బంచితి వేంకటగిరిమహావిభుని చేతఁ
జే దోడువా దోడుగాఁ దోఁపనుంటి, విరాట్పురాణోద్గ్రంధరచనయందుఁ
ప్రకటాధునికభారతకవిత్వమిచ్చితి, గరుడగర్వవిభంగకావ్యమునకు
నెట్లు కరుణింతువో నన్ను నింకమీఁద, భుజగరాయక్షమాధీశసద్ద్విజకవీశు
శారదావిలాసంబునఁ జేరి నీవు, సన్నుతలసత్కవికదంబ! శారదాంబ!

## వీథినాటక ప్రారంభము.

సీ. మేలిమైడాలు మకరాలంబులోనుండి పొంగి జెఱంగుతోఁ దొంగిచూడ
మృదులాంఘ్రిపద్మమంజీరద్యుతులు కాలిదివిటీలుగా సన్నిధిని వెలుఁగ
సత్కృపాక్షౌద్ర విశాలాక్షిపద్మముల్ వదనసరస్సీమ గడిసి విరియ
నవరత్నకంకణచ్ఛవినించుకరమునఁ గాంచనదర్వి రాణించుచుండఁ
గాశికాపురవీథులఁ గలయఁ దిరిగి, యిష్టమృష్టాన్నములఁ బ్రజ కీయనేగ
నున్న *విస్సన్న చెలిమిన్న నన్నపూర్ణ, నరసి నిల్వ భిక్షాందేహి యంటినేను.

సీ. ఘనశిరోమాలికాకలితవక్షముతోడ ముకుఁజెఱుమలఁ గోపమును వహించి
తతశాతఖడ్గరాజితకరాబ్జముతోడఁ గనుఁగొలుకులఁ గ్రోధమును వహించి
నవరత్నమకుటసన్నద్ధమూర్ధముతోడ భ్రూలతలను గ్రౌర్యమును వహించి
ఖరదైత్యఘట్టితచరణాంబుజముతోడ ముఖసీమ రుద్రత్వమును వహించి
కాశిపట్టంపువీథులఁ గాళి దిరుగ, నన్నిటికిని వెఱచి యోయమ్మ! నాకు
విద్య నిమ్మని కాల్వట్టి విడువకున్న, నాల్కపై నేమియో వ్రాసి నన్నుఁబంపె.

మ. నిమిషార్థంబునఁ బంచభక్ష్యములతో నేర్పొప్పఁగా వండి మో
దముతో నేకమహాశనంబునఁ బ్రసాదం బిచ్చి యేబిక్షఁ దే
శ్రమముం జెందునో యంచుఁ గాచుకొని నిచ్చల్ శ్రీజగన్నాథవీ
థి మనోజ్ఞాకృతి సంచరింపఁ జను నాతి న్మ్రొక్కి †జగ్గప్పపెం
డ్లము సుబ్బమ్మను గాంచి చేలమును నేలం జాచి యాచించితిన్.

సీ. ఘననీలములడాలు గొనఁజాలు నలకల నాని చెంపసరంబు లందగింపఁ
జెంపసరంపునిద్దంపుఁగాంతుల నాని బంగారుబొగడలు రంగుమీఱ
బంగారుబొగడలఁ బొంగారురుచిదారి నాని తాటంకంబు లవఘళింప
బలుకెంపురతనంపు చెలువంపుఁగెమ్మోవి నాని ముంగఱ కాంతు లీనుచుండఁ
జంద్రికావరివేష్టితచంద్రబింబ, మనఁగ నగుమోము దోఁపఁగా నరసవల్లి
వీట ‡సూరన్నసతి స్వారివెడలఁగంటి, నామెకో§చాయమ్మతల్లి యంచుఁ దఱిని.

సీ. ఘనసారమిళితచందనకర్దమము మేన వాసింపఁ జక్కఁగాఁ బూసిపూసి
గొజ్జంగిపూవురేకుల హిమాంబువుల లోఁ గనకచేలంబును గట్టికట్టి

---

* విస్సన్న = విశ్వనాథుఁడు.
† జగ్గప్ప = జగన్నాథస్వామి. సుబ్బమ్మ = సుభద్ర.
‡ సూరన్న = సూర్యభగవానుఁడు. § చాయమ్మ = ఛాయాదేవి.

మృగమదసౌరభమృదులసిందూరంపుఁ దిలకంబు మోమున దిద్దిదిద్ది
బహువిధనవరత్నభరితభూషణపఙ్క్తి నొడలెల్ల వెలయంగ నుంచియుంచి
వేడ్కతోడ సింహాచలవీథి భక్త, వర్గమునకు ఫలంబు లవ్వారి నొసఁగు
చున్న *యప్పన్నయిల్లాలి నన్నుమిన్నఁ, గంటి నాదెమ్మలచ్చమ్మఁ గన్నులార.

సీ. నాసికిముత్తెంపునత్తు సంతసమిడఁ గనుదోయి భయమును గడలుకొలుప
గళమున బంగారుకంటె మోదంబీయ ఘనశిరోమాలిక ల్వనటఁ బెంప
హస్తంపుదివ్యప్రహారంబుఁ గావింప ఖడ్గహస్తము భయంకరముగాఁగఁ
గాలియందియలుచోక్కంబుగఁ గాన్పింపఁ బ్రోక్షంగఁ బడినమర్త్యుఁ డుభయమిడ,
నలరు చెంపుర్తివీథి నూకమ్మఁ గాంచి, కృతయుగంబున రేణుక, త్రేత సీత,
ద్వాపరమ్మునఁ గృష్ణ, నీవకలిసెల్ల, గృహములనుశక్తివఁటమగం జెవఁడటంటి.

సీ. కెనిమిటి రుమరాక పేరులం గోరినఁ బా రత్నహారసంతతులఁ గోరుఁ
బతిమేనఁ బూయంగభస్మంబుఁ గోరంగఁ బాఁ గుంకుమంబు మోదమునఁ గోరు
స్వామి కట్టుకొనంగఁ జర్మంబులం గోరఁ బాఁ జిత్రవర్ణవస్త్రములఁ గోరు
వల్లభుం డెక్కంగ బక్క యెద్దును గోరఁ బాఁ మృగరాజరత్నంబుఁ గోరు
నట్టి †కూటన్న చెలిసి రాజమ్మఁ గాంచి, కోర్కు లడుగంటి యేమిషల్లుటకు లేక,
యమ్మ! నీకాఁపురంబు బాగైనఁ జాలు, నని తొలంగితి పీఠపత్తనపువీథి.

చ. తలఁగలగంగ దింపు నిరతం బభిషేకజలంబె నీదునాఁ
దలఁ గలమేకునుండి దిగి తద్దయు శైత్యముసేయునేమొ నేఁ
గలఁగెద నంచుఁ బైఁటఁ గడఁకం దడియొత్తుచు ద్రాక్షవాటివీ
థి లలి వెలుంగు‡భీమనసతీమణి మాణెమఁ జండిఁ గాంచితిన్.

సీ. శ్రీరామచంద్ర రంజితపదాబ్జంబులఁ దూఁగాడు తేఁటికన్దోయితోడ
రఘుకులతిలకవిగ్రహనీలమేఘజన్యం బగువిద్యుదంగంబుతోడ
దశరథపుత్త్రహృదయపంజరస్థితి ప్రాణమైతగు శుకవాణితోడఁ
గాకుత్స్థవరభుజాస్కంధావలంబన లలితంబులగు బాహులతలతోడ
నలరు భద్రాద్రివీథి§రామన్నపత్నిఁ, గాంచి, సీత! గోపన్న చేయించినట్టి
నాఁటిచింతాకుపతకంబునాకుఁ జూపు, మమ్మయనమాయతికొసంగితనివచింతె

---

*అప్పన్న=వరాహ అప్పలనృసింహస్వామి. ఆదెమ్మ లచ్చమ్మ=ఆదిలక్ష్మి.

†కూటన్న=కుక్కుటేశ్వరుఁడు. రాజమ్మ=రాజరాజేశ్వరి.

‡భీమన=భీమేశ్వరుఁడు. మాణెమ=మాణిక్యాంబ.

§రామన్న=శ్రీరాముఁడు.

ప్రబలు శ్రీరంగనాయకపత్ని రంగ, నాయకినిగాంచితల్లి! పెన్నయిదివొంగఁ
చెరువు నీకెద్ది యనిన గోపురము లేదె, వెడలుమన నేను నెల్లూరివీథిఁజనితి.

సీ. మారేడుదళమిాయ నీరేడుభువనముల్ పాలింపనిడునట్టిభర్తఁ గూడి
భూతినిచ్చినను విభూతు లెన్నిదిటికి నాయకత్వ మొసంగుసాధుఁ గూడి
విషబిందువిడిన దుర్విషయనిరాశుగాఁ జలిపెడుప్రాణేశుఁ జక్కఁ గూడి
తలపోయునంత భూతలపతిత్వ మొసంగి మంతునక్కెక్కించు మగనిఁ గూడి
యలరు*మల్లయ్యసతిభ్రమరమ్మఁగాంచి, జననిపలుజన్మలెత్తంగఁజాలనింకఁ
గావు మన మాశిఖరమును గాంచు మనినఁ,జూచిశ్రీశైలవీథినిజొచ్చినాఁడ.

సీ. సాలిపుర్వునకు మోక్షంబిచ్చె నాభర్తయనునుబ్బు మొగమున నాటలాడ
వారణంబునకపవర్గంబొసఁగెనాయొడయఁడన్న మోద మోక్షముల నెగుర
బోయవానికినిడె ముక్తినాపతి యనుసంతస మంబకస్థలి నటింపఁ
బన్నగఁబునకునిర్వాణంబుఁగూర్చె నారమణుఁడన్నుదముకన్నొమల మెలఁగఁ
దనరుచును గాళహస్తివీథిని జరించు, కాళహస్తీశ్వ[illegible]†జ్ఞానమఁ గని
తల్లి! మృత్యుంజయుండు నీవల్లభుండు, చావు లేనివరంబు నిచ్చు నిడుమంటి.

సీ. వడ్డికాసులు పెంచి యిడ్డద్రవ్యముఁ గూర్చి కొన్నయొడ్డాణంబు వన్నెమిాఱ
చెప్పుదెబ్బలుదిని చెల్లించినధనంబుఁ జేర్చికూర్చిన కంఠి చెన్నమిాఱ
ముండనంబునఁ గొన్న మూల్యంబునుం బేర్చివిలిచినపతకంబు చెలువుమిాఱ
నిలువుదోఁపిడుల గణించిన నవరత్నభూషణంబులు [illegible]
వెలయు తిరుపతివీథిని వేంకటప్ప, కాంత నలమేలుమంగమ్మఁ గాంచియమ్మ!
నీకు నాంచారికిని స్నేహమే కదమ్మ, యనినఁ గన్నన్న సేసె మాటాడకుండ.

సీ. ఆయమ్మచెవులలో నాలోచనముసెప్ప తాటంకకృతసుకృతం బదేమొ?
ఆతల్లిపెంపంబు నంటియుండఁగ హారతతియొనర్చినసద్వ్రతం బదేమొ?
ఆమాతకరములతో మైత్రినెఱపంగఁ గంకణభాగ్యసంఘం బదేమొ?
ఆయంబచరణసేవాసక్తి విడనినూపురము లొనర్చినపుణ్య మేమొ?
అనఁదగిన పార్థసారథి యనుఁగుటింతి, వేదవలిఁ దిర్వలిక్కేణివీథిఁ గాంచి
అమ్మ! యెవరిసారథి యివ్వఁ డయ్యగార,టన్న నవ్వుచు వెట్టించె నట్టిముక్క.

సీ. చరణపద్మముల భాస్వరత గన్పడకుండఁ జంద్రికాధౌతవస్త్రమును గట్టి
రమ్యవక్షోసీలరత్నాళిరుచి తేటపడకుండఁ గనకపుష్పములఁ దాల్చి

---

*మల్లయ్య = మల్లికార్జునుఁడు.

†జ్ఞానమ = జ్ఞానప్రసూనాంబ.

చెక్కుటద్దముల విశేషకాంతులు బయల్ గాకుండ గంధపంకంబుఁ బూసి
తెలిదమ్మికన్నుల తేట దోఁపకయుండఁ జలువకప్పురపుటంజనము దిద్ది
పొందుపడఁజెన్ను పురవీథిఁ గందసామి, వల్లభను వల్లిఁ గాంచి యో తల్లి! యేమి
యడుగఁబోను నరేంద్రుఁడనగు మనహినో, సంగుమన్న నీ నెమ్మికిఁ జాలవనియె.

సీ. ఘనదయామృతము లోచనపద్మములనుండి యుచితగతిఁ బ్రవహించుచుండ
స్థిరదరహాసచంద్రిక సముజ్జ్వలముగ ముఖచంద్రమండలమును లగింప
సకలామయధ్వాంతసమితి నడంచు భాస్కరదీధితులు మేన నిరవుకొనఁగ
హితభక్తవిసరవాంఛితము లీడేర్చు బాహులతలు కల్పలతోపమలుగ
వేత్రతోఁ దిరువళ్లూరివీథి రాఘు, వయ్య సతి కనకవలి పంగ్వాంధబధిర
కుష్ఠరోగార్తజనబాధఁ గూల్పఁ గాంచి, నాశరత్వంబుఁ బాపుమన్న వినిన వ్వె.

సీ. నవరత్నభూషిమండనమండితము లగు కాంతులు దిక్కులఁ గలయఁ బర్వ
నూత్నదుకూలమంజులరుచిపుంజమౌ మేనిబెడం గజ్జ మించి వెలయ
సద్యోవిలిప్తసత్సారంగమదయుక్తగంధసౌరభము భక్తతతిఁ దనుపఁ
గ్రొమ్మించు తీవల గుదియించు కరుణాకటాక్షేక్షణములు వేడ్కలను బెంప
నలరు శివకంచివీధి నేకామ్రనాథు, సతిని గామాక్షిఁ గని తల్లి! చదికిలఁబడఁ
బోకుము పురాతనంబౌటఁ జికియుండె, నీదుపీఠం బనిన నవ్వి నిలిచియుండె.

సీ. కలకలనవ్వు మొగంబుతో మాచెంత కరుదెంచునని భక్తు లలరుచుండ
సకలభాగ్యములు విచ్చలవిడి దయసేయునని సేవకులు మోదమును వహింపఁ
బాపసంచయమును బాపి రక్షణసేయు నని కొల్చువారు నిత్యము నుతింప
మోక్షంబొసంగఁ బ్రేముడి మీఱఁ గనుఁగొనునని బంటులానందమునఁ జరింప
నలరు*వరదప్ప కొమ్మఁ బేరమ్మ విష్ణు, కంచివీధిని గాంచి నన్నేంచు తల్లి!
భక్తవరదుండు నీభర్త భక్తవరద, వీవు గావున భక్తంబు నిమ్మటంటి.

ఉ. మంగళరత్నకంకణసమంచితపాణుల నాథునంఘ్రులు
ప్పాంగుమ నొత్తు రంగపతిముద్దుపడంతిని రంగమాంబ శ్రీ
రంగము వీథిఁ గన్గొనుచు రంగమతల్లి! భవద్విభుండు ని
ద్రం గను మోడ్పఁబోఁ డీకనోటింగుము పాదము లొత్తువాడ నే
కుం ; గలుమంబు లెల్లఁ గడకుం దొలఁగింపు మటన్నఁ దానగెన్.

---

*వరదప్ప=వరదరాజు. పేరమ్మ=పెరుందేవి.

చ. తొగరుచి కెంపు మోవిరుచితో దరహాసముఖంబుతోడ, భ
క్తగణముతోడఁ బల్కెడుచొకాటముతోఁ దనరారునట్టి క
ల్కిగనిన *సుందరప్పసతి మీనమఁ గాంచుచుఁ దల్లి! నీకు నీ
మగనికి నర్ధరాత్రమున మాటలు లేవనుకొందు నన్న దీ
విగఁ గని పల్కుమిన్ మధురవీధిఁ దొలంగితి సారెమ్రొక్కుచున్.

మ. అకులీనుండుఁ గులీనుఁ డంచు మది వ్యత్యాసంబు లేశంబుఁ జూ
పక ధర్మాత్ములె భక్తకోటి యనునాపంచాపకేశప్రియాం
తికపత్నీతిలకంబుఁ బంచనదవీధిం గాంచి, †ధర్మమ్మ! ప్రే
మకుఁ బాత్రుండను ధర్మిఁ జేయు విది ధర్మం బేయనం దానగెన్.

శా. దారిద్ర్యం బెడఁబాపుకన్నుఁగవఁ జంద్రజ్యోత్స్నలీలన్ దయా
సారం బల్లెడఁ [illegible]హాదీశప్రేష్ఠపత్ని న్నమ
స్కారంబుల్ బచరించుచుం జనుచుఁ దంజాపూరివీధిన్ ముదం
బారం గాంచుచుఁ దల్లి! జెట్టి గఱచెన్ హా! హా బృహన్నాయికా!
మీరల్ దంపతు లేకనాము లిడుమీ వృత్తింత యన్నన్ నగెన్.

మ. కనుఁగొన్నంతన మంగళంబు లిడు, వేడ్కం బిల్వం బల్కున్, జనా
వనదీక్షుం గొనె నంచు భక్తులు వచింపం గుంభకోణంపు వీ
థిని గుంభేశ్వరుపత్ని మంగళమ నర్థిం గాంచి తల్లీ కృశా
నుని గన్నన్భయమయ్యె నీవిభునికన్ను న్మాసినం జేరి నీ
ఘనపాదంబులు గొల్చువాఁడ నన వేడ్కం జూచి నవ్వెన్ననున్.

సీ. అడుగనివానిది యా పాప మాయమ్మ పెట్టుపోతల లేనియట్టివాఁడు
కోరనివాని దా నేర మాజనయిత్రి యనురాగమును బొందనట్టివాఁడు
వేఁడనివాని దా వేసట యాతల్లి యభిమానమును గాంచనట్టివాఁడు
తలఁపనివాని దా బలువంత యమ్మాత యాదరంబును జెందనట్టివాఁడు
లేఁడనఁదగు ‡ననంతయ్య లేమలక్ష్మి, నలయనంతశయనవీధి నమరఁ గాంచి
యమ్మదారిద్ర్యమును బాపుమంచు వేఁడ, దండకొక త్రాఁడు గట్టిపోఁదటె మెనన్ను

---

*సుందరప్ప = సోమసుందరేశ్వరుఁడు.

†ధర్మమ్మ = ధర్మసంవర్ధని.

‡అనంతయ్య = అనంతపద్మనాభస్వామి.

సీ. పొందితో వైకుంఠముపకుఁ బాపెదమిమ్ము రంపని పిల్చుకరంబుతోడ
నమగుఁడీ నానాథు వాస్తులనెడఁబాపుఁ గదనాతోసనెడి క్రేఁగంటితోడఁ
బొడకట్టె మీపాపపుణ్యంబు లాత్మ జాగ్రత్తయు స్వప్నమొగంబుతోడఁ
బిల్వఁడీ భక్తి నావిభు నాదరంబునఁ దనుజేర్చునసెడి యుత్సవముతోడ
వెలయువైకుంఠనాథుని వెలఁదిమిన్నఁ, గూర్మి వైకుంఠవల్లి వైకుంఠవీథిఁ
గాంచి యోతల్లి నాపాపకర్మసమితి, లెక్క వెట్టితివే యనఁ బక్కనఁగ.

సీ. కుంతలకుంతరూపాంతరమై తోఁప విద్వేషిగణములు నెత మునుఁగవె?
బొమ్మపేరమ్ము వీరమ్మునఁ గన వైరివర్గమ్ము దవ్వులఁ బాఱకున్నె?
చూపుదూపుల సోఁగఁజోపిన శత్రుసంఘంబు నిల్వఁగను భస్మంబుగాదె?
కరకరవాలభీకరమూర్తి నిలిచిన నహితసందోహంబు లణఁగిపోవె?
యనఁగ వెలయు సుబ్రహ్మణ్యునాతి దేవ,సేన యయ్యుడిపివీథినిగానుపింప
జనని నీసాయమునఁగా దెజయమునురల,కబ్బె లేమికుమారునకగు నెయంటి

ఉ. నుదుటం గుంకుమబొట్టు పెట్టియనఁ గన్పట్టెమ్మిల్ తమద్యూతిభూ
మదళంబోయన నీశ్వరత్వము ప్రేమనొప్పమునం జూపున
పద రామేశ్వరవీథి వర్ధనము రామ*రామనాథేశకాం
త దయాస్వాంతను జూచి తల్లి! హిమవంతం బేడ నీసేతువే
డ దిగంతంబుచఁ బద్ధదానవన వేడ్క న్నవ్వుచుం బొమ్మనెన్.

సీ. బుగ్గఁగాటుకచుక్కబొట్టని కొందఱుఁ, గస్తూరికాతిలక మని కొంద
ఱళినీలకుంతలం బగునని కొందఱుఁ గందోయియంచును గొంద ఱక్షి
తారకలంచుఁ గొందఱుఁ గనుబొమలని కొందఱు,ముఖచంద్రు కందుగాఁగ
వర్ణింపఁదగి పెండ్లిపడుచు వేషముతో ననంతశయనపట్టణాంతికమున
నబ్ధితీరవీథిఁగల కన్యాకుమారిఁ,గాంచి గౌతమశాపంబుఁ గడచు కేమె?
నీశ్వరుఁడు వచ్చుటెడ నీకింకనైనఁ, దల్లి! యూరికిఁబొమ్మన్న నొప్పదయ్యె.

సీ. పతిదిగంబరుఁ డనుభావమించుకలేక యాత్మయిచ్చెడుప్రియుం డంచు నమ్మి
విభునిభిక్షాటనవృత్తికిఁ గలఁగక యర్థమిచ్చెడు ప్రియుం డంచు నమ్మి
పురుషుండు బూడిదెబుస్సన్న యనఁబోక యైశ్వర్యమిడు ప్రియుండంచు నమ్మి
భర్త యప్పులమున్నవాఁ డని తలఁపక హాళిఁగూర్చెడుప్రియుం డంచు నమ్మి
కొలుచు నాజంబునాథేశకొమ్మ జంబుకేశ్వరమునీసని చెంతలాండేశ్వరమ్మఁ
గాంచియోతల్లియప్పులముంచుమగని,యింట నెట్లుంటివవనేగి మేగమసి తెతె.

---

* రామనాథేశుఁడు=రామనాథస్వామి. వర్ధనము=పర్వతవర్ధనమ్మ.

సీ. దివ్యకావేరీనదీతరంగానిలశీతలంబునఁ జిచ్చుచెట్ట లేక
ప్రాలేయగిర్యోషధీలతామణివలయములచే సర్పభయమ్ము లేక
ఘనతరసింహవాహనసముద్ధతిఁ జేసి కరిచర్మవసనవిడ్వరము లేక
నిర్మలామృతపాననిరతరక్షణమున నాతతదుర్విషభీతి లేక
యీశుసేవించు మాతృభూతేశుకూర్మి,పత్నిని సుగంధికుంతలాంబఁగనితల్లి!
మగనిఁజేసితి మంత్రసానిగ నను నెటు,పంతొ యని పోతిఁ దిరిచినా, ౖలేప్,.

ఉ. మొగమున మంగళాంకము సముజ్జ్వలసౌష్ఠవమీన వెల్గు భ
ద్రగుఁ డయియొప్పు దేవనటరాజవధూమణి దేవతామణిం
దగు శివకామసుందరిఁ జిదంబరవీధిని గాంచి నేఁడు నీ
మగఁ డిట నాడువాఁడయిన మాతరొ ! నీవును నాఁడుదానవే
యగుదువుగాదె యంచుఁ బరిహాసముఁ జేసిన నవ్వె పొమ్మనెన్.

సీ. క్షితిని బురాణదంపతు లన్న పేరున్న నార్యయైయుండె నేయతివ సతము
అర్థహీనగృహిణి యైయున్నను నపర్ణ యనియెన్నఁబడియె నేవనిత సతము
మందాకినికిఁదాను ముందరిదైయున్న గౌరినాఁజాలు నేగరిత సతము
చండీసమాఖ్యఁ బ్రచండురాలయ్యు శాంకరినా నెసంగు నేకలికి సతము
నట్టిదైన యపీతకుచాంబ నంబ,నల్ల*యరుణయ్యసతి నరుణాచలంపు
వీధిఁగని తల్లి! పాలీవు బిడ్డలకును,మగనిపాలఁ దక్కుదు రే నిసుఁగులన నగె.

సీ. చక్కెరమీఁగడల్ మెక్కుట మసృణమై యొప్పుపల్కుస్పుపై నూహగలిగి
కమలానివాసయోగ్యం బయి వెడఁదయై యలరువక్షంబుపై నాసగలిగి
బంధురోలూఖలబద్ధప్రసిద్ధమౌ నవలగ్నమున మహాత్సవము గలిగి
వల్లవీజనకరపల్లవసేవ్యమై వెలయుపాదములపై వేడ్కగలిగి
కూర్మిమన్నారుగుడివీధి† గోపబాలుఁ, దగవరించిన చెంగమ్మతల్లిఁ గాంచి,
అమ్మ! మీకనకవనమ్మునందుఁ గసవు,పసిఁడిగాఁబోలు మేయు నేపసువులంటి



---

*అరుణయ్య = అరుణాచలేశ్వరుఁడు.
†గోపబాలుఁడు = రాజగోపాలస్వామి.

# గ్రంథస్వీకారము

1. ౧. ఒథెల్లో:—వెనీసునగరపుమూరు ; ౨. హ్యామ్లెట్ - డెన్మార్కు కుమారరాజా. ఈ గ్రంథములు పాశ్చాత్యనాటకచక్రవర్తి యగుషేక్స్పియరుయొక్క విషాదాంతనాటకములలో నగ్రగణ్యము లగుహ్యామ్లెట్, ఒథెల్లో యనువాని కాంధ్రభాషాంతరీకరణములు. ఇందలిశైలి నూతనకల్పనలతో నింపుగను వింతగను నున్నది. గ్రంథకర్తకుఁ గలభావోద్రేకముచే నొకొక్కచో నపూర్వపదప్రయోగ మొనర్పఁబడినది. వలయువారు గ్రంథకర్తయగు కాకినాడలో జాయింటుసబురిజిస్ట్రారునగు మహారాజశ్రీ గోగులపాటి వీరేశలింగముపంతులు బి. ఏ. గారికి వ్రాయవలయును.

2. సరోజిని లేక కన్నీరుకత:—ఈగ్రంథము పార్వతీపురవాస్తవ్యులగు మహారాజశ్రీ అనంతపంతుల వెంకటేశ్వర్లుపంతులు బి.యే., బి.యల్. గారిచే రచియింపఁబడినది. పద్యకావ్యము. శైలి నాతికఠినమై యుచితపాకమున నలరారుచున్నది. పాశ్చాత్యకథానిర్మాణచాతురి ననుసరించి కథ కూర్పఁబడియున్నది. శైలికై రెండుపద్యములు—

ఉ. అంబుజమిత్రుఁ డీడెఁ జరమాద్రిని ; జీకటిరాకఁ దెల్పు న
ల్లంబుదపాళి నింగి నడయాడె ; సుగంధమరుత్కిశోరముల్
సంబర మొప్ప నాడె ; ద్విజసంతతి బంతులుదీర్చి వేడ్కమై
యంబర మంటి పాడెఁ ; బశులార్చుచు దూడలఁగూడె బాలిడన్.

గీ. ప్రాణమిత్రునిపై పొలయల్కనూని
సుఖకరాశ్లేషదూరయా సుదతివోలెఁ
దూర్పుదిక్కున రవి తోఁపఁ దొలఁగి యపర
దిశకు నటువోని నిపుడుఁ దూర్పు దిరిగెఁ జాయ.

గ్రంథమున నచ్చటచట, కండ్లకు, తనెత్తుపసిండి మొదలగు లక్షణవిరుద్ధప్రయోగములు గలవు. వెల రు 1-0-0 పార్వతీపురమున గ్రంథకర్తగారియొద్ద దొరుకును. దీనిని ఇంటరుమీడియేటు పరీక్షకు నియమించిరి.

3. ప్రతాపసింహ :—గ్రంథకర్త మ॥ కోటమర్తి చినరఘుపతిరావుగారు, కాకినాడ. షేక్స్పియరుచే రచియింపఁబడిన హ్యామ్లెట్ నాటకము ననుసరించి రచింపఁబడిన విషాదాంతనాటకము. హ్యామ్లెట్ నాటకమునందలి

పాత్రముల నామములు తెనుఁగుభాష కనుకూలముగ మార్పఁబడినవి. కథాభాగమునందునుఁ గొలఁదిమార్పులు గానవచ్చుచున్నవి. వెల రు 1-4-0. గ్రంథకర్తగారియొద్ద దొరకును.

4. స్త్రీపురుషరహస్యములు:— (Some problems of Sex) ఈ గ్రంథము విశాఖపట్టణమున రోగవ్యాప్తిఖండనసంఘమువారిచేఁ బ్రచురింపఁబడినది. ఎల్లిసు, మేరీస్టోప్సు, కార్పెంటరు మొదలగుపాశ్చాత్యుల గ్రంథములననుసరించి గర్భనివారణసూత్రములు, వానిధర్మాధర్మవిచారణయు నొనరింపఁబడినవి. వెల 8 అణాలు.

5. మణిభూషణము :—(రెండుభాగములు) ఇందలిపద్యములు మహారాజశ్రీ చేకుమళ్ల రాజగోపాలరావు బి. ఏ. గారిచేఁ బోతనామాత్యుని భాగవతమునుండి సంగ్రహింపఁబడినవి. గజేంద్రమోక్షణము, రుక్మిణీకల్యాణము, ప్రహ్లాదచరిత్రము,వామనచరిత్రము కుచేలోపాఖ్యానము మొదలగునవిగలవు.

6. పిల్లలపద్యములు :—పిల్లలచేఁ దఱచుగ నాటలాడుకొనునపుడు పాడఁబడు 'కాళ్లాగజ్జా' 'చందమామరావే' మొదలగుపాట లీచిన్నిపొత్తమున సమకూర్పబడినవి.
వెల 2 అణాలు. చేకుమళ్ల రాజగోపాలరావుగారు సంగ్రహించి ప్రచురించిరి.

7. చారుచర్య :—మహాకవి క్షేమేంద్రునిచే విరచింపఁబడిన గ్రంథము సాంధ్రతాత్పర్యముగఁ బ్రకటింపఁబడినది. మూలమునఁ గల పురాణేతిహాసకథాభాగములు సూక్ష్మముగ సూచింపఁబడినవి. వెల 3 అణాలు. వలయుచో కాకినాడపురవాసులు మ. శ్రీ. గోవిందరాజుల హరిశ్చంద్రరావుగారికి వ్రాయవలయును.

8. దృష్టాంతశతకము :—ఇది కుసుమదేవవిరచితము. మ॥ గోవిందరాజుల హరిశ్చంద్రరావుగారి యాంధ్రతాత్పర్యము గలదు. వెల 3 అణాలు.

9. ఉపదేశశతకము :—'పండితుల వేడుకనిమిత్తమును' మూఢమతులకు మహోపకారార్థముగను' గుమానికవి రచించిన యుపదేశశతకము. దీనిలో గోవిందరాజుల హరిశ్చంద్రరావుగారు రచించిన యాంధ్రతాత్పర్యమును గలదు వెల 2 అణాలు,

10. భట్టివిక్రమార్కుని కథలు:—(రెండుభాగములు) ఇందు జక్కనవిక్రమార్కచరితము, ద్వాత్రింశత్సాలభంజికల కథలు, బేతాళపంచవింశ

తి, కథాసరిత్సాగరము మొదలగు గ్రంథములనుండి గైకొనఁబడి విక్రమార్క నిచరితము జననమాదిగ శాలివాహనునిచేఁ జంపఁబడుటవఱకు వర్ణింపఁబడిన ది. గ్రంథకర్త మద్దూరి శ్రీరామమూర్తిగారు, కాకినాడ వెల రు 1-8-0.

11. సాముద్రికశాస్త్రము :—పండితారాధ్య శరభయకవిప్రణీతం బయినసాముద్రికభూషణమునందు, ప్రథమాశ్వాసమును నందుకు మద్దూరిశ్రీరామమూర్తిగారి యాంధ్రతాత్పర్యమును గలవు. పరిషత్పుస్తకభాండాగారము నందలి తాళపత్రప్రతులననుసరించి ముద్రింపఁబడినది. మిగిలినగ్రంథభాగము కానవచ్చుటలేదు. వ్యాఘ్రపురాధీశుఁ డగునాగేశ్వరున కంకితమీయఁబడినది. 123 పద్యములు మాత్రము కలవు. వెల 6 అణాలు, వలయువారు కొండపల్లి వీరవెంకయ్య అండుకో, వారికి రాజమండ్రి వ్రాయవలయును.

12. శివయోగసారము :—గణపతిదేవకృతము, ప్రథమసంపుటము. శైవప్రచారిణీగ్రంథమాల యందలి పదునాల్గవకుసుమము- ఇందు శివయోగసారోత్తరభాగము నందలి ప్రథమాశ్వాసమును విద్వాన్ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారిచే రచియింపఁబడిన యాంధ్రతాత్పర్యమును బ్రచురింపఁబడినవి.

వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-4-0, వలయువారు శైవప్రచారిణీకార్యాలయము వరంగల్ అని వ్రాయవలయును.

13. విజయపాలీయము:— (ససేమిరా) కాకినాడవాస్తవ్యులగు మ॥ త్యాడీ వేంకటశాస్త్రిగారిచే రచియింపఁబడిన యయిదంకముల నాటకము. ఇందలికథ జక్కనకవిప్రణీత మైనవిక్రమార్కచరితమునుండి గైకొనఁబడినది. వెల రు 1-0-0 గ్రంథకర్తగారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

14. సర్వలక్షణసారసంగ్రహము :—చిత్తూరు గవర్నమెంటు జిల్లా హైస్కూలునం దాంధ్రపండితులగు కీ. శే. శ్రేష్ఠులూరు కుప్పనయ్యంగారిచే రచియింపఁబడిన వ్యాకరణము. గ్రంథకర్తగారి జీవితమును సంగ్రహముగఁ దెల్పుచు వారిశిష్యులగు శ్రీయుత కట్టమంచిరామలింగారెడ్డిగారు పీఠికనువ్రాసియున్నారు. కేవలవ్యాకరణభాగములే గాక కావ్యాలంకారలక్షణములు గూడ సరసభూపాలీయము ననుసరించి యిందుఁ జేర్పఁబడియున్నవి. గ్రంథమంతయు వివరణములేక సూత్రప్రాయము [illegible]

తోఁచుచున్నది. అచ్చటచట 'పోతివా' 'చేరితే' యిత్యాది గ్రామ్యపదప్రయోగ మొనర్పఁబడినది.

వెల 4 అణాలు. వలయువారు వేంకటరామ్ అండుకో, యేలూరు అని వ్రాయవలయును.

15. గోవర్ధనోద్ధారణము :—ఇయ్యది ఉయ్యూరు జమీందారులగు శ్రీ రాజా వేంకటాద్ర్యప్పారాయవిరచిత మగు మూఁడంకముల నాటకము. గ్రంథకర్త పూర్వరంగమునఁ దెల్పినటులు—

చెలువంపు వెలయాలి చెలిమి యుంబోలె,
క్షణభంగురం బీవసంతశోభనము
కలకాల మొకరీతి నిలువంగఁబోదు
సత్యంబు చెప్పెద సర్వరక్షకుని
సత్కీర్తనంబె . . . . . వహము.

అను నూహయే శ్రీకృష్ణలీలల రూపకముగ రచించుటకుఁ గారణమైనది. శైలి మృదుమధురమై సలక్షణమై యున్నది.

వలయువారు గ్రంథకర్తగారికి వ్రాయవలయును.

## పత్రికాస్వీకారము.

అభ్యుదయ- ఇది రాజమహేంద్రవరమున మ॥ జొన్నలగడ్డ వేంకటరామకృష్ణయ్యగారిచేఁ బ్రకటింపఁబడు మాసపత్రిక. ఇందు 'గూఢుమాచినకొత్తరికం' 'మాంచాల' 'ప్రేమ' యను కథలు గలవు. వ్యాసములలోఁ గొన్ని గ్రామ్యభాషలోను గొన్ని గ్రాంథికభాషలోను విలసిల్లుచున్నవి.

సంవత్సరమునకుఁ జందా రు 2-0-0, వలయువారు మేనేజరు, అభ్యుదయ, రాజమహేంద్రవరము, అని వ్రాయవలయును.

# ధాతుమాల.

## అ

| ధాతువు | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|
| అక్కళించు | కుక్షినిమ్నీకరణే | *స కడుపు పల్లము చేయుట |
| అగలు | విదారణే | అ పగులుట |
| అగ్గించు | స్తుతౌ | స స్తుతియించుట |
| అంగలార్చు | దైన్యరోదనే | అ దైన్యముగా నేడ్చుట |
| అగపడు, అగుపడు | దర్శనవిషయే | అ దృశ్యమవుట |
| అగ్గపడు | అధీనతాప్రాప్తౌ | అ అధీనత్వమును బొందుట |
| అగ్గలించు | దుస్సహాధిక్యే | అ వెక్కసమవుట |
| అచ్ | ఆధమర్ణ్యే | స అప్పుపడుట |
| | అన్యాయదానే చ | అ అన్యాయముగా నిచ్చుట |
| అంటు | స్పర్శే | స తాఁకుట |
| | సంశ్లేషణే | అ రంగు మొదలైనది వస్త్రాదుల నంటుట |
| | అభ్యంజనే | స అభ్యంగనము సేయుట |
| అటమటించు<br>అటమరించు | వంచయిత్వాహరణే | స వంచించి హరించుట |
| † అటకాయించు<br>అడ్డగించు | నిరోధనే | స నిరోధించుట |
| అడఁగు | నాశే | అ నశించుట |
| | వినయే చ | అ వినయము వొందుట |
| అడుగు | యాచనాయాం ప్రశ్నే చ | స యాచించుట, ప్రశ్న సేయుట |
| అడుగుకొను<br>అడుక్కొను | సాంత్వనాయాం | స సాంత్వన సేయుట |
| | స్వార్థయాచనాయాం | తనకై యాచించుట |
| | స్వార్థప్రశ్నే చ | తనకై ప్రశ్న సేయుట |
| అడు | తలప్రహారే | స అఱచేతఁ గొట్టుట |
| అడిచిపడు | అత్యౌద్ధత్యే | అ మిడిసిపడుట |

* స సకర్మకము. అ అకర్మకము.    † గ్రామ్యము = మ్లేచ్ఛము.

| ధాతువు | సంస్కృతార్థము | | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| అడరు | ప్రకాశే | అ | ప్రకాశించుట |
| అడరించు | ప్రయోగే | స | ప్రయోగించుట |
| అడలు | ఉచ్చైరోదనే<br>భయేచ | అ | గట్టిగా నేడ్చుట<br>భయపడుట |
| అడుగంటు | అధోగమనే<br>అంధోవిదాహేచ | అ | క్రిందికిఁబోవుట<br>అన్నాదులడుగుమాఁడుట |
| అడ్డపడు | ప్రతిబంధే<br>తిర్యక్పతనే<br>దర్శనప్రతిబంధకతయాంతరావస్థానేచ | అ | ప్రతిబంధక మవుట<br>అడ్డముగాఁ బడుట<br>చూడవలసినవస్తు వగుపడకుండ నడుమనుండుట |
| అణఁగు, అణుగు | నాశే, వినయే<br>అధోవసర్పణేచ | అ | నశించుట, వినయమువొందుట, క్రుంగుట |
| అణవరించు | బుద్ధికరణేనపోషణే | స | బుద్ధిచెప్పి పోషించుట |
| అతుకు | సంయోగే | అ | కూడుట |
| అదుకు | సంయోజనేచ | స | కూర్చుట |
| అద్దు | ఉందనే<br>వస్త్రాదిరంజనేచ | స | నీళ్లలోఁదడుపుట<br>అద్దకము వేయుట |
| అందు | ప్రాప్తౌ<br>విప్రకృష్టస్యస్పర్శయోగ్యతాయాంచ | స<br>అ | పొందుట<br>చేతముట్టఁదగుట (దూలమందెనని) |
| అందుకొను | గ్రహణే<br>విప్రకృష్టస్యస్పర్శనేచ | స | గ్రహించుట<br>చేతముట్టుకొనుట (దూలమందుకొను) |
| అందగించు | అలంకారే<br>పరోక్తిసంయోగే<br>అలంకరణేచ | అ<br>అ<br>స | అందమగుట<br>ఒకనిమాటలోఁ గలసికొనుట<br>అందముచేయుట |
| అదుము | అధఃప్రాపణే | స | క్రుంగఁజేయుట |
| అదరు, అదురు | కంపనే | అ | కంపించుట |
| అదరిపడు | ఆకస్మికకంపనే | అ | ఆకస్మికముగఁ గంపించుట |
| అదల్చు<br>అదలించు<br>అదిలించు | పశ్వాదినివారణే | స | పశ్వాదులను దోలుట |

| ధాతువు | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
| --- | --- | --- |
| అను | చలనే | అ చలించుట |
| అను | ఉక్తౌ | స చెప్పుట |
| అనుపించుకొను<br>అనిపించుకొను | ఉక్తౌ | అ చెప్పఁబడుట |
| అనుకొను | స్వయ మనుసంధానే | స తనలోఁదాను తలఁచుట |
| అనఁగి పెనఁగు | సంవాసేన స్నేహం సంపాద్య కార్యేషు సహప్రవృత్తౌ | అ సహవాసముచేతస్నేహము సంపాదించుకొనియొకనితోఁగూడ బనులయందుఁ బ్రవర్తించుట—అన్యోన్యప్రీతిగా నుండెననుట. |
| అనుచు, అనుపు<br>అంపు, అంపించు | ప్రస్థాపనే<br>ప్రేషణేచ | స పంపించుట |
| అప్పళించు | ఆస్ఫాలనే | స భుజములుమొదలైనవి చఱచుట |
| అప్పగించు | అర్పణే | స ఒకనివశముచేయుట |
| అబ్బు | లభ్యతాయాం | అ లభ్యమగుట |
| అమ్ము | విక్రయే | స విక్రయించుట |
| అమరు<br>అమురు | శోభాయాం<br>సిద్ధౌచ | అ శోభించుట<br>సిద్ధించుట |
| అయిదుపదిచేయు | పరాగతౌ | అ వెనుకదీయుట |
| అరుగు | గతౌ | అ పోవుట |
| అరుగుదెంచు<br>అరుదెంచు | ఆగమనే | అ వచ్చుట |
| అరయు | విచారణే<br>మార్గణేచ | స విచారించుట<br>వెదకుట |
| అరికట్టు | నిరోధనే | స నిరోధించుట |
| అఱు | నాశే<br>హైన్యేచ | అ నశించుట<br>తగ్గుట |
| అఱుగు | జీర్ణతాయాం, లోహాదీనాం ఘర్షణేన హైన్యేచ | అ జీర్ణించుట, లోహాదులు తోముట మొదలగువాని చేతఁ అఱఁగిపోవుట |

| ధాతువు | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
| --- | --- | --- |
| అఱ, అఱు | ఉద్ఘోషే | అ ఉద్ఘోషించుట |
| అఱువు | గ్రహణాదిశక్యతాయాం, లభ్యతాయాంచ | అ పట్టుకొనుటకు శక్యమవుట చేతికఱువుట, దక్కుట |
| అఱువుకొను | ప్రాప్తస్యజీర్ణకరణే | స ప్రాప్తమైనదానిని జీర్ణము చేసికొనుట |
| అఱుము | ఆక్రమణే | స ఆక్రమించుట |
| అలుకు | గోమయాదిలేపనే | స పేఁడ మొదలగువానిచే లేపనము సేయుట |
| అలుగు | రోషే | అ రోషముపొందుట |
| అలంచు | పీడనే | స పీడించుట |
| అలందు | చర్చనే | స గంధము మొదలైనవి పూసికొనుట |
| అలందురు | దుఃఖే | అ దుఃఖపడుట |
| అలము | వ్యాప్తౌ | స వ్యాపించుట |
| అలయు, అలియు | శ్రాంతౌ | అ శ్రాంతుఁడగుట |
| అలరు | వికాసే, సంతోషేచ | అ వికసించుట–సంతోషించుట |
| అలవడు | అభ్యస్తే | అ అలవాటుపడుట |
| అల్లాడు<br>అల్లల్లాడు<br>అల్లనాడు | అనవలంబస్పందే | అ అవలంబనము లేక కదలుట |
| అళుకు | భయే | అ భయపడుట |
| అల్లు, అళ్లు | అన్యోన్యగ్రథనేన నిర్మాణే | స అల్లికగానిర్మించుట, చాపయల్లెను |
| | లతాదిప్రసరణేచ | అ తీఁగ మొదలైనది ప్రసరించుట |
| అవు | భవనే | అ అవుట |
| అవయు<br>అవియు | రూపపరామర్శే | అ రూపు చెడిపోవుట |
| అవుడుగఱ | క్రోధేనోష్ఠదంశనే | అ కోపముచేతఁ బెదవులు కొఱికికొనుట |

# ఆ

| ధాతువు | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
|---|---|---|
| ఆఁకొను | క్షుధితే | అ ఆఁకలిగొనుట |
| ఆఁగు | అనాశావస్థానే | అ నశింపక నిలుచుట |
| | అనాశావస్థాపనేచ | స నశింపకుండ నిలుపుట |
| ఆఁచు | అనాశావస్థాపనే | స నశింపకుండ నిలుపుట |
| ఆఁటు | కార్యారంభసక్షమతాయాం | అ పనికిఁజాలుట (ఈకత్తి యుద్ధమున కాఁటెను) |
| | పర్యాప్తౌచ | చాలుట (ఈయన్నమందఱకు నాఁటెను) |
| ఆడు | కృత్తే | అ కృత్తము చేయుట |
| | భాషణాదౌచ | స మాఁటలాడుట, మాటచెప్పుట, తానమాడుట, తానముసేయుట |
| ఆను | పానే | స త్రాగుట |
| | ఉపధానేచ | చేరుకొనుట |
| ఆనుకొను | ఉపధానే | స చేరుకొనుట |
| ఆదమఱు | జ్ఞప్తిభ్రంశే | అ జ్ఞప్తిదప్పుట |
| ఆఁపు | అనాశావస్థాపనే | స నశింపకుండ నిలుపుట |
| ఆపోవు | తృప్తౌ | అ తృప్తియౌట |
| ఆమతించు / ఆమెంతించు | సత్కృత్యాహ్వానే | స సత్కారపూర్వకముగాఁ బిలుచుట |
| ఆరగించు | భోజనే | స భుజియించుట |
| ఆరయు | పరిశీలనే | స పరిశీలించుట |
| | ఆర్తివారణేచ | ఆర్తివారించుట |
| ఆరాయు | పరిశీలనే | స పరిశీలించుట |
| ఆరు | పూర్తౌ | అ నిండుట |
| ఆరితేఱు | సమర్థీభవనే | అ సమర్థుండౌట |
| ఆఱు | నిర్జలీభావే | అ నిర్జలమౌట, ఎండఁబోవుట |
| | ఊష్మశాంతౌ | వేఁడిశమించినదౌట |
| | దోషాదీనాం నాశేచ | దోషములు నశించుట |

| ధాతువు | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
| --- | --- | --- |
| అచ్చు | ఉద్ఘోషే<br>దీపాదినిర్వాపణేచ | స ఉద్ఘోషించుట<br>దీపాదులు చల్లార్చుట |
| ఆర్పు | దీపాదినిర్వాపణే | స దీపాదులు చల్లార్చుట |
| ఆలకించు<br>ఆలించు | సావధానశ్రవణే | స సావధానముగా వినుట |
| ఆవులించు<br>ఆవలించు | జృంభణే | అ ఆవులింత విడుచుట |
| ఆవటిల్లు<br>ఆవటించు | భూతాదీనామావేశే | అ భూతాదులావహించుట |

## ఇ

| | | |
| --- | --- | --- |
| ఇంకు | నిర్జలీభావే | అ నిర్జలమగుట |
| ఇగ్గు | ఆకర్షణే | స ఈడ్చుట |
| ఇగ్గులాడు | అన్యోన్యాకర్షణే | అ అన్యోన్యమీడ్చికొనుట |
| ఇగురు | నిర్జలీభావే | అ నిర్జలమగుట |
| ఇగుర్చు | పల్లవోద్భేదే | అ చిగిరించుట |
| ఇగిలించు | దంతానాం ప్రదర్శ్యావస్థానే<br>అశ్వఘోషేచ | అ పండ్లు తెఱచికొనియుండుట<br>గుఱ్ఱము శబ్దించుట |
| ఇచ్ | దానే | స దానముచేయుట |
| ఇచ్చగించు | సమ్మతౌ | స సమ్మతించుట |
| ఇడు | దానే, నిధానేచ | స ఇచ్చు, ఉంచు మొ॥ |
| ఇడియు | విశ్లేషే | అ విరియుట |
| ఇనుకు | నిర్జలీభావే | అ నిర్జలమగుట |
| ఇందు | | అ భక్షింపఁబడిన యన్నాదులు దక్కుట |
| ఇనుమడించు<br>ఇబ్బడించు<br>ఇమ్మడించు | ద్విగుణీభావే<br>ద్విగుణీకరణేచ | అ ద్విగుణమగుట<br>స ద్విగుణము సేయుట |
| ఇముడు | సంకుచితస్థలేపర్యాప్త్యావస్థానే | అ సంకుచితస్థలంబునఁ జాలియుండుట |

| ధాతువు | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
|---|---|---|
| ఇమురు | జలశోషణే | అ జలము శోషించుట |
| ఇయ్యకొను | అంగీకారే | స అంగీకరించు |
| ఇరవొందు | శోభాయాం | అ శోభించుట |
| ఇఱియు | దృఢసంశ్లేషణే<br>చూర్ణీభావేచ | అ కదియుట<br>చూర్ణమగుట |
| ఇఱుకు | అంతరాసంకుచితావస్థానే | అ నడుమ సంకుచితముగా నుండుట |
| ఇలకఱ | దంతదృఢబంధే | అ దంతములు గట్టిగా బిగఁబట్టుట |

## ఈ

| ధాతువు | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
|---|---|---|
| ఈఁకు | నిర్జలీభావే | అ నిర్జలమగుట |
| ఈఁగు | వ్యపనాశనే | స పోఁగొట్టుట |
| ఈచుకపోవు<br>ఈచుకొనిపోవు | పశ్వాదిగర్భపాతే | అ ఆవులు మొదలైనవానికి గర్భపాతము నొందుట |
| ఈడు, ఈడ్చు | కర్షణే | స లాగుట |
| ఈడేరు | సాఫల్యే<br>ప్రథమరజఃప్రాదుర్భావేచ | అ సఫలమవుట<br>కన్యరజస్వలవుట |
| ఈడఁబోవు | పరాగతౌ | అ వెనుకదీయుట |
| ఈడగిలపడు | గంతుమశక్తౌ | అ నడువనశక్తుండౌట |
| ఈఁతకొట్టు<br>ఈఁదు<br>ఈఁదులాడు | బాహుప్లవనే | అ నీళ్లలో బాహువులచేతఁ దేలుట |
| ఈను | తిరశ్చాంప్రసవే<br>సస్యఫలనిష్పత్తౌ | స ఆవు మొదలైనవి ప్రసవించుట<br>పైరు వెన్ను విడుచుట |
| ఈరు, ఈర్చు | కేశలిక్షాపసారణే | స తలవెండ్రుకలలో ఈళ్లు పోవునట్లు చేయుట |
| ఈలుఁగు | మృతౌ | అ చచ్చుట |
| ఈలకఱ | దంతదృఢబంధే | అ దంతములు గట్టిగా బిగఁబట్టుట |

## ఉ

| ధాతువు | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
|---|---|---|
| ఉంకించు | ఉద్యమే | అ ఉద్యుక్తుఁడౌట |
| ఉగ్గడించు<br>ఉగ్గళించు | అతివాదే<br>వాదారంభేచ | అ మిక్కిలి వాదించుట<br>వాదమునకారంభించుట |
| ఉచ్ | అంతఃప్రవేశే | స లోపలికిఁ దూఱుట |
| ఊఁచు | నిధానే | స పెట్టుట |
| ఉజ్జగించు | త్యాగే | స త్యజియించుట |
| ఉటంకించు | సారాంశగ్రహణే | స సారాంశగ్రహణము సెయు |
| ఉటకాడించు<br>ఉడకాడించు<br>ఉడుకాడించు | ప్రహాసాయ బాధనే | స నవ్వుటకై యొకని బాధపెట్టుట |
| ఉడాయించు | క్షణమాత్రేణాపహరణే | స క్షణమాత్రములో నపహరించుట(ప్రాకృతతద్భవము) |
| ఉండు | నివాసే | అ నివసించుట |
| ఉడుకు<br>ఉడికిలు | క్వాథే<br>పరిహాసజే రోషేచ | అ పక్వమవుట<br>అపహాసముచేత రోషయుక్తుఁడౌట |
| ఉడుగు | కార్యవిరమణే<br>కార్శ్యేచ | స పనిచాలించుట<br>కృశించుట |
| ఉడ్డుగుడు | శ్వాసపారవశ్యే | అ ఊపిరి త్రిప్పుకో లేక పోవుట |
| ఉడిపోవు | నిస్సారీభవనే | అ నిస్సారమౌట |
| ఉతుకు, ఉదుకు | వస్త్రాదిక్షాళనే | స వస్త్రాదులు క్షాళనము సేయుట |
| ఉదిరిపడు | ఆకస్మికవల్గనే | అ ఉలికిపడుట |
| ఉదిలపడు<br>ఉదిలగొను | చింతాయాం | అ చింతనొందుట |
| ఉనుచు | నిధానే | స పెట్టుట |
| ఉప్పు | పిష్టవ్రీహ్యాదిక్వథనే | స పిండి, వడ్లు మొదలైనవి ఉడుకఁబెట్టుట |

క. పున్నమనాఁటినిశాపతి, కన్నియనెమ్మోముసాటి గాలేక కడు
సన్న మగుఁ దక్షపక్షము, మిన్నావాలంచు గాంచు మొ...
ఉ. తమ్ములమేలు పూనమిని దక్కులవెన్నెల మేనుపాఁకిన
న్నెమ్మివహింపమిం గలుగునింద తొలంగఁగ నిందుఁజామము
డెమ్మెలతమ్మియుం జెలువయింపులనెమ్మొగ మొచ్చుఁ బూనెఁ గా
తమ్ములమేలు మేల్సొగసుఁ దాలుచు లేనగుతేటవెన్నెలన్.
గీ. సవతు గనఁడయ్యెఁ బూర్ణదోషాకరుండు
బహుబుధగ్రస్తజలజముల్ ప్రతియుకావు
పరిహృతాశేషదోషమై భవ్యకాంతి
నైభవము గాంచు నెచ్చెలివదనమునకు.
క. ఎన్నఁ బ్రతిబింబభావా, పన్నం బగు ముకురమునకుఁ బోటియు ...
*గన్నన్న సమత బింబత, గొన్న వికర్తనతనూజగౌరవము ... న్.
గీ. కాంతివారాశి యగుభానుకన్యమోము
జిగి యొకించుక యన్నగాఁ జెంది యొక్క
రేయి చెలువొందె యది దీర్పలేమిఁ బోటము
పాపము కళంకమై విధుఁ బాయకుండు.
గీ. బహుళపక్షపాతభావితుఁ డైనట్టి, చందమామ జపుఁడు సాటి యగునె
సమతఁబూని శాస్త్రసత్త్వవిమరత, వఱలుచుండుచెల్వ వక్త్రమునకు.
చ. పగ లిది రేయి నాక మఱి పక్షవిభేదము గాంచ కెప్పుడుం
దగులు మహాహ్లాదయస్ఫురణఁ దాల్కొను నర్కునిమూర్తిప్రస్ఫురే
ల్సొగసులనెమ్మొగంబునకుఁ జొప్పడునే సరి యెంచుఁ బల్కఁగాఁ
దొగచెలికాని దోషములు దూఁకొనువానిఁ గళంకభావితున్.
క. కనఁజనియె ముకుర మిందుఁడు, గొనకప్పొంజనియె మాఱుకొన్న ...
వనజంబు గాని నెచ్చెలి, గొనబులనెమ్మోము సాటి గొన వి...
గీ. అమరు బింబానుబింబైక్య మరసిచూడ, నడుదుబింబానుబింబులనైక్యవృత్తి
కంబుకంధరముఖదర్పణంబుతోడ, నైక్యమొనగూడెఁ జగ్గ్రన కెబ్బురంబు.
ఉ. సాటికి రానినీలములు సానల రాపడెఁ బొఱిఁబోతులై
తేఁటులు పోయె, మేఘములు దీనత మొత్తులు (వెట్టెఁ) జామరల్
గాటపుఁదెల్లఁబా టొదవెఁ గన్పడెఁ బల్వగఁ గేకిపింఛముల్
పాటలగంధికొప్పుసిరిప్రాభవ మెన్నఁ దరంబె చూడఁగన్.

---

*గంగన్న సమతబింబత—మూ.

గీ. అఖిలసుమనఃకదంబకాభ్యర్హితంబు, నీరజాప్తతనూభవనీలకబరి
దానిసవతంచు నేగతిఁబూనవచ్చు, జగముకై నీరములు మోయుజలవహంబు.

క. అమరెడుకీల్జడ స్రగ్ధర, కొమరుమిగులు పిఱుఁదు దలఁప గొనబగువిపులే
కమనీయతనువు చపలే, రమణీమణి యాఱార వృత్తరత్నాకరమే.

క. చెలమా సుధ కధరము చం, చలమా కనుదోయి కుచము చాలితకనకా
చలమా వైపుల్యజితా, చలమా జఘనంబు ఘనము చానకు నెన్నన్.

క. రాకాచంద్రుని నగు నా, రా*కాంతమొగమ్ము కెంపురాకావికి మే
రా కామినియధరము చిగు, రాకా పాదంబు సురుచిరాకారమునన్.

క. †నాకము నగుఁ గొనమ్మై, నాకము(జిగి)గుబ్బ యలపినాకము బొమ యా
లోకముల సుదతి హరిణా, లోకము నిందించు నౌర లోకము మెచ్చన్.

క. ధరమా కుచ మాబలుఘణ, ధరమా నూఁగారు ‡నీరదాయకధారా
ధరమా కచంబు స్వర్ణవి, ధరమాధరమా మెఱుంగు ధరణిజఘనకున్.

సీ. ఇంపారుకీల్జడ యింద్రనీలముఁ జేయు మధురంపుమోము పద్మంబుఁ జేయు
ముత్యాలసరిఁ జేయు ముద్దురదశ్రేణి రుచిరంపుమోవి విద్రుమముఁ జేయు
శంఖంబుఁజేయును జక్కనికంధర గుబ్బలు బంగారుకొండఁ జేయు
భూమిచక్రముఁ జేయుఁ బొందైన జఘనంబు తనరుమధ్య మ్మనంతంబుఁ జేయుఁ
గలికిపాదంబు పద్మరాగంబుఁ జేయుఁ, జాననిలువెల్లఁ దప్తకాంచనముఁ జేయు
వెలఁదిఁగొనియాడు మాటలు వేయు నేల, రమణిలావణ్యమొగిసముద్రంబుఁ జేయు

సీ. జలధరమాలిక జగజంపుకీల్జడ చంపకమాలిక సరసనాస
భ్రమరవిలసితంబు కొమరారుకనుదోయి మత్తకోకిల యగుమంజుగళము
శిఖరిణి నైమించుఁ జెలువౌ రదశ్రేణి స్రగ్ధరయగు గుబ్బచన్నుదోయి
యమరువిద్యున్మాల యగును దనూయష్టి మత్తేభగతియగు మంజుపదము
అలభుజంగప్రయాతమై యారు దనరు, బంధురంబయ్యె సర్వాంగభవ్యలక్ష్మి
యరసిచూడఁగఁ బంకేరుహాప్తసూతి, విశదలావణ్యమహిమసద్వృత్తమయ్యె

సీ. రమణిలావణ్యాంబురాశిలోఁ గనుపట్టుఁ దేఁటులగుంపులు వెలిపిమీఁలు
మువ్వన్నెచందురుల్ ముద్దుబమీనము ల్పసిరము ల్సంపెంగ సొంపునింపు
ముక్తాఫలశ్రేణి మురువంపుఁబవడంబు శంఖంబు గుబ్బలు ల్సరసనాళ
లందంపుఁజిగురులు పొందైనజలనీలి బలువైనప్రావము నిబ్బరపుదీవు

---

*కాద్య మొగము — మూ. † నాకమనగాకా — మూ.
‡ నీలధావకధారాధరము — మూ.

అబ్బురపువలపులె నెమనక్ట్రిరంభ, లరిదిగావించు కాండ్లంబు లధికమృదుల
పంకజాతంబు లసమానభాసమాన, కాంచనచ్ఛాయ నెప్పు* డొదవించుతీవె.

వ. ఇట్లు నిండుజవ్వనంబున దేవాసురమనుష్యలోకకాంతామరూపకామనీయకలక్ష్మీలీలాయతనంబును సర్వలక్షణైకలక్ష్యంబు నగునమ్మోహనాంగి నిఖిలవిద్యావిజ్ఞానవిమలాంతఃకరణ యని విశేషించి సకలజనపరమాహ్లాదైకకారణం బగుసంగీతశాస్త్రంబున మిగులఁ బ్రవీణ యగుట యారసి యారసి కనీలవేణీముఖ సఖీజనంబులు తద్విద్యాపాటవంబుఁ దలిదండ్రులగు ఛాయాసూర్యులకు డెందంబుల కమందానందంబుగాఁ దెలుపం దలంచి యొక్కనాఁడు.

సీ. మేటిమిన్నేటిపొన్నీట మజ్జనమాడ్చి చిన్నివెన్నెలవన్నెచీరఁ గట్టి
పొంగుసిబ్బెపుఁజన్నుబొంగరంబులమీఁదసొగసుగ్రొంబట్టుకంచుకముదొడిగి
నెఱికప్పుసిరి నొప్పు నెఱికొప్పు చెలువంద నందంపుఁబూదండ లమరఁ జుట్టి
రిక్కరా మొక్కపెన్నిక్కు చక్కఁగఁ జేసి చొక్కునెన్నుదుటఁ జేర్పుక్కఁ బెట్టి
కలువగమి కెగ్గుగలిగించుకన్నుఁగవకుఁ, గలికి కజ్జ†నిగ్గుమిక్కుల కాటుకయిడి
యలరు నాణిముత్తెపుసరులఁటుత నిలిపి, తీర్చి రీరీతి వెలఁదికిఁ గూర్చుచెలులు.

క. కాయమ్మున నాభరణని, ‡కాయమ్ము సఖీజనంబు ఘటియించుచనున్
మాయమ్మే సాటియగు, న్నాయమ్మకు మిగులు సవతు మాయమ్మనుచున్

వ. తదనంతరంబ.

క. ఏచ్చేయును నీవిద్యకు, నచ్చెరువడి నేఁడు సత్సభాన్వితుఁ డగుచు
న్వెచ్చరివేలుపు విలిచెను, ముచ్చటగా నీదుపాట ముఱిపముచూడన్.

వ. అని విన్నవించిన.

ఉ. వచ్చె సఖీప్రయత్నమున వారిజలోచన వెన్క ముందటన్
హెచ్చు కచాదిభారమున నెమ్మెలుకౌ నొగిఁగుల్కఁ గొప్పడా
లొచ్చెము లేనిచీఁకటుల నుప్పతిల న్వడి జెళ్కుమోమునం
దచ్చపుమొల్కనవ్వు జిగి నందపువెన్నెలచాయ లొల్కఁగన్.

ఉ. కాంచెను గాంచనాంగి దనుఁగాంచినదక్షు సమస్తవిష్టపో
దంచితచక్షు నాశ్రితజనావనదక్షిణవిస్ఫురత్కృపా

---

* డొదవించితీవె—మూ.   † కరసిగ్గు—మూ.

‡ కాయమ్మున సఖీజనంబు సంఘటియించెన్—మూ.

ంచితవిష్ణుఁ బ్రాగ్వచనసారతనూరుచిదుర్నిరీక్షు నా
కుంచితసద్వపుత్త్రితయగోపనపక్షు హతాసపక్షునిన్.

చ. కని కరమొప్ప మ్రొక్కి నను గన్నియ నాదరణాను*వృత్తితోఁ
గనుఁగొని తన్మనోజ్ఞముఖకంజము రంజిల సత్కరంబుల
న్ననుఁదు కవుఁగిలించుకొని యింపుగ మూర్కొని తచ్ఛిరోజము
ల్వసపడదువ్వ చిట్లను నపారకృపారసవార్ధిఁ దేలుచున్.

సీ. పవడంపుఁదీవె రా బంగారుబొమ్మరా పొదలెడురాయంచబోద రావె
గుణరత్నరాశి రా గొనబుఁబూబంతి రా కొమరొప్పుముద్దులగుమ్మ రావె
యతివమేల్బంతిరా యందాలకుప్ప రా యొఱపైనక్రొక్కారుమెఱుఁగ రావె
యప్పచ్చికొండ రా యతనువాలమ్మ రా సొగసైన చందమునాగ రావె
బ్రాఁతి మైనట్టి నాతపఃఫలమ రావె, లలిత మైనట్టినవకల్పలతిక రావె
రాణగాంచిననాయింటిలక్ష్మిరావె, తలఁపులోనఁగూర్చు నను గన్నతల్లిరావె.

ఉ. బంగరు లీనుచూపు గలబంగరుబోటికి సాటియైన మా
బంగరుకొండ వచ్చెఁ గులపావనసద్గుణవార్ధి వచ్చె నా
కొంగుపసిండి వచ్చె మదిఁ గోరినభాగ్యము వచ్చె వచ్చె మా
ముంగిటికామధేను వని ముచ్చట దీరఁగఁ బల్కె వెండియున్.

క. తల్లివి గద కన్యామ, త్తల్లివిగద సొగసుఁగులుకుఁదనముల సిరిమే
ల్తల్లివి గద సురభూరుహ, వల్లివి గద మమ్ముఁ బ్రోవ వల్లినిభాంగీ.

క. ఒప్పులకుప్పా నినుఁగ, న్నప్పటినుండియుఁ బ్రమోద మనుజలరాశిం
దప్పక మునుంగు నాకుం, జొప్పడె నభ్యుదయమెప్పుఁ జోద్యము జగతిన్.

గీ. అమ్మ నినువంటిపట్టి మాకబ్బెఁ గాన, చాయచాయకు మర్యాద

—(ఇక్కడఁ గొంత గ్రంథము లేదు)—

దముల్వాలఁ దనర
గేయవాక్కర్త్రి యనుపేరు గీలుకొనఁగ, వీణ వాయించె నవ్వేళ నేణనయన.

గీ. †తత్పదముభాతి మంగళార్థంబు గీతి, కది పరాత్మవచించుట నంచు నెన్ను
శాస్త్ర మాగీత మగ్గీతశాస్త్రవేత్రి, కబ్రమే భావిసన్మంగళార్థమగుట.

క. రూపవతి గీతిభూషణ, దీపితమై మెచ్చుఁగాంచుఁ దీవ్రం బుపమా
క్షేపములు వడయునని సభ, నాపాదించుచును మోదమందిరి విబుధుల్.

---

*వృత్తితో—మూ. †తత్పంబాతి—మూ.

వ. ఇట్లు శ్లాఘించి.

సీ. సంగతతత్పురుషపదనిష్ఠాస్ఫూర్తి నలరారుపాణినీయంబు వనఁగ
సిద్ధసాధ్యవిశేషబుద్ధస్వరూపతఁ బ్రాకృతవ్యాకృతి ప్రకటమనఁగ
జ్ఞాతాత్మకీర్తి నిర్ధూతాంజనాత్మతఁ సాధ్వలంకృతివిశేషంబనంగ
సరళస్థిరకళాప్రశస్తిసద్భావత సరసాంధ్రశబ్దశాసన మనంగ
నరుగుదెంచెను నారాయణాభిధాయ, కాష్టవర్ణమనూత్తంసకాభిధాన
చతు స్స్వరస్వరవిశేష, హరిమహాతికరుండు శుభాకరుండు.

సీ. చంద్రోపరి సితాభ జలవాహరేఖనాఁ దగుఫాలగోపిచందనము దనర
నైరావతాలింగితాభ్రాపగాబ్జలతాలినాఁ బసిఁడిజంద్యములు మెఱయ
సగ్రకాశ్మీరకింజల్క సముదయం బన జటాసమితి వెలుఁగఁ
గలధౌతనగమధ్యగతనీలవేదిక నాఁ గటిఁ గృష్ణాజినము దనర్పఁ
గల్పకశ ...క్షమాల, వల్లి యన వీణ భుజమున వన్నెమీఱ
నలుదిశలమేను తెలుపి వెన్నెలలుగాయ, వచ్చె నారదుఁడవ్విభానునికడకు.

ఉ. దూరమునుండి రా మునికిఁ దూర్ణము బంగరుగద్దె డిగ్గ బ
ల్గారవ మొప్పఁగా నెదురుగాఁ జని భక్తిభయాంచ్యుతంబు ల
ప్పారిగ సందడించుమది వారిజబంధుఁడు సాఁగి మ్రొక్కెఁ ద
చ్చారుపదాంబుజాతములు సాధుకరద్యుతు లంటి రాజిలన్.

క. మ్రొక్కినఁ *జెయ్యులసాకిరి, మక్కువఁ గైగ్రుచ్చి యెత్తిమది ముదమలరన్
అక్కలహాశనమునినగు, మొక్కలు వొక్కటముగాఁగ మొగముననమరన్.

క. దీవించె నీకు దుర్లభ, మేవస్తువు లేదు దేవ నిడకుండఁగరా
దేవస్తు వక్షయం బగు, నావస్తువు నీకుఁ జుట్టమగు నిజ మనుచున్.

వ. ఇట్లు భావిశుభంబుఁ దెలుపు పలుకు వలుకు తొలిపలుకులగమికానిగాదిలి కొడుకుం గడగననివేసుక గడలుకొన ముందట నిడుకొని వచ్చి యచ్చెరువులకు నెలవగు తననెలవునకుం దెచ్చి దచ్చిదిక్కు లచ్చంపుఁ బచ్చివెన్నెలలు సొగసు మునుంగు లోసంగు మగతామానికంబుల పెద్దగద్దియ నుంచి యవంచితభయభక్తి వినయాతిశయ మ్మగునాశయమ్మున నమ్మహాశయునకు నిర్వాశయమ్ముగా నిజకరకుశేశయమ్మున సదాశ మోచితంబు లగు నుపచారంబులు చేసి యాబేసిగుఱ్ఱాబుల తేరి నెఱవొర దొర సెఱుంగని

* జైవులసామికి. మూ.

సౌభాగ్యలక్ష్మి దనకెంతయుం బిలిచి యప్పు డిప్పాదకమలమునకు ముట్టం జిక్కంబడని దొక్కటియుఁ జిక్కదు ముక్కవలయు ననిమ్రొక్కించిన నక్కారుణికపురుషమణి పురుషకారనిరతాంగీకృతనిర్వాహ యని దీవించి యనుపం బిదపఁ దదనుమతి నమ్మహామతి విహానుగతసభా జనంబుల యథాపూర్వోచితస్థానంబుల వసియింప నియమించి తాను దత్సమీపతలంబున దివ్యభవ్యనవ్యహేమముక్తాఫలామూల్యనిచ్చిద్రభద్రాసనంబునఁ గూర్చుండి యుండెఁ దత్కాలంబున.

చ. *తొలుతటిపల్కుబల్గనులు దుష్టతమోహరణప్రవీణమౌం
సలమహిమాన్వితు ల్మహితసత్పథవృత్తినిరూఢభావు లా
కలితదిగంతరాళరుచిగాఢతనూరుచిరుల్ సభాస్థలిం
జెలువలరారి రిద్దఱును జేతనజాతము లబ్బురంపడన్.

క. అన్యోన్యకాంతివైభవ, మన్యోన్యముఁ గప్పఁ జిహ్న లవిషయములుగా
నన్యునియం దన్యభ్రమ, మన్యాయత్తంబుగాక యలవడె సభకున్.

క. నిండునెలఁబోలు మునిమా, ర్తాండుని మార్తాండుఁ జూచి హర్షైకదుపుపే
రుండెడుపులుఁగులు భ్రమచే, నొండొండ ముదంబు ఖేద మొందునుమిగులన్

గీ. అట్టి మెఱుఁ దమ్మివిడిమట్టుపట్టుదిట్ట, పట్టి యగువాని కనియె నవ్వొట్టజేజె
గీటుకొనుహాసమున మోముసీటుగుల్క, మాటమాటకునమృతంబు తేటలొలుక.

క. నీరాక రాక సమ్మద, నీరాకరమునకు సుగుణనీరాకర యీ
నీరాక గాక యా(ప, స్నీరా)కరమునకుఁ దేవ నేనెఱుఁగుదునే.

వ. ఓసుదర్శనకరశుభకరపదభక్తిమత్సుదర్శన నిదర్శనసమధిగత నిఖిలదర్శన కాలత్రితయపవిత్రతావ్యంగ్యవ్యంజకంబగుభవదీయదర్శనసమంజససంజీవనౌషధంబున మదీయతాపత్రయంబపత్రపానిఃయంబయ్యెడు మజ్జననంబు పరార్థభావంబు నొందెడు మత్తేజంబు వేలోల్లంఘనంబుననలరారెడు మదభ్యుదయం బనస్తమయంబై చెలువారెడు మదీయనివాసంబు విష్ణుపదంబునం జెన్నుగాంచెడు మదధికారంబు గ్రహాతీతంబై యొప్పారెడు మచ్ఛత్రంబు కాంతిపర్యాయంబై వెలుఁగొందెడు మత్సంతానంబు సమందతఁ గాంచియు నమందతవైవాజెడు నీరేడుజగంబులఁదేజోవంతులకు దృష్టాంతంబనై మెలంగెడు భాగ్యంబు నాకుఁ బొసంగెడు సమాధిమత్కళానిధినిరుపాధి

* తొలుతటిబలుకి-బలకి-చ.చు.మూ.

చ. హరిపదపంకజాతయుగళాంచితభక్తిపరప్రవేక యా
హరి మనుజాకృతిం బుడమి నందుటకుం గత మెద్ది యమ్మహా
పురుషునిఁ జెందఁజేయఁ దగుపుణ్యపుసాధన మెద్ది రూప మె
ప్పరమున కెట్టి దింతయు నపారకృపాజలరాశి తెల్పవే.

క. అన విని వీణాముని య,య్యినునిఁ గనుంగొనుచు నగుచు నిట్లను నోరా
వనజాప్త నీదువినయము, విని కని యెఱుఁగము సమస్తవిబుధులలోనన్.

గీ. వేదమూర్తివి నీవె కా వేదవేద్యు; నెఱుఁగఁజాలవె యెట్టిన నెన్ని చూడఁ
బరహితజ్ఞానమార్గప్రవర్తకులకుఁ,బ్రష్టృభావంబు భూషణప్రవర మనఘ!

క. వనజాక్షభక్తిభరపా, వనుఁడవు నీవెంతభాగ్యవంతుఁడవు బళీ
నినునుండి తత్కథాస్మృతి, నెనసితి *నిటనాదుపుణ్య మే మనవచ్చున్.

క. దిన మొక్కనిమున మయిన, న్వనజాక్షుస్మరణ మెలఁగ వానివృజిన మ
ద్దినకృతము సుకృతమగు స్వ, ర్ఘనవేధిస్పర్శ నినుము సౌవర్ణము కా.

చ. తలఁచిన విన్న మానసము తద్ద మునుంగు ముదంబురాశి మైఁ
బులక †లెసంగుఁ గన్నులఁ బ్రమోదజలంబులు పొంగుఁ బూర్ణతా
ఫలితమనస్కులౌ పరమపావనమానుల కైన నద్దిరా
బళిబళి వాసుదేవుకథఁ బోటిలుమాధురిసార మెట్టిదో.

సీ. సౌశబ్దసంగతి సడలుకావ్యమురీతి విజ్ఞానహీన మా విద్యమాడ్కి
సాధుదానము ‡లేనిసంపద కైవడి వరశాంతి నెడయు తపంబుభాతి
కంఠరక్తమానుగానంబువడువునఁ బాలనసేయని ప్రభుతచాయ
శ్రద్ధానురుద్ధత జాఱుకర్మముక్రియ రాగంబు గాంచని రతిపసునఁ
సిద్ధపాండిత్యవర్జితసేవ§తేవ, భూరిపరిమళ మందనిపువ్వుపోల్కి
వాసుదేవునిపదభక్తి వదలువాని, జన్మము నిరర్థకం బగు జలజమిత్ర!

చ. అలఘరహస్య మెంతటిమహాత్మునికైనఁ దరంబుగాదు దాఁ
దెలియఁగ నెట్టిదట్టిలను దెల్పికిరాఁ దెలుపంగ శక్యమే
జలరుహమిత్ర యట్లయిన సంగ్రహసూక్తుల నాదుబుద్ధికిం
దెలిసినయంత దెల్పెద సుధీవర తప్పక యాలకింపుమా.

---

*నిచ నాదుపుణ్య—మూ. †లాసంగు—మూ. ‡చేయుసంపద—మూ. §(తేవ—మూ.

గీ. తపసి యిత్తఱి నప్పరతత్త్వ మవని, భారకారులఁ గంసాదిఘోరదనుజ
నికరములఁ ద్రుంపవసుదేవునికిజనించి, నటలుచునుగృష్ణుఁడనద్వారవతిమెలంగు.

వ. అతనిమాయాబలపరిగృహీతదివ్యమంగళవిగ్రహంబునకు నుపమానంబు దు
ర్గ్రహం బన నసంశయం బేమియయినం గీర్తనధ్యానాదిసాధనంబులం బో
పక్షయార్థు లగుమాదృశు లగుదాసులకుం దదుపమానకల్పనసాహసంబు
న నల్పదోషంబుఁ గాదని విచారించి నాయథాశక్తి నమ్మహాపురుషు నంగ
సౌందర్యం బీషత్కాలంబు గీర్తించి కృతార్థత గాంచెద సావధానుండ వై
యవధరింపుము.

సీ. ఇంద్రనీలచ్ఛాయ నెనయుదేహమువాఁడు ముద్దుగుల్కెడునవ్వుమోమువాఁడు
ఘనశంఖనిభ మైనకంఠంబు గలవాఁడు చక్కని వెడఁదవక్షంబువాఁడు
జయలక్ష్మి లీనునాజానుబాహులవాఁడు దనరారు సింహమధ్యంబువాఁడు
జనసంపదల మించుజంఘలు గలవాఁడు తమ్ముల మించుపాదములవాఁడు
కటిని జెన్నొందు బంగారుపటమువాఁడు, ధాతఁ గన్నట్టినాభిపద్మమ్మువాఁడు
ప్రబలు శ్రీవత్సకౌస్తుభప్రభలవాఁడు, చక్కఁదనముల *కిల్లైజరుగువాఁడు

ఉ. క్రిందయి రేక మోచి పరిఖిన్నతఁ గృష్ణునిపాదయుగ్మ మిం
పొంద భజించి యంబుజము లొక్కెడఁ దత్సుషమాంశలేశకా
ప్తిం †దనరారఁ బద్మములపే రది వొసిడి తత్సమంబుగాఁ
గొందరు పాదపద్మ మని కుంఠితబుద్ధులు గారె లోకముల్.

ఉ. అంగుళులే దళంబులు నఖాళులు కేసరము ల్పదప్రపీ
ఠాంగణనమ్రదేవమకుటాంచితనీలమణీరుచు ల్చల
ద్భృంగము లై చెలంగఁ గడుఁ దేజిలు శౌరిపదాబ్జముల్ శుభా
ళిం గరుణించి భక్తులకు లేములు వాపుఁ దమోసవారకా.

ఉ. అంగజుమేల్నిషంగయుగ మాకృతి కేము సమానవైభవం
బుం గయికొంటి మింక సరిపోలము కాంతి నటంచు నల్గులం
‡బృంగి తపించి తత్తనువు వీడిన నాదొన లీడుగా వన
న్నంగతి నయ్యదూద్వహునిజంఘల సొంపుఁ దలంప శక్యమే.

చ. తన కుపమానవస్తు విఁక ధారుణి లేదని కాదె గెల్పి పెం
పున ధరియించు మేల్బిరుదు §పో యిదినాఁగ మణీవినూత్నకాం
చనమయనూపురార్భటి నెసంగెడుఁ దద్ఘనజంఘ లెంచ న
వ్వనజభవుండుఁ జాలఁడు దివాకరకోటిప్రభ నెన్న శక్యమే.

---

* ఇల్లుదై-మూ. † దనరారిపద్మములు మూ. ‡ భ్రుంగి—అని యుండుట న్యాయ మైనను గొన్నిప్రాచీనప్రయోగము లిట్లుకనఁబడుచున్నవి. భ్రుంగి...బోవిన-అనుట సరళపద్ధతి. § మేల్బిరుదపోవౌఁ-మూ.

క. [illegible]నాస్యవదనమారుత, గతిచే వక్షమున కెగసి కనుపడునాభీ
వితతపయోరుహకేసర, వితతి యనం గౌస్తుభంబు వెలయున్ హారికిన్.

క. ఒత్తుటలువడుచు మార్దవ, భృత్తయి *సుస్వనత లేక వెలవెలఁబోచున్
రిత్తవడి శంఖ మచ్యుతు, కుత్తుకనై పోలిచి నిలిచె గుణనిధి యగుచున్.

క. మంజుభుజకీర్తి హీరా, సంజాతధవళిమము భూమిసాకల్యధురా
రంజితము కంసదానవ, భంజనుకే లమరు శేషఫణిసన్నిభమై.

చ. తను వెలగాఁ గొనుం బసిఁడి చాన మెలంగుటఁగాని చెల్వులే
దని యలకొంపు తద్విభుశయద్వయమై నవరత్నకోటికాం
చనతను †పేయఁ బుచ్చుకొనసాగి విదోషసదోషభావతన్
గొనటు వహించుఁ జూడ్కులకుఁ గోరిక లీరిక లీనుచుండఁగన్.

క. అకలంకగోవిలాస, ప్రకటత దోషానిరుద్ధభావతఁ గొనుచు
న్వికసించు తన్ముఖంబున, కకటా దుష్టములు నెలయు నబ్జము సరియే.

చ. తమిగొను ముద్దుకై తలఁచు తామరసాలయకన్య కన్యకా
భ్రమ జనియింపఁ దచ్చనకుఁ బన్నన నిద్దపుఁదళ్కు మించుట
ద్దము లనఁ దోఁచు జూపఱకుఁ దద్దయు మేల్మినుజెక్కు లౌర చి
త్తమునను వాక్పథం దలఁపఁ దత్ప్రభ సన్నుతిసేయ శక్యమే.

క. ఖలుగండ్లు వోవఁ బవడము, జలజాక్షుని మోవి యయ్యె సాగెనట వధూ
విలసద్రదనక్షతములు, తొలఁగ దెచట బాధ రాగదోషము గొన్నన్.

చ. ఘనవదనాలవాలమునఁ గన్రొనచస్సుధ నాటుదేరి చి
న్నినగవువెన్నెలం గలసి [illegible] సులో
యన రదనాళి యుంపౌనరె నాదటఁ దత్కిసలంబనంగఁ గృ
ష్ణునిమధురాధరంబు గడుసొంపు వహించు నిలింపవందితా.

క. కమలాహితవరకాంతులు, శమితతిమిరజాత్తు లమలసత్ప్రథవర్తుల్
భ్రమితోరుతారకంబులు, కమలాక్షునియాంబకములు కడుఁ దనరారున్.

ఉ. భవ్యతరంబుగా భరణభావవలాంచితవృత్తియుక్తమై
నవ్యపయోజజాతయమనం బయి యుత్పలమాలికాకృతి
స్తవ్యము గాంచి రాజిలును దైత్యవిరోధిశుభేక్షణాలి త
ద్దివ్యదుదారనైఖరులు తెల్పఁగ నా కగునే విభాకరా.

---

*స్వ్పస్వనత-మూ. †విష్ణ-మూ.

క. ఏకా ప్రతిపదగము లై, భావింప సువర్ణశబ్దభరణాంకము లై
     పైవాఱె మంగళమహా, శ్రీవృత్తము లగుచుఁ బొలిచె శ్రీపతివినుల్.

క. హారికప్పుబవిరిగడ్డము, *సారిదిగ నవ్వదనచంద్రుఁ జుట్టుకొను దళ
     త్సురరాజనీలశోభా,పరిపంథిస్ఫురదురుఁ దనరుఁ బరివేష మనన్.

క. హారిచెక్కుల సొంపా రెసు,గురుతరనవపద్మరాగకుండలరుచి శ్రీ
     తరుణీకృతిచుంబనవి,స్ఫురదురుతాంబూలరాగముం దలఁపించున్.

గీ. విషయగంధరాగనివృత్తిచేఁ జెన్నారు, కమలపత్ర నేత్రు ఘ్రాణమునకు
     విషయ మనఁగరాదు వివరింపఁగా గంధ, ఫలివి†గంధమాత్ర ఫలిత మగుట.

క. గుణవృద్ధు లగుచు రాజులు,ఫణిరాజశయానుబొమలు పరికించునుగా
     గుణిగణము వక్ర మే‡యిది,గణుతింపఁగ వక్రతమ మెకా ‡యిదియనుచున్.

క. చక్షుఃప్రియమృగమదతిల, కాక్షీణసులక్షణైకహారి యగురమా
     ధ్యక్షునలికంబునకు నప,లక్షణవక్రంపునెల తుల యనం దగునే.

గీ. ప్రథమ మై వడి సత్కళాప్రథ వహించు,దీపితాకార మై సంవృతి కెన యగును
     శక్యమే సన్నుతికి యదునార్వభౌము,లాలితచ్ఛాయమృదులనిటాలతలము.

గీ. మహితజలధరమాలికామైత్రిఁగాంచి,వఱలుచుండెడుహరివాలబంధ మొప్పు
     లఘుగుణౌజ్జ్వల్యముఖ్యత రాజిలంగఁ,జాల రహిఁజెందుచంపకమాలి కమర.

గీ. అతనిసౌందర్య మతనికళ్యాణగుణము,లనవశేషంబుగా నెన్న నలవిగాదు
     వదనములు నాల్గు గల్గినవాని కైనఁ,దలలువేయింట మెలఁగెడువలున కైన.

ఉ. అట్టిసమస్తలోకనిధి యట్టిజగద్ధితవేషధూర్వహుం
     డట్టిదయాపయోవసతి యట్టితిమోపహనామకీర్తనుం
     డట్టివిచిత్రరూపఖని యట్టిమహాద్భుతకార్యకర్త నీ
     పట్టికి మేలుప ట్టయినపట్టు సుమీ పరికించి చెప్పితిన్.

క. మదిలోపల నిక్కార్యము,వదల ననౌచిత్య మచట వదలదును వదా
     వదనదనవనజములు సమ, పదభాషికభూషణంబు పద మొందదుగా.

గీ. అబ్జబాంధవ యింతపర్యంత మిల్లు,హారికధాగోష్ఠి సమయ మత్యంతమధుర
     మగుచు వెడలెను సత్యలోకానుసరణ,వాంఛ దీర్పంగ నానతీవలయునని.

---

*సారిదిగనక్ పవనరెంగ్ర. †గంధమాత్రపలె-మూ. ‡ఏవ తాన్నల 'ఇది' యని యేకము.

గీ. ఇట్లు బలు *పోటునాటఁ గనిపుగాంచు, మించుజడదారిరతనంపు మేలుమాల
లాలకించి మురిపి ఝాత్మఁ జాల నించి, యినుఁడుసద్భక్తిఁ బల్కె మోల్లనహసించి.

ఉ. అంతర పరాత్రమంబుబలు పాఱుప నేరుపు గన్గొ సాకు నే
కాంత మనంత మానుదయ మంది తనంతపదంబు గంటి శ్రీ
కాంతుసుధాతికాంతకథఁ గర్ణయుగం బొగిఁ దన్పి తీవ్ర వా
క్కాంతతనూజ నమ్రజనకల్పకభూజ సుధీజనోత్తమా.

క. ఏగుణహాని యెఱుంగని, జోక విశేషోక్తియందు శోభిలు నమృత
శ్రీకలితసామ్యదార్ఢ్యము, లోకహితాచార బోధలులితవికారా.

గీ. అనఘమీరానతిచ్చినయట్లు నడచుఁ, గాక యీజనుఁ డన్యథాగతి మెలఁగునె
వైదికోక్తికి మీవంటివారిమాట, కరయ సత్యత నీరెంటి కర్థమొకటి.

వ. ఇట్లు వచించి విరించితనయునకు సవినయంబుగా నమస్కరించు నమస్క
రించి యతం డరుగఁ గొంతద వ్వనుగమించి మగుడఁ దదనుజ్ఞ భజించి తిరిగి
వచ్చి కూఁతుం గాంచి గ్రుచ్చి కౌఁగిలించి మెచ్చుగా ముచ్చట దీర న
మూల్యభూషణాంబరంబులు ధరియించి తక్కినసీలవేషముఖసఖీజనంబులకుఁ
దగిన సభాజనంబులు సభాజనదృక్సభాజనంబుగాఁ గావించి యయ్యింతి*మె
లపుటింతులతో నంతిపురంబునకు ననుపుటయు.

క. పరమార్థరూప వినము, †చ్ఛరమార్థవిధానదక్షసంస్మృతనామా
సురమాన్య మాన్యచరితా, పరతరమానీంద్ర హృదయపంకజభృంగా.

గద్యము. ఇది శ్రీమద్రామచంద్ర చరణారవిందనిష్యందాంతఃకరణ పోలూరి
మా[illegible]ముజ్జ్వలత్కృపాకటాక్షాసాదితపాండిత్యాభరణ ప్రభంజన
వం[illegible]శాంక నిరంతరారాధితవిచక్షణశశాంక అభినవసన్నయ
భట్టారకాహోబల§బలపత్యాహ్వయకవిమహోపాధ్యాయభట్టారక ప్ర
ణీతం బైన సకాళిందీకన్యాపరిణయం బనుమహాప్రబంధంబునందుఁ బ్రథమా
శ్వాసము.



*పోటినాటలు-మూ. †మేలు ప్రతి [illegible]. ‡చరమార్గవిధాన. §బిలపత్యా-మూ.

శ్రీ

# కాళిందీకన్యాపరిణయము.

## —: ద్వితీయాశ్వాసము :—

క. శ్రీమైథిలీమనోహర, కామితఫలదాయ సుజనకల్పమహీజా
శ్యామలవిగ్రహ నుతసు, త్రామా సాకేతధామ దశరథరామా! ౧

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపుము. ౨

క. తనతండ్రికి నారదుఁ డా, వనజాక్షునిచరితములను వర్ణింపంగా
విని మనము నాటి కామిని, తనకుం దగినట్టివిభుఁ డతండని తలఁచెన్. ౩

ఉ. ఉల్లము రంజిలం దనుఁ బయోరుహ*నేత్రలు గొల్వవచ్చి తాఁ
దల్లికి మ్రొక్కి యాయమ ముదంబున సేస లొసంగి దీవనల్
తెల్లముగా నొసర్ప నొకతీరునఁ గైకొని యొయ్య నొయ్యనే
పల్లవపాణి యందుఁ దగుబంగరుగద్దియఁ జేరెఁ జాతతోన్. ౪

చ. వనజభవేంద్రచంద్రధరవాఙ్మనసాతిగమై వెలుంగు కృ
ష్ణునిలలి సొంపునింపు జిగిసోయగము న్విభవంబునుం ద్రయీ
తనునకు నారదుండు తదుదంతము సాంతముగాఁగఁ జెప్పఁగా
వినిన మెలంత కచ్చువడి వేగమె నిల్చె హృదంబుజంబునన్. ౫

చ. తలఁచినయంతనే మిగుల దర్పకుఁ డేఁపఁగ నంతకంతకు
న్వలపులు చింత వంత బలవంతపుఁగాఁకలు వింత సేయఁగాఁ
జెలుల కెఱుంగనీక తనచెక్కిటఁ జెయ్యిడ నేరకుండె నా
జలరుహపాణి మౌగ్ధ్యమునఁ జెయ్వులు దక్కుచు లోనఁ గుందుచున్. ౬

ఉ. వీనుల విన్నయంతయును వెన్నునిచక్కఁదనంబు సంతత
ధ్యానము సేయుచో నతనియాకృతి కన్నులఁ గట్టినట్లనై
మానుగఁ దోఁచినంతటన మానిని సిగ్గున మోము వాంచినం
గానమి నంతలో వగచి కన్నుల నించును బాష్పపూరముల్. ౭

చ. నెలఁతకు వెంటనే మరుఁడు నెమ్మదికోర్కి వియోగవహ్ని కా
ల్పొలుపను మించఁగా వెడలు క్రొత్తజిగాడ్పుల వేఁడియూర్పు లై
ల్దొలఁకెఁ దదుద్గతాభినవధూమఘనాంకురపాళిసోఁ బయిం
బులకలు నిండెఁ దద్రసముపోలికఁ గ్రమ్మె శ్రమాంబు చెక్కులన్. ౮

---

*నేత్రలు. మా.

# విషయసూచిక.

---

విషయములు. పుటలు.



---

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

సంపుటము ౧౬. { ప్రభవనామసంవత్సరము / శ్రావణభాద్రపదమాసములు. } సంచిక ౩.

## భాషాశాస్త్రము—చరిత్ర.

—♦ కోరాడ రామకృష్ణయ్యగారు ఎం. ఏ. ♦—

ఆధునికయుగము ముఖ్యముగాఁ బ్రకృతిశాస్త్రయుగ మని (Age of Science) చెప్పఁబడుచున్నది. ఎక్కడఁ జూచినను ప్రకృతిపరిశోధనలు జరుగుచున్నవి. అనఁగా, ప్రపంచమున మన కగపడుచున్న వస్తుసముదాయము యొక్క మూలస్వరూప మేదో, అదినుండియు దానిచరిత్ర మెట్టిదో తెలిసికొని వానితత్త్వమును గ్రహించుటకు విశేషప్రయత్నము చేయఁబడుచున్నది. ఒకవస్తువుయొక్క తత్త్వమును గ్రహించుటకు దానిపూర్వచరిత్రను దెలిసికొనుట యత్యావశ్యకము గదా. కావుననే యీకాలమునఁ బ్రకృతిశాస్త్రముతోపాటు చరిత్రము- ప్రాచీనచరిత్రము, అనుశబ్దముకూడ దిశల మాఱుమ్రోగుచున్నది. ఐతిహాసికపరిశోధనలుజరుపఁబడుచున్నవి. అనేకవిధములగుచరిత్రలు బయలుదేఱుచున్నవి. దేశచరిత్రలు, యుగచరిత్రలు, రాజ్యాంగచరిత్రలు, సామ్రాజ్యచరిత్రలు, జీవితచరిత్రలు, వాఙ్మయచరిత్రలు, ఇంకను శాస్త్రముల చరిత్రలు మొదలగున వనేకములు బయలుదేఱుచున్నవి. ఆయాచారిత్రకాంశములను బోధచేయుటకుఁగా ననేకవిధము లగు ప్రాచీనవాఙ్మయములు, శాసనములు, నాణెములు, శిల్పములు, నింక నితరము లగులేఖ్యపత్రములు పరిశీలింపఁబడుచున్నవి. వీనివలనఁ దెలియవచ్చిన మానవచరిత్రకు నృవంశశాస్త్రము (Ethnology) పురాణవస్తుశాస్త్రము (Archaeology) లిపిశాస్త్రము (Palaeography) జీవశాస్త్రము (Biology) భూగర్భశాస్త్రము (Geology) మొదలగునవి మఱికొంత సహాయము చేయుచున్నవి. కాని శాస్త్రసంపదలు,

ప్రాచీనచరిత్ర నిర్మాణమునకుఁ గలిగినసహాయములలో శబ్దశాస్త్రమువలనఁ గలిగినసహాయము మహత్తర మైనదిగా నెన్నఁదగియున్నది. ఈశబ్దశాస్త్రమనునది యిటీవలఁగొలఁదికాలముక్రిందట నేవృద్ధిలోనికిఁ దేఁబడినదైనను, మానవకుటుంబముల ప్రాచీనచరిత్రమును దెల్పుటలో నిది యగ్రగణ్య మైనయాధారం బై వెలయుచున్నది. ఏలయనఁగా నిది యితరము లగునాధారము లన్నిటివలనఁ దెలిసికొనఁగలిగినదానికంటె మిక్కిలి పూర్వమును ప్రాచీనము నైనమానవచరిత్రను అనఁగా నిదివఱలో మనకుఁ దెలిసినచరిత్రకాలముకంటెఁ బ్రాచీనతరంబగు కాలమునందలి (Prehistoric times) మానవకుటుంబములచరిత్రను మనకుఁ దెలుపుచున్నది. మఱియు నాయాకాలముల నాయాజనులచే స్వయముగ వ్యవహరింపఁబడిన శబ్దములలో వారిభావములు ముద్రింపఁబడి నిక్షిప్తములై యుండును గావునఁ దక్కినవానికంటె నిది నిస్సందిగ్ధ మగుసాక్షాన్నిదర్శనముగ (Direct evidence) గ్రహింపఁదగియున్నది. ఆకాలమందు వారిస్థితిగతు లెట్టివో, వారిసాంఘికమతస్థితులు, వారివృత్తులు ఆచారవ్యవహారములు భావజ్ఞానసంపత్తి యీమొదలగు సన్నిహితవిషయములఁ గూర్చి మనము తెలిసికొనఁగలము. చరిత్రను బలువురు పలువిధముల నిర్వచించిరి. కొంద ఱాయాదేశములయందలి రాజ్యాంగవ్యవహారములు లేదా వానిచరిత్రయే దేశచరిత్ర మనిరి. మఱికొంద ఱందలిమహాపురుషుల జీవితచరిత్రయే దేశచరిత్ర యనిరి. మఱికొంద ఱందు బయలుదేఱిన మతసాంఘికరాజకీయాద్యనేకవిధములగునుద్యమముల(Social & political & other movements) చరిత్రయే దేశచరిత్ర యనిరి. ఏ దెట్లైనను, ఒకమానవకుటుంబముయొక్క చరిత్రము మనము తెలిసికొనఁదలఁచినపు డాజనుల కాకాలమునఁ గలవివిధములగుభావములను మతాచారములను జీవనపద్ధతులను గూర్చి తెలిసికొనలేకపోయినచో వారినిగూర్చి యథార్థజ్ఞానము కలవారము కాఁబోము. ఈసంవత్సరమున నిన్నియుద్ధములు జరిగినవి, యీరాజు పాలించుచుండెను. ఇందఱు జనులు చచ్చిరి. అనునీచెప్పెడివార్తలె దేశచరిత్రము కా దనువిషయ మిప్పు డందఱు గ్రహించుచున్నవిషయమే. శబ్దశాస్త్ర మనున దీవిధము లగుచారిత్రకాంశకములను దెలుపుటకుఁ దోడ్పడకపోయినను, ఆయాకాలములందలి జనులభావములను స్థితిగతులను గూర్చినయథార్థజ్ఞానము కొంత కలుగఁజేయు ననుటలో సందేహము లేదు.

కాని "యీశబ్దములు శబ్దశాస్త్రము ననుసరించి చరిత్రజ్ఞానమున కెట్లు తోడ్పడఁగలదు" అని యడుగవచ్చును. శబ్దశాస్త్ర మనఁగా భాషాశబ్దములను గూర్చినశాస్త్రము- అనఁగా, ప్రపంచమందుఁ గలభాషలన్నియు, నాభాషాపదము లన్నియు, ఇంతయేల యేదైననొకయర్థమును సూచించెడివ్యక్తము లగు పదములన్నియు నీశాస్త్రమునకు విషయములే. "యేనోచ్చారితేన, సాస్నాలాంగూలకకుదవిషాణినాం సంప్రత్యయోభవతి సశబ్దః ప్రతీతపదార్థకః ధ్వనిశ్శబ్దః" అని భాష్యకారుఁడగు పతంజలి చెప్పియున్నాఁడు. ఇప్పుడు భూభాగమున వ్యవహరింపఁబడుచున్నభాషలు సుమారు 900 లకుఁ దక్కువయుండవనికనుఁగొనఁబడినది. ఈభాషలలోఁ బ్రసిద్ధమైనవానికిఁ బరస్పరము గలసంబంధమును జూచి శబ్దశాస్త్రజ్ఞు లీభాషలను గొన్నికుటుంబములుగా నేర్పఱిచి, యీభాషాకుటుంబము లొకకాలమునందు వానిని వ్యవహరించిన మానవకుటుంబములనే సూచించు నని నిర్ధారణచేసిరి. అనఁగా, కొన్నిభాషలకుఁ గలసన్నిహిత మైనపరస్పరసంబంధము కనపెట్టఁబడినచో, నాభాషలన్నియు నొకమాతృభాషనుండి వచ్చియుండవలయు ననియు, కావుననే యాభాషలను మాటలాడువారందఱు నొకకాలమున నామాతృభాషను మాటాడుచు నొకచో నివసించిన ప్రాచీనమానవకుటుంబముయొక్క సంతతివారై యుండవలయు ననియుఁ దెలియుచున్నది. ఒక్కొక్కకాలమున నొకజాతివారు దేశాంతరమునకుఁ బోయి యచ్చటిభాష నవలంబించి వ్యవహరించుట తటస్థించుటంజేసి భాషకును జాతికి నియతసంబంధ ముండునని నిశ్చయముగాఁ జెప్పుట కవకాశము లేదుగాని, సామాన్యముగా భాషాకుటుంబములు మానవకుటుంబములను సూచించు నని చెప్పవచ్చును. ఏదైన సారూప్యము గలయొకపద మొకకుటుంబమునకుఁ జెందినభాషలలో సమానార్థకమై కన్పడినచో నది ప్రాచీనకాలమున నామాతృభాషను మాటలాడినజనులుకూడ నాపదము నాయర్థమున వ్యవహరించియుందు రని తలంపఁదగును.

| సం. | గ్రీకు | లాటిన్ | జర్మన్ |
|---|---|---|---|
| అనితి-అనిలః=వాయువు- | అనెమోస్ (anomos) | అనిమస్ (animus) | —— |
| హంసః- | ఛెన్ (chen) | ఆన్సెర్ (anser) | గాన్స్. (gans) |
| భ్రాతర్- | ఫ్రేటెర్ (Fhrater) | ఫ్రేటెర్ (frater) | (గాథిక్) బ్రోథర్ (Brothar) |

| సం. | గ్రీకు | లాటిన్ | జర్మన్ |
|---|---|---|---|
| మాతర్ – | మెటెర్ (mater) | మాతెర్ (mater) | మాటెర్. (mouter) |
| పంచ – | పెంటె (pente) | క్వింక్వె (quinque) | (గాథిక్) ఫింఫ్ (finf) |
| చత్వారః – | టెట్టారెస్ – టెస్సారెస్ (Tettares) | క్వాటుర్వొర్ Quattuor | గాథిక్, ఫిడ్వొర్ (Fidwor) |
| త్రయః | త్రెస్ (treis) | త్రెస (గాథిక్) థ్రెస | (లిథూ) కెటూరి. (Keturi) (threis) |
| భరామి – | ఫెరో (phero) | ఫెరో (fero) | బెయిరా (baira) |

ఇట్లు యత్కించిత్స్వరభేదము గలవై సమానార్థకము లగు వేలకొలఁది యీపదములు మిక్కిలిదూరస్థలము లగు దేశములలోని జనులచే వ్యవహరింపఁబడుటంజేసి యవి యొకభాషనుండి మఱియొకభాషలోని కెరవు తెచ్చుకొనఁబడిన వని చెప్పుటకు వీలులేకుండుటచే నొకప్రాచీనభాషాస్రవంతినినుండి కాలక్రమమున వేఱువడి ప్రత్యేకముగా, పాయలై ప్రవహించిన భాషాప్రవాహములుగా నెన్నఁదగియున్నవి. కావుననే యీభాషల కన్నిటికిని మూలాధార మగుమాతృభాష కల దనియు, నిప్పు డీభాషలను వ్యవహరించుచుండెడి జనసంఘములకు మూలభూతం బగునొకప్రాచీనజనసంఘ మా భాషలో వ్యవహరించుచుండెడివా రనియుఁ జెప్పఁబడుచున్నది.

భాషాపదములలోఁ బ్రతిదానికి నేదోయొకయర్థ ముండక మానదు. భాష యనునది మానవునియాంతరంగికభావముల నితరులకుఁ దెలుపుసాధనములలో ముఖ్యమైనది. ఆంతరంగికభావములను ధ్వనిరూప మగుభాషచేఁ బైకివ్యక్తపఱుపఁగల శక్తి జంతువులలో నొక్కమానవునికే గలదు. కావున నాకాలమునాఁటి యాతనిభావము లన్నియు నప్పటియాతనిభాషలోఁ బ్రతిఫలించియుండె ననుటకు సందేహము లేదు. కావున మానవునికి భాష నుపయోగించుకొనుశక్తి కలిగినప్పటినుండియు నాతఁ డుపయోగించిన శబ్దజాలమును మనము గుర్తింపఁగలిగినచో నప్పటినుండియు నాతనిభావములను–అనఁగా భూభాగమునందలి మానవజీవితముయొక్కచరిత్రను మనము తెలిసికొనఁగలుగుదుము. ఇంతకాలమునుండియు మానవుని లేదా మానవకుటుంబముల ప్రాచీ

నచరిత్రను దెలిసికొనుటకుఁగా ననేకవిధము లగుప్రాచీనవస్తువులు లిపులుఁ శాసనములు కట్టడములు మొదలగునవి పరిశోధింపఁబడినవి. కాని ప్రతిదినము మనము మాటలాడుచుండిన భాషలయొక్క శక్తి యెట్టిదో పరిశీలింపఁబడ లేదు. ఇటీవల శబ్దశాస్త్రమనునది వచ్చినపిదప-అనఁగా భాషలపుట్టు, పూర్వోత్తరక ములు ఉత్పత్తి వికాసములు మొదలగువానికిఁ గలకారణములు గనిపెట్టఁబడి నతరువాత, భాషాశాస్త్రమనునది తక్కినశాస్త్రములవలెనే యొకశాస్త్రముగా నంగీకరింపఁబడుటచే దీనిమూలమున భాషలయొక్కయు, భాషాపదములయొ క్కయు, పూర్వచరిత్రము నన్వేషించి, యవి యేయేకాలముల నేయేమార్పు లను జెందినవో, ఏస్థితిలో బయలుదేఱి యెట్లు ప్రస్తుతస్థితికి వచ్చినవో, వాని మూలరూపములు మూలార్థములు నేవియో కనిపెట్టఁబడినవి. ఒకభాషాపద ములయొక్కయు వానియర్థములయొక్కయుఁ జరిత్రనుబట్టి యాభాషాపదము లను వాడుకొనినజనులు, ఏయేకాలములయం దెట్టిభావములు కలిగియుండిరో యనువిషయమును మనము తెలిసికొనఁగలుగుచున్నాము. మఱియు నీమా ర్పులకుఁ గలకారణము లేవో యని విచారించుటచే మన కనేకము లగుచా రిత్రకవిషయములుగూడఁ దెల్లంబు గాఁగలవు. ఒకచిన్నయుదాహరణము. ఆంగ్లభాషయందుఁ గొన్ని నార్మనా ఫ్రెంచిపదములు కనఁబడుచున్నవి. ఇవి 11 వశతాబ్దమునుపిదప బయలుదేఱిన గ్రంథములలోఁ గనఁబడుచున్నవి. దీనిని బట్టి యింగ్లీషువారి కాకాలమున నార్మనులతో సంబంధము కలిగిన దని తెలి యవచ్చుచున్నది. దీనికి నిదర్శనముగా 11 వశతాబ్దమం దింగ్లాండుదేశము నార్మనులచే జయింపఁబడిన దని చరిత్రయె ఋజువుచేయుచున్నది.

ఇట్లే, ఆంధ్రవాఙ్మయమున 14 వ శతాబ్దప్రారంభమునుండియు హిందు స్థానీపదములు గానవచ్చుటకుఁ గలకారణమును చారిత్రకవిషయములు సమ ర్థించుచునేయున్నవి. కొంతకాలముక్రిందటఁ దెలుఁగుభాషలో 'కుంపిణీ' మొ దలగుపదములు వ్యవహారమున నుండుటకును, ఇప్పుడు లాంతరు, ఆసుపత్రి, రోడ్డు, మొదలగునవి ప్రచారములో నుండుటకును గలకారణములు సర్వవి దితములే. ఇట్లు భాషలవలన సూచింపఁబడెడి మానవులజీవితచరిత్రను గూర్చి నవిషయములను జరిత్ర సమర్థింపవచ్చును గాని, భాషయైతే చరిత్రచే సమ ర్థింపలేని-అనఁగా, చరిత్ర కందని యతిప్రాచీనం బగుకాలమందలి మానవకు టుంబముల స్థితిగతులను గూర్చికూడఁ జెప్పఁగలిగియున్నది. ప్రస్తుత మార్య

సంఘములయొక్క ప్రాచీనచరిత్రను దెలిసికొనుటకు శబ్దశాస్త్ర మెట్లు తోడ్ప డుచున్నది పరిశీలింతము.

ఇప్పు డింగ్లీషు, గ్రీకు, లాటిన్, జర్మన్, రష్యియన్, అవెస్టాభాష, సంస్కృతము మొదలగు హిందూయూరపుదేశములందు వ్యవహరింపఁబడెడు కొన్ని భాషలకుఁ బరస్పరసంబంధము కలదనియు, నివి యన్నియు నొకమాతృభాష నుండి పుట్టిన వనియు, వీనికి మూలమైన యాభాషను మాటలాడిన యొకప్రాచీనకుటుంబముయొక్క సంతతివారే యిప్పు డీభాషలను వ్యవహరించుచున్నారయియుందు రనియు శబ్దశాస్త్రజ్ఞు లాయాభాషలకుఁ గలసామ్యమునుబట్టి నిర్ధారణచేయుచున్నారు. ఈజనులప్రాచీనచరిత్రమును గూర్చి తెలుపఁదగినయాధారములు సంస్కృతమున ఋగ్వేదాదులు, గ్రీకున హోమరుగ్రంథములు మొదలగునవి కొన్నియున్నను, అవి క్రీస్తుశకమునకుఁ బూర్వము సుమారు రెండువేలయేండ్లకంటెఁ బ్రాచీనమగు చరితమును దెలుపలేవు. అంతకుపూర్వ చరిత్రమును, అనఁగా, ప్రాచీనార్యకుటుంబముయొక్క స్థితిగతులను దెలిసికొనవలెనన్నచో భాషాచరిత్రము,పదచరితముతక్క మఱియేయాధారములును లేవు. యూరపుపశ్చిమభాగమునుండి హిందూదేశమువఱకు వ్యాపించిన యీ యార్యసంతతివారికి మూలకుటుంబమునా రేదేశమున నివసించెడివారో వారియాచారవ్యవహారము లెట్టివో, అనువిషయమును దెలిసికొనుటకుఁ గొన్ని పదములు మనకుఁ దోడ్పడఁగలవు.

సంస్కృతమున, 'మధు' అనుపద మొకటి కలదు. దీనికిఁ దేనె యనియు మధుపానీయ మనియు నర్థము. మధూక మనఁగాఁ దుమ్మెద. దీనికి అవెస్టాభాషలో 'మదు', బల్గెరియన్‌భాషలో 'మెడ్యు', లిథూనియన్‌భాషలో 'మెడ్' ప్రాచీనప్రష్యన్‌భాషలో మెడ్డో, గ్రీకు 'మెధు' ప్రాచీనజర్మన్ మెతో, డచ్చి మెడె, ఆంగ్లోసాక్సన్- మెదు, ఇంగ్లీషు- మీడ్ అనురూపములు కలవు. ఈభాషలలో నీపదముల కన్నిటికిని తేనె లేదా తేనెతోఁ జేయఁబడిన యొక విధ మగుపానీయము. (Fermented liquor made from honey) అని యర్థము. ఇన్నిభాషలలోఁ దేనె యనునర్థ మొక్కపదముచేతనే చెప్పఁబడుటచే వీనికి మూల మగుభాషలో నిట్టిపదమే యుండవలయు ననియు, నాభాషను వ్యవహరించిన ప్రాచీనార్యకుటుంబము తేనెను,మధుపానీయమును ద్రావెడివా రనియు, తెనెటీఁగలకు నివాస మై తేనె పుష్కలముగా దొరకెడిదేశ

మున నివసించినవారనియు మన మూహింపనగును. ఇప్పటికిఁ గొన్ని దేశములలో, తేనెకు బదులు ద్రాక్షాసారాయము మొదలగునవి యుపయోగింపఁబడుచున్నను, లిథూనియను లిప్పటికి నాపదమునే వాడుకొనుచు సీమధుపానీయమునె పుచ్చుకొనునాచారము నిన్నివేలయేండ్లనుండియు నిలుపుకొని యున్నారు. మనదేశమున దేవతాపూజలలో, పంచామృతము స్నానమునను, పితృకార్యములలో మధుపర్కమునను మాత్రమే ప్రాచీనాచారము నిలిచియున్నట్లున్నది.

తేనె లొలికించు దేశములలో నివసించెడి వీరికి జీవనాధారం అను ప్రశ్నకు వీరు ధరించిన, లేదా వీరికిఁ బెట్టఁబడిన 'ఆర్యులు' అను నామమె కొంతవఱకు జబాబు చెప్పుచున్నది. 'ఆర్య' శబ్దమునకు భూస్వామి (Land holder) అనునర్థమువచ్చినది. కాని దీనిమూలార్థము వీరిముఖ్యవృత్తిని దెలుపును. ఈ పదము 'కదలఁదీయుట' అనునర్థముగల 'అర్' అనుధాతువునుండి యేర్పడినది. భూమిని కదలునట్లు చేయుట దున్నుటవలననే గనుక 'అర్' అనుదానికి దున్నుట యని యర్థము. ఈధాతువునుండియే అవెస్టాలో 'ఐర్య' (Airya) లాటిన్‌లో 'అరేర్' (arare) అనియు, గ్రీకులో 'అరోన్' (ar-oun) అనియు, ఐరిషులో 'అర్' అనియు, లిథూనియన్‌లో 'అర్తి' (ar-ti) అనియు, రషియన్‌లో ఒరతి (ora-ti) యనియు, గాథిక్‌లో 'అర్ జాన్' (ar-jan) అనియు, ఆంగ్లోసాక్సన్ (er-jan) 'ఎర్.జాన్' అనియు, ఇంగ్లీషులో 'to ear' అనియు, సమానార్థకపదము లేర్పడినవి. ఇంగ్లీషులో 'to ear' అనఁగా to plouth దున్నుట అనునర్థముకలదు. "To ear the land that has some hope to grow" అని Richard II నాటకములో (IV-2) షేక్స్పియరు ప్రయోగించినాఁడు. దీనినుండియె దున్నుట కుపయోగించు పనిముట్టు—నాఁగలి యనునర్థమున లాటిన్‌లో అరత్రం (ara-trum) గ్రీకులో 'అరొత్రోన్' (aro-tron) లిథూనియన్‌లో అర్క్లస్ (arklas) అనుపదములు గలిగినవి. సంస్కృతమున 'అరిత్రం' అనఁగా, చుక్కాని (Rudder). నాఁగలి భూమిని కదల్చి దున్నినట్లె చుక్కాని నీళ్లను భేదించి నావను నడుపుట కుపయోగించుచు గాన నాధాత్వర్థ మిచ్చుటను సరిపోవుచున్నది. గ్రీకు 'ఎరా' (era) జర్మన్ 'ఎరొ' అనుపదమునకు భూమి—దున్నినభూమి యనియర్థము. సంస్కృతమందలి 'ఇరా'— ఇలా యనుపదమును

ఇంగ్లీషుఁ ఎర్త్ (earth) అనుపదములు వీనికి సంబంధించినవే. ఇన్ని భాషలయందుగల రూపముల సమానార్థకమై కనఁబడుచుండిన యీపదమునుబట్టి చూడఁగాఁ బ్రాచీనార్యకుటుంబమునకుఁ గలజీవనాధారములలో భూమినిదున్నుట, పండించుట అనఁగా వ్యవసాయమే ముఖ్యమైన దనియు నద్దాని నిప్పుడు వేఱువేఱుభాషలు మాటలాడుసంఘము లన్నియు విడివడక కలసి యేకకుటుంబముగ నున్నకాలమందె వీ రవలంబించియుండి రనియు నూహింపఁదగియున్నది. కాని పశుపాలకత్వముకూడ మఱియొక జీవనోపాధియై యుండె నని యీభాష లన్నిటిలోను గనఁబడుచున్న 'పశు' శబ్దము సూచించుచున్నది. దీనికి లాటిన్‌లో 'పెకస్' (pecus) గాథిక్‌లో 'ఫెయిహు' (faihu) జర్మన్‌లో 'వెహ్' (veih) ఇంగ్లీషులో 'ఫీ' (fee) అనియు రూపములు గలవు. వారు పశువులనే ధనముగా నెంచుకొనుచుండి రనుటకు వేదమున 'గవేషణ గవిష్టి' పదములకుఁ గల ధనముకొఱకు వెదకుట యనునర్థమే నిదర్శన మగుచున్నది. ఆధనము—అనఁగా, పశుధనము సంపాదించుటకొఱకప్పుడు యుద్ధము చేయవలసియుండెను గావున నీశబ్దములకు 'యుద్ధము' అను నర్థముకూడఁ గలిగినది. 'యోధుఁడు' అనుటకు ఋగ్వేదమున 'గోసుయుధ్' గోవులకొఱకుఁ బోట్లాడువాఁడు—అనుపదము కలదు. దీనివలన గోవులకొఱకు—అవియే వారి ధనము గావున ధననిమిత్తమై వారు యుద్ధములుకూడఁ జేయుచుండిరని తెలియుచున్నది. 'పశు' శబ్దమునకుఁ గల 'ధనము' అనునర్థము లాటిన్‌భాషయందలి 'పిక్యూనియా' (pecunia) అనుపదమునందుఁ గూడ నున్నది. దీనినిబట్టియే యింగ్లీషుభాషలో 'పిక్యూనియరీ' (pecuniary) 'ధనసంబంధమైన' అనునర్థముగల విశేషణవాచకపదము గలిగినది. ఆంధ్రమునఁ బశువులకు 'సొమ్ము' లని వాడుట గంజాము విశాఖపట్టణముజిల్లాలలోఁ గలదు. కృష్ణా గోదావరులలో నున్నట్లు నే నెఱుఁగను. కన్నడమునఁ గూడఁ బశువులకు 'దన' మని యందురు. ఈరెండుపదములును "స్వం" "ధనం" అనుసంస్కృతపదములనుండి వచ్చినవే గావున నార్యులు పశువులను సొమ్ముగాను ధనముగాను నెంచుకొనుచుండినకాలమున దక్షిణదేశస్థులతోఁ గలిగిన సంసర్గముచే, వచ్చిన సాంప్రదాయమా యని సందేహము కలుగక మానదు. ఇంతేగాక వేదకాలమున యజ్ఞములయందు దక్షిణలుగా గోవులనె యిచ్చుచుండెడివారు, ఉపనిషత్తులకాలమందుఁ గూడ బహుమానరూప మగు దక్షిణగా గోవులనే

యిచ్చుచుండిరనుటకు నిదర్శనముగా బృహదారణ్యకోపనిషత్తునందు (III-1-2) జనకుఁ డొకవాగ్వాదమున మాధ్యస్థ్యమును వహించి యచ్చటిబ్రాహ్మణులతో నిట్లు చెప్పినట్లు తెలియుచున్నది. "బ్రాహ్మణా భగవన్తో యో వో బ్రహ్మిష్ఠః స ఏతా గా ఉదజతాం" ఓపూజ్యులగు బ్రాహ్మణులారా! మీలో నెవరు బ్రహ్మిష్ఠులో వా రీగోవులను గ్రహింతురుగాక". మఱియుఁ బ్రాచీనకాలమున వివాహశుల్కముగఁ గూడ నీగోవులనె యిచ్చునాచారమున్నట్లు తెలియుచున్నది. అప్పటిసంప్రదాయము ననుసరించియే యిటీవలి కాలమున మనువుమొదలగు ధర్మశాస్త్రకర్తలు అష్టవిధవివాహములలో, పెండ్లికొడుకు వధువుతండ్రికి గోయుగము నర్పించి యామెను వివాహము చేసికొనుపద్ధతిని 'ఆర్షవివాహ' మని చెప్పియున్నారు. ఈ 'వధువు' అనుశబ్దమే ప్రాచీనార్యుల సంఘవ్యవస్థను గూర్చి కొంత చెప్పుచున్నది. అనఁగా వారిలో వివాహము లున్నట్లు స్పష్టము. 'వేధ్' అనుధాతువునుండి 'సం. వధు' అనియు, లిథూనియాలో 'వెడు' (vedu) అనియు, సాక్సనుభాషలో వెధ (veda) అవెస్టాలో ఉపవాదయైత=(వాఁడు వివాహము చేసికొనును) అనియు రూపములు కలవు. ఈపదములకు మూలార్థ మగు 'తీసికొనిపోవుట—వహించుట—అనునర్థము ఐరిష్ భాషలో (fedaim) (ఫెడైమ్)—సం. వహామి=I carry—నేను తీసికొనిపోవుచున్నాను. fedan = a team = బండినిగాని రథమునుగాని వహించుపశువులజంట—అనుపదములలోఁ గన్పడుచున్నది. వేదభాషలో 'వహతు' అనఁగా వివాహము. వివాహశబ్దము కూడ నాయర్థమునె సూచించుచున్నది. ఈవహించుట యనఁగా నామెజీవనభారమును వహించుటగాని లేదా అగ్నిచుట్టు ప్రదక్షిణము చేయుటగాని మొదటియర్థమయి యుండదు. వరుఁడు 'వధువు'ను తల్లిదండ్రులకుఁ దెలియకుండఁ గాని లేక వారితోఁ బోరాడి జయించిగాని యెత్తుకొనిపోవుట యనియే దీనిమొదటియర్థము. ఈసాంప్రదాయము ప్రాచీనధర్మశాస్త్రములలోఁ జెప్పఁబడినరాక్షసవివాహమునఁ గానవచ్చుచునె యున్నది. ఇట్లు గానిచో వరుఁడు వధువునకుఁ గా నామెతల్లిదండ్రులకుఁ గొంతసొమ్మిచ్చి యామెను రథముమీఁదఁ దన యింటికిఁ దీసికొనిపోవునాచారమును బట్టియైన 'వహించుట' కాయర్థము వచ్చియుండును. ఇట్లు సొమ్మిచ్చు నాచారమును బ్రబలియున్న దనుటకు 'వధువునకుఁగా నిచ్చెడిధనము' అనునర్థముగల '(Anglo Saxon)' ఆంగ్లోసాక్సన్

భాషలోని 'Westuma' జర్మన్‌లోని 'విట్టుమ్' (Wittum) స్లావోనిక్ భాషలోని 'వెనో' (Veno) [illegible] 'వసన' యనుపదములే నిదర్శనములగుచున్నవి. ఇంకొకటి, విగతభర్తృకలు మరల వివాహము చేసికొను నాచార మప్పు డున్నటులు గన్పడదు. సంస్కృతమున విధవా, లాటిన్ భాషలో (vidua) విడువ; గాథిక్‌లో 'విడువో' (widuvo) జర్మన్ 'విట్వే' (witwe) ఇంగ్లీషు 'విడో' (widow) అనుసమానార్థకపదములు కనఁబడుచుండుటచే నాకాలమున స్త్రీపునర్వివాహమున కభ్యంతర మున్నట్లు తోఁచును గాని భార్యను గోల్పోయినపురుషుని సూచించుపదము లేకుండుటచేఁ బురుషులు పునర్వివాహము చేసికొనుట కేయభ్యంతరము లేదేమో యని తలంపఁ దగియున్నది. ఇంగ్లీషులోని 'widower' అనుపదము 'widow' యనుదానినిబట్టి తరువాత నేర్పడినది. దీనికిఁ బ్రాచీనభాషలోఁ బ్రత్యేకపద మేమి యున్న ట్లగఁ బడదు. కావునఁ బురుషులపునర్వివాహమున కప్పు డాటంక మున్నట్లు లేదని తలంపఁదగియున్నది. ఇట్లె ప్రాచీనార్యకుటుంబముయొక్క స్థితిగతులనుగూర్చి సూచించెడి పదము లనేకములు గలవు.

సంస్కృతమున 'దమ',—"ధామ" అనఁగా, ఇల్లు సంస్కృతమున ధామశబ్దమునకున్నంత ప్రాచుర్యము 'దమ'శబ్దమున కున్నట్లులేదు. వైదికభాషయందుఁ 'దమ'శబ్దమునకు వ్యవహారము "వర్ధమానంస్వేదమె"etc.

సం. దమ–Sk. డొమోస్ (domos)– లాటిన్ డోమస్ (domus)ఈ యిళ్లకు ద్వారములు కలవు. సం.ద్వార్; గ్రీకు-థూసా (thusa) లాటిన్ ఫోరెస్ (fores), గాథిక్-దుఆర్ (duar) జర్మన్-తూర్ (tuir) ఇంగ్లీషుడోర్ (door). దీనినిబట్టి ప్రాచీనార్యులు ద్వారాదులలోఁగూడిన యిండ్లలో నివసించెడివారని తెలియుచున్నది. పురుషుఁడె యాగృహమున కధిపతి–యజమానుడు. (ఈ 'యజమాని' శబ్దమునకర్థ మాంధ్రమున నెట్లుమాఱినదో గమనింపుఁడు.–)

అతఁడె యాగృహమును రక్షించువాఁడు కావుననే 'పతిశబ్దవాచ్యుఁడు దీనికి గ్రీకులో–పోటెస్ (potes) గాథిక్–ఫాథ్స్ (faths) అనురూపములు కలవు. ఈయర్థమునే చెప్పు దంపతీ–శబ్దమునకు గ్రీకున–డెస్‌పోటేస్ (despotes) అనురూపము కలదు. దీనికిమూలరూపము "డెమ్స్‌పోటెస్" అనఁగా దమస్‌పతి=గృహపతి అనియర్థము. ఈ 'దంపతీ'శబ్దమును దమస్+పతి–అని

కాక, జంపతీశబ్దసాదృశ్యముచే గాఁబోలును "జాయాచపతిశ్చ" యని పిషఁదీసి "జాయాశబ్దస్య జంభావో దంభావోవా నిపాత్యతే" జాయాశబ్దమునకు జంభావము, దంభావము వచ్చునని నిపతించి-జాయాచపతిశ్చ-జంపతీ, దంపతీ, యని సంస్కృతవైయాకరణులు విగ్రహముచెప్పిరి గాని 'జాయా'శబ్దమును 'దం' గామాఱుటకుఁ గారణ మేమియుఁ గనఁబడకుండుటచేఁ బ్రాచీనకాలమున నిది "దమః"-గృహమునకుపతి యని కేవలపుంపరముగనే గ్రహింపఁబడినట్లు తెలిసికొనవలసియున్నది. గృహభర్త-పతి-కాఁగా భార్య పత్ని యైనది. దీనికి గ్రీకున 'పోట్నియా' (potnia) అనురూపము కలదు. వీరి జీవనాధారమగు నాధారవిషయమును దెలుపుటలో "గవాశిరమ్" "గవ్యం" అనుపదములు తోడ్పడుచున్నవి. వీనికిఁ బాలతోఁ గూర్పఁబడిన, లేదా చేయఁబడిన యాహారమని యర్థము. ఉదీచ్యులకు నైరోపీయులకు గ్రీకుభాషలో 'గెలక్టోట్రోఫౌంటెస్' (galaktotrophountes) అనఁగా పాలే యాహారముగాఁ జేసికొని బ్రతుకువారు (Those who subsist on milk) అని యర్థముగల పదముగలదు. ఈయావులవాల నింటియందలి యాఁడుపిల్లలె పితుకుచుండిరనుటకుఁ మన'దుహితృ'పదమె తార్కాణము, దీనికి గీర్వాణభాషలోపలెనె గ్రీకు, ఇంగ్లీషుభాషలలో 'థుగెటర్' (thugater), డాటర్ (daughter) అను సాజాత్యరూపములు (cognate words,)కలవు. వీని కన్నిటికిని కుమార్తె యనియే యర్థము. ఇవి 'పితుకుట' అనునర్థముకల 'దుహ్' ధాతువునుండి నిష్పన్నములై సాజాత్యముకల వగుటచేఁ బ్రాచీనార్యులు తమయాఁడుపిల్లలను గోసంరక్షణమున నియమించి వారిచేఁ బాలను పిదికించుచుండెడివా రనియు, నట్లాక కాలమున నింటిలోఁ బాలుపితుకుటె ముఖ్యకర్తవ్యముగాఁ గలిగిన పిల్లలే తరువాత దుహితృశబ్దవాచ్యులై యుండిరనియు మనకుఁ దెలియవచ్చుచున్నది. ఇప్పు డీభాషలను మాటలాడుచున్నవారికిఁ బూర్వు లగు "నిండోయూరోపియన్' కుటుంబమువారిలో నొకకాలమున నిట్టియాచారమున్నటు లీపదచరితమువలననే గాని మఱియేయితరగ్రంథసామగ్రివలనను మనము తెలిసికొనుటకు వీలులేదు. గొఱ్ఱెలచర్మములను కట్టుకొనెడివారనియు, బొచ్చును నేతకుపయోగించెడివారనియుఁ గూడ 'రెనోఫొరియస్' గొఱ్ఱెలచర్మములు ధరించువారు అనెడిగ్రీకుపదమునుబట్టియు, సం. ఊర్ణా, లాటిన్-వెల్లన్, గాథిక్ వుల్ల (wulla) జర్మన్ 'వొల్లె' (wolle) అనుపదములవలనను గ్రీ-ఉ

ఫైనో (phaino) జర్మన్ 'వెబెన్' (weben) సం 'ఊర్ణ—నాభ' అనుప దములవలనను తెలియుచున్నది. కాలవాచకము లగుపదములలో సంవత్సర మును దెలుపుటకుఁగా మొట్టమొదట 'హేమన్త' 'హిమ' అనుపదములు నేక రింపఁబడినట్లు తెలియనగును. దీనికి గ్రీకుభాషలో 'ఖెయ్మోన్' (cheimon) అనియు లాటిన్‌లో 'హీమ్స్' (hiems) అనురూపములు కలవు. లాటిన్‌లో Bimus, bimus=అనఁగా రెండేండ్లు మూఁడేండ్లువయసు గలయనియర్థము. వేదమునఁగూడ నూఱుసంవత్సరములనుటకు "శతంహిమాః" అనుటకలదు. మఱికొన్నిచోట్ల "శతం నో రాస్వశరదః" (ఋ వే. II-27-10) 'జీవేమశర దఃశతం" అని 'శరత్' పదమును సంవత్సరపరముగాఁ జెప్పఁటయుఁగలదు. మఱి యొకటి "సమాః"అనునది. అవెస్టాలో 'హామ్' (ham) ఆర్మీనియన్ అమర్ని ఐరిష్—సామ్ (sam) జర్మన్ 'సుమర్', ఇంగ్లీషు- 'సమ్మర్' (Summer) అనురూపములు వేసవి అనునర్థములోఁ గలవు. సమశబ్దమునకుఁ గల'సగము' అనునర్థమునుబట్టి ప్రాచీనార్యులు సంవత్సరములో సగముభాగము వేసవిగాఁ గలప్రదేశమున నున్నప్పుడీపదము బయలుదేఱి, తరువాత సంవత్సరపర్యాయ ముగా వాడుకలోనికి వచ్చియుండునని యూహింపఁదగియున్నది. 'హిమ, శరత్, సమ' శబ్దములవలెఁ దక్కినఋతుద్యోతకపదములు సంవత్సరపర్యా యములు కాలేదు. దేవతలనుగూర్చినపదములలో దేవ-Lat. deus లిథూని యన్ (dievas), ద్యౌపితా-Lat. 'juppiter' గ్రీకు zeus pater (జియస్ పెటేర్ అగ్ని-లిథూనియన్ (ugnis) ఉగ్నిస్, రషియన్ (ఒగోన్) ogon. లాటిన్ (ignis) ఇగ్నిస్, ఉషస్-గ్రీ (eos) ఇయాస్ లాటిన్ (aurora) ఔ రోరా-అనుపదములనుబట్టి యీదేవత లీభాషలమాటాడువా రందఱుఁగలసి యున్నప్పటినుండి యుండిరని తెలియవచ్చుచున్నది. ఇట్లె ద్రావిడభాష లనఁ బడు దక్షిణహిందూదేశమందు వ్యవహారములో నున్నభాషలలో సమానా ర్థకములైన సరూపపదములు లేదా సాజాత్యపదములను గూర్చి విచారించి నచో నీదేశమును గూర్చి తెలిసీతెలియనిప్రాచీనకాలస్థితిగతులు కొన్ని బయ లుపడు ననుటకు సందేహము లేదు. ఈభాషలన్నియు నింతకుఁబూర్వము చెప్పఁ బడినభాషలలో నుండివచ్చినవా లేక భిన్నకుటుంబమునకుఁ జెందినవాయని నిరూపించుటకు సాహ్యపడని కొన్ని పదము లిందుఁ గనఁబడుచుండుటచే నట్టిప దములను దీసికొని మనమువిచారింపవలసియుండును. కాని సంస్కృతమున

ధాతుపాఠము హస్తులేని దగుటచేతను, వైఁగా „ధాతూనా మనేకార్థత్వాత్" అను కారణముచే నేపదముకైన మనకు వలసినయర్థము సాధింపవలను పడుచుండుటచేతను, ఈపదముల యుత్పత్తిక్రమమునుగూర్చి బాగుగఁ బరిశీలించినఁగాని నిశ్చయింప వీలులేకున్నది. మొత్తముమీఁద దక్షిణదేశభాష లన్నిటిలో సమానార్థకములైన సరూపపదములు తగినహేతువు కనఁబడినఁగాని సంస్కృతజన్యములని చెప్పుటకు సాహసింపఁగూడదు. ఇట్టి సాజాత్యపదములను గొన్నిటిని బరిశీలించినచో, నిచ్చటి ప్రాచీనజనులస్థితిగతులు కొంత తెలియుఁగలదు.

ఆంధ్రమున గుడియనునర్థమున 'కోవెల' యనుపద మొకటి వ్యవహరింపఁబడుచున్నది. దీనిసాధురూపము 'కోయిల' 'కోయిల్' అని తమిళరూపము. కో అనఁగా రాజు కొందఱిజనులకు రాజుపాలకుఁడై నట్లే ప్రపంచమునకంతకును పాలకుఁడైనవాఁడు గనుక దేవుఁడుకూడ 'కో'శబ్దవాచ్యుఁడైనాఁడు. ఆతనికిఁగాను గట్టఁబడిన యిల్లు స్థానము కోయిల్ అయినది. ఇందా దేవుఁడు వారిచేఁ బూజింపఁబడుచుండెను. కోనేఱు దేవునికొఱకైన ఏఱు—తమి. ఎఱు—నీటిప్రవాహము కోనేఱు అయినది. ఈదక్షిణదేశభాషలన్నిటియందును మరుందు—మందు అనుపదములు కలవు. ఇవి 'పరిమళించు', అను నర్థముగల 'మరు'అనుధాతువునుండి యేర్పడిన 'మరం' అనుపదమునుండి వచ్చినవి. మరం అనఁగాఁ జెట్టు. మొక్కలు, చెట్లు, ఆకులు మొదలగునవే మందులుగాఁ బ్రాచీనకాలమున నుపయోగింపఁబడియుండుటచేతనే, మరందు— మందు— ఏర్పడిన దని తెలియుచున్నది. దీనినిబట్టి దక్షిణదేశమునఁ బ్రాచీనకాలమున మూలికావైద్యము ప్రబలియున్న ట్లూహింపఁదగియున్నది. ఇప్పుడు సీసాలలోని నీళ్ళకుఁ గూడ నీ'మందు' అనుపదమునే యుపయోగించుచున్నాము. త. ఇరుంబు—తె. ఇనుము— త. వెళ్ళి— వెండి; చెంబొన్— చెంబు; మొదలగు నీ సజాతీయపదములనుబట్టి ప్రాచీనద్రావిడులకు లోహములజ్ఞానము కలదనియు, నాయాలోహములను వానికిఁ గలవర్ణములను బట్టి, అనఁగా, ఇరుంబు—ఇరుంబొన్—నల్లనిలోహము, ఈ'ఇరు'శబ్దము 'ఇరులు'చీకట్లు అనుపదములోఁ బ్రసిద్ధము—వెళ్ళి—వెళ్—అనఁగాఁ దెల్లనిలోహము, వెండి, చెంబొన్—చెన్ను+పొన్ను=ఎఱ్ఱనిలోహము—రాగి యని యిట్లు వానికిఁ గలవర్ణమునుబట్టి పేర్లిడిరనియు నివి'అయస్' మొదలగుపదముల తద్భవరూపములు కావనియుఁ దెలి

యుచున్నది. ప్రాచీనకాలమున నీదక్షిణదేశస్థులు నావికాయానము చే బహు దూరదేశములకేగి యచ్చటివారితో వర్తకవ్యాపారములు సల్పిరనుటకును సముద్రముదాఁటుటకు సాధనములను నిర్మించుకొనిరనుటకును తమి : ఓడం, తె: ఓడ ; త: పడగ్గై, తె: పడవ; త:కట్టమరాన్ మొదలగు దేశీయపదముల వలన సుస్పష్టంబగుచున్నది. 'ఓడ' యనుపదము 'ఓడు' to run away, to flee, పరు గెత్తుట యనునర్థముగల ధాతువునుండి యేర్పడినది. నీటిపైఁ బరు గెత్తునది గావున 'ఓడ' యైనది. నీళ్లు ఓడుట యనునప్పు డీధాతువునె ప్రయో గించుచున్నాము. వట్ట్రోడినపెల్లో యని నన్నెచోడుఁడు కుమారసంభవమునఁ బ్రయోగించినాఁడు. 'కట్టమరాన్' అనుపదమునుబట్టి చెట్లస్తానులను త్రాళ్లు మొదలగువానితోఁ గట్టి వానిమూలముగ సముద్రమునుదాఁటుచుండువారని తెలియుచున్నది. కన్నడమున 'కప్పల్' అనఁగా పైనికప్పుగలిగిన చిన్నపడవ, పడవ కట్టికప్పున్నట్లు కనఁబడదు. హీబ్రూభాషలో 'తూక్కి-యమ్' తోకై, అనియు, గ్రీకులో 'టెయూస్'అనియు తమిళమునందలి నెమఁలి యనునర్థము గల తోగై- అనుపదము కనఁబడుచున్నది. ఇక్లై-అరెబికభాషలో కారియన్ అనునది- తమిళమందలి 'కరప్పు' (కర్పూర) అనుపదము.తమిళమందలి'అరిశి, పదమె 'ఒరిజా' యనురూపమున గ్రీకుభాషలోఁ గనఁబడుచున్నది. దీనిఁబట్టియె ప్రాచీనకాలయిన నీదక్షిణదేశస్థులా యాదేశముల కాయావస్తువులను దీసికొనిపోయి వ్యాపారముచేసి రని తెలియవచ్చుచున్నది.

ఇఁకఁ బొక్కిలి,చంక మొదలగుపదముల వ్యుత్పత్త్యర్థమును జూచినచో వారికిఁ గొంతశారీరకశాస్త్రజ్ఞానము కలదని తెలియఁగలదు. పొక్కిలి-పొర్ + కుళి-తమి. కుళి-అనఁగా గొయ్యి. పొర్కుళి=ప్రోచునట్టి-శిశువును బోషించి రక్షించునట్టి గొయ్యి-తల్లినుండి గర్భస్థ మగు శిశువున కీనాభినాళముమూల ముననె పోషణ జరుగుచున్న దని యీపదము సూచించుచున్నది. కావుననె యది పొక్కిలియైనది. చంకశబ్దము-కై + కుళి=చేతియొక్క గొయ్యి-arm pit అని మూలార్థము.హృదయమునకు-గుండెకాయ గుండియయను దేశ్యపద ములు కలవు. గుండ్రముగ నొకకాయవలె నుండుటనుబట్టి దీని కీపేరు వచ్చి యుండును. మోఁకాలు, మోఁచెయ్యి-త. ముణంగాలు-ముణంగ్కై-ముడంగాల్-ముడంగై-ముడ్రి- కీలు-'ముడుచు'ధాతుప్ర. చేతిని,కాలిని మధ్యకుము డుచుటకు వీలైనప్రదేశములు మోఁచెయ్యి,మోఁకాలు ఇవియన్వర్థములు. త

ఎళుత్తు=అనఁగా వర్ణము, ఇది ఎఱు=to draw-లాగుట యనఁగా నొకదాని తరువాత నొకటిగా వ్రాయఁబడునది. దీనినిబట్టి వర్ణములు వ్రాత చిరకాలము ననుండి యున్నట్లు గ్రహింపఁదగినది. ఇట్లే,త. వరై-వ్రాయు-వ్రాఁత-వ్రాలు-చేవ్రాలు- దీనినిబట్టి వ్రాఁతకూడ చిరకాలముక్రిందటనె యేర్పడియుండును. తమిళమున ఆవి యనఁగా-ఆత్మ Soul అనియర్థము- ఆవి=అనఁగానూఁపిరియని తెలుఁగునను గలదు-"ఆ సుమహోగ్రముఖ నావి గలుగ" నని భారతము ఊపిరి-ప్రాణమనియర్థము. దీనికి సంబంధించినదె 'ఆవిరి,-దీనిని 'సేరావి, యని తమిళులు చెప్పుటకలదు. ఆవిరివలెనె యదృశ్యమయ్యెడిది లేక కనఁబడనిది, గావున 'ఆవి, అనఁగఁ బ్రాణము అనికొందఱును,ఆత్మయనికొందఱును జెప్పిరి. త.ఉయిర్-ఉసుర్-ఉసురు- అనుపదములకుఁగూడ నిదియె యర్థము. అనఁగాఁ బ్రాణము త.ఉయిర్ ఎళుత్తు=అనఁగా అచ్చులు- లేక ప్రాణులు అని యర్థము. ప్రాచీనకాలమునుండి యిప్పటివఱకును వచ్చుచున్న యొకయాచారమును సూచించెడి 'ఓలె' యనుద్రావిడభాషాపద మొకటి కలదు. ఒలె, ఓలె-యనఁగా తమిళమళయాళకన్నడములయందు- శ్రీతాళము- ఒకవిధమగుతాడిచెట్టనియర్థము. ఆదేశములలో స్త్రీలు ధరించెడు నొకకర్ణాభరణమును గూడ'ఓలె' యనిచెప్పుదురు. ఈయాభరణము శ్రీతాళపత్రముతోఁ జేయఁబడియుండుటచేతనే దీనికి 'ఓలె' యనుపేరు వచ్చినది. మలబారుదేశమున నీతాటియాకుతోఁ జేయఁబడినయీయాభరణమును జెవులకుఁ బెట్టుకొనుట యిప్పటికిని గలదు. ఆంధ్రులు పెట్టుకొనుచెవుల 'కమ్మలు'కూడ నిట్టితాళపత్రము చేతనే యొకకాలమునఁ జేయఁబడుచుండెడివేమో ? 'కమ్మ'యనఁగాఁ దాటియాకని యర్థ ముండియుండును. పూర్వ ముత్తరములు తాటియాకులమీఁద వ్రాసికొనునాచారమునుబట్టియె, కాగితముమీఁద వ్రాసినను జాబులు 'కమ్మలు' అయినవి. శ్రీతాళపత్రములతోఁ జేయబడిన కర్ణాభరణములు ధరించుట చిరకాలమునుండి యాచారమై యుండెననుటకు, కాళిదాసునిచే రచింపఁబడినట్లు చెప్పఁబడుచున్న శ్యామలాదండకమున "తాళీదళాబద్ధ తాటంక భూషావిశేషాన్వితే"యని దేవికి విశేషణముగా వాడిన యీవాక్యమునుండి తెలియవచ్చుచున్నది.

ఇట్లె యాయాభాషలయందలి పదముల మూలార్థములను జరిత్రను బరిశోధించి చూచినచోఁ జిరకాలమునుండి భూభాగమున నివసించిన మానవ కుటుంబములఁగూర్చిన చరిత్రాంశ లనేకములు విచిత్రములై కనుపడుచుండును.

# పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి—శృంగారశాకుంతలము.

శ్రీ మల్ల అచ్యుతరావుగారు ఎం. ఏ. యల్. టి.

(గతసంచిక తరువాయి)

క. ఇట్టుల మఱుమఱి భారత, ఘట్టమునకు నడనయచ్చుఁ గట్టిన కవితా
పట్టాభిషిక్తు నన్నయ, భట్టోపాధ్యాయుఁ దలఁచి పరమప్రీతిన్.

గీ. ఉభయకవిమిత్రు నత్యంతశుభచరిత్రు, భానుసమతేజుఁ గొమ్మయప్రభుతనూజు
సుకృతివిభ్రాజిఁ దిక్కనసోమయాజి, బ్రణుతబహుదేశకవిరాజిఁ బ్రస్తుతించి.

అని కవిత్రయములో మొదటి యిద్దఱనే ప్రశంసించెను. తరువాత వెన్నయామాత్యునకుఁ గృతిపూర్వకముగా నొక్క ప్రబంధము రచింపు మని నప్పుడయినను

సీ. నన్నపార్యుఁడు ప్రబంధప్రౌఢివాసనాసంపత్తి సొంపు పుట్టింప నేర్చు
దిక్కనయజ్వ వాక్శక్తికామోదంబు చెలువు కర్ణముల వాసింపనేర్చు
నాచిరాజునిసోము వాచామహత్త్వంబు సౌరభంబులు వెదచల్లనేర్చు
శ్రీనాథభట్టు భాషానిగుంఫంబుల పరిమళంబులు గూడఁ బఱపనేర్చు

... ... ... ...

ఇట్లు ప్రాచీనాంధ్రకవుల స్తుతించుచు నన్నయ తిక్కన, సోమన్న శ్రీనాథులను మాత్రము ప్రశంసించెను గాని యుభయసందర్భములలోను గవిత్రయములో నొకఁ డగుశంభుదాసుని మాట నెత్తనైనలేదు. ఇది చాలవింతగా నున్నది. ఎఱ్ఱాప్రెగడను గుఱించి, తనకు గౌరవము లేకపోయెనా లేక కృతిపతికి గౌరవము లేకపోయెనా యని విచారింప, జైమిని భారతములోఁ గృత్యాదిని 'మానన్నయభట్టుఁ దిక్కకవి నెఱ్ఱాప్రెగ్గడన్ సోమునిన్' అని యీ కవి రచించెను. కావున నెఱ్ఱాప్రెగ్గడను గుఱించి కవి కెంతమాత్రము, ననాదరము గాని, యగౌరవము గాని లేదని స్పష్టపడుచున్నది. మఱియేకారణమున నెఱ్ఱాప్రెగడ మహాకవిని బ్రశంస చేయుటలేదనిన,—ఎఱ్ఱాప్రెగ్గడ గుడ్లూరు గ్రామస్థుఁడు అద్దంకి రెడ్డిప్రభువులయొద్ద నాస్థానకవి. గుడ్లూరు కందుకూరు తాలూకాలోనిదియు, సోమరాజుపల్లికిఁ జాల దగ్గఱగా నున్నది. చిల్లర వెన్నయామాత్యుఁడు కరణముగా నుండి రెడ్డిప్రభువుల క్రింద నుద్యోగిగా నుండెను. స్వశాఖీయు లగునియోగులై, సమీపగ్రామములలో నున్న గృహస్థ

కుటుంబములకుఁ జేరియుండిన వారగుటచేతను, ఏకసంస్థానాధిపత్యసేవకులగు టచేతను ఎఱ్ఱాప్రెగడకుటుంబమగు చెదలవాడవారికిని వెన్నయకుటుంబమగు చిల్లరవారికి నన్యోన్యద్వేషములుండియుండవచ్చును. అందుచేతఁ గృతిపతి యగు వెన్నయ శ్రీకుటుంబము వాఁ డైనశంభుదాసునిగుఱించి యొక్కమాట యైనను వ్రాయనియ్యలేదు.

శాకుంతలమూలకథ :—భారతమున నాదిపర్వములో శకుంతలాదుష్యంతుల కథ యున్నది. హస్తినాపురముయొక్క రాజగు దుష్యంతుఁడు వేటకొఱకు మాలినీతీరారణ్యమునకుఁ బోయి యందున్న కణ్వమహర్షి యాశ్రమముఁ జొచ్చి యామహర్షియుఁడు ఫలాహారార్థము బైటికి వెళ్లియుండ నాతనికొమార్తె యగుశకుంతల రాజునకర్ఘ్యపాద్యాదు లొసంగి స్వాగత మిచ్చెను. రా జాకన్నియ రూపరేఖాలావణ్యములఁ జూచి మోహపరవశుఁడై యామెతో నీవెట్లూర్ధ్వరేతస్కుఁ డగుకణ్వమహర్షికి జనించితి వని యడుగ నాముగ్ధ తా నొకప్పుడు తండ్రినోట విన్న తనవృత్తాంతము రాజనందనునకుఁ జెప్పెను. ఈకథ సుప్రసిద్ధ మైనదిగాన సంక్షేపముగా నిట వ్రాసితిని.

నృపపుంగవుఁ డాయుదంతమును విని యాకన్య క్షత్రియజాత యని తెలిసి గాంధర్వమునఁ దన్నుఁ బరిగ్రహింప వేఁడికొనెను. అందున కాయువతి తనకుఁ బుట్టినకుమారునకు రాజ్యపట్టాభిషేకముఁ జేయునట్లొడంబడుముకొని యియ్యకొనెను. గాంధర్వవివాహానంతరమున రాజు తిరిగి హస్తినాపురికిఁ బోయెను. తదనంతరము కణ్వమహర్షి యాశ్రమమునకు వచ్చి దివ్యజ్ఞానమున నీవిషయ మంతయు గ్రహించి తనకూఁతునకుఁ జక్రవర్తి భర్త యయ్యె నని సంతసించి భీతిల్లిన శకుంతల నూఱార్చెను. కొన్నినెలలు గడచినపిదప శకుంతల కొక సుపుత్రుఁడు గలిగెను. వానికి సింహదమనుఁ డనుపే రిడిరి. పిల్లవాని యాఱవ సంవత్సరమున మునిపుంగవుఁడు శకుంతలను, కొడుకును దుష్యంతునికడకు బంపుటకుఁ గొందఱి శిష్యుల సహాయముఁ జేర్చి యామెను హస్తినాపురికిఁ బంపిన వారు నిండుకొలువులో నున్నరాజునొద్దకుఁ దీసికొనిపోయిరి. నృపపుంగవుఁడు భార్యను బుత్రునిఁ జూచి తెలిసియుఁ దెలియనట్లుగ మిన్నకుండెను. అంత శకుంతల క్రోధోద్విగ్నమానసయై తనవిధివిపాకమునకు వగచుచు సభాస్థలి విడిచి పోవ నుద్యమించుచుండ నశరీరవాణి—

శ్లో॥ భర స్వపుత్రం దుష్యంత ! మావమంస్థా శ్శకుంతలామ్
త్వం చాస్య ధాతా గర్భస్య సత్య మాహ శకుంతలా.
అని యుద్ఘోషించెను.

ఆమాటలు సభవా రందఱు వినిరి. అప్పుడు రాజు తనప్రజలం దఱకు శకుంతలయొక్క పారిశుద్ధ్యమును దెలుపఁగోరి యిట్లు చేసితి నని చెప్పి పుత్త్రు నినాలింగనముచేసికొని భరతునకు యౌవరాజ్యపట్టాభిషేకముఁ జేసెను.

కాళిదాసుని శకుంతలనాటకము :—భారతమందలి యీ యితివృత్త మును శృంగారరసప్రధాన మగునాటకనిర్మాణముఁ గూర్చుకొని నాయికా నాయకుల శీలములను జేర్చియు, నూతనపాత్త్రములఁ గల్పించియు, కథాంశ ములఁ గొన్నిటి మార్చియు నిట్లనేకవిధములఁ బెంచియుఁ, గుదించియు, వ్యక్తీ కరించియు సర్వాంగసుందరమగునాటకరాజమును, కాళిదాసమహాకవి రచిం చెను. కాళిదాసు—

(1) శృంగారరసవర్ణనము కొఱకు నాయకున కొకనర్మసఖుఁ డగు మాండవ్యుని, నాయికకు నిద్దఱుసకియల, ననసూయాప్రియంవదలను, నూతన ముగఁ గల్పించెను.

(2) శకుంతలయొక్క జన్మవృత్తాంతము నామెచే స్వయముగాఁ జెప్పిం పక, సఖు లగుప్రియంవదానసూయలచేఁ జెప్పించెను. ఏల యనఁగా శృంగార రసావేశదోత్యతక మగునీవృత్తాంతము నూతనానురాగకోరకము లుదయింపఁ జేయుచున్న యీకన్యచేఁ జెప్పించుటకంటె, సఖులచేఁ జెప్పించుట యెంత యేని యుచితము; వీరైననుఁ గొంతవఱకుఁ జెప్పి మిగిలినభాగము సిగ్గుచేఁ జెప్పలేకపోయిరి.

(3) విప్రలంభశృంగారముకొఱకు వనగజప్రవేశ మొకటి గల్పించెను.

(4) శకుంతలకుఁ గొడుకు పుట్టినతర్వాత నాఱవయేఁట దుష్యంతుని కడ కామెను దీసికొనివెళ్లినట్లు మూలకథ యుండఁగా నామెగర్భవతిగా నున్న ప్పుడే రాజునొద్దకు వెళ్ళినట్లు కాళిదాసు మార్చెను. దీనికిఁ గారణములు :—

(i) దీర్ఘమగుకాలాత్యయ మైనయెడల నాయికానాయకులప్రేమ రసము తగ్గు ననియు (ii) నాటకమందలి యితివృత్తమున దీర్ఘకాలవిలంబన మనుచితమనియు నుండఁగా నోపును.

(5) శార్ఙ్గరవుఁడు, శారద్వతుఁడు మొదలగు చిన్నపాత్త్రములనుఁ దత్తదవసరము లగుపనులనిమిత్తము క్రొత్తగఁ గల్పించెను.

(6) మూలకథయందు దూర్వాసమహాముని శాపవిషయము లేనే లేదు. నాయకునిశీలము నిలుపుటకుఁ గా నీశాపకారణమును కాళిదాసు నూతనముగఁ గల్పించెను. ఇంక నెన్నియో చిన్నమార్పులును, కూర్పులును చేయఁబడినవి. కాళిదాసుని యప్రతిమానప్రతిభ, రసపోషణమందే గాక తత్తదనుకూల మగుకథాశరీరనిర్మాణమందును గాన్పించుచున్నది.

పినవీరభద్రకవి భారతమునందలి మూలకథను గాని, కాళిదాసుని నాటకమందలి కథనుగాని యథాతథముగాఁ దీసికొనక రెంటిని మిశ్రమముఁ జేసి తనప్రబంధమున కనుకూలముగా నుండునట్లు వాడికొనెను. కాళిదాసు రచించినది దృశ్యకావ్య మగుప్రబంధము, నాటకముయొక్క ముఖ్యోద్దేశము ప్రదర్శనముచే రసముఁబుట్టించుట. నాటకమందుఁ బ్రదర్శనయోగ్య మగుకథాసంవిధానము స్థలకాలనియమములకు లోఁబడి యున్నది. ప్రబంధమందలికథాసంవిధానమున కట్టి సంకుచితనియమములు లేవు. కాఁబట్టి కాళిదాసు, నాటకనిర్మాణముకొఱకు నూతనపాత్రములు చిన్నవియుఁ బెద్దవియుఁ గల్పించి కథాప్రణాళికను నిరంతజీవితవాహినీప్రతిబింబితముఁ జేసెను. పినవీరభద్రుఁ డాయాపాత్రములను జాలవఱకు విడిచిపెట్టి రసవర్ణనల కనువగు క్రొత్తయవస్థలను గల్పించికొనెను. ఇట్లుభయకవులు లక్ష్యభేదములఁబట్టి కథాసంవిధానము మార్చుకొని తగువ్యక్తిమహిమలు జూపించికొనిరి.

తే. భారతప్రోక్తకథ మూలకారణముగఁ, గాళిదాసునినాటకక్రమము కొంత
తావకోక్తికి నభినవశ్రీ వహింపఁ, గూర్మి కృతిసేయు నాకు శాకుంతలంబు.

అని వెన్నయామాత్యుఁడు చెప్పినరీతి యొప్పిదముగా నిర్వహింపఁబడినది. పినవీరభద్రుని శృంగారశాకుంతలకథకును భారతమందలికథకును, కాళిదాసునినాటకమందలి కథకును గలభేదములు—

(1) భారతమునందు శకుంతల తనజన్మప్రకారమును దానే దుష్యంతునితోఁ జెప్పినట్లును, కాళిదాసునినాటకమందు, చెలికత్తెలు దుష్యంతునితోఁ జెప్పినట్లు నిదివఱకే వ్రాసితిని. ఈవిషయమును పినవీరభద్రకవి పై రెండువిధముల నిరాకరించి తనగ్రంథమున కనుకూలించిన క్రొత్తమార్పుఁ జేసికొనెను. శృంగారరసపూరిత మగునీయుతివృత్తమును స్త్రీలచేఁ బురుషునకుఁ జెప్పించిన విపులవర్ణనలకు నవకాశమీయ దని కణ్వమునిశిష్యులచే రాజునకుఁ జెప్పించెను. ఈమార్పంతయు సమంజసమై కవియొక్క యుచితజ్ఞతకు గొప్పదృష్టాంతముగా నున్నది.

(II) కాళిదాసుని గ్రంథమందు వనగజమాశ్రమమునఁ బ్రవేశించినట్లును, దుష్యంతుఁడు దానిని బంధించుటకు వెళ్లినట్లును జెప్పుటచే శకుంతలయొద్దకుఁ దిరిగి పోవుట కవకాశము లేక విరహవేదనమున రాత్రి గడిపెను. పినవీరభద్రుఁ డావిషయమున వనగజమునకు బదులు దుష్యంతునినగరి వేఁటపులిని గల్పించెను. కారణము మృగ్యము.

(III) కాళిదాసుని నాటకమందు—కణ్వాశ్రమమున దుష్యంతుఁడు గొంతకాల ముంచుటకుఁ దదాశ్రమమున నధ్వరాచరణవిషయమును, రాక్షసాటోపంబును, దుష్యంతునిచేఁ గ్రతురక్షణంబును గల్పింపఁబడి స్వల్పమాత్రముగ సూచింపఁబడినది. రౌద్రవీరరసద్యోతనంబుగ నీఘట్టము పినవీరభద్రుని గ్రంథమున నతివిపులముగ వర్ణింపఁబడుటచే శృంగారరసప్రధాన మగుతత్కావ్యంబున మితిమీఱి కొంతరసాపకర్షణముగా నున్నదని నాతలంపు.

(IV) మూలకథయందు శకుంతల తనపంచవర్షవయస్కుఁ డగుకుమారుని దీసికొని దుష్యంతునియొద్దకు వెళ్లినట్లును, కాళిదాసునినాటకమున గర్భవతిగానుండియే రాజునొద్దకు వెళ్లినట్లు నున్నదని యిదివఱలోఁ జెప్పితిని. ఈ రెంటిలోఁ బినవీరభద్రుఁడు మూలకథలో నున్నదానినే గ్రహించి తనగ్రంథమున వాడుకొనెను. పురాణమునందువలెనే ప్రబంధమునందును గాలదినియమములు లేకపోవుటచేఁ గాలవిలంబనమువలన దోషములేదుగాన యాకవివర్యుఁ డట్లుచేసె నని యూహింపవలసియున్నది.

(V) మూలకథలో లేకపోయినను గాళిదాసునినాటకములో నున్నటులు దూర్వాసునిశాపమును, అంగుళీయకప్రభావమును పినవీరభద్రకవి తన గ్రంథమున నుపయోగించుకొనెను.

(VI) శకుంతలావిస్మృతినిఁ జెందినదుష్యంతునకుఁ బునఃస్మరణము గలుగఁజేసినవి—భారతమందు నాకాశవాణియు, కాళిదాసునందు నంగుళీయకమును; ఈరెంటిని రెండుగ్రంథములనుండియుఁ దీసి పినవీరభద్రుఁడు తన కథయందు జతపఱిచెను.

ఇట్లు మూలకథనుండి కొంతయు, కాళిదాసునికథనుండి కొంతయుఁ దనప్రబంధమున కుపయోజ్యము లగుభాగములను స్వీకరించి కథాసంవిధానమెంతయు నుచితముగను, రసపోషకముగను నిర్వహించె నని నిష్పక్షపాతబుద్ధితోఁ జెప్పవచ్చును.

శృంగారశాకుంతలమందలి కవిత్వలక్షణము :—"కావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకుంతలా" అను నార్యోక్తి ప్రకారము సంస్కృతవాఙ్మయమం దత్యున్నతస్థాన మలంకరించుచున్న యీమహానాటకమును గొంతవఱకైనను బ్రాచీనాంధ్రకవులలోఁ జేరెన్నికఁబొందిన యొకకవివర్యునిచేఁ దెనిఁగింపఁబడుట మనయాంధ్రుల భాగ్యవిశేష మని నొక్కి వక్కాణింపఁదగును. ప్రపంచమందలి యుత్తమకవులలో నొకఁడుగ గణింపఁబడుచున్న మహాకవి కాళిదాసునిగ్రంథములలో నుత్తమం బయిన యీనాటకము కవిత్వమునకేమి నాటకతత్త్వమునకేమి యాదర్శప్రాయమై విరాజిల్లుచున్నదికదా! అందలి కమనీయకవితామాధుర్యమును బ్రాచీనాంధ్రకవులనోటను మృదుమధురధ్వనితో వినిన వీనులకెంతమనోహరముగ నుండునో యూహింపఁదగును.

ప్రాచీనాధునికకవులలోఁ గవితాగుణవిశేషములఁ బ్రాచీనకవు లెక్కుడుమిన్నలు. మృదుమధురపదసంపదలు, రసస్ఫూర్తివర్ణనలు, కావ్యనిర్మాణనైపుణములు, ఇత్యాదికావ్యశోభలక్షణము లన్నిటియందు, ప్రాచీనకవులు మార్గదర్శకులు, ఆదర్శపురుషులు. ఇట్టివారిచే సంస్కృతవాఙ్మయమందలి యుద్గ్రంథము లాంధ్రీకరింపఁబడుట యాంధ్రభాషాయోషిల్లలామ లోకప్రశస్తి నొందినయుత్కృష్టాలంకారములఁ దొడిగినట్లైనది. పురాణేతిహాసములు, సనాతనధర్మసంబంధము లగుటచేఁ బ్రథమస్థాన మలంకరించినవి. ప్రథమాంధ్రకవులు చాలవఱకు భగవద్భక్త్యుపయోగ్యము లగుగ్రంథములను దెనిఁగించిరి. కాని తక్కినవానిని—అనఁగా నాటకములను, కావ్యములను జాలవఱకు ముట్టనేలేదు. పినవీరభద్రకవి పూర్వులవలెఁగాక శృంగారరసప్రధాన మగునీనాటకమును దెనిఁగింపఁ బూనుకొనెను. కాళిదాసునిమృదుమధురవాక్కు నిబ్బంగిఁ జవిఁజూప నిచ్చగించెను.

ఈమహనీయకృతి నిర్వహింపసమర్థుఁడు పినవీరభద్రుఁడే యని వెన్నయామాత్యుఁడు మనకుఁ దెలియఁజెప్పెను. నన్నయభట్టు ప్రబంధవాసనాసంపత్తియుఁ దిక్కయజ్వవాక్ఛక్తికామోదమును, నాచనసోమునివాచామహత్త్వమును, శ్రీనాథునిభాషానిగుంఫనములును, ఈయనయందుఁ గాన్పించుచున్నవనియు, నీయనయొక్క పిత్మైతామహంబుగఁ గవిత్వలక్ష్మి వెలయుచున్నదనియు వెన్నయామాత్యుఁడు నిస్సందేహముగా మనకుఁ జెప్పెను. ఈతనిపలుకు లనర్థము లగుస్తోత్రపాఠములు గాక, యథార్థవాక్యములే యని మనకగుపడుచున్నది.

పినవీరభద్రుని కవిత్వమునందు ముఖ్యముగా సరసవచోరచనల సుధామాధుర్యము గగనధునీతరంగములవలె నిరంతరామోద ముద్భవింపఁజేయుచుండును. ఈతనికవితాధార నిరర్గళమైన ప్రవాహమును బోలియుండును. ఒకచోటఁ జల్లనిపిల్లవాయువులచే సంచలితమై సన్నగ ధ్వనించుచున్న సెలయేటివలెను, వేఱొకచోట నిరంతరధారాసంపాతమున నిర్ఘోషించుచు మహాప్రవాహవేగమునఁ దల్లడిల్లి పెల్లున వెల్లివిరిసి కల్లోలినివలెను, నైసర్గికముగా నప్రయత్నముగా నీతనివాక్సుధాలహరి ప్రవహించుచుండును. పద్యములు కమ్మచ్చునఁ దీసినబంగారుతీఁగలవలె [illegible] ప్రులనీనుచు మహావేగమునఁ బరుగులిడుచుండును.

ఈయనకుఁ దెలుఁగుశబ్దములకంటె సంస్కృతశబ్దము లెక్కుడువాడుక. అందులో దీర్ఘసమాసములు దఱచుగఁ దటస్థించును. శైలివిషయములో శ్రీనాథునిశైలిని లక్ష్యముగా నిడికొనినట్లు గాన్పించుచున్నది. శ్రీనాథునికవిత్వమందున్న గుణావగుణము లీతనికవిత్వమునందు నావిధముగానే గాన్పించుచున్నవి. శ్రీనాథునివలె, పినవీరభద్రుఁడు గొప్పపండితుఁడు. బహుగ్రంథపారంగతుఁడగుటచే నితనికవిత్వమందు పూర్వకవులవర్ణనలు నప్రయత్నముగాఁ బ్రసరించి తమఛాయ నంతర్లీనముఁ జేయుచుండును.

కథాసంధాన మతిరసవంతముగను, మనోహరముగను, చిత్రపటవర్ణనాదికములతో నేత్రపర్వముగ నుండి విసుగుగలుగనీయకుండఁ దత్తత్కాలోచితవర్ణనలతో నలరారుచుండును. నాటకమందు నూతనపాత్రలు ప్రవేశించునపుడు తెరమాటునదలి దడాలున దృగ్గోచర మగునట్లు, ఈకవి, కథయందలి క్రొత్తక్రొత్త యవస్థలను వర్ణించునప్పు డద్భుతరసావేశము గలిగించు నూతనకల్పనలతోఁ బ్రారంభించును. శ్రీనాథునిపద్ధతి యదియే. పెద్దనాదులు నీ కథనచమత్కృతినే యనుసరించిరి. మనుచరిత్ర వసుచరిత్రల కథాక్రమముఁ జూచినయెడల పినవీరభద్రునితీరు వారి కెంతమార్గముఁ జూపినదో తెలియవచ్చును. విస్మయజనకము లగురుచులఁ బుట్టించు రసవికాసకలస్వరములను, మనోజ్ఞభావపుష్టిని నెలకొల్పు మృదుశబ్దపరంపరలను, కథాకథనమం దప్రయత్నముగఁ బరిపోషించి శ్రోతల నానందాబ్ధి నోలలాడునట్లు చేయుచుండును.

మ. చలదిందీవరచారునేత్ర సముదంచచ్చంచరీకాలకం
జలజాతాననఁ గంబుకంఠి బిసహస్తం జక్రవాకస్తనిం

బలినశ్రోణి మరాళరాజగమన న్యాభాజాని గాంచె న్సట
జ్జలకల్లోలపరంపరానినదవాచాశాలిని న్మాలినిన్.

శా. చంచత్పల్లవకోమలాంగుళికర న్సంపూర్ణచంద్రాననన్
న్యంచచ్చందనగంధి గంధగజయానం జక్రనాకస్తనిం
గించిన్మధ్యఁ దటిల్లతావిలసితాంగిం బద్మపత్రాక్షి వీ
క్షించెన్ రాజు శకుంతల న్మనుకరస్త్రీలసత్కుంతలన్.

ఉ. ఎంచి నుతింపశక్యమె యహీశ్వరునంతటివాని కైన ర
త్నాంచిత రోచిరుద్గమనిరస్త సమస్త రవీందుజాలమున్
గాంచనకందరాయవనికాయతవారిధరాంతరాళ
నిర్వాంచితదేవతామిథునవాంఛితమూలము శీతశైలమున్.

ఈకవియందు వర్ణనచమత్కృతి చాలమెక్కువ, భావనావైశద్య మపారము. ఇతఁడసామాన్యపాండిత్యగౌరవమున జంకుగొంకులు లేక ధైర్యముగఁ గవితోద్యోగము నిరాఘాటకముగ నిర్వహింపసమర్థుఁడు. తనశక్తి తనకు బాగుగఁ దెలియును. ఉన్నదానికంటెఁ జెప్పికొనుట గూడ హెచ్చే! ఆత్మవిశ్వాస మత్యధిక మగుటచే శ్రీనాధునివలె రసనిరూపణమందుఁ బ్రమాదములు గలుగుచుండును. శకుంతలయొక్క ప్రేమానురాగము గుఱించి దుష్యంతుఁడు, అనసూయాప్రియంవదలతో భాషించినపరిహాసోక్తు లంతసరసముగ నుండలేదు. కూరగాయలబేరము జరిపిన ట్లుండుటయే గాక వేగిరపడి నిశ్చతాభిప్రాయముఁ జెప్పెను. తొందరపెట్టుట సుకుమారకీర్తి వధూప్రేమ నాకర్షించెడివిధము కాదని నానమ్మకము.

క. మాసొమ్ము మాకునొసఁగిన, మీసొమ్ము న్మీకు మగుడ మీమాసొమ్ము
ల్వాసివడకుండ నూరక, గోసన మేమిటికి మార్చుకొనియెద మెందున్.

గీ. ఇందులోనిష్టమెద్దిమీయిందుముఖికి, నడుగుఁడెడమాటలకుఁబ్రాసనిడివిలేమ
సాయమవసానమైనను సవనరక్ష, కొడవవలెఁగాని యింకను నుండరాము.

మఱియొక దృష్టాంతము :—

శకుంతలాదుష్యంతులకు గాంధర్వవివాహ మైనపిమ్మట కణ్వమహాముని శకుంతలను బృచ్ఛించినవిధము చాల విరసముగా నున్నదని నాతలంపు.

* ఈపద్యము శ్రీనాథుని హరవిలాసములోఁ గూడ నున్నది.

వ. అని యంతాంతరంబుల యోగక్షేమము లడిగి కాలత్రయజ్ఞానశీలుండు సకలంబు నెఱింగియు, నెఱుంగనివాఁడుంబోలె నమ్మెఱుంగుఁబోఁడి తెఱంగు తన్ముఖంబున విన నున్ముఖుండై యిట్లనియె !

ఉ. ఎన్నఁడు లేని క్రొత్తసిరి నీ నెఱునీవదనాంబుజంబునై
చెన్నును నూత్నరేఖవిలసిల్లెడు భావము లెన్నియెన్నియుం
మున్నిటిభంగిఁగాక కడుమోహనలీలలఁ గ్రాలుచున్న వి
యున్ననిజంబు దాఁచుకొనియుండిన నాపయి నానవెట్టెదన్.

గీ. అనిన గజగజవడఁకుచు నశ్రువారి, కన్నుఁగవరాల గద్గదకంఠియగుచుఁ
గొంతయును మాటువెట్టక కోమలాంగి, మునికివిన్నపమొనరించె మునికిమునికి.

ఇది నూతనప్రియాసంభోగము నొందిన కూఁతునితో నిత్యబ్రహ్మచారి యగుతండ్రి భాషించెడువిధమా ? సరసులు నిర్ణయింతురుగాక !

ఈసందర్భమున రసికాగ్రేసరుఁ డగుకాళిదా సనుసరించిన మార్గముఁ జూడుఁడు. వీరిగాంధర్వవివాహముఁగూర్చి యశరీరవాణిచెప్పఁగా నామునిపుంగవుఁ డామెయొద్దకుఁ బోయి కౌఁగిలించుకొని "బిడ్డా ! కన్నులఁ బొగకమ్ముకొనియున్నను భాగ్యవశముచేత సోమయాజిచేతియాహుతి యగ్నిహోత్రములోనె పడినది. మంచిశిష్యున కిచ్చిన విద్యవలె నీవును నాకు సంతోషహేతువైతివి. ఇప్పుడే ఋషులను దోడిచ్చి నిన్ను నీభర్తసన్నిధికిఁ బంపెదను." అని చెప్పెను. భారతమునందుమాత్రము ముని తనదివ్యజ్ఞానముచేతఁ దెలిసికొన్నట్లున్నది.

ఇట్లు కొన్నికొన్నిస్థలములలో రసభావప్రమాదములుఁ గాన్పించుచున్నవి. పాత్రోచితసంభాషణ సంఘటనమున సామాన్యముగ నీకవి యతిసమర్థుఁడని తోఁచెడు. శృంగారరసవర్ణనలు తఱచు రసవంతముగను మృదుమధురవచోయుతముగ నింపారుచున్నవి.

విప్రలంభశృంగార మెప్పుడు నొక్కశేషక్కిగా నుండి చదువుటకు విసువు గలిగించుచుండును. దుష్యంతుఁ డీగ్రంథమందు సుమారు నూఱుమార్లు విరహవేదనలఁ బొందినట్లు వర్ణింపఁబడెను. ప్రతిమాఱును దుమ్మెదలరొదలు, కోయిలలకూఁతలు, చిలుకలపలుకులు నిత్యాది సామాన్యకవిసంప్రదాయసిద్ధములగుసాధనములే యుపయోగింపఁబడినవి కాని క్రొత్తకల్పనలు గాని మదనోద్వేగసూచకము లగుమనోవికారచేష్టితములు గాని వర్ణింపఁబడ

లేదు. పెద్దన, పింగళి సూరన మొదలగుకవు లీవిషయములో నెంతసవిస్తా రముగా వర్ణించిరో చూడవచ్చును. ఈకవికి ప్రపంచానుభవజ్ఞానము తక్కు-వ, గ్రంథపరిజ్ఞానము మెక్కువ యనియుఁ దోఁచుచున్నది. ఈకారణముచేతఁ బూర్వగ్రంథములలో నున్న విరహవర్ణనలను గొంచెముగా మార్చి యీగ్రంథము దిద్దుకొనెను.

ఆంధ్రవాఙ్మయమున శృంగారరస ముత్కటముగా నిరూపించుట శ్రీనాథునితోఁ బ్రారంభించి పినవీరభద్రుఁడు, పెద్దన, సూరన్న మొదలగువారిచే వృద్ధినొంది దక్షిణదేశమున ముద్దుపళని, శేషము వేంకటపతి మున్నగువారి చేతులలో వెఱ్ఱితలలు వేసి పరిహాసాస్పద మయ్యెను.

పినవీరభద్రుని శాకుంతల మందు శృంగారరసవర్ణనలకంటె యుద్ధవర్ణనము చాలరసపూరితముగ నున్నదని చెప్పవచ్చును. ఈయుద్ధవర్ణనము ప్రబంధము దనుచితమయినను స్వాభావికవర్ణనలతో నలరారుచున్నది.

రగడ. లలితహృదయము తిరిగి లంఘించుచరణములుఁ
గులగిరులనైన ఢీకొను మదద్విరదములుఁ
పెరలి యురువడి గాలిఁ దెగఁబాఱు వాజులును
నురురాజసరివచ్చు చుట్టంపురాజులును.
... ... ... ...
నిండి సేనాసమితి నేలయీనినమాడ్కి
నహితులకుగుండెల్లొడంగ నంతంత,
మహితసైన్యము నిల్చె మాలినీనదిపొంత.

తృతీయాశ్వాసములో హయగతిరగడను వర్ణించిన సైన్యసమరోత్సాహంబంతయు నెన్నిసార్లుచదివినను తనివితీరదు. నిజముగనారాజసైన్యము మనకన్నులయెదుట నడచుచున్నట్లుండును. బహుశః కర్ణాటరాజ్యసేనానియగు యన్నగారితో నీకవి సమరసన్నాహమున నున్న చమూనివహంబుల వెంబడి కొంతకాలము దిరిగి ప్రత్యక్షముగఁ జతురంగబలంబుల సమరకౌతూహలకోలాహలంబుల వీక్షించి తన స్వానుభవము యథార్థముగ వర్ణించెనేమో యని సందేహము గలుగుచున్నది.

భాషాంతరీకరణము :—కాళిదాసునినాటక మీప్రబంధముగఁ గొంచెవఱకుఁ దెనిఁగింపఁబడిన దని యింతకు పూర్వము చెప్పితిని. ఆభాషాంతరీకరణము కథాక్రమముగాఁ గాని, అంకక్రమముగాఁ గాని చేయుటలేదు. అచ్చ

టప్పటి నున్న మేలైనశ్లోకముల నాంధ్రీకరించి కథాసందర్భమునఁ దనగ్రంథమున కలంకారముగా నుంచికొనెను. కాళిదాసుని శిరీషకుసుమకవితాలాలిత్యమును వన్నె చెడకుండ, వాసన పోవకుండ, నవరసభరితముగ నుండునట్లు తెనిఁగించి గీర్వాణకవితామాధుర్యమునుఁ దెనుఁగుబాసయందు యథామూలముగఁ జూపింపవచ్చు నని సిద్ధాంతపఱిచెను.

పినవీరభద్రునితర్వాత నీగ్రంథమును గృష్ణకవియు, నాగరాజామాత్యుఁడును, వేఱువేఱుగా వ్రాసియున్నారు. ఆధునికకవులలో వీరేశలింగముగారు మున్నగువారు కాళిదాసునినాటకమును నాటకరూపముగఁ దెనిఁగించిరి. ఎంతమంది కవు లెన్నివిధముల నీనాటకమును దెనిఁగించిన నవి పినవీరభద్రుని కృతిని మించుటలేదు. పినవీరభద్రునియాంధ్రీకరణమసదృశము, అనతిశయ్యము. కాళిదాసునిశాకుంతలమునుండి రెండుశ్లోకములకుఁ బినవీరభద్రుఁడు చేసిన భాషాంతరీకరణముల నిటఁ బొందుపఱిచెను.

చ. విలుగొని వెంటవెంటఁ బృథివీపతి రా శరపాతభీతిఁ దా
మలఁగిమలంగి కన్గొనుచు మార్గము క్రేవకు నడ్డగించుచున్
నిలుచుచుఁ గొంతకొంత గమనించుచు నర్ధము మేసిమేసి ద
ర్భలు వివృతాస్యపార్శ్వముల రాలఁగ మింటికిఁ జౌకళించుచున్.

చ. కొనకొని తావి మూర్కొనని క్రొవ్విరి యెయ్యెడ వజ్రసూచిరా
యని రతనంబు జిహ్వ చవియానని తేనియ గోరుమోపి గి
ల్లని చిగురాకు లాలితవిలాసని కేతన మూలతాంగి దా
ననుభవకర్త యేఘనుఁడొ యావిధియత్నఁ మెఱుంగనయ్యెడున్.



# మహాభారతమీమాంస.

— చర్ల నారాయణశాస్త్రి గారు —

(గతసంచిక తరవాయి).

మహాభారతమున వర్ణితములైన వ్యక్తులన్నియు మహాత్మ్యస్వభావము గలవియై యున్నవి. ఇంతియేకాదు, దానియందు నప్పుడప్పుడు దేవతలయొక్క వర్ణన చేయఁబడియున్నది. వారిచరిత్రములు కూడ మహాత్మ్యములై యున్నవి. ఈసంబంధమున హోమరుయొక్క యిలియడ్డుకంటె మహాభారతమునందలి కుశలతయొకప్పు డధికముగా నున్నది. ఇలియడ్గ్రంథమున వర్ణింపఁబడిన యూనానీదేవతలయొక్క నడవడిక మనుష్యులకంటెఁ గూడ నధమముగా నున్నది. వారొకరిమీఁది కొకరు జగడమునకై లేచుచున్నారు. కొట్టుకొని నఱకుకొనుచున్నారు కూడను. వారియొక్క దేవతాత్వము తెలుచు నష్టప్రాయముగా నగుపడుచున్నది. మహాభారతమందుఁ గల దేవతావర్ణన యిట్టిది కాదు. వారు మనుష్యులయొక్క వ్యవహారములో నిష్వేధముగాఁ జేయిచేసికొనరు ; చేయుఁబూర్వక తప్పనియప్పుడు, దేవతలువలెనే వ్యవహరించుచున్నారు. ఒకయుదాహరణము తీసికొనుఁడు. కర్ణునియొక్క సహజకవచము నర్జుననినిమిత్తము గైకొనునభిప్రాయముతో నింద్రుఁ డొకయుపాయము పన్నెను. బ్రాహ్మణుఁ డేదియడిగినను గర్ణుఁడు లేదనఁడని యతనియొక్క యీవ్రతము నింద్రుఁ డెఱుఁగును. కావున నింద్రుఁడు బ్రాహ్మణరూపధారియై కర్ణుని యొద్దకుఁ జని యతని కవచకుండలముల నడిగెను. దానశూరుఁ డగు కర్ణుఁడు వెంటనే తనకవచకుండలముల నతని కిచ్చివేసెను. కాని యింద్రుఁ డిపుడొక సాధారణమనుష్యుఁడు వలెఁ గవచకుండలములను జంకలో నిఱికించుకొని యలికిడి లేకుండ నచటినుండి దాఁటిపోవలేదు ; అతఁడు దేవతాస్వభావమున కనురూపముగా వ్యవహరించెను. సంతుష్టుఁడై యతఁడు కర్ణునితో ననియెను,—"నీవు నీమనస్సువచ్చిన వరము నడుగుము" కర్ణుఁ డతని నమోఘశక్తి నడిగెను. ఇంద్రుఁడు, కర్ణుఁ డాయమోఘశక్తి నర్జునునిమీఁదఁ గూడఁ బ్రయోగించునని యెఱిఁగియే యుండెను. అయినప్పటికి నతఁడు కర్ణునికాశక్తి నిచ్చివేసెను. సారాంశము, మహాభారతమందు వర్ణితములైన దేవచరిత్రములు దేవతలకే తగినయుదాత్తత గలిగియున్నవి. ఇలియడ్డుకంటె మహాభారతమున నీవిశేషగుణ మున్నది.

ఇంక, కవి తనపాత్త్రములయొక్క స్వభావవర్ణన తనకథారచనయు నెట్లు కావించెనో, యిది విచారింపఁబడును. స్వభావప్రకటనము భిన్నభిన్నవర్ణనలచేతను విశేషించిసంభాషణములచేత నగుచున్నది. ఈవిషయమునఁగూడ మహాభారతముయొక్క యతిశయము సర్వశ్రేష్ఠమైనది. మహాభారతముయొక్క రమణీయత దానిసంభాషణములయందే యున్నది అందీయఁబడినసంభాషణములకు సమానముగాఁ బ్రభావశాలు లగుభాషణములు తదితరస్థలముల యందుఁ జాలఁ దక్కువగా నగుపడుచున్నవి. ఆసంభాషణములగుండా భిన్నభిన్నపాత్త్రములు చక్కఁగా వ్యక్తము లగుచున్నవి. ఇటువంటిసంభాషణములకుఁ గొన్నియుదాహరణము లీయఁబడుచున్నవి:—ఆదిపర్వములో, యౌవనదశయందు దుర్యోధనుఁడు, కర్ణుఁడు, అర్జునుఁడు, మఱి భీమునియొక్కయు సంభాషణములు ; వనపర్వమునకు మొదట శిశుపాలునియు భీష్మునియు సంభాషణములు ; అందే యుధిష్ఠిరుఁడు, భీముఁడు, మఱియు ద్రౌపదియొక్కయు సంభాషణములు ; ద్రోణపర్వమున ధృష్టద్యుమ్నుఁడు ద్రోణుని జంపినప్పుడు, ధృష్టద్యుమ్నసాత్యకులయు, నర్జునయుధిష్ఠిరులయు సంభాషణములు; కౌరవసభయందు శ్రీకృష్ణునియొక్క యేసంభాషణము కలదో, అది యన్నింటను శిరోమణియై యున్నది. కర్ణపర్వమునందుఁ గర్ణునిరథముమీఁదికి దాడి వెడలిన సమయమున నర్జునునితో శ్రీకృష్ణుఁడు చేసినయుత్సాహజనకమైనభాషణముకూడ నిట్లేయున్నది. ఇవ్వి యట్లే యితరభాషణములు భారతకారుని యుత్తమకవిత్వమునకు, సాక్షులగుచున్నవి. భారతమున వర్ణింపఁబడిన వ్యక్తుల భాషణములందు నవి ప్రభావంతములుగను నిర్భయములుగను నుండుట విశేషగుణము. ఉదాహరణార్థము, దుర్యోధనుని కుపదేశించునపుడు విదురుఁ డతని నదలించుటలో ముందువెనుకలు చూడలేదు. విదురుని కది యతనిపెద్దతనమునకుఁ దగియున్నది. కాని శకుంతలకయితే యది కూడ సాధారణము కాదు. అంతస్సరిగానేఁ గూడ నామెకు రాజసభయందు దుష్యంతునితోడి భాషణము నిర్భయమైయున్నది. మఱియు సదాచారసంపన్నయు సుగుణవతియు, నాశ్రమవాసినియు నగునొకకన్యకు శోభాదాయకమైయున్నది. కాళిదాసునిశకుంతలకును వ్యాసునిశకుంతలకును భాషావ్యాకారములయంతర మున్నది. ఎప్పుడు దుష్యంతుఁడు శకుంతలతో నిండోలగమున "నేను నిన్ను మును పెన్నఁడును జూడనేలేను ; అట్టిచో నిన్ను వివాహముచేసికొంటినను టెట్లు?

ములు సరసములును భావజాలములు నగుచున్నవి; అన్ని దృశ్యములవర్ణన, స్త్రీపురుషులస్వరూపము, స్వభావము, దుస్తులవర్ణనయు మనోహరముగా యున్నవి. వ్యాసుడు చేసిన యుద్ధవర్ణన చాల సరసమైయున్నది. ఇంతేకాక యది యద్వితీయమని సాహసించి చెప్పవలయును. ఔను, ఒక్కప్రసంగమే యప్పు డప్పుడు నూటినూటికి వచ్చుటచేతఁ జదువరులమనసునకు విసుగుపుట్టుట నిజము; కాని యీప్రసంగములు సాటి చేర్చిన వని జ్ఞప్తియుంచుకొనవల యును. ఇదిగాక యింకొకవిషయమున్నది. ఎప్పుడు యుద్ధమునకు శస్త్రములు ధనుస్సులు, బాణములే ప్రధానములై యుండెనో, ఎప్పుడు రథికులయందు ద్వంద్వయుద్ధములు తఱచుగా జరుగుచుండెడివో, అప్పటియుద్ధప్రసంగముల కల్పన యిపుడు మనహృదయములయందు నాటవలసియున్నది. ఇప్పటికిఁ గొన్ని వందలయేండ్లనుండి రథయుద్ధములు, గజయుద్ధములు లన్నమాటయే లేదు, కనుక నేఁడు మనము సరిగా, నట్టియుద్ధములయందు నెట్టినిపుణత, శూర త్వముఁ గావలసియుండెనో, కల్పన చేయఁజాలము. వ్యాసకృతమైన యుద్ధవ ర్ణన యొక్కొకపుడు కాల్పనికముగాఁ దెలియుచున్నదని పరిణమించుచున్నది. ఇట్టియుద్ధములయందుఁ గూడ సేమవలకొలఁది వేఱువేఱుప్రసంగము లుప స్థితములైనవో, అన్నిటియొక్క వర్ణనయు సూక్ష్మతతోడను, వక్తృత్వము తోడను జేయఁబడినదెను. మహాభారతమునందలి యుద్ధప్రసంగముల కథలను విన్నచో వీరరసము జనియింపకమానదు. మహాభారతశ్రవణముచేతనే శివా జీవంటివీరుని హృదయమునందు శూరత్వము స్ఫురించె నని ప్రసిద్ధికలదు.

సృష్టిసౌందర్యవర్ణనలు మహాభారతమం దెక్కువలేవు; ఉన్నవి కూడ రామాయణమునందలి వర్ణనలువలె సరసములుగా లేవు. అయినను మహా భారతముయొక్క తరగతి యితరకావ్యములకంటె శ్రేష్ఠమే యగుచున్నది. ఎందుచేతననఁగా, ఇందు చేయఁబడినవర్ణనలు కన్నులారఁజూచినవారివి యగు చున్నవి. వనపర్వమున హిమాలయవర్ణన యున్నది. అది దానిహిమాచ్ఛాది తమైన యున్నతప్రదేశమునఁ బ్రత్యక్షముగా నివసించువానియొక్క ముఖము నుండి యగును. ఎటువంటితపస్సున ద్రౌపదియుఁ బాండవులుఁ జిక్కుపడిరో, అటువంటితపస్సులు హిమాలయమునందే వచ్చుచుండెడివి. ఆతపస్సుల యొక్క వర్ణన నంతసరసముగను వాస్తవికముగను నాప్రదేశమునందు నివ సించిన కవియే చేయఁజాలును. గంధమాదనపర్వతముయొక్క వర్ణన యతిశ

యోక్తులతో నిండిన కారణముచేతఁ గొంతకల్పితముగా నగుచున్నది ; కాని సత్యమైనవిషయ మేమనఁగా గంధమాదనపర్వతముకూడ మేరుపర్వతమువలెఁ గొంతకొంత కాల్పనికమే యగుచున్నది.

మహాభారతమం దున్న స్త్రీపురుషవర్ణన లతిమనోహరములు మర్యాదాయుక్తములును నగుచున్నవి. ఇప్పటిసంస్కృతకవులచేతఁబోలె నీగ్రంథమున స్త్రీలయొక్క సౌందర్యవర్ణన గ్రామ్యరీతిని జేయఁబడలేదు. యుధిష్ఠిరుఁడు ద్రౌపదిని వర్ణించెను. అది చూడఁదగియున్నది "ఏది యంతపొడగరియుఁ బొట్టిదియుఁ గాదో, ఏది లావు సన్నముఁ గూడఁ గాదో, దేనినేత్రములు శరదృతువునందలి కమలపత్రంబులట్లు విశాలములు సుగంధయుక్తములు నగుచున్నవో, ఒకమనుష్యుఁడు తనస్త్రీ నెంతయందముగా నుండవలయునని, కోరునో అంతయందముగా నెవర్తుకయున్నదో; ఎవతుక నేను నిద్రించినవెనుక నిద్రించునో, నేను లేవకమునుపు లేచునో; ఇట్టినా స్త్రీయగు ద్రౌపదిని జూదమున నొడ్డుచున్నాను." అగుఁగాక; బృహన్నలా వేషమున నున్న యర్జునునియొక్క వర్ణన యెంతో రుచ్యముగానున్నది. భీష్ముఁడు ద్రోణుఁడును యుద్ధమునకుఁ బోవునప్పటివర్ణనయు, ఆదిపర్వమునఁ బిలువకుండనే రంగభూమికిఁ జనుచున్న కర్ణుని యొక్క వర్ణనయుఁ జాలఁ జిత్తాకర్షకములుగ నున్నవి. ఈయుదాహరణములచేతఁ బైవిషయము స్పష్టమగుచున్నది. ఇపుడు నాల్గవయంశము, అనఁగా వృత్తములు భాషయు విచారింపఁబడును.

మహాభారతరచన ముఖ్యముగా ననుష్టుప్వృత్తమునఁ జేయఁబడినది ; చాలచోట్ల నుపజాతివృత్తముగూడ నుపయోగింపఁబడెను. గంభీరకథావర్ణనకును మహాకావ్యమునకును నీవృత్తము లన్నివిధముల యోగ్యములైయున్నవి. అర్వాచీనసంస్కృతమహాకావ్యములలో నీవృత్తము లుపయోగింపఁబడినవి. పురాణములయందు, నుపపురాణములయందు నితరసాధారణగ్రంథములందుఁ గూడ ననుష్టుప్ఛందస్సే యుపయుక్తమైనది, కాఁబట్టి యీవృత్తము సాధారణమైనదివలె నున్నది. కాని ప్రాచీనమహాకావ్యములలోని యనుష్టుప్శ్లోకములు చాలఁ బ్రౌఢములుగను గంభీరములుగను నున్నవి. ఈవిషయము, రఘువంశమునందుఁ బ్రథమ, చతుర్థసర్గములలోని శ్లోకములను జూచినయెడలఁ బ్రతివానియొక్కధ్యానమునకు రాఁగలదు. మహాభారతమునందలి భాష గంభీరముఁ బ్రౌఢమునైయున్నది. ఇదేవిధముగా నయ్యది సరలము శుద్ధముఁగూడ

మైయున్నది. సరళతకును బ్రౌఢతకును నొకచో సమావేశము కలిగిన బో ల్తిగాఁ దక్కువగా నగుపించుచున్నది. ఆధునికమహాకావ్యములయొక్క భాష యందుత్వము ప్రౌఢమైయున్నది. కాని యీగుణము సిద్ధించుటకై వానియందు సరళత్వము త్యజింపవలసెను. గ్రంథములయొక్క రచనాప్రౌఢత్వము పాఠకు లకుఁ జక్కఁగా లగ్నమగుచున్నది. సరే, కాని గ్రంథములయర్థముఁ దెలియు టకై వారాగమ సెలవిప్పుడున్నది. ఆలోచనమైనను చేయవలసివచ్చుచు న్నది. ఆధునికపురాణగ్రంథములవిషయ మిట్టిదే. తాఱుమారైనది. వానియందలిభాష సరళము, కాని, యతిమిగుల సపరిశుద్ధము. అందుఁ బ్రౌఢత్వ మన్నమాట కూడ లేదు. మహాభారతమునందు రెండుగుణములు—ప్రౌఢత్వము, సరళ తయు—స్పష్టము లగుచున్నవి. వ్యావహారికభాషకు సమీపమయి, ప్రౌఢభాషా లియు నగునట్టికవి [illegible] భాష నుపయోగించునో, అట్టి యీభాషయే మహాభారతములోనిది. 'ఆర్నాల్డు' గ్రంథ తావిషయమును నిట్లు చెప్పుచున్నాఁడు. “మిల్టనుయొక్క కావ్యభాష గుణగౌరవమున కెట్టుండవలె కావలయునో, య ట్టివంటిదే;” కాని యదిశుద్ధము నమిశ్రితము నగు నాంగ్లేయభాష కాదు. అందు లేటిన్, గ్రీక్కు శబ్దములును, శబ్దరచనలును నిండియున్నవి. సారాం శము, భాషాదృష్టిచేతఁ గూడ మహాభారతముయొక్క తెనుగు మిల్టనుకా వ్యముకంటె గొప్పది. మహాభారతములోని కొన్ని ప్రధానభాగములయందు నుపయోగింపఁబడిన భాషనుండి, సంస్కృతభాష వేఁకొలఁదిజనులయొక్క వ్యావహారికభాషగా నున్నప్పుడు, శుద్ధమై సరళమై సంస్కృతభాషయందుఁ బ్రౌఢమైన శబ్దరచన యుండుట యెంతవఱకు సంభవమో వెల్లడియగుచున్నది.

మహాభారతమునందు వ్యాసకృతమైనయా భాగములయొక్క భాష యిత రభాగములలోని భాషకంటె విశేషముగా సరసము, సరళము, గంభీరమునై యగుపడుచున్నది. సౌతికూడ నేమియుఁ దక్కువప్రతిభ గలకవి కాఁడు. కాని యాలినిసమయమున సాధారణజనులవ్యవహారమునందు సంస్కృతభాష లేకుండెను. కనుక నతనిచేత రచింపఁబడినభాగములోని భాషయందుఁ గొం చెము భేదముండుట స్వాభావికము. ఎవరు వ్యాసకృతమహాభారతములోని భాష యెంతప్రౌఢము, శుద్ధము, సరసము, సరళమునైయున్నదియుఁ దెలియఁ గోరుచున్నారో, వారు భగవద్గీతలోని భాష నొకమాఱు తప్పక చూడ వలయును. ఏప్రకార మీగ్రంథభాగము సమస్తమహాభారతమునుండి మథించి

వెడలింపఁబడిన యమృతమై యున్నదో, అదేప్రకారము దానియొక్క భాష కూడ నమృతతుల్యమైయున్నది. ఏప్రకారము దానియందు మహాభారతమంతటికంటెను శ్రేష్ఠమైన తత్త్వజ్ఞానము నిండియున్నదో, అదేప్రకారము సంస్కృతభాషయందు వ్యాసమహాఋషియొక్క ప్రభుత్వముకూడఁ దుదిదాఁక జేరినదై యాగ్రంథమునఁ గనుపట్టుచున్నది. సంస్కృతభాషయొక్క సమస్తసాహిత్యమందును భాషాదృష్టిచేతఁగూడ భగవద్గీతకు సమానమైనది మఱి యేగ్రంథమును లేదు. సరలత్వము, శబ్దరచనయొక్క శుద్ధత, వాక్యములయొక్క శ్రావ్యము గంభీరము నగుధ్వని, మొదలగునవి భగవద్గీతాభాషకు నద్వితీయము లగుగుణములు. ఈసర్వోత్తమ మైనభగవద్గీతాగ్రంథముయొక్క ప్రతిశబ్దము, ప్రతివాక్యము సువర్ణమయమై యున్నది; ఎందుచేత ననఁగా అవి నిజముగా సువర్ణమువలెనే చిన్నవియు, బరువైనవియుఁ, దేజస్సుగలవియును.

పైని జెప్పఁబడినగుణములచేతఁ గాక మఱి యితరగుణముచేతఁగూడఁ, బ్రపంచమునందలి యాగ్రము లగుమహాకావ్యములయందు మహాభారతముయొక్క శ్రేష్ఠత్వము చక్కఁగా స్థాపింపఁబడుచున్నది. ఏమహాకావ్యమునకుఁ బ్రాణము లేక జీవాత్మ యిదే యని చెప్పఁజాలము. కవి యనేకపద్ధతులచేతఁ దనపాఠకులకు మనోరంజనము చేయును. భిన్నభిన్నప్రసంగములయు నట్లే భిన్నభిన్నదృశ్యములయు వర్ణనచేయును; కాని మనోరంజనము గాక యతనికి మఱియొక హేతువగుపడదు. మహాభారతముయొక్క స్థితి యిటువంటిదికాదు. ఎది సమస్తగ్రంథమందు నొకసామాన్యసూత్రమువలె గ్రథితమై యున్నదో, దేనికారణమున నీకావ్యముయొక్క ప్రాణము లేక జీవాత్మ స్పష్టముగాఁ బరిచితము కాఁగలదో, అట్టిప్రధానహేతు వొకటి దానియందుఁ గలదు. ఏప్రసంగము వర్ణించునపుడును వ్యాసమహర్షియొక్క నేత్రములయెదుట సర్వదా ధర్మమే యొకవ్యాపకహేతువై యుపస్థితమయ్యెను. అతని యుపదేశ మేమనఁగా "మనుష్యుఁడు ధర్మము నాచరింపవలయును; ఈశ్వరసంబంధులు నట్లే మనుష్యసంబంధులు నగునకర్తవ్యములఁ బాలింపవలయును. ఆప్రకారముగా ధర్మాచరణముచేతనే యతనియుద్దిష్టహేతువు లన్నియు సిద్ధించుచున్నవి. ఆధర్మాచరణమునకుఁ బరాఙ్ముఖుఁ డగుటతోడనే యతని యుద్దిష్టహేతువు లన్నియు నష్టము లగుచున్నవి. ఇచ్చవచ్చిన నెంతపెద్ద కష్టమైనఁ దటస్థింపనిమ్ము, ఎంతదుఃఖకరమైనఁ గానిమ్ము, కాని మనుష్యుఁ డెన్నఁడును ధర్మమును

విడువరాదు." ఈయుపదేశము ననుసరించియే సౌతి ప్రతిచోట నుపదేశించియున్నాఁడు. సమస్తమహాభారతమందును ధర్మముయొక్కమహిమ నొక్కి నొక్కి వక్కాణింపఁబడినది. ఏదేని నాఖ్యానమును లేక పర్వమును దీసికొనుఁడు, దాని తాత్పర్య మిదే యగుపడును ఇదే తత్త్వముయొక్క జయధ్వని వినఁబడును. "యతోధర్మ స్తతోజయః" ఈప్రకారము ధర్మమును నీతిని బ్రధాన హేతువులుగా నుంచుటకుఁ బ్రయత్నము ప్రాచ్యపాశ్చాత్యమహాకావ్యములయందు వేనియందును జేయఁబడలేదు. తనకుఁ దానే వ్యాసమహర్షి తనశబ్దములచేతఁగూడఁ దనగ్రంథమున కిదే తాత్పర్యమును జెప్పియున్నాఁడు. మహాభారతమునకుఁ జివర భారతసావిత్రీనామక మైననాలుగుశ్లోకము లున్నవి. వానియందు వ్యాసమహర్షి తనగ్రంథముయొక్క యీరహస్యమును వెల్లడించెను. వానిలో నొకశ్లోకమిది :—

ఊర్ధ్వబాహు ర్విరౌమ్యేష నచ కశ్చి చ్ఛృణోతి మే
ధర్మా దర్థశ్చ కామశ్చ సధర్మః కిం న సేవ్యతే॥

అనఁగా "బుజము పై కెత్తి బిగ్గరగా నఱచి మీకందఱకుఁ జెప్పుచున్నాను. కాని నామాట యెవఁడును వినఁడు. ధర్మమువల్లనే యర్థకామములు సిద్ధించుచున్నవి. అట్టిధర్మమును మీరు మఱి యెందులకు సేవింపరు?" వ్యాసమహర్షియొక్క యీహృదయపూర్వక మైనయుపదేశమే యీగ్రంథమునకు ముఖ్యతాత్పర్యము. కనుకనే సర్వప్రపంచమందు నీగ్రంథముయొక్క శ్రేష్ఠత్వము చక్కఁగా స్థాపింపఁబడుచున్నది.

ఇంతవఱకు "మహాభారతకర్తల విషయమున విచారము గావించుచు మహాభారతగ్రంథ మెంతగొప్పదో, దానిమూలభాగ మేదో, యెంతయో, మూలభాగమునకు వర్తమానస్వరూప మెట్లు ప్రాప్తమయ్యెనో, యీగ్రంథమునకుఁ గర్తలెవరెవరో యివన్నివిషయములు సవిస్తరముగా వివేచింపఁబడినవి.

ఇంక నీవిషయములే సంక్షేపించుటకు సింహావలోకనము చేయఁబడును. మహాభారతమునందు దాదా పొకలక్షశ్లోకము లున్నవి. ఇంతవిరివి యైనరచన యొకకవిదే యగుట సంభవముకాదు. ఇందువలన నీగ్రంథముయొక్కరచన యొకనికంటె నెక్కువకవులు చేసియుందు రని తెలియుచున్నది. ఇరువురు కర్తలు గ్రంథమువల్లనే స్పష్టముగా వెల్లడియగుచున్నారు. వారు వ్యాసుఁడు సౌతియు నైయున్నారు. వ్యాసకృతమూలభారతమును దొలుదొల్త వైశంపా

యనుఁడు ప్రసిద్ధముచేసెను. కనుక ముగ్గురు కర్త లున్నారని యొప్పుకొనుటలో హానియేమియు లేదు. వ్యాసవైశంపాయనుల గ్రంథములయందు న్యూనాధికభావ మెక్కువయుండదు. వైశంపాయనునిగ్రంథమున 24,000 శ్లోకము లుండె నని యగుపడుచున్నది. మూలగ్రంథమునకుఁ బేరు "జయ" మని యుండెను. వైశంపాయనుఁడు దానికి "భారత," మని పేరుపెట్టెను. అతఁడు మొట్టమొదట భారతసంహితను బఠించెను. ఆశ్వలాయనుఁడు సూత్రమున నతనిని భారతాచార్యుఁ డని చెప్పెను. భారతమునందు 8800 కూటశ్లోకము లున్న వని చెప్పుచున్నారు. దీనిఁబట్టి కొందఱకు వ్యాసకృతభారతమునందలి శ్లోకములయొక్క సంఖ్య యిదే యగునని యనుమానము కలుగుచున్నది ; కాని యీయనుమానము సరియైనదికాదు. వ్యాసకృతభారతములోని శ్లోకములసంఖ్య దీనికన్న నెంతేని యెక్కువ కావలసియున్నది. వ్యాసమహాకవి యెడతెగక మూఁడుసంవత్సరములదాఁకఁ బ్రయత్నించి యుద్ధము సమాప్తమైనవెంటనే, తనగ్రంథము రచించెను. వైశంపాయనుఁడు దానిని, గొంచెముగా వృద్ధిచేసెను. 24000 శ్లోకములగ్రంథముగ గావించెను. మఱియును సౌతి దానినే యొకలక్షశ్లోకములగ్రంథముగాఁ జేసివైచెను. ఇంత పెద్దగ్రంథముగా రచించుటకు సౌతినాఁడు సనాతనధర్మముయొక్క దశయే ప్రధానకారణము. సౌతిసమయమున సనాతనధర్మమును బౌద్ధజైనధర్మములు ముట్టడించినవి. సనాతనధర్మమందుఁగూడ నప్పుడు పరస్పరవిరుద్ధము లైనమతమతాంతరములు ప్రచలితములై యుండెను. కనుకనే యాసమయమందుఁ జిన్నచిన్నగాథల నన్నింటి నొకచోఁ జేర్చి యన్నిమతమతాంతరములు విరోధమును దొలఁగించి యేదే నొకగ్రంథమున సనాతనధర్మముయొక్క యుజ్జ్వలస్వరూపమును బ్రకటించుట యావశ్యకమయ్యెను. ఈరాష్ట్రీయకార్యమును సౌతి పూరించెను. ఇట్లు చేయునపుడు ప్రసిద్ధములైన పుక్కిటిపురాణము లన్నిటిని నతఁడొకచోఁ జేర్చెను. మఱియొకరీతిని గూడ మహాభారతమునఁ జాల నుపయోగించువిషయములను సంగ్రహించెను. సారాంశము—ధర్మము, నీతి, తత్త్వజ్ఞానము, మఱి యితిహాసముయొక్క యొకబృహద్గ్రంథమునే యతఁడు చేసెను. అతఁ డేయేభాగములను వృద్ధిచేసెనో సరిగాఁ జెప్పఁజాలము, ఐన, నీవిషయమున స్పష్టముగాఁ గొంత యనుమానము చేయఁగలిగితిమి. సౌతి యేయేవిషయములను విస్తరించెనో యిఁకకూడ విచారింపఁబడెను. అంతమునఁ గవిత్వదృ

ష్టిచేత వ్యాసకృతభారతముయొక్క శ్రేష్ఠత్వ మెంతయధికమైనదియు విచారింపఁబడియెను. ఈభారతమందు సౌతి చాలవఱకు క్రొత్తగాఁ బూర్తిచేసియున్నాఁడు. కాని యిందువలన గ్రంథముయొక్క శ్రేష్ఠతకు న్యూనత్వ మేమియు రాలేదు. దానికి మారుగా, ధర్మము మఱి నీతియొక్క కథల నుచితముగా నీగ్రంథమున సంగ్రహించినకారణముచేత దీనికి రాష్ట్రీయస్వరూపము ప్రాప్తించినది. దీనివలన మూలగ్రంథమునాఁటి పరిస్థితులుగాక సౌతి దీనిని వృద్ధిచేసినప్పటి పరిస్థితులుకూడ దీనియందుఁ బ్రతిబింబితములై యున్నవి యనియుఁ దెలియుచున్నది. ఆసౌతిసమయమేదో, యిది విచారించుట యావశ్యకము. ఈసమయము మనము మునుపు చెప్పినట్లుగా అశోకునిదే సమయమో లేక మఱియొకటియో, యింక నిదే చూడఁదగి యున్నది.



# పత్రికాస్వీకారము.

(1) గోలకొండపత్రిక :—ఈపత్రిక హైదరాబాదునందు సురవరము ప్రతాపరెడ్డిగారిచే ప్రతిబుధవారమును శనివారమును బ్రకటింపఁబడుచున్నది ఇందు రాజకీయవిషయములును జరిత్రాంశములును జర్చింపఁబడును. సంవత్సరమునకుఁ జందా 7-0-0.

(2) సుజాత :—దక్షిణ హైదరాబాదు నగరమున పి. యస్. శర్మగారిచే బ్రకటింపఁబడు సచిత్రమాసపత్రిక- ఇందు భాషావిషయములు, చిన్నికథలు, ఖండకావ్యములుఁ బ్రచురణమొందుచున్నవి హైద్రాబాదు ఆంధ్రపరిశోధకసంఘమువారు తాము నూతనముగఁ గనుఁగొనిన శాసనముల నిందు సవిమర్శముగఁ బ్రకటించుచున్నారు. హైదరాబాదురాజ్యమున నాంధ్ర భాషకుఁ బ్రాచుర్యమొసంగుటకై యీపత్రికారాజమును బ్రకటన మొనర్చుటచే శర్మగారి ప్రయత్న మెంతయుఁ బ్రశంసనీయము. సంవత్సరమునకుఁ జందా రు 3-0-0.

(3) సుభాషి :—రాజమహేంద్రవరమున పందిరి మల్లికార్జునరావుగారిచే బ్రకటింపఁబడుమాసపత్రిక. ఇందు సారస్వతము, కళ, చరిత్ర, రాజనీతి మున్నగువిషయములు చర్చింపఁబడును. ప్రథమసంచికయందుఁ జిలుకూరి వీరభద్రరావుగారి 'అన్నయదేవుఁడు వింతచరిత్రాంశములు' అనువ్యాసమును కొన్ని [illegible] గలవు. పత్రిక యుపక్రమణికఁ జూడ వ్యావహారిక భాషాపోషణకునై కంకణము గట్టుకొనినటులు గానవచ్చుచున్నది. సంవత్సరమునకుఁ జందా 3-0-0

(4) లలిత :—ఈపత్రిక చిరకాలమునకుఁ దిరుగ వెడలినందుకు సంతసిల్లుచున్నారము. ప్రథమసంపుటమున మూఁడవసంచిక మాకార్యస్థానము నలంకరించినది. ఇందుబౌద్ధయుగమునాఁటి'కాళీభూతకథ''భూరిదత్తజాతకము' మొదలగు కథలును, ప్రాచీన యీజప్తుదేశచరిత్రమును, నేఁటిబాలురవిద్యావిధానమును దెలుపు పరీక్షలను వ్యాసమును గలవు. చందా సం॥కు 3-0-0 వలయువారు మేనేజరు లలితాకార్యాలయము విజయనగరము-అని వ్రాయవలయును.

(5) ఆరోగ్యప్రకాశిక :—డాక్టరు యు. రామారావుగారిచే సంపాదితమై మదరాసున వెలువడు సచిత్రమాసపత్రిక. ఆరోగ్యమును గురించి

నేత్రాది విషయములఁ జర్చించుచు నాంగ్లమున వెలువడు Health అను మాసపత్రికయు వీరిచేఁ బ్రచురింపఁబడుచున్నది. 'శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్మ'నుట యెల్లరకును విదితమే. ఇట్టిపత్రికలు మనదేశమున వ్యాపించి యారోగ్యాభివృద్ధిసాధకము లగు నని తలంచుచున్నాము. సంవత్సరమునకు చందా రు 1-8-0.

(6) ఆంధ్రభారతి :—మచిలీపట్టణమున తల్లాప్రగడ రామారావుగారిచేఁ బ్రకటింపఁబడుమాసపత్రిక. రెండవసంపుటమున 5 సంచిక మాకార్యస్థానమును జేరినది. వివిధము లగుకల్పనాకథలును గొన్నిఖండకావ్యములును గలవు. చందా రు 3-0-0.

(7) సఖి :—సాహితీసమితికిం జేరిన శ్రీశివశంకరశాస్త్రి వీరరాఘవస్వామిగార్లచేఁ బ్రచురింపఁబడిన పత్రిక, మూఁడుమాసములకొకసారి వెలువడును. సాహితీసమితిసభ్యుల రచనలు మాత్రమె యిందుఁ బ్రకటింపఁబడును. చందా సం॥కు 3-0-0.

(8) The quarterly journal of the Mythic Society, Bangalore ఈపత్రిక పదునేనిమిదవసంపుటమున మొదటిసంచిక వెలువడినది. ఇందు డాక్టరుశ్యామశాస్త్రిగారిచే రచియింపఁబడిన సూర్యప్రజ్ఞప్తి మొదలగువ్యాసములు గలవు. పత్రిక చందా సం॥ కు రు 5-0-0.

(9) గ్రామోపాధ్యాయుఁడు:—తేజోమూర్తుల శివరామయ్య గారిచే గంజాంజిల్లా, లక్ష్మీనర్సుపేటనుండి ప్రకటింపఁబడు విద్యావిషయక పత్రిక. ఇందు బాలురవిద్యావిధానములు మున్నగునవి చర్చింపఁబడును. సంవత్సరమునకుఁ జందా రు 0-12-0.

(10) గ్రామపునర్నిర్మాణము:—గ్రామములందలిసాంఘిక, ఆర్థికవిద్యావిషయములఁ జర్చించుటకు, గ్రామపునర్నిర్మాణమునకు వలయుసాధనములఁ దెల్పుటకు, నరసింహదేవర సత్యనారాయణగారివలనఁ బ్రకటింపఁబడు మాసపత్రిక. సం॥ కుఁ జందా రు 2-0-0. వలయువారు గ్రామపునర్నిర్మాణపత్రికా కార్యాలయము, రామచంద్రపురం, మని వ్రాయవలయును.

(11) రంగూన్ ఆంధ్రపత్రిక:—బర్మాదేశమునందు శ్రీరాములు అండుకంపెనీవారివలనఁ బ్రతిశనివారమును బ్రచురింపఁబడు పత్రిక. సాంఘికరాజకీయ సాహిత్యవిషయములు చర్చింపఁబడును. పత్రిక 1 కి రు 0-1-0.

(12) రత్నగిరి:—నూతనముగ సేలంజిల్లాయందలి కాళినాయకనపల్లి గ్రామమునందు గన్నెల్లి మునిరెడ్డిగారిచేఁ బ్రకటింపఁబడు మాసపత్రిక. సాహిత్య, మత, రాజకీయ, చారిత్రకాదివిషయములు ప్రకటింపఁబడును. ప్రథమసంపుటమునఁ బ్రథమసంచికయందు త్యాగము, కోకిలా మున్నగుఖండకావ్యములును, చంద్రముఖియను చిన్నికథయు, కె. వి. ఆచార్యగారిచే రచియింపఁబడిన వేదము లనువ్యాసమును గలవు. తమిళదేశమున నిట్టిపత్రికారాజమును నెలకొల్పి యాంధ్రభాషాప్రాచుర్యము కలుగఁజేయుటచే రెడ్డిగారి ప్రయత్న మెంతయుఁ బ్రశంసనీయము. సంవత్సరమునకుఁ జందా 3-0-0.

## గ్రంథవిమర్శనము.

షాజహాన్:—శ్రీ ద్విజేంద్రలాలురాయ విరచిత వంగభాషానాటకమున కాంధ్రానువాదము. అనువాదకుఁడు దినవహి సత్యనారాయణగారు. మొగలుచక్రవర్తి యగుషాజహా నంత్యదశయందు నౌరంగజీబుచే బంధింపఁబడుటయు, దారా, షూజా, మూరాదు లాతనికుట్రలకు లోనయి చంపఁబడుటయు నిందలికథాభాగము. కవి దారాకుమారుఁడగుసులీమాను, భార్యయగునాదిరా, ఔరంగజీబు కుమారుఁడగు మహమ్మదుల పాత్రములను జక్కఁగఁ జిత్రించియున్నారు. షాజహానుయొక్క పుత్రప్రేమ గ్రంథాంతమునఁ జక్కఁగ సూచింపఁబడినది. ఔరంగజేబుయొక్క రాజ్యకాంక్ష, మహమ్మదీయమతమును బురస్కరించుకొని యాతఁడొనర్చిన దుర్నయములును జరిత్రానుసారముగ వర్ణింపఁబడినవి. పాశ్చాత్యవిషాదాంతనాటకముల ననుసరించి నాదిరా, దారాల మృత్యువు రంగస్థలమునఁ జూపఁబడినది. ఉత్తమనారీశీలమును నాదిరాపాత్రమున లిఖించి తారతమ్యమును సూచించుకొఱకుఁ గవి పియారాపాత్రమును సృష్టించినటులు దోఁచెడిని. పాఠకులకుఁ జిరపరిచితము లగుచంద్రగుప్త, సోహరాబ్ రుస్తుము, మున్నగునాటకముల రచియించిన గ్రంథకర్తనుగూర్చి విశేషించి వ్రాయ నవసరములేదు. సత్యనారాయణగారి యనువాదము హృద్యముగ నున్నది. వెల రు 1-0-0 వలయువారు దినవహి సత్యనారాయణగారు, మార్కెట్టువీధి, రాజమహేంద్రవరమని వ్రాయవలయును.

2. ఆత్మానుభవసాధనేశ్వర శతకము:—పెద్దిభొట్ల యజ్ఞేశ్వరశర్మగారిచే రచియింపఁబడినది. భక్తి, జ్ఞాన, వైరాగ్యవిషయము లిందుఁ దెల్పఁబడినవి. వెల 4 అణాలు.

3. ఈశ్వరశతకము అను సాంఘికనీతిపద్యావళి—గ్రంథకర్త గుల్లపల్లి నారాయణమూర్తిగారు, రాయవరము, గోదావరిజిల్లా. కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగముగారి యుపన్యాసములలోని ముఖ్యవిషయము లిందుఁ జేర్పఁబడిన వని గ్రంథకర్తగారే తెల్పియున్నారు. ఈశతకమునందలి భావములలో మతభేదములున్నవి. శైలిసరళముగ నున్నది. వలసినచో గ్రంథకర్తగారికి వ్రాయవలయును.

4. లోకనాయకశతకము—గ్రంథకర్త మునగపాటి చినహనుమయ్యగారు, మునగవాడు, సత్తెనపల్లి. భారతీగ్రంథమండలివారిచేఁ బ్రకటింపఁబడినది. మతవిషయములతో నిమిత్తము లేక నీతిబోధకముగ రచింపఁబడినది. వెల 0–3–0. వలయువారు భారతీగ్రంథమండలి, సత్తెనపల్లి యని వ్రాయవలయును.

5. సమానప్రతిభ—బళ్లారిపురవాస్తవ్యు లగుపండిత కె. సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే రచియింపఁబడిన 'డిటెక్టివు'నవల. ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయమువారిచేఁ బ్రకటింపఁబడినది. వెల రు 1–8–0.

6. విజయ:—సత్తెనపల్లి భారతీగ్రంథమండలివారిచేఁ బ్రకటింపఁబడిన ప్రథమకుసుమము. మహావాది వేంకటరత్నముగారిచే రచియింపఁబడినది. పల్నాటివీరవనిత యగుశ్రీమతి పురుషవేషమును ధరించి దొంగలగుంపును బట్టుటయే యిందలి కథాభాగము. వెల రు 1–0–0, వలయువారు భారతీగ్రంథమండలివారికి వ్రాయవలయును.

7. శివయోగసారము:—కొలని గణపతిదేవకృతము, ఉత్తరభాగమున ద్వితీయతృతీయాశ్వాసములు వేర్వేఱుసంపుటములుగ శైవప్రచారిణీగ్రంథమాలాసంపాదకులగు కొడిమేల రాజలింగారాధ్యులుగారిచేఁ బ్రకటింపఁబడినవి. విద్వాన్ మువిగొండ వీరేశలింగశాస్త్రిగారిచే రచియింపఁబడిన తాత్పర్యమిందుఁ గలదు. వలయువారు మేనేజరు శైవప్రచారిణీకార్యాలయము, వరంగల్, అని వ్రాయవలయును. వెల సంపుటమునకు రు 1–4–0.

[శివయోగసారము గద్యములో "కొలని యాదిమూలనామాత్యపుత్త్ర" యని యున్నది. ఇంటిపేరు కొలనియాదివారని ముద్రితప్రతులలోఁ జేర్చుచున్నారు. కొలనివారే కాని కొలనియాదివారు కా రనియు, "కొలని ఆదిమూల నామాత్యుఁ" డని యుండవలయు ననియుఁ దలఁచుచున్నాము. పూర్వభాగములోఁ గృత్యాది దొరకకపోవుటచే నీసంశయము కల్గుచున్నది. ఇపుడిపు డాపూర్వభాగమును గనఁబడుచున్నది కావునఁ బ్రకాశకులు పరిశీలింతురు గాక]

# నూపురమహిమ (లేక) కన్నకిచరిత్రము.

—♦ తి. సు. మురుగేశపిళ్ళెగారు ♦—

—గోవలుఁ డిలు సేరుట—

ఈచందంబునం గన్నకియు దేవంతియు మందలించుచుండుతఱి గోవలుఁడు దనయిలుసొచ్చి పడుకటింటిలోఁ దూఱి మంచముమీఁదఁ గూర్చుచుండెను. మగనిరాకం గన్నకన్నకి పంటిపక లేచి మగనిచెంగటి కేగి చెంగనాలొనర్చి యోలగించుచుండెను. కన్నకి వగపుచే నొగిలి మొగము సొగసెడలి, మొడలు బడలి చిక్కియుండుటం గని మదిం బొరింబొరిం బొక్కుచుఁ, గన్నకి స్మృక్కువతోఁ దిలకించి నాయనుంగుఁబ్రోయాల! వాడువాఱియుండు నీమోముఁ జూడ నామదిలో గోడు మూడుచున్నది. జూటు స్నేహముగా నాటింపఁగల యాటబొట్టులతోఁ బాటమైన వలపునం గలసిమెలసి నాపెద్దలు గడించిన లచ్చినెల్ల పిచ్చలవిడి నూఁచముట్టుగా వెచ్చించి నిప్పచ్చరమున కచ్చుపడి నొచ్చితిని. అట్టిబెట్టిదపు నాచెయ్వులకొఱ కెదలో మిక్కుటంపు వెక్కసముతో సిగ్గగలమగుచున్నది'—యని గోడాడుచు నుడివెను. గోవలునిపలుకులం జెవిగొన్న కన్నకి మాధవికి నిచ్చుటకుం బైకము లేమిం జేసి తనపెనిమిటి వనటంబడి యిక్కరణి నుక్కఱి వక్కాణించుచున్నాఁ డని యంకించి, యతనిం దిలకించి, దేవా! నాయొద్దఁ గుందనంపుటందియలు రెం డున్నవి; వెలచితిరేని యంకిలింపక పొంకముగా నిచ్చెద. అంకిలినొందక వానిం బుచ్చుకొని యిచ్చపెయిం జరగింపుఁడు' అని పొచ్చెములేక యంకించెను. అట్టి యింపుమాట లాడినకన్నకిం జూచి గోవలుఁడు జూవరము గొని నాయనుఁగుంబ్రోయాల! నే నీకొఁడగూర్చిన కిక్కురింతలకై వెక్కసింపక మక్కువమాటలం జొక్కించెదవు; మంచియీలువు గలయిల్లాలవు గావున యింటియూతని కిం పొడఁగూర్చెదవు. మంచిది; మనము పాండ్యనాటిలోని మధురాపురమునకుఁ దరలి నీయందియల నమ్మి యందునం గిట్టుపైకమును సంచిమొదలుగాఁ గొని బేరమొనర్చి విరివిగ విడిముడి గడింప నుజ్జగొనుచున్నాఁడ. ఈవును నావెంబడి మధురకు రావలయు' నని గోవలుఁడు ముచ్చటించెను. అందుకుం గన్నకి సెయ్యముతో నియ్యకొనెను. మఱునాఁడు వేగుటకుముందె యీవీడు వీడి వెడలవలయు నని యాయిద్దఱును మాటలాడి యుఱిదిపఱుచుకొనిరి.

—— గోవలుఁడును గన్నకియు మధురకు తరలుట; కౌంతి ——

నాఁటిరేయి కడజామునం గోవలుఁడును గన్నకియు నిలువదలి బయ
లుదేఱి, యొరు లెఱుఁగకయుండ నాయూరిం గలమిన్నవన్నె పెరుమాళ్ల కోవె
లలోనికిం బోయి, యాదేవుని వలగొని వచ్చి కొలిచి యచ్చోటువాసి వెడలి
మధురాపురి తెరువుంబట్టి కా[illegible]ట్టుదారిం బడమటికిం బోయి యం
దొక్క విరిదోఁటం జేరిరి. అచ్చట జైనమత తాపసి కౌంతి యనుపేరిముసలి
యాకె తపము సేయుచుండుటం గని యామెయడుగుఁదమ్ములంబడి మ్రొక్కులో
నర్చిరి. ఆమెయుఁ దనయడుగులకు సాగిలంబడి డింగిల్లొనర్చిన వారల దీవిం
చెను. గోవలుఁడును గన్నకియు మధుర కేగుట నెఱింగి, వారలం జేరి, 'మ
ధురానగరమునం గలపెద్దలయొద్ద ధర్మశాస్త్రముల వినుటకును, ధర్మస్వరూ
పిని దర్శించుటకును నేనును మీవెంబడిఁ దరలివచ్చెద' నని చెప్పెను. పిదప,
ఆముువ్వురును మధుర కేగు తెరువుంబట్టి నడచి శ్రీరంగము చెంగటనుండు
తోఁపొకటిం జేరిరి. అట, జైనమతమందు సిద్ధిఁజెందిన చారణు లిరువురు
గంటికగపడుటయు నీమువ్వురు నాయిర్వురి యడుగులకు వ్రాలి చెంగనాలొనర్చ
కయివారము సేసిరి. అప్పు డాచారణులు దశబలుని యడుగుల కెరఁగి పొగడ
నివారలు పుట్టుక యనుప్రాయేటనుండి యీఁది గట్టుసేరఁజాల' రని నుడివిరి.
అప్పలుకుల విని కౌంతి యనునది 'సమంతభద్రునిఁ దప్పఁ దక్కినదయ్యంబుల
నా కేలు దోసిలింప'వని వాకొనెను. అప్పుడు, చారణులు 'కౌంతికిఁ బాశము
విడువడుఁగాక' యని దీవించి కంచుమింజైరి.

సిద్ధజైను లోలసూసగొన్న కొంతసేపటి కామువ్వురు నచ్చోటువాసి
యోడయెక్కి కావేటివలగట్టుసేరి, యందుండినట్టి పెద్దతోఁపొకట విడిసిరి.
అప్పుడు, రోఁతవంగడములోఁ బుట్టినయొక జట్టిపుఁడును వాని పెండ్లాము నా
తోఁపులోఁ గౌంతి మొదలగుముగురు విడిసియుండువిడిదికి నేగి కౌంతిం గని
కన్నకిగోవలుల గుఱించి చూపి 'వీర లెవ్వ' రని యడిగిరి. అందులకుం గౌంతి
'వీరలు నాబిడ్డలు ; మీరు వారలచెంతకుం జేరక తొలఁగిచనుఁ' డని కట్టడ
సేసెను. తోడన, యాదుండగులు గౌంతిం దిలకించి 'వీర లిరువురు నాలుమ
గలుగాఁ గనఁబడుచున్నారే ! ఒక్కకడుపునం బుట్టినవారలైన వీరలాలుమ
గలగుట కావచ్చునని మీజైనమతశాస్త్రములో జెప్పఁబడి యున్నదా ?'
యని కోఁజసము సేసిరి. కౌంతి కడుం గాఁతాళపడి యావెంబరవిత్తు లిరువుర
వఱుళ్ళు లగునట్లు దిట్టెను. అప్పుడ వారలు వఱుళ్లయిరి.

ఈచెయిదములం గన్నకన్నకియు గోవలుఁడు నలమరి, కనికరించి శాప విమోచన మొసఁగునట్లు గౌంతిని బతిమాలిరి. 'వీర లిరువురు నొక్కయేఁడు నక్కలుగా మిట్టాడుచుండి పిదపఁ దొంటినిలువు లొందుదురుగాక' యని కౌంతి దిట్టువిడుగడ యిచ్చెను. పదపడి కౌంతి, గోవలుఁడు, గన్నకియను ముగ్గురును దోవనడచి నాఁటిమునిమాపున నుఱయూరుసేరి విడిసియుండిరి. (ఈ ఉఱయూరు తిరుచినాపల్లికిఁ బడమరఁ గోసుదవ్వున నుండునట్టి నగరి. ఇదియే చోళవంగడపుమన్నీలకు దరతరమైన రాజధాని, ఈఉఱయూరియంద చోళరాజులు బొమిడిక దాల్చి పట్టముగట్టుకొని మఱి యెందేనియు రాచఱికము సేయుచుందురు.)

శ్రీ

## II మధుర కాండము.

గోవలుఁడు మున్నగువార లుఱయూరు నురలి మధురకుఁ దరలుట:—
ఉఱయూరిలోని జైనమఠమందు మఱునాఁ డంతయుఁ గౌంతి కన్నకీగోవలులు విడిసియుండి యలపుదీర్చికొనిరి. అందుకు మఱుసటినాఁటి వేకువ లేచి యామువ్వురు నచ్చటనుండి బయలుదేఱి మధురాపురము దారింబట్టి యేగుచుండు తఱిఁ, దోవలోఁ బెద్దతోఁ పొకటం గలిగిన చవికయందు వేసట దీర్చికొనిరి. అప్పటి కొక్కపాఱుఁడు పాండ్యరాజుం బలువగల నగ్గించి దీవించుచు నాచవికలోనికి వచ్చి విడిసెను.

గోవలుఁ డా బాఁపనిం జూసి 'అయ్యగారు! మీ రేయూరినుండి యేతెంచుచున్నారు?' అని యడిగెను. అందు కా బాఁపనయ్య 'ఏను కుడగు దేశములోని 'మాంగాడు' అనుపేరియూరివాఁడ. పాలకడలి నెడలి, మానిసులందఱు మనుటపొంటె కనికరించి, మిన్నుముట్టునట్టి తోఁపులు దోరముగాఁ గలిగి రంగారుచుండు సిరంగములో, వేయిదలలు గలపాఁపఱేని యొడలిమీఁదఁ బవ్వడియుండు శ్రీరంగనాయకుల సేవించుటకును, దేనెలొలుకు, దోఁపుల ప్రాపునిఱు తిరువేంకట మనుచిలువమలనెత్తమ్మునందు, నీలిచాయ నెగడు మేలిమొగిలుంబోని మేనితో నిలఁబడి, చెందమ్మి యందంబునొందు చేతులయందుఁ జిందము, సుడివాలు నెఱఁగ జగాజిగి నందగిల్లు తమ్మిపిఁదండ జొమ్మునం దైవాఱ, పసొంబట్టుపుట్టము పసొయలుమీఱఁ దాల్చి, కెందమ్మిఱేకులవంటి కన్నులతోఁ జెన్నుమీఱి వెలుఁగుచుండుకఱివేలుపుం గాంచుటకును నాకన్నులు

నాయెడఁద నెనకొలుప నేనిచ్చటి కేతెంచితి. వచ్చుదారిలోఁ బాండ్యదేశములోఁ గల నిగారములను, పాండ్యమన్నీని యాగియు నక్కటికము మున్నగుగోనములం జానుగుచవిగా వినఁబడియుఁ, గన్నులపండువుగాఁ గాంచియు నెనలేని యెలరువుంతో విలసిల్లుచున్నాఁడఁ గాఁబట్టి యతని బొగడితలం బొగడుచు నిచ్చటికి వచ్చితిని' అని బదులుసెప్పెను. పదపడి, గోవలుఁడు పాఱునిం గని మధురకు నేగు దారిని మాకుం జెప్పవలయు నని యడిగెను.

మాంగాటి బాఁపఁడు మధురకుఁ బోవు తెరువులం జెప్పుట :—మాంగాటిపాఱుఁడు గోవలునింజూచి 'అయ్యా! ఎలమావిచిగురుం దెగడునొడలు గల గరితతో నిచ్చటి కీయెండ మిడిమిడి కాలునప్పటి కేతెంచితిరే! అక్కటా! వేఁగంటి యెండ వేఁడిమి నీననఁబోఁడి యేలాగున నోర్వఁగలదు? మధురకుం బోవు తెరువుం జెప్పెద వినుఁడు. ఈకఱకుటెడారిం గడచి చని కొడుంబాళూరు, నెడుంగుళ మను రెండుకోటికలకు నడుమం గలచెఱువుం గడచి చనినయెడ, ముమ్మొనవాలుంబోలె పాయవాఱియుండు మూఁడుత్రోవల మధురకేగునట్టి బాటలుగాఁ జూడఁగలరు. ఆమూఁటిలో వలపటిత్రోవం బట్టిపోతిరేని పలుగపసుటెడారులం గడచి చిఱుమలను వలగొనిచని మధురాపురిం జేరవచ్చును. ఇఁక రెండవదియైన డాపలిత్రోవంబట్టి పోవవలచినయెడలఁ బలుకఱకుటెడారులం గడచి 'తిరుమాల్యున్నము' అనునళగరుమలం జేరవచ్చును. అందుండి గుబ్బలిబొఱియ యొకటివెంటం బోవలెను. అచ్చటఁ బుణ్యాశరవణము, భవకారణి, ఇష్టసిద్ధులను కోనేఱులు మూఁడు గలవు. ఆకొలంకులలోఁ బుణ్యాశరవణమను కోనేటం గ్రుంకినయెడల నింద్రునిచేఁ జేయఁబడిన ఐంద్రవ్యాకరణము నెఱుఁగఁగలరు. భవకారిణి యనుగుంటలో మునిఁగితిరేని యీపుట్టువునకుం గతమైన తొలిబాముచెయ్వుల నెఱుఁగఁగలరు. ఇష్టసిద్ధి యనుకొలనులోఁ గ్రుంకులిడితిరేని మీరు దలఁచినతలఁపుల నన్నియుఁ జేతి కబ్బఁగలరు.

అట్టిగుబ్బలిబొఱియలోఁ దూఱి మధురం జేరవలచితిరేని తిరుమాల్యున్న మనునళగర్మలలోఁ బొడచూపుచుండు వెన్నునియడుగులఁ గన్నులారఁ జూచి, చేతులార దోయిలించి చెంగవాల్వొట్టి యుల్లమున మొల్లమగు వేడ్కతోఁ దలఁచి, నోరార నోడుప్పులచేఁ బొగడి యాకొండను మున్నాఱు వలగొని చుట్టివచ్చి యచ్చటనుండు మిగులలోఁతు గలపిలంబేటియొద్దున నిలిచిన యొక కొండగోఁగుచెట్టు నడుగున 'వరోత్తమ' యనునందగత్తె యొకతె వచ్చి పొడ

కట్టును. అట్టు పోడచూపి మిమ్ములంజూచి 'యీబావున కింపును, మఱుపుట్టునపున కెప్పుడుం జెడలేని యుసులు నేవి ? సెప్పుఁ' డని యడుగును. ఇట్లడిగినందుకు మీరు బదులుసెప్పినయెడల నాబొటియుం దెఱచి మీకు దారిం జూపును. ఆదారిగుండాపోయి, దానంగల యెడదారులన్నిఁ గడచి యేగితిరా, యొక జంటతలుపుఁగడప దోఁచును. అచ్చట నొక్కమచ్చెకంటి వచ్చి 'తుదలేని యునులేది ?' యని మిమ్ముల నడుగును. అందునకు మీరు బదు లీయకుండినను, మిమ్ముల నది యెంతేనియు వేఁకరింపదు. మీరు పోవలసినదారిని మిమ్ములం బోనిచ్చును. బదు లిచ్చువారి కామూఁడుగొలంకులం జూపును. పంచాక్షరి లేక యష్టాక్షరీమహామంత్రములలో నొక్కటిం దలంచుచు నామూటిలో నొకకోనేటం గ్రుంకులిడిన మీకు [illegible] లఱచేతియుసిరికవలెఁ జేకుఱును. అట్లా గుంటలలో మునుఁగుట కిచ్చలేనియెడల నందుండినట్లే గుమసుఁ గైదువజోదుం గుఱిగొని యెదలోఁ దలఁచి కొలిచితిరేని యళగరుకోవెల గరుడకంబము మీకుఁ బొడకట్టును. ఆకంబముదారిం బోయిన మధురాపురముం జేరఁగలరు. ఇప్పుడు నేఁజెప్పినత్రోవలు రెండుగాక మూఁడవత్రోవను గూడ నుడివెద నాలింపుఁడు. ముందు వాకొనంబడిన రెండుతెరువులనడుమ నుండునట్టిత్రోవ యెంతో మేలైనదియగును. ఈత్రోవలోఁ దోఁపులును, గోనలును బెక్కులు గలవు. అట్లయిన నీత్రోవం జనువారల దయ్యమొకటి వచ్చి వెంపరలాడును. ఆదయ్యము మిక్కిలి యణకువగా ముచ్చటించుచుఁ దెరువరులవెడ్డువెట్టి పయనమున కడ్డవాట్లు సేయును. ఏపాటిదొసఁగుం బొసఁగింపదు. ఆదయ్యమునుండి దుసికిల్లి వెడలితిరా వైళమ మధురాపురిం జేరవ వచ్చును. ఇప్పు డేఁ జెప్పిన మూఁడుదెరువులలో మీకు సరిపడినబాటవెంబడి మీ రేగవచ్చును. ఏనును బొదడై విచ్చేసి రెండడుగులతోఁ ద్రిజగములం గొలిచిన వెన్నునిం గొలువనేగెద" ననిచెప్పెను.

పాఱుఁడు పలికినపలుకుల వినినకౌంతి యిట్లని వాకొనెను :—'బాఁపనయ్యా! మాభగవానుఁడు పచరించిన పరమాగమములలో నైంద్రవ్యాకరణముం దిలకించుచున్నాము. కాఁబట్టి పుణ్యశ్రవణమును గుంటలో మునుఁగవలసినయగత్యము లేదు. తొలిబామునం జేసినచెయ్వులనే యీబాములోఁ గుడుచుచున్నా మనుటను మేము సక్కఁగాఁ దెలిసికొనియున్నాము. కనుక భవకారణి యనుగొలనునం గ్రుంకవలవదు. నిక్కువు, చంపమి యనురెండు

నోముల వాలాయము వాసిగ నోచువారలకు వారలతలంపులు విరివిగఁ జేకు రుంగావున మే మిష్టసిద్ధి యనుగుంటం గ్రుంకవలసినది లేదు. మాకు సరిపోయిన తెరువుంబట్టి యేగుదము. మీరు మీతలఁచినట్లు విన్నుమన్నుం గొలిచిన వె న్నుని యజ్జులం గొలిచి పెంపెసవు నందుదురుగాక," పాటుఁడు దనత్రోవ దారిం దరలెను. కౌంతిమొదలగు ముప్పురు నచ్చోటు వదలి నడచిపోయి యొకకొటికలో బడలిక దీర్చుకొనుటకై తడసియుండిరి.

దారిలో దయ్యము దటమటించుట :—మఱునటినాఁటి రేపకడ మస లక లేచి యాముప్పురుం బయనమయి మధురకుం బోవుబాట వెంబడి యేగు చుండుతఱి, గోవలుఁ డెండతాఁకుచే దప్పి గొని దప్పిం దీర్చికొనుటకొఱకు దారిలోని కొలనుగట్టుఁ జేరెను. అప్పటి కాకొనలో నుండుదయ్య మొక్కటి గోవలు నేగింపఁదలఁచి వసంతమాలనడుపున వాలకముగా వచ్చి, గోవలుని యంజలో వ్రాలి తాను మాధవిచేఁ బుత్తెంపఁ బడిన దని నొడివి యేడువం దొరఁకొనెను. అప్పుడు మూంగాటిపాటునిపలుకులు గోవలుని నెనరునకు వచ్చు టయు, నిది యీకోనవేలుపో? నిక్కువాపు మానిసిమడఁతియో? యని యాజాయించి నేటు నెఱుఁగుటకై యంతరిమాత్రము జపించెను. అలమం త్రమున కాదయ్యము బెలుకురి నిక్కువము నుడివి కంచుమించాయెను. గో వలుఁ డాకోనేట డిగ్గి, నీరుద్రాగి దప్పిదీర్చుకొని, తనప్రోయాలికి నొకతమ్మిమూ కులో నీరుగొని పోయెను. కన్నకి యానీరుగ్రాపి తనదప్పిం దగ్గించుకొనెను. పెండియు నాముప్పురు వేటఁగుఱ్ఱపు వేడిమి వెగ్గలముగా నుండు టెఱిఁగి, యిఁకఁ ద్రోవనడచుటకు వలనుపడ దని తలఁచి యాత్రోవచేరువ నుండిన ఆర్య కోష్ఠ మనుకాళిగుడి నెద్దు విడిసి వేసటఁదీర్చుకొనుచుండిరి.

దుర్గిపూజ :—ఎఱుకులు పలువు రాదుర్గగుడి కేగి యందునం బొడ చూపియుండు దుర్గమ్మను బలుతేవల నర్గించి కైవార మొనర్చిరి. అప్పు డెఱు కతయైన వేలుపుసానిమీఁద సుమాళిమువచ్చి యచటనుండిన బోయలం జూచి దుర్గమ్మవాఁకిం జెల్లింపవలసిన కానికలఁ జెల్లింపమిఁ జేసి బోయపల్లెలం గల గుడిసెలన్నియుఁ బొడలెనవి యనియు, వారల దోఁపుడుసొమ్ములు గొఱ వడినవి యనియు, వారలకావరములు గడచవియె ననియు, నిఁకనైన నమ్మవారి నోలగించి యునురు బలి యీవలయు ననియుఁ గట్టడసేసెను. తోడన, తలయొక తెరువై దుర్గమ్మకు నాడంబరముగా నీరాట, గైసేతలు

మొదలైనవానిచే నోలగించి, తాముసేసిన పూజల నియ్యకొనవలయు ననియు వేడించి వేఁడిరి. పదపడి వేఁకిరులందఱు పలుతెగల వాయిదముల వాయించి బవిసీలాడి కైవార మొనర్చిరి.

వెండియు నాఁడెకత్తిమీఁద సుమాళము వచ్చి గోవలునిచెంగట నుండినకన్నకిం జూపి చిత్రముగని 'యీకె మేలిమిమైన యీలువుగల యిల్లాలు ; కొంగు, కుడగు, దమిళము మున్నగు విలాతిమిన్నీలచేతను, గాఁపులచేతను వేల్పు డొందఁబడు' నని మాదలించెను ఈనుడువులఁ జెవిగొన్న కన్నకి పుచ్చడీకముచేఁ దలవాంచి తనపెనిమిటిచాటునం డాగి నిలిచెను. వెండియు, నాసుమాళము 'వేఁటలో నొనర్చిన వేల్పుతనువలన మగ్గి మైకోలు వడసిన'దని ముచ్చటించి యోలమాసగొనియెను. వీనినంతయుఁ జూచి కౌంతి మున్నగు ముగ్గురు నగ్గలముగ నలరుచుండిరి.

చెంచుల యించుచెయ్యాల నంచలనుండి చూచుచుండి యన్నియుఁ గొనసాగిన పిమ్మట, గోవలుఁడు కౌంతిం గని 'నాయనుఁగుటాలు వేఁడివెలుంగు నెండవేఁడిమి పోఁడిమిమీఱు నీపగటిప్రొద్దున నెట్లు సహువఁగలదు ? దానియ కాళ్లంత బొబ్బలు పొటమరించెను; మోము గోముసెడి వసివాడెను; ఒడలు బడలి వాడువాఱెను గనుక పగటిప్రొద్దు నిందుండి కడచి యీరేయ రేవెలుంగు పొడతెంచినయంతనె యిచ్చోటువిడిచి రేయెండలో మనదారిం బట్టి యేగవచ్చు' నని చెప్పెను. అందునకుం గౌంతియు నెయ్యముతో నియ్యకొనెను.

నాఁటిరేయిఁ దొగలవిందు పొడతెంచినపిదప నాముగ్వురు నందుండిన మగ్గిగుడి విడిచి వెడలి మధురాపురికిం బోవుబాటం బట్టి పోవుచుండిరి. త్రోవలోఁ గౌంతి గోవలునికిఁ బలువగల నిగారపు టెడాటముల ముచ్చటించుచుఁ జనుచుండిరి. అట్టియింపుకతలం జానుగుచవిగా వినుచు గోవలుఁడును గన్నకియుఁ దమనడుమటవలని యలపులను నొప్పులనుం జీకిసేయక నడచియేగిరి. మఱునటినాఁటివేకువ నాముగ్వురు బొమ్మంత్రు వెలయు నొకకొట్టికం దగ్గఱిరి. అప్పుడు గోవలుఁడు కౌంతినిం గన్నకిని నొక్కెడ నుండనిచ్చి తాను వేగువెంటలఁ దీర్చివచ్చుటకై చెంతనుండు నొకబావియొద్దికి నేగెను.

మాధవిచేఁ బంపబడిన కౌశికుఁడు గోవలునిం జూచుట:—గోవలుని యెడఁబాటువంతల నోపక వందురి మలఁగుచుండిన మాధవిచేఁ గావిరి పూంపట్టణమునుండి పనుపంబడినకౌశికుఁ డనుపాఱుఁ డొకఁడు మాధవిపుత్తెంచిన కిల్లాకు తోనాబావియొద్దకి నేతెంచెను. అట్లు దోతెంచితాఁ డె

చ్చినకమ్మను నాగోవలునిచేతి కిచ్చెను. గోవలుఁ డాకమ్మం జదివి, ముప్పు
వడసిన తనతలిదండ్రులను, మాధవియుఁ గుములుచుండు గొడవల నెఱిఁగి
తద్దయుఁ గోడాడెను. పుహార్ పట్టణముం బాసి పఱతెంచిన కతంబును, దనకై
వారములను దనతల్లిదండ్రులకుం జెప్పి వారలం జక్కఁగఁ బ్రోదిసేయుచుండు మ
ట్లును నొడివి గోవలుఁ డాబాఁపనయ్యం బంపెను. పిదప గోవలుఁడు దనవేగు
వెంటలం దీర్చికొని కన్నకియుఁ గౌంతియు నుండుతావున కేతెంచెను.

గోవలుఁడుమున్నగు మువ్వురును మధురాపురిం జేరుట :—అందుండి
యామువ్వురును మధురకుం బోవుదారింబట్టి కొంతద వ్వేగుటయు, గాణలు
గొందఱు వారలయొద్దకి వచ్చిచేరిరి. ఆగాణలు గొన్నిపాటలం బాడఁగా నా
పాటలకుం దగినట్లైవడి గోవలుఁడు వీణియ వాయించెను. వెండియుఁ బ్రోవన
డచుచు గోవలుఁ డాగాణలం దిలకించి 'యిందుండి మధురానగర మెంతద
వ్వుండు'నని యడుగఁగా, 'నదిగో! చూడుఁడు పొగ యెగయుచున్నది గదా?
ఆపొగ మధురానగరమునుండియే యెగయుచున్నది,' యని చెప్పి వారలం
బాసి యాగాణలు దమదారిం దరలిరి. నాఁటిపగటిప్రొద్దుం గడపుట కాకౌంతి
మున్నగుముగ్గురు నచ్చటనే యొకతోఁపులో నలపు దీర్చుకొనుచుండి రేయ
గుటయు నచటు వదలి బయలుదేఱి పోయి వైగయేటిం డగ్గఱి దానిం గొలిచి
యోడ యెక్కి యవ్వలిగట్టుం జేరి, యందుండి పోయి మధురానగరముయొక్క
కోటగోడ దండనుండిన నిరాబారుల యిరవైన వెలినగరిలో విడిసియుండిరి.

మఱునాఁటిరేపట లేచి గోవలుఁడు గౌంతిం గొలిచి, తనకు ముందటం
బొడమిన యడజడుల నెల్ల నొడివి యడలుచుండెను. కౌంతివారల నూఱడిం
పుమాటలం బెక్కులు సెప్పి యోదార్చెను. పిదప, కన్నకిం గౌంతికి నప్ప
గించి 'మధురనగరిలోనికిం బోయి బేరమొనర్చుటకుం దగిన చోటు నారసి
వచ్చెద' నని వెలువడి మధురానగరిలోనికిం బోయెను. అప్పుడు, మధురా
పురి నేలుచుండిన నేత పాండ్యవంగడములోఁ బొడచూపిన 'నెడుంజెళియఁ'డను
నిడుదపాండ్యుఁడు. అతని దేవేరి 'కోప్పెరుందేవి' యను రాజమాదేవియగును.

మధురానగరిలోనికి నేగిన గోవలుఁడు, బాఁపనలు, రాచవారలు,
బచ్చులు, వెలమ లనునీవంశసంతతులవా రిరవగు తెరువులంతటికి నేగి, దాని
మేలిమిని, యంగడివీధుల యందములను, దేవళముల యావటమును, రచ్చ
కొట్టముల మెచ్చులును, మన్ననిమగపాడియుఁ గని మదిం గనుకని యెనసి
నివ్వెఱపడెను. (సశేషము).

# వివిధవిషయములు

అమెరికాదేశమునందు మాక్డౌగల్ అను నొకశాస్త్రవేత్త వృక్షము లు తమవృద్ధిక్షయములను దామే తెలుపునటు లొకనూతనయంత్రమును వినిర్మించియున్నాఁడు. దానికి డెండ్రోగ్రాపు (Dendrograph) అని పేరు. ఆసాధనము నెట్టివృక్షమున కైనను దగిల్చినయెడల నది శీతోష్ణస్థితుల భేదమువలన గాని మఱియితరకారణములవలనఁ గాని పొందువృద్ధిక్షయములను సులభముగఁ దెలిసికొొన నగును. చిరకాలము జీవించినవృక్షముల వృద్ధి గాని క్షయముగాని సూక్ష్మతరం బగుటచే నిట్టిసాధన మావశ్యకమని చెప్పనగును. నూతనముగ గనిపెట్టఁబడినయంత్రము శీతోష్ణములవలన నెట్టిమార్పును బొందఁజాలదు. ఏవృక్షమైనను దనసాంవత్సరిక వృద్ధిక్షయములనే గాక ప్రతిదినమును వృద్ధిక్షయములను బొందు ననియు, నట్టివృద్ధి గాని తగ్గుదల గాని దానివ్యాసపరిమాణమునందు $\frac{1}{1250}$ భాగముమొదలు $\frac{1}{200}$ భాగమువఱకుండు ననియు నాతఁడు నిర్ధారణ మొనర్చియున్నాఁడు.

---

ప్రాచీనవస్తుపరిశోధకసంఘమువా (Archaeologists) రిటీవల సింధుదేశమునందలి మోహెనుజోడారోయను నొకపురాతనపట్టణమును బరిశీలింపనం దాభరణములపాత్ర మొకటి కాన్పించినది. దానికిఁ జుట్టిన నేతవస్త్రము చినిఁగిపోయినను, ఆవస్త్రఖండములను జూడ హిందూదేశమున నయిదువేల సంవత్సరములక్రితము ప్రత్తిచే నేయఁబడిన వస్త్రములు వాడఁబడుచుండె నని పరిశోధకసంఘమువారు నిశ్చయించిరి. గ్రీకు, బాబిలోనియనుభాషలయందు అట్టివస్త్రములకు సిందను, సిందు అనిపేరుండుటచే నవి సింధుదేశమునందు నేయఁబడుచుండె ననియు నవిపట్టుసంబంధ మనియుఁ, బ్రత్తితో నేయఁబడినవి కావనియు నిదివఱలో ననేకులు నమ్మియుండిరి. సింధుదేశమునందలి పరిశోధనమువలన మనచేఁబ్రత్తియని పిలువఁబడుదానితో వస్త్రములను గ్రీ.పూ. 3000 సంవత్సరములక్రితము నేయుచుండెడివా రని నిశ్చయమగుచున్నది.

---

సింధునది కుపనది యగుసట్లెజ్ నదీజలములచేఁ దనరాజ్యము నంతవిరివిగ సేద్య మొనర్చుటకై బికనీరుమహారాజుగారు చేసినప్రయత్నము నేఁడు

ఫలించినది. సట్లెజ్ నదినుండి యత్యద్భుతమైన కాలువయొకటి బికనీరురాజ్యములోనికిఁ ద్రవ్వఁబడినది. ఆకాలువకు నిరుప్రక్కల నెనుబదిమైళ్లదూరమువఱకును జల మింకకుండునటులు సున్నపుపని గావింపఁబడినది. ఆకాలువవలన సుమారు, ఆఱులక్షలయకరములు సాగుచేయవచ్చునఁట. అందువలనఁ బదునాలుగువత్సరములలో విశేషమురాఁబడి వచ్చునని నమ్ముచున్నారు.

---

హిమాలయపర్వతపంక్తులలో నెవరెస్టుశిఖర మెత్తయినది. దానిని టిబెటుదేశీయులు లోకమాత యందురు. దానియున్నతశిఖరమును జేరఁబోయి తిరిగి జీవములతో నరుదెంచుట కష్టసాధ్య మని వారు తలఁతురు. ఇటీవల, పాశ్చాత్యులలోఁ గొందఱా శిఖరప్రాంతమునఁ బదునెనిమిదివేలయడుగులవఱకును బోయి పరిశోధించినటులు వినియున్నాము. నూతనముగ కెప్టెనునోలు అనునతఁడు తనకెమెరాను గైకొని హిమాలయపర్వతశిఖరముల పైకిఁ బోవుటయేగాక యచట సినిమాప్రదర్శనమునకుఁ దగిన ఫొటోలను దీసి పాశ్చాత్యదేశములను రంజింపఁజేయుచున్నటులు దెలియుచున్నది. ఆప్రదర్శనమువలన మానవుని యల్పత్వము, బ్రకృతివైభవసౌందర్యములును బ్రేక్షకులదృష్టికిఁ దోఁపఁజేయుటయే తనయాశయ మని నోలుగారు వ్రాసియున్నారు.

---

డార్విను పండితుఁడు తనగ్రంథమును రచియించిననాఁటినుండియు, నితరశాస్త్రపరిశోధకులు మానవుఁడు తనప్రస్తుతమానవస్వరూపమును బొందకపూర్వ మెట్టిస్వరూపమును ధరించెనో యని వివిధపరిశోధనల జరుపుచున్నారు డార్విను చూపినమార్గము ననుసరించి గ్రెగరీ యనుశాస్త్రవేత్త మానవులకును గోఁతులకును బరస్పరసాదృశ్యము గల దనియు, మానవులు కొన్నివేల సంవత్సరముల క్రిందట నుండిన యొకకోఁతిజాతి నుండి పరిణామసూత్రముచేఁ బ్రస్తుతస్థితిని బొందిరని సిద్ధాంతీకరించెను. ఆస్బరను ( Professor Henry Fairfield Osborn of Newyork) అనుపండితుఁడు డార్విను గ్రెగరీల సిద్ధాంతములు సరికావనియు మానవులును గోఁతులునుగూడ 160 లక్షలసంవత్సరముల క్రితము పుట్టియుండి రనియు, నందువలన మర్కటజాతినుండి మానవు లుద్భవించు టసంభవ మనియు, మధ్యాశియాపర్వతభూములయందు మానవజాతి మొదట జనించె ననియు వ్రాసియున్నాఁడు. నూతనముగ నెబ్రాస్కాపర్వతప్రా

తమునఁ గనిపెట్టఁబడిన యెముకపనిము ల్లాకాలమునాఁటి వని యాతనియభిప్రాయము. ఆకాలమునాఁటిమానవులను మొదటిమనుష్యులని (Dawn men) యాతఁడుపేర్కొనియున్నాఁడు. వా రేమృగజాతినుండి యుద్భవించిరో యింకను దెలియ లేదఁట.

---

ఫ్రాన్సుదేశమున నత్యద్భుత మగుకాలువ యొకటి త్రవ్వఁబడినదని తెలియవచ్చుచున్నది. రేవుపట్టణ మగుమార్సైల్సు (Marseilles) నుండి పదునైదుమైళ్లదూరమున నున్నబెరీసరస్సువఱకు నది వ్యాపించియున్నది. మార్గమధ్యమునఁ బర్వతపంక్తు లడ్డువచ్చుటచే డెబ్బదిరెం డడుగులవెడల్పు గలిగి యైదుమైళ్లు పొడుగు గల సొరంగము నొక దానిని పర్వతముల భేదించి త్రవ్వియున్నారు. దానిని ద్రవ్వుటకు సుమారు ఆఱుకోట్లడాలర్లు వ్యయమైనవఁట. ప్రపంచమునఁ జూచియానందింపఁదగిన దృశ్యములలో నిదియొకటి యని చెప్పవచ్చును.

---

జావాద్వీపమునకుఁ దూర్పున నున్నబాలీ యనుద్వీపమున కేగి యచటి నాగరకతావిశేషముల నరసి తాము గనినవింతలను దమ యనుభవములను మాడెరను రివ్యూ యను పత్రికయందుఁ గాళిదాసునాగ్ గారు వ్రాసియున్నారు. మహాభారతమును, బ్రహ్మాండవిష్ణుపురాణములను, మనుభృగుధర్మశాస్త్రములను గామందక రాజనీతిశాస్త్రమును జిలెంటిక్ అను పండితునియొద్దఁ దాము కనుఁగొంటి మనియు, నవి యచటిభాషలో నున్నవనియు వీరు దెలిపియున్నారు. అచటిదేవాలయములు మనదేవాలయములవలె నుండును గాని చెక్కడపుఁబనుల విశేషముగ గలిగియుండునఁట. గరుడుని మూఁపుననుండు విష్ణుమూర్తివిగ్రహముగూడ నొకదేవాలయపుగోడపైఁ జెక్కఁబడినటులు దెలియుచున్నది. అచటినాగరకతయుఁ, బంచాయితీసంఘములును, మతవిషయములును హిందూదేశమునందలి పురాతనవిషయముల స్ఫురింపఁజేయుచున్నవి. మాడరనురివ్యూ పత్రికయందలి దేవాలయమునకుఁ బోవుబాలీదేశపుస్త్రీల చిత్తరువును జూడ వారు స్తనాచ్ఛాదనకునై బిగించిన వస్త్రములు 'అతిపినద్ధేనవల్కలేన న ఖలు ప్రియంవదయా నియంత్రితాస్మి' యను శాకుంతలమునందలి వల్కలవర్ణనమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది.

---

జపానుదేశపు నేతపరిశ్రమలు సుమారు 1867 వసంవత్సరమున మొదలుపెట్టఁబడి యఱువదివత్సరములలో మిక్కిలి యభివృద్ధిఁ జెందినవి. 55 లక్షలరాట్నములును 80,000 మగ్గములును బనిచేయుచున్నవి. ప్రతిసంవత్సరమును 28 లక్షలబేళ్లప్రత్తి యచటి కెగుమతి చేయఁబడుచున్నది. సుమారు 500 మిలియనుయెన్నుల సరకు లచటినుండి యెగుమతి యగుచున్నవి.(ఎన్ను రు 1-4-0 విలువగల జపానునాణెము) అమెరికాఖండమునఁ దక్క మఱియెచటను బ్రత్తి పరిశ్రమ యంతయభివృద్ధిని జెందలేదని ప్రస్తుతజపానుదేశము (Present day Japan)అనుపత్త్రికయందు వ్రాయఁబడియున్నది. జపానుదేశపు ఆర్థికస్థితి కీపరిశ్రమయొక్క వృద్ధిక్షయములే కారణ మనుట యతిశయోక్తి కాదు.

---

కోమడో యనుద్వీపమున నూసరవెల్లి (Lizard) జాతికిఁ జెందినగొప్పజంతువులఁ జూచితి మనియు, నవి పదిమొద లిరువదియడుగులవఱకుఁ బొడుగుగ నుండెననియు, కాబ్ హేముగారు వ్రాయుచున్నారు. అవి యడవిపందులను, పోనిజాతిగుఱ్ఱముల నవలీలగఁ జంపి తమగోళ్లతోఁ జీల్చితినునఁట. తోఁకతోఁ గొట్టినయెడల నెట్టిమనుజుఁడైనను విగతజీవుఁడగుటకు సందియము లేదు. ఆజాతి రమారమి నాలుగువేలసంవత్సరములనుండియు భూమియందుఁ బ్రబలియున్న దని శాస్త్రవేత్తలు దెల్పుచున్నారు.

---

అమెరికాయందు గృహములు నానాఁటికిని నాకసము నంటునటులు నిర్మింపఁబడుచున్నవి. న్యూయార్కుపట్టణమధ్యమున నూటపదియంతస్తులను గలిగి 1208 యడుగుల యెత్తుగలసౌధము నిర్మింపఁబడుచున్న దని తెలియుచున్నది. అది కట్టుటకు ఇంచుమించు 13 మిలియనులడాలర్లు వ్యయ మగునఁట. అందు నలువదివేలమనుష్యులు నివసింపవచ్చును. 60 అంతస్తులు గలిగిన వూలువర్తు సౌధముకంటె నిది మూఁడురెట్లు ఎత్తుగ నుండును. ఇట్టికట్టడములవలన నపాయము లెక్కువగ నుండుననియు, నిప్పుడైనను గనులు దెఱచి అమెరికాదేశస్థులు వాని నిర్మాణమును మానవలయు ననియు, థామసన్ యెడిసనుగారు దెలుపుచున్నారు.

---

కాళీఘట్టమునకు సమీపమున రూపనారాయణనదీతీరమున తామ్రలిప్తి యనునగరముండెడిది. దానిని ప్రస్తుతము టమ్లుక్ అనిపిలుచుచున్నారు. ఆపట్టనప్రాంతమున రోమనుచక్రవర్తియగు జస్టినియనుయొక్క నాణెములు పరిశోధకులకు దొరకినవి. టోలమీ, ఫాహియను, హ్యూనుసాంగు మొదలగు చరిత్రకారు లీపట్టణమును గూర్చి వ్రాసియున్నారు. అది పూర్వకాలమున రేవుపట్టణ మనియు నపుడు సముద్రమచటికి దాదాపుగా నెనిమిదిమైళ్ల దూరముననుండె ననియుఁ దెలియుచున్నది. ఇపుడు సముద్రమచటి కఱువదిమైళ్ళ దూరమున నున్నది. ఆపట్టణమునుండియే సింహళము, చీనా మొదలగు దేశములకు వాణిజ్యము జరుగుచుండెను. నీలిమందు, పట్టువస్త్రములు, తామ్రము విశేషముగ నెగుమతిచేయుచుండెడివారు. తామ్ర మెగుమతి యగుచుండుట చేతనే తామ్రలిప్తి యనుపేరు వచ్చియుండు నని చీనాయాత్రికుఁడు హ్యూనుసాంగు వ్రాసియున్నాఁడు. అచట బౌద్ధవిహారములు పదియుండె ననియు, 200 అడుగుల యెత్తుగల యశోకునిస్తంభ మొకటి యుండెననియు నాతనిగ్రంథమువలననే తెలియుచున్నది.

---

హిందూదేశమున గుహాప్రదేశములు పెక్కులు గలవు. అవి బొంబాయిరాజధానిలో నెక్కువగ నున్నవి. కార్ల, అజంతా గుహలు పాఠకులకుఁ జిరపరిచితములే. పూర్వమీగుహలు బౌద్ధవిహారములుగ నుండుటకై నిర్మింపఁబడుచుండెడివి. ఆగుహలయందు శిల్పము విశేషముగ లేకపోయినను జూపఱకానంద మొసఁగు చిత్రలేఖన ముండును. ఆకాలమునాఁటి రంగు లింకను వన్నెఁబాయక హృద్యముగ నున్నవి. బౌద్ధుల మహాయానపథముఁ దెలుపు చిత్రము లజంతాగుహలయం దెన్నియో గలవు. పుదుకోటసమీపమున సిత్తనవాసల్ గుహయం దతిరమ్యము లగుచిత్రములు గలవు.

---

శాలివాహనశక ప్రారంభమును గూర్చి బెంగుళూరు మిథిక్ జర్నలు (Journal of the mythic Society Vol.XVIII Part I) జూలై సంచికయందుఁ జర్చింబడినది. కన్నింగుహాము డూబ్రెయిలు నుక్షహరాటా చస్తనుఁడు శాలివాహనశకప్రారంభ మొనర్చె ననియు, పండితభగవానులాలును

ఫ్లీటుగారును క్షహరాటా నహపానుని కాలమే శకప్రారంభ మనియు వ్రాసియున్నారు.

పైపత్రికయందు భణ్డార్కరుగారు చస్తనుఁడుగాని నహపానుఁడుగాని శాలివాహనశకమును బ్రారంభింప లేదనియు, నహపానుఁడు క్రీస్తుపూర్వము మొదటి శతాబ్దమువాఁడనియు, గౌతమిపుత్ర శాతకర్ణి శాతవాహనుఁడు క్రీ. శ 124 తరువాతివాఁడు గాఁడనియు, నతనిరాజ్యకాలము క్రీ. శ 70—80 సంవత్సరములలోఁ బ్రారంభించిన దనియు వ్రాసియున్నారు. గౌతమిపుత్ర శాతకర్ణియే శాలివాహనశకప్రారంభ మొనర్చె నని వీరిమతము. పండిత శ్రీకంఠశాస్త్రిగారి హాలునికాలమున శకప్రారంభ మయ్యెనను వాదమును ఖండించుటకై యీ వ్యాసము వ్రాయఁబడినది. గౌతమిపుత్ర శాతకర్ణి క్రీ. శ. 133-154 వఱకు రాజ్యమొనర్చె నని చరిత్రకారులు వ్రాసియున్నారు. చిలుకూరి వీరభద్రరావుగారి యాంధ్రులచరిత్రమును బైమార్గము నేయనుసరించుచున్నది. గౌతమిపుత్రుని కాలము సరియయినచో హాలుఁడే శాలివాహనశకప్రారంభ మొనర్చె నన వలసివచ్చును. గౌతమీపుత్రునికాలమున శకప్రారంభమయ్యెననువాదము విమర్శనీయము ఈసందర్భమున నాంధ్రచారిత్రకపరిశోధకసంఘమువారి పత్రిక రెండవసంపుటము ప్రథమసంచికయందు (Journal of the Andhra Historical Research Society Vol II Part I) వెలువడిన శాలివాహనశకమను వ్యాసమును జూడనగును.

---

అనంగహర్షవిరచిత మగు తాపసవత్సరాజ మనుసంస్కృతనాటకమునకు జర్మనీదేశమునుండి ఫొటోప్రతినిసంపాదించితి మనియు, నది యాఱుశతాబ్దప్రాంతమున రచింపఁబడియుండెననియు మానవల్లి రామకృష్ణకవిగారు ఆంధ్రపరిశోధకమండలివారిచేఁ బ్రకటింపఁబడినపత్రికయందుఁ జెప్పియున్నారు. రత్నావళీస్వప్నవాసవదత్తాదినాటకములవలెనే యిందలియితివృత్తము ఉదయనుఁడను వత్సరాజునుద్దేశించియున్నది. స్వప్నవాసదత్తమందువలెఁ బద్మావతీకరపరిగ్రహణమువర్ణింపఁబడినదఁట. శైలి రమణీయముగ నున్నదనియు, గొన్నివిధముల భాసునిస్వప్నవాసవదత్తనాటకమును మించియున్నదనియు వారు వ్రాసియున్నారు. శైలికై యొకశ్లోకము—

సంక్రుద్ధస్య లలాటలోచనభువా సప్తార్చిషా ధూర్జటే
ర్నిర్దగ్ధే మకరధ్వజే రతిరసా కిం స్యాద్గృహీతవ్రతా
సంవాసాద్వనదేవతామునివధూవేషప్రపంచే గతః
క్షుత్త్యేతా రమతే త్రసిగ్రహపతే కిం వా పత్రశ్రీరియమ్

కవిగారు శీఘ్రముగ సీనాటకమును బ్రచురించి పాఠకలోకమున కానందముం గూర్తురుగాక.

---

సుభాషి ప్రథమసంచికయందు చిలుకూరి వీరభద్రరావుగారు కొన్ని వింతచరిత్రాంశములను దెల్పియున్నారు. శివయోగసారగ్రంథకర్త యగు కొలని ఆదిమూలనామాత్యపుత్రుం డగుగణపతిదేవమహాకవికిం బూర్వుండగు అన్నయదేవభూపాలుండు నియోగిబ్రాహ్మణుం డయ్యును కాకతీయవంశజ యగు రుద్రమదేవి కల్లుం డయ్యెననియు, నన్నయదేవులు పెక్కు రుండినను రుద్రమదేవియల్లుండగు అన్నయదేవుండే శివయోగసారగ్రంథకర్తకుం బూర్వుండనియు వారు చర్చించి నిరూపించియున్నారు. అన్నయదేవునివంశమున కిందులూరివంశ మని ప్రథమమునం బేరున్నను, కొలనివీడు (యేలూరు) ను వశపఱుచుకొనుటచేం గొలనివా రనునింటిపేరు గలిగినదని తెల్పంబడినది.

---

చిరకాలమునుండియు హిందూదేశమున గోవులు భక్తిశ్రద్ధలతోం బూజింపంబడుచు రక్షింపంబడుచుండెడివి. పురాణగాథలయం దెట్లు తెల్పంబడియున్నను, ఆర్యుల జీవితము గోవులపై నితరపశువులపై నాధారపడి యుండుటయే దీనికిం గారణ మని చరిత్రకారులు వ్రాయుచున్నారు. బౌద్ధజైనమతము లభివృద్ధిం జెందినకాలమున, నెట్టియల్పజంతువునైనను హింసింపంగూడ దని నియమ మేర్పడినది. బౌద్ధమతావలంబు లగు అశోకుండు మొదలగు చక్రవర్తులకాలమందు రాజుల పాకశాలలయందు సైతము జంతుహింస నిషేధింపంబడి యుండె నని తెలియుచున్నది. జంతుచికిత్సకునై వైద్యశాల లేర్పఱుపంబడినవి. ఆనాంటియాచారము లింకను బూర్తిగ నడుగంటియుండలేదు. ఆర్యధర్మముల ననుసరించి రాజశాసనము లొనర్పంబడియుండుటచేం బూర్వపు చక్రవర్తులకాలమున గోరక్షణ మొనర్పంబడుచుండెను. ఆఱవశతాబ్దమందుండిన కాశ్మీరనృపతి యగుగోపాదిత్యునికాలమున యజ్ఞములందుం దప్ప జంతుహింస యొనర్పంగూడ దనునియమముండె నని రాజతరంగిణియందుం దెల్పంబడియున్నది. మేఘవాహనునికాలమున ఘృతముతోం జేసినపశురూపమునుమాత్రము యజ్ఞముల నుపయోగించిరంట. వేయేల. తొమ్మిదవశతాబ్దమందలి యవంతివర్మకాలమున వితసీనదీతీరమునం బక్షులను జేపలను సైతము జంపరా దని శాసనముండెను. గూర్జరదేశమునం బండ్రెండవశతాబ్దమందుండిన కుమారపాలునిరాజ్యమున నెట్టిచిన్నజంతువును హింసించినను విశేష మగుదండనము విధింపంబడెను, గోరక్షణమ్మును గుఱించి యింకను బెక్కువిశేషాంశములు బెంగుళూరు మిథిక్ జర్నలు జూలైసంచికయందుం జూడనగును.

---

# ఆంధ్ర భారతి.

(కవిభూషణ కవిరాజ శ్రీవత్సవాయ వేంకటనీలాద్రి రాజుగారు)

సీ. కల్హారములపొందు గాదుపొమ్మని సరోజములం గైకొనుపద్మ మముపొంగు
చిన్నిపూందేనెమచ్చికపాటి సేయక చెఱకుపాల్మెచ్చు వాతెఱబెడంగు
నవశిరీషప్రసూనముల నుల్లసమాడి మిసిమిపొత్తున మన్న మేనిమెలపు
మందారకుసుమదామము నాదరింపక శశిలేఖగొను కచోచ్చయముహొ
యలు
సహజమై యొప్ప నీయుపాసనమువలన, శ్రీమహామండలేశ లక్ష్మీవిభూతి
సురభిళముసేయు బిడ్డలశోభగంటి, యాంధ్రభారతి నీభాగ్యమనవె పొగడ.

శా. అమ్మా భారతి యేమి వత్స దయ యొక్కంతంత నామీందరా
నిమ్మా ప్రస్తుత మేమి వర్ణ్య మఖిలాంధ్రీశానసామ్రాజ్యమా
సమ్మోదం బిదె కొమ్ము సాంధ్యనటనాసంరంభశంభుక్షిప
ద్ధమ్మిల్లోద్యతరంగిణీకలకలోదంచద్వచోగుంభనల్.

ఉ. నీచనుదోయి నవ్యకమనీయవిశేషపయఃప్రపూరముల్
నాచనసోమవాఙ్మయసనాథులు గ్రోలనె యింకె నంచు నా
లోచనయయ్యెడుం జనని లోంగక యించుకతక్కె నేనియుం
వాచవిచూపవమ్మ శిశువత్సల వేమఱదమ్మ భారతీ!

ఉ. కొంకక కింకవీంద్రులను కుంకుమమ్రాంకుల సంస్కృతాంధ్రకూ
లంకషసాహితీలసవలత్కవితాలహరీరయంబునన్
గుంకటివేళ్లతోంబెఱికి కొంచును సత్కవిగోష్ఠ నీకద
ళ్యంకితనారికేళవని కారడివెట్టకు మమ్మ భారతీ.

ఉ. ప్రాలకపత్మ్మముల్ బయలువారక చూపులు కేవలోన్నమ
ద్భ్రూలతమీంద నానుకొని పోవంగ నాత్మశరీరభాన ని
ర్మూలముగాంగ నీలలితరూపకశైక్ష్యము గాంచుమాత్ర నే
పోలిక నాత్మకెక్కుం గవిభూషణశబ్దము కావ్యభారతీ.

శ్రీరస్తు.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు-కాకినాడ.

—:0:—

## (TELUGU ACADEMY.)

**1926—27.**

క్షయనామసంవత్సర కార్యనివేదనము.

ఆంధ్రసారస్వతాభివృద్ధికిని, నిఘంటునిర్మాణమునకును, శాస్త్రచారిత్రకాదివిషయములఁ జర్చించుటకును 1911 సంవత్సరమున మదరాసు నగరములో స్థాపింపఁబడిన యీపరిషత్తునకుఁ బదునై దేండ్లు గడచినవి. పదాఱవసంవత్సరము నడచుచున్నది. ఆంధ్రోద్యమము, ఆంధ్రవిశ్వవిద్యాలయస్థాపనము, ఆంధ్రరాష్ట్రవిభజనము మొదలగు నుద్యమములు ప్రబలుచునుండ నీపరిషత్తు మదరాసునుండి యాంధ్రరాష్ట్రమునకు మార్పఁబడి (కొన్నికారణములచే) కాకినాడలో నెలకొలుపఁబడినది. పదునాల్గు, పదునైదు వార్షికసభ లచ్చటనే జరుపఁబడినవి.

కార్యస్థానమును మార్చుట కైనవ్యయమును దాము భరించుటయె గాక ప్రతివత్సరమును దగినవిరాళముల నొసంగుచుఁ బరిషత్కార్యాలయమునకుఁ గాకినాడలోని తమభవనమును దయచేసిన పరిషత్తునకు స్థాపకులును యావజ్జీవాధ్యక్షులు నగు శ్రీ శ్రీ శ్రీ పిఠాపురము మహారాజావారిని మన మెంతయు నభినందించుచుండవలయును.

ప్రస్తుతపరిస్థితులు :— ప్రప్రథమమునఁ బరిషత్తు స్థాపింపఁ బడినపుడు సాధారణసభ్యులు 219 గురును యావజ్జీవసభ్యులు 26 గురును గలరు. ప్రస్తుతము సాధారణసభ్యులు 95 గురును యావజ్జీవసభ్యులు 21 వురు మాత్రమే యున్నారు.

గడచిన 15 వత్సరములలో నాంధ్రభాషాప్రపంచమునఁ బెక్కుమార్పులు కలిగినవి. ఆధునిక నవలారత్నములు, పాశ్చాత్యవాఙ్మయము నను

సరించినఖండకావ్యములు, చిన్నికథలు, భావగీతములు వేనవేలుగ నుదయిం చుచున్నవి. గ్రామ్యభాషావాద మంతరించిన యనంతరము వ్యావహారిక మను భాషలో నవ్యకవుల యవ్యక్తగానము దిశల మాఱుమ్రోయించుచున్నది. "భారతి" మొదలు నూతనముగఁ బ్రచురింపఁబడుచున్న సాహితీసమితివారి "సఖి" వఱకుఁ బత్రిక లన్నింటిలోఁ [illegible]ము వ్యావహారికభాష ప్రయో గింపఁబడుచున్నది. నియమరహితమై యెటులుతోఁచిన నటులు వ్రాయుటకును వింతగీతము లల్లుటకును సహాయభూతమై యుండు నూతనభాష కరబదరీస దృశమై యుండ ఛందోవ్యాకరణనిబద్ధమై కడుంగడుఁ బ్రయాసచే నలవడు భాషయందు,నట్టిభాషలో రచియింపఁబడిన పూర్వకవివిరచితములగుకావ్యము లందును సాధారణలోకమున కాదరము నశించె ననుట యతిశయోక్తికాదు. ఇపు డాంధ్రభాషార్ణవమున నీసుడిగాలి వీవఁదొడఁగినది. సరస్వతియనుగ్రహ మున మరల నచిరకాలమున సర్వజనానందకరమగుచు మృదుమధురస్వనత, సలక్షణతయుఁగలిగి యాంధ్రభాష వెలయఁగల దనుటకుఁ బెక్కుకారణములు మాకుఁ గనఁబడుచున్నవి.

పరిషత్పత్రిక :—కార్యస్థానము చెన్నపురమున నుండినపుడు పత్రిక రెండుమాసముల కొక్కసారి సరిగఁ బ్రకటింపఁబడకపోవుటచేఁ జందాదారు లకు దానిపై నాదరము తగ్గియుండవచ్చు నని తోఁచుచున్నది. కాకినాడ వ చ్చినపిదప, సకాలమునకు వెలువడునట్లు యత్నము లాచరించుచు రాఁగా ని ప్పటికి యుక్తకాలములో వెలువడుటకుఁ దగినసౌకర్యము కుదిరినది. పరిష త్పత్రికకు గతసంవత్సరమున 63 గురు చందాదారు లుండిరి. ఈసంవత్సరము న వారిసంఖ్య 66. పత్రికను సకాలమునఁ బ్రకటించుచుండుటచేఁ బూర్వము వలె సభ్యులసంఖ్య యభివృద్ధిగాఁగలదని మాయాశయము. ఈసంవత్సరపత్రి కలోఁ బ్రకటింపఁబడినవ్యాసములను దత్కర్తలను దెలుపు 2-వ యనుబంధ మును చిత్తగింపవలయును. పరిషత్పత్రికకు వినిమయముగా వచ్చుపత్రికలపే రులు 3-వ యనుబంధమునఁ జూడనగును. శాస్త్ర చరిత్రాదివిషయములు ప త్రికకు ముఖ్యము లగుటచే "ఆంటిక్వెరీ" మొదలగుపత్రికలు పరిషత్పత్రిక కు వినిమయముగా వచ్చుటకై ప్రయత్నము లొనర్పఁబడుచున్నవి.

నిఘంటుకార్యము :—పరిషత్పక్షమున మొదలిడిన సూర్యరాయాంధ్రనిఘంటునిర్మాణకార్యభారమును శ్రీ శ్రీ శ్రీ పిఠాపురము మహారాజావారు తామే వహించి నిఘంటుకార్యాలయమును చెన్నపురినుండి తమరాజధాని యగుపిఠాపురమునకుఁ దెప్పించి, పనిచేయించుచున్నారు. ఆకార్యమును గుఱించిన వివరము 1-వ యనుబంధమునఁ దెల్పఁబడుచున్నది.

పుస్తకభాండాగారము-గ్రంథప్రకటనము :—పరిషదుద్దేశములలో గ్రంథసంపాదనమును, బ్రకటనమును ముఖ్యములయినవి. పత్రికలోఁ బ్రకటింపఁబడిన పిమ్మట, విప్రనారాయణచరిత్రము, చంపూరామాయణము, శివరాత్రిమాహాత్మ్యము, నారసింహపురాణము మొదలగు పరిషత్పుస్తక భాండాగారమునకు మాత్రమే లభించిన యపూర్వప్రబంధములును, చంద్రభానుచరిత్రము, శివతత్త్వసారము ననునుద్గ్రంథములును, బునర్ముద్రణము గావింపఁబడినవి. మరల నిప్పుడు, [illegible]రచిత మగుకాళిందీకన్యాపరిణయ మనుప్రౌఢప్రబంధము దొరకినది. దీనికి నెందును బ్రత్యంతర మితరత్ర కనఁబడదు. దీనినిగూడఁ బ్రకటించుచున్నారము. సముఖము వేంకటకృష్ణప్పనాయకుని వచనజైమినిభారతమును, భీమకవి కవిజనాశ్రయమును బత్రికలోఁ గాకుండ వేఱుగా ముద్రించి ప్రకటింపఁబడినవి. అందలి జైమినిభారతము ద్వితీయముద్రణములో నున్నది. చిన్నకోట పెద్దనార్యుని కావ్యాలంకారచూడామణిలోని 8-9 ఆశ్వాసములును, అపూర్వముగా దొరకినవి. శ్రీకృష్ణరాయలచరిత్రమును దెల్పు రాయవాచకము, వెనుక పత్రికలో మాత్రమే ప్రకటింపఁబడినది. అద్దానియుంక మరల సవిమర్శముగఁ బుస్తకరూపమున ముద్రింపఁదలఁచితిమి. పరిషత్కార్యాలయమునఁ గల కొన్నియపూర్వగ్రంథములను, షోడశకుమారచరిత్రము మొదలగుపద్యకావ్యములను గ్రమక్రమముగ శక్తికొలఁదిఁ బ్రచురింపఁబూనుచున్నారము. సభ్యులయుత్సాహమునకును, మాయుద్యమమునకును ననుగుణముగ గ్రంథప్రకటన మొనర్పలేమికి ధనసంకోచమే కారణము. ప్రతిసభ్యుఁడును బ్రతిభాషాభిమానియుఁ దమతమమండలములలోని మిత్రమండలిం బురికొల్పి పరిషత్తు నాదరించిరేని మాయుద్యమము శీఘ్రముగ నెఱవేఱఁగలదు.

పరిషత్పుస్తకభాండాగారములో 4472 తాళపత్ర గ్రంథములు 1434 ముద్రిత గ్రంథములును గలవు. ఈసంవత్సరమున 30 తాళపత్ర ప్రతులు, 100 ముద్రిత ప్రతులును బరిషత్పుస్తకభాండాగారమునకుఁ జేర్పఁగలిగితిమి. కువలయాశ్వవిలాసచంపువు,నలచంపువు, త్రివిక్రమభట్టురచితములు ; రుక్మిణీకళ్యాణచంపువు రత్నఖేటదీక్షితునిది—అసంపూర్ణములు దొరకినవి. కళువె నంజరాజకృతశివభక్తవిలాస మనునాంధ్రవచనము పూర్ణముగను, బొబభూపాలుని సంస్కృతవసుచరిత్ర నాటకము కొంతయు దొరకినవి. అముద్రిత గ్రంథములను తాళపత్రములనుండి కాగితములమీఁదికిఁ బ్రతులు వ్రాయించుట కేర్పాటులు చేయుచున్నాము. భాషాదరముగల రసజ్ఞులగు లక్ష్మీపుత్రులు మాజీర్ణోద్ధారమునఁ దోడ్పడి యాంధ్రభాషకు వన్నె దెత్తురని నమ్ముచున్నారము. మదరాసు, తిరువాన్కూరు, మైసూరు, దొరతనమువారు ప్రతివత్సరమును వారి శాసనపరిశోధక గ్రంథముల నుచితముగా నొసంగుచున్నారు. పరిషత్పుస్తకభాండాగారములోని గ్రంథములను బత్రికలను బలువురువిద్యార్థులు విద్యాధికులును వచ్చి చదివి యానందించుచున్నారు. పరిశోధించుచున్నారు. ప్రతులు వ్రాసికొనుచున్నారు.పరిషత్ప్రకటిత గ్రంథములపట్టిక ముఖపత్రము 4వ పుటలోఁ గలదు.

ఆయవ్యయవిచారము :—క్షయసంవత్సరముయొక్క ఆయవ్యయపట్టిక యిందుఁ జేర్పఁబడినది. తైలరహిత మగుదీపకాంతివలెఁ బరిషదాదాయము నానాఁటికిఁ దగ్గుచున్నది. విరాళములపై నాధారపడి పరిషత్కార్యమును గొనసాఁగించుట దుర్ఘటము. ఆంధ్రవిశ్వవిద్యాలయమునకై విశ్వప్రయత్నముచేసి మనవ్యక్తిత్వమును జాతీయతను నిలుపుకొనిన మనము పరిషదుద్ధరణమునకుఁ జేయూఁత యొసంగవలసియున్నది. నూతనసభ్యులను జేర్చుచుఁ బరిషదభివృద్ధికై పాటుపడవలసియున్నది. ముఖ్యముగఁ గృష్ణదేవరాయలనాఁటియాంధ్రవాఙ్మయమును బెద్దనార్యాదిసత్కవులను స్మరించుచుఁ దమతమ జిల్లాలయందు సారస్వతాభివృద్ధి నొనర్చుచుఁ బరిషత్తును గౌరవింపవలయును.

---

# 1-వ యనుబంధము

## శ్రీసూర్యరాయాంధ్రనిఘంటునిర్మాణము.

### క్షయసంవత్సర (1926–1927) కార్యనివేదిక.

నిఘంటునిర్మాణమున నిప్పటివఱకు నిద్దఱొక్కటిగాఁ జేరి పదవిమర్శనము చేయుచున్నారు. ప్రకృతము జరుగుచున్న తత్సమేతరపదవిమర్శనమునకుఁ గాల మెక్కువపట్టుచుండుటచే మఱిద్దఱు నియమితులైరి. వారును గొంతభాగము విమర్శించుట కేర్పాటు కావింపఁబడినది. ఈసంవత్సరమంతయు రెండుసంఘములవారు పనిచేయుటచే గతసంవత్సరముకంటె రెట్టింపు పని జరిగినదని చెప్పవచ్చును. ఈసంవత్సరము "ఎడ" అనుపదము మొదలు "కురులు" అనుపదమువఱకు విమర్శనము జరిగినది. క్రోధనసంవత్సరమున నిర్ణయించిన ప్రకారము మచ్చుపదములపుస్తకములు 54 పౌరటలు గలవి ముద్రింపఁబడి మున్నూఱు ప్రతులు భాషావేత్తల యభిప్రాయార్థమై పంపఁబడినవి. కొందఱయభిప్రాయములు వచ్చినవి. మఱికొందఱయభిప్రాయములు రానున్నవి. వాని ననుసరించి యావశ్యకమని తోఁచిన మార్పులు గావింపవలసియున్నది. అజాదిపదభాగము ('అ' మొదలు 'క' వఱకుఁ గలభాగము) కొంచెమెచ్చుతక్కువగా వేయుపౌరటలు గలసంపుట మగు నని తోఁచెడిని. అది మొదటిసంపుటముగాఁ బ్రకటింపఁబడును. భాషాభిమానముతో మచ్చుపదములపై, తమతమయభిప్రాయములను బంపినవారియెడల మిగులఁ గృతజ్ఞులము–

క్షయసంవత్సర (1926–27) మున నిఘంటునిర్మాణనిమిత్తమయిన వ్యయము.

| | | |
|---|---|---|
| జీతములు | ... ... | 3648– 5–2 |
| చిల్లరవ్యయము | ... ... | 70–10–0 |
| | | 3718–15–2 |

జ॥ రామయ్య.

| | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| పరిషత్తు ఫండు.— | | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ | 82,468 | 6 | 6 | | | |
| ఈసంవత్సరమున హెచ్చు ఆదాయము | 1,669 | 9 | 11 | | | |
| | | | | 84,138 | 0 | 5 |
| ప్రభవసంవత్సరమునకు అడ్వాన్సు చందాలు | | | | | | |
| సాధారణసభ్యులవలన | 12 | 0 | 0 | | | |
| పత్రిక చందాదారులవలన | 6 | 0 | 0 | | | |
| | | | | 18 | 0 | 0 |
| తంజావూరు లైబ్రరీ చందా | | | | 33 | 0 | 0 |
| చేబదుళ్ళు | | | | 1,200 | 0 | 0 |
| నిఘంటు ఫండు | | | | 15,000 | 0 | 0 |
| పరిషత్కార్యస్థానము మార్పు ఫండు | | | | 700 | 0 | 0 |
| మొత్తం | | | | 1,01,089 | 0 | 5 |

పైని దెలుపఁబడిన జమాఖర్చు నిలువ లెక్కయు, ఆంధ్రసాహిత్యపరిషత్తువారి క్షయ సామసంవత్సరపు లెక్కలతో తనిఖీచేసి సరియైనట్లు తెలుపుచున్నాను.

రాబర్ట్సన్ వీధి, కాకినాడ,
19—9—1927.

యనమండ్ర గణపతిరావు, ఎఫ్.సి.ఆర్.ఏ., (గ్లాస్గో)
కార్పొరేట్ అక్కౌంటెంటు అండ్ గవర్నమెంటు
డిప్లమేట్ ఇన్ కామర్సు.
(ఆడిటరు)

# ఆస్తి.

| | | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|
| పరిషత్తు ఫండు.— | | | | | | | |
| మదరాసు ఇంపీరియల్ బాంకు ఆఫ్ ఇండియా వారి జాగ్రత్తలో నుంచబడినవి | | | | | | | |
| 3½% 1900-01 గవర్నమెంటు పత్రము | | 10,000 | 0 | 0 | | | |
| గతసంవత్సరము లెక్క—దాఖలా తరుగు | | 4,450 | 0 | 0 | | | |
| | | | | | 5,550 | 0 | 0 |
| 5% 1927-47 గవర్నమెంటు పత్రము | | 10,000 | 0 | 0 | | | |
| గతసంవత్సరము లెక్క—దాఖలా తరుగు | | 2,000 | 0 | 0 | | | |
| | | | | | 8,000 | 0 | 0 |
| నగదు వగైరా నిలువ.— | | | | | | | |
| మేనేజరువశమున నిలువ | | 560 | 11 | 3 | | | |
| ఇంపీరియల్ బాంకు ఆఫ్ ఇండియాలో కరెంటు అకౌంటులో నిలువ | | 42 | 3 | 3 | | | |
| | | | | | 602 | 14 | 6 |
| సభ్యులవలన రావలసిన చందాలు | | | | | 11,145 | 3 | 0 |
| కుర్చీలు, సామానులు (అసలు) | | 525 | 8 | 0 | | | |
| గతసంవత్సరము మినహా | 278 14 0 | | | | | | |
| యీసంవత్సరముకు మినహా | 24 4 0 | 303 | 2 | 0 | | | |
| | | 222 | 6 | 0 | | | |
| యీసంవత్సరములో కొనినవి | | 19 | 7 | 0 | | | |
| | | | | | 241 | 13 | 0 |
| ప్రచురింపబడిన పుస్తకముల నిలువ | | 3,428 | 8 | 0 | | | |
| పత్రికల నిలువ | | 3,659 | 12 | 0 | | | |
| కాగితముల నిలువ | | 177 | 0 | 0 | | | |
| | | | | | 7,265 | 4 | 0 |
| పుస్తకభాండాగారము ముద్రితప్రతులు గతసంవత్సరాంతమున నిలువ | | 1,958 | 12 | 0 | | | |
| యీసంవత్సరమున కొనినవి | | 0 | 1 | 0 | | | |
| ఉచితముగా వచ్చినవి | | 264 | 13 | 0 | | | |
| | | 2,223 | 10 | 0 | | | |
| గతసంవత్సరాంతమున మినహా | 826 12 0 | | | | | | |
| యీసంవత్సరాంతమున మినహా | 60-0-0 | 886 | 12 | 0 | | | |
| | | | | | 1,336 | 14 | 0 |
| పుస్తకభాండాగారము వ్రాతప్రతులు | | | | | 51,427 | 8 | 6 |
| విఘంటువ్యయము:—గతసంవత్సరాంతమున | | 14,849 | 11 | 8 | | | |
| ఈసంవత్సరమునకు | | 0 | 11 | 0 | | | |
| | | | | | 14,850 | 6 | 8 |
| పరిషత్కార్యస్థానము మార్పు ఫండు వ్యయము | | | | | 669 | 0 | 9 |
| | | | | | 1,01,089 | 0 | 5 |

దర్భా వేంకటశివరామరావు, కిళాంబి రాఘవాచార్యులు, కార్యదర్శులు.

ఆంధ్రసాహిత్యపరిషత్తు—కాకినాడ—క్షయనామ సం॥ (ది 10 మార్చి 1927 సం॥

ఆయము.

| | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| సంవత్సరాదిని కార్యస్థానమున నిలువ | | | | 83 | 9 | 9 |
| బ్యాంకి కరెంటు అక్కౌంటు జమ | | | | 401 | 7 | 0 |
| బ్యాంకి చిల్లరవ్యయం తాలూకు జమ | | | | 2 | 5 | 0 |
| విడిసంచికల విక్రయము | | | | 22 | 4 | 0 |
| చందాలు:—సాధారణసభ్యులు | 172 | 0 | 0 | | | |
| పత్రిక చందాలు | 161 | 8 | 0 | | | |
| ప్రాతచందా వసూళ్ళు | 5 | 0 | 0 | | | |
| | | | | 338 | 8 | 0 |
| బ్యాంకినుండి వచ్చిన వడ్డీ | | | | 763 | 4 | 4 |
| వి. పి. పోస్టేజీ | | | | 10 | 4 | 6 |
| చిల్లర జమలు | | | | 44 | 8 | 0 |
| పరిషత్కార్యస్థానము మార్పు | | | | 700 | 0 | 0 |
| విరాళములు | | | | 500 | 0 | 0 |
| పుస్తకముల విక్రయము:— | | | | | | |
| మన్నారుదాసవిలాసనాటకము | 0 | 12 | 0 | | | |
| అరవదేశమునందలి తెలుఁగు వాఙ్మయము | 0 | 4 | 0 | | | |
| డిఫెన్సు ఆఫ్ లిటరరీ తెలుఁగు | 0 | 8 | 0 | | | |
| అకారాద్యముద్రితగ్రంథసూచిక | 1 | 0 | 0 | | | |
| ద్రావిడియన్ లెక్సికోగ్రాఫీ | 0 | 8 | 0 | | | |
| శివతత్త్వసారము | 6 | 7 | 0 | | | |
| చంపూరామాయణము | 15 | 5 | 0 | | | |
| ప్రాకృతభాషోత్పత్తి | 1 | 8 | 0 | | | |
| శివరాత్రిమాహాత్మ్యము | 19 | 8 | 6 | | | |
| నారసింహపురాణము | 5 | 0 | 0 | | | |
| విప్రనారాయణచరిత్రము | 7 | 13 | 0 | | | |
| యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము | 2 | 0 | 0 | | | |
| నీతిసీసపద్యశతకము | 1 | 4 | 0 | | | |
| కావ్యాలంకారచూడామణి | 24 | 11 | 0 | | | |
| చంద్రభానుచరిత్రము | 21 | 5 | 0 | | | |
| జ్ఞానప్రసూనాంబికాశతకము | 0 | 10 | 0 | | | |
| జైమినిభారతము | 1 | 5 | 6 | | | |
| కవిజనాశ్రయము | 27 | 4 | 0 | | | |
| సర్వేశ్వరశతకము | 0 | 9 | 0 | | | |
| ఆర్యభాషావిభాగము | 1 | 0 | 0 | | | |
| జ్యోతిశ్శాస్త్రసారము | 3 | 7 | 0 | | | |
| హరిస్వరంగములు | 0 | 15 | 0 | 143 | 0 | 0 |
| | | | | 3,015 | 2 | 7 |

రాబర్ట్సనువీధి, కాకినాడ.
19—9—1927.

యనమండ్ర గణపతిరావు, ఎఫ్.సి.ఆర్.ఏ, (గ్లాస్గో) కార్పొరేట్ అక్కౌంటెంటు అండ్ గవర్నమెంటు డిప్లమేటిక్ ఇన్ కామర్సు.
(ఆడిటరు.)

౨౦ మొదలు 2 ఏప్రియల్ 1927 సం॥రం వరకు) ఆయవ్యయముల లెక్క.

## వ్యయము.

| | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| బ్యాంకికి బంపినది | | | | 404 | 12 | 8 |
| బ్యాంకి చిల్లరవ్యయము | | | | 2 | 15 | 6 |
| వి. పి. పోస్టేజి | | | | 14 | 9 | 0 |
| ప్రయాణవ్యయము:— | | | | | | |
| ఉద్యోగుల ప్రయాణవ్యయము | 7 | 11 | 9 | | | |
| పండితుల ప్రయాణవ్యయము | 9 | 10 | 0 | | | |
| | | | | 17 | 5 | 9 |
| పత్రికావిషయము.— | | | | | | |
| ముద్రణము, బైండింగు | 188 | 6 | 0 | | | |
| పత్రిక కాగితము | 100 | 0 | 0 | | | |
| పత్రిక చిల్లరవ్యయము | 12 | 15 | 0 | | | |
| పత్రిక పోస్టేజి | 66 | 14 | 0 | | | |
| | | | | 368 | 3 | 0 |
| ఇతరముద్రణము, బైండింగు | | | | 73 | 4 | 6 |
| పుస్తకభాండాగారవిషయము:— | | | | | | |
| కొనిన పుస్తకము | 0 | 1 | 0 | | | |
| చిల్లరవ్యయము | 11 | 13 | 6 | | | |
| | | | | 11 | 14 | 6 |
| కొనిన సామానులు | | | | 19 | 7 | 0 |
| నిఘంటు చిల్లర వ్యయము | | | | 0 | 11 | 0 |
| చిల్లర పోస్టేజీ | | | | 55 | 8 | 3 |
| కలములు, కాగితములు వగైరా | | | | 14 | 4 | 3 |
| కార్యస్థానమున చిల్లరవ్యయము | | | | 28 | 12 | 9 |
| పరిషత్కార్యస్థానము మార్పు | | | | 669 | 0 | 9 |
| ఉద్యోగుల జీతములు | | | | 528 | 11 | 11 |
| ఏజంటు వ్యయము | | | | 98 | 9 | 6 |
| ఇంటి అద్దె | | | | 80 | 0 | 0 |
| రిజష్టరు పోస్టేజీ | | | | 8 | 1 | 6 |
| పుస్తకముద్రణావికము | | | | 58 | 4 | 0 |
| కార్యస్థానమున నిలువ | | | | 560 | 11 | 3 |
| | | | | 3015 | 2 | 7 |

దర్భా వేంకటశివరామరాను }
కిళాంబి రాఘవాచార్యులు } కార్యదర్శులు.

ఆంధ్రసాహిత్యపరిషత్తు—కాకినాడ—క్షయనామ సం॥ (ది 15 మార్చి 1926 సం॥

వ్యయము.

| | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| ఉద్యోగుల జీతములు | 528 | 11 | 11 | | | |
| ఏజంటు వ్యయము | 98 | 9 | 6 | | | |
| ఇంటి అద్దె | 80 | 0 | 0 | | | |
| ఇతరముద్రణము, బైండింగు | 73 | 4 | 6 | | | |
| పుస్తకముద్రణాదికము | 58 | 4 | 0 | | | |
| చిల్లర పోస్టేజీ | 55 | 8 | 0 | | | |
| ప్రయాణవ్యయము | 17 | 5 | 9 | | | |
| కార్యస్థానమున చిల్లరవ్యయము | 28 | 12 | 9 | | | |
| వి. పి. పోస్టేజీ | 14 | 9 | 0 | | | |
| రిజిస్టరు పోస్టేజీ | 8 | 1 | 6 | | | |
| కలములు, కాగితములు వగైరా | 14 | 4 | 6 | | | |
| పుస్తకభాండాగారమున చిల్లరవ్యయము | 11 | 13 | 6 | | | |
| బ్యాంకి ఎక్స్చేంజి | 0 | 10 | 0 | 989 | 14 | 11 |
| పత్రికముద్రణము వగైరా | 368 | 3 | 0 | | | |
| పత్రికలు నిలువ | 3,355 | 0 | 0 | | | |
| కాగితములు నిలువ | 75 | 8 | 0 | | | |
| పుస్తకముల నిలువ (ప్రచురింపబడినవి) | 3,193 | 6 | 0 | 6,992 | 1 | 0 |
| మినహాయింపులు:— | | | | | | |
| కుర్చీలు, సామానులు | 24 | 4 | 0 | | | |
| పుస్తకభాండాగారము | 60 | 0 | 0 | 84 | 4 | 0 |
| ఆదాయము | | | | 1,669 | 9 | 11 |
| | | | | 9,735 | 13 | 10 |

రాబర్టుసన్ వీధి, కాకినాడ.
19—9—1927.

యనమండ్ర గణపతిరావు, ఎఫ్.సి.ఆర్.ఏ.,
(గ్లాసుగో) కార్పొరేట్ అక్కౌంటెంటు అండ్
గవర్నమెంటు డిప్లమేట్ ఇన్ కామర్సు.
(ఆడిటరు.)

రం మునిలు 2 ఏప్రియల్ 1927 సం॥రం వరకు ఆయవ్యయముల లెక్కలు.

## ఆయము.

| | | | | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|---|---|
| చందాలు:— | | | | | | | | | |
| సాధారణసభ్యులు | | | | 522 | 0 | 0 | | | |
| పత్రిక చందాలు | | | | 189 | 8 | 0 | 711 | 8 | 0 |
| విడిసంచికల విక్రియము | | | | 22 | 4 | 0 | | | |
| పుస్తకవిక్రియము | | | | 143 | 0 | 0 | | | |
| వి. పి. పోస్టేజీ వసూలు | | | | 10 | 4 | 6 | 175 | 8 | 6 |
| బ్యాంకి వడ్డీ | | | | | | | 789 | 4 | 4 |
| పత్రికలు నిలువ | | | | 3,659 | 12 | 0 | | | |
| కాగితములు నిలువ | | | | 177 | 0 | 0 | | | |
| పుస్తకముల నిలువ | | | | 3,428 | 8 | 0 | 7,265 | 4 | 0 |
| చిల్లర జమలు | | | | 44 | 8 | 0 | | | |
| ఉచితముగావచ్చిన పుస్తకములు :— | | | | | | | | | |
| క్రిందటిసంవత్సరములోవచ్చినవి | 189 | 2 | 0 | | | | | | |
| ఈయసంవత్సరములోవచ్చినవి | 75 | 11 | 0 | 264 | 13 | 0 | | | |
| పాత్రచందావసూలు | | | | 5 | 0 | 0 | | | |
| విరాళములు | | | | 500 | 0 | 0 | 814 | 5 | [illegible] |

# 2 వ అనుబంధము.

## వినిమయముగావచ్చు పత్రికలు.

1. అభినవసరస్వతి—(మాసపత్రిక)—జానపాడు, గుంటూరు.
2. రవి—(వారపత్రిక) కాకినాడ.
3. ఆంధ్రపత్రిక, (వారపత్రిక) చెన్నపురము.
4. భారతి, (మాసపత్రిక) చెన్నపురము.
5. కృష్ణాపత్రిక, (వారపత్రిక) బందరు.
6. సుదర్శిని (పక్షపత్రిక) నరసాపురము, కృష్ణాజిల్లా.
7. కర్ణాటకసాహిత్యపరిషత్పత్రిక, (త్రైమాసిక) బెంగుళూరు.
8. ఆర్కియాలాజికల్ రిసర్చి, బెంగుళూరు; మద్రాసు; తిరువాన్కూరు.
9. వైఖానసపత్రిక, (మాసపత్రిక) ఈగావారిపాలెము, చెంగల్పట్టుజిల్లా.
10. క్షత్రియపత్రిక— డిట్టో డిట్టో ,,
11. పంచానన, (పక్షపత్రిక) సోంపేట, గంజాంజిల్లా.
12. ఆయుర్వేదసమ్మేళనపత్రిక, (మాసపత్రిక) బెజవాడ.
13. త్రిలింగ (వారపత్రిక) చెన్నపురము.
14. శ్రీవైష్ణవపత్రిక, (మాసపత్రిక) పెంటపాడు, కృష్ణాజిల్లా.
15. స్వధర్మప్రకాశిక, (మాసపత్రిక) కీలుపాక్కం, చెన్నపురము.
16. నీలగిరి (వారపత్రిక) నల్లగొండ, నైజాం.
17. రెడ్డిరాణి (మాసపత్రిక) పెదపాకరాయవరము, గోదావరి.
18. ధన్వంతరి (మాసపత్రిక) చెన్నపురము.
19. హిందూసుందరి (మాసపత్రిక) కాకినాడ.
20. బ్రాహ్మణపత్రిక (మాసపత్రిక) మాంబళము, సైదాపేట.
21. వజ్రాయుధము, (మాసపత్రిక) రాజమహేంద్రవరము.
22. మహారాజావారి కాలేజీపత్రిక, (త్రైమాసికపత్రిక) విజయనగరము.
23. మాణిక్యప్రభపత్రిక (పక్షపత్రిక) శంకరగిరి, ఆస్పారి, బళ్లారి.
24. ఆంధ్రరాష్ట్రము, (వారపత్రిక) రాజమహేంద్రవరము.
25. Andhra Historical Research Society, Rajahmundry.
26. లలిత (మాసపత్రిక) విజయనగరము.
27. చిత్రరంజని (వారపత్రిక) రాజమండ్రి.
28. శైవప్రచారిణి (పక్షపత్రిక) ఓరుగల్లు, నైజాం.
29. ప్రాథమికవిద్య (మాసపత్రిక) కాకినాడ.
30. గంధర్వ (మాసపత్రిక) విజయనగరము

# 3 వ అనుబంధము.

పరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడిన వ్యాసములు-తత్కర్తలు.

కార్యదర్శి విజ్ఞప్తి—దర్భా వేంకట శివరామరాసుగారు.

వృత్తాంతములు

ఆంధ్రసాహిత్యపరిషత్కార్య నిర్వాహక సభ.

స్వాగతము—డా॥ బ॥ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు.

మాతృభాషాసంసేవము-శ్రీ త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావుదొరగారు.

గుణగవిజయాదిత్యునినాఁటి యుద్ధంకి శిలాశాసనము—జయంతి రామయ్య పంతులుగారు.

ఆంధ్రవాణీ సమాశ్వాసనము-శతావధాని, ఓలేటి వేంకటరామశాస్త్రిగారు.

నారసింహపురాణము-ఉపోద్ఘాతము, డిటో.

ఆంధ్రసాహిత్యపరిషత్తు

మహాభారత కథాప్రాశస్త్యనిరూపణము-మల్లాది రామకృష్ణశాస్త్రి చయనులుగారు

అధ్యక్షుని యుపన్యాసము

చందాదారులకు మనవి

మన్నారుదాస విలాసనాటకము-రంగాజమ్మ.

కార్యదర్శివిజ్ఞప్తి-దర్భా వేంకటశివరామరాసుగారు.

అర్పితము-పండిత పెనుమచ్చ సత్యనారాయణరాజుగారు.

సెలవు-కొత్తపల్లి సూర్యరావుగారు.

అరవమునందలి ழ అను విశేషాక్షరము తెనుఁగునఁ గలదా—కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు.

భాషాసేవ-తప్పులను-జనమంచి శేషాద్రిశర్మగారు.

శ్రీస్కాందపురాణము-విద్వాన్ కట్టిసాంబమూర్తిశాస్త్రిగారు.

శ్రీకృష్ణభూపతి తారావళీప్రశంస-అడిదము రామారావుగారు.

కావ్యగుణములు-పసుముల చినసీతారామస్వామి శాస్త్రిగారు.

అహోబలపతి-జయంతి రామయ్యపంతులుగారు.

గోమహిషసంవాదము-కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు.

గ్రంథవిమర్శనము

అరవమునందలి విశేషాక్షరము తెనుఁగునఁగలదా? కా. బ్రహ్మయ్యశాస్త్రిగారు

[illegible]భ్రాంతి మీమాంస-చెర్ల నారాయణశాస్త్రిగారు.
మన్నారుదాస విలాసనాటకము పీఠిక-జయంతి రామయ్యపంతులుగారు.
సకల విద్యోద్దేశము
శబ్దలక్షణసంగ్రహము-విద్వాన్ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారు.
షోడశరాజకుమారచరిత్ర-దుగ్గిరాల వేంకట సూర్యప్రకాశరావుగారు, బి.ఏ.
సూత్రసమన్వయము-కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు.
ఆంధ్రభాషయందలి వింతయక్కరము-జయంతి రామయ్యపంతులుగారు.
ద్రావిడభాషాతత్త్వ విమర్శనము-కోరాడ రామకృష్ణయ్యగారు, ఎం. ఏ.
కాళిందీకన్యాపరిణయము-అహోబలపతి.
శ్రీస్కాంద మహాపురాణమేది-ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు.
కృతిస్వీకృతి-అనంతపంతుల రామలింగస్వామిగారు.
దేవేంద్రవర్మ చీడివలసశాసనము-విద్వాన్ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారు.
బాలవ్యాకరణ హరికారికలపౌర్వాపర్య విమర్శనము—విద్వాన్ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు
కరుణరసము-కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.
సూర్యనారాయణీయాంధ్రభాషానుశాసన ప్రామాణ్యవిచారము — శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు.
కవిత-విద్వాన్ కోపల్లె శివకామేశ్వరరావుగారు.
పాలకురికి సోమనాథకవి-గద్యకృతులు- బండారు తమ్మయ్యగారు.
అఱవమునందలి వింతయక్కరము తెలుగునం గలదా—కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు.
కావ్యభాష-అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.
అఱవమునందలివింతయక్కరము తెలుగునం గలదా—జయంతి రామయ్య పంతులుగారు.
సాముద్రికశాస్త్రము-మల్లాది దక్షిణామూర్తిగారు.
అలంకారప్రాచీనత-మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు.
నూపురమహిమ లేక, కన్నకిచరిత్రము-తి॥ సు॥ మురుగేశ పిళ్ళగారు.

# పరిషత్కార్యాలయమున వెలకు దొరకు

# గ్రంథములు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము–చదలువాడ మల్లయకవి రు | 0 | 8 | 0 |
| 2 | కవిజనాశ్రయము–వేములవాడ భీమకవి ...... | 0 | 10 | 0 |
| 3 | చంపూరామాయణము–ఋగ్వేదికవి వేంకటాచలపతికవి | 1 | 0 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము–తాళ్లపాక పెదతిరుమలార్యుఁడు | 0 | 2 | 0 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము–శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు బి. ఏ., యల్. టి. ...... | 0 | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము–శిష్టు సర్వశాస్త్రికవి...... | 0 | 2 | 0 |
| 8 | సర్వేశ్వరశతకము–యథావాక్కుల అన్నమయ్యగారు | 0 | 3 | 0 |
| 7 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము–జ. రామయ్యపంతులు గారు, బి ఏ., బి ఎల్. ...... | 0 | 8 | 0 |
| 9 | కావ్యాలంకారచూడామణి–విన్నకోట పెద్దయకవి | 0 | 8 | 0 |
| 10 | చంద్రభానుచరిత్రము–తరిగొప్పుల మల్లనకవి ...... | 1 | 0 | 0 |
| 11 | అకారాద్యముద్రిత గ్రంథసూచిక ...... | 0 | 8 | 0 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి–శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ...... ...... | 0 | 12 | 0 |
| 13 | శివతత్త్వసారము–మల్లికార్జున పండితారాధ్యులు | 0 | 12 | 0 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు బి ఏ., బి. ఎల్. ...... | 0 | 8 | 0 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము–శ్రీనాథమహాకవి ...... | 0 | 12 | 0 |
| 16 | ఆర్యభాషావిభాగము–శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ...... ...... | 0 | 8 | 0 |
| 17 | Drawidian Lexicography ... ... | 0 | 4 | 0 |
| 18 | ప్రహస్వరంగములు–క్రొత్తపల్లి సూర్యరావు ...... | 0 | 8 | 0 |
| 19 | నాగసింహపురాణము ఉత్తరభాగము–హరిభట్టు...... | 1 | 0 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము—రంగాజమ్మ. ...... | 0 | 8 | 0 |
| 21 | జైమిసిభారతము–వచనము–వేంకటకృష్ణప్పనాయకుఁడు | 0 | 12 | 0 |

Printed by P. Brahmananda Row at the Sujanaranjani Printing Works, Cocanada.

# విషయసూచిక.

---

విషయములు. పుటలు.

# పరిషత్ప్రయోజనములు.



తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి :—

i తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వాంకష మగునిఘంటు వొకటి రచించి ప్రచురించుట ;

ii తెలుఁగుభాషకు సజాతీయేతర భాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణమును రచించి ప్రచురించుట ;

iii ఆధునికశాస్త్ర గ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట ;

iv ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, ... లయిన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమ... ...త్తరముగాఁ దెలుఁగుదేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొ... ...ించి ప్రచురించుటయు ;

v సర్వవిషయములనుగుఱించి చేయఁదగు ...నకుఁ బ్రోత్సాహ మొసంగుట ;

vi ఆంధ్రభాషలోని ... ...ములఁ బాఠిక పరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట ;

vii తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట ;

viii తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకొఱకు సాంవత్సరికసభల నేర్పాటుచేయుట ;

ix తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్య పట్టములను, యోగ్యతాపత్రికలను, నొసంగుట ;

x ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట. ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును ; వార్తాపత్రికలుగూడ నుండవలయును ;

xi తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపకరించు నన్ని కార్యములను జేయుట

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

సంపుటము ౧౬. { ప్రభవనామసంవత్సరము ఆశ్వయుజకార్తికమాసములు. } సంచిక ౪.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు - పదాఱవవార్షికసభ.

### బళ్లారి.

ది 22 అక్టోబరు 1927 సంవత్సరము శనివారముమధ్యాహ్నము బళ్లారి పురమందిరమునం బరిషద్వార్షికసభ ప్రారంభమై 24 తేది సోమవారముసాయంకాలమువఱకు జరిగినది

— సభ్యులు —

శ్రీమన్మహామండలేశ్వర మాళవరాజు రామరాజుగారు, సింగినిగుండు జాగిరుదారుగారు, ఆనేగొంది.

శ్రీరాజా దాట్లవేంకటసింహాద్రి జగపతిరాజు బహదరుగారు, ఆనేగొంది

మ.రా.రా. శ్రీ పి. శివరావుగారు, యం. యల్. సి.

" రావుబహదరు సి. హెచ్. హనుమంతగౌడుగారు.

" యస్. నారాయణరావుగారు, బి.ఏ.బి ఎల్., మ్యునిసిపల్ చైర్మన్

" వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపురము.

" రామమూర్త్యాచార్యులుగారు, పండితులు.

" విద్వాన్ యం. నారాయణశాస్త్రిగారు.

" టి. శంకరలింగం పిళ్ళైగారు, బి. ఏ. బి. ఎల్.

" జి. వేదగిరిశ్రేష్ఠిగారు.

" విద్వాన్, కట్టి సాంబమూర్తిశాస్త్రిగారు, నరసన్నపేట, గంజాము.

,, కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ. బి. ఎల్., కాకినాడ.
,, డాక్టరు. డి. శేషాచార్యులుగారు.
,, కే. గుండాచార్యులుగారు, వకీలు.
,, కాసుల రంగప్పగారు, బి. ఏ., ప్లీడరు.
,, వనం శంకరశర్మగారు, ప్రత్తికొండ.
,, కే. భీమసేనరావుగారు, బి. ఏ. బి. ఎల్.
,, కే. గురురాజారావుగారు, బి. ఏ. బి. ఎల్.
,, రావుసాహెబు జొన్నగట్ల పాపయ్యగారు.
,, స్రిడిగి సిద్దప్పగారు.
,, వి. కృష్ణమ్మసెట్టిగారు, బి. ఏ. బి. ఎల్.
,, కే. టి. శ్రీనివాసాచార్యులుగారు, బి. ఏ.
,, చింతలపల్లి నరసింహశాస్త్రిగారు.
,, పి. శ్రీనివాసరావుగారు.
,, టి. రాఘవాచార్యులుగారు, బి. ఏ. బి. ఎల్.
,, సి. యస్. శ్రీనివాసాచార్యులుగారు, ఎం. ఏ., చెన్నపురము.
,, యం. మృత్యుంజయశాస్త్రిగారు, బి. ఏ. బి. ఎల్.
,, డి. గోపాలాచార్యులుగారు, బి. ఏ. బి. ఎల్.
,, టి. సుబ్రహ్మణ్యముగారు.
,, ఉద్దగిరి వెంకన్నభట్‌గారు, ప్రత్తికొండ.
,, యం. దేవేంద్రనాయఁడుగారు, బి. ఏ. బి. ఎల్.
,, సవితాల సుబ్రహ్మణ్యముగారు, ఎం. ఏ. బి. ఎల్., కాకినాడ.
,, భక్తవత్సలం నాయఁడుగారు, డిస్ట్రిక్టు మున్సబ్.
,, విట్టా శేషప్పశ్రేష్ఠిగారు.

మఱియు ననేకులు న్యాయవాదులు, నధికారులు, నుద్యోగులు, సంపన్నులు, నుపాధ్యాయులును విచ్చేసిరి.

రామలింగయ్యగారు దైవప్రార్థనము గావించినపిదప కే. సంజీవమూర్తిరావుగారు, శతావధాని దోమా వేంకటస్వామిగుప్తగారును స్వాగతపద్యములు చదివి పరిషత్ప్రశంసను గావించిన పిమ్మట, మ॥ శ్రీ టి. శంకరలింగము శెట్టిగారు (పరిషదాహ్వాన సంఘాధ్యక్షులు) స్వాగతోపన్యాసముం గావించిరి.

సభాధ్యక్షులు శ్రీ త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావుదొరగారిని గూర్చి జయంతి రామయ్యపంతులుగారు, ప్రశంసించిన పిమ్మట, రావుబహద్దరు సి. హెచ్. హనుమంతగౌడుగారును వారి సామర్థ్యమును గొనియాడిరి. పిదప సభాధ్యక్షులు వారిసహజమధురధోరణిని మహోపన్యాసముం గావించిరి. తదనంతరము కావ్యతీర్థ జనమంచి శేషాద్రిశర్మగారు (కడప) సూక్ష్మతను విద్యావిలాసము, బళ్లారి కృష్ణప్పగారు (ఆలూరు) భాషాభిమానము, బులుసు విశ్వనాథశాస్త్రిగారు (హొసపేట) హిందూదేశమం దాంధ్రభాషాప్రచుర్యము, విద్వాన్ కరి బసవశాస్త్రిగారు (ఆలూరు) కవి—కవిసమయములు నను వ్యాసములం జదివిరి.

ది 23 తేది ఆదివారము, ఉదయము 8 గంటలకు మరల సభ ప్రారంభమైనది. కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు (చంద్రగిరి) ఆంధ్రులు-వ్యాకరణము, కేతవరపు వేంకటశాస్త్రిగారు (విశాఖపట్టనము) శబ్దశక్తివివరణము నను వ్యాసములం జదివిరి. కావ్యవిశారద అనుముల వేంకటశేషయ్యశాస్త్రిగారు (నంద్యాల) భావకవిత్వముం గూర్చి యుపన్యసించిరి.

మధ్యాహ్నము కీ. శే. శ్రీశ్రీశ్రీ బొబ్బిలి మహారాజావారిం గూర్చి జయంతి రామయ్యపంతులుగారు కొంత ప్రశంస యొనర్చి వారిమరణమున నాంధ్రలోకమునకుం గలిగినకొఱంతను దెలిపి "ఆంధ్రసాహిత్యపరిషదుద్ధారకులును ఆంధ్రవిశ్వకళాపరిషత్తునకు మొదటి "ప్రోచాన్సలరు"ను విద్యాపోషకులును జి. సి. ఐ. ఇ; సి బి. ఇ. బిరుదాంకితులును నగు శ్రీశ్రీశ్రీ మహారాజా సర్ శ్వేతాచలపతి వేంకటరంగారావు బహద్దరువారు కాలధర్మము నొందినందుకు, ఈసభవారు మిక్కిలి విచారించుచున్నారు" అను తీర్మానము నుపపాదించిన యనంతరము సభ్యులెల్లరు విచారసూచకముగ నిలువంబడి యేకగ్రీవముగం దీర్మానము నామోదించిరి.

2. తరువాత "ఆంధ్రసాహిత్యపరిషత్ప్రతిష్ఠాపకులును విద్యాపోషకులును, మహెహ్కాదారులును, సి. బి. ఇ. బిరుదాంకితులును, పీఠికాపురాధీశ్వరులు నగు శ్రీశ్రీశ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరువారు, ఆంధ్రవిశ్వకళాపరిషత్తునకు "ప్రోఛాన్సలరు" గా నియమింపబడినందున నీసభవారు మిక్కిలి యానందించుచున్నారు" అను తీర్మానమును,

3. విద్యాధికులును, చిరకాల ముపాధ్యాయత్వము వహించి పలువురకు విద్యాదానము చేసినవారును నగు దివాన్‌బహద్దరు శ్రీమాన్ కిళాంబి రామానుజాచార్యులు, ఎం. ఏ. బి. ఎల్. గారికిని, దివాన్‌బహద్దరు సర్ రఘుపతి వేంకటరత్నమునాయఁడు ఎం. ఏ. గారికిని సాహిత్యభట్టాచార్య (Doctor of Literature) బిరుదమును, ఉభయభాషాప్రవీణులును, సుప్రసిద్ధవిద్వాంసులు నగు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిలుగారికి "కళాప్రపూర్ణ" బిరుదమును నిచ్చుటకు, ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు నిశ్చయించినందున కీసభవారు కళాపరిషత్తువారిని సంతోషపూర్వకముగా నభినందించుచున్నారు." అనుతీర్మానమును రామయ్యపంతులుగా రుపపాదించిన సభ్యులామోదించిన పిమ్మట —

సుప్రసిద్ధాంధ్రగ్రంథప్రకాశకు లగు వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అందున్నవారిమీఁద, వారు ప్రచురించిన పూర్వకవికృతగ్రంథములలో నసభ్యవర్ణనము లున్నవని యధికారులు తీసికొనుచున్న చర్యలనుగూర్చి పూర్వకవికృతగ్రంథములజోలికిఁ బోయిన భాషకు నష్టము కలుగు నను మొదలైన విషయములతో గవర్నరుగారికి మహజరు పంపుటకై తగిన యేర్పాటులు చేయవలయు ననియుఁ గొందఱు గవర్నరుగారిని దర్శించి సందర్భములను మనవిచేయవలయు ననియుఁ జెప్పిరి.

అటుపిమ్మట శతావధాని దోమా వేంకటస్వామిగుప్తగారు (చెన్నపురి) ఆంధ్రసింహావలోకనమును గూర్చి చదివిరి. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు "ఆంధ్రభాషావతారము" అనువ్యాసమును బంపిరి. దానిని క్రొత్తపల్లి సూర్యరావుగారిచేఁ జదివించిరి. మల్లాది విశ్వనాథశర్మగారు (విజయనగరము) నాటకకళోపాసనము, అనునుపన్యాసమును సభారంజకముగ నుపన్యసించిరి.

ది 24 తేది, ఉదయమున మ్యునిసిపల్ హైస్కూలులో, పరిషత్కార్యనిర్వాహకసభ జరిగినది.

ఆనాఁడు మధ్యాహ్నము ప్రయాగ వేంకటరామశాస్త్రిగారు (అనంతపురము) "మహాభారతరచనావిశేషములు" అనువ్యాసమును కావ్యతీర్థ రావాడ వేంకటరామశాస్త్రిగారు (బల్లారి) ఆంధ్రసారస్వతము, గ్రామ్యభాష, మొంకిపాటలు, వీనిగుఱించిన వ్యాసమును జదివిరి. కావ్యతీర్థ మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (నంద్యాల) శబ్దరత్నాకరముంగూర్చి యుపన్యసించిరి,

జి. వేదగిరిశ్రేష్ఠిగారు (బళ్లారి) పోతనామాత్యుని భాగవతముంగూర్చియు విద్వాన్ తోగర్చేటి భాస్కరశాస్త్రిగారు (ఆదోని) భీష్మోపాఖ్యానమును గూర్చియు గార్లదిన్నె సుబ్బరావుగారు (ఆదోని) అగ్బరురాజ్యముం గూర్చియు పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (పిఠాపురము) విస్మృతగత్తమండల కవులం గూర్చియు వ్యాసములం జదివిరి. కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు (కాకినాడ) ఆసత్య మన నెట్టిది యను విషయముంగూర్చి సభ్యులకు హృదయంగమముగ ముచ్చటించిరి.

అధ్యక్షు లుపసంహార వాక్యములు నుడివిన పిమ్మట నన్యోన్యాభినందనములతో సభ ముగిసినది.



# స్వాగతోపన్యాసము.



[బలారిపురమున జరగిన పదాఱవ వార్షికసభాహ్వానసంఘాధ్యక్షులగు తిరుచనాపల్లి శంకరలింగము పిళ్ళై బి. ఏ., బి. యల్., గారు చదివినది.]

ఆర్యులార! విద్వద్బృంద శిఖామణులార! సుహృదులార!

మాబలారిపురవాసులపక్షమున మీకు స్వాగతము. నా పూర్వజన్మపుణ్యపరిపాకవశంబుననో నామిత్రులకు నాయందుఁ గలయనురాగాతిశయంబుననో, అఱవలకు నాంధ్రులకును గలపరస్పరసంబంధబాంధవ్యములనో, అఱవలలో నఱవయగునాకుఁ గించిన్మాత్ర మాంధ్రభాషయందుఁ గలయభిరుచివశంబుననో యీసదస్యుల సన్నిధానంబున నిలిచి స్వాగతం బొసంగు సౌభాగ్యముం గంటిని. దూరమనక వ్యయమనక, ఆయాసప్రయాసల కోర్చి యిండ్లు వాకిండ్లను విడిచి యింతదూరము వచ్చి సభయందు నిండియుండుట మీకాంధ్రభారతియందలి యభిమానంబును జాటించుచున్న దని చెప్పనవసరములేదు. ఇట్లు దేశారాధన తత్పరులై యాంధ్రభాషాసేవకు నడుముగట్టినవారైన తమబోట్లకు మాసేయుసపర్యలత్యల్పం బయ్యును భక్తిపురస్సరంబుగ నొనర్పఁబడినవి గాన సదయహృదయులరై మాసత్కారంబుల దోషంబు సరకుగొనక యంగీకరింతురని ప్రార్థన. ఈపరిషత్సభ మామూలుమేరకు గ్రీష్మర్తుసమయంబున మార్తాండమండలము తనచండప్రచండకిరణములతో వేఁడివెలుంగులు వెదచల్లుసమయంబునఁ బంచాగ్నిమధ్యంబునఁ దపంబొనర్పు సంయమీంద్రులవృత్తి నవలంబించి వర్తించుట కొంకింత భీతిలి గగనమణికిరణముల నిగనిగలకోర్వఁజాలక శరదాగమారంభ విలసత్తర తారకల్తారకరాజ చంద్రికల్సంతసం బొదవింప మందమందమారుతంబులు చల్లనిగాడ్పుల వింజామరలు వీవ నల్లన నేతెంచు వారిధరంబులు విరులవాన గురియింప నుల్లంబు పల్లవింపఁజేయు నీశుభసమయంబున నీసభ సమావేశంబగునట్లు చేసిన సాహిత్యపరిషత్సభ్యులకు మావందనములు. ఇక్కాలపు శీతవాతావరణంబులు మాదేశమునం దక్క మఱియెక్కడఁ గానరావనుట యతిశయోక్తిగానేరదు. ఈసుదినమునఁ గూడిన యీసభకు సర్వమంగళములు సమకూర్చి జయప్రదంబుగ ముగియునట్లు సర్వేశ్వరుండు ప్రసాదించుఁగాక,

ఆర్యులార! మనము వాడుభాషకు, ఆంధ్రభాషయనియుఁ, దెలుఁగు భాషయనియు నామములుగలవు. ఆంధ్రభాషయనఁగా నాంధ్రజాతి జనసముదాయముచే వాడఁబడున దనియు, తెలుఁగుభాషయనఁగఁ ద్రిలింగమధ్యదేశమునం దుపయోగింపఁబడు భాషయనియు, నఱవమున, తెరుక్కు, తెక్, వీనికి వికృతి తెలుఁగు, తెనుఁగు అను దేశములయందు (అనఁగ దక్షిణదేశములయందు) వాడఁబడు భాషయనియుఁ జెప్పుదురు. ఈయాంధ్రులు ప్రథమమున, మధ్యఆసియాఖండమునుండి వెలువడి వింధ్యప్రాంతంబుల నాక్రమించిరనియుఁ దదనంతరము వింధ్యకు దక్షిణమున దక్షిణాపథమని పేర్కొనఁబడు ప్రదేశముల మార్గముగ, బొంబాయి, నాసిక్, మహారాష్ట్రము మొదలగు పశ్చిమ హిందూదేశమున నాంధ్ర రాజ్యమును స్థాపించి పాలించుచుండిరనియును, వారిలో శాతవాహనవంశపురాజులు బల్లారిమండలమే యాదిమనివాసస్థానముగఁ గల్పించుకొని రాజ్యమేలుచుండి రనియు శాసనముల మూలమున నాణెములమూలమున మనకుఁ దెలియవచ్చుచున్నది. బల్లారిమండలములోని హిరేహడగలియందు దొరకిన శివస్కంధవర్మయొక్క తామ్రశాసనమున నీ ప్రదేశము సాతవాహనరాష్ట్రమని పేర్కొనఁబడి యున్నది. ఆదోనితాలూకా మ్యాకదోనిగ్రామములో నొకపురాతనశాసనము కనఁబడినది. అది శాతవాహనవంశపురాజగు పులుమావియొక్క శాసనమని చెప్పుచున్నారు. ఆదోనితాలూకాలోని సాతనూరుగ్రామము, ఆంధ్రహాళుగ్రామము, ఆంధ్రశాతవాహనుల సంబంధమును సూచించుచున్నది. ఈరాజులు పశ్చిమసముద్రతీరమున నుండు బొంబాయిరాజధాని నంతయుఁ బాలించుచుండిరి. ఈదేశమున నుత్తరమహారాష్ట్రభాగము కొంకణమనియు దక్షిణమహారాష్ట్రభాగము కుంతలమనియు వాడఁబడుచుండెను. ఆంధ్రులు పశ్చిమమునుండి తూర్పుదిశకుఁ బోయి యిప్పటియాంధ్రదేశ మనఁబడు కృష్ణాగోదావరీమధ్యప్రదేశమునఁ గట్టకడపట నివసించియుండిరి. ఈయాంధ్రదేశమే యాంధ్రుల కడపటినివాసస్థానము. ఈరాజులనామములు శ్రీశాతకర్ణి, మృగేంద్రస్వాతికర్ణి, కుంతలశాతకర్ణి, సుందరశాతకర్ణి, చకోరశాతకర్ణి, యజ్ఞశ్రీశాతకర్ణి, గౌతమీపుత్రశాతకర్ణి వాసిష్ఠీపుత్రపులుమావి యని పురాణముల మూలమునఁ దెలియ వచ్చుచున్నది. ఈయాంధ్రులు క్రీ. పూ. 200 వత్సరమునుండి 300 వత్సరముదాఁక నాంధ్రదేశమును బాలించిరనియు, వీరికిఁ గృష్ణానదీముఖద్వారముననుండు

శ్రీకాకుళమును, బెజవాడకు సమీపముననుండు ధాన్యకటకమును ముఖ్యపట్టణములై యుండెననియు వీరు సుమారు 460 వత్సరములు చతురంగబల సమేతముగ నేకచ్ఛత్త్రముగఁ రాజ్యము పరిపాలించుచు, శక, యవన, పల్లవుల రణరంగమున నోడించి యాంధ్రవిజయధ్వజమను పతాకమును నాకసంబునఁ బ్రకాశింపఁజేసిరని తెలియవచ్చుచున్నది. వీరు మౌర్యవంశరాజుల కాలమున సామంతరాజులై యుండి యశోకుని మరణానంతరమున, కొద్దికాలముననే దక్షిణాపథమునంతయు నాక్రమించుకొని పాలించుచుండిరి. అక్కాలంబున బౌద్ధమతము ప్రబలవ్యాప్తిగలదై యుండుటచే నాంధ్రరాజులు బౌద్ధభిక్షువులకు మఠములను, విహారములను, స్తూపములను గట్టించుచుండిరి. అమరావతి, కార్లె, ఘంటసాల, జగ్గయ్యపేట, భట్టిప్రోలు, గుడివాడ మొదలగు ప్రదేశములయందలి కట్టడములు ఆంధ్రసామ్రాజ్యలక్ష్మి సాక్షాత్కరించిన విధంబును నేఁటికిని జాటుచున్నవి. బౌద్ధకాలమునఁ బ్రాకృతమే ముఖ్యభాషగ వాడఁబడుటచే బౌద్ధయుగప్రాంత్యంబున నేలిన యాంధ్రరాజులును దమశాసనములయందును నాణెములయందును ప్రాకృతభాషనే యుపయోగించుచుండిరి. ఇట్టిశాసనములు పశ్చిమమహారాష్ట్రదేశమున గౌతమీపుత్ర శాతకర్ణి మొదలగు ప్రథమాంధ్రవంశపు రాజులశాసనములును వాసిష్ఠీపుత్రపులుమావి మొదలగు కడపటియాంధ్రవంశపు రాజులశాసనము లాంధ్రదేశమునందును గొన్ని దొరకియున్నవి. వీరు విదేశీయులతో వ్యాపారసంఘముల నేర్పఱిచి వ్యాపారము చేసినట్లును సముద్రయానమునఁ గడిదేఱినవారై సమరసన్నాహంబున యుద్ధనావ లుపయోగించినట్లును, సంగ్రామముఖంబున ధైర్యస్థైర్య శౌర్యాతిశయంబుల వెలయింపఁజేసి "కాకతీయుల కదనపాండితి" యనునది లోకోక్తిగఁ బరిణమించునట్లు చేసి శిల్పములందు నితరములైన చేతిపనులయందు నసమాన సామర్థ్యముగలవారై యుండినట్లును దెలియవచ్చుచున్నది. శాతవాహనులను నాంధ్రరాజులు సుమారు 500 వత్సరములు రాజ్యమేలుచుండిరి. వీరికిఁ బిదప క్రీ. శ. తరువాత 3 వ శతాబ్దమునుండి యాంధ్రదేశము పల్లవుల పాలయ్యెను. పల్లవరాజులలోఁ బ్రసిద్ధిఁగాంచిన మహేంద్రవర్మ నరసింహవర్మ కాలమునఁ గాంచీపురము ప్రసిద్ధపుణ్యక్షేత్రమయ్యెను. వీరవర్మ కాలముననో యాతనికుమారుఁడు స్కంధవర్మ కాలములోనో, పల్లవరాజ్యము చోళులవశముకాఁగాఁ బల్లవులు కొంతకాలము నెల్లూరు, అనంతరము, గుంటూరు జిల్లా

లయందును రాజ్యముచేయుచుండిరి. వీరినే యాంధ్రపల్లవులని చెప్పుదురు. వీరు మఱియును గాంచీపురమును స్వాధీనపఱుచుకొని యాంధ్రమండలమును దొండమండలమును బాలించుచుండిరి. మహేంద్రవర్మ పల్లవరాజులలో ముఖ్యుడైనవాఁడని చెప్పితినిగదా, ఆమహేంద్రవర్మకుఁ బూర్వమాంధ్రదేశమున శిలామయములగు దేవాలయములు గట్టునాచారములేదు. కొండగుహాలయం దాలయములను జెక్కించుట యీతనికాలమునందే ప్రారంభమయ్యెను. ఈ యాచార మాంధ్రదేశము నందంతయు వ్యాపించె ననుటకు సందేహము లేదు. అమరావతిస్తూపము మొదలగుకట్టడములు ద్రవిడులప్రోత్సాహములచేతఁగలిగినవైనను, నాంధ్రుల నాగరకతా విజృంభణమును వెల్లడిచేయుచున్నవి. కాంచీపురమును బల్లవులు పాలించునపుడు చాళుక్యులు దక్షిణాపథమునకు రాజులై పాలించుచుండిరి. వీరిలో నుత్తమశూరుఁడగు పులకేశి చక్రవర్తి హర్షవర్ధనుని జయించి మహేంద్రవర్మ పల్లవరాజు నోడించి నెల్లూరికుత్తరమున నుండిన వేఁగిరాష్ట్రమును వశపఱుచుకొని తనతమ్ముఁడగు విష్ణువర్ధనుని యువరాజుగ నియమించెను. ఇదియే తూర్పుచాళుక్యవంశమునకుఁ బ్రారంభము. ఈవంశమునఁ బుట్టినవాఁడే రాజరాజనరేంద్రుఁడు. ఇతఁడు పాలించినదే రాజమహేంద్రవరము. ఈతనికుమారుఁడే రాజరాజ కుళోత్తుంగచోళుఁడు. వీరికాలముననే చాళుక్యులకును జోళులకును బరస్పరవైవాహిక సంబంధబాంధవ్యముల వలన సమ్మేళనము గలిగెను.

7 వ శతాబ్దమునుండి 10 వ శతాబ్దమువఱకుఁ బశ్చిమచాళుక్యులకును, పల్లవులకును, రాష్ట్రకూటులకును దక్షిణాపథము సంగ్రామసదనంబై విజయలక్ష్మి పలుమాఱు పలువితంబులఁ జలనమొందుచుండెను. తుదకు 10 వ శతాబ్దమున తైలరాజను చాళుక్యవంశపురాజు రాష్ట్రకూటుల నోడించి పశ్చిమచాళుక్యరాజ్యమును గళ్యాణపురమునందు స్థాపించెను. 10 వ శతాబ్దమునుండి 12 వ శతాబ్దమువఱకు, పశ్చిమచాళుక్యరాజ్యము తలయెత్తుచుండఁగా దేవగిరియందు యాదవులును ద్వారసముద్రమున హొయిసలాలును వారంగల్లున కాకతీయులును బ్రబలులై పాలించుచుండిరి. తురుష్కులు హిందూదేశముమీఁదికిఁ దండయాత్రల జేయఁబ్రారంభించిరి. వీరియాత్రలకు వెనుదీసినవారై హరిహరబుక్కరాయాదులు విద్యారణ్యులవారి వరప్రసాదంబున విజయనగరరాజ్యమును స్థాపించిరి. ఈవిద్యానగరసంస్థానము 1300 సంవత్సరములనుండి

తాళికోటయుద్ధకాలమువఱకు అనఁగ 1565 సం॥ వఱకు సత్వైభవముననుండెను. పిమ్మట 16వది సంవత్సరమువఱకుఁ జిన్నచిన్నరాజులు బైలుదేఱి విజయనగరము విడిచి పెనుగొండయు, నందుండి చంద్రగిరియుఁ, జేరి కాలక్షేపము చేయుచుండిరి. వీరిలోఁ జంద్రగిరి రంగరాయలవారు చెన్నపట్టణమును కంపెనీవారి కిచ్చి యాంగ్ల ప్రభుత్వము నంకురింపఁజేసెను. ఈరాజవంశమున గతించినవారుపోఁగ మిగిలిన శేషమే ఆనెగుందివంశస్థులు.

పల్లవరాజులు కాంచీపురము నేలుసమయమునఁ జోళవంశపురాజులు తిరుచినాపల్లి, తంజావూరు, ముఖ్యపట్టణములుగఁ జేసికొని రాజ్య మేలుచుండిరి. ఈచోళరాజ వంశకర్తయే కరికాళచోళుడు. ఈతఁడే పల్లవరాజైన ముక్కంటిపల్లవుని జయించినవాఁడు. మహేంద్రవర్మకుఁ, ద్రిలోచనపల్లవుఁ డనుబిరుదనామముగలదు. ఈకరికాలచోళుఁడే కావేరీతటములను గట్టినవాఁడు. ఇతనికుమారుఁడగు రెండవ కరికాలునివంశమున తెలుఁగు బిజ్జన చోడబిజ్జన యని పిలువఁబడు బిజ్జన పుట్టెను. ఈబిజ్జనసంతతివారే యాంధ్రచోడులని పిలువఁబడుచున్నారు. ఈయాంధ్రచోడులనుండియే కమ్మనాయకులును, రెడ్డిరాజులును, వెలమమహీపతులును బయలుదేఱి గోదావరీదక్షిణప్రాంత్యములఁ గమప్రభుత్వముఁ జలుపుచుండిరి. రాజమహేంద్రవరము వేగినాఁ డనియు గుంటూరుజిల్లా కోణిదెన మొదలు కొండవీడు అద్దంకి కమ్మనాఁ డనియు నెల్లూరు పాకనాఁ డనియు వ్యవహరింపఁబడుచుండెను. కడప పొత్తపినాఁ డనియుఁ గర్నూలుజిల్లా రేనాఁ డనియు బళ్లారి కుంతలనాఁ డనియుఁ బిలువఁబడుచుండెను.

10 వ శతాబ్దమునుండి 15 వ శతాబ్దమువఱకుఁ గల యుత్తమకవీశ్వరులు గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, వారంగల్లు మొదలగు నాంధ్రదేశములయం దుండినట్లు తెలియవచ్చుచున్నది. ఆంధ్రకవితాపితామహుండగు వాగనుశాసనుం డనుబిరుదము వహించిన నన్నయభట్టారకుండును, కవిబ్రహ్మ యగు తిక్కనయు, ప్రబంధపరమేశ్వరుం డనంబరఁగు శంభుదాసుండును, పోతనశ్రీనాథులు నీయాంధ్రప్రపంచమును వన్నెకు వాసికిఁ దెచ్చినవారు. ఇక్కాలంబున దత్తమండలము దండకారణ్యభూభాగమై యుండి తదనంతరము 14 వ శతాబ్దము మొదలు 16 వ శతాబ్దమువఱకు విజయనగరసామ్రాజ్యమునకాకరమై సుకవిజన మనోరంజనమై ప్రకాశించె. ఇక్కాలంబుననే యాంధ్ర

వాణి నవయౌవనసుకుమారకోమలగాత్రియై సర్వాలంకారసంశోభితయై సర్వాంగసౌష్ఠవంబున నేత్రపర్వంబై ముద్దులుగుల్కు మొగంబును ఖండశర్కరతోఁ గలహించుచిలుకపలుకులును గలిగి యనర్గళ కవిత్వసుధాధారాపరంపరలచే నాంధ్రులమనంబుల నాకర్షించుచుండెను. 1350 వ సంవత్సరప్రాంతమున సకలభాషాభూషణ సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తి సంపూర్ణకీర్తి నవీనగుణ సనాథ నాచన సోమనాథ నామధేయుండు బుక్కరాయల యాదరంబునఁ బ్రసిద్ధిఁగాంచెను. విద్యారణ్యస్వాములవారు వారికి మంత్రియు సుప్రసిద్ధుఁడగు భాష్యకర్తయు నైయుండెను. సాయనాచార్యులు వేదభాష్యమును బుక్కరాయల కంకితముచేసెను. అయ్యలరాజు రామభద్రుఁడు 16 వ శతాబ్దమునఁ బొత్తపినాఁటిలో నొంటిమిట్టయం దుండువాఁడు. కకుత్స్థవిజయమును రచించిన అనంతభూపాలుఁడు, రామరాజభూషణుఁడు, భట్టుమూర్తి, అల్లసానిపెద్దన, వేమన, కవిచౌడప్ప, జగన్నాథ మల్లినాథ కవీశ్వరులు మాదత్తమండలమునఁ బ్రసిద్ధిఁగాంచినవారు. కవిధూర్జటి కృష్ణరాయల యాస్థానమునం దుండెను. కాలహస్తిమాహాత్మ్యమును రచించిన కవి. కందుకూరి రుద్రకవి విశ్వకులబ్రాహ్మణుఁడు; నిరంకుశోపాఖ్యానమును రచించిన కవి. తిరువేంగళనాథుఁ డను కవి అష్టమహిషీకళ్యాణమును రచించెను. నంది మల్లయ్య, మలయమారుతకవి యను బిరుదాంకితమును వహించిన ఘంట సింగయ్య కృష్ణదేవరాయలతండ్రియైన నరసింహదేవరాయల యాస్థానకవీశ్వరులు. వరాహపురాణ మనుకావ్యమును నరసింహదేవరాయల కంకితము చేసిరి. ఈతని కుమారుఁడే యాంధ్రభోజుఁ డని ప్రసిద్ధిఁగాంచి కర్ణాటకరాజ్యసార్వభౌమమకుటాగ్రేసరచూడామణియై రణరంగంబునఁ బ్రళయకాలానిలసన్నిభుండై కసిమసంగి మృత్యుకరణి సంవర్తసమయసమవర్తియుంబోలె శత్రుసైన్యంబుల నుక్కడంచి మహారాజాధిరాజ రాజపరమేశ్వర మూరురాయరగండ అదిరాయ విజయభాషాగీతప్రవర రాయరగండ యవనరాజ్యసంస్థాపనాచార్య శ్రీవీరప్రతాపకృష్ణదేవమహారాయ లను నభిధానము వహించి యష్టదిగ్గజంబు లనుపేరు వహించిన కవివరేణ్యులచే నలంకరింపఁబడిన సంస్థానంబున విజయలక్ష్మి తాండవమాడ దేవేంద్రవైభవంబున రాజ్యము నేలుచుండె.

ఇతనికవులలో, అల్లసాని పెద్దన్న బళ్లారిప్రాంతమువాఁడు. ఆస్థానకవీశ్వరులలో ముఖ్యుఁడు. కవిగండపెండేరమును రాయలవారు తానే యతనిపాద

మునఁ దొడఁగ, నాంధ్రకవితాపితామహ యల్లసాని పెద్దనకవీంద్ర యనిపిలువఁబడు ఖ్యాతినొందినవాఁడు. స్వకపోలకల్పితం బగు ప్రబంధమును రచించుటకు మార్గదర్శి యైనవాఁడు.

(2) ముద్దుపలుకులకొప్పు పారిజాతాపహరణంబును రచించిన ముక్కు తిమ్మనయు

(3) అనర్గళసుధారసధారలం జిల్కు నతులితమాధురీమహిమనొప్పు కాళహస్తీశ్వర శతకము రచించిన కవిధూర్జటియు ముఖ్యులు.

(4) ఆర్వీటి బుక్కరాయసంతతివారైన కృష్ణదేవరాయలకుఁ గళాపూర్ణోదయము నంకితము గావించిన కవి పింగళి సూరన, ప్రభావతీప్రద్యుమ్నము రాఘవపాండవీయము నను గ్రంథముల రచించెను. తెనుఁగున రాఘవపాండవీయమునకు మించిన శ్లేషకావ్యము లేదు. తెలుఁగు ప్రబంధకవిత్వమున నితని మించినవారు లేరు. ఈతని కవితాచాతుర్యమును బొగడుట సహజసౌందర్యకాంతిచే వెలుఁగు పదియాఱువన్నెల బంగరువునకు మెఱుఁగుఁబెట్టఁ బ్రయత్నించిన చంద మగును.

(5) ఎలకూచి బాలసరస్వతి, నన్నయభట్టు వ్రాసిన యాంధ్రశబ్దచింతామణికి వ్యాఖ్యానము వ్రాసినవాఁడు. చంద్రాంగదచరిత్రము భర్తృహరిశతకములు, తెలుఁగు పరివర్తనము చేసినవాఁడు. రాఘవయాదవపాండవీయమను త్ర్యర్థికావ్యమును రచించినవాఁడు. ఇతని పేరు వేంకటరాయకవి, బాలసరస్వతియే మూర్తిభవించిన విధమున నుభయభాషా కౌశలంబున నద్వితీయపాండిత్యము గలవాఁడై యుండెను.

(6-7) శబ్దశ్లేషవాగాడంబరముఁ బెట్టి వసుచరిత్రముఁ వ్రాసినకవి రామరాజభూషణుఁడు. ఈకావ్యముతోఁ దులఁదూఁగు శ్లేషకావ్యము మఱియొండు గానరాదు. ఇతనినే నరసభూపాలీయ మను కావ్యాలంకారసంగ్రహమును రచించిన భట్టుమూర్తి యందురు. మఱికొందఱు వీరిరువురు నన్నదమ్ము లని చెప్పుదురు. రామరాజభూషణుఁడు భట్టురాజకులమునఁ బుట్టినను గవిపుంగవులకు మేలుబంతియై యప్రతిమప్రభాభాసమానుఁడై గానశాస్త్రమునం దత్యంత పాండిత్యము గలవాఁడై యుండెను.

(8) పాండురంగమాహాత్మ్యమును రచించిన తెనాలి రామకృష్ణకవి కృష్ణదేవరాయల యష్టదిగ్గజములలో నొక్కఁడని చెప్పు ప్రతీతిగలదు. ఈతని

కవిత్వము కల్పనా చమత్కృతిశోభి నిండినదై స్వభావసిద్ధంబులగు ప్రాపంచిక ప్రకృతిస్వరూపమును వర్ణించుటయందు నద్వితీయంబై నిరర్థక పదప్రయోగంబులు లేక గాంభీర్యపదగుంభనలచే నలరారుచు నలంతియలంతి తునియలుగ నుండు శుద్ధాంధ్రపదములచే నతిసరళపదవిరళార్థంబు గలదై స్వభావోక్త్యలంకారవర్ణనమునకుఁ బుట్టినిల్లై కేవలభక్తిజ్ఞానవైరాగ్య నైతికధర్మంబుల నుద్బోధించుచు నిహపరార్థప్రాప్తిమూలంబై ప్రౌఢకావ్యంబులలో నగ్రగణ్యంబై యొప్పినది యీతని పాండురంగమాహాత్మ్యము. ఈకావ్యము కఠినదీర్ఘపదసమాసభూయిష్ఠంబై లోకోక్తులచే నిండినదై సంస్కృతపదబాహుళ్యము గలదై యుండును.

(9) కులాలవంశసంభూత యగు నాంధ్రవిదుషీమణి మొల్లయను స్త్రీ రామాయణంబు రచించి తనయశశ్చంద్రికల దశదిశల వెలయింపఁజేసి యాంధ్రవాఙ్మయఘోటికి నెచ్చెలియై చెలువొందె.

మాధవాచార్యులు బుక్కభూపాలుని కులగురువులు. ఆదిశంకరుల యపరావతారం బని ప్రసిద్ధిగాంచిన మహనీయులు. వీరు విద్యారణ్యు లనువేదభాష్యమును, ఉపనిషద్వ్యాఖ్యానమును, పరాశరమాధవీయమునుమఱియు ననేక వైదికగ్రంథములు రచించినవారు. ఈయన సోదరుఁడు సాయనాచార్యులు వేదములకు భాష్యములు వ్రాసి ప్రపంచమునకు మహోపకార మొనర్చినవారు.

కవిత్వపటుత్వమునను బదగుంభనమునను బాండురంగమాహాత్మ్యమును బోలిన రామాభ్యుదయ మను కావ్యమును అయ్యలరాజు రామభద్రుఁడు రచించెను.

ఈ యీ కవియుని ప్రస్తుతింప నేల, మధ్యమయుగంబున వెలసినకవిపుంగవు లందఱును విజయనగరసంస్థానమునకుఁ జేరినవారే.

i. కృష్ణరాయలకాలమునందు దత్తమండలములును, ఉత్తరసర్కారులును, మైసూరు, దక్షిణభారతవర్షము చుట్టుముట్టు దేశమంతయు రాయలవారి యాధిపత్యముక్రిందికి వచ్చినది. కృష్ణదేవరాయలయొద్దఁ బెక్కండ్రాంధ్రవీర సేనాధిపతు లుండిరి. తాళికోట యుద్ధానంతరమే సేనాను లందఱు చిన్నచిన్న సంస్థానాధీశ్వరులై పలువురు కవిశ్రేష్ఠుల కాదరణ యొసంగిరి. ఇక్కాలంబున నాంధ్రకర్ణాటక సంస్కృతగ్రంథములు వందలకొలఁది వెల్లడియయ్యెను. కృష్ణ

దేవరాయలు సర్వమతసహనబుద్ధి గలవాఁడై యుండియును ముఖ్యముగ వైష్ణవమతోద్ధారకుఁడై యుండుటంబట్టి వీరికాలమున వైష్ణవమతమే యెక్కుడు ప్రచారమునకు వచ్చెను. ఈతనికాలమునఁ బ్రజలు రామరాజ్యమునందువలె సుఖమున జీవించుచుండిరి. వీరికాలమునకు, ప్రబంధయుగ మని చెప్పవచ్చును. కన్నడకవులందఱు నింతకుముందే ప్రబంధరచనయం దగ్రస్థానమును వహించియుండిరి. కృష్ణదేవరాయలు సంస్కృతాంధ్రకావ్యములు పెక్కు రచించినట్లు చెప్పుదురు. జాంబవతీకళ్యాణమను సంస్కృతనాటకముమాత్రము మనకలవడుచున్నది. అముక్తమాల్యదయను నాంధ్రగ్రంధము రాయలవారికవితాచమత్కారమును సూచించుచున్నది. ఇది కేవలము వైష్ణవగ్రంధము. విష్ణుచిత్తీయమనునామమునఁ బ్రసిద్ధిగాంచినది. కావ్యము కడుఁ గాఠిన్యముగలదై చదువరులకుఁ గష్టముగనుండును. ఆముక్తమాల్యదను రచించినవాఁడు కృష్ణదేవరాయలా యనువాదమున కాధారములు కొన్ని కనుపించుచున్నవి గాని జనశ్రుతిచే రాయలవారే యీకావ్యమును రచించిన ట్లామోదింపఁబడుచున్నది.

ii కొందఱు పండితులు స్వభాషాభిమానమునఁ గర్ణాటకవాఙ్మయమునఁ బ్రసిద్ధిగాంచిన పూజ్యపాదదండి, నాగార్జున, అదిపంప, పొన్న, నాగవర్మ, పండితారాధ్య, దండనాథ, భీమకవియనువారు ఆంధ్రులేయనియుఁ గన్నడదేశమునకు వెళ్ళి యుద్గ్రంథముల వ్రాసి యాంధ్రనాగరకతను గర్ణాటదేశమున వ్యాపింపఁజేసిరని చెప్పుచున్నారు. ఈవాదము చరిత్రాంశములకును సత్యమునకును దూరమైయుండునేమో యనుసంశయము వొడముచున్నది.

అఱవము, తెనుఁగు, కన్నడము, మళయాళము, తుళు అనునీభాషలు పంచద్రావిడభాష లని వాడుక. అఱవము కేవలము ప్రాచీనమైనదై గ్రంథబాహుళ్యమున నితరభాషలకన్న మిన్నయై యుండుటచే శబ్దసాదృశ్యకారణంబునను సామాన్యవ్యాకరణసూత్రప్రయోగంబునను, నది యితరభాషలకు మాతృకయై యుండవచ్చు నని కొంద ఱభిప్రాయపడుచున్నారు. మఱికొందఱు ద్రావిడభాషలకన్నింటికి సామాన్యమగు మాతృభాష మఱియొక్కటి యుండవలె ననియు నాభాషామూలముననె ద్రావిడభాషలు జన్మించె ననియు, భాషాభిజ్ఞులు, చెప్పుచున్నారు. గీర్వాణభాషయం దుండి యనేకశబ్ద వ్యాకరణచ్ఛందో లక్షణములు ద్రవిడభాషలందుఁ జేర్పఁబడియుండినను ద్రావిడభాషలకు సంస్కృతము మాతృభాష కానేరదని నాయభిప్రాయము. సంస్కృతభాషావాసనలేని యఱ

వపండితులు మహామహోపాధ్యాయుల కైనయగువార నేకులు గలరు. ఈవిష యము పరిషత్తువారు పరిశీలించి వ్రాయఁదగిన యంశము.

భాషాలిపి:—ఐరోపాఖండమునందును, చీనా, యీజిప్టు దేశములయం దును, క్రీస్తుశకమున కనేకశతసంవత్సరములకు మునుపే స్థిరమగు గ్రాంథికలిపి యేర్పడెనని లిపిశాస్త్రజ్ఞులు, చరిత్రకారులు చెప్పుచున్నారు. అఱవమునందు క్రీస్తుశకపూర్వము రెండువందలవత్సరములకంటె ముందునుండి గ్రంథములుం డినట్లును తొలికావ్య మను వ్యాకరణగ్రంథమువలనఁ దెలియవచ్చుచున్నది. కన్నడభాషయందు సయితము క్రీస్తుశకారంభమునుండియో యంతకుముందు నుండియో గ్రంథములు వ్రాయఁబడియుండినట్లు చరిత్రకారులు వ్రాయుచున్నా రు. ఆంధ్రచక్రవర్తులగు శాతవాహనవంశపురాజుల కాలములో, బౌద్ధులును జైనులును బ్రబలులైయుండుటచేఁ బ్రాకృతభాషయే ప్రాముఖ్యములో నుండినట్లు తెలియవచ్చుచున్నది. తదనంతరము బౌద్ధజైనుల మతముక్షీణించి శంకరాచా ర్యుల వేదమతము ప్రాముఖ్యమునకు రాఁగా సంస్కృతభాషయే వాడుకయం దుండినట్లును దెలియవచ్చుచున్నది. ఆంధ్రచాళుక్యుల కాలముననే యాంధ్ర లిపిస్వరూపము ప్రచారమునకు వచ్చినట్లు మన మూహింపవలసి యున్నది. పదియవశతాబ్దమున నన్నయభట్టు వ్రాసినభారతమే తెలుఁగుభాషయందుఁ బ్రథమగ్రంథ మని తేలుచున్నది. ఈగ్రంథముయొక్క లిపిస్వరూప మేలాటిదో నన్నయభట్టువ్రాసిన గ్రంథ మెందులీనమైయున్నదో తెలియఁదగిన విషయము. ఈగ్రంథము దొరకిన దానిప్రతిబింబగ్రంథ మొకటి యేర్పఱిచి వెల్లడిచేసిన సాహిత్యపరిషత్తువా రాంధ్రమండలమునకుఁ జిరస్మరణీయు లై యుందురు. తెలుఁగుభాషాప్రయోగములుగల కొన్నిపురాతనశాసనము లిటీవలఁ దొరకు చున్నవి కాని వానికాలనిర్ణయము చేయుటకుఁ దగిన యాధారములు గాన రావు. నన్నయకాలముకంటెఁ బూర్వపుగ్రంథములు లేకుండుటవలన దీని సూచనలు సయిత మితరభాషలయందుఁ గనఁబడకుండుటవలన వీరికిఁ బూర్వము గ్రంథములు గాని కావ్యములు గాని లేవనుట సాహసము కాదు. ఈవిషయమును నిర్ధరించుటకుఁ దగిన యాధారము లుండినఁ బరిషత్తువారు ప్రకటించుట ముఖ్యకర్తవ్యము.

ఆంధ్రవ్యాకరణము:—సంస్కృతభాషాపరిజ్ఞానమే యాంధ్రభాషాపాం డిత్యమున కస్తిభారమను నభిప్రాయముండినందున నాంధ్రవ్యాకరణములు సం

స్కృతమునందే వ్రాయఁబడుచుండెను. నన్నయవ్రాసిన యాంధ్రశబ్దచింతామణిని విద్యానగరమునకుం జేరిన మతంగపర్వతమున నుండిన శివయోగి బాలసరస్వతి కిచ్చి యీయపూర్వగ్రంథమునకుఁ టీక వ్రాయుమని చెప్పెనఁట. ఆంధ్రకౌముది, అహోబలపండితీయము మున్నగునవి సంస్కృతభాషామయము లైయున్నవి. ఆంధ్రభాషతో వ్రాయంపఁబడిన ప్రాచీనాంధ్రభాషావ్యాకరణములలో, కేతనార్యుని యాంధ్ర[illegible]షణమే మొదటిది. అప్పకవీయము, కావ్యాలంకారచూడామణి యను గ్రంథములు కావ్యలక్షణములు ఛందోనియమములు, కొన్ని వ్యాకరణవిషయములను మాత్రము తెలుపును. చిన్నయ్యసూరిగారి బాలవ్యాకరణము వావిలికొలను సుబ్బారావుగారి గ్రంథము నిపుడు వెలువడియున్నవి. ఈగ్రంథములున్నవిగాని కేవలము లాక్షణికగ్రంథములుగ నుపయోగింపఁబడుట లేదు. కాన పరిషత్పండితు లాంధ్రమున నొక ప్రామాణ్యగ్రంథరాజమును వ్రాయుట యుచితము.

వ్యావహారికభాషావాదము :— వ్యావహారికగ్రామ్యభాషావాదులు తమ ప్రజ్ఞావిశేషమువంతయు ధారవోసి యాంధ్రభాషకు మాఱువేషమువేయఁ దలఁచుచున్నారు. పిపీలికాదిబ్రహ్మపర్యంతమును గల జంతుజాలమును, అణుప్రమాణము మొదలాకసము పర్యంతము వ్యాప్తినొందిన యచేతనపదార్థమును మానుషావలోకనంబున వ్యక్తంబులగు సకలపదార్థములును గాలచక్రపరిభ్రమణంబునఁ గాలకాలమునకు రూపములు మాఱి తుదకుఁ గాలగతిఁ బొందుట ప్రాపంచిక నైజధర్మమై యున్నది. ఆవిధముననే మానుషలోకంబు వాడుభాషయును మార్పుఁజెందును. ప్రథమయుగంబున వాడఁబడిన భాష మధ్యమయుగంబు భాషకంటె భిన్నమై యుండును. మధ్యయుగభాషకంటెను నాధునికయుగమునందలి భాష భిన్నంబై యుండు. అయిన నీమార్పులు మానుషసంకల్పంబునకు మానుషేచ్ఛాప్రయత్నంబులకును బాహ్యమై పరివర్తించుచుఁ గ్రమక్రమమున నాత్మశక్తిచే వ్యక్తిం గాంచుచుండును. బహుజనసంసేవ్యంబై రాజ్యాంగభాషయై సూర్యరశ్మి స్పృశించు నఖండదిఙ్మండలమున నాబాలగోపాలంబుగ వాడంబడు నాంగ్లభాష సకలశాస్త్రార్థసుబోధంబును వేదవేదాంతసారమును సుగమంబుగ వివరించు సౌకర్యంబున నలరారుచున్నది. కాని యాభాషాకోవిదులు మనవారివలె మార్పుచేయ సాహసించువారు కారు. సామాన్యజనోపయోగమున వెలయు పదములందెన్నెన్నియో నిరర్థకపదము

లున్నను శబ్దశాస్త్రరీత్యా అనుచితంబులైయున్నను అట్టిపదంబుల నావర్ణముల తోనే వ్రాయుచున్నారు. ఈభాషాసాంప్రదాయ మితరభాషలయందును వర్తించునట్లు మనకుఁ దెలియవచ్చుచున్నది. ఇట్లుండ మాభాషకుమాత్రమే ప్రయత్నపూర్వకములగు మార్పులెందుకు కావలయును ? మృదుమధుర పదలాలిత్యంబు గలదియై వ్యాకరణచ్ఛందోబద్ధనియమములకు లోనై శిష్టాచార సంప్రదాయ సంయుక్తంబై మందారమకరంద బిందుసందోహనిష్యందధారా పరంపరలచే సరసులహృదయం బానందకందళితం బగువిధంబు నొనర్చు పలుకువెలఁదిని తాత్కాలికమాత్రాభూషణముల నలంకరించి సంస్కారనియమ లక్షణములకు వెలియై విచ్చలవిడి విహరించు భాషామతల్లిగ మార్పులఁజేయ నెంచుట సంస్కారశోభిత యై సర్వగుణగరిష్ఠ యై నిరర్ఘాలంకారయై వెలుంగుగృహిణి నసంబద్ధప్రలాపంబుల నాత్మగౌరవం బొకించుకయును బరిగణింపక కపటనాటకభూషావిశేషంబులచే నలరారువారవనితయుంబలె నొనర్ప నుద్యమించిన విధంబు ననుకరించు నని నాయభిప్రాయము. వ్యవహారముల యం దుపయోగింపఁబడునది వ్యావహారికభాషయై యుండిన నుండవచ్చును గాని గ్రంథస్థమగు భాష గ్రాంథికభాషయై పరిణమింపవలయును. గ్రామ్యభాషయును సంకరభాషాప్రయోగము నెప్పటికిని వర్జనీయములే. కాన సాహిత్యపరిషత్తువారుశబ్దసాధుత్వమును నిర్ణయించుప్రామాణ్యగ్రంథమునువ్రాయవలయును.

ఆంధ్రభాషాపోషణ:—ఆంధ్రకళాశాలయం దాంధ్రభాషయే ప్రథమ భాషగను ఆంధ్రమునందే సకలశాస్త్రార్థరహస్యముల నుద్బోధించు గ్రంథముల వ్రాయవలయు ననియు నాంగ్లభాషను ద్వితీయభాషగ నుపయోగింపవలయు ననియుఁ గొన్నిప్రయత్నములు చేయునట్లు గనఁబడుచున్నది. ఈసాహస మెంతవఱకు సఫలంబు గాఁగలదో తెలియకున్నది. దేశచరిత్రము కవిత్వతత్త్వ విమర్శనగ్రంథములును, భౌతికశాస్త్రములు, శిల్ప, వైద్య, గణితశాస్త్రములు మొదలగు సర్వకళాశాలాపఠనీయగ్రంథములును, సారస్వతసర్వస్వములును, శబ్దార్థనిఘంటువులును వెలువడిననేకాని యాంధ్రసారస్వతమునకుఁ బ్రాముఖ్యత గలుగనేరదు.

క్షేత్రప్రాశస్త్యము:—దత్తమండలము దండకారణ్యభూభాగమై యనాగరకస్థితియందు బహుదినము లుండె నని యిదివఱకే చెప్పియుంటిని. అయిన నినకులాంబుధిసోముఁడును, సకలసద్గుణరత్నసంతానమునకు విశ్రాంతిధాముం

ఘుఁడును, దీనజనముద్ధారుఁడును, భక్తజనపోషణదీక్షాదక్షుఁడును, బితృవాక్యపరిపాలనాధురంధరుఁడును సత్యమూర్తియు నగు శ్రీరామచక్రవర్తియు జుమ్మఁజాళి పదయుగళకంజకింజల్క ప్రభాపుంజరంజితంబై యుగయుగంబునకుఁ బరమపావనంబై పరఁగు పంపాక్షేత్రము మాపుణ్యభూమియని చెప్పఁగలము. వాలి సుగ్రీవాంజనేయ జాంబవదాదులగు మహనీయులు శ్రీరామభూపాలుని కైంకర్యమున జన్మసాఫల్యమునొందిన పుణ్యపురుషులు వాసముచేసిన కిష్కింధ పంపాక్షేత్రమున కనతిదూరముననే యున్నది.

ఆధునికకవులు:—ఆధునికయుగంబునఁ గవులు నవలలు నాటకములు వ్రాయ మొదలుపెట్టిరి. వీరిలోఁగొందఱు ప్రస్తుతదేశకాలపాత్ర పరిస్థితుల కనుగుణముగ విదేశభాషయందు రచింపంబడిన నాటకములు కల్పనాచమత్కృతుల నిమిడ్చియు, సంఘసంస్కరణ విషయములఁ బొందుపఱిచియు, నూతనపక్కిని నాటకములు వ్రాయుచున్నారు. వీరిలో నగ్రగణ్యుఁడు మాబలారినగరమునకుఁ జేరినకృష్ణమాచార్యులేయని చెప్పఁగలము. మఱియు విషాదనాటకములను మొట్టమొదటఁ దెనుఁగుభాషయందుఁ బ్రవేశపఱిచి ప్రచురించిన కవిపుంగవుఁ డీఘనుఁడే. అందువలననే వీరి కాంధ్రనాటక కవితాపితామహుండనుబిరుదనామం బన్వర్థంబై విరాజిల్లె. ఇతనికవిత్వమున మధుమధురమునకంటె మధురతగలిగి తేనియలు సోనలై కురియుచుండును. ఇతనిరచనాచమత్కృతియుఁ, బదసౌష్ఠవంబును హావభావవిలాసవిభ్రమంబులును, శృంగారాది రసపోషణయు సమయోచితవర్ణనకౌశలంబును సరళపదలాలిత్యంబును వినువారివీనులకు విందొనర్చుచుండును. మఱియు, కోలాచల మల్లినాథవంశాన్వయ వతంసుఁడును సరసగాంభీర్యౌదార్యగుణంబుల వెలసిన శ్రీనివాస కవివరేణ్యుండు మాపురనివాసియే. ఇతనికవిత్వము క్లిష్టతరపదభూయిష్ఠమై దీర్ఘసమాససంయుక్తమై పామరజనసామాన్యమున కలవడనిదియై పండితజనసాహసప్రయత్నంబులకు సహవాసంబుగలదియై నారికేళపాకంబున రచింపఁబడి యుండును. మఱియొకతఱి నాంధ్రభాషాయోషిద్రత్నమున కెన్ని తెఱఁగుల మెఱుఁగులు గలిగియుండునో యన్నిరంగుల నొప్పారుచు గానవిశారదుని హస్తమున సప్తతంత్రీనిస్వనంబున వెలువడు రాగమాలికలంబలె శ్రవణానంద మగుచు సంపూర్ణపూర్ణిమనాఁటి పండువెన్నెల సందర్శనంబున నుప్పొంగు మహోదధి యుత్తుంగతరంగములవలె నుప్పొంగుచు సరసులహృదయమును జూఱగొనుచు మెమఱ

చి పరవశులగువిధంబునఁ జేయుచుండును. వీరే చారిత్రికనాటకములను మొదటఁ దెనుఁగునఁ బ్రవేశపెట్టినవారని నమ్ముచున్నాను. మాదౌర్భాగ్యవశమున నీయిరువురు కవులును గీర్తికాయులై యంతరించినందున మా ప్రొద్దంత కొంత పడమర దిగెనని శంకాకలితచిత్తులై యుండు సమయమున మేఘచ్ఛన్నంబగు నంబరంబు చెంగటి వెలుఁగుమెఱుఁగు గుదిఁగయుఁ బోలెఁ గవితాంకురములు గనుపట్టుటచేఁ గొంతసంతసము నొందుచున్నారము. ఆంధ్రకాదంబరియను కావ్యమును వేంకటగిరిరాజుల కంకితంబుఁ జేసి కృతార్థతఁగన్న నరసింహశాస్త్రియును బాలకవి సంజీవమూర్తియును గాకినాడయందుఁ గాలము గడపుచున్న పండితసుబ్రహ్మణ్యశాస్త్రియుఁ గృష్ణమాచార్యుల సోదరుండగు గోపాలాచార్యవర్యులును మఱికొందఱు మాదేశమునకుఁ జేరినవారై కబ్బంబుల నబ్బురంబుగఁ జేయుచున్నారు. ఆంధ్రనాటకకళావిశారదుండని సర్కారుజిల్లాలయందు సయితము పారితోషికంబుగఁ బతకంబులఁగొని ప్రఖ్యాతిగాంచిన న్యాయవాదశిఖామణి యగు రాఘవాచార్యులు మావారే యని వేఱుగఁ జెప్పనేల.

ఉపసంహారము:—ఉత్తరజిల్లాలవా రాంధ్రవాగ్వాణి తమయింటిసొమ్మని యూహింతురు కాఁబోలు. అట్టియభిప్రాయము భాషాప్రాచర్యమునకు శ్రేయోదాయకం బనుట నిర్వివాదాంశము. అయిన నాంధ్రభాషాభిమానంబునను మాతృభాషాసేవనంబునను మే మితరులకు వెనుదీయువారము కామని చెప్ప సాహసించుచున్నాను. ఇప్పటికి సుమారు 12 వత్సరములకు మున్ను చతుర్థవర్షప్రాయమునఁ దనఁబసు నడనుడుగులు గలిగి యవ్యక్తమధురసంభాషణంబుల మాపురవాసులకు సంతసంబొదవించి దినదినప్రవర్ధమానంబున షోడశకళాసంపూర్ణయై పురదర్శనం బిచ్చి యానందింపంజేసినందులకు సాహిత్యపరిషత్తునకభివాదనపురస్సరంబులగు వందనంబు లాచరించుచుఁ గార్యక్రమం బుపక్రమింప వేఁడుకొనుచున్నాఁడ. మఱియొకమాఱు మాపురవాసుల పక్షంబున నే నొసంగు స్వాగతంబు నంగీకరించి జయప్రదంబుగ జరుగునట్లు చేయుదు రని ప్రార్థించుచున్నాను.

---

# గ్రంథవిమర్శనపద్ధతి.

— కేతవరపు వేంకటశాస్త్రిగారు —

ఇదివఱకే మనయాలంకారికులు కావ్యములందు గుణదోషములను జర్చించి వివరించియున్నారు. వాని ననుసరించి యీవ్యాసమును రచించితిని. ఇందలి దోషములను బరిహరించి గుణమున్నచోఁ బరిగ్రహింపఁ బ్రార్థితులు.

విమర్శకుఁ డొకకావ్యమందలి గుణదోషములను నిర్ణయించునపుడు తగినంత కారణకలాపమును జూపవలయును. ఒకవేళ గుణపరిశీలనము పట్టున నట్లువర్తించినను దోషనిరూపణము చేయునప్పుడు మాత్రము తగినకారణములను జూపకతీఱదు. ఒకస్వతంత్రగ్రంథమును వ్రాయుట సులభము కాని యొకరిగ్రంథమునందలి గుణదోషములను నిరూపించుట సామాన్యము కాదు. విమర్శకుఁడు నిష్పక్షపాతబుద్ధితో నిరూపించిన గుణదోషపరిశీలనము మాత్రమే విమర్శన మనిపించుకొనును. లేనిచో నది యాశబ్దమునకుఁ దగదు. న్యాయసభయందు న్యాయాధికారివలె వాఙ్మయమునందు విమర్శకుఁడు నిష్పక్షపాతముగా వర్తింపనిచోఁ బెక్కనర్థములు పుట్టక మానవు. కావున నిష్పక్షపాతత్వమే విమర్శకునికిఁ బ్రధానలక్షణ మని యెంచవలయును.

మనము వెనుకటిశతాబ్దములందలి కవులకావ్యములను విమర్శించునప్పు డాకాలమునఁ గవులయుద్దే శ మెట్లుండెనో ప్రజలయాదర మెట్లుండెనో, ప్రభువుల యాశయము లెట్లుండెనో, కృతిపతియభిప్రాయము లెట్లుండెనో మొదలగు నంశములను గూడ మనమునం దుంచుకొనియె కావ్యవిమర్శమునకుఁ బ్రయత్నించుట యుక్తము కాని యీయిరువదవశతాబ్దపువారి యభిరుచులనుబట్టి విమర్శింపరా దని నాయభిప్రాయము. ఏమన, ఆకాలము వేఱు. ఇప్పటికాలము వేఱు. వారియూహలు, కల్పనలు, రీతులు, రుచులు, వేఱు. ఇప్పటివారివి వేఱు. కావున నప్పటికవులకావ్యము లందలి వర్ణనలు, రీతులు, మొదలగునవి యిప్పటివారిహృదయములకు వెగటనిపించినచో నది పూర్వకవుల లోపముగా నెన్నరాదు. ఇందుముం దిట్టిప్రజలు పుట్టుదు రని యాకవులకుఁ దెలియదు గదా ?

ముందుగాఁ దాము విమర్శింపఁదలఁచిన గ్రంథము ననేకపర్యాయములు విమర్శనదృష్టితోఁ జదువవలెను. చక్కఁగా నర్థముచేసికొనవలెను. మొదట నాకావ్యము స్వతంత్రగ్రంథమా? పరివర్తితమా? పరివర్తిత మైనచో దాని కిమూలగ్రంథ మేది? మూలమున కిది సరియైన పరివర్తనమా? లేక కథాంశము మాత్రము చేకొని తనబుద్ధికిఁ దోఁచినమాదిరిని కవి రచించెనా? ఆకథాంశమునైనను నున్న దున్నట్లుగానే వర్ణించెనా? లేక యేమయినను మార్పుల నొనరించెనా? ఒనరించిన మార్పులు మూలకథకుఁ బోషకములుగా నున్నవా? లేక భంజకములుగా నున్నవా?" యను నంశములు ముందు చర్చింపవలయును. పిమ్మటఁ గావ్యమునందలి పాత్రములను విమర్శింపవలెను. తరువాత శృంగారాదిరసములను బరిశీలింపవలెను. రసపోషకములు గుణములును, రసభంజకములు దోషములును గాన యవి కావ్యమునం దెచ్చటెచ్చట నున్నవో పరిశీలింపవలెను. పిదపఁ గవితాపాకము, శైలి, వర్ణనములు, మొదలగు నంశములు గమనింపవలయును. ఈవిధముగా నొకకావ్యమునందలి గుణదోషములను బాగుగాఁ జర్చించి గుణదోషతారతమ్యమును బట్టియే కావ్య ముత్తమమో, మధ్యమమో, యధమమో నిర్ణయింపవలయును ఈవిధముగా నొకకావ్యమును విమర్శింప యత్నించెదను.

ఆంధ్రభాషలో సుప్రసిద్ధ మగు మనుచరిత్రమును పెక్కురు పండితులు విమర్శించిరి. కొందఱు దానికి నున్నతస్థానము నిచ్చిరి. కొందఱు దాని కధమస్థానము నొసంగిరి. నేను నామనుచరిత్రమునే నాబుద్ధికొలఁది విమర్శించి పైని జెప్పిన లక్షణములను నవకాశ మున్నంతవఱకు సమన్వయించెదను. ఈసందర్భమున నిదివఱకు మనుచరిత్రమును విమర్శించిన విమర్శకుల నామములను వారియభిప్రాయములను జేర్కొనవలసి యుండును. అట్లయినఁ గాని యెవరియభిప్రాయము లెట్టివో చదువరులకు స్పష్టముగాఁ దెలియవు. కావునఁ దమనామములను జేర్కొన్నంతమాత్రమున నవి తమకుఁ దిరస్కారముగా భావింపవల దని విమర్శకులను బ్రార్థించెదను.

మనుచరిత్ర:—ఇది పెద్దనకవి విరచితము. ఇందలి కథాంశము మార్కండేయపురాణాంతర్గతము. అయినను నిది కేవలము మూలమునకుఁ బరివర్తనము కాదు. కథాంశమునందుఁ గాకున్నను, వర్ణనాదులం దిది స్వతంత్రగ్రంథ మననొప్పును. కథాంశమునందుఁ గూడఁ బెద్దన కొన్ని చిన్నమార్పులు

గాళించెను. అవి మూలమునకుఁ బోషకములు గా నున్నవో భంజకములుగా నున్నవో పరిశీలింతము. అవి యేవనఁగా, 1. సిద్ధుఁడు కుతపకాలమున వచ్చె నని కాలనిరూపణము చేయుట. 2. వేఁట. 3. మనోరమవివాహము కొండ దండను గాక యిందీవరాక్షుని పురమున నొనర్చుట. 4. మనోరమ తనసఖుల దురవస్థ మాన్పు మని వివాహమునకు ముందుగానే స్వరోచిని గోరినట్లు మూలమున నుండఁగా నది వివాహానంతరమునఁ బతితోఁ గలియుసందర్భము నఁ జెప్పుట. ఇంకను జిన్నమార్పు లేవేని యుండవచ్చును. ఇట్టిమార్పులు కథను బోషించుటకే గ్రంథకర్త కావించియుండును. ఆయంశము ముందు చర్చింతము. ఇందు రామాయణాదికావ్యములందువలె వస్తువున కేకత్వము లేదు. అందుచే నాయికానాయకులు వీరే యని నిర్ణయింప వీలులేదు. అంత మాత్రమునఁ గథ రసహీనమైన దని చెప్పలేము. రఘువంశాదికావ్యములం దు వస్తువున కేకత్వము లేనంతమాత్రమున నవి రసహీనము లయినవా? మఱియుఁ బెద్దన వేఱువేఱుగా నున్నకథాంశముల నొక్కగ్రంథముగఁ గూర్చి తనకవితాచాతుర్యమహిమచే నెడనెడను రస ముప్పతిలునట్లు వర్ణించి పండిత తల్లజుల యుల్లములకు వచ్చునట్లు చేసినాఁ డని నాయభిప్రాయము.

మనుచరిత్రమందలి కథాంశములను జర్చించుచు "పెద్దన కుతపకాలా నంతరమున మధ్యాహ్నమును వర్ణించి మూలకథను సందర్భవిరహితమునుగాఁ జెప్పి పాడుచేసె నని కొందఱు వ్రాసిరి. అట్లు చేయలే" దని కొందఱు వ్రాసిరి. ఇటఁ బాఠితులకు భిన్నాభిప్రాయములు కల్గినవి. వారు వారు తమ తమ యభిప్రాయములకుఁ గారణములను జూపిరి. అవి చదువరులకు విదితములయి యుండనోపును. ఈవిషయమున నాయభిప్రాయ మిది:—

"అతిథిసత్కారార్హ మగుకాలవిశేషమును దెల్పుటకై పెద్దనకవి మూలములో లేనికుతపకాలమును వర్ణించినాఁడు. కుతపకాలానంతరమున మధ్యా హ్నమును వర్ణించుట విరుద్ధముకాదా" యని యడుగవచ్చును. ఆమధ్యాహ్న వర్ణన మానాఁటిదే యైనచో విరుద్ధము కావచ్చును. కాని పెద్దనకవి యట్లు వక్కాణింపలేదు. అతఁడు, ప్రవరుఁడు హిమాలయమున కరుగుట సిద్ధుఁడు వచ్చిననాఁడే యని కాని మఱునాఁ డని కాని కంఠోక్తిగాఁ జెప్పలేదు. అయిన నాయంశము పూర్వాపరవర్ణనములవలన ద్యోతితము కాకపోలేదు. పెద్దన కుతపకాల మని వర్ణించుటచే నాఁటికి మధ్యాహ్న మతిక్రమించియే యుండె

ను. నాఁటికి మధ్యాహ్నము మరల రానేరదు కదా? కాన, హిమాలయమునఁ బ్రవరుఁ డొనర్చిన మధ్యాహ్నవర్ణనము మఱునాఁటిదే కాని తొలినాఁటిది కాదు. అట్లయినఁ బెద్దనకవి మూలమునందువలె సిద్ధుఁడు మందిచ్చి వెళ్లెనని చెప్పక యతనిపాదములకుఁ బూసి వెళ్ళె నని చెప్పెను గదా! ఆమందెప్పుడుపూసెను? సిద్ధుఁడు వచ్చిననాఁడే యందుమా నైష్ఠికుఁడగుప్రవరుఁడు పాదప్రక్షాళనాదిక మొనర్పకుండ నెట్లుండఁగలఁడు? అట్లొనర్చిన పాదలేపముకరఁగి పోవునుగదా? కాన మఱునాఁడని చెప్పవలెను. మఱునాఁడయిన నెప్పుడు పూసియుండు ననియందు రేని వినుఁడు. సిద్ధుఁడు నైష్ఠికుఁడు కాన కుతపకాలమున వచ్చినపిమ్మట మఱికొంచెముకాలము స్నానాదులవిషయమై పట్టును. తరువాత మఱికొంతసేపు భోజనమునకుఁ బట్టును. పిమ్మట వారు కూర్చుండి ప్రసంగమునకు దొరఁకొనిరి. మొదట వారు పరస్పరోత్కర్షముల నుతించుకొనిరి. పిమ్మటఁ బ్రవరుఁడు దేశగిరితీర్థద్వీపపుణ్యాశ్రమసముద్రాదులను గుఱించి యడిగెను. వానిని సిద్ధుఁడు తనవాక్చాతుర్యముచే వర్ణించి చెప్పెను. మనుచరిత్రమందలి యచ్చటిఘట్టము చదివినచో వారు దీర్ఘప్రసంగము సలిపినట్లు తోఁచును గాని కొన్నిమాటలాడి విరమించినట్లు తోఁపదు. కావున వా రది ప్రసంగించుచుండఁగనే సాయంకాలము కావచ్చును. నైష్ఠికు లగువా రిరువురును గాలకృత్యములను దీర్చుకొని మరలఁ బ్రసంగింప మొదలిడవచ్చును. పరస్పరయోగ్యతలం దధికాదరమును గలసిద్ధుఁడును బ్రవరుఁడును తీర్థాదిమహిమలను జెప్పుటకును, వినుటకును, నత్యుత్సుకులై యుండురనుటకు సందియముండదు గదా? కావున వారలీప్రసంగముతో రాత్రిగూడఁ గొంతవఱకుఁ గడపియుండవచ్చును. ఈదీర్ఘప్రసంగములవలన మిక్కిలి పరిచితుఁడగు సిద్ధునిఁ బ్రవరుఁడు పాదలేప మడిగియుండును. మఱునాఁడు సిద్ధుఁడు వెడలునప్పుడు ప్రవరునిపాదములకు లేపమును బూసి వెడలవచ్చును. ఇట్లూహించుటకవకాశ మున్నదికదా? కవి ప్రవరునిఁ బరమనైష్ఠికునిగా వర్ణించెను. సిద్ధుఁడు కుతపకాలమున వచ్చినట్లు వర్ణించెను. హిమాలయమున ప్రవరునిచే మధ్యాహ్నవర్ణనమును జేయించెను. ఈయంశము లాలోచింపఁగా సిద్ధుఁడు వచ్చిననాఁడు మరల మధ్యాహ్న మగుట యసంభవ మగుటచేతను, ప్రవరుఁడు కర్మవిముఖుఁ డగుట యసంభవ మగుటచేతను, సిద్ధుఁడు వచ్చిన మఱునాఁడే ప్రవరుఁడు కాల్యకృత్యములఁ దీర్చుకొని మందును దనపాదములకుఁ

బూయించుకొని హిమాలయమున కరిగె నని చెప్పవచ్చును గదా? గ్రంథమునఁ జదువరు లూహించుకొనఁదగిన యంశములు పెక్కు లుండును గదా. మఱియు నుత్తరకథాసందర్భమును బరిశీలించినను బ్రవరుఁడు సిద్ధుఁడు వచ్చిన నాఁడే హిమాలయమున కరిగె నని చెప్ప వీలులేదు. ఏమనఁగాఁ గుతపకాలమున వచ్చిన సిద్ధున కతిథిసత్కారము సల్పి ప్రసంగించి పాదలేపమును బూయించుకొని ప్రవరుఁ డానాఁడే హిమాలయమునకు వెళ్ళె నని యందుమేని యప్పటికే చాలకాల మతిక్రమించి యుండుటచే మిగిలిన స్వల్పకాలములోఁ బ్రవరుఁడు హిమాలయమందలి వింతలను జూచుటయును వరూథినిని జూచుటయును నామెతోఁ బ్రసంగించుటయును బ్రవరుఁ డామెను ధిక్కరించుటయును తరువాత నగ్నిప్రభావంబున నతఁ డిలుచేరుటయును బిమ్మట వరూథిని యతనిగుఱించి వనమంతయు వెదకి వేసారి తనగృహము చేరుటయుఁ, బ్రవరుని గుఱించి విలపించుటయు, నిన్నికృత్యములు జరుగ నవకాశములేదు. పెద్దనకవి యీకథాంశము లన్నియు ముగిసిన పిమ్మట సూర్యాస్తమయమును వర్ణించెను. ఈసూర్యాస్తమయవర్ణనము మఱునాఁటి దని చెప్పినప్పుడే యిన్నికథాంశములు వర్తిల్లుట కవకాశముండును గాని సిద్ధుఁడు వచ్చిననాఁటిదే యనిన నందుల కవకాశ మెక్కడ? ఈకారణములచేఁ గథయందుఁ బూర్వాపరవిరోధము లేదని నాయభిప్రాయము. కావున నతిథిసత్కారార్హసమయనిరూపణమునకై పెద్దనమూలములోలేని కుతపకాలమును వర్ణించి కథ కుత్కర్షమును గల్గించె నని నాకుఁ దోఁచుచున్నది.

రెండవమార్పు వేఁట:—మూలములో స్వారోచి మందరాద్రితటమున విహరించుచున్నసమయమున నార్తురా లగుమనోరమ వచ్చి వేఁడుటయును స్వారోచి రాక్షసునిఁ జంపి యామెను గాపాడినట్లును గలదు. ఆభాగమునఁ బెద్దనకవి మందరాద్రితటమున నున్నస్వారోచిని సమీపించి యాటవికులు మృగములబాధ విన్నవించి యతని కాఖేటోత్సాహము గల్గించినట్లును స్వారోచి దుష్టమృగసంహారము చేసి వేఁట ముగించుసమయమున నార్తురా లగుమనోరమ శరణుసొచ్చి నట్లును మార్చెను. పెద్దనకాలమునందు రాజులును సేనానులును దక్కఁగలవారును యుద్ధాదులం దాఱితేఱినవీరులు. వారికి వేఁటయం దధికాదరము గల్గుట సహజము. కృతిపతి యగుకృష్ణరాయఁడు వీరాధివీరుఁడు. ఇట్టివారల ప్రోత్సాహముచేఁ గథయందు వేఁటవృత్తాంతమును బెద్దన కల్పిఁ

చియుంచును. పురాణాంతర్గత మగుకథను తనకాలపు వారగువీరుల కుత్సాహజనకముగా మార్చి వ్రాయుట యెంతయును సమంజసము కదా? ఈమార్పువలనఁ గథానాయకుఁ డగుస్వారోచి బాహువీర్యము, ధైర్యము, ధనుర్విద్యాచాతుర్యము మొదలగు వీరగుణములు వెల్లడియగుచున్నవి. కాన నిది స్వారోచిపాత్రను బోషించుటయే కాక కథాంశమునకుఁ గూడఁ బోషకమై మనోహరమై యున్నది.

మూఁడవమార్పు :—విభావసీకళావతుల శాపవిముక్తికి సంబంధించినది. ఈయంశము మూలములో శాపవిముక్తుఁ డయిన యిందీవరాక్షుఁడు తన కూఁతు రగుమనోరమను స్వారోచి కీయ దలంచి యుండఁగా నప్పుడు మనోరమ తనచెలియలకు శాపవిముక్తి యైనఁ గాని తాను తనని పెండ్లియాడి సౌఖ్యము లెట్లనుభవింతు నని పల్కెను. అది విని స్వారోచి యిందీవరాక్షుఁడు తన కిచ్చిన యాయుర్వేదబలంబున నామెచెలులల దుర్దశ తొలఁగింతు ననియె. మనోరమ స్వారోచిని బెండ్లాడ నిష్టపడెను. ఇందీవరాక్షుఁడు స్వారోచికి మనోరమ నిచ్చి వివాహము గావించి వెడలెను. అనంతరము మనోరమతో స్వారోచి వనమున కరిగి విభావసీకళావతులకు శాపవిముక్తి గల్గించి వారినిం గూడఁ బెండ్లియాడెను. ఇట్లున్నకథను బెద్దనకవి మనోరమ దనసఖీశాపవృత్తాంతమును వివాహమునకుఁ బూర్వమునఁ జెప్పక వివాహానంతరమున శయ్యనాగారమునం దున్నపతిసన్నిధికిఁ దన్నుఁబంపినప్పుడు చెప్పెను. మఱియు నిందీవరాక్షుఁడు తనకూఁతున కాకొండదండనే వివాహముచేసి తనపురికి వెడలినట్లు మూలములో నుండఁగా నీమనుచరిత్రమునందు శాపవిముక్తుఁ డగునిందీవరాక్షుఁడు తన వృత్తాంతము విని తన్ను మన్నింపవచ్చిన ప్రజలతోను స్వారోచితోను దననగరమున కరిగి తనకూతున కక్కడనే పెండ్లి చేసినట్లు మార్చెను. ఈమార్పులు రెండును మూలకథ కంటెఁ బ్రబంధకథ కెన్నోమడుంగుల యుత్కృష్టమును గల్గించె నని నాయభిప్రాయము. అందు గంధర్వరాజయిన యిందీవరాక్షుఁడు నిరుపేదవలె నడవిలోఁ దనకూఁతునకు వివాహముచేసె ననుటకంటెఁ దననగరంబున మహావైభవముతో వివాహ మొనర్చె ననుట యెంతయు సమంజసమని సులభగ్రాహ్యంబు. ఇఁక రెండవయంశ మాలోచింతము.

ఇందీవరాక్షుఁడు తన కుపకారియగు స్వారోచి కాయుర్వేదవిద్య నొసంగి తనకూఁతు రగుమనోరమను బెండ్లియాడు మనెను. అప్పుడు మనోరమ

తండ్రితోఁ గాంబోపుభర్త చెంత నుండఁగనే "నామన స్సుపకారి యగు నితని యం దనురక్త మైనను నాచెలులకు శాపవిముక్తి యగునంతవఱకు నితనితో మనసిజసౌఖ్యములఁ బొందఁజాల" నని చెప్పినట్లు మార్కండేయమున నున్నది. కాని యిది యంతసరసముగా నున్నట్లు తోఁపదు. కాంబోపుభర్త చెంత నుండఁగాఁ దనతండ్రితో నీరీతిగాఁ బల్కుటచే మనోరమ తాఁగతనము వెల్లడి యగుచున్నది. మఱియు నిది కేవలము కన్యాజనస్వభావమునకు విరుద్ధము. పతి చెంతఁ బెండ్లికూఁతు రంతప్రౌఢత్వము చూపెననుట యౌచిత్యమునకుఁ గూడ భంగము కల్గకమానదు. తండ్రితో మాటాడ నేమి యనఁ బతి చెంత నున్నపుడు కన్యక లందులకును మొనయలేరు. కన్యక సౌఖ్యము లనుభవింప లేనని తండ్రితోఁ జెప్పుట మఱియు నీచముగాఁ గానవచ్చుచున్నది. పెద్దన యీవిషయ మాలోచించియే మూలకథను మార్చి యేకాంతమున నున్నపుడు మనోరమచే భర్తకుఁ జెప్పించెను. నవోఢ యగుమనోరమ కప్పుడు మఱింత సిగ్గుగా నుండునేమో యని యందురేని యది సత్యము కావచ్చును. కనుకనే భర్త తన్నుఁ గౌఁగిలించుకొని బుజ్జగించి తరిచి తరిచి యడిగినను మాటాడనేరక స్త్రీస్వభావంబునఁ గన్నీరు విడుచుచుఁ బతిచే మఱిమఱి యడిగించుకొని తన కోర్కి చెప్పెను. ఎట్టినవోఢ యైనను నేకాంతమునఁ బతి తన్నంతగా వేడుకతో నడుగుచున్నపుడు తనకోర్కి చెప్పకపోదు. మఱియుఁ దనకోర్కి చెప్పుకొన సమయమున కెదురుచూచు మనోరమ యప్పుడు సంకోచించునా? కావున నీమార్పు మిక్కిలి యుచితముగా నున్నట్లు నాకుఁ బొడకట్టుచున్నది.

బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు దుష్కృతిసంహరణ మను నాంధ్రపరిషత్పత్రికలో దశమసంపుటమున నీవిషయమును విమర్శించుచు "వివాహమహోత్సవములందుఁ గులుకుచుండినప్పుడు మనోరమకుఁ జెలులు జ్ఞప్తికి రాక గర్భాధానపుగదిలో భర్తసన్నిధియం దున్నపుడా చెలులు జ్ఞప్తికి వచ్చుట! కేళీభవనములోఁ గోర్కు లువ్విళులూరఁ దనపతి తన్నుఁ గౌఁగిలింప గమకించునప్పుడా చెలులదుఃఖములు స్మృతిపథమునకు వచ్చుట! సురతక్రీడకు మగవాఁడు వచ్చినపుడు దాని సదనుగాఁ జేసికొని తమయభీష్టములు దీర్పించుకొనఁ బ్రయత్నించువారు వెలయాండ్రు కాని పతివ్రతలు కారు, కావునఁ బెద్దన చేసినయీ మార్పు మిక్కిలి యనుచితముగా నున్న"దని యాక్షేపించినారు. కాని యీ యాక్షేపము సరిగా దని నాతలంపు. సమయము కల్పించి పనులు నెఱవేర్పిం

చుకొనుట వెలయాండ్రకే కాక సర్వస్త్రీలకుఁ గూడ నైజమే. స్వారోచి ప్రభువు. అతఁ డాయుర్వేదమును బడసినవాఁడు, కాన తనచెలుల రోగములను బాప సమర్థుఁ డని మనోరమ యెఱుఁగును. అట్టివాఁడు సంతుష్టచిత్తుఁడై యున్నసమయ మెఱింగి తనకోర్కెను దెల్పి నెఱవేర్పించుకొనుట సమంజసముకదా ? సామాన్యముగా యౌవనవంతుఁ డగుపురుషునికి యువతీప్రథమసంగమము కంటె నధికసంతోషసమయ ముండదుగదా ? తాదృశసంతోషావస్థయం దున్నపు డెట్టివాఁడును బ్రియురాలికోర్కెఁ దీర్పక మానఁగలఁడా ? కార్యార్థులు అట్టిసమయమునకు వేచియుండుట సహజముకదా ? సంభోగావస్థకంటెఁ బురుషునికి మఱిసంతోషావస్థలు లేవా యనియందు రేని యుండవచ్చును. ఏమైనను నిదిసంతోషావస్థ కా దనలేము కదా ! తనతండ్రిశాపవిమోచన మైనపిమ్మట స్వారోచితో సంభాషించుటకు మనోరమకప్పుడే సమయము లభించినది. ఏమనగాఁ బతిసన్నిధిని దండ్రితో మాటాడ సిగ్గుపడియుండు నని యిదివఱకే చెప్పితిని. పిమ్మట నిందీవరాక్షుఁడు తనకూఁతుతోను స్వారోచితోను దననగరమునకేగి వేఱొకసౌధంబున స్వారోచిని విడియించెను. అప్పుడు తనకోర్కెని స్వారోచికిఁ దెలుపనవకాశము లేదుగదా ? పిమ్మట వివాహ మారంభ మైనది. మంగళస్నానము లప్పుడు గాని పెండ్లిపీఁటపైఁ గూర్చున్నప్పుడు గాని తలఁబ్రాలు పోయుసమయమునఁ గాని హోమాదు లొనర్చునప్పుడు కాని మనోరమ కవకాశ మేది ? మఱియెప్పుడు తనయభిమతమును బతికి విన్నవించుట ! శయనాగారమందు మాత్రమే యట్టిసమయము లభించినది. అప్పుడును సిగ్గువడియుఁ గ్రమముగా స్వారోచి చేయునుపలాలనములవలన దిటవుదెచ్చుకొని పతికిఁ దన యిష్టము నెఱింగించినది. ఇది యెంతయుఁ గన్యాస్వభావమున కనుకూలముగా నున్నది. మారన సంస్కృతమున నున్నదున్నట్లుగా వర్ణించి మనోరమను బాఁగనుజేసెను. పిమ్మట రెండుశతాబ్దములతరువాతివాఁ డగుపెద్దన యుచితతమాలోచించి కథను మార్చి మనోరమను ద్రపావతి యనుకన్యకనుగా వర్ణించి యున్నాఁడు. వివాహభోగము లనుభవించినప్పుడు మనోరమకుఁ జెలుల దుఃఖములు జ్ఞప్తికి రాలే దే మని శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగా రాక్షేపించినారు. కానీ యప్పుడు మాత్రము మనోరమకు మనోదుఃఖము లే దని యెట్లు చెప్పఁగలరు ? మజ్జనములు మంచిగందపుఁబూఁతలు తూర్యనాదములు వివాహవిధులగు తలఁబ్రాలు మొదలగునవియుఁ జేయుచున్నంతమాత్రమున నామెకు మన

మందు దుఃఖము లేదనఁగలమా? దుఃఖము మనోగతము. ఇవి బాహ్యములు. బాహ్యవ్యాపారములనుబట్టి మనోవృత్తిని నిర్ణయింపలేము. ఆయుర్వేద మెఱింగిన స్వారోచిచేఁ దనయభిమతమును దీర్చుకొన నెంచియే మనోరమ వివాహమున కంగీకరించినది. వైవాహికవిధు లన్నియుఁ బత్నితో నెఱవేర్చినది. పతి తన్ను సమీపించినప్పుడు తనమనోదుఃఖ మెఱింగించినది. స్వారోచి యుత్తమనాయకుఁడును ధీరోదాత్తుఁడును గాన తనమనంబునఁ బొంగి పొరలు ననురాగంబు నరికట్టి తనవలె నత్యంతసంతుష్టురాలు కానియువతితోఁ గలియుట యనుచిత మని భావించి స్వారోచి యామెచెలియల రోగములు వాపి పిమ్మట సంతుష్ట యగుమనోరమతో సుఖించె. ఇట్లు చెప్పుటవలన మనోరమ స్వారోచులపాత్రముల కెంతయో యుత్కర్షము గల్గుచుండ శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారు పైవిధమున నెట్లు వ్రాసిరో తెలియకున్నది. మఱియు శ్రీ శాస్త్రిగా రెంతయు బాగుగా నున్నదని పొగడిన మారనగ్రంథమందుఁగూడ మనోరమ వివాహము సఖీశాపవిముక్తికిఁ బూర్వమందే యయ్యెను. పెద్దనవలె వైవాహిక విధులను మారన వర్ణింపకపోయినను వివాహము వర్ణించెను గాన తద్విధులును వర్ణింపఁబడినట్లె యగును గదా? మూలగ్రంథమందలి మనోరమ సఖులకు శాపవిముక్తి కాకుండ నెట్లు వివాహభోగము లనుభవింపఁగల్గెను? కావున మనుచరిత్రయందు శాస్త్రిగారు చూపినదోషము మూలగ్రంథమునఁ గూడ లేకపోలేదు. అందువలన నాలోచించినను పెద్దన చేసిన మార్పు సముచిత మని తేలుచున్నది.

శ్రీ శాస్త్రిగారు మనుచరిత్రకథకుఁ గలి యనుగంధర్వునికథ సరిగా నతుకలే దనిరి. మూలములో గంధర్వునిపేరు చెప్పఁగా నిం దాతనిపే రేల చెప్పలేదని వారి యాక్షేపణము. కాని యిందువలన గంధర్వకథ యతుకకపోవునా? చదువరులు సులభముగాఁ గథను దెలిసికొనుటకుఁ గదా గ్రంథములందు నామవ్యవహారము. మఱియు నేకజాతివారు పెక్కు రున్నప్పుడు నామములవలన నెవ్వ రేది చేసెనదియుఁ దెలిసికొన వీలగును. పెద్దనార్యుఁడు "ఏగంధర్వుఁ" డను పద్యముచేఁ బూర్వ మేగంధర్వుఁడు వరూథినిని మోహించి యామెచేఁ దిరస్కృతుఁ డయ్యెనో యాగంధర్వకుమారుఁ డని యెత్తికొనుటచే గంధర్వుని వృత్తాంత మంతయు ద్యోతిత మగుచునే యుండెను. మూల గ్రంథములో "చేడియ విరహాతుర యై తిరుగుచుండఁ దొల్లి యకామినిం

గామించి దానిచే నిరాకృతుండైనవాఁడు కలి యనునొక్క-గంధర్వుం డ"ని చెప్పఁబడియె. ఆవృత్తము "ఏగంధర్వుఁ" డను పద్యమందలి యచ్ఛభ్రతచ్ఛబ్ద ములచే స్పష్ట మగుచునే యుండెను. ఆగంధర్వునిపేరు మాత్రము చెప్పలేదు. అంతమాత్రమున గంధర్వుని కథ మూలకథ కతుకకపోవుట యెట్లు? ఆగంధ ర్వుని చరిత్ర మైనను ద్వితీయాశ్వాసములోఁ గడపటిభాగమునఁ గొన్నిపద్య ములందు మాత్రమే కలదు. అందు గంధర్వుఁడు, వియచ్చరుఁడు, ఖేచరుఁడు, మొదలగు పదములను వాడి పెద్దన కలిపేరు చెప్పుట మానివైచెను. అది యంత ప్రధానాంశము కాదని మానివేయవచ్చును. అంతమాత్రమునఁ గథ కొకలోపము కల్గునా?

మనుచరిత్రకథ నీతిదాయకమా! లేక దుర్నీతిదాయకమా! ఈవిష యమున విమర్శకుల యభిప్రాయములను దెలిపి పిమ్మట నాయభిప్రాయమును దెలిపెదను. విమర్శకాగ్రగణ్యు లగు శ్రీబ్రహ్మయశాస్త్రిగారీవిషయము నెత్తి కొని యిట్లు వ్రాసిరి. వారివిమర్శనమందలి సారాంశము.

"పెద్దన జారత్వము సర్వవిధముల నుచితమే యని సాధింపఁ బ్రయ త్నించినాఁడు. ఇది పెద్దన పెద్దతప్పు. "వెలిపెట్టిరే బాడబు" లనుపద్యమునఁ దనయాశయములను వెల్లడించెను. అంకుతనమును సాధించుటకై పురాణము లనుండి యుదాహరణములను దండోపతండములుగాఁ దీసికొని వచ్చినవారికిఁ బెద్దన మార్గదర్శి. దుర్నీతివిషయమున నీగ్రంథము తారాశశాంకవిజయము కంటెను నీచగ్రంథము. నీతివిషయమునఁ బెద్దనకంటె వేంకటపతియే మేలు. అతండు తారను "ఒంటిగవచ్చెఁ జంద్రుఁ" డను పద్యమున "తుంటరిగుబ్బలాఁ డి" యనియు, "విగలోరువివేకపాకయై" యనియు నిందించినాఁడు. పెద్దన యామాత్రపు నీతులనైనను దెల్పలేదు. కావున మనుచరిత్రకథ సర్వవిధముల దుర్నీతి దాయకము".

పైవిధమున శ్రీబ్రహ్మయశాస్త్రిగారు గాక సామాన్యులు వ్రాసిన నా కంతవిచారము లేకపోవును. కాని సంస్కృతాంధ్రములఁ బ్రామాణికు లగు శ్రీశాస్త్రిగా రిట్లువ్రాయుట మిగుల విచారహేతు వయ్యెను. మిడిమిడిజ్ఞాన ము గల నవనాగరకుల యుపదేశములు విని ప్రభుత్వమువారు విదేశీయుల దాడులవలన నశింపఁగా మిగిలిన యాంధ్రసారస్వతమునకుఁ బ్రధానము లగు ప్రబంధములు శృంగారరసభూయిష్ఠము లని కొన్నింటిని నశింపఁజేయ నుద్య

మించు నిక్కాలమున వా రిట్లు వ్రాయుట మిక్కిలి ప్రమాదకర మని నాతలంపు. అది య ట్లుండనిండు. మనుచరిత్రకథ తారాశశాంకకథవంటి దెన్నఁటికిని గానేరదు. మఱియు మనుచరిత్రకథయం దెచ్చటను ఱంకుతనము లే దనియే నాయభిప్రాయము. ఱంకుతనము, జారత్వము, మొదలగు శబ్దములను, దనభర్తను విడిచి వేఱొకపురుషునితో నొకస్త్రీ సంగమించినపుడును, లేక తనభార్యను విడిచి పురుషుఁడు వేఱొకనిభార్యతోఁ గూడినపుడును, మాత్రమే వాడుచున్నాము. అంతియే కాని యొకవేశ్య యొకపురుషునితోఁ గూడిన ఱంకనిపించుకొనునా ? తారాశశాంకవిజయమున నిట్లు కాదే ? అక్కడఁ దార చంద్రునియందు మోహము గల్గి భర్త దూరదేశగతుఁ డగుటకు సంతసించి తప్పి చరించినది. అది వాస్తవముగాఁ ఱంకగును. దుర్నీతి కావచ్చును. కాని మనుచరిత్రమునం దట్టిదేది ? తారతో వరూధినిని బోల్తమా ? తార మగనాలు. వరూధిని యట్టిదికాదు. తక్కిన మనోరమాదులకును దారకును బోలికయే లేదు. మఱియె ట్టికథ దుర్నీతిదాయక మయ్యెను ? వరూధిని బ్రవరుని మోహించి మోహింపఁజేయుట దుర్నీతిదాయకము కాదా యందురేని కాదు. వరూధిని యచ్చర. దానికిఁ బరమసుందరుఁ డగు ప్రవరునియందు వలపుగల్గినది. ఏకపత్నీవ్రతస్థుఁడు నైష్ఠికుఁడు నగు ప్రవరునికి వలపు జనింపలేదు. తనయందు వలపుజనింపలే దని తెలిసికొని వరూధిని యతనిమనము త్రిప్పుటకై పురాణగాథల నుదాహరించినది; యెన్నియో యుక్తులు చెప్పినది; తనమాటల చమత్కారము చూపినది. ప్రవరుఁ డామెకుఁ దగినసమాధానము లిచ్చియున్నాఁడు. ఇఁకఁ దనసరసాలాపములు పనికిరా వని బలిమిని గౌఁగిలించి వానిని మోహింపఁజేయఁజూచినది. కాని మహాధీరుఁ డగు ప్రవరుఁడు కొంచెమేనియుఁ జలింపక పైఁబడినయువతిని ద్రోసివైచి తననిర్మలప్రవర్తనమును గాపాడికొనియె. వరూధినీప్రవరులకు జరిగినచర్య యిదియే. ఇందు నీతిబాహ్యమైనదేది ? ఇందు ఱంకుతన మేమున్నది ? వేశ్యయగువరూధిని యొకపురుషు నభిలషించుట తప్పగునా ? పురుషాభిలాషము గలవేశ్యచే నట్టిమాటలనే పల్కింపవలయును గాని పరమపతివ్రత పల్కఁదగిన మాటలను బల్కించుట యర్హ మగునా ? ఒకవేళఁ బెద్దన ప్రవరుఁడు వరూధినిమాయలోఁ బడినట్లు వర్ణించి యతనిసత్ప్రవర్తనమునకుఁ గళంకమును గల్పించినచో నది తప్పయినఁ గావచ్చును. అప్పు డొకవేళ దుర్నీతియైనఁ గావచ్చును. కాని మనుచరిత్రకథ

యట్లు ప్రవర్తిల్ల లేదే? తారాశశాంకకథవలె నిది మఱెట్లు దుర్నీతిదాయకమయ్యెను? లేక వరూథినీమాయాప్రవరులచరిత్రమువలనఁ నట్టిదుర్నీతి వెలువడుచున్న దందురా? అదియు ను సరి కాదు. వరూథినీమాయాప్రవరులకును దారాశశాంకులకును బోలికయే లేదు. తార మగనా లగుటచే నామె చంద్రునిఁ గవగూడుట అం కనిపించుకొనును. ఇట వరూథిని వేశ్య. కాముకి, కలి యొకకాముకుఁడు. ఎట్లయిన నేమి? వారికి సంగమము గల్గినది. వారలు కేవలము దృఢానురాగము గలదంపతులవలెనే ప్రవర్తించిరి. కాని యి చు కేనియు విపరీతవర్తనలు కాలేదు. ఇటఁ గలి చేసినపని మంచిదా? చెడ్డదా? యనునంశము వేఱొకచో విమర్శించెదను. ఆలోచింప వీరల చరిత్రమువలన లోకమునకు దుర్నీతి పొడమలే దని స్పష్టముగాఁ జెప్పఁగలను. దుర్నీతిదాయకములగుపురాణగాథలను బెద్దన యుదాహరించె నన్నయపవాద మతనిపై మోపిరి. ఆలోచింప నాపురాణగాథలలో మాత్రము దుర్నీతి యెచ్చట నున్నది? సత్యవతీపరాశరులకును, మేనకావిశ్వామిత్రులకును, అప్సరోమాండకర్ణులకును గలసంబంధము తారాశశాంకుల సంబంధమువలె నీతిబాహ్యము కాదు. అట్లయిన స్త్రీపురుషసంబంధమె నీతిబాహ్యమనవలసియుండును. ఇఁక నహల్యాసంక్రందనుల వర్తనము నీతిబాహ్యము కావచ్చును. కాని యది గూడఁ దారాశశాంకులచరిత్రమువంటిది కాలేదు. దుర్నీతినాచరించినందుల కహల్యాసంక్రందనులు శాపహతులై దుష్ఫల మనుభవించిరి. కావున నది దుర్నీతిపరులు దుష్ఫల మనుభవింతురు, కాన యట్లు చరింపఁగూడ దని లోకమునకు నీతినే బోధించుచున్నది. తారాశశాంకులచరిత్ర మట్లు కాలేదు. అందుచే నది దుర్నీతిదాయకమే?

ఇట్లుండ నింకఁ బెద్దన్నగారిపెద్దతప్పేమో తెలియకున్నది.

# త్రిలింగరంగము.

— కాశీభట్ట కృష్ణరాయశాస్త్రి గారు. —

నేను నాస్వగ్రామ మగుసాలూరికిఁ బోయి యటనుండి రెండుమైళ్ళదూరమునఁ గల కొట్టక్కియనుగ్రామమునకుఁ బ్రయాణముసేసినతఱి మార్గమధ్యస్థనదివలన నడ్డంకిగలిగి నాపెట్టె యానీటఁ బడినది. దానిచే నందలికొన్నికాగితములు తడిసి యేతద్విషయ (త్రిలింగరంగ) సంగృహీతప్రమాణములు నశించినవి. అయినను క్లుప్తముగ వ్రాయుదును.

ఆంధ్ర భాష — ఐతరేయమున నాంధ్రశబ్దమున్నది. నీచజాతిసాహచర్యమున నున్నదగుట నీచులే యనికొందఱాంధ్రుల నిర్వచించిరి. దానికిఁ దగిన ప్రత్యుత్తర మాంధ్రపురాణకర్త లిచ్చియుండిరి. భాషావిషయ మిటఁ బ్రస్తకమగుట నదియ యవలంబింతును. ఆంధ్రము త్రిలింగపర్యాయమా? అగుచోఁ బూర్వమునుండియుఁ ద్రిలింగము ప్రయోగింపఁబడుచుండెనా ? అని సంశయింతుము. 'త్రిలింగము' మధ్యకాలమునఁ బ్రయుక్త మయ్యెను. ఆంధ్రము పూర్వమునుండియు నున్నది. ఈ రెండుపదములును సంస్కృతపదములే. కావుననే సంశయము. 'త్రిలింగ' పదము 'తెలుఁగు' పదమునకు సంస్కృతము. ఇట్లన్నింటిని సంస్కృతీకరింప నిజము నీట మునుంగును. 'ఆంధ్రము' సంస్కృతపదము. కావున సంస్కృతవాఙ్మయమున 'తెలుఁగు' పదమును వెదుకఁజనదు. అయినను వేదస్థ మగునాంధ్రపదమును దదర్థమును విమర్శింతము. ఆంధ్రులు వేఱు, తెలుఁగువారు వేఱు, కాలక్రమమునఁ గలిసిపోయిరి. ఆంధ్రము తెలుఁగునకుఁ బర్యాయము పూర్వమునుండియుఁ గాదనియు వాదము గలదు. సంఘచరిత్రవిషయ మిందప్రకృతమగుట విరమింతును. కాని ఆంధ్ర — త్రిలింగముల యన్యోన్యబాంధవ్యము శాబ్దముగ నైన విచారింపవలయును. ఆంధ్రశబ్దము సోత్పత్తికముగ విచారింతమన్నఁ జెల్లదు. 'అంధ్, ధాతువు' రాఖ్ ధాతువును గలియ నాంధ్రమయ్యె నని యిట్టిసందర్భమున నుపయోగింపరాదు. ధాతువాద మీపదమునకే కాదు సర్వపదములకు నెట్లో పట్టును. మఱియు వైదికప్రయోగముల సాంప్రదాయముల ననుసరించి యర్థము చేసికొనఁదగును. కావున నాంధ్రశబ్దము వేదసంప్రదాయానుసారముగ నర్థముచేయవలయును. అందును బ్రాహ్మణమునఁ గలవానికిఁ గొంచెము ప్రామాణ్యము తగ్గును. మంత్రబ్రాహ్మణ

ములు వేదనామమున నున్నను జారిత్రకులకుఁ దగినంతబలము బ్రాహ్మణమున లేదు. అయినను త్యాజ్యముగాదు.

వేదము — ఆంధ్రము — "తస్యహ విశ్వామిత్రస్యైకశతం పుత్రా ఆసుః, పంచాశత్ ఏవ జ్యాయాంసో మధుచ్ఛందసః, పంచాశత్ కనీయాంసః, తద్ యే జ్యాయాంసో న తే కుశలం మేనిరే. తాననువ్యాజహారాన్ తాన్ వః ప్రజా భక్షీష్టేతి త ఏతే౽ంధ్రాః పుండ్రాః శబరాః, పుళిందా, మూతిబాః ఇత్యుదంత్యా బహవో భవంతి వైశ్వామిత్రా దస్యూనాం భూయిష్ఠాః" అని యున్నది. ఇది చాలఁ బ్రాచీనమయిన గ్రంథ మనుటకు సంశయములేదు. ప్రాచీనగ్రంథ మగు దీనియందును నాంధ్రప్రశంస యితిహాసరూపమున నుంట నంతకుఁ బ్రాచీనులని యే చెప్పవచ్చును. ఈబ్రాహ్మణమునఁ గల "ఆంధ్ర" పదమునకుఁ బ్రాచీనతయే ప్రధానము గాని యన్యముగాదు. ఆంధ్రులు ప్రాచీను లని సిద్ధమగును. పిమ్మట దస్యుత్వ మాలోచింతము. ఈయితిహాస మే సందర్భములోనిది? వరుణత్ప్రీత్యై నరబలినీయ శునశ్శేఫునిఁ దెచ్చుట మొదలుగాఁ గలకథలోనిది. విశ్వామిత్రుని పెద్దకొడుకులు 'దేవరాతు'నిఁ దమసోదరునిగ సమ్మతింపమిఁ బిత్రభిశప్తు లయి యాంధ్రు లయి రని యున్నది. ఇంతమాత్రమున నాంధ్రు లనార్యు లనుట పొసఁగదు. యజ్ఞకర్మ కనర్హులయినవా రని యన్న నందురుగాక. దస్యులలోఁ జేరిపోయి రనియందు రేని సమ్మతింతుము గాక! కాని యాంధ్రులు దస్యు లనుట తప్పు. దీనివిషయము 'భారతి' లోఁ బ్రకటిత మగుచున్నది. నా కది యప్రకృతము. ఆంధ్ర శబ్దమున కున్నంతప్రాచీనత 'త్రిలింగ'శబ్దమునకుఁ గానరామి నాంధ్రత్రిలింగములఁ జర్చింపవలసివచ్చెను. ఈచర్చకుఁ బూర్వము నాయభిప్రాయమును సూచింతును. అనాసు లగుదస్యులలో నాంధ్రులను జేర్చిన నంతలాభ మేమి? దస్యులు నార్యులు నొక్కజాతివారే, యుత్తరధ్రువప్రదేశమున నుండినవారే. తరువాత భిన్నాభిప్రాయులైరి. 'అనాసు, లనఁ జప్పిడిముక్కువా' రనియర్థముచేయుటలోఁ బ్రమాణము ప్రత్యక్షము. కావున జాతిపరముగ నర్థముచేసిరి. కాని సాయనాచార్యులవారియర్థము సమ్మతమా? అనాసులనఁగా నోరులేనివా రఁట. మాటలాడ నేరనివా రఁట. ఈయర్థమున కాధార మేమి? ఆసమన నాసన మనియు ననాస్సులన ననాసనులనియు నేనర్థముసేయుదును. నాయర్థమున కాధార మేమి? కర్మనుండి (యజ్ఞాదులనుండి) తొలఁగింపఁబడి యుంట యజ్ఞసమయమున నాసీనులగుటకు వీరికిఁ దావులేదు. నిష్కాసితులును శప్తులు నైరి. అనగ్నులు ననింద్రు

లు నైరి. అట్లగుటచే బుద్ధిలేనివా రనునర్థము వచ్చునట్లు 'అనాసు' లని వర్ణింపఁబడిరి. కాని నోరులేనివారు ముక్కులేనివారు కారు. మొదట నాంధ్రులను వర్ణించుటలోను గొంతయాధిక్యత గలదు, అది యట్లుండనిండు. యజ్ఞాములఁ దిరస్కరించి ప్రత్యేకముగ నాంధ్రులు దేవవాఙ్మయమును సృజించిరి. అవియే యుపనిషత్తులు. ఉపనిషన్మతమంతయు నాంధ్రులదియే. బ్రాహ్మణములను ఖండించుటకు నుపనిషత్తులు పుట్టినవి. కావుననే యైతరేయబ్రాహ్మణమున కైతరేయోపనిషత్తును కౌషీతకిబ్రాహ్మణమునకు కౌషీతక్యుపనిషత్తును తైత్తిరీయబ్రాహ్మణమునకు తైత్తిరీయోపనిషత్తును వ్రాసిరి. మఱియు నివి యన్నియు నారణ్యకములలోనివి గూడ నగును. యతికిఁ బ్రతి యనునట్లు వేదములకు బ్రాహ్మణము లుండుట నరసి వేదముల కుపనిషత్తులను సృజించిరి. బ్రాహ్మణములలో ద్రవ్యప్రధానయజ్ఞములు వర్ణితములు కాఁగ నుపనిషత్తులలో భావప్రధానయజ్ఞములు వర్ణితము లయినవి. ఉపనిషత్తులలో సాధారణముగ నగ్నిదేవతాకకర్మముల నాత్మపరముగ నన్వయము చేసి బ్రాహ్మణులు క్షత్రియుల దగ్గఱ జ్ఞానమును సంపాదించినట్లును వర్ణింపఁబడియున్నది. వేయేల? కర్మాధిపతి యగు నింద్రుఁడును జ్ఞానము సంపాదించుటకు వచ్చినట్లున్నది. ఈవాఙ్మయమును బరిశీలింప క్షత్రియప్రాబల్యము స్పష్టమగును దీనివలన నుపనిషన్మతము బ్రాహ్మణప్రతిఘటకమై క్షత్రియసృష్టమై యున్నట్లు తెలియుదుము. ఇఁక నాక్షత్రియులు వైశ్వామిత్రు లని యనుటకు సంశయింప నక్కఱ లేదు. వృత్తిమాత్ర క్షత్రియులై బ్రాహ్మణులునైరి. మనప్రాచీనగ్రంథము లీవిషయమును దృఢముగఁ జెప్పును. "యస్య బ్రహ్మచ క్షత్రంచ ఉభే భవతః ఓదనః" కఠము సెప్పనెఱుఁగుదుము. బ్రహ్మక్షత్రముల యభిప్రాయభేదము లచిరకాలము నైక్యమై సుఖమే సూచ్చినది. ఆయైక్యతయే జాత్యైక్యతయు నగును. కాని వారాంధ్రులే యననేల? అని సంశయింతురేని వేఱొకవ్యాసమునఁ జర్చింపవలసి వచ్చు నని విన్నవింతును. కపాలశాస్త్రము, భాషాశాస్త్రము, సంఘశాస్త్రము మున్నగు శాస్త్రము లాంధ్రార్యైక్యతఁ జాటుచుండుటయే చాలును. చాల దన్న నిది తావుగాదు. జాతివిషయ మిట్లున్నను భాషావిషయ మేమందురు? సంస్కృతము పూర్వభాష యని నాయభిప్రాయము. ఆంధ్రాదిభాషలయొక్క సంస్కారరూపమే సంస్కృతభాష యయ్యెను. సంస్కృతము గ్రాంథికభాష, యాంధ్రము వ్యావహారికభాషగ నుండెను. భాషాశాసకులు సంస్కరించి ప్రయోగించిరి. అట్లు

వారుచ్చిరి. సంస్కృతమునకు భాషానామము లేదు. ఇప్పటికి నుత్తరదేశమున 'భాషాటీక' యని వాడుదురు. భాషా యనఁ దమస్వస్థానభాష యని యభిప్రాయము. ఇవంద్రుఁ డింద్రుఁ డయినట్లు వేదమే చెప్పుచుండ సంస్కారవిషయమున సంశయింపనేల ? వేదకాలమునాఁటికే సంస్కారము ప్రారంభమయి క్రమముగ లౌకికమున నతోధికముగ సంస్కృతమయ్యెను. సంస్కృత మందఱిసొమ్ము. కావున గౌరవము మెండు. ఇప్పటికి నాంధ్రులలోఁ బైతృకకర్మముల సందర్భమున నాంధ్రభాష భాషింపరా దనియు నుద్గ్రంధముల నాంధ్రీకరింపరా దనియు నను నాచారము గలదు. ఈయాచారముననే యాంధ్రుల కాంధ్రభాషలో నుద్గ్రంధములు లేకపోవలసి వచ్చెను. శాశ్వతకార్యములను సంస్కృతభాషలోఁ జేసిరి. శాతవాహనాదు లాంధ్రులయ్యు శాసనాదుల సంస్కృతమున రచింపించిరి. అయిన నానాఁటికి సంస్కారాభిలాష హెచ్చియేయున్నది. కావున నాఁటి భాషలోఁ గొంతస్వాతంత్ర్య మున్నది. అట్లగుచో నాంధ్రు లుపనిషత్తులు సంస్కృతమునఁ జెప్పిరా యని ప్రశ్నింప నక్కఱ లేదు. కాని సంస్కృతమునకు నాంధ్రభాషకుఁ గలయన్యోన్యసాజాత్యవిషయమున సంశయింతును.

ఆంధ్రము-సంస్కృతము:—ఆంధ్రమునఁ జాలభాగము సంస్కృతమే యైన నాగీర్వాణభాషతో సంబంధము గల దని నిర్ణయింపఁబడిన యితరభాషలతో దగ్గఱచుట్టఱికము గలదియై యాంధ్రభాష యున్నది. ఈసందర్భమునఁ దత్సమ, తద్భవముల విడిచి కేవల దేశ్యము లగువానిని జర్చింతును. కేవల పదతత్త్వము నాధారముగ మాటలాడిన హాస్యతాపాదక మగు నని యెఱింగియు నను దదుపబలముగ నర్థవాదభంగి నైన నుచ్చటింపవచ్చు నని యెంచితిని. పాశ్చాత్యదేశభాషావిషయమున నైక్యత నరయుదము. పెక్కుమంది యీవిషయమును నాంధ్రులకుఁ దెలియఁజేసిరి. కావునఁ గొంచెముగ నాంగ్లభాషాపదముల యన్యోన్యమైత్రిఁ బ్రదర్శింతును.

| ఆంగ్లము | ఆంధ్రము | విశేషాంశము |
|---|---|---|
| One | ఒండు, | ఒకండు |
| Birth | పుట్టు | పురుడు |
| Put | పెట్టు | |
| Dig | త్రవ్వు | దిగు |
| Die | చయ్యు | |

| ఆంగ్లము. | ఆంధ్రము. |
|---|---|
| Drink | త్రాఁగు |
| Creep | ప్రాఁకు |

ఇత్యాదిపదసముదాయము గనఁగొన్నను పాశ్చాత్యసంబంధ మున్నట్లు తేలఁగలదు. మఱియు Bear, బరువు మోయు, గ్రీకులోని 'ఫెరొ', గాథికులోనిబైర (Baira) సమధ్వనితములుగ నుంటఁ బాశ్చాత్యభాషాసాజాత్య మున్న దని యేర్పడుచున్నది. దీనిం గూర్చి యనేకు లిప్పటివారు వివరించియున్నారు. ఇఁకఁ బ్రాచ్యభాషాసాజాత్య మరయుదము. ప్రాకృతభాషలలో ఎ, ఒ, లున్నట్లు తెలుఁగునఁ గూడఁగలవు. ప్రాకృతభాషలలోఁ గొన్నింటికి ద్వివచనములు లేనియట్లు తెలుఁగున లేవు.

మఱియుఁ బదసామ్యమును నరయుదము.

| సంస్కృతము | జందు | పాలీ | గాథాది | తెలుఁగు |
|---|---|---|---|---|
| వృక్షమ్ | వరేషమ్ | | | మ్రాఁకు |
| శ్రేష్ఠిన్ | | సెట్టి | | సెట్టి |
| | | కధికా | | కిదుకు |
| స్త్రీ | | | ఇస్త్రీ | ఇంతి |
| ఉష్ట్రమ్ | | ఒత్థ | | ఒంటె |
| శాస్త్రమ్ | | సత్త | | చదువు |

ఇత్యాదిసామ్య మరయ నాంధ్రసంబంధము తెలియును. పైఁజూపిన పథకములవలనఁ దెలియునది యేమనఁగ నాంధ్రభాష యార్యభాషలలోఁజేరినది యనితెలియుటయే. ఇఁక నాంధ్రభాషాసాంప్రదాయములు గూడ నార్యభాషలలోఁ గల వనియుఁ దెలియ నాంధ్రభాష యార్యభాషాభాగమునఁ జేరినది యని యనవలయును. గాథామాగధ్యాదులలోఁ గలయట్లు ప్రత్యయలోపము శ, స, వ, మ, ర, లాది విపర్యయమును గలదు. భాషలోను బ్రజలలోను నార్యాచారములు గానరాఁగ నాంధ్ర మార్యము గాదనుట యుచితముగాదు.

అది యట్లుండనిండు, సంఘమునకుఁ బ్రధాన మయినపలుకుల నరయుదము 'అమ్మ' స్వాభావిక పదము తల్లి, పదము, తాయి నుండిరాలేదు. ప్రాకృతభాషలఁ గొన్నింట 'అలంకార' లంకార, పదములఁ బూర్వవర్ణము లోపించినట్లు 'మాతృ' శబ్దము, మాతర, గమాఱి, మా, పోయి 'తర' కు, గౌరవార్థకముగ "లు" తరలు, తల్లు, స్త్రీత్వమునకై "తల్లి" యని యయ్యెనో కాక

'తొలియాలు' పదమే 'తల్లి' గ మారెనో (తొయ్యలి, రూపమును స్త్రీపర మునఁ గన్పట్టుచున్నది.) కాక "ఆంధ్రి, లోని 'ఆం' పోయి "ధ్రి" తిరి, తివి, తలి, తల్లి, గ మారెనో కాని తాయినుండి కాదు. అమ్మ మొదటిది తల్లితరువా తిది యగుటఁ దల్లిపదమున నిట్టిజాతివాచకమున కన్వయముచేయుటయే బాగు. ఆంధ్రులకు "అమ్మ" వంటిది "తల్లి" కాదు. వెంకమ్మ, చోడమ్మ, గంగమ్మ, పోలమ్మ, ఎల్లమ్మ, యిత్యాదుల 'అమ్మ' యనియేయున్నది. తల్లియనిలేదు. 'తండ్రి' యను పదముగూడ నట్లే 'తనయూంధ్రుఁడు' అనునర్థమున "తంద్ర" యయి మైత్రిని 'తండ్రి' గ మారి యుండును. కూడు "క్షుత్" నుండి వచ్చినది. "అహమ్, ఏమ్, ఏన్, న్యాన్, గ మారి "నేను, ఏను, రూపము లేర్పడినవి.

ఇట్లే సంస్కృతముతోడి సంబంధము ప్రధానపదములఁ గలదు.

| తెలుఁగు | సంస్కృతము | విశేషము |
|---|---|---|
| నేను, | అహం | నౌ, నః, |
| నీవు | త్వం | ,, |
| వాఁడు | వత్, | మతుబర్థముననుపయుక్త (పుట్ట మువాఁడు) మగును. |
| అది | తద్ | అదస్, |
| ఇది | ఇదమ్, | ఏతద్, |
| ఏమి | కిమ్, | |
| లేదు | నాస్తి | |

ఇత్యాది పదములఁ జూడ సంబంధము తెలియును. గాథాభాషలో సాధారణముగ "ఉ" చేర్పఁబడియుండును. స్రమవరు, నరవరు, హితకరు, ఇత్యాదిపదములు "ప్రాకృతభాషోత్పత్తి" వ్యాసమునఁ గలవు. అట్టిసాంప్రదాయము వేదమునకుఁ గూడ నటనటఁ గలదు. అట్లే యాంధ్రసాంప్రదాయము నై యున్నది. కావున నాంధ్రభాషతో వైదికభాష సంబంధించి యున్నదియో లేదో విచారించి సిద్ధాంతమునకు వత్తము.

ఆంధ్రము-వేదము:—వేదభాషలో "ళ" కారము గలదు. ఆంధ్రమునఁ గలదు. వేదమున నానునాసిక్యప్రాచుర్యము గలదు. ఆంధ్రమునను గలదు. వేదమున విభక్తిపై విభక్తి వచ్చుట గలదు. ప్రత్యయలోపమును గలదు. ఆంధ్రమునను గలదు. మఱికొన్ని సామ్యములునుగలవు. పదసామ్యము నరయుదము.

| వైదికము. | తెలుఁగు. | వివరణము. |
|---|---|---|
| మోకీ = రాత్రి | మాఁగు | నలుపెక్కు |
| బుందః = బాణము | బంగి, బండ, పూఁచ, పుల్ల | అర్థవిపర్యయమునరావచ్చును |
| బేకురా = వాక్కు | వాఁగు, వాగరు | అర్థభేదము |
| అగ్రుః = నది | ఏఱు | |
| ఉపలః = ఆకాశం | ఉప్పరము | ప్రాచీనభాష |
| ఇందుః = యజ్ఞము | విందు | అర్థభేదము |
| చష్టే = పశ్యతికర్మా | చూచు | వ్యత్యయము |
| మహ = పూజాయాం | వగ | |
| క్షయః = ఇల్లు | చదురు | అర్థభేదము |
| దివి, జివి = ప్రీణనాయాం | తీపి, చవి | |
| రణ = మనోహారే | రాణ | |

ఇట్లెన్నియో వైదికపదములసాజాత్య మాంధ్రమునఁ గలదు. వేదధాతువులనుండి యెన్నియో పదము లాంధ్రమునకు వచ్చియున్నవి. జ్యోక్= సోఁగ, సాఁగు, చివుకు, అనుపదములు పుట్టఁగలవు. వృజి వర్జనే, అనుధాతువునుండియే వేయు, వైచు, పదములు పుట్టినవి. హర్య-గతికాంత్యోః, అనుదానినుండి "అరుగు, అరుదు, అఱిది, పదములు పుట్టినవి. తృహ, హింసాయాం, అనుదానినుండి తెగు, తఱుగు, పుట్టినవి. పెక్కుపదము లీరీతిని బుట్టినవి. దీనిఁబట్టి యాంధ్రము వైదికభాషాసాంప్రదాయము గలది యనవలసి వచ్చును. సముచ్చయము వేదములో ఉ, తెనుఁగులో ఉన్ గలదు. ఘనక్రమములో ఉ, వవర్ణముగ మాఱును. తెనుఁగునను గురువు, తరువు, మొదలగునవి గలవు. ఋగ్వేదమునకుఁ బూర్వమునుండియు నున్నవారే యాంధ్రులు వా రార్యు లగుదురు. మఱియు సూర్యునకు సప్త యనుపేరువచ్చినట్లె వత్సరమునకు "ఏడు" అని పేరుశబ్ద సాజాత్యము నుపయోగింతురు. నెల,మాసమునకుఁ జంద్రునకు నర్థము వేదమునను గూడ నట్టె. ఇట్టిసామ్యములవలన నాంధ్రము వైదికమని సిద్ధాంతితమగును.

దేశ్యపదజాలముగూడ వైదికాంధ్రములోఁ గలియ నాంధ్రత్రిలింగము లొక్కఁడే యగునా యనుసంశయము వొడమును ఋగ్వేదమునను బురాణముల నాంధ్రప్రశంస గలదు. వరాహమిహిరాదులును వాడిరి. కాని త్రిలింగ,

పద మట్లుప్రయుక్తముగామి మధ్యకాలమున నీ నామము వచ్చినదేమో. అట్ల నరాదు. త్రిలింగపదము స్వరూపము విచారించినపిమ్మటఁ దదాగమ మూహింతము. అధర్వణవేద మాంధ్రవేద మయినట్లు తెలియుచున్నది. అట్టి వేద కర్త లగువారిచరిత్రము చర్చింపఁ బుణ్యము. తెలుఁగు, పదమునుగూర్చి విచారింపవలయును త్రికలింగము త్రిలింగ, మయ్యెననుట పొసఁగదు. అట్టిజాడలు మన కగోచరములు. కాని "తెలుఁగు" పదములజాడలు గానవచ్చుచున్నవి. సంగ్రహముగ వ్రాయుదును. తలాంగు, తైలాంగు, తలైనాఁడు మున్నగుపదము లందందుఁ గానవచ్చుటఁ దెలుంగుజాడలు దీయవచ్చును. "తెలు" గుఱించియే విమర్శింపఁ దగుననియు "గు" బహువచనప్రత్యయ మనియుఁ దెల్పుచున్నారు. "తెలుఁగు" పదము 'భాష'కును బ్రజకును విశేషణముగ నున్నది. సంస్కృతమనఁగ 'సంస్కృతభాష, యనియు, 'పంజాబీ' పంజాబీభాష యనియు, నిట్టి యుదాహరణములు గలవు.

కాఁబట్టి "తెలుఁగు, అనునది భాషకు విశేషణము. భాష కనఁగా వ్యావహారికమున కని యర్థము. పాణిని యష్టాధ్యాయిలో "భాషాయాం" అనియు నొండొకకవి "భాషాకవి" యనియుఁ బ్రయోగించినట్లు తెలియ స్థాన భాషాయాం, అనియు స్థానభాషాకవి యనియు నెఱుఁగవలయును. 'తెలుఁగు తెనుఁగు, అనిరెండురూపము లుండఁగా నేరూపము చింతింపవలయును? తెనుఁగు కాదు. తెలుఁగు మొదటిరూపము. తెనుఁగు తరువాతిది.

తెలుఁగు:—తెలఁగాణ్యము, తెలగాలు, త్రిలింగము, మున్నగు ప్రయోగములు ప్రాచీనములుగఁ గన్పట్టుటను, తిలాంగ్, పదము మరాటిలో నున్నదగుటను దెలుఁగే ప్రాచీనము. తెలుఁగులోని "గు" ను విడిచి 'తెలు' గుఱించి విచారింతము. ఆంధ్ర లోని 'ధ్ర, ధర, మై 'తర" మై తల, గ మాఱి యుండనోపును. "తలపై 'ఉ' వచ్చి "వు" గ మాఱి 'గు' గనై యున్నదేమొ? పూర్వులచే నాంధ్రనగర మని వర్ణింపఁబడినది తెలంగాణ, యే మై యుండ నోపును. తౄ, ప్లవనతారణయోః, అను ధాతువు 'తౄ' ప్లవనతారణ తేజనానాం అని యెఱుంగఁదగును. ఈధాతువునుండి "తల" తలఁచు, తెలఁచు, తెలుపు, తెలివి, తేలు, తోలు, తలిమము, తలఁగు, తలిరు, తలుగు, తాలుచు, తెలియు, మున్నగుపదములు పుట్టినవి. 'భూ, సత్తాయాం, ఉణ్, సత్తాయాం, అని తెలుఁగుధాతువు. ఈధాతువునుండియే, 'ఉండు,

అగు, పుట్టు, మొదలగు 'భూ, ధాతుజన్యపదము లన్నియుం బుట్టును. పీచ్, విస్తారే, పేచు, పేసు, పైసు, పాము, కప్పము, చిప్ప, పెంచు, పాచి, మొద లగునవి పుట్టును. ఇట్లే యాంధ్రభాషకు ధాతువులు గలవు. కావున "తల, మాటి 'తెలు + ఉ తెలుఁగు గ నయ్యెను. తెలుంగు, పదమునకుఁబరోక్షప్రియు లు 'ఆన్ధ్ర, అనిప్రయోగించిరి. మఱియుఁ గలపదముల విమర్శింప నదియె తేలును. కలియు, తునియు, చెడియు, మురియు, ఇత్యాది 'డియు, నియు, రియు, లియు, ప్రభృతివర్ణము లంతమందుఁ గల ధాతువులనుండి (నామతమున నిది ధాతువుగాదు) 'గు, చేర్పఁబడినపదము లున్నవి. అట్లే "తెలియు" పద మునుండి 'తెలుఁగు, వచ్చెను. భాషాపర మగుట నన్యార్థమునఁ బ్రయుక్తము కాలేదు. స్పష్టత ప్రకాశత యని యర్థము. ఆంధ్రకు నట్లే యర్థము. రెండును సమానార్థకములే. త్రిలింగ అనుగీర్వాణరూపము 'కాళహస్తి, ద్రాక్షారామ, శ్రీశైల ముల మధ్యదేశ మనునర్థమునఁ బ్రయోగింపఁబడిన తరువాత 'ఆంధ్ర ము, త్రిలింగము, అని భిన్నదేశములుగ వాడిరి. ఎల్లకాల కట్లు వాడిరి. అనం గరంగ మనుగ్రంథమున 'ఆంధ్రకర్ణాట, మద్రత్రిలింగ, అని యుపయుక్తమ య్యెను, 'గాని, యది ప్రామాదికము. కలికాది నన్నయ్య నుంచినట్లే ఆంధ్రము తెలుంగునకుఁ బర్యాయ మని తెలియుఁడు. 'ఆంధ్రముఁ దెలుఁగువా రుప యోగించుచువచ్చిరి. ఆంద్రవారు గలరు. విశాఖపట్టణముజిల్లా సాలూరు దగ్గఱ "ఆండ్ర దొర, ఆంద్రకొండలు, ఆంద్రగ్రామము, గలయట్లు తెలియఁబ డుచున్నది. కళింగమున నట్లే, ఆంధ్రయొక్క వికృతరూపమే 'ఓఢ్రము, ఆం ధ్రోఢ్రముల యత్యంతబాంధవ్యము కొలఁదిదినములలో వెలికి రాఁగలదు. తెలుఁగుభాషలోని సమగ్రతఁ దెలుప సంకల్పించియుఁ గాలము సావకాశము గ నుండమి విరమించి నాయాంధ్రవ్యాకరణపాఠరహస్య మనుగ్రంథమునకు విజ్ఞులు తోడ్పడుదు రని విశ్వసించి ప్రార్థించుచున్నాను.

---

# నూపురమహిమ (లేక) కన్నకి చరిత్రము.



— తి. సు. మురుగేశపిళ్లైగారు —

(గతసంచిక శేషము)

గోవలుఁడు మధురాపురిలోని చూపట్టంబుఁజూచి వెఱగుపడి మరలివచ్చి మధురలోఁ దాఁ జూచిన బెడఁగుఁగలుముల మేలిమినంతయు నొడివి యగ్గించుచుండెను. అప్పుడు పుహార్‌పట్టణము దగ్గఱనుండునట్టి 'తలైచ్చెంగాడు' అను కొటికలో నిరవుకొనియుండువాఁడును, గోవలునికిఁ జెలిమికాఁడు నైన మాఠలుఁడను పుడమివేలు పచ్చటి కేతెంచెను. అతనిం గని గోవలుఁడు మచ్చికతో ముచ్చటింపం జొచ్చెను. పాఱుఁడు 'మీ రూరు విడిచి యిక్కరకే నిచ్చటికి విచ్చలవిడి విచ్చేసినది మెచ్చుగా' దని ముచ్చిరెను. ఈపలుకుల వినిన గోవలుఁడు మధురకుఁ దా వచ్చినపిదపఁ దాఁ గన్నదొసఁగుఁ గలం గుఱించి యా బాఁపనితోఁ జెప్పి వెచ్చనూర్చెను. పదపడి కౌంతియు బాఁపనుఁడును గోవలునిం జూచి 'మీ రిచ్చట నాలుమగలుగా నిరవారియుండుట మేలు గాఁజాలదు. ఇచ్చోటు నిరాబారుల కని యేర్పఱుపఁబడినది. ఇఁక మీరు మధురానగరిలోనికిం బోయి కాఁపురించుటయు మంచి దని వక్కాణించిరి.

మాతరియింట గోవలుఁడును గన్నకియు విడియుట:—అప్పుడు మంచియాలుడి గలమాతరి యనుగొల్లత యొకదిత యట కేతెంచి కౌంతికిం జోహారొనర్చెను. కౌంతి యాగొల్లతనుఁ గన్నకికిం జూపించి 'యీకె మేలి యీలువుగల గరిత; ఈపెం గాపుగడగా నుండి కాపాడితివేని నీకు వెగ్గలముగ లగ్గులు సిగ్గును. ఈపె నీయెడ నిల్లడగా నుంచెద; నీ వీయిల్లాలుం బెనిమిటితోఁ దోడ్కొనిపోయి పదిలముగాఁ బ్రోదిసేయుచుండ్రుగాక' యని చెప్పెను. అందుకు నొడఁబడి మాతరి గోవలునిం గన్నకినిం దన యిమ్మువట్టున ప్రేపల్లెకు వేడ్కమెయిం గొనిచనెను.

అట్లాయాలుమగలం దోడ్కొని చని యలప్రేత దనయింటిప్రక్కనుండు నొకక్రొత్తయింటిలో నుండనిచ్చి తనకూఁతురు ఆర్య యనుదానినిం గన్నకికిం దోడుగా నుంచి, తిండికిం గావలసిన వంటసామానుల నవ్వారిగాఁ దెచ్చియిచ్చి కొలుచుచుండ్రెను. సాపాటుసామానులం బుచ్చుకొని కన్నకి సొంపుగా

వండి తనపెనిమిటికి వడ్డించి తనిపించి తానును గుడిచి త్రుప్పటిల్లెను. తిండి తినినపిమ్మట గోవలుఁడు గన్నకిం జేరి దగ్గఱఁ గూర్చుండఁబెట్టుకొని 'నాననుపు జెలనాఁగ! నీవు కటికుటెడారిలోఁ గాళ్లునొవ్వ నడచివచ్చినది యెఱింగినచో మనతల్లిదండ్రులు దిక్కుటమక్కుటగొని యెక్కరణిం బొక్కుచుందురో మన యిక్కలో నెంతో మిక్కుటంపుటింపుల మెక్కుచుండిన మన యిక్కరణి ను క్కటి వెక్కసమైన చిక్కులంబడి యక్కసించుచున్నాము. ఇందులకుం దొలి బాముననెట్టిట్టిదంపుఁజెట్టలం దట్టముగా దిట్టతం జేసితిమో! ఏండ్లు ముదిరి ముదుసలులైన నాతలిదండ్రులకు నూడిగము లొనర్చి కొలుచుచుండక వెడఁ గనై యిల్వెడలి వెడలి వచ్చితినే! కడలేని యుసుళ్లం బెడఁగారుచుండిన పు డఁతియగు నీకు నిట్టి యిడుమల నొడఁగూర్చితినే! నే నిట్టికతంబున నెట్టిబెగ డు గొడవలదరి వెడఁగ్గై కడగండ్లం బడి మిడుకఁగలనో! యెఱుఁగను. చుట్ట లు మొదలగు వారల నెడఁబాసి, 1 సిబ్బితి 2 వెడఁగు, 3 జడుపు, 4 జలద రింపు లను గరితలకుఁగల నాలుగుగొనములను నీంఱునే దొడ్డతోడుగాఁ గొని నావెంబడివచ్చి నాయొంటడికమును దొలఁగించితివి. హా! నాయిాలువ మిన్నా! నీకంటె నీలువున మేలిమిఁ జెందిన యాలి యొకరిత యెక్కడ నుం డఁజాలదు. ననఁబోఁడీ! నీయందియలలో నొండు నేఁ గొనిపోయి జట్టి యిచ్చి వచ్చెద. నిన్నొంటరిగా విడిచి వెడలుచున్నా నని జడియకుము' అని యింపు మాటలం దెంపొడఁగూర్చి దానియందియలలో నొక్కటిం బుచ్చుకొనెను.

గోవలుఁడు గన్నకి యందియం గొని మధురలో నమ్మఁబోవుట:—అందియం గైకొన్నగోవలుఁడు గన్నకిని నొంటిగా నుంచి యేగుట కోపక యెడఁద దడదడ మని జడిసెను. వానియొడలు గడగడ వడఁకుచుం జెమ్మటం జెమ్మగిల్లె

1. సిబ్బితి (నాణం)=స్వీయ భర్తలుగాని విమయాదికములును బరపురుషులును గంటఁబడిన యప్పుడును అట్టి వికటోక్తులు సెవులం బడినయప్పుడును రోఁతచేఁ గలిగెడిలజ్జ.

2. వెడఁగు (మడం)= భర్తృభావణ శుశ్రూషాములుదప్పఁ దక్కిన వ్యయాముల భావ మెఱుఁగనేగని యజ్ఞానము.

3. జడుపు (అచ్చం)= సదా సర్వావస్థలయందును స్వామియందు దత్తచిత్తురాలై యుండుటచేత కని యొుకర్చి యెఱుఁగని యెట్టికార్యములనైన నకస్మాత్తుగాఁ గనినఁ దటుక్కించినప్పుడు స్త్రీలకుఁ గలుగు భీతి.

4. జలదరింపు (పయిర్పు)= అన్యుల కరస్పర్శాదుల కోర్వక యొగురుచేఁ గలుగు దేహకంపము.

ను. వాఁ డడలుకడలిం బడి యుసుకాడెను. కన్నుల నీరుగ్రమ్మి కాఱఁజొచ్చెను. నీరు దొరఁకట నెఱింగెనేని కన్నకి యోర్వక బడలువడి యుడలు నని తలఁచి కన్నీటి స్రవల్చెను. అట్లయ్యుఁ దొంటికఱతల పంటబలిమినిఁ గంటగిల్లక యొంటరిగా విడిచి యేగుటకుఁ గొంత తెగువగొని యచ్చోటు వదలి కదలెను. కదలునప్పుడు ద్రోవలోఁ గొఱగామివలనులు గొన్ని చూపట్టెను. వాని నతఁడు సీరికిసేయక నడచెను.

వెడ్డరియైన యగసాలె గోవలుని వెడ్డువెట్టుట:—అంగడివీదివెంట గోవలుఁ డేగుచుండుతఱి యగసాలెలు నూర్వురు వెంబడింప నగసాలె పెత్తనకాఁ డొకఁడు దనకెదురుగా నేగుదెంచుటం గనెను. ఆ యగసాలె మిన్న మన్నెకానిచే మన్ననలు వడసిన యగఁడుగా నుండవచ్చునని యుజ్జగొని వానిమాటునకు వాటముగా నేగి తనయందియ నతనికిం జూపి మన్నిని దేవేరి దొడుగుకొనుటకుం దగినయీపాడగముం జట్టియిచ్చునట్టి చాలుబడి నీకుఁ గలదా?' యని గోవలుఁ డడిగెను. అగసాలె పెండెరముం జూచి 'ఔను! ఔను!! ఇది రాజు దేవేరిగారికి నురవగు; రాచనగరునకుం జని మన్నెకానిముంగల దీనిం జూపి దీనిపెరిమెం దెలిపించి మరలి వచ్చునందాఁక మీరు మాయింటి మందట మంతనంబున నుండుఁ'డని మందలించి గోవలునిం దనవెంటం దోడ్కొనిచని యొకయింటం దడసి యుండఁజేసి, తానొక్కఁడ రాచనగరునకు వెడలెను.

కొన్నాళ్లక్రిందట నాకమసాలి దేవేరియొక్క పెండేరములలో నొక్కటిం జూటాడి, దాని నెవ్వఁడో దాఁపరించుకొని పోయినాఁడని రాజుమ్రోల విన్నవించుకొనియెను. ఇప్పు డీయందియం దెచ్చిన గోవలుఁడే యా తెక్కలికాఁడని తెలిపించి, గోవలునిమీఁద నా డొగరు మోపి, తాను దుసికిలవలయు నని తలంచి యీ యగసాలె మన్నినిమ్రోలం జని 'కొన్నాళ్లక్రిందటం దేవేరివారి యందియం దాఁపరించిన దాఁపరి నిప్పుడు నేఁ గనిపెట్టి పట్టి నాపట్టున నికటములో నుంచి యిటకుం బాఱివచ్చితి' నని బద్దుమొఱ యిడుకొనియెను. ఈబవంతమును రవంతయు మంతనముసేసి పరికింపకయ పాండ్యుఁడు దెక్కలినిం జాగరలాడుటకై 'యందియతోఁగూడ నిటకుఁ దెం'డని తలారులకుఁ గట్టడయిడఁ దలఁచిన మన్నీఁడు దొంటితులువచెయ్వులపంట దాపరించినందువల్ల' నా దోఁపుకానిం జక్కాడి పాడగంబుం దెం'డని మాఱాటముగా మందలించెను.

తలారులు గోవలునిం జక్కాఁడుట:—తోడన, పంటింపక, దలారు లా యగసాలె వెంబడిఁ గోవలుఁడుండు చోటికి నేగి గోవలుని వాలారువాలుచేఁ బాలాడి యా పాడగముం గొని పోయిరి. ఇది యిటులుండ: —

కన్నకి విడిసియుండిన గొల్లపల్లెలోఁ బలువగల కొఱగామివలనులు వొడకట్టెను. మాతరియను వ్రేత తంకూఁతురింజీరి 'అయ్యో! ఇదియేమి వెఱఁగు? మనము సేమిరిపెట్టిన బూవలోనిపాలు పేర లేదు! మన కోడెలకుడికన్నులనుండి కన్నీరు గాఱుచున్నది! నిన్న చిలికియెత్తిన వెన్నంగాంచినం గరఁగలేదు! మన మేఁకపిల్లలు ద్రుళ్ళియాడక వసివాడి యున్నవి! మనతొడుకులన్నియు వెఱచఱచి యఱచుచున్నవి! మెదవ్రుల యఱుకంగట్టియున్న గంటలన్నియుఁ దెగి పడుచున్నవి. కాఁబట్టి మనకెద్దియో కీడు మూఁడనున్నది. బుచ్చము! మునుపు వ్రేపల్లెవాడలో వెన్నుఁడు దనయన్నతో నాడిన పిల్లలాటలు పలుగలవు. వానిలో వాలువలె వాలాగునిడుదకన్నులు గల వ్రేతలతో నాడిన గొండ్లి యాటలనాడి వెన్నునిం గొలిచితి మేని మనకుం బొడమనున్న కడగండ్లు గడివోవఁగలవు. కన్నకియు మనతోనుండి మనము పాతరలాడు గొండ్లింగని యలరొందుఁగాక' యని వాకొనెను.

ఈ నొడులం జెవిగొన్న ఐయు (ఆర్య) యనునది 'ఔ! నేను!! అట్ల సేయుదను. మన కడరంగల యెడరుల నా వెన్నుఁడ యడఁగించుఁగావుత' యని బదులుసెప్పెను. వెంటనె, మాతరి బయలువెడలి కొందఱుగొల్లపిల్లల మొల్లముగాఁ దెచ్చి నిలిపెను. కన్నకియు నాబజ్జళ్ళపాతరలం జూచుటకై వచ్చి నిలిచెను. వెండియు నామాతరియుఁ దక్కినవ్రేతలు నొండొరులు సేతులు గ్రుచ్చికొని వెన్నుని నగ్గించుచు బజ్జళ్లుద్రొక్కి గొండ్లి యాడిరి. ఆ యాటలం గని కన్నకి సాల యింపొందుచుండెను.

గొండ్లియాటలు గొనసాగినంతటఁ గఱివేలుపుట్టువుకొసల్పుట్టువలఁ బూజించుటకై మాతరి నీరాడుటకు వైగయేటి కేగెను. అప్పుడు గోవలుఁ డందియఁ బ్రుచ్చిలించిన ద్రుచ్చుని పట్టుకొనిపోయి కడికండ లొనర్చిన గొడవను మధురానగరిలోనుండి వచ్చినగొల్లత యొక్కతచే వినఁబడి కన్నకి పదటముచే నదిరిపడి బెగడుచే వడవడవడంకి నేలంబడి కో యని యార్చి యేడువదొరఁకొనెను. తనకనులు జేగురుబన్నట్లు మోమున నఱచేత మొత్తుకొనుచు నారటపడి పలవించెను. 'నేర మెం తేనియు లేని నా మగనిం దోఁపరి యని పాడిలేక పొలాడిరే! నా పెనిమిటి దునుమువడె నను నొడి వినియు నాగుండె పెటపెటం

బెట్టలేదే ! నాయుసు లొడలువిడిచి యిఁకను వెడలలేదే! ఇంక మనుచున్నానే ! నాయెడఁజ యేమి పడుకా? నా నడవడు లేమి యంత దుడుకా ? నా యత్తమామలిది విన్నంతనె కొడుకా ! కొడుకా !! యని కడుకాఁకలంబడి మిడుకాడుదురే !' యని కడలేని గొడవ పాల్పడి గోడాడెను. పదంపడి తొగల సూడుం బొడఁగని చేతులల్లార్చి జోడించి 'నెరడుకరడము లడరిన కడలిచే సుడివడిన యీ పుడమింబొడమిన నడవడులలో నీనెఱుఁగనిచేత యొక్కటియు నుండనేరదు. కాఁబట్టి కాయునట్టికఁటుకుఁగళుకుఁగలివిూ! చెయ్వులసాకిరియైన నీనెఱుంగునట్లు నాపెనిమిటి తెక్కలికాఁడా ? మ్రుచ్చనుట నిక్కమేనా ?' యనియడిగెను. అందుకుం బ్రాఁబల్కులకొంకి 'యీలువున నిగరమైనమగువా ! నీపెనిమిటి దెనువాటు కాఁడు. అతనిం దోఁపరి యనినయాప్రోలు సెచ్చెరఁ జిచ్చుసొచ్చి క్రచ్చుకొనుటచేఁ గచ్చువిచ్చగును' అని కంచుమించుగా నుండి వక్కాణించెను.

కలువదాయకట్టడల విన్నయంతనె కన్నకి దనయొద్దనుండిన మఱియొక పాడగముం జేతంబట్టుకొని ప్రేపల్లెనుండి వెడలి మధురలోనికిం బోయి యచ్చటనుండిన యిల్లాండ్రైన గరితలంగాంచి 'పాడి దప్పినమన్నీఁ డేలుచుండు నీవీట న్ననుచుండు క్రొత్తడులారా ! ఇదిగో నాచేతం బిసాళించు మఱియొందు పెండేరముం జూడుఁడు. నామగఁడు దోఁపరి కాఁడు. నాకాలి యందియ యొక్కవిలువం గిలుబాడుటకై నాపెనిమిటినిం దోఁపుడుకాఁడని నొడివి పొడవడఁగించిరి. అక్కటా ! నాకడరిన చేటఱిక మీనేలయం దేరికి దాపరించినది ? నాపెనిమిటిని మునుపటినిలువునం గని యతఁడు నొడువునొడువులం జెవిఁగొనం జాలుదు. అట్లు విన నలవడనియెడల నేను మిక్కిలి తక్కువయైన టక్కరి యని నొడివి గుప్వకరిగొని దిసంతులాడుఁ' డని నొడివి గగ్గోలువడి పలవించెను.

ఈలాగునం గన్నకి పలవించుటం గని యాయూరివార 'లక్కటా ! యీగరిత యొక్కపెనిమిటి దొంగ గాఁజాలఁ డని తోఁచెడిని; అతనిని మన మన్నీఁడు దునుమాడం గట్టడయిడినాఁడే ! యొంతకట్టిడిపని? ఇట్టి మంచి యీలువుగల యీవాలుగంటిచే మనకును మన్నీనికిని యెట్టెట్టి తెక్కలిపాటులు నెక్కొనవున్నవో ? యని యొండొరు లాడుకొని వెగ్గలముగ జెగ్గడిల్లిరి.

ఆయూరివారలలోఁ గొంద ఱాకన్నకిం దోడ్కొని చని గోవలుఁడు దెగటార్పఁబడియుండు చోటుం జూపించిరి. కన్నకి దనయొడయని యొడలిం గన్న

యంతనె యతనియడుగుల వ్రాలి నేలం బొరలి యఱచేత నెత్తిలో మొత్తుకొని కన్నీరు మున్నీరుగాఁ గాఱం బోయుచ నెలుఁగెత్తి రోజుచు, అయ్యో నా యనుఁగుసామీ! గంధము మున్నగు దావికదంబము పూసి కడానిడాల్గడలు మిటారంపుఁబోడలు దమారమడరి బడలుపడి పొడవడఁగున ట్లేలాగున నా కళతలాండ్రు గడికండ లొనర్చిరో? కటకటా! ఇది నేఁ దొలిబాముసం జేసిన కలుకుంగావలపుం బంటయో! నిన్నీడఁ జూసి మన్నన నింక మనియుండు టేమిటికో! పుడమిలోనుండువారలు నన్నాగడకత్తియ యని గువ్వకరిగొని యాడిపోసికొనరో! నేరమొకింతయు లేని నాయొడయని వాలారువాలునం బాలాడిన తగవుమాలిన తఱుసలి మన్నెకాఁడు మనుచుండు నీపీట మంచియాలుడిగలవాలుగంట్లు వాలాయముగా వఱలుటకు వాటపడుచున్నదా? దయ్యమ్ముం దైవాఱుమన్నదా? వేలు పున్నయెడల నిట్టియాగడ మడరునా? పెద్దలెవరైన నీమూర మనుచున్నారా?' యని వాచారుచ వాపోవుచుండెను. తన మగని యారజంపుఁబొమ్మునఁ దనబొమ్మం జేర్చి కౌఁగిలించుకొని గాసిల్లుచుండెను.

అట్టితఱి గోవలుఁ డసుఱు వచ్చి లేచి నిలిచి తనయాలిం దిలకించి 'అక్కటా! నిండుజాబిల్లిఁబోని జగాజిగిం గోమువాఱఁగల నీమోముటసల్పుట్టుపు మంచుద్గోఁగిన సంచున మించుగంది యున్నదే! నాయనుంగు టన్నుల మిన్నా! యేలొకో వన్నెసెడి విన్నఁబోయి యున్నా' వని బుజ్జగించుచు దానికన్నులనుండి కాటుకతోఁ గరఁగి కాలువవాఱి కాఱు కన్నీటిం దనచేతం దుడిచి దురపిల్లెను. కన్నకి వెక్కివెక్కి యేడ్చుచు నేలవ్రాలి, తనమగని బెడఁగుటడుగుల విరులంబోలె క్రాలు దనకేలం బుడుకుచు నడఁకువతోఁ డెంకణాలొనర్చి తలవాంచి నిలుచుండెను. గోవలుఁడు దననను పుటాలిం గని 'నీవిందుండుపుగాక' యని మందలించి కల్ల యొడలివిడలి వినుప్రోలికిం జనుటపొంటె బాసవాలతో వాసిమీఱుచు నోసరిల్లెను. ఇటీవలఁ గన్నకి దనపెనిమిటి యుసుఱు వచ్చి లేచి నిలిచి తనతోఁ బలికినది 'బూమెయో? లేక నేటో? ఏనొం డెఱుంగ వలఁతిగాక యలమటతో బొలయుచున్నాను. ఇఁక నామగని నెందుఁ గని పొందఁగలదాన? నాపెనిమిటిం జెచ్చెరం గని యెనయం బొనరువడినను నాయలుక వోలఁగుటకు మును పెనయంబాలను. నామగనిం దెగటార్చిన యగడుగల పుడమియొడయనిం డగ్గఱి 'నామగని నవగడముగాఁ దెగఁజూచి

న తగవేమి ?' యని యడుగుము" నని నొడివి యయ్యెడనుండి వెడలి పుడమి ఱేనికడకుఁ దడయక కడఁకమెయి నడచెను.

నగరులోపలఁ బాండ్యునిదేవేరి కొలకలలు గొన్ని గని వానిం దన ఱేనితోఁ బలవింపుచుండునదనునఁ గన్నకి బైడాలము బడాయింప నగరువాకిటికి నరిగి యచ్చుండు కావలివారలం గని "పాడిలేని ఱేనివాకిలిం గాచువాఁడ! 'పెనిమిటిం దునుమనిచ్చి వనరుచున్న ననఁబోఁడి యొక్కతె పాయవట్టె మొండుం గేలఁ బూని పఱతెంచి యున్నది' యని నీయొడయనియెడం దడయక నొడువు" మనెను. కావలివాఁడు దేవగింపక నగరులోనికిం బోయి ఱేనిం గని చెంగనాలొనర్చి నొసటం దోసిలిగాని 'జేజే! ఱేరాజుం బోని రాజా! నగరువాకిట నెవ్వతయో జవ్వని యొక్కత మిక్కిలి కాంతాళముతోఁ దోతెంచి యున్నది. ఆకె దుర్గియో? భద్రకాళియో? పోలేఱమ్మయో? యని చూచువారలు బూదియె యని దిగులు వడువడువునం జిందఱరేఁగి పొడచూపుచున్నది. ఆయిల్లాలు దనమగనిం గోలుపోనిచ్చినదఁట; చేతఁ బాడగ మొక్కటిం బట్టుకొని కీడుమూఁడఁబడినదానింబలెఁ దీండ్రించుచున్నది' యని యడఁకువతో నొడయనికి విన్నవించెను. ఆవిన్నపముల వీటిఱేఁడు విని సరగున నాగరిత నిటకుఁ బుత్తెంచు' మనెను. కావలివాఁడు సరచరం జని కన్నకిని ఱేనికడకుం బంపెను.

కన్నకి పాండ్యరాజుమ్రోలఁ దగవులాడుట:— కన్నకి నగరులోనికిం జొచ్చి రాజుమ్రోలఁ బొడసూపి నిలిచెను. ఆమెం దిలకించిన పాండ్యరాజు 'గరిత! యీవెవ్వరవు? రోజుచు నాకొలువుకూటంబునకు వచ్చిన పోలుపాం దేమిటిది?' యని యడిగెను. అందుకుం గన్నకి చిరాకుచేఁ జిందఱరేఁగి 'పాడిదప్పినఱేఁడా! పాడి గలిగి వాడిమెఱయు చోళమన్నీలు పలువురేలుచుండిన కావిరిప్పూంబట్టణములో మంతుకెక్కి మనుచుండిన గోవలుని యిల్లాలను నేను. నాపేరు కన్నకి యందురు. విడిముడిగడింపఁ గడఁగి యేను నాపెనిమిటియుఁ దొంటిచెయ్వులపంటచేఁ దగవుమాలిన యీనగరము నెయ్దితిమి. నాకాలియందెలలో నొక్కటి సమ్ముటపొంటె యేతెంచిన నామగఁడవగడముగా నీచేఁ దెగటార్పఁబడెను. అల్లుఱుమఱసేసిన యీవు నొకపాడిగల ఱేఁడవా?' యని అవఱవలెసఁగ నఱచెను. ఈమాటల వినిన మన్నీఁడు 'మంచి మురిపెముచే వఱలుగరిత! తెరువాటుం దెగటార్చుట ఱేఁపురమ్ము గాఁజాలదు. అతగవు మగపాడియే యగును?' అని మందలించెను.

కన్నకి, పఁట్రింపక పాండ్యుభేనిం గని 'వెంటలం బరికించి కొంచుకఱదలేని కట్టిడితేఁడా! ఇదిగో నీకఱవయొక్క కఱుకుం జూపించెదఁ జూడుము. నీచేతికివచ్చిన నాపాదగము లోని పూసలు దమ్మికెంపు' లనెను. పాండ్యుఁడు సక్కఁగాఁ జెప్పితివి! ఆహాదేవేరి యందియలోని పూసలాణిముత్తెము' లని చెప్పి తనయాలికాలియందియలలో నొక్కటినిం గోవలునెడ నవగడముగాఁ బుచ్చుకొన్న పాదగముం దెప్పించి కన్నకి ముంగల నుంచెను. గోవలునియొద్ద నుండి యెకిమీఁడు పుచ్చుకొన్న తనయందియం గన్నకి దీసి పగిల్చెను. అందుండి మానికెంపుంబూసలు జలజలరాలెను. 'చూచితివా? ఱేఁడా! ఈపూసలు దమ్మికెంపులా? ముత్తెములా? ఇప్పుడైన నామగఁడు దొఁపరిగాఁ డని నీకుఁ దోఁచుచున్నదా?' యని కన్నకి చిడిముడిపాటుతో నుడివెను.

మన్నీఁడు మడియుట:—వానిం దిలకించి పాండ్యుఁడు పదరి 'కటకటా! మది మోసపోయితినే! అగడపుటగసాలితగ వాలించి పరికించి చూడని తగవుమాలిన తఱుసరినైతినే! ఇట్లు పాడి దప్పిన యేనును మన్నీఁ డగుదునా? ఏన తెక్కలికాఁడను; మంతుకెక్కిన నిగరంపు పాండ్యవంగడములోఁ బొడచూపి యొనలేని మినుకుంబొగడిత లందిన పాండ్యరాజుల పెరిమెల్ల నానెపమున నేఁటితో మచ్చుమాసెనే! కొలముం జెఱుచుగొడవలికామనై పుట్టిన కొడిమెలాఁడైన యేను నేఁడ చావఁగల' నని వాచారపముతోఁ జాల నొచ్చికొని కనుకనిం బెనంగి తాఁగూర్చుండియుండిన బొబ్బమెకపుఁ గడాని గద్దియమీఁదఁ దొప్పఱిలి యుసుఱుం దొఱఁగెను. ఇది యెఱుఁగని రాజు దేవేరియైన కోప్పెరుందేవి యఱచి యేడ్చుచు వచ్చి కన్నకి యజ్జలం జాగిల్లెను.

కన్నకి కోప్పెరుందేవినిం దేఱి చూచి 'దేవీ నేనొంటుసఱుఁగనిదానను; ఐనను మీరలు నన్నేపరిఁచిన తీఁపురములపంట మిన్నుల న్వదలి తొలఁగం జాలునో? ఏను, యీలువున మేలిమిఁ బొందిన వాలుగంట్లు పొడచూపి పోణిమి మీఱిన యాణియమందుఁ బుట్టినదానను. ఏ నీలువుటాలుడింగోలుపోని క్రొత్తడిగా నుండితినేని యఱుగువడిన తేనితోడన యీమధురానగరమును గూడ నఱవఱసేయుదు' నని చెప్పి రాచనగరు విడిచి యగలెను. పదపడి కోప్పెరుందేవియుఁ దన మగనిం గాఁగిలించికొని మచ్చుమాసెను.

కన్నకి మధురాపురిం గాల్చుట:—కన్నకి మచ్చరించి వీదికి జేతెంచి నిలుచుకొని 'పడఁతులారా! బుద్ధులారా! నిరాబారులారా! తెఱగంటు

లారా! నామనవుల వినుఁడు. పరికింపక నామగనిం బెడిదంపు టడిదముచేఁ గడికండలొనర్చిన యీమధురాపురిమీఁద నాకుఁ గసరుపొడమినది. కాఁబట్టి, యీమధురాపురి నంబరము సేయఁబడి పాడటఁగల' దనిచెప్పి తనడాపలి చన్ను న్వలకేలం బెఱికి తీసి యామధురానగరము మీఁద విసరివైచెను. తోడన, పంటింపక నతనాల్కలసామి పేఱువిచనువునం బఱతెంచి కన్నకిన్ప్రాలం బొడకట్టి దానిం దిలకించి 'క్రొవ్విదములేని క్రొత్తడీ! నీకు డాఁగ రానర్చినయప్పుడ యీనగరము న్మాంబరము సేయునట్లు మునుపే నాకొక కట్టడ గలదు. ఇప్పు డేసీప్రోలం గలవారిలో నెవ్వరెవ్వరిం జఱుపవలయు' నని యడిగెను. 'బాఁపనలు, గామిషలు, నాలుడిగలచాగులు, యీలువుటింతులు, ముదుసలులు, బుడుతలు, మొదవులు మున్నగువారలం దొలఁగి, తలకొట్లమూర్ల పాలిటి కేఁడువుగాక' యని కన్నకి విన్నవించెను. తోడన, మధురా నగరముం దంతటం జిచ్చుపొచ్చి మెఱమంట లెగయ దరికొనం దొరఁకొనెను. పొగయు మిఁగులఁ బొగరి మొగసెను.

మధురలోని నెవ్వులంతయు బెగ్గడిలున ట్లగ్గలముగ డిగ్గి నిగ్గుకొనం దలపెట్టెను. అలప్రోలుం బ్రోచుచుండిన వరుణభూతములు నాలుగును వారి యునికి నులికి తలఁగిపోయెను. పురోహితులు, గణకులు, మంత్రులు మొదలగు వారలు వంచాడించి, కనుకనిం బెనపి యొకిమీనిం దిలకించుచున్నే యుండిరి. నగరివాకిటం జిచ్చు దట్టముగాఁ బట్టి రగులుటం జూచి యేనుఁగుమావుతులును గుఱ్ఱపురావుతులును, తేరుదోలువారలును, గాల్బంటు లైనమూసటీలును దమయొకిమీని మోసికొని చనిరి. గార లందఱు నెలుఁగెత్తి యఱచుచుం బరువిడిరి. పలుతెగల పీనులంగల యెల్లకొలనువారలును దలఁకి కలఁగిపాఱిరి. మొదవులును గదుపులును గొల్లపీనులకుం గ్రేళ్ళుఱికి పరువిడెను. మత్తగారులును, దత్తకులు నాప్రోలికోట చెంగటికిం బాఱెను. గుబ్బెతలు గొందఱు గూనొక్కనియుం బుకూనలం దీసికొని వేళాకోళముగాఁ బరువిడిరి. ఏండ్లునిండిన ముదుకలు దడబడి తడబడినడచుచు నెడరి నేలంబడుచు లేచుచు దడదడ నడచిరి. అప్పు డాపెద్దప్రోలిం బ్రోచుచుండు దయ్యమైన మధురాపతి యనునది కన్నకియొద్ది కేఁగి పొడచూపెను.

మధురాపతి పొడకట్టి కన్నకి నూఱడించుట:—అట్లు పొడకట్టిన దయ్యము కన్నకిం జేరి, 'గరిత! ఏ నీప్రోలుంబ్రోదిసేయునట్టి మధురాపతి యనుబా

సవాలు. కొన్నిమంతనంబుల రంతుగొన నీచెంతకు నేతెంచితి. ఈవు నాపలుకుల మెలఁకువతోఁ జెవిఁగొనుదువుగాక. ఈనగరిలో మునుపు మనుచుండిన పాండ్యరాజులలో నెక్కరును రాచతగవుల పాడిదప్పినవారు గారు. ఇప్పుడు పొడవడంగిన నెడుంజెళియఁడను నికుదపాండ్యుఁడు సయితము పాడిదప్పని మగపాడిగల మన్నీఁడ. [illegible] వాఁడు నీమగనిం దెగటార్చిన కతముం జెప్పెద వినుము. మునుపు కళింగదేశములోని సింగపురి నెకిమీఁడైన వసురాజును కపిలపురము నేలుచుండిన కుమారరాజును దాయ లగుదురు. వారలొండొరులు పగగొని యొకరినొకరు గెలువఁ గడంగి బవర మొనర్చుచుండిరి. అప్పుడు, జంగముఁ డనుగొర యొకఁడు దనపెండ్లముతో విడిముడిగడించుట కొంకె సింగపురమున కేతెంచెను. ఆ బేరి యావీటి యంగడిలో సరకుల బండములం జట్టియిచ్చుచుండు నపుడా బేరిపగతుఁడును నాయూరిరాజునకుం గొలువుసేయువాఁడు నైన భరతుఁ డనువాఁ డాజంగమునిం బట్టుకపోయి రాజునకుం జూపించి వీఁడు మనమార్తుఁడైన కపిలపురరాజునొద్దనుండి వచ్చిన వేఁగువాఁ డని చెప్పి వానిం బొరిమాలించెను. జంగముని యాలియైన నీలి యనునది 'మాకిట్టి వల్లడి యొనర్చినది తగవగునా? ఇదియుఁ బాడిసే?' యని నాచారివాపోవుచుఁ బదునాల్గునాళ్ళదనుక నానగరివీదులలోఁ దిరుగాడుచుండెను. పెండియు నామె దనమగని నెనయుటకొంకె తనయుసులుం దొఱఁగించుకొనుటకుఁ దలకొని యొకకొండకొసకెక్కి 'మాకిడుమ లొనర్చిన వారలు మఱుపుట్టువున నిట్టిగొడవలందఁగల' రని నొడివి పొరిమాలెను.

ఆభరతుఁడే యిప్పు డీకోవలుఁడుగాఁ బుట్టెను, కాఁబట్టి, మీర లానీలి యిడిన తిట్టుమేర కిట్టియిడుమలం బడసితిరి. ఈవు నేటికిఁ బదునాలుగవనాఁటి మాపటివేళ నీమగనింగని బెరయఁజాలుదు' వని చెప్పి కన్నకి నూఱడించి యోలమాసగొనియెను.

కన్నకి తిరుచ్చెంగున్రుసేరుట: — పెంకియుఁ గన్నకి 'యిఁక నాపెనిమిటిం బొడఁగనినపిదపఁ గాని యొక్కెడఁ దడవుండఁజాల' నని నుడివి, మధురానగరముం దొఱఁగి వైగయేటి యొడ్డుదారిఁ బడమటికడకు నడచెను. పదునాలుగవ నాఁడు కొండవీటినుండు 'తిరుచ్చెంగున్రు' అను కొండమీఁదికి నెక్కి యందుండిన వేఁగిచెట్టు నీడలో నిలిచెను.

---

శ్రీ

# III వంజికాండము.



కొఱవతలు గన్నకిం గని మాటలాడుట:-—తిరుచ్చెంగున్రులో మనుచుండు కొఱవతలు వేగిచెట్టునీడలో నిలుచుండిన కన్నకినిం బొడగాంచి 'జగముతల్లీ! మావల్లిదేవింబోలె వఱలునట్టి మీ రెవ్వ' రని యడిగిరి. అందుకుం గన్నకి 'మగనిం గోలుపోయి పాండ్యమన్నీనిని మధురానగరమును మచ్చమాయించిన మతకరిని నే' నని మందలించెను. ఈమందలింపు వినిన కొఱవతలు వంచాడించి, నెత్తిమీఁదఁ గేలు జోడించి జోడా లొనర్చి యోలగించుచుండిరి.

కన్నకి మగనింగని మగనితో విన్రప్రోలి కేగుట:-—పదునాలుగవనాఁడు ఎఱసంజ మెఱయఁదొరఁకొనెను. అప్పుడు కన్నకి 'నాయొడయనిం దడయకఁ బడయుట కెడ మడరిన' దని యెడఁద నలరుచుండెను. తోడన, గోవలుఁడు వేలుపుఁగొడలితో వేలుపుటరదమున నెక్కి యేగుదెంచి కన్నకిమ్రోలం బొడకట్టెను. కన్నకి పంటింపక తనమగనిం దిలకించి యలవిలేని మెలరు పంది కొలిచి యతనితో వేలుపుటరదముపై వేడ్కమెయి నెక్కి కూరుచుండెను. వేలుపులు విరులజడిం గురిసి వారలం దోడ్కొని తరలి బాసవాలప్రోలిం డాసిరి.

ఈచందంబున నందంబుగఁ దనపెనిమిటితో విన్నుప్రోలికిం జనినదానిం దిలకించుచుండిన కొఱవతలు దమకొలమువారల నెలుఁగిచ్చి పిలిచి 'యీకొండమీఁద వేగిచెట్టునీడలోఁ బఱతెంచి నిలిచిన యీలువువేలుపైన కన్నకిదేవిని మనయింటివేలుపుగాఁ గొని కొలుచుచుందము. మనకు దీనికంటె నిగరపుదయ్యము వేఱొండు దొరక' దని ముచ్చటించిరి. పిదప నెల్లకొఱవతలుం గుమిగూడి పలువగల వాయిదముల వాయించుచు నీలువువేలుపైన కన్నకిం గొనియాడి పాడి గొండ్లియాడి పొగడి జేజేలిడి యోలగించిరి.

చేరరాజు తిరుచ్చెంగున్రుం జేరి కన్నకికర్జముల నెఱుంగుట:-—అట్టి యదనునఁ, గొండకొమరుం జూచుటకై 'సెంగుట్టువన్' అనుపేరి చేరరాజు దన దేవేరియైన వేణ్మాదేవితోడను 'ఇళంగోవడిగళ్' అనుపేరి తమ్మునితోను, నాలుగువగల బలగములతోడను వంజినగరమునుండి బయలుదేఱి పోయి దొడ్డేటి

యొడ్డున నొక్కయిసుముదిప్పలో విడిసెను. కొఱవలారాజు రాక నెఱిఁగి యేనుఁగుఁగోఱలు; అగరుకట్టియలు మలాకాకట్టియలు, పులికడాసములు, పులిగోళ్ళు, పందికొమ్ములు, వింజామరములు, తేనియకుండలు, మామిడిపండ్లు, నెమలితోఁకలు మొదలగు కానికలం గొంపోయి యారాజున కరిపెట్టి చెంగనాలిడి, కేలుమోడ్చి యోలగించిరి. వెండియు వారలామన్నీనిం దిలకించి 'జేజేరాజుం బోనితేజారు రారాజా! జేజే! రేరాజుం బోరయుఁ దేజారిన రాజా! జేజే! తొగనేజా యోజ మెఱయు బాహుసెన మారాజా! జేజే. ఈ కొండలో జరగినక్రొత్త యొకటిగలదు. ఈకొండలో నీపొదలకడ వేగిచెట్టు నీడలో మిగుల వెతారముతో నొకగరిత వచ్చి నిలిచెను. ఆకె దోతెంచిన కొంతప్రొద్దునకుం దెఱగంట్లు గొందఱు వేల్పుటరదములో నిటకు విచ్చేసిరి. ఆయరదములో నాక్రొత్తడి పెనిమిటియు నుండెను. పంటఁపక నామెయు నాయరదము మీఁద నెక్కి మగనిచెంగటం గూరుచుండెను. తోడన, బాసవాలాయరదముం దరలించుకొని మింటితెరువుదారి జేజేయిక్కం జేరిరి. పుత్తడి బొమ్మం బోనియాక్రొత్తడి యెవ్వరో? మేమెఱుఁగ' మని విన్నవించిరి.

గోవలునినడవడులం గూలవాణికసాత్తఁడు చేరరాజునకుం జెప్పుట:—

ఇట్టివిన్నపములం జెవిఁగొన్న మన్నీఁడు, నాతనివెంబడి వచ్చిన బలగములును వెఱగందిరి. అప్పు డచ్చట కేతెంచియుండిన యఱవపలుకుటొజ్జ యైన 'మధుర కూలవాణికసాత్తనార్' అను విన్నాణి మధురలో గోవలుఁడు నక్కాడఁబడినదియు, నచటం గన్నకిచే జరిగింపఁబడిన దెష్పరములను, మధురాపురి వేలుపైన మధురాపతి పొడచూపి కన్నకికిం జెప్పినయెడాటములను, చేరరాజునకును మఱియందఱికిని వెల్లాటకముగా వెల్లడించెను. సెంగుట్టువచేరరాజు నెడుంజెళియఁ డనుపాండ్యుని చావునకుం జాల జాలింగొని గోడాడెను. పిదప, చేరరాజు దనదేవేరి వేణ్మాదేవి వేఁడుకోలు నియ్యకొని కన్నకియైన యీలువువేలుపునిలువు నెలకొలిపి కొలుచుటకుం దలంచెను. కన్నకియొక్క నిలువుం జేయుటకు వలిమలనుండి ఱాయి దేవల నని తలపోసి యాఱేఁడు దనప్రెగ్గడలు మొదలగువారలతో మంతన మొనర్చి తీర్మానించి వంజినగరముం జేరెను.

వంజినగరముం జేరినయంత చేరరాజు దెఱవామెకపుగద్దియపై, కొలువమరెను. అప్పుడు ప్రెగ్గడలు పడవాలు మొదలగువార లోలగముం జేరి చెంగనా లొనర్చి జేజేలొట్టి యోలగించిరి. ఱేఁడు వారలంజీరి, "మునుపు వలిమ

లనుండి వచ్చిన నిరాబారు 'లార్యరాజులరైన కనకవిజయులు దమిళనాటి మన్నీనుల నెకసక్కెముులాడి' రని నుడివిరి. కాఁబట్టి యిప్పుడు మనము సలి కొండనుండి తేఁగల బండ నాయార్యరాజుల తలలపై నెక్కించి తేవలెను. అట్లుసేయనియెడల నేను రాజుఁ గాఁజాల" నని యొట్టువెట్టెను.

చేరరాజు, పంటింపక, తన బలగములతో దాడివెడలి మంచుఁగొండం గుఱించి యేగుచు దారిలో, నీలగిరిం జేరి విడిసిరి. అప్పుడు వలిమలనుండి వచ్చిన నిరాబారులు మన్నీనిం జేపెట్టిరి. పిదప, సెంగుట్టువచేరఁడు కావిరి గట్టు వదలి యేగి మిన్నాకం జేరెను. అందతని నంటురాజులైన కన్నరను వారలు పడవలందెచ్చి యుంచి యుండిరి. కన్నరులు దెచ్చిన యోడలమీఁద నెక్కి తనదండుతో నవతలిగట్టుంజేరి వేలముల నేర్పఱుచుకొని విడిసియుండిరి.

చేరరాజు కనకవిజయుల గెలిచి కన్నకికిం బనుకుఁ గొనుట:—సెంగుట్టువరాజు విచ్చేసియుండుట నార్యరాజు లయినకనకవిజయుల కెఱుకవడెను. తోడన వారలు దమబలగములతో నుత్తరుఁడు, చిత్రుఁడు, విచిత్రుఁడు, భైరవుఁడు, సింగఁడు, ధనుర్ధరుఁడు, స్వేతుడు మొదలగుడాకడవిలాతిరాజులు పలువురం జేర్చుకొని సెంగుట్టువచేరరాజు నెదిరించి కడంకతోఁ గడిఁదికయ్యా మొనర్చెను. అట్టియాలమున నార్యరాజులపౌఁజు లన్నియుఁ బాడఱెను. కనకవిజయు లిర్వురును, నూఱుతేరు దావరులును సెంగుట్టువరాజుచేతం జిక్కిరి. మఱిం బలువురు జోగులుగాను, గాణలుగాను, పాతరలాడువారలుగాను వేడబములు దాల్చి పఱువిడి పలుతావులలో డాగికొనిరి. దురమున గెలు పొందినపిదప, క్రొత్తడివేలుపైన కన్నకికొఱకు వడఁకు గొండనుండి పడుకుం గొనెను.

అందఱు నగ్గించునట్లు పదునెనిమిదిగడియలలోఁ గయ్యముం గడ ముట్టించి గెలుపుగొన్న సెంగుట్టువరాజు దాఁ గొండఱేనినుండి పెకలించికొన్న ఱాతిం గనకవిజయులతలలో మోపెట్టుకొని జేజేజాలుడాపలిగట్టునకుం దెచ్చెను. ప్రాఁబలుకుపలుకుమేర కాఱాతిన్ మిన్నాకనీటిలో నునిచిపెట్టెను. పదపడి యతఁడు తనదాడితో నావలయం దెక్కి చదలేటివలగట్టుం జేరి, యచట నార్యరాజులచే నమర్పఁబడిన విడిదిలోవిడిసి తన దడములోని దండిమగలకుఁ బలువగలచాగముల నొసంగెను.

మాతలుఁడను పాఱుఁడు చేరరాజుం జేరవచ్చుట:—అట్టితఱి, మిన్నేటిలో నీరాడవచ్చిన మాతలుఁ డనుపాఱుఁడు, చేరరాజుంజేరి 'రాజా! నీయేలు

బడి యెల్లప్పుడు నెనక మెసఁగుఁగాక! ఏను గంధపుఁగొండను వలగొనివచ్చి కన్యాకుమారినీటిలోఁ గ్రుంకి, పాండ్యరాజ్యమున కేతెంచితిని. తోతెంచిన తోడన నచ్చటం గోవలుఁడు జూవరముగాఁ జావఁబడినదియుఁ, బాండ్యుఁడు నతనిదేవేరియుఁ బిలుకుమాలినదియు నాలకించి జాలితోఁ బ్రేతలపల్లెకుం బోయితిని. అచ్చటఁ, 'గౌంతియడియరి నాయం దిల్లడగా నునిచిన బిడ్డలం గోలుపోయితినే' యని వాచారి వందురి మాతరి యనుగొల్లత ప్రాణిదినదియు, 'గోవలునికిం దోసఁగు వొసఁగించిన పాండ్యునిం దిట్టుటకుమున్న పిలుకుమాలి నాఁడే' యని యేఁకరించి నిట్టూర్పాసముఁపూని కౌంతియడియరి గడచనినదియు నెఱిఁగి యేను కావిరిప్పూంబట్టణము నొద్దుతిని. ఆపట్టణములోని కొందఱికీయెడాటములం జెప్పితిని. ఈయెడాటములం జెవిగొన్న కన్నకీగోవలుల తల్లిదండ్రులు గడలేని గొడవపాల్పడి బౌద్ధసన్న్యాసులయిరి. తల్లులు వనటంబడి పొలివోయిరి. మాధవియుఁ దనవిరులు గుఱుల గొఱిగి విసరివైచి బుద్ధమతజంగమురాలాయెను. నానొడులం జెవిగొన్న కొన్నిమానిసిలు ప్రాణిదిరి, కాఁబట్టి యీకావలము నేవగించుకొనుట పొంటె నేను జదలేటికివచ్చి క్రుంకులిడి యేలికవారిమ్రోల నేతెంచితి" ననెను.

ఇట్టి కడిఁదినుడువ్రల నాలించి సెంగుట్టువరాజు 'నెడుంజెళియ పాండ్యుఁడీల్గినపిమ్మట నావిలాతినేలువా రెవ్వా'రని మాఠలుని నడిగినందు కాతఁడు 'మహారాజా! కొర్కైకొట్టికలో నుండిన చుట్టురాజైన వెట్రివేల్పాండ్యుఁడు వేయియగసాలెముదుకలఁ గన్నకికిం గావిచ్చి బొబ్బమెకపుగద్దియనెక్కి యేలుచున్నాఁ' డనెను.

మాఠలునికి, పైఁడిచ్ఛాగమిచ్చి చేరరాజు వంజినగరమునకు విచ్చేయుట:-

పడమటికడపడఁతి దనకడకుం దమ్మిమగఁడు దడయక రాఁగలఁడు; వెడవిలుతుని చెయిదములం బడయఁగల మని చెంగావిచీరగట్టి, తమ్మికెంపుల తొడవులం దొడిగి, కెందమ్మివిరులదండ నఱుతం దాలిచి, వలపుగులుకుఁ దనమేనఁ గెంజాయగంద మలఁది సొబగుగాఁ గైసేసి జేగుఱుచందురజోతులంటించి యెదురు వేచుచుండునట్లుగా మునిమాపు పెనుపారుచుండెను. అప్పటికి రాజసోదెకాఁడొకఁ డేతెంచి మిక్కిలియణకువతో నెదురువేచి 'రాజా! మనము వంజిమానగరముం దలఁగివచ్చి నేఁటికి ముప్పదిరెండునెలలు ముగియుచున్నవి. ఇఁక మనయూణియమునకు మరలి యేగుట మంచిది యని మన్నీనివారిమ్రోల వి

న్నవించుకొనియెద'నని మనవిసేసికొనియెను. పిదప సెంగుట్టువరాజు సోదెకాని పలుకుల నియ్యకొని మాతలునితో నొక్కింతప్రొద్దు ముచ్చటలాడుచుండి యతనికిఁ దనయెత్తైన రెండుబారువులపసిఁడి నీవిగా నొసంగెను. పదపడి చేరరాజు దననంటురాజులైన కన్నరులు నూఱుగురం దమతమనెలవులకుం దరలుఁడని సెలవిచ్చిపంచి, తనచే గెలువఁబడిన కనకవిజయులఁ జోళపాండ్యరాజులకుఁ జూపి రమ్మని నీలుఁడు మున్నగు వేగులకుం గట్టడసేసి పుత్తెంచెను. పిదప యోగిరము లారగించి పాన్పునం దెచ్చుండెను. అఱేయిఁ గూర్కొనియుండి వేకువలేచి రేపటిచెయ్వులం దీర్చుకొని యచ్చోటువిడిచి బయలుదేఱి, తన దండుతో వెడలి పయనమయి వంజిమానగరముం జేరి, నగరుకోటకుం బోయి తనదేవేరిని మఱింగలవారలం బుజ్జగించి యొలరుపురణ వెలరారుచుండెను.

ఇటీవల సెంగుట్టువచేరమన్నీఁడు మన్నెఱికము సేయుచుండుతఱి నొకనాఁడు రాజు పేరోలగంబునం గొలువమరియుండ నడచున నీలుఁడు మొదలగు వేగువారలు దోతెంచి చేరరాజునకుం దెఱంగనాలిడి, నొసటం జేఁదోయి మొగిడ్చి "రాజరాజ! దేవరవారికట్టడమేరకు మేము కనకవిజయులం దోడ్కొనిచని చోళపాండ్యమన్నీలకుం జూపించితిమి. వారలిరువురును 'ఓటువడి మారటనిలువ్రాని వెన్నిడిపాఱినవారల నీకరణిం బట్టితెచ్చుట రోఁతచెయ్వులగు'నని నుడివిరి. మేము కనకవిజయులతో నిటకువచ్చితి"మని విన్నవించిరి. ఆపలుకుల నాలించినంతనె చేరరాజునకుఁ గనరు పొనరి చిందఱరేఁగెను. అప్పు డందుండిన మాతలుఁడు లేచి 'మహారాజ! మీరందినకినుక నణపుఁడు. గోవ, ఒడలు, కలిమి మొదలగునవి నీటిమీఁది బుడగలవంటివి. అవి మించుంబలె పొడచూపి పొడవడంగునట్టివి. పడయుట కరుదైన యీమానిసిపుట్టువుం బడసిన మనము మనమునికితములో గామిడికర్జములం గావించి యిందునందును వాసికెక్కి మంచియునికి నెనయవలయును. కాఁబట్టి మంచియునికి నిచ్చునట్టి వేలిమి మొదలగువెంటల వేఁకమెయినొనర్చి పెంద్రోవకుం దెరువుఁ గడఁకతో గడింపవలయు'నని మందలించెను. ఇట్టియింపుమాటల నాలించి చిరాకుడిందుపడి, మాతలుని మాటనీటున వేలిమి వేల్చుటకు నియ్యకొనెను. వేలిమికి వ్వలసిన బండముల నొడగూర్ప నేర్పరులు గొందఱ నేర్పఱిచి పుత్తెంచెను. ఆర్యరాజు మొదలగువారలం జెఱదొలఁగించి, తనవేలిమి కొనసాగునంతకు వారలకు వలసినబండముల నవ్వారిగా నొసంగి తనిపించునట్లు దనప్రెగ్గడలలో నొకఁడైన విల్లవగోదునకుఁ గట్టడయిడెను.

జాతిచేఁ జేసినకన్నకినిలువును గుడిలో నెలకొలుపుట:—ఇటీవల సెంగుట్టవరాజు దనప్రెగ్గడలను బెద్దలను, బాఁపనలను, సోదెకాండ్రను దనతో వెంబడించుకొని చని వాసికెక్కు కాసీలచే నీలువువేలుపైన కన్నకికొఱకుం గట్టంబడినగుడిలో, మంచుకొండనుండి తీసి పొంగుమనుఁగులోఁ దడియఁ బెట్టి తెచ్చిన జాతిచేఁ జేయఁబడిన నిలువునం గన్నకిని నెలకొలిపి (ప్రతిష్ఠించి) కొలిచెను. మఱియు నేమముగా దినచాగుబడికలును, పండుగలును, జక్కగా జరగునట్లు ప్రెగ్గడలు, బాపనులు, పూజారులు మొదలగువారలకుం గట్టడసేసి సెంగుట్టువరాజు దేవళపు దాపుననే యోలగించి మనుచుండువాఁడాయెను.

గోవలుఁడు దునుమాడఁబడినది మొదలగు కర్జము లన్నింటిని మాతలునిచే వినఁబడిన దేవంతియుఁ గన్నకియొక్క పెంపుడుతల్లియుఁ దానిచెలికత్తెయు నొండుగూడి మిగులవగచుచుఁ గన్నకిం జూచుటకై గొనకొని కావిరిపూంబట్టణమునుండి బయలుదేఱి మధురానగరముం జేరిరి. అటం గన్నకిం గానక గొల్లపల్లెలో నుండిన మాతరిచెంకి సేరిరి. అచ్చట మాతరి మచ్చమాసినది యెఱిఁగి వగటంబడి వందురి వాపోయిరి. పదపడి యా ముప్వురును మాతరికూఁతు రైన ఐయతోఁ గూడి వెడలి వేగవతి యేటియొడ్డుగుండా పోయి తిరుచ్చెంగున్రు అనుకొండమీఁదికి నెక్కిపోయి కన్నకిగుడిం జేరిరి.

అప్పు డాకన్నకిం గొలిచి నిల్చుండిన సెంగుట్టువరాజు నానలువురు మెలఁతలుం గని రాజుం గొలిచి దీవించిరి. వెండియు నావెఁదులు దాము పలానివారల మని మన్నీనికిం దెలిపి కన్నకియొక్క యెడఁబా[illegible]వంతల నోర్వలేక యలమటంబడి పలువరించిరి. అప్పుడు కన్నకి చిటిబిందులు, పసిండిపెండెరము, మగతాలకమరు, ముంగాముఱువులు, సందిదండలు, బన్నసరులు, సరిపెనలు, పంజులకమ్మలు, రావిరేకలు, ముంగఱ, జిలిబిలిజల్లులు, ముద్దుటుంగరములు మొదలగు తొడవులును చెంగావిజరబాజువలిపముం దాల్చి క్రొక్కాఱు మెఱుంగుం బోనిమేని జగాజిగిమెఱయ నొకవేలుపుకొడలితోఁ దిన్నగ మింటం బొడకట్టెను. ఆచెం జూచి చేరరాజుమున్నగువార లక్కజముపా లయిరి. పదపడి కన్నకి 'పాండ్యరా జెంతేనియు నాకెగ్గొనర్చినవాఁడు గాఁడు. వాఁడు మొగిలుకొతుగీమున ముచ్చటగా నారజమొంది మెఱయుచున్నాఁడు. ఏనీపాటినిగరము నందినది యతనివలనంగదా? కాఁబట్టి యే నతని కల్లారుముద్దుఁగూఁతు

రను. ఏ నీకొండ నెత్తమ్మువిూఁద నెల్లప్పుడు నాడుచుందును. చెలులారా! మీర లందఱును మునుపటివలె నాతో నాడుటకురం' డని, ముచ్చటించెను. అట్టియలరుపలుకుల నాలకించి యచ్చటి కేతెంచియుండిన వంజినగరివెలఁదుకలు, ఈలువువేలుపైన కన్నకిని బలువగల నగ్గించి కైవార మొనర్చిరి. తోడన చేరపాండ్యరాజులఁబొగడి జేజేవెట్టిరి.

ఈలాగున నీలువుదయ్యము సెంగుట్టువఁడు మొదలగువారలకు దరిసెనమిచ్చి యోలమూసగొనినపిదప దేవంతి, మణిమేఖల యిలుదోఱఁగిన వెంటన్వెల్లడించెను. పదపడి, యాదేవంతిమీఁద సుమాళిము వచ్చి, దానికెఱులు విరిసివెన్నున వ్రేలాడఁ, గన్నులు జేగుఱింపఁ జేతుల మీఁదికెత్తుకొని గొంట్లియాడెను. అలసుమాళిము మాతలునిం దిలకించి 'ఏను పాషండశాత్తఁడు; ఈదేవంతిమీఁద సుమాళమ్మై వచ్చియున్నాఁడ; గుడిలోనం గన్నకియొక్క నెలకొలుపుం జూచుటకొఱకే కేగుదెంచిన యెలనాగలలో నిరువురును, అరట్టసెట్టియొక్క యమడలు; మఱియొకరిత తిరువనందపురములోనఁ బాఁపపాన్పునం బరుండియుండు పెరుమాళ్లకు వేల్పుతొనర్చు పాఱునికూఁతురు. ఈముువ్వురు ముగుదలమీఁదను మునుపు నీచేతం బెట్టిన నీటిం జల్లు' మని నుడివెను.

చేరరాజు, పంటింపక, మాతలునిం దిలకించెరు. మాతలుఁడు కావిరిపూం బట్టణములోని వల్లకాటియొద్దనుండు గుడిలో నెలకొనియుండు పాషండశాత్తఁ డొకబాఁపత బొడిగమై యాపెద్దగఱ నెదిగి, దేవంతినిం బెండ్లియాడి, దేవంతితోఁ గొంతదడవు మనియుండెను. వెండియు నోరులెఱుఁగని తెఱఁగునం దనగుడిసొచ్చి నెలకొనిన నడవడు లంతయు నూచముట్టిగా సెంగుట్టువనికిం జెప్పెను. వెండియు మాతలుఁడు, దా నాపాషండశాత్తనియొద్దనుండి తీర్థముం జెందిన తెఱఁగుఁగూడ చేరరాజునకుం జెప్పి, తనచేతనుండిన గిండిలోని యానీటి నాసుమాళిము నొడివిన పడువున నలముువ్వురు పూఁబోఁడులమీఁదం జల్లెను. తోడన, యామెలఁతుకలు కన్నకియొక్క తల్లి, గోవలునితల్లి, మాతరి యను ముగ్గురును మఱుపుట్టువులరుగాఁ బొడసూపిరి.

కన్నకీగోవలులతల్లులు, మాతరియనుముగ్గురు నక్కరణి పుట్టినందులకుం గతమును మాతలునిచే సెంగుట్టువతేఁ డెఱిఁగెను. పిదప సెంగుట్టువఁడు కన్నకికిం దినచాలుబడిక యొనర్చునట్లు దేవంతికిం జెప్పి, తానాదేవతను ముమ్మాఱు వలగొని వచ్చి యోలగించి నిలుచుండెను. అప్పు డార్యరాజులును,

మాళవరాజును, లంకాపురిరాజైన గయవాహుఁడును నచ్చటికి విచ్చేసి కన్నకిదేవిం గొలిచి 'దేవీ! యీసెంగుట్టువజేని వలననే మేమును మానగరిలో నీకు గుడికట్టి నిత్యపూజ మొదలగువానినిం జేసెదము. ఈ వందులకు విచ్చేసి మే మొనర్చుచాలుబడికల నియ్యకొని మమ్ములం బ్రోవవలయు' నని వేఁడి కొలుచుచుండిరి. అప్పుడు 'మీరలు వలచినచొప్పున మెప్పు లొసంగితి' నని యొకపలుకు వినఁబడెను. ఆపలుకుల నాలకించి సెంగుట్టువమన్నీఁడును, పెఱమన్నీలును నలవిలేని యులరుపునం బొలుపారిరి. కదపడి సెంగుట్టువఁడు మాఁతలునితో వేలిమికాపునకు వేంచేసి, వేలిమి నేలిమిగా నొనర్చి నేమముతో నిగిరికల నాయూబాసపాలులకు వాసిమీఱ నొసంగి, వారలిడిన మెప్పుల నంది తనిసి పాటులకుం బేదసాదలకు మదిత్రుప్పటిలం బంగారముల, రంగారుదీమంబుల, నెక్కిరింతలఁ, దొడవుల, మిన్నల, నన్నులమిన్నల, నేలల, వలిపంబుల, నోగిరంబులం జాలుఁజాలు నన్నట్లవ్వారిగా నొసంగి యీనేల నేలిమిం జెందెను.

సెంగుట్టువజేని తమ్ముఁడైన 'ఇళంగోవడిగళ్' అనువిన్నాణి కన్నకిగుడికి విచ్చేసినప్పుడు కన్నకి దేవంతిమీఁద సుమాళముగా వచ్చి యతనిమ్రోల నిలిచి తననడవడు లంతయు నూచముట్టుగా నిట్టిట్టి వని చక్కగా వెల్లాటకముగా వక్కాణించెను. అట్టిజానుగుఁచవి యైనమందలింపుల నాలించి ఇళంగోవడిగళ్ ఇంపుసొంపారెను. క్రొత్తడివేలుపైన కన్నకిదేవియందుం గల కూరిమి పేరిమిచే నామె కత లన్నింటిని నఱవపలుకులో దొడ్డనిగరంపుఁగబ్బముగా 'సిలప్పధికారము' అనుపేరఁ గైతలల్లి పొగడితం గనెను.

ఈసిలప్పధికారము * ద్రావిడపంచమహాకావ్యములలో మిన్నవలెఁ జెన్నుమీఱి, యీనేలం బెచ్చుపెరిఁగి పిచ్చలించుచున్నది.

---

* ద్రావిడపంచమహాకావ్యములు:—1 సిలప్పధికారము, 2. మణిమేఖల, 3. జీవకచింతామణి, 4. వలయాపతి, 5. కుండలకేశి.

# వివిధవిషయములు.



భరతభాష్యము నాన్యదేవవిరచితము:—భరతముని ప్రణీత మగు నాట్యశాస్త్రమునకు అభినవగుప్తుఁడు వివృతి(వృత్తి)నొకదానిని వ్రాసియున్నాఁడు. నాన్యదేవవిరచిత మగుభరతభాష్య మనునొకగ్రంథము భండార్కరు గ్రంథాలయమునఁ గలదు. గ్రంథమువలన నతనికిఁ గర్ణాటకులభూషణ, రాజనారాయణ, నృపమల్లాది బిరుదములు గల వనియు, నతనియనుఁజుడు కీర్తిరాజ నృపతి యనియు సౌవీర, మాళవ, గౌడ, బంగాళనృపతుల నాతఁడు నిర్జించె ననియుఁ దెలియుచున్నది గ్రంథమహార్ణవ మనుగ్రంథమును గూడ నాతఁడు రచించెనఁట. అతఁడు క్రీ. శ. 1097-1133 వఱకు మిథిలానగరమున రాజ్యపాలన మొనరించె నని జయస్వాలుగారు వ్రాసియున్నారు. రాష్ట్రకూటరాజులు కర్ణాటు లనియు దక్షిణహిందూస్థానమున వారిరాజ్య మంతరించినయనంతరము వా రుత్తరహిందూస్థానమునఁ జిన్నరాజ్యముల నేలుచుండి రనియు, నాన్యదేవుఁడును, గీర్తిరాజును రాష్ట్రకూటవంశజు లనియు శాసనాదికములవలనఁ దెలియుచున్నది. నాన్యదేవుఁడు తనగ్రంథమున మతంగ, యష్టిక, నందీశ, నారదాదిగ్రంథకర్తలను బేర్కొనియున్నాఁడు. భరతుఁ డొనర్చిన నాట్యశాస్త్రవిభాగము లగువాచిక, ఆంగిక, సాత్త్విక, ఆహార్యముల యందు వాచికాంశనుమాత్రము నాన్యదేవుఁడు తనగ్రంథమున విశదీకరించినటులు గన్పడుచున్నది. మిగిలినభాగములపై నాతఁడు భాష్యమును రచించెనో లేదో తెలియరాకున్నది. గ్రంథమున దెల్పఁబడినవివిధవిషయములఁ దెలియుటకు నాంధ్రచారిత్రపరిశోధకమండలివారిచేఁ బ్రచురింపఁబడిన మానవల్లి రామకృష్ణకవిగారివ్యాసమును Vol. I Page 54-64) జూడనగును.

---

బౌద్ధయుగమున నాఫగనిస్థానము గాంధారదేశమున నొకభాగమై యుండెను. అందు బౌద్ధమతము విశేషముగఁ బ్రబలి యుండెను. ప్రస్తుతము బెగ్రాము, జెలాలాబాదు అను పట్టణములసమీపమునఁ గపిశానగరాహారము లనుగొప్పపట్టణము లుండెను. బౌద్ధమతావలంబి యగుకనిష్కునికాలమునఁ గపిశానగరము గ్రీష్మర్తువున రాజధానిమై యుండెను. నగరాహారమున దీపంకర బుద్ధుఁడు నివసించుచుండె నని బౌద్ధగ్రంథములవలనఁ దెలియుచున్నది.

హ్యూయెనుసాంగు తనగ్రంథమున నీపట్టణముల వర్ణించి యుండెను. మహమ్మదీయమతము పెక్కుశతాబ్దము లాదేశమునఁ బ్రబలియున్నను, నాపట్టణప్రాంతముల బౌద్ధవిహారములును, స్తూపములును జాడఁ గలవని పరిశోధకులు వ్రాసియున్నారు. పెక్కుశిల్పములను గలిగి బౌద్ధమతమును స్మరింపఁజేయు జలాలాబాదునందలి ఖైస్తాతోఁపువు, గాబూలునగరప్రాంతమున మినార్ చక్రి యనఁబడు శిలాస్తంభమును బామియనుప్రాంతమునఁ గలబుద్ధవిగ్రహములు నందు ముఖ్యములు. బామియనుప్రాంతమున నూఱు నూటయేఁబదియడుగుల యెత్తుగల బుద్ధవిగ్రహములు గలవఁట.

---

నూతనముగ టైపుయంత్రసహాయముచేఁ జిత్తరువుల వ్రాయుట సాధ్యమగునని కనిపెట్టఁబడినది. ఆచిత్రములు చిత్రలేఖనస్వరూపముల కెంతమాత్రము దీసిపోవుటలేదు. మాడరనురివ్యూ ఫిబ్రవరిసంచికయందలి తిలకు, రవీంద్రనాథుల చిత్రములఁ గాంచిన నట్టిపద్ధతిచే రమ్య మగుపటముల వ్రాయవచ్చునని స్పష్టపడఁగలదు.

---

పాశ్చాత్యనాగరకత శాస్త్రపరిశోధనములచే నానాఁటికి వింతమార్పులఁ జెందుచున్నది. మణిబంధమున గడియారముల ధరించునాచారము పోవుచున్న దనియు షర్టుబొత్తములయందే (Cuff link watch) చిన్నగడియారములమర్పఁబడుచున్న వనియు వినుచున్నాము. షర్టుచు దొలఁగింపకుండ సునాయాసముగఁ గాలమును దెల్పుటకునై యీపద్ధతి నవలంబించుచున్నారు.

---

వివాహవిషయములఁ బాశ్చాత్యవాతావరణ మల్లకల్లోలముగ నున్నది. నానాఁటికిని వివాహబంధచ్ఛేదనకు న్యాయస్థానము లెక్కు వగుచున్నవి. దైవసన్నిధి నొనర్పఁబడుటచే వివాహములు పవిత్రము లనియు, నట్టివివాహబంధములను ద్రెంచుటకై మానవుఁ డొనర్చుప్రయత్నములు శోచనీయములనియు జెరమీటెయిలరుగా రొనర్చిన యుపన్యాసములును నందలి యుదారభావములును బూర్తిగ నంతరించినవి. (Jeremy Taylor in his sermon on 'The Marriage Ring') ప్రస్తుతపరిస్థితులయందు వివాహముకూడ నొక "ఖరారునామా" వంటిదనియు, దానికి మతవిషయములతోఁ గాని యితరవిషయములతోఁ గాని యెట్టిసంబంధమును లే దనియు వాదము ప్రబలుచున్నది. అమెరికాసంయుక్తరాష్ట్రముల నొకవత్సరమునకు సుమారు లక్షయునేఁబదివేల

వివాహములు శిథిలీకృత మగుచున్న వనిన నచటి శోచనీయపరిస్థితులఁ బాఠకు లూహింతురుగాక. ఇంతటితో సంతసింపక పాశ్చాత్త్యుల భావములు వేఱుమార్గముల ననుసరించుచున్నవి. నేఁటిన్యాయసభలయందుఁ దగుకారణములు లేక వివాహబంధమును రద్దుపఱుచుకొనుటకు వీలు లేకపోవుటచే, నట్టియభ్యంతరములు లేక స్వేచ్ఛగా నుండుటకై ప్రయత్నము లొనర్పఁబడుచున్నవి. రష్యాదేశమునందు స్వతంత్రప్రేమ యనునూతనవిధానము ననుసరించి (Doctrine of Free love) నేఁడు జరిగినవివాహము కొలఁదికాలములో నశ్రమముగ రద్దుపఱుచుకొనవచ్చు ననియు, నందు కెట్టికారణములు నవసరము లేదనియుఁ దెలియవచ్చుచున్నది. స్త్రీపురుషబాంధవ్యమునకు వివాహమునకు నిచ్ఛయే కారణము గనుక నట్టియిచ్ఛయే వివాహబంధమును రద్దుపఱుచుకొనుటకుఁ బ్రబలకారణ మగునియు వేఱుకారణము లనవసరము లనియు వీరియాశయము. రష్యాదేశమున నిట్టియూహలవలన లక్షలకొలఁది స్త్రీలు వారిసంతానములఁ బోషించుకొనలేక పెక్కులిడుములం బొందుచున్నారు. ఇట్టివిరుద్ధలక్షణములఁ గనులారఁ గనియుఁ, బత్త్రికలయందుఁ జదివియుఁ బెక్కురుమహనీయులు పాశ్చాత్త్యజీవితానుకరణమే మనకు మోక్షసాధనమని తలంచుచు శాసనసభల నూతనశాసనములం బ్రవేశపెట్టుచున్నారు. హిందూమతసాంప్రదాయములను, సనాతనధర్మములను మంటఁగలుపుటకు యత్నించుచున్నారు. పాశ్చాత్త్యవివాహవయోనిబంధనములను వివాహముల రద్దుపఱుచుకొనుసూత్రములను జనసామాన్యమున కిష్టములేకపోయినను శాసనమూలమునఁ బ్రామర్య్యమొనర్చి జనుల శాసనబద్ధులఁ జేయుచున్నారు. హిందూమతజీవితముల కెట్టిశాసనములు శ్రేయోదాయకములో యట్టిశాసనముల మాత్రము శాసనసభలఁ బ్రవేశపెట్టవలయు ననియు, సంఘసంస్కర్తలు ప్రాచ్యపాశ్చాత్త్యపరిస్థితులఁ జక్కఁగఁ బరిశీలింపవలయు ననియుఁ, గేవలపాశ్చాత్త్యనాగరకతావలంబనమువలనఁ గలిగిన వ్యామోహమును విడువవలయు ననియుఁ గోరుచున్నాము.

---

# పత్రికాస్వీకారము.



1. ఇంద్రావతి :—ఈపత్రిక కర్నూలుజిల్లా పత్తికొండలో వనం శంకరశర్మగారిచే బ్రకటింపఁబడు వారపత్రిక. ఇందు రాజకీయ సాంఘిక సాహిత్య విషయములు చర్చింపఁబడును. దత్తమండలములలో నానావిషయముల నుద్బోధన మొనర్చుటకుఁ గడంగిన పత్రికాధిపతిప్రయత్నము ప్రశంసనీయము. ప్రథమసంపుటము 28 సంచికయందు, కావ్యతత్త్వమను వ్యాసమును, గుండాలక్ష్మీయతు మొదలగు చరిత్రవిషయములును గలవు. సంవత్సరమునకు, చందా రు. 4_0_0 వలయువారు ఇంద్రావతీకార్యాలయము, పత్తికొండ, కర్నూలుజిల్లా యనివ్రాయవలయును.

2. యుగంధర :—ఈవారపత్రిక వేలూరునందు ఎం.యల్.యన్. శర్మగారిచే బ్రకటింపబడుచున్నది. సంవత్సరమునకు చందా రు. 3_0_0. మాకార్యస్థానము నలంకరించిన సంచికయందు 'ఓర్వలేమి' యను ఖండకావ్యమును, హనుమజ్జీవితప్రబంధములోని కొన్నిపద్యములును, గలవు. సాహిత్యవిశారద కోన వేంకటరాయశర్మగారిచే రచియింపఁబడిన 'అనుమకొండప్రాశస్త్య' మను నొకచారిత్రకవ్యాసముగూడఁ గలదు.

3. సత్యసాధని :—మచిలీపట్టణమున యస్. జగన్నాథరావుగారిచేఁ బ్రచురింపఁబడు వారపత్రిక- సంవత్సరమునకు చందా రు. 3 0.0.

4. యాజ్ఞవల్క్య :— ఇది యఖిలాంధ్రయాజ్ఞవల్క్యమహాసభవారు యాజ్ఞవల్క్యసంఘాభివృద్ధికై ప్రకటించు మాసపత్రిక. సంవత్సరమునకుఁ చందా రు. 2.0.0 వలయువారు గాడిచెర్ల సూర్యనారాయణగారు, యాజ్ఞవల్క్యపత్రికాప్రకాశకులు, కాకినాడ యనివ్రాయవలయును.

5 భారతకథానిధి :—కడపజిల్లా ప్రొద్దుటూరునందు ఎం. రామసుబ్బయ్యశ్రేష్ఠిగారిచేఁ బ్రకటింపఁబడు మాసపత్రిక. పెక్కుచిత్రకథలును గొన్ని ఖండకావ్యములను గలవు. సంవత్సరమునకు చందా రు. 1-8_0.

6. శాంతి : — ఈమాసపత్రిక తూర్పుగోదావరిజిల్లా తోటపల్లి నివాసులగు ఓంకారస్వామిచేఁ భక్తిజ్ఞానవైరాగ్యవిషయములఁ దెల్పుటకునై ప్రచురింపఁబడుచున్నది. సంవత్సరమునకు చందా రు. 2.0.0.

7. రాజపుత్రాభివర్ధని :—విశాఖపట్టణవాసు లగుభూపతిరాజు సీతా రామరాజుగారిచే 'నాంధ్రక్షత్రియాభ్యుదయమునకును దేశాభ్యుదయమున కును' బ్రచురింపఁబడు సచిత్రమాసపత్రిక. కేవలము క్షత్రియులకే గాక తదితరులకుఁ గూడ రుచియించునటులు లలితకళావిశేషములును, కావ్యనాట కాదిశాస్త్రచర్చలును, జారిత్రకాదివిషయములు నిందుఁ జర్చింపఁబడు నని స్వవిషయమునఁ దెల్పఁబడినది. ఇట్టియాశయమే సరియైన దనియుఁ, బ్రతి సంఘమువారును దమసంఘవిషయములకే పత్రికలఁ బ్రచురించుచు వచ్చిన హిందూసాంఘికాభివృద్ధికిఁ గాని దేశోద్ధరణమునకుఁగాని తోడ్పడ రనియుఁ దలంచుచున్నాము. ప్రథమసంచికయందు వేదసారము, విస్మృతకవులు మొద లగు వ్యాసములు గలవు. సంవత్సరమునకు. చందా రు. 3-0-0.

---

# గ్రంథస్వీకారము.



సుయోధనవిజయము :—ఇది కాకినాడపురవాస్తవ్యు లగుబ్ర॥ కోట మర్తి చినరఘుపతిరావుగారిచే రచియింపఁబడిన సీసపాదములతోఁ గూడిన యేకాంకనాటకము. ఇందు సుయోధనుఁడు ద్వైపాయనహ్రదసమీపమునఁ దొడలు విఱిగి పడియున్నపుడు కృష్ణపాండవులును, బలరాముఁడును వచ్చిన వారివారితో సుయోధనునకు నడచిన సంభాషణముఖమున, కౌరవపాండవుల లో నెవ్వరిది న్యాయ మెవ్వరి దన్యాయ మనుచర్చయును, వ్యాసునికిఁ గల పాండవపక్షపాతచర్చయు, నతనికామోద్రేకము వలనియవిమృశ్యకారిత్వమును ద్రౌపదీస్వయంవరము, పంచపతిత్వవిమర్శనము, ద్రౌపదిజన్మము, ఆమెపాతి వ్రత్యవిచారము, కృష్ణుని యక్రమము మొదలగునవి తెల్పఁబడినవి. సాధార ణముగా భారతముం జదివినవారు చిరకాలమునుండి గ్రంథమునం దెట్లున్నను పాండవపక్షమువారుగానే కనఁబడుచున్నారు. "యతోధర్మ స్తతోజయ" మ్మని గాంధారిపలికిన దనియు, "యత్ర యోగీశ్వరః కృష్ణో యత్రపార్థో ధను ర్ధరః। తత్ర శ్రీర్విజయోభూతిః" ఇత్యాది పూర్వవాక్యములను బట్టియును, కాఁబోలును కౌరవులపక్షమునకు వ్రాలుట లేదు. భారతగ్రంథముమీఁదను, తత్కవులమీఁదను, కథాకల్పనము, ఇతివృత్తము మొదలగువానిపైని వివిధదే శస్థులు వివిధవిధములుగాఁ దమయభిప్రాయములను వెల్లడించుచున్న యీస

మయములో రఘుపతిరావుగారి యీవిమర్శనతోడి చిన్ని నాటకము బైలువెడలుట సత్యనిర్ధారణమునకై యగుఁగాక. రఘుపతిరావుగారి కీనాటకమును వ్రాయుటకుఁ గలయభిప్రాయమును వారే యీక్రిందిరీతిని దెల్పియున్నారు.

"మామామగారైన బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రులుగారితో భారతవిషయికప్రశంస వచ్చినప్పుడెల్ల భారతమందలి ధర్మము కౌరవపక్షమున నున్నదని చెప్పుచు వచ్చిరి. అంతియె కాక కురుపాండవదాయభాగముఁ గూర్చి వారు విపులముగాఁ జర్చించి యందుఁ బాండవులకు వారసత్వమే లేనట్లు రచియించి యుండిరి. వారివాదములును వ్రాఁతలును తెలిసికొనిన పిదప భారతమును తిరిగి జాగ్రత్తగా చదువుటచే భారతయుద్ధమందలి నిజమైనధర్మము విజయము సుయోధనునకే వచ్చినదని దృఢాభిప్రాయుఁడనై యీసుయోధనవిజయమును వ్రాయుటకుఁ బూనుకొంటిని. భారతమునందు మహాభక్తివిశ్వాసములు గలవారికి నాగ్రంథముపై కోపము రావచ్చును. వారికి భారతముపై నెట్టిభక్తివిశ్వాసములు గలవో నాకుఁ గూడ నట్టిభక్తివిశ్వాసములే సంపూర్ణముగ గలవని హృదయపూర్వకముగా విన్నవించుకొనుచున్నాను. కాని భారతమునందలి యితివృత్తములోని లోపములఁ గూర్చి ప్రజలకుఁ దెలుపునుద్దేశముతోడను...... నే నీగ్రంథమును రచించి ప్రకటించుటకు సాహసించితిని."

దీనింబట్టి వీరియభిప్రాయము బోధపడఁగలదు.

"సత్యరతిని బాయుట వ్యాసుండు పాపశాంతికి దాను భాగవతంబును వ్రాయఁదొడఁగె" నని సుయోధనవాక్యములో నున్నది. దీని నెట్లు సమర్థింపవలెనో!— దీని వెల రు. 1.

2. హిమ్మత్ సింగు:—ఈనవల భారతీగ్రంథమండలివారిచేఁ బ్రకటింపఁబడిన రెండవకుసుమము. వారణాసి లక్ష్మీనారాయణగారిచే రచియింపఁబడినది. రాజపుత్రుల యంతఃకలహములును మహమ్మదీయుల జయము నిందుఁ జక్కఁగఁ జిత్రింపఁబడినవి. కథానాయకుఁడగు హిమ్మత్ సింగుయొక్క పితృభక్తియు ధైర్యస్థైర్యములును, సత్యసింహునిరాజభక్తియుఁ బ్రశంసనీయముగ వర్ణింపఁబడినవి. వెల రు. 1-0-0.

24. a ప్రసంగరత్నావళి—గ్రం. సం. 77.

ఇందు 316 శ్లోకములు ప్రసంగోచితములైనవి కలవు. ఇందలిశ్లోకములనేకకవుల గ్రంథములనుండి సంగ్రహింపఁబడినవి. కొన్ని మచ్చునకు—

శ్లో॥ పక్షద్వంద్వవిరాజితోహ మమలో మీనప్రసేవీసదా
పూర్ణాంగ స్సకలోదితః పరిభవశ్చంద్రస్సమః కిమను
సర్వస్థానుశిరోగతోహ మనిశం చంద్రం బకోహాసతే
మాత్సర్యేణ దురాత్మకోపి సుజనం దృష్ట్వా సదాహాసతే. 3౨

కర్పూరధూళిరచితాలవాలః కస్తూరికాచందనసదోహవశ్రీః
పన్నీరనీరై రభిషిచ్యమానః ప్రాఙ్గుణం ముంచతి కిం పలాండుః.

వాఙ్మాధుర్యా త్సర్వలోకప్రియత్వం వాక్పారుష్యాత్సర్వలోకాప్రియత్వమ్
కోవాలోకే కోకిల స్యోపకారః కోవాలోకే గార్దభ స్యాపకారః.

పరోపి హితవాన్బంధుః బంధుర ప్యహితః పరః
అహితస్యాంగజవ్యాధే ర్హితమా రణ్య మౌషధమ్.

—। ఇందే—పద్యావళి గ్రంథము గలదు ।—

ఈపుస్తకములో 300 శ్లోకము లుగలవు- మొదట-

శ్లో॥ పద్యావలీ విరచితారసికైర్ముకుంద సంబంధబ ధురపథా ప్రమదోర్మిసిధు రమ్యాసమస్త తమసోదమునిక్రమేణసంగృహ్యా తేకృతికదంబక కౌతుకాయ ప్రారంభే మంగళాచరణమ్।

నమో నలిననేత్రాయ వేణువాద్యవినోదినే।
రాధాధరసుధాపానశాలినే వనమాలినే- కస్యచిత్.

ఇందుఁ గలశ్లోకముల కర్తలపేరులును జాలభాగము తెల్పఁబడినవి.

సారాంగస్య; శుభాంగస్య, రహస్య, కస్యచిత్, దాక్షిణాత్యస్య, విష్ణుపురీశ్రీపాదానాం, తేషామేవ, సర్వజ్ఞస్య, శ్రీరామానందరాయస్య, శ్రీధరస్వామినోక్తం, శ్రీలక్ష్మీధరస్య, శ్రీవిశ్వపురీశ్రీపాదానాం, శ్రీభగవతః, కేషాంచిత్, శ్రీవేదవ్యాసపాదానాం, కవిరత్నస్య, శారాదాకారస్య, పురుషోత్తమదేవస్య, సమాహర్తుః, శ్రీగోపాలభట్టానాం, దౌగ్ధికస్య, సర్వానందస్య, ఈశ్వరపురీశ్రీపాదానాం, ధనంజయస్య, మాధవేంద్రపురీశ్రీపాదానాం, రఘూపాధ్యాయస్య, శ్రీకవిరాజమిశ్రస్య, శ్రీశంకరాచార్యాణాం, గోవిందస్య, భవానందస్య, సార్వభౌమభట్టాచార్యాణాం, జీవమాళినాం, సంజీవస్య, గజ

పతిపురుషోత్తమదేవస్య, శ్రీమతః, మయూరస్య, వసుదేవస్య, ఉమాపతిధరస్య, అభినందస్య, సర్వానందస్య, యోగీశ్వరస్య, కవిచంద్రస్య- ఇత్యాది కలవు.

మచ్చునకుఁ గొన్ని శ్లోకములు—

కల్యాణానాం నిదానం కలిమలమథనం పావనం పావనానామ్
పాథేయం యన్ముముక్షోః సపదిపరపదప్రాప్తయే ప్రోచ్యమానమ్
విశ్రామస్థాన మేకం కవివర వచసాం జీవనం సజ్జనానాం
బీజం ధర్మద్రుమస్య ప్రభవతు భవతాం భూతయే కృష్ణనామ॥

దీనికి (శ్రీ)మద్విశ్వపురీ(శ్రీ)పాదానాం అని యిుందున్నది, దీనినే "రామ నామ"యనుమార్పుతో హనుమన్నాటకము మొదటఁ జూచుచున్నారము.

శ్రుతి మితరే స్మృతి మపరే భారతమన్యే భజంతు భవభీతాః
అహమిహ నందం వందే యస్యా లిందే పరబ్రహ్మ॥
శ్రవణే మధురా నయనే మధురా తనేమధురా హృదయే మధురా
పురతో మధురా పరతో మధురా మధురా మధురా మధురా మధురా.
ఆబద్ధకృత్రిమసటా జటిలాంబిభర్తి స్వారోపితో మృగపతేః పదవీయతశ్చ
మత్తేభకుంభపరిపాటనలంపటస్య నాదం కరిష్యతి కథంహరిణాధిపశ్చ ౨౧౦
యాలాభా-యాపరద్రోహా యాపాత్రే యాపరార్థకః
ప్రీతిర్లక్ష్మీర్వ్యయః శ్లోకః సాకిం సాకిం సకిం సకిమ్. ౨౨౮

25. అంగపాతాళసంఖ్యపద్యములు—గ్రం. సం. 92.

అంగపాతాళసంఖ్యపద్యములు, తాళప్రస్తారపద్యములును గల యొక విడివిడి పేఁచుకాగితముల పుస్తకము. ఇందు మొదటియంగతాళ సంఖ్యను గుఱించి లేదు.

"కోవిదులందఱుఁ గొనియాడఁగానుద్వియంగపాతాళసంఖ్యయు దెలుపుదు
భళిభళి యనిమెచ్చ భరతశాస్త్రజ్ఞులు లీలత్రియంగపాతాళసంఖ్య"

ఇట్లొక్కొక్క-పాతాళసంఖ్యలో ననేకవిధముల పద్యములు గలవు. ప్రస్తారములో దేని కెన్నివచ్చునో లెక్క- తెల్పఁబడినది.

క. ఆరయ శరత్రియంగము, భూరిగభరతజ్ఞు లెఱుఁగ ముప్పదివేలా.
ర్న్నూటుందొంబదియైమను, ధారుణిలోపలనువెలయు దశరథరామా.

గీ. ధరణి ద్రుత శేఖరద్వయ గురువుకమరు, రెంపులకులనలువదియొండునొక్క
వేలనిన్నూటపదియును వెనుకఁద్రొమ్మి, దియునునారసికవివరుల్ దెలియరామ

ఈరీతిని బదిపాతాళసంఖ్యలు చెప్పఁబడినవి. కొన్నితావుల నక్షరము లు మాసిపోయినవి.

౨. తాళప్రస్తారములోని పద్యములు— ఇందు చతురశ్రజాతి, త్రిశ్రజాతి, మిశ్రజాతి, ఖండజాతి, సంకీర్ణజాతి ప్రస్తారసంఖ్యలకుఁ బద్యములు చెప్పఁబడినవి.

చతురశ్రజాతిలో నష్టము—

సీ. చతురశ్రజాతినష్టము చెప్ప మనినను కాల్మాత్రయావిగాఁ గలిగియుండు
నిన్నియక్షరముల కింతసంఖ్య యటంచు నెఱిఁగి యేసంఖ్యలో నెవ్వరైన
నిన్నగుభేదము లెటువలె నుండును జెప్పుమీ నాతోడఁ దప్పకుండ
ననియడిగిన సంఖ్యలన్నియు వ్రాసుక యడ్డయచుద్రుతములయుండ ద్రుతము
చతుర్థమున లఘువుచెలఁగనష్టమగురువు ద్వాదశప్లుతముతో దొరయఁగూడ
తన నడిగిన సంఖ్య గొనియు నాయింటను............................

క. ధరఁ ద్రిశ్రజాతి యరచం, దురునిసిమొక్కటియు మఱియు ద్రుతమున రెంటన్
శిరమునను జుట్టునాలుగు, స్థిరముగ మముఁ బ్రోవుప్రేమ సీతారామా.

క. ఒకటిం గాలుకు నాఱు, న్నొకటియు ద్రుతలఘున నీచునొకపదమూఁడున్
ఇఁక రెంట నిరువదైదగు, శుకసన్నుత దివ్యనామ సురసుత్రామా.

ఈపుస్తకముకడపట నిట్లున్నది.

"శుభమస్తు"

శ్రీరంగరతిజయ శ్రీరంగమకరంద కందర్పదర్పణకంతుకాది
రతిలీల వనమాలి రాజచూడామణి ప్రత్యంగరూపక పంచభూత
రాజమార్తాండైకరాజనందన కోకిలప్రియోద్వీక్షణ లలితబసవ
శంకరప్రతిరాయ వెంక్కోలఖత్తాఖ్య షట్పికాపుత్రికోత్సవ కుడుక్క
చంచత్పుటాభంగ చాచపుటానంగ జయమంగళద్వంద్వ శరభలీల
వర్ణభిన్న త్రిశ్రవర్ణ వర్ణయతి త్రిభిన్నవిలోకిత బిందుమాలి
కరుణద్వితీయకోఘట్టకళధ్వని శ్రీకీర్తిచాతాళ సింహనాద
చతురశ్రవర్ణక రాజవిద్యాధర హంసనాద త్రిభంగి సమరవినుము

మల్లికామోద లీలాదు లెల్లఁదెచ్చి, సాహితీగీతికుచకుంభ శారదాంబ మెచ్చి శరభోజభూప నిన్నిచ్చగించు, నలరుఁబోణి పదంబున మెలఁగఁజేసె.

దీనింబట్టి యీపుస్తకము తంజావూరురాజగు శరభోజిభూపాలుని యాస్థానములోని సంగీతవిద్వాంసుఁ డెవ్వరో రచియించియుండు నని తేలుచున్నది. కర్తపేరు తెలియలేదు.

26. శృంగారపుపాటలు - ఖడ్గలక్షణము — గ్రం. సం. 95.

ఇదియు నొక్కపీఁచుకాగితపు గ్రంథము; చిన్నది. కొన్ని మచ్చునకు—

వందేత్వాం గోకర్ణేశ వకుళారణ్యనివేశ మహేశ॥

1. వందారుదానవసందోహసేవా మందానంద బృందముకుంద నందము కుందపురందరవందిత — వందేత్వా॥

4. సంగరరంగవిరూపా నిజకరసంగతసురగిరిచాపా మంగళకరచిద్రూపా రవిరథాంగ వేదనుత గురుతరకోపా ॥ — వందే॥

5. కాండభాండలయలీలా । పరవేదండాజినవరచేలా పాండరకపాలమాలా । కోటితొండమాన్ కులజనవరపాలా భండనమండలఖండనపండిత । చండపిచండిలకుండలికుండల । — వందే।

— రాగమాలిక —

గౌరీమనోహర గోకర్ణమాంపాహి గౌరమహానట నారాయణప్రియ
సారంగధరకళారంజిత మస్తక సామగానప్రియ సర్వలోకశరణ్య
దశముఖారివినుతచరణ సరసీరుహ దళ్తిలవిళహరిప్రముఖభాగ్యోదయ
విశదపూర్ణవ్యోమలహరీజటాజూట విమలశంకరాభరణాయితాహీశ
సకలచరాచరనాటనాకార శమితారివేగవాహినీశనిషంగ॥
వికటవరాళికాత్మీహతమన్మథ వినుతజనకళ్యాణిమాదిభాగ్యప్రద.........

ఇంతయలుగనేల యేనేమిచేసితి నింతిరో బాగాయెనే ॥

రంతుకాఁ డాకోటిరాజాబహద్దురుని యింతిపేరేమని యేఁదెలియవేఁడితి.

ఖడ్గలక్షణము - వచనము - ఇందుఁ గత్తులపేరులు పొడవు వెడలుపు లక్షణము ముద్రలు పిడులవివరము మొదలగునవి వ్రాయఁబడినవి.

కత్తులు 1 యిందుస్థాన్‌సురై 2 అబ్బియాబాగుసురై 3 బక్‌దర్‌త్యాగా 4 న్యహాన్‌త్యాగా 5 రుమ్మీత్యాగా 6 బిందుపాన్‌త్యాగా 7 హీరాన్‌త్యాగా 8 అబ్బాలీత్యాగా 9 పరన్‌సెరీత్యాగా 10 బద్గాత్యాగా 11 సరవరి

త్యాగా 12 మావిలీత్యాగా 13 హైదరాబాద్ త్యాగా 14 కుచ్చిత్యాగా 15 చెంగ్లామాత్యాగా 16 విలాతిఅబాసీ 17 ఖురాసాన్ అబాసీ 18 మంమమా భీర 19 అందాబాదికురువా 20 యెర్నాల్ అనునవి చెప్పఁబడినవి ఒక్కదాని కుదాహరణము.

ఖురాసాన్ ఆబాసీ:—కత్తి గమనుగా నుండును. తక్కినలక్షణములు విలాతిఆబాసువలెను.

మిశ్రకత్తి: —(మిసర్ కత్తి?) కాలుతక్కువ నాలుగుజేనలు. వెడలుపు 3 వ్రేళ్లు. పెణికదగ్గర నొకదోరెము. పెణికెలావు. పిల్లదోరెము ౧। బీరకాయపీఁచువలె ఛాయ.

నాలువాలు:—నిడివి 3 జేనలు. పెణికెకొనదాఁక సన్నగా నుండును. నడుమ నొకదోరెము, ఉక్కుటల్లు. నీరునల్పు వెడలుపు రెండువ్రేళ్లు.

ఖండా:—నిడివి కాలుతక్కువనాలుగుజేనలు వెడల్పు 3 వ్రేళ్లు చూరి ముందు వంగియుండును. అడుగు దుత్తెకు. 3 దోరెములు. పెణికెదగ్గఱ కడ వెళ్లు బంటువుముద్దర. దుగిళ్ళం పేరామిదపుగి జవలె కత్తిగమను రందాపట్టు ..............దప్పం కత్తిలఘువు.

ఆయాతావులఁ గత్తియొక్క ముద్రలు చిత్రింపఁబడియున్నవి. ఫరుజులు ఢాల్‌లు కేడెములు పేరులు గుర్తుకొఱకుఁ గొన్నివ్రాసికొన్నారు.

కేడెయములు— బరువుగానుండును. క్రొత్తది కోసిన నేరేడుపండు చెక్కినట్టుండును. ప్రాతగిలిన దోరబీరకాయచెక్కనఁ గోసినట్లుండును. నఱువ గిలినఁ గూడిపోవును. నాలుగుతావులను బెట్టునది కేడయము. తక్కినతావున పెట్టేది చిలువట్టు. ఇత్యాదికలదు.

ఈపుస్తకముజదివిన పురుకోట్టసంస్థానములోనిదని తెలియవచ్చును.

27. స్కాందాంతర్గత ధర్మఖండము — గ్రం. సం. 117.

కవి యాఁదులపల్లి భవానీసుఁడు; కవి యీగ్రంథమును శ్రీశైలమల్లికార్జునిని కంకితము చేసెను.

గద్యము:— ఇది శ్రీమద్గురుకరుణా తిశయలబ్ధ కవితావైభవ యాఁదులపల్లి శంకరమంత్రితనూభవ సుధీజనవిధేయ భవానీశనామధేయప్రణీతంబైన స్కాందపురాణంబున ధర్మఖండంబునందు......ఆశ్వాసము.

ఈక్రిందిసీసపద్యములోఁ గవి తనవంశముం జెప్పుచున్నాఁడు.

సీ. ధాత్రిభారద్వాజగోత్రపవిత్రుఁడై సురుచిరాపస్తంబసూత్రుఁ డగుచు
నిరతాన్నదానాభిరతుఁ డౌనీఁకులపలి నరసామాత్యుపౌత్రవరుని
సంతతపూజితశంకరుం డగుశంకరామాత్యమౌళికి నాత్మభవుని
బ్రాజ్ఞుని నచ్చమాంబాగర్భశుక్తిముక్తామణి నీశ్వరధ్యాననిరతు
భవ్యశృంగారమంజరీకావ్యరత్న, మాంధ్రభాష నొనర్చిన యనఘచరితు
శంభునిభుఁడగు నివటూరిశంభుశిష్యు, ననుభవాసీశనాముఁగన్గొనుచుఁబలికె.

ఇప్పద్యమందలి యివటూరిశంభుఁడు మతగురువును-

ఉ. శ్రీమయవాగ్విలాసు డు నశేషలిపిప్రవణుండు భూరిశో
భామహనీయమూర్తియుఁ బ్రబంధనిబంధనబంధురక్రియా
భామహతుల్యసూత్రుఁడు నృపాలకపూజ్యుఁడు నంచుఁ దక్ జనుల్
వేమఱు నెంచ దిట్టకవి వేంకటరాయ కవీంద్రుఁ డొప్పగన్.

చ. అతనికృపాకటాక్షవిభవాతిశయం బనిశంబుగల్గ నే
నతులకవిత్వతత్త్వమహిమాఢ్యతఁ బ్రౌఢిమఁగంటిఁ గావునం
గృతమతిచేఁ బ్రబంధ మొనరించు తలంపురు స్వప్నమున్ సమం
చితగతి సమ్మహాత్మునకుఁ జేతులుమోడ్చుచు విన్నవించితిన్.

అనుపద్యముంబట్టి యీ వేంకటరాయకవి విద్యాగురువు నని తెలియ వచ్చును. ఇంతకంటె నీతనివంశాదికము వివరముగాఁ దెలియదు. సుకవిస్తోత్రము కుకవినింద స్వప్నము నిందును గలవు.

ప్రారంభము.

ఉ. శ్రీనగకన్య ముత్యములచేఁ దలఁబ్రా లిడువేళ శీర్షగం
గానదిఁ జిందు బిందువులక్రందున సర్వసుపర్వకోటి ను
ర్వీనుతవైభవంబునఁ బవిత్రితగాత్రులఁజేయు శంభుఁ డా
శ్రీనగరాజమందిరుఁడ శేషశుభంబులు మాకు నీవుతన్.

మ. గరిమం గౌస్తుభరత్నబింబిత నిజాంగస్ఫూర్తి వేఱొక్కసుం
దరియంచున్ సిరి యెంచునత్తఱి నితాంతప్రీతి సంధిల్ల న
య్యురుభూషామణిఁ దత్కుచాగ్రమున నాయోజించి కేళీకళా
స్ఫురణన్ రంజిలఁజేయు శౌరి దయఁ బ్రోచు న్మమ్ము నెల్లప్పుడున్

చ. సురరమణీమణీచికురచుంబితపాదసరోజ మారఘు
స్మరనిరవద్యవామతనుసౌధనివాసిని యోగిలోకహృ
త్సరసిరుహాభ్రమద్భ్రమరి సర్వజగజ్జనయిత్రి సీత భూ
ధరవరపుత్త్రి నిత్యశుభదాత్త్రి ననుం గృతకృత్యుఁ జేయుతన్.

................................................................................................

గీ. అనుచు నిష్టదేవతాదిను సత్కవి, వందనంబు. గుకవినిందనంబుఁ
జేసి తెనుఁగుబాస భాసురమగుగతి, కబ్బమెలమిఁ జేయఁగా దలంచి.
గీ. స్కాందమునఁదగు నేఁబదిఖండములను, ధరణిధరములఁగనకభూధరముకరణి
మేటియై ధర్మఖండంబుమిగుల నలరు,నదియునా నేర్పురీతిఁ జెప్పెదముదమున.

ఇట్లనుకొనుచుండఁగా స్వప్నములో నమృతలింగమూర్తి యీశ్వరుఁడు సాక్షాత్కరించి తనకాకృతి నిమ్మని కోరి పుచ్చుకొన్నాఁడు.

ఈప్రతిలో అగిన పత్రములలోఁ దొమ్మిదియాశ్వాసములు మాత్రము కలవు. తొమ్మిదవది పూర్తిగాలేదు. రామాయణకథలో నాగపాశములపిమ్మట.

క. సురవరులు నసురయోధులు, హరిపీఠులు గనఁగ రాఘవానుజుఁ డస్త్రై
శరవృష్టిన్ ముంచిన న, య్యురుభుజుఁ డజశరము వింటయోజించి వెసన్.
గీ. అనఘుఁ డీరాముఁడు పరాత్ముఁ డయ్యె- అనునింతవఱకెకలదు.

ఈకవి యింతకుమున్ను శృంగారమంజరి యనుకావ్యమును రచించియున్నట్లు వంశవర్ణనము పద్యముంబట్టి తెలిసికొంటిమి.

—— కవిత్వశైలికై కొన్నిపద్యములు ——

క. అడిగెడుధనికులు గడులే,వడి మాకని యతిథిఁ దిట్టి స్వల్ప మొసఁగి యా
కడఁ బశ్చాత్తాపితు లగు, జడమతులకు నల్పసుఖము సమకూరుఁ దుదన్.
గీ. వేలరానిచ్చి తని ద్వారపాలుఁ గినిసి, యతిథి గడనిడి కడువడి నారగింప
కిష్టమృష్టాన్న పానీయతృప్తుఁ జేయ, వలయు నైశ్వర్యకాములై వఱలువారు.
శా. ఆతం డధ్వరకర్మ కర్తలకుఁ దా నార్త్విజ్యముం జేయుచున్
శ్రౌతస్మార్తవిధిజ్ఞుఁడై నిఖిలదేశస్తుత్య సద్విద్యుఁడై
ధూతాఘుండు వినిర్జితేంద్రియుఁడు సంతుష్టాంతరంగుండు నై
ఖ్యాతిన్ సర్వమహీసుపర్వ నృపలోకాచార్యుఁడై వర్తిలున్.
ఉ. ఇష్టముఁ బూర్తముల్ వ్రతము లిద్ధతపంబును దీర్థయాత్రలు
త్కృష్టపరోపకారములు నిమ్ముగఁ జేసినవాఁ డగు న్నిజా

దృష్టతఁ గాశి క్షేగి నిటలేక్షణు నీశ్వరు విశ్వనాథు భ
క్తేష్టదుఁ జంద్రశేఖరు మహేశ్వరుఁ జూచిననాఁడు పోఁడిమిన్.
శా. శంభుద్వేషులు దోషదూషితులు హింసాతత్పరుల్ క్రోధులున్
శుంభత్కర్మవిదూరులు న్బుధజనస్తోమక్రియాదూషణా
రంభగ్రస్తులు నైనభక్తులు సురేంద్రా తామసుల్ విష్ణుఁ డా
దంభాచారుల దుష్కుమారులఁ బలెం దాఁ గన్గొనన్ నిష్కృపన్.

వ్రాఁతతప్పులు మెండుగాఁ గలవు. ప్రతి మంచిస్థితిలో నున్నది.

## 28. గోపాలవిలాసము—గ్రం. సం. 135.

ఇది యొక్క యక్షగానము. దీనికిఁ గాళింగచరిత్ర మను నామాంతరము గలదు. ౨౧ పత్రముల పుస్తకము. ప్రారంభము :—

శా. శ్రీరామా నిను నే నుతింతు మదిలో సీతామనోనాయకా
ఘోరాకార మదారిదైత్యహరణా కోట్యర్కతేజోమయా
నీరేజాసనసేవితాంఘ్రికమలా నీవాఁడ నన్నేలు మీ
కారుణ్యాకర రాఘవాన్వయమణీ కాకుత్స్థవంశాగ్రణీ.

వ. ఇట్లు కృతీశ్వరుండైన రామస్వామిని వినుతించి హరిహరబ్రహ్మాదుల నేమని కొనియాడుచున్నాఁడు.

త్రిపుట—సిరికిఁ జెప్పక యుఁజేకి మకరిని నఱకివేగమె దరికి నీడ్చుకఁ గరికి
నభయం బొసఁగు శ్రీనరహరికి శరణు॥
మట్టిరథమఁట గట్టువిల్లఁట జంటనాలుకదఁట నారఁట కంటిమంటల
మరునిగెల్చిన ఘనునిఁ గొలుతున్॥
తమ్మిఁ బుట్టినదాత తానై క్రమ్మి లోకములెల్ల నేలిన। బొమ్మదేవరపద
ములెన్నుదు నెమ్మిమీఱన్.

వ. ఇందిరా గౌరీ వాణీ మహాదేవుల నేమని సన్నుతించుచున్నాఁడు.........

ఇట్లు సకలదేవతాప్రార్థనంబును సుకవులకు వందనంబు నాచరించి శ్రీమన్మహాభాగవతంబున దశమస్కంధంబునందు శ్రీకృష్ణలీలలు వర్ణన సేయం దలంచి యున్న నొక్కనాఁడు.

సీ. నిగమగోచరుఁ డైననీలాద్రినిలయుండు విప్రవేషముదాల్చి వేడ్కతోను
నొకచేత బెత్తము నుత్తరీయంబును ముసిముసినగవుతో మోదమునను

చ. తఱుఁగక నే మెలంగినను దాపుర*కంటికి మోముదమ్మి కో
నెఱిఁ దొవరంగు పొం గిడెడు నీటరి సాటి యటంచుఁ బల్కఁగా
నుఱియలు లోఁగ వైరి యిఁక నుండఁగ నీతము గా దటంచుఁ దా
నఱవఱ లయ్యెఁ జెమ్మట నొయారపుఁగస్తురిబొట్టు మోమునన్. ౯

ఉ. క్రమ్మిన చెక్కుక్రొంజెమట కమ్మకరంబులఁ గ్రమ్ముచున్ గగు
ర్పమ్మెయి పైఁకొమన్బులచ మూఁత దలిర్పఁగఁ గోరిక ల్మది
న్మమ్మర మేనియు న్నఱుఁగుఁ బూని త్రపావశత న్వయస్యలం
గొమ్మ యెఱుంగనీక యటు గొంత మెలంగెఁ బ్రమోహమగ్నయై ౧౦

క. ఈగతి విన్నంతనె మను, లాగక రేఁపన్ హృదంబుజాస్థపునస్సం
ధాగరిమన్ గరితకు నాఁ, లోఁ గనఁబడియెన్ రమేశురూపం బెల్లన్.

ఉ. శౌరియచింత్యరూపపటుసంపద సింగిణి గాఁగఁ దగ్గ నో
దారత నారిగా హాప్రధానమనోహరసౌమనస్యశృం
గారము లంపకోలలుగఁ గైకొని మన్నన దేయఁజొచ్చె నే
పార శిరీషపేశలము లైనతలోదరిసుప్రతీకముల్. ౧౨

ఉ. ఈయదుసార్వభౌముకథ లిట్టివి భావభవానుమోదదం
బై యెదఁ బాయకుండెడి సఖులార సదా యతనుప్రభావమో
హా యని వారువారుఁ బ్రకృత్యుక్తు లన న్వని మగ్గ గావున
న్నాయెడఁ గూర్చి పల్కు టని నాన నతాననయై వసింపుచున్. ౧౩

వ. అంత నగ్గద్దియనుండి ముద్దియ దిగ్గన లేచి. ౧౪

సీ. శుక్తికానిర్ముక్తముక్తికంబులరీతిఁ గన్నుల బాష్పంబుకణము లొలుక
జాలాంతరవిలోలచక్రద్వయములీలఁ జన్గవ పైఁటలోఁ జౌకళింప
ఘనసంఘనిర్గతకరకలకరణిగాఁ దుఱుమున నరవిరు ల్దొరఁగుచుండ
సారసోపరిహిమజలబిందువులపోల్కి మోమునఁ జెమ్మట మొల్ల లెత్త
నడుము గడగడ వడఁకఁగ †బెడఁగుగడవ
నుడిగెపుఁబడంతు లుడిగెము లొగిఁ బరాకు
చేయుచును జెల్వకైదండ సేయ నదియు
నిచ్చగింపక యింటికి నేగి యచట. ౧౫

* కంటుక—మూలము. † బెగడు కడువ—యూ.

—: కాళిందివిరహావస్థ :—

క. కసికాటుగ భుజియింపుచు, విసువున నేతెంచి పాన్పు వెసఁ జేరె మనో
రసజాతతీవ్రవిరహాభ,రసుమస్సహతాప యాచు రమణి రయమునన్. ౧౭

చ. ఎడయనిమోహవేదనల నెంతయుఁ గుందుచుఁ గృష్ణురూప మే
ర్పడ నునులేఁతకల్పతరుపత్రమునీఁదట వ్రాయు వ్రాసి యిం
పడరఁగఁ జూచుఁ జూచి తనయక్కునఁ జేరిచి ముద్దుగొంచు నా
పడఁతుక నమ్మదిం బొడమి పాయనిప్రేముడి రేఁప నెంతయున్. ౧౮

క. వనితకుఁ దాపజ్వర మెచ్చినచోఁ బ్రియుకథల రతిని జెందుచు ననిశం
బును మెలఁగ నయ్యౌషధ్యా,మునఁ గాదే మిగులఁ దాపమున్ గఱుకైనన్.

గీ. సంతతధ్యాతహరికథాసరసిలోన, నెప్పుడును దేలుచుండు నాయిగురుఁబోణి
కదియ సమ్మువియోగతాపాహిశజ్వ,రాంకురంబున కగుహేతు వాదిమంబు.

సీ. తళుకొత్తుచెక్కుటద్దములకాంతులతోడ మందహాసంబులు మాద మయ్యెఁ
జెలులతోఁ జేయుముద్దుల ముచ్చటలతోడ శృంగారరచనలు రంగు దప్పె
నునుగకవెడలు నిట్టూర్పులగమితోన కన్నీటిమించుసురులు గడలుకొనియె
సతిమనోహరరుచిరాకారములతోన మేల్మిబంగారునెమ్మేను డస్సె
మోహదశతోన కోరికల్మించుకొనియె, వెడఁదకన్నులతోఁ జేష్టవిప్పువదలె
బడలికలతోన చెమటలు వొడమఁ జొచ్చె, విరహవేదన నక్కాంత వేఁగుచుండ.

క. గురుతరమదనజ్వరవిస్ఫురణాం
జూడ నప్పుడు, ఖరశిఖిసంతప్తకనకకళికకు సరియై. ౨౧

వ. ఇట్లు దినదినప్రవర్ధమానవిరహవేదనాదోదూయమానమానస
న నిట్లని వితర్కించె. ౨౨

చ. నిగమగణోక్తికిం బరమనిర్మలమానసవృత్తికి న్సదా
సొగియనియట్టి కృష్ణపదసూతిపస్రుఁ గాంతు (నేసెదన్)
పయోనిధి నీఁదఁగోరెద
న్నిగుల సుధాంశుమండలము మిన్నక చేతులఁ బట్టఁ గోరెదన్. ౨౩

గీ. అమ్మచెల్ల మహావిరక్తాగ్రయాయి,
ధికరాగసదావృతస్వాంతులైన, మాదృశులకబ్బనమచు నమ్మంగివచ్చు.

క. చిత్తము గోరిన నబ్బులు, విత్తము లభియించునెడ దు
వత్తరమై తాపవహ్నిం వారకపుట్టెన్. ౨౪

సీ. నిఖిలగాయకగాయిసీమన్లభంబైన యింపులపాట నాకేల యచ్చె
నబ్బుఁగాకేమి నా
నంపుఁగాకేమి నే నగ్గతి వినిపింప నద్దివ్యముని యేల యటకు వచ్చె
వచ్చుఁగాకేమి యవ్వాసుదేవస్వామిలాలితచారిత్ర (యేలచెప్పె)
యచ్యుతునిఁ గోరె నీకోర్కి యజ్ఞరచిత
కావ్యసైఖరి విఫలతఁ గాంచి హాస్యపదము గానున్న దిం కేటిబ్రుకుత్రోవ.

ఉ. కన్నజ
విన్నయతండు దీర్ప మదిఁ బెట్టునో పెట్టఁడో పెక్కిఁ బూన న
న్నన్నలినాక్షుఁ డియ్యకొన నయ్యెడునో మఱి కాఁడొ యిట్టినా
బన్న ౨౭

గీ. వేఁడివేలుపు కృష్ణునివేఁడఁబోవ, గురుత కొంచించుకాంతయే కొఱఁతవడిన
గారవము వోవు నని చెప్పఁగాఁ బనేమి ౨౮

ఉ. చక్కనివారిలో మిగులఁ జక్కనిచానలు చాలఁజాల న
చ్చక్కఁదనాలకుప్ప యమచంద్రునిఁ దామె వరించి రన్న నే
నొక్కతఁ బోల నెట్లు
సౌఖ్య మీవిరహా మెట్లు తరించెద నేను దైవమా. ౨౯

క. అరయఁగ బహుకాంతాజన, వరణాస్పదమైన వరుని వరునిగ మదిలో
ధాత దా నఘమొందుర్.

* * * *

వ. ఇట్లూహించువేళ నబ్బాలయూహాబలంబున. ౩౦

ఉ. కన్నియయుంగకమ్రదిమ గన్నులఁ దప్పు జయింప బల్వెత
న్నిన్నక పంచతం గొనుచు మేల్గొనఁ దన్ను భజించు నమ్ములం
దిన్నఁగః దెల్విచేసి పగ దీర్పఁగ వేళ యి దంచు మన్మథుం
*డన్నువవెంట నంటుచు రయంబున లోఁగొనె నైదుబాణముల్. ౩౧

ఉ. తమ్ములుఁ గల్వలు న్మను బృథగ్గతి సాటికి రాక నీటిలోఁ
బమ్మి తపం బొనర్చి మెయి వాయుచు నెచ్చెలికన్ను లయ్యెఁగా
యమ్మదనప్రతాపతపనావృతిగాఁ దమచేష్ట వాయమిం
జు మ్మరవిప్పు మోడ్పులను జూడఁగ నయ్యెను నింతినేత్రముల్. ౩౩

---

* డన్నువు వెంట- మూలము.

క. కలువలుఁ దమ్ములు సరిరా, మెలఁగుట కోర్వంగలేక మెలఁతుకకన్నుల్
*బలుకోపుగదురు నిద్దుర, నొలయవు వికాసభావ మొందవుఁ దలఁకన్.
క. కాంతకు మదిఁ బుట్టెకుశల, పోంతలతో వేఁడియూర్పులతో మరుబ
ల్గోంతలతో మయిపూఁతల, రోంతలతోఁ జేలు హ్రస్వలుప్తము లయ్యెన్.
క. కృశగాత్రి యనుచు నెప్పుడుఁ, గుశబుద్ధులు పిలువఁ బీనకుచయుగంబుల్
కృశతఁ గొనె బుధగణోక్తులు, వశమే తప్పింప నెట్టివారికి నైనన్. ౩౭
క. రవణములు †మీఱిపడియెన్, ధవళేక్షణమేనుకీఁగ దాఁ గృశియింపన్
రవళి యిటు మానెఁ జెల్లదు, తవిలెన్నూభ్యతయె నిల్వఁదరమాయనుచున్.
క. తరుణికిఁ గ్రమమున రుచితో, నరుచులు మిక్కుటము లయ్యె నతివకురుచిగా
కురువేదన దినదిన మ, చ్చెరువుగ నంగంబు లెల్లఁ జిక్కఁగసాగెన్. ౩౮
క. ఆసమయంబున గుణవతి, యాసురచనసాధ్వలంక్రియాసాహిత్యం
బీసడ చేసి నిజేష్టర, సాసన్నస్వాంతవృత్తి నైవర్తిల్లెన్. ౩౯
ఉ. ఉత్తమగాత్రి కట్టియెడ నుత్తమ మయ్యెను గేశపాశ ము
త్యుత్తమ మయ్యెఁ జిత్తము మహోత్తమ మయ్యెఁ గటిప్రదేశ మే
కోత్తమ మయ్యె మోహనపయోధరయుగ్మము చిక్కనంగను
ల్మత్తచకోరలోచనకు మధ్యమవైఖరిఁ గాంచెఁ జిక్కుచున్. ౪౦
చ. విరహనిదాఘకాలమున వేమఱు మోము వడంకసాగె ని
ర్భరహృదయానురాగరసవారిఝరుల్ వ్రయి కుంచె నూర్మికో
త్కరములు కంకణాకృతులఁ దాల్చె నెలంతకు నంత వింత యి
ట్లరయ ఘటించఁ బలేఁడె ఘటనాఘటనాకృతి మారుఁ డెంతయున్. ౪౧
గీ. మారనాశింధముఁడు తాపభారవహ్నిఁ
గ్రాఁచి తనతూపు మొనవాఁడి ‡కమ్మియుచ్చు
చేత సంఘర్షణముసేయఁ జిక్కిచిక్కి
కనఁగనఁగుఁ జెల్వలలితాంగకనకలతిక. ౪౨
గీ గోకులాయతచేష్టసంకోచ మొదవె, నెమ్మిపురివిచ్చెఁ గాలువ్య మిమ్మకానిమొ
హంసజాతాంగయాతనాయత్తమైన, యతనుశరవర్షమవిరళంబగు సుఁబర. ౪౩.
మ. స్మరదావాగ్ని హృదంతరాళము దహింపం బైకిఁ బొంగెక్కు ని
శ్చరపుచ్ఛాతి యనంగ నంగమున ధావళ్యంబు దైవాఱె భీ

* బలునొప్పు— † మీఱపడితన్— ‡ కలిమియిచ్చు— మూలము.

కరతలాత్కామశరప్రవర్షణమునం గన్పట్టు దూర్వా(తృణాం)
కురపుఁ *జొంపమనంగఁ దీప్పు సెఱపెఁ గుంపై సెఱుఁ గ్లోముసల్. ౮౬

గీ. ధార్తరాష్ట్రిలినాదంబు లార్తులొదవ, మీఱఁగాఁ బాండురాజకుమారగోచు
ళనుగ సద్వర్గమామోదమంద మెలఁగ, నతనుశరశయ్య గాంగేయసుతను†వారగ

క. పుర్వ్వలవిలుతునిపుర్వ్వల, ఉర్వ్వల నునుఁబూలబంతిఉర్వ్వలు మఱచెం
బుఁవ్వులు నవ్వులు మఱచెఁ, బుర్వ్వలు దర్వ్వలను మఱచెఁ బూఁబోణితగన్.

సీ. తనువున నవమహాధనచేలము ధరింప దమలంపు మెకుకర్దమ మలఁదకు
మోహనప్రాలంబముఖమాల్యములు గొన దతిరుచిరలలాతికాదు లిడకు
భృంగికనకధారణాంగీకృతికి రోయు నశనవాంఛకు దూర మగుచునుండు
దాంబూలరుచు లానుతలఁపుఁగో మెలఁగను చమవులపై భ్రాంతిమొదవనీకు
హీరమయపంజరాంతర చారుకీర, శారికారావములు వినఁ జేరఁ జనదు
చిత్తపద్మనికేతన(శ్రీ)నివాస, రూపజాలంబులోఁ జిక్కి రుచిరగాత్రి. ౮౭

గీ అతనుసుమహేతిసముదయం బతనుకుచను
నతనుసుమహేతిసముదయం బమ్యో నపును
అతిఘనాబ్జసుచిస్ఫూర్తి యబ్జనయన
కతిఘనాబ్జసుచిస్ఫూర్తి యగుచు మెలఁగె ౮౮

క. అతిసూక్ష్మాంబరకుసుమో, ద్గతగంధము లానుపూఁకి కమలేక్షణకున్
అతిసూక్ష్మాంబరకుసుమో, ద్గతగంధము లానుపూఁకి గతిఁ గననయ్యెన్.

లయగ్రాహి. ఆటలకు ముందెసఁగుమాటలకు
నింపౌనరుపాటలకు లేనగవు తేటలకు నెమ్మే
నీటులకుఁ గప్పురపువీటులకుఁ బూఁబఱపుఁ
జోటులకుఁ గేళవనవాటులకుఁ గూర్చు
బోటులకు రేనిమరపాటులకు రవణముల
కోటులకు బోనముల నేటులకు శారీ
చాటులకు సౌధముల చోటులకుఁ గిళలయల
వాటులకు బాల యెుతెవాటులకు రోసెన్. ౯౦

గీ. అంతరంగము మాధవధ్యానపటిమ
కలితమై యొప్పఁ దద్వశగతము లగుచు

* జొంపమునారి— † వరగె— మూలము.

సఖులవిషయములు మెలఁగ బాహ్యాంబుమఱచి
యయ్యయోగిని యోగిని యనఁగఁ బరఁగె. ౫౧

క. అదిమఱచె నిదియుమఱచె, స్మదవతి యని పలుక నేల మది హరి నొకనిం
గదియించి మఱవదెప్పుడు, నదియునియన నేమి బాహ్యమంతయు మఱచెన్.

గీ. సర్వకార్యాంతరాయంబు సంఘటిల్లు, బ్రీడఁగైకొన్న ననిచూచి బ్రీడమాని
బ్రీడవతియాత్మలోని యభీప్సితంబు, కన్నతండ్రికి వినుపింపఁగాఁ దలంచు.

చ. నగుఁ దల యూఁచుఁ గన్మొగుచు నల్లడఁ జూచు వడంకు లేచు బ
ల్వగగొను మూర్ఛనుం బొరలు వాడును శౌరిఁ దలంచి వేఁడు మై
గగుఱుపుఁ జేర్చు నుస్సు రను గద్గదపాటు గనుం జెమర్చు నిం
పగుచెలిఁ బిల్చుఁ బల్కుడుపు నంబుజలోచన మన్మథార్త యై. ౫౪

శా. రంభారూపిణి చెట్టవట్టుకొన నారంభించు శ్రీకృష్ణుఁడో
స్తంభం బంచు గృహేంద్రనీలరచితస్తంభంబుఁ దచ్చారువ
క్త్రాంభోజం బని గేహకుడ్యఖచితప్రాంచన్మహాదర్పణం
బంభోజానన ముద్దులాడ మొగ మొయ్యం జేర్చుఁ గామార్త యై. ౫౫

శా. నేత్రమ్లానమశ్రుచైత్యవిరతం నిష్కంపతాం స్విన్నతాం
గాత్రం యాతిచ హృష్టరోమచయతాం కంపైకసంపన్నతామ్
పాత్రం దుశ్చ్యవసంగతే ర్భవతి సద్వక్త్రం చ వైశ్వర్యభా
గ్యాత్మప్రభ వామణే స్మమజని గ్రీవా హ్యయోగక్రమాత్. ౫౬

క. మదనాసమశరమయ మని, ముదమున లోకంబు లెల్లఁ బొగడుట నిజమై
యొదవ మదనాగగామిని, మదనాసమశరమయంబు మానక యయ్యెన్.

క. అరయఁగ సస్ఫుటతాసు, దరతాన్విత మగుచు సాధుతాభావితమై
తరుణీమణివచనము ప్రాగ్విరచితసరసప్రబంధవిధములు దెలుపున్. ౫౮

గీ. విషమశరశరవేదనోద్విగ్న యైన, వెలఁదిమైఁదీఁగ భారతీవృత్తిఁ గనియె
నట్టివేళన పంకేరుహాక్షసూతి, విన్నని మొగంబు భారతీవృత్తి వదలె. ౫౯

గీ. వాక్కుతోడుత నత్తేటచెక్కులాఁడి
చాలఁజాలంగ నెడసెఁ బాంచాలిపొందు
చిత్రమొనరంగ నవ్వేళఁ జెల్వమేను
చాలఁజాలంగఁ గొనియెఁ బాంచాలిపొందు. ౬౦

గీ. విషమబాణుఁడు విషమాస్త్రవేధ సేయ
నతనిమాయ మహాతపం బడరి కాయ
నతసిసేనాఘనార్భటు లరిది డాయ
మోహనాకార బలు వైవమూర్ఛ మునిఁగె. ౬౧

—: కాళిందివేదనకుఁ గారణము నీలవేణి యడుగుట :—

వ. ఇబ్భంగి ననంగదశాలింగితాంగి యై పొరలు యమునాతరంగిణీసోదరిం గని సఖీసుముఖు లందఱు గుంపులు గూడి కూడనిమనంబున గుజగుజలం బోవ వారల వారించి యప్పింపుచుఁబోఁడి విషాదంబు నివాదం బై సంభవిల్లుటకుఁ దన్నిదానం బిద్ది యని నిదానింప నంతఃకరణం బకరణంబుగా నేర దిది యే మొకో తెలియఁ దగు నని సఖీజనంబులు నెఱుంగకుండ రహస్యంబుగా నీలవేణి యయ్యలివేణి డాయం బోయి ౬౨

ఉ. అల్లన లేవఁగాఁ దిగిచి యంకతలంబునఁ జేర్చి కన్నులం
జల్లఁగ జాఱునశ్రువులసంతతి కైవనఁ బాపి పెన్నెఱు
ల్తెల్లన గుంపుదీర్చి చనుమిట్టలపైఁటఁ గుదిర్చి కౌఁగిటం
జల్లఁగ దార్చి చెక్కుఁగవఁ జక్కఁగ నొక్కుచు మేను దువ్వుచున్. ౬౩

క. అమ్మవు గద రెండవమను, నమ్మవు గద కాఁకదేఱు నట్టియుదిరిమే
ల్బొమ్మవు గద మరు నాఱువ, యమ్మవుగద యనుచు ముద్దులాడుచుఁ బలికెన్. ౬౪

క. కన్నియ విశ్వంభరుకుడి, కన్నన రాజిల్లునట్టి ఘనుఁడు గదా నీ
కన్నట్టితండ్రి గావున, నెన్నఁగ దుర్లభము నీకు నెద్ది జగములన్. ౬౫

సీ. వ్యాకోచనలినంబు వన్నె తగ్గవగాఁగఁ గన్నులు విప్పవే వన్నెలాఁడి
యుదితరాకాచంద్రు నొఱపు కొఱంతగా మో మెత్తి చూపవే ముద్దులాఁడి
కలికి చిల్కలపల్కు కులుకు లుల్లులఁ జెందఁ దేటగాఁ బల్కవే నీటులాఁడి
తఱపివెన్నెలరంగు తలఁపులో మెలఁగంగ గొబ్బుగా నవ్వవే గుబ్బలాఁడి
విన్నఁదన మేటికే నీకు వింతలాఁడి, యేమి కన్నీరు నించెదే యించులాఁడి
వగకు నింతకుఁబని యేమి సొగసులాఁడి, తెలుపవే తెల్లముగ మోవితీపులాఁడి.

గీ. మగువ యక్లిష్టముఖపద్మమండలమునఁ
బాయకుండెడు బిందుసంపాతమునను
మాఘుకులు దేల్పఁ దలఁచి లో మాఁకుఁ దెలియఁ
బలుకఁగాఁ జిత్త మిడవమ్మ పైఁడిబొమ్మ. ౬౭

శా. కొమ్మా నీవిధ మెంతయుం దెలియ మాకుం దోఁచ దేమమ్మ నీ
విస్త్రా లోపలఁ గుందుచున్నఁ గని మా కెంతే భయం బయ్యెడు
న్నమ్మి న్నీ కొనఁగూర్చు నెచ్చెలిని నే నిన్నంటి యుండఁగ నో
యమ్మా చెప్పిన దోసమే యెఱుక సేయన్రాదె యే వింతనే. ౧౮

క. ఏమైన మున్ను నాతో, నేమంబునఁ జెప్పుచుండు నీ కిపు డీవిం
తేమమ్మ తెలియఁ బలుకవు, తామరసదళాక్షి యింత దాఁపుర మేలా.

గీ. అతివ నీప్రాణపద మైనయట్టివస్తు
వితతిఁ బో గొట్టికొన్నట్టివిధము దోఁచు
చున్నయది నాకుఁ జూడ నోసన్నుతాంగి
మాయ వెట్టక యెఱిఁగింపుమా నిజముగ. ౨౦

క. మానుగ నాకన్నను నెన, రైనచెలు ల్నీకుఁ గలరె యరమర సేయం
గా నేల తెలుపు నీతం, డ్రానసుమీ నలువతండ్రియానయుఁ జుమ్మా. ౨౧

ఉ. ఈగతి నీలవేణి కమలేక్షనియాన మెలంగఁ బల్కఁగా
నాగజయాన సిగ్గు మది నాఁటఁగఁ గొంకుచుఁ గొంత దేఱి చే
తోగతిఁ బ్రేమతోడ వగ దొట్రకొన న్మును నారదుండు దా
నాగరుడధ్వజుం దెలుపు టాదిగ నంతయుఁ జెప్పెఁ జెప్పినన్. ౨౨

వ. విని యక్కాళిందీకీరవాణికి నానీలవేణి యొక్కింతవిచారించి యి ట్లనియె. ౨౩

క. ఇంతీ యింతటిపనికిం, జింతింపఁగ నేల యొకటి చెప్పెద వినుమీ
యెంతైనఁ దల్లిదండ్రుల, వంతుసుమీ కూఁతుఁ దగినవరునిం గూర్పన్. ౨౪

వ. అదియునుంగాక. ౨౫

గీ. బాల్యమున మాతృపితరులుఁ బ్రాయమునను
మగఁడు *ముదిమిని దనయుండు మగువ కరయ
నధిపు లగుదురు తదధీన లగుటఁ గాన
మానవతులకుఁ దమయిచ్చ మలయఁ జనదు. ౨౬

క. జనకాధీనలు కన్నియ, లనుట నిజం బాట వార లనుమతి సేయం
జనుఁ గాని తమకుఁ దామే, పనుపడి వరుఁ జేరఁ దగదు బాలల కెందున్.

వ. కావున మావలన నీవిధం బెఱింగి నీతండ్రి యగులోకలోచనుం డుచితో
పాయంబున శ్రీకృష్ణదేవుని రప్పించి నీమనోరథంబు సఫలంబుగాఁ బెండ్లి
సేయు నంతకు ధైర్యం బవలంబించి యుండు మని పల్కిన నీలవేణికిఁ గా
ళింది యి ట్లనియె. ౨౮

---

* ముదిమిని సుతుఁడు-మూ.

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| ఉప్పొంగు | అ | ఉద్వేల్లనే | పైకిఁబొంగుట |
| ఉప్పతిలు / ఉప్పతిల్లు | అ | ఉద్భవే | ఉద్భవించుట |
| ఉప్పతించు | స | ఉత్పాతానుధ్యానే | ఉత్పాతమనియెంచుట అనఁగా ఆశ్చర్యమనియెంచెననుట. |
| ఉబ్బు / ఉబుకు | అ | పీనతాయాం | బలియుట, |
| | | సంతోషేచ | సంతోషించుట |
| ఉబ్బరించు | అ | ఉచ్ఛూనతాయాం | ఉబ్బుగానౌట |
| | స | ఉచ్ఛూనీకరణేచ | ఉబ్బుగాఁజేయుట |
| ఉముచు / ఉమియు | స | నిష్ఠీవనే | ఉమ్మివేయుట |
| ఉమ్మగిలు | అ | ఊష్మణాపాకే | ఆవిరిచేతఁబక్వమౌట |
| ఉమ్మదించు | అ | నివాతోష్మణి | గాలిలేనందున ఉక్కగానుండుట |
| ఉరడించు | అ | విజృంభణే | విజృంభించుట |
| ఉరియు | అ | విస్రంసే | విడిపోవుట |
| ఉరలు | అ | విస్రంసే | విడిపోవుట |
| | | పతనేచ | పడిపోవుట |
| ఉరళించు | అ | శోభాయాం | శోభించుట |
| ఉరుము | స | సకోపదర్శనే | కోపముగాఁజూచుట |
| | | హుంకారేచ | హుంకారము సేయుట |
| ఉరియాడు | అ | కంపనే | కంపించుట |
| ఉఱు | అ | అర్ఘత్వే | అగ్ఘమవుట |
| | అ | హైన్యే | తగ్గిపోవుట |
| | స | బహూకరణేచ | గొప్పగాఁజూచుట |
| ఉఱుకు | అ | ధావనే | పరుగెత్తుట |
| | అ | ఊర్ధ్వభాగాత్పతనేచ | మీఁదినుండి దుముకుట |
| ఉఱియు | అ | వర్షజలస్రావే | వాననీళ్లు స్రవించుట |
| ఉఱుము | అ | మేఘగర్జితే | మేఘముగర్జించుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
|---|---|---|---|
| ఉజ్జులాఁగు, ఉజ్జూఁత లాఁగు | అ | డోలనాతిశయే | మిక్కిలియూఁగుట |
| | | కార్యాత్యుత్సాహేచ | పనియందు మిక్కిలి ఉత్సాహయుక్తుఁడౌట |
| ఉలుకు, ఉలికిపడు | అ | ఆకస్మికవల్గనే | ఆకస్మికముగా నదిరిపడుట |
| ఉవ్విళ్ళూరు | అ | గృధ్నుతాయాం | మిక్కిలిమనసుపడుట |
| ఉసుము | స | వస్త్రక్షాళనే | వస్త్రక్షాళనముచేయుట |
| ఉసికొలుపు | స | శునాంప్రేరణాయాం | కుక్కలఁ బ్రేరేపించుట |
| ఉసూరను, ఉసురను, ఉస్సురను, ఉస్సను | అ | నిశ్శ్వాసే | విసుకుట |
| ఊ | | | |
| ఊకొను, ఊకొట్టు | స | శ్రవణే | వినుట |
| ఊకించు | స | చాలనే | కదలించుట |
| ఊఁగు, ఊఁగులాడు | అ | డోలనే | ముందటికి వెనుకకుఁగదలుట |
| ఊఁచు, ఊఁచిపోవు | అ | రోగేణకేశభ్రంశే | తలరోగముచే వెండ్రుకలు లేనిదగుట |
| ఊఁచు | స | డోలాచాలనే | ఉయ్యాలనూఁగఁజేయుట |
| | | నిష్ఠీవనేచ | ఉమియుట |
| ఊటు | స | పశ్వాదీనాం నిశ్శేషపానే | పశ్వాదులు నిశ్శేషముగాఁ ద్రాగిపోవుట |
| ఊడు | అ | పలాయనే | పలాయితుఁడౌట |
| | | విస్రంసేచ | విడిపోవుట |
| ఊడు, ఊడ్చు | స | అంకురారోపణే | మొలకలునాటుట |
| | | ధూళినిర్హారే | దుమ్ముద్రోసివేయుట |
| | | విస్రంసనే | వదలించుట |
| | | భూషణావమోచనే | సొమ్ములుతీసివేయుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| ఊఁదు | స | ఆధ్మానే | శంఖాదులుపూరించుట |
| | స | అవష్టంభే | ఆనుకొనుట |
| | అ | ఉచ్ఛూనతాయాంచ | లావౌట |
| ఊను | స | అవలంబే | అవలంబించుట |
| ఊయు | స | నిష్ఠీవనే | ఉమ్మివేయుట |
| ఊర్చు | అ | శ్వాసే | నిట్టూర్పువిడుచుట |
| ఊరార్చు | స | అనునయే | అనునయించుట |
| ఊరడిలు<br>ఊరడు<br>ఊరడిల్లు | అ | ఆశ్వాసే | తెప్పిఱిల్లుట |
| ఊరడించుకొను<br>ఊరటించుకొను | అ | స్వయమాశ్వాసే | తెప్పఱిల్లుకొనుట |
| ఊఱటిలు<br>ఊఱటిల్లు<br>ఊఱడిల్లు<br>ఊఱడిలు<br>ఊరడు | అ | శాంతౌ | శాంతిపొందుట |
| ఊఱు | అ | జలోత్పత్తౌ | నీళ్ళుపుట్టుట |
| | అ | కందోత్పత్తౌ | గడ్డపుట్టుట |
| | అ | దేహపీనతాయాం | దేహములావౌట |
| | అ | లవణాదిసంస్కారేచ | ఉప్పుమొదలైనవానిలో నూఱుట |

## ఎ

| | | | |
|---|---|---|---|
| ఎక్కు | స | ఆరోహణే | ఆరోహించుట |
| ఎక్కుపెట్టు | స | ధనుషిగుణారోపణే | వింటనల్లెమోపెట్టుట |
| ఎక్కిరించు | స | అనుకృత్యోపహాసే | అనుకరించిపరిహాసముచేయుట |
| ఎగియు<br>ఎగుసు | అ | ఉత్పతనే | పయికిఁబోవుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| ఎగిసిపడు<br>ఎగిరిపడు | అ | అత్యూర్ధ్వత్యై | మిట్టిపడుట |
| ఎగఁజేఁపు<br>ఎగఁదన్ను | స | దుగ్ధానావిష్కరణే | ఆవు పాలుపైకిఁ జేఁపుట |
| ఎగవేయు | స | కర్తవ్యకర్మాకరణే | చేయవలసినపనిచేయకపోవుట |
| | | ఊర్ధ్వక్షేపేచ | పయిగావేయుట |
| ఎగు | స | బాణప్రయోగే | బాణముప్రయోగించుట |
| ఎంచు | స | గణనాయాం | లెక్కపెట్టుట |
| | | అనుధ్యానేచ | తలఁచుట |
| ఎచ్చ్ | అ | ఆధిక్యే | అధికమౌట |
| | స | అతిక్రమణేచ | అతిక్రమించుట |
| ఎచ్చరించు | స | జ్ఞాపనే | జ్ఞాపకము సేయుట |
| ఎండు | అ | శుష్కీభావే | శుష్కమౌట |
| ఎడయు<br>ఎడవాయు | స | వినాభావే | విడిచియుండుట |
| ఎడలు | అ | గతౌ | పోవుట |
| ఎడదెగు | అ | విచ్ఛేదే | విచ్ఛిన్నమౌట |
| ఎత్తు | స | ఉన్నయనే | పయికిఁదీయుట |
| | | ఉత్తంభనే | పయిగాఁబట్టుకొనుట |
| | | గ్రహణే | గ్రహించుట |
| | | ఆరంభే | ఆరంభించుట |
| ఎత్తుకొను | స | గ్రహణే | గ్రహించుట |
| | | ఆరంభే | ఆరంభించుట |
| | | స్వస్మిన్నారోపణేచ | తనయందెక్కించుకొనుట |
| ఎత్తుపడు | అ | అశక్తౌ | అశక్తుఁడౌట |
| ఎత్తిపొడు | స | సోల్లుంఠనే | చేసినతప్పులు దెప్పిపెట్టుట |
| ఎదగు<br>ఎదుగు | అ | వృద్ధౌ | వృద్ధినొందుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
|---|---|---|---|
| ఎదిర్చు<br>ఎదిఱ్చు<br>ఎదిరించు<br>ఎదిఱించు<br>ఎదుర్కొను<br>ఎదుఱ్కొను<br>ఎదురు | స | ప్రత్యవస్థానే<br>పర్యనుయోగే<br>ప్రత్యుద్గమనే చ | ఎదురుగా నిలిచి జగడమునకుఁ బూనుట<br>అడిగినవానిమరలి యడుగుట<br>ఎదురుగాఁబోవుట |
| ఎన్ను | స | గణనాయాం | లెక్కపెట్టుట |
| ఎనయు | అ | సంయోగే | కలియుట |
| ఎనచు<br>ఎనపు | స | పక్వశాకాదీనాందర్వ్యాదినామర్దనే | పక్వమయిన కూర మొదలయిన దాని గరిటె మొదలైన దానితో మర్దించుట |
| ఎరియు | అ | దాహే | దగ్ధమౌట |
| ఎఱగు | స | నమస్కారే | నమస్కరించుట |
| ఎఱుఁగు | స | జ్ఞానే | తెలిసికొనుట |
| ఎలయించు | స | దానే<br>సంతోషణే చ | ఇచ్చుట<br>సంతోషింపఁజేయుట |
| ఎలుఁగిచ్ | అ | ధ్వానే | ధ్వనిచేయుట |
| ఎసఁగు<br>ఎసలారు | అ | శోభాయాం | శోభించుట |

## ఏ

| | | | |
|---|---|---|---|
| ఏకు | స | తూలాదిప్రచయకరణే<br>దోషప్రఖ్యాపనే చ | దూదిమొదలైనదాని విడఁదీయుట<br>అందఱియొద్దను దూషించుట |
| ఏకారు | అ | అనవలంబభ్రమణే | అవలంబము లేక తిరుగుట |
| | స | దైన్యయాచనే చ | దైన్యముగ యాచించుట |
| ఏగు | అ | గతౌ | పోవుట |
| ఏఁగుదెంచు | అ | ఆగమనే | వచ్చుట |
| ఏచు | స | పీడనే | పీడించుట |
| ఏటువడు | అ | తాడితే | కొట్టఁబడుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| ఏడు, ఏడ్చు | అ | రోదనే | రోదనముసేయుట |
| ఏతెంచు | అ | ఆగమనే | వచ్చుట |
| ఏను | స | రక్షణే | రక్షించుట |
| ఏమఱు, ఏమాఱు | అ | ప్రమాదే | ప్రమాదము పొందుట |
| ఏయు | స | క్షేపణాదౌ | వేయుట |
| ఏర్చు | స | దాహనే | దహించుట |
| ఏర్పడు, ఏరుపడు | అ | నిష్కర్షే | నిష్కృష్టమౌట |
| ఏఱు, ఏఱ్చు | స | కణశోన్వేషణే | ఒక్కొక్కటిగా వెదకుట |
| ఏలు | స | పాలనే | పాలించుట |
| ఏవగించు | స | అసహనే | అసహ్యపడుట |

ఒ

| | | | |
|---|---|---|---|
| ఒక్కాణించు | స | ఆఖ్యానే | చెప్పుట |
| ఒగ్గు | అ | ఉద్యమే | ఉద్యుక్తుఁడౌట |
| ఒగర్చు | అ | కషాయీభవనే | ఒగరువేయుట |
| ఒంగు | అ | నతౌ | నమ్రమౌట |
| ఒంటు | అ | దేహానుకూల్యే | దేహమున కనుకూలమౌట |
| ఒట్టు | అ | నిర్జలీభావే | నిర్జలమౌట |
| ఒడ్డు | స | పణక్షేపే | పందెము పెట్టుట |
| | | ఉద్యమే చ | పూనుట |
| ఒడుకు | స | తంతునిర్మాణే | దారములు నిర్మించుట |
| ఒడుచు | స | పరాభావనే | ఓడించుట |
| ఒడియు | స | హఠాద్గ్రహణే | బలాత్కారముగాఁ బట్టుకొనుట |
| ఒడిగట్టు | అ | అవశ్యచికీర్షాయాం | అవశ్యముగాఁ జేయవలయు నని సిద్ధమౌట |
| ఒడంబడు | స | సమ్మతౌ | సమ్మతించుట |
| ఒడిసివేయు | స | ప్రసభక్షేపే | విసరివేయుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
| --- | --- | --- | --- |
| ఒడివేయు | స | ప్రతివేష్టనే | మెలివేయుట |
| ఒత్తు | స | వ్యూహనే | ఆవలికిఁద్రోయుట |
| | స | శంఖాదిధ్మానే | శంఖాదులూఁదుట |
| | స | నిష్పీడనే | పిసుకుట |
| | అ | అపసరణే-(దాక్షిణాత్యానాం) క్రముకఖండనాదౌచ | ఆవలికి జరుగుట వక్కలు ఖండించుట |
| ఒత్తిలు } ఒత్తిగిలు } ఒత్తికిలు } | అ | ఏకపార్శ్వపరివర్తనే | ఒక్కప్రక్కగాఁ బొర్లుట |
| ఒందు | స | ప్రాప్తౌ | పొందుట |
| ఒకొగు | అ | అంగసంకోచావస్థానే | దేహము సంకుచించుకొనియుండుట |
| | | కార్యోపయోగేచ | పనికుపయోగించుట |
| ఒదవు } ఒమవు } | అ | వ్యాప్తౌ | వ్యాపించుట |
| | | కార్యోపయోగేచ | పని కుపయోగించు |
| ఒదర్చు | స | ఉద్ఘాటనే | పెళ్ళగించుట |
| ఒనరు | అ | శోభాయాం | శోభించుట |
| | | సంభవేచ | సంభవించుట |
| ఒనర్చు } ఒనరుచు } ఒనరించు } | స | కరణే | చేయుట |
| ఒనఁగూడు | అ | సంఘటనాయాం | సంఘటిల్లుట |
| ఒప్పు | అ | శోభాయాం | శోభించుట |
| | | సమ్మతౌచ | సమ్మతించుట |
| ఒప్పించు | స | సమ్మతికరణే | సమ్మతింపఁజేయుట |
| | | అర్పణేచ | అప్పగించుట |
| ఒప్పగించు | స | అర్పణే | అప్పగించుట |
| ఒమ్ము | అ | ఆనుకూల్యే | అనుకూలమౌట |
| ఒరుము | అ | సంయోగే | కలియుట |
| ఒరగు } ఒరుగు } | అ | పతనే | పడుట |
| | | ఏకతోవినమనేచ | ఒకప్రక్కగా ఒంగుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| ఒరయు | స | ప్రాప్తౌ | పొందుట |
| ఒరియు | | ఘర్షణే | ఒరసికొనుట |
| ఒఱయు | | శాణోల్లేఖనేచ | సానపెట్టుట |
| ఒఱియు | | | |
| ఒఱగు | అ | పతనే | పడుట |
| ఒఱుగు | | ఏకత్రో వినమే | ఒకప్రక్కగా ఒరఁగుట |
| | | నమస్కారేచ | నమస్కరించుట |
| ఒరలు | అ | విలాపే | విలపించుట |
| ఒల్లు | | బహుజల్పనే చ | తఱచు మాటలాడుట |
| ఒలుకు | అ | స్కందనే | చిందుట |
| ఒలు | స | తుషాద్యపనయనే | పైపొట్టు తొంబక మొదలైనది తీసివేయుట |
| ఒలయు | అ | శోభాయాం | శోభించుట |
| ఒల్లఁబోవు | అ | ముఖవైవర్ణ్యే | వివర్ణముఖుఁడౌట |

ఓ

| | | | |
|---|---|---|---|
| ఓకిరించు | అ | వమనోద్యమనే | కక్క నుద్యుక్తుఁడౌట |
| ఓకిలించు | | | |
| ఓటించు | స | అన్యాయేనజయే | అన్యాయముగా జయించుట |
| ఓట్రించు | | | |
| ఓటాఱు | అ | భిన్నతాయాం | భిన్నమౌట |
| ఓటుపడు | అ | నిశ్చేష్టతాయాం | నిశ్చేష్టుఁడౌట |
| ఓడు | అ | పరాజయే | పరాజితుఁడౌట |
| | | భయే | భయపడుట |
| | | జలస్రావేచ | నీళ్లుకాఱుట |
| ఓడించు | స | జయే | జయించుట |
| ఓడఁగొట్టు | | | |
| ఓదార్చు | స | అనునయే | అనునయించుట |
| ఓదర్చు | | | |
| ఓపు | అ | శక్తౌ | శక్తుఁడౌట |
| ఓము | స | రక్షణే | రక్షించుట |

# విషయసూచిక.

---

విషయములు | పుటలు.





# పరిషత్ప్రయోజనములు.

తెలుఁగుభాషయు, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడు చున్నవి :—

i తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వాంకషమగు నిఘంటు వొకటి రచించి ప్రచురించుట ;

ii తెలుఁగుభాషకు సజాతీయేతర భాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణమును రచించి ప్రచురించుట ;

iii ఆధునికశాస్త్ర గ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట ;

iv ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యములయిన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగుదేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుటయు ;

v సర్వవిషయములను గుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసఁగుట ;

vi ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట ;

vii తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట ;

viii తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గుఱించి చర్చించుటకేఁగాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట ;

ix తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను, నొసంగుట ;

x ఒక పుస్తకభాండాగారమును స్థాపించి సాగించుట ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును ; వ్రాఁతప్రతులుగూడ నుండవలయును ;

xi తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపకరించు నన్ని కార్యములను జేయుట.

ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

సంపుటము ౧౬ { ప్రభవనామసంవత్సరము / మార్గశిర — ఫాల్గునమాసములు. } సంచిక ౫, ౬.

# కవిరాజసూరికాలనిర్ణయము.

— శ్రీమాన్ యీయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు —
(ఆంధ్రగీర్వాణసాహిత్యసమేళనాధ్యక్షుఁడు, విజయనగరము.)

"శ్లో॥ శ్రీమద్రామాయణం గఙ్గా భారతం సాగరో మహాన్
తత్సంయోజన కార్యజ్ఞో కవిరాజభగీరథః॥"

రాఘవపాండవీయమ్ 1, 40

## 1 పీఠిక.

ఏకవిరాజసూరిదీధితికౌశల్యముచే భారతరామాయణరాజీవము వికసించెనో; యేకవిరాజరసజ్ఞుఁడు రామాయణమాధ్వీకమును, భారతమృద్వీకమును నొక్కపాత్రమున సంయోజించి రసాస్వాదనలోలుపము లగురసికమధువ్రతములకు నొసంగెనో; యేకవిరాజపండితుఁడు, రామాయణరత్న భారతప్రవాళముల నేకసూత్రమున గ్రుచ్చి యామనోహరహారముచే గీర్వాణవాణీగ్రీవము నలంకరించెనో యట్టిసుగృహీతనాముని నామమాత్రస్మరణమున మనము చరితార్థుల మగుదుము.

ఈకవితల్లజుని బుత్త్రునిగాఁ బడసినపుణ్యాత్ము లెవరో తెలియుటలేదు. ఈకవిశిరోమణి జననముచే నేదేశము పూత మయ్యెనో, యీతని నైకకాలికు లగుభాగ్య మెవరికిఁ గలిగెనో యించుక యరయుదము.

గీర్వాణసారస్వతమున, 'వాసవదత్తా' రచయిత యగు సుబన్ధుమహాకవియు, 'గాదంబరీ' కావ్యనిర్మాత యగుభట్టబాణమహాకవియు శ్లేషకవితా

నిర్మాణదక్షులు; కాని వీరు ద్వ్యర్థికావ్యకవులు కారు. i 'రాఘవపాండవీయము'ను రచించి కవిరాజు ద్వ్యర్థికావ్యనిర్మాణమునకు మార్గదర్శకుఁ డయ్యెను; దీనివలనఁ గవిరాజునకుఁ బూర్వము ద్వ్యర్థికావ్యకవులు లేనట్లు సువిదితము. పిమ్మట నైషధ (?) ధనంజయుఁడు (దశరూపకధనంజయునికంటె భిన్నుఁడు) ii రాఘవపాండవీయాపరనామము గల 'ద్విసంధాన' మహాకావ్యమును రచించెను. పిమ్మటఁ గ్రీస్తుశకైకాదశశతాబ్దిలో 'సన్ధ్యాకరనన్ది' యనుకవి iii రామచరిత మనుద్వ్యర్థికావ్యమును రచించెను. [Edited by M. M. Haraprasada Sastri, M. A., 'Memoirs of the Asiatic Society of Bengal' Vol. III P I] తరువాత హరదత్తసూరి (17 వ శతాబ్ది) iv. "రాఘవనైషధీయ మనుద్వ్యర్థికావ్యమును దద్వ్యాఖ్యానమును రచించెను. 'కమలినీకలహంస, కావ్యదర్పణాది గ్రంథనిర్మాత యగు 'రాజచూడామణిదీక్షితుఁడు v. "రాఘవయాదవపాండవీయ" మను త్ర్యర్థికావ్యము రచించినట్లు తెలియుచున్నది. [Vide Preface to 'Kamalinikalahamsa' p. v, Sri Vani Vilas Series, Srirangam ]

ఆంధ్రసారస్వతమున 'వేములవాడ భీమకవి' రాఘవపాండవీయ' మను ద్వ్యర్థికావ్యమును నిర్మించినట్లును, నది పింగళి సూరనకుఁ బూర్వమే ఖిలమైనట్లును సూరనకృత 'రాఘవపాండవీయము' వలననే తెలియుచున్నది. [చూ. రాఘవపాండవీయ పీఠిక: 5 పు. 10, 11 ప. వావిళ్లవారిప్రతి.] అందుచే ii నాంధ్ర రాఘవపాండవీయ నిర్మాతయే, యాంధ్రద్వ్యర్థికావ్యనిర్మాణ మార్గమునఁ బ్రథమపథికుఁడు (16 వ శతాబ్ది) తరువాత రామరాజభూషణుఁడు (3) "హరిశ్చంద్రనలోపాఖ్యాన" మను ద్వ్యర్థిప్రబన్ధమును రచించెను. పిమ్మటఁ గృష్ణాధ్వరి (4) నైషధపారిజాతీయ మనునొకద్వ్యర్థికావ్యమును రచించెను. [చూ. శ్రీరామమూర్తిగారి 'కవిజీవితము' ఆంధ్రద్వ్యర్థికావ్యకవుల చరిత్ర. 25 పు- 1894] పిండిప్రోలు లక్ష్మణకవి (18 వ శతాబ్ది) (5) "రావణదమ్మీయము (లంకావిజయము)" మను ద్వ్యర్థికావ్యమును నిర్మించెను. (6) క్రొత్తలంక మృత్యుంజయకవి (18 వ శతాబ్ది) ధరాత్మజాపరిణయ మనుద్వ్యర్థికావ్యమును వ్రాసెను. ఈకవి గ్రంథనామములోఁగూడ ద్వ్యర్థిచమత్కారముం జూపెను. భూమిజ (సీత) యొక్కయు, గిరిజ (పార్వతి) యొక్కయుఁ బరిణయము లిందు వర్ణితములు. తరువాత బుక్కపట్టణము తిరుమల వేంకటాచార్యకవి, పైప్రబంధమువలెనే (7) "అచలాత్మజాపరిణయ" మనుద్వ్యర్థిప్రబంధమును రచించెను.

ఈకవిగూడఁ బ్రబంధనామమునఁ గూడ ద్వ్యర్థివైభవముం జూపెను— అచలాత్మజ- సీత; పార్వతి. ఇందువీరికల్యాణవృత్తాంతము వర్ణింపఁబడెను. (8) ఘోడూరి పెదరామకవి "శివరామాభ్యుదయ" మను కథాద్వితయ సంఘటితకావ్యమును రచించెను. [ఈసందర్భమున సాహితీచక్రవర్తులును, విద్వ్యత్ప్రవరులు నగు స్వర్గీయ కొంరిభద్రాద్రిరామశాస్త్రిగారి "శివరామశతక"మను ద్వ్యర్థిశతకము జ్ఞాపకమునకు వచ్చుచున్నది] ('శివరామాభ్యుదయము' చూ. ఆంధ్రకవులచరిత్ర III భా. (9) మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవి "కృష్ణార్జునచరిత్ర" మను ద్వ్యర్థికావ్యమును నిర్మించెను. (10) శ్రీపాద వేంకటాచలకవి ('కౌసల్యాపరిణయ' ప్రణేత; 19 వ శతాబ్ది) "రామకృష్ణోపాఖ్యాన"మను ద్వ్యర్థికావ్యమును విరచించెను.

ఆంధ్రత్ర్యర్థికావ్యరచనకు ముందంజవేసినవాఁడు మహోపాధ్యాయబిరుదాలంకృతుఁడగు నెలకూచి బాలసరస్వతి (17వ శతాబ్ది) ఇతఁడు (11) "రాఘవయాదవపాండవీయ"మను త్ర్యర్థికావ్యమును బ్రబంధీకరించెను. (12) నెల్లూరి వీరరాఘవకవి (18 వ శతాబ్ది) "యాదవరాఘవపాండవీయ" మనునొక త్ర్యర్థిప్రబంధమును నిర్మించెను. అయ్యగారి వీరభద్రకవి "రాఘవపాండవయాదవీయ" మను మూఁడర్థముల కావ్యమును రచించెను. (చిత్రాడ: "అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము"న ముద్రితము.) (14) ఓరుగంటి సోమశేఖరకవి, రాఘవ-యాదవపాండవార్థముల నిచ్చు "రామకృష్ణార్జునరూప నారాయణీయ" మనునొక త్ర్యర్థి నిబంధనమును నిర్మించెను. (15) మఱియొకకవి "నలయాదవరాఘవపాండవీయ" మను చతురర్థిప్రబంధమును రచించినట్లు తెలియుచున్నది. [చూ. 'కవిజీవితములు, ఆంధ్రద్వ్యర్థికావ్యకవులచరిత్ర 42 పు.] గీర్వాణాంధ్రద్వ్యర్థిత్ర్యర్థిచతురర్థి కావ్యవిషయము నింతటితో విరమించి లేఖినిని బ్రసంగాంతరచర్చకు మరల్చుదము.

## II కవిరాజసూరి కాలనిర్ణయచర్చ

కవిరాజుకాలనిర్ణయచర్చకుఁ బూర్వము, ప్రాచ్యపాశ్చాత్యవిద్వాంసులీవిషయమున నొసంగినయభిమతముల విమర్శింతము.

1. విద్వచ్ఛిరోమణి యగు "మెక్‌డానెల్" మహాశయుఁడు స్వవిరచిత "గీర్వాణసారస్వతచరిత" మున నిట్లు వ్రాసియున్నాఁడు;

"The culmination of artificiality is attained by the Raghava-pandaviya, a poem composed by Kaviraja, who perhaps flourished about A D. 800"

—(Dr. A. A. Macdonell's 'History of Sanskrit Literature' P. 331)

2. 'డఫ్'పండితునియభిప్రాయము: (As given by Sriman M. Krishnamachariar avl, M. A, M. L., Ph. D., M. R A S, in his 'History of Skt. Literature?)

"Dr Duffs 'Chronology' makes Sruta kirti the author of the poem, whose name is mentioned in an inscription dated 1130 A. D. In that case, the poem must be assigned to about the 10th or 11th Century"

3. శ్రీమాన్ కృష్ణమాచార్యుల వారియభిమతము:—"The poet's (Kaviraja's) history is utterly in the dark, but he appears to have flourished about the beginning of the 9th century"

—(History of Classical Skt. Literature," P. 41, by Dr. M. Krishnamachariar).

4. పండిత మాధవదాసచక్రవర్తి, సాంఖ్యతీర్థుని యభిప్రాయము:— "Kaviraja, the author of Raghava-Pandaviya" flourished at about 800 A. D." (A short History of Skt. Lit" P. 141, by Professor Madhabdas Chakravarty," M A, Sankhya-tirtha)

5. ఆచార్య "బెరిడేల్ కీత్" మహాశయుని యభిప్రాయము:—"The ultimate result of the love of playing with language which marks both Bharavi and Magha is seen in the 'Raghava-Pandaviya' of Kaviraja, which is most probably to be dated under Kadamba Kamadeva about A. D. 1190, though it has been ascribed to the ninth century"—(Dr. A. B. Keith's Classical Skt. Lit. P. 56)

6. శ్రీమత్పండిత పరవస్తు వేంకటరామానుజస్వామివారి యాశయము:—"As Vamana who belongs to the 8th century A. C., refers to Kaviraja (Kavyalankarasutrani IV. Adhikarana, i. Adhyaya 10th Sutra) the latter must have flourished in the 7th century A C."

'కవిరా'జని కవియొక్క బిరుదము గాని కవినామము కాదు. ఇట్లు బిరుదములచేతనే కొందఱుకవులు వ్యవహరింపఁబడుట సుప్రసిద్ధము. ఉదా. 'భవభూతి' యని కవి యొక్క బిరుదము; కవినామము 'శ్రీకంఠుఁడు' కాని యి

తఁడు 'భవభూతి' యనియే' వ్యవహరింపఁబడుచున్నాఁడు. 'రసగంగాధర' మనోరమాకుచమర్ద'నాది గ్రంథప్రణేత యగుజగన్నాథపండితుఁడు, 'పండితరాయ' లను బిరుదనామముచేతనే వ్యవహరింపఁబడుచున్నాఁడు. ఈవిషయమై నాంఖ్యతీర్థు లగు శ్రీచిన్తాహరణచక్రవర్తి M A. యిట్లు వ్రాసియున్నాఁడు;—

"The practice of referring to a scholar by his title alone is not unknown or rare in India. Even great kings are sometimes found to be referred to, not by their proper names but by their epithets. Thus king Asoka in all his inscriptions but one, refers to himself as Priyadarsi—प्रियदर्शि—his favourite epithet. And this kind of frequent use of the epithet to the negligence of the proper names, has been responsible, in some cases, for the entire forgetting of the proper name by later day people. Thus the son of Govinda III of the Rastrakúta family of Mányakheta is known to us from all documents so far obtained, only by his epithets such as Amogha-varsa etc., Of scholars known by their titles, we may cite the example of Jagannátha, author of the 'Rasagangàdhara,' who is generally known by his title of Panditaràja. The proper name of the founder of the Vaisesika system of philosophy is yet unknown, he being generally known by his various epithets Kanáda, Aulukya etc." (Prof-Chintaharana Chakarvarty's Introduction to the 'Pavanadutam' of Dhoyi, Page 3.)

'కవిరాజసూరి' నామము మృగ్యము. కావ్యాంతమునందలి XIII. 62. శ్లో॥ చక్రబన్ధమునఁ గూడఁ "గవిరాజకావ్య" మనియే వ్రాయఁబడి యున్నది 'కవిరాజ' బిరుదాలంకృతు లగుకవుల నరయుట ప్రకృత మవసరము.

(1) క్రీ, శ. 4 వ శతకమున రాజ్యపాలన మొనర్చిన "సముద్రగుప్తు" నకుఁ గవిరాజబిరుదముఁ గలదు.

"Samudragupta, we learn, was a poet himself whose title of *King of poets* (Kavirâja)—later the style of poet laureate awarded to successful writers—was established by the composition of many poems worthy of imitation by the learned, who was master of a poetic style worthy of study, and who enriched by his efforts the spiritual treasures of the poets."

—Dr. A B. Keith's "Classical Sanskrit Literature," P. 28)

(2) "బాలరామాయణ, కావ్యమీమాంసా"ది గ్రంథనిర్మాత యగు రాజశేఖరమహాకవిగూడఁ గవిరాజబిరుదాలంకృతుఁడు. ఇతఁడు, 'కర్పూరమం

జరి' ప్రస్తావనలోఁ దనసమకాలీను లగు 'మృగాంకలేఖాకథాకారాపరాజిత కవులు' తన్ను నుతించినట్లుగా "బాలకవిః 'కవిరాజో'నిర్భయరాజస్య తథో పాధ్యాయః" అని చెప్పికొనెను.

(3) 'కర్ణభూషణ' మనునలంకారగ్రంథకారుఁ డగుగంగానందు'నికిఁ గూడఁ గవిరాజబిరుదము గలదు.

(4) వంగదేశాధీశుఁ డగు'బల్లాలసేన'సూనుఁ డగు'లక్ష్మణసేను'ని సభాలంకారభూతుఁడును "పవనదూత" కావ్యనిర్మాతయు నగు'ధోయీకవికిఁ' గూడఁ గవిరాజబిరుదము గలదు. 'పవనదూత'కావ్యాంతమునందలి గద్య: "ఇతిశ్రీధోయీకవిరాజవిరచితం పవనదూతాఖ్యం కావ్యం సమాప్తం"

శ్లో॥ దన్తివ్యూహం కనకలతికాం చామరం హైమదణ్డం
యో గౌడేన్ద్రా దలభత కవిక్ష్మాభృతాం చక్రవర్తీ।
శ్రీధోయీ కః సకలరసికప్రీతిహేతో ర్మనస్వీ
కావ్యం సారస్వత మివ మహామన్త్ర మేత జ్జగాద."

పవనదూతమ్ 101 శ్లో.

"శ్లో॥ .........యావ ద్రాధారమణతరుణీకేళిసాక్షీకదమ్బ
స్తావ జ్జీయా త్క్షితినరపతే రేష వాచాం విలాసః॥"

ప. దూ. 108 శ్లో.

ఈగ్రంథికోదాహరణమువలన 'ధోయీ,' కవిరాజబిరుదాంచితుఁ డని విదిత మగుచున్నది. మఱియు, జయదేవమహాకవి తన"గీతగోవిన్ద"కావ్యమున నిట్లు వ్రాసియుండెను. (I-4)

"శ్లో॥ వాచః పల్లవయ త్యుమాపతిధర స్సంధర్భశుద్ధిం గిరాం
జానీతే జయదేవ ఏవ శరణ శ్శ్లాఘ్యో దురూహద్రుతేః।
శృంగారోత్తరసత్ప్రమేయరచనై రాచార్యగోవర్ధన
స్పర్ధీ కోఽపి నవిశ్రుత శ్శ్రుతిధరో 'ధోయీ'కవిక్ష్మాపతిః॥"

ఈశ్లోకమున జయదేవుఁడు తనసమకాలీనకవుల నుల్లేఖించియున్నాఁడు. లక్ష్మణసేనుని సభాభవనద్వారమునందున్న శిలాశాసనమునందు—

"శ్లో॥ గోవర్ధనశ్చ శరణో జయదేవ ఉమాపతిః।
కవిరాజశ్చ రత్నాని సమితౌ లక్ష్మణస్య చ॥"

అనుశ్లోకము వ్రాయఁబడియున్నట్లు తెలియుచున్నది. పైరెండుశ్లోకములవలన

'ధోయీ,' కవిరాజబిరుదాంచితుఁ డని తెలియుచున్నది. ఈవిషయమై 'కీత్' పండితుఁ డిట్లు వ్రాసియున్నాఁడు.

"Of infinitely greater importance is the 'Gita Govinda' of Jayadeva, one of the court poets of Laksmana Sena of Bengal, a contemporary of Govardhana, Dhoyi Srutadhara 'Kaviraja', Sarana and Umapatidhara, who with him make up The five * jewels in whose possession the Court of his patron vied with the nine of Vikramaditya, though with better historical warrant" (Prof A. B. Keiths "Classical Skt. Literature. P. 120)

కొంచె మప్రస్తుత మైనను నిట నొక్కవిషయము వ్రాయవలసియున్నది. పండిత శివప్రసాదభట్టాచార్యులవారు, లక్ష్మణసేనునియాస్థానమున, విక్రమాదిత్యునియాస్థానమునందు వలెనే తొమ్మండుగురు పండితరత్నము లుండి రని వ్రాసియున్నారు కాని యిది యచారిత్రక మని పూర్వోద్ధృతశ్లోకములవలనను "బెరిడేల్ కీత్"పండితుని గ్రంథమునందలి యాకరములవలనను దెలియుచున్నది.

(Prof. Sivaprasada Bhatta charya, M. A, opines in his scholarly essay "The Gaudi Riti in Theory and Practice" in 'The Indian Historical Quarterly, Vol. III. No 2. June 1927. Laksmana Sena, king of Bengal, was regarded as the Vikramaditya of Bengal, as would appear from a verse—101 Sloka—of the 'Pavanaduta' This age has been called the Augustan age. There were also nine * gems in his court". P. 391; Footnote no 1.

లక్ష్మణసేనుఁడు 12 వ శతాబ్దిలో రాజ్యపాలన మొనర్చుటచే ధోయీ కవికూడ నాకాలముననే యుండినట్లు నిశ్శంకనీయముగఁ దెలియుచున్నది.

రాజశేఖరమహాకవినిశ్చితకాలము క్రి. శ. 880—920. కాని, ధోయీ కవిరాజు 12 వ శతాబ్దిని నుండెను. అందుచే రాజశేఖరస్తుత్యుఁ డగుకవిరాజు, ధోయీకవిరాజుకంటె భిన్నుఁడుఁ బూర్వుఁడు నని విశద మగుచున్నది.

(5) 'సాహిత్యదర్పణ' కారుఁ డగు 'విశ్వనాథు'నకుఁ గూడఁ గవిరాజ బిరుదము గలదు. (1300—1350 A D) కాని పైఁజెప్పిన 'సముద్రగుప్త రాజశేఖర, గంగానంద, ధోయీ, విశ్వనాథుల'లో నెవ్వరును 'రాఘవపాండవీయ కవిరాజు' వలెఁ గేవల బిరుదనామములచే వ్యవహరింపఁబడుట లేదు. ధోయీకవియైనను బూర్వోద్ధృతశ్లోకములం దక్కుమ తెక్కడను గవిరాజ ని వ్యవహరింపఁబడుట లేదు. అందుచే వ్యస్తముగాఁ గవిరాజనినచో 'రాఘవపాండవీయ కారుఁడే' సూచితుఁడు.

ఇంతదనుక 'గవిరాజ కాలనిర్ణయమునకు విషయసమీకరణము చేయఁబడెను. ఇఁకఁ గవిరాజ కాలసమాలోచనమునకుఁ గడంగుదము: —

(1) క్రీ. శ. 8 వ శతాబ్దోత్తరభాగమునఁ గాశ్మీరదేశాధీశుఁ డగుజయాపీడుని యాస్థానమున నుండిన "వామనపండితుఁడు తన "కావ్యాలఙ్కారసూత్రవృత్తి"లోఁ గవిరాజనామముగల శ్లోకము నుదాహరించెను.

"పాదానుప్రాసః పాదయమకవత్ యే పాదయమకస్య భేదా స్తే పాదానుప్రాసస్యే త్యర్థః తేషా ముదాహరణాని యథా 'శ్లో. కవిరాజ మవిజ్ఞాయ కుతః కావ్యక్రియాదరః కవిరాజం చ విజ్ఞాయ కుతః కావ్యక్రియాదరః."

IV అధి । అ 10 సూ.

అందుచేఁ గవిరాజు సప్తమశతకోత్తరభాగమున సప్తమశతాబ్దప్రథమపాదమున (క్రీ. శ. 650 — 725) జీవించియుండె నని నిశ్చయింపనగును.

(2) 'రాజశేఖరమహాకవి' "బాలరామాయణ" ప్రస్తావనలోఁ గవిరాజును సూచించియున్నాఁడు.

"శ్లో॥ సమూర్తో యత్రాసీ ద్గుణగణ ఇవా కాలజలద।
స్సురానన్ద స్సోఽపి శ్రవణపుటపేయేన వచసా ।
న చాన్యే గణ్యాస్తే తరళకవిరాజప్రభృతయో।
మహాభాగ స్తస్మి న్నయ మజని యాయావరకులే."

బాలరామా I అఙ్కము 13 శ్లో.

ఈశ్లోకమున 'రాఘవపాండవీయ' ప్రణేతయే కవిరాజ శబ్దసూచితుఁడు. రాజశేఖరుఁడు "కావ్యమీమాంస" యందు (9 వ పుట) దశవిధకవుల నిర్వచించుచు — "దశచ కవేరవస్థాభవన్తి. తత్రచ బుద్ధిమదాహార్యబుద్ధ్యో స్సప్తతిస్రశ్చ ఔపదేశికస్య తద్యథాః 1 కావ్యవిద్యాస్నాతకః 2 హృదయకవి: 3 అన్యాపదేశీ 4 సేవితా 5 ఘటమానః 6 మహాకవిః 7 కవిరాజః 8 ఆవేశిక: 9 అవిచ్ఛేదీ 10 సంక్రామయితాచ ........ ..... యోఽన్యతరప్రబన్ధే ప్రవీణః స మహాకవిః యస్తు తత్రతత్ర భాషావిశేషే తేషు ప్రబన్ధేషు తస్మిం స్తస్మిం శ్చరసే స్వతంత్రః సకవిరాజః" అని వ్రాసెను. ఇందు దశవిధకవులలో నాఱవవాఁడు మహాకవి, ఏడవవాఁడు కవిరాజు నానాభాషాప్రవీణుఁడు, నానావిధప్రబన్ధప్రణేత రసభావనిరంతరకవితాదక్షుఁ డే కవిరాజ బిరుదార్హుఁడు. కవిరాజు మహాకవికంటె యధికతరుఁడు.

రాజశేఖరుఁడు 880—920 నడుమ జీవించియుండుటచేఁ గవిరాజు, న వమశతకమునకుఁ బూర్వుఁ డని తేలుచున్నది. పూర్వోక్త వామనపండితుని సూచనచేఁ గవిరాజు 650—725 నడుమ నుండినట్లు నిర్ణిత మగుచున్నది.

(3) ఇఁక గ్రంథస్థ నిదర్శనముల విమర్శాంతము.

"ఇతి శ్రీహలధరణీప్రసూత కాదమ్బకులతిలకచక్రవర్తి వీరశ్రీ కామదేవప్రోత్సాహిత కవిరాజపండిత విరచితే రాఘవపాండవీయే మహాకావ్యే కామదేవాఙ్కే రావణదుర్యోధనవధ, శ్రీరామయుధిష్ఠిరాభిషేకో నామ త్రయోదశ స్సర్గః." ఇది రాఘవపాండవీయాంతిమగద్య. దీనివలనఁ గాదంబకులతిలకుఁ డగువీరకామదేవుని ప్రోత్సాహముచేఁ గవిరాజు, రాఘవపాండవీయమును నిర్మించె నని తెలియుచున్నది. ఈవీరకామదేవుని దేశకాలము లవిదితము లగుటంజేసి, మనకవిరాజు దేశకాలములుగూడ నజ్ఞాతము లయ్యె.

"శ్లో॥ సుబన్ధు ర్బాణభట్ట శ్చ కవిరాజ ఇతి త్రయః।
వక్రోక్తిమార్గనిపుణా శ్చతుర్థో విద్యతే నవా." రా. పాం. I- 41

అనునీశ్లోకమునఁ గవిరాజు సుబంధుభట్టబాణులును దానును వక్రోక్తి కవితారచనమున దక్షు లనియు, నిఁక నట్టివక్రోక్తి కవితానిర్మాణనిపుణులు లేర నియు ఘంటాఘోషమున నుద్ఘోషించెను. ఈశ్లోకమువలన భట్టబాణుఁడు (590—650 A. D.) కవిరాజుకంటెఁ బూర్వుఁ డని తెలియుచున్నది. కవిరాజు పూర్వోక్తకవిత్రయముకంటె శ్లేషకవితానిపుణులు లే రని కంఠోక్తిగా వక్కాణించుటంజేసి, శ్లేషకవితానిర్మాణమున సిద్ధహస్తుఁడును, రాఘవపాండవీయాపర నామముగల "ద్విసంధాన మహాకావ్య" రచయితయు నగు ధనంజయమహాకవికంటెఁ గవిరాజు పూర్వుఁ డని స్పష్ట మగుచున్నది. 'ద్విసంధానమహాకావ్య' నిర్మాత యగుధనంజయుఁడు (దశరూపకకారుఁ డగుధనంజయునికంటె భిన్నుఁడుఁ బూర్వుఁడు) రాజశేఖరమహాకవికంటెఁ బూర్వుఁ డని యీక్రింది 'ద్విసంధాన'పీఠికాకరమువలనఁ దెలియఁగలదు.

"884 క్రిస్తాబ్దపర్యన్తం కాశ్మీరా న్పాలయితు రవన్తివర్మణ స్సమకాలీనయో 'ర్ధ్వన్యాలోక' నిర్మాయ కానన్దవర్ధన 'హరచరిత' మహాకావ్యరచయితృ రత్నాకరయోః స్తావకస్య, 959 క్రిస్తాబ్దరచిత 'యశస్తిలకచంపూ' నిర్మాతృ జైనసోమదేవేన స్తుతస్య, 'బాలరామాయణా' ద్యనేకనిర్మాతృ రాజశేఖ

రస్య నామ్నా జల్హణాతిసంగృహీత "సూక్తిముక్తావళ్యా"దిషు లిఖితేషు ప్రాచీనకవివర్ణనశ్లోకేషు (సూక్తిముక్తావళి- సుభాషితహారావళ్యోః)

'శ్లో॥ ద్విసన్ధానే నిపుణతాం సతాం చక్రే ధనంజయః
యయా జాతం ఫలం తస్య సతాం చక్రే ధనంజయః'

ఇత్యుపలభ్యమానత్వేన 'రాజశేఖరకవేః ప్రాచీనో ధనంజయకవిరాసీత్' ఇతి."

'కవిరాజు, శ్లేషకవితానిపుణులను మాత్రమే యుదాహరించెం గాని, సామాన్యు లగుశ్లేషకవుల నుదాహరింపలేదు. అందుచేఁ బూర్వోక్తరాఘవపాండవీయశ్లోకము (I- 4) కవిరాజధనంజయపౌర్వాపర్యద్యోతకము కాఁజాల' దని కొందఱి యభిమతము కాని యిది సత్యబద్ధము కాదు. ధనంజయమహాకవి కవిరాజుకంటె నేవిషయమునను దీసిపోవువాఁడు కాఁడు.

"శ్లో॥ ప్రమాణ మకలంకస్య పూజ్యపాదస్య లక్షణం
ద్విసంధానకవేః కావ్యం రత్నత్రయ మపశ్చిమమ్."

ధనంజయనిఘంటువు. II. పరి 48

అకలంకభట్టారకుని న్యాయశాస్త్రమును, బూజ్యపాదుఁ డనుదేవనన్దియొక్క వ్యాకరణమును, ద్విసంధానకవి యగుధనంజయుని "రాఘవపాండవీయము"ను (ద్విసంధానమహాకావ్యము) నసదృశరత్నత్రయ మని యీశ్లోకభావము.

"శ్లో॥ జాతే జగతి వాల్మీకౌ శబ్దః కవి రితి స్మృతః
కవీ ఇతి తతో వ్యాసే కవయ శ్చేతి దణ్డిని॥
కవయః కవయ శ్చేతి బహుత్వం దూర మాగతం
వినివృత్తం చిరా దేత దస్మిన్ జాతే ధనంజయే."

— ధన. II. 49; 50

ఈశ్లోకములవలన ధనంజయుఁ డుత్తమకవిశిరోమణి యనియు, (6 వ శతాబ్దిలో నుండిన) ఆచార్యదండి మహాకవికిఁ జాలకాలమునకుఁ బిమ్మట నుండినవాఁ డనియుఁ దెలియుచున్నది. 'ఇవి ధనంజయుఁడు స్వానుచమర్దనప్రియత్వముచేఁ జెప్పినశ్లోకములు గాని, యితరకవు లెవ్వరును ధనంజయు నిట్లు నుతింపలే' దని కొందఱు పురోభాగు లీశ్లోకముల నిరసించిన నిరసింతురుగాక. ద్విసన్ధాన' కావ్యరత్నము నవలోకించిన ధనంజయకవి యసదృశప్రజ్ఞావైభవము

గోచరించును. 'ద్విసంధానము' లో ధనఞ్జయుఁడు పూర్వకవిస్మరణము చేయ మిచేఁ దనకుఁ బూర్వుఁడైనను గవిరాజును, స్మరించుటకుఁ బ్రసక్తి కలుగలేదు. వీరిరువురకు విశేషకాలవ్యత్యాసము లేమిచే ధనంజయునకుఁ గవిరాజవృత్తాంతము తెలియలే దనుటకు నవకాశము లేకపో లేదు. (Prof. A B Keith opines in his "Classical Skt. Literature) P. 56 Footnote: "A work of the same title (ie. Rághava-Pandavîya) by Dhanamjaya is mentioned by a Rájasekhara, and the date of it is dubious. అని "బెరిడేల్కీత్" పండితుఁడు వ్రాసియున్నాఁడు; కాని పూర్వవిమర్శితాంశములం బట్టి ధనంజయుని నితనిరాఘవపాండవీయమును సూచించిన రాజశేఖరుఁడు 'బాలరామాయ' ణాదిగ్రంధరచయితయే యని యు, నీధనంజయుఁడు కవిరాజునకుఁ బరమునను, రాజశేఖరునకుఁ బూర్వమున నుండినవాఁ డని స్పష్ట మగుచున్నది, కనుక ధనంజయుఁ డష్టమశతకోత్తరార్ధమున (750—800 A D) నుండిన ట్లూహింపనగు. క్రీ. శ. 750 కిఁ బూర్వుఁడును, వామనస్తుత్యుఁడు నగుమనకవిరాజు క్రీ. శ. 650—725 నడుమ నుండె ననుట సత్యసంబద్ధము. అందుచేఁ గవిరాజు క్రీ. శ. 725 వ వత్సరమునకుఁ బరమున నుండె ననిన "కీత్" మొదలగు విద్వాంసుల యభిప్రాయము లన్నియు నలీకవాదము లగుటచే నిరస్తము లని సత్యాన్వేషణతత్పరుఁడనై మనవి చేయుచున్నాను. శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులవారు "కావ్యమీమాంస" యనెడి శీర్షికతోఁ బ్రచురించినవ్యాసములో రాజశేఖరునిచే స్మరింపబడిన "కవిరాజును గురించి యేమియుఁ దెలియ"దని వ్రాసియున్నారు.

Vilde 'The Maha Rajah's College, Magazine'—Vizianagaram—(Vo. VI. No. 4 July 1927. Page) అట్టికవిరాజుంగూర్చి యీమాత్రవ్యాసమునైనను వ్రాయఁ గలిగినందులకు సంతోషించుచున్నాఁడను. కాలాంతరమున 'రాఘవపాండవీయవిమర్శనారవిన్దము' సూర్యాలోకమున వికసించి రసికామోదదాయకము కాఁగల దని విన్నవించుచున్నాఁడను.

# కవిసమయము.

(విద్వాన్ కప్పగల్లుమఠం కరిబసవశాస్త్రిగారు)



చ. మనమునఁగొన్న నెవ్వగలు మాన్పి ఘటింతు రకాండసమ్మదం
బనఘకథాముఖంబున హితాహితబోధ మొనర్తు రింపుగాఁ
గనుఁగొనుకంటె నద్భుతముగా నెఱిఁగింతు రతీంద్రియార్థముల్
ఘనమతు లెల్లవారికి నకారణబంధులు గారె సత్కవుల్.

కవికులావతంసములారా ! విద్వచ్ఛిరోరత్నములారా !

రసజ్ఞులకుఁ గావ్య మమృతతుల్యము. కావ్యజ్ఞానము సుఖైకసాధనము. కావ్యము శ్లేషప్రసాదాదిగుణసంయుతము. కైశిక్యాదివృత్తిసంయుతము. నవరససంభరితము. భావపరిప్లుతము. రీతిసమ్మిళితము. వ్యంగ్యప్రధానము. అలంకారాలంకృతము. దోషరహితము. నాయికానాయకవిభాసితము. జాతి, ద్రవ్య గుణ క్రియాదిసల్లక్షణసంజాతము. శబ్దచిత్ర, అర్థచిత్రాదివర్ణనాదీపకము. కథాసందర్భరచనౌచిత్యగుంఫనము.

ఏవంవిధసురుచిరలక్షణావృత మగుకావ్యపఠనము రసికజనమనోహ్లాద మనుటకు సందియముఁ గలదా ! ప్రపంచస్థితిని గనుఁగొనుటకు, పారమార్థిక సిద్ధిని బొందుటకు, పురాణేతిహాసములు గలవు. పద్యగద్యాది గ్రంథములు గలవు. వీని కన్నిటికిని గావ్య మనుపేరు గలదా ? యనినఁ గల దనియే చెప్ప వచ్చును. కావ్యప్రభేదము లనంతములు. "కవేః కర్మ కావ్యం" అనెడు వ్యుత్పత్తిచేఁ బురాణేతిహాసనాటకపద్యగద్యాదిగ్రంథములు కావ్యశబ్దవాచ్యములు. పురాణేతిహాసములను రచియించినవారు కవులు. ఇతిహాసశిరోరత్న మగుశ్రీమద్రామాయణము "ఆదికావ్య" మని ప్రసిద్ధి. కాన పురాణేతిహాసములు కావ్యగోష్ఠియందుఁ జేరఁదగినవి.

శాస్త్రము లుండఁగా నీకావ్యములవలనఁ బ్రయోజన మెట్టిది యన శాస్త్రములు దురవగాహములు. నీరసము లయి యుండుటఁ బట్టి కావ్యసృష్టి చేయవలసివచ్చె నని పలువురు పండితుల యభిప్రాయము. దీనివలనఁ గావ్యము సరస, మాధుర్యాదిగుణముల కాకరమై సర్వజనాంగీకృత మాయెను.

సుఖము మానవుని ముఖ్యోద్దేశము. అట్టిసుఖము నింద్రియములమూలమునఁ బొందుచున్నాము. సుఖమును బ్రత్యక్షముగాఁ జేసికొనుటకంటెను

గావ్యమూలకముగా లభింపఁజేసికొనుటలో సౌకర్యము గలదు. ఆనందము గలదు. కావ్యరసాస్వాదనమువలనఁ గలుగునట్టి సౌఖ్యము తదితర గ్రంథపఠనమువలనఁ గలుగదు. ఈసుఖమును, అజ్ఞులు, ప్రాజ్ఞులు, ధనికులు, దరిద్రులు సమముగా ననుభవింపవచ్చును. ఆ కావ్యజ్ఞానము మాత్రము గలిగిన ట్లాయెనా తక్కినజ్ఞానము తనంతఁ దానే కరతలామలక మగును. కావునఁ గావ్యజ్ఞానము మానవున కత్యంతాదరణీయము. విద్యార్థులకుఁ దంగెటిజున్ను, సాహిత్యజ్ఞానమునకు భాండాగారము.

ఆ కావ్యజ్ఞానమున కనేకసాధనము లున్నవి. అట్టిసాధనము లయందు "కవిసమయ" జ్ఞాన మొకటి. రసాలంకారాదులను దెలిసికొన్నను గవిసమయజ్ఞానము లేనియెడలఁ గావ్యరసమును సంపూర్ణముగా నాస్వాదించుటకుఁ గొదవ యగును.

కావ్యజ్ఞానమునకుఁ బ్రబలాంగము లగురసాలంకారాదులను జక్కగా నెఱిఁగినచోఁ గవిసమయజ్ఞానము తప్పక ప్రయోజనకారి యగుచుండును గాన నీవిషయమునందు గ్రంథములు విశేషముగాఁ బుట్టలేదని తోఁచుచున్నది.

ఇట్టివిషయమును గుఱించి పండితులసన్నిధియందు నివేదించుటవలనఁ గావ్యజ్ఞానమునకుఁ గొంత మెఱుఁగిడిన ట్లగునేగాని తఱుఁగ దని నానమ్మకము.

"కవిసమయ" మనఁగా ? కవు లనేకవిధములుగా వర్ణనావైఖరిచే లోకవృత్తమును వెలిఁబుచ్చుచున్నారు. ఇట్లు చేయునప్పుడు పాఠకులయాహ్లాదాతిశయమునకై ప్రతినిత్యము మేము చూచుచున్న పదార్థములందు సాదృశ్యము లగుపదార్థములనే పోల్చునట్టి కొన్నికొన్ని సంకేతముల నుంచుకొనుచున్నారు. ఆసంకేతములకే "కవిసమయ" మని పేరు.

ఈసంకేతములకు నియమ మెట్టిది యనిన—కవులు నిరంకుశులు గానఁ దమకుఁ దోఁచినసంకేతముల నుంచుకొనెదరు.

ఆసంకేతములలో, నిజముగా నుండుదానిని లే దనియు, లేనిదానిని నున్న దనియు, భిన్నవస్తువు లభిన్నవస్తువు లనియు, కార్యమునకు సిద్ధమైన కారణమును లే దనియు, దానికి వేఱొక కారణము గల దనియు, ఇత్యాద్యనేకసంకేతముల నేర్పాటు చేసికొనుటవలన నీసంకేతములకు "కవిసమయ" మనుపేరు వచ్చినది. ఇయ్యది కవిపరంపరాప్రాప్తముగా వచ్చుచున్నది. "గవిసంప్రదాయ" మనియును పేర వ్యవహరింపఁబడుచున్నది. ప్రస్తుతము నాకుం

లోకానుభవముచేత నిరూపింపఁదగినది గాదు. ఆగమపురాణేతిహాసములయందు సిద్ధమైనవిషయమును గాదు. కాని, కవిజనపరిగృహీతమై కేవలము రూఢివశమున వచ్చిన దయి యుండవచ్చును.

కవిసమయస్వరూపముఁ దెలిసికొనినఁ గాని కవులు తమతమగ్రంథములయందు విస్తరించు చమత్కారము హృదయంగమము గానేరదు. వారియుద్దేశమునకు భంగము గలుగును. రసవంత మగుసత్కవులవాక్యము లున్మత్తప్రలాపములా యేమి యనుశంక జనించును. దీనికి మనగ్రంథములలోని కొన్నియుదాహరణముల నొసఁగెదను ; అది యెట్లన ? వసుచరిత్రమునందు—

సీ. వలుదగుబ్బలు ప్రసేవకవృత్తిఁ దగుగుబ్బకాయల కపరంజిచాయ లొసఁగ
లలితాంగుళీదళంబులు సమేళములైన సారెలపై రాగసంపద లిడఁ
బాణికంకణరుతు ల్ప్రాణానుబంధంబు గలతాళగతి కనుగ్రహము లీన
నాలాపభంగి యత్యక్తసంపాది సమస్వరంబులకు గ్రామంబు లునుపఁ
బ్రచురతానామృతముల మూర్ఛనలచేన, చేతనంబులు చేతనరీతిఁ దనరఁ
జేతనంబు లచేతనభాతి నొనర, వీణవాయించు నొకయలివేణిఁ గంటి.

ఈపద్యమునందు గవి వసురాజేంద్రునకుఁ దనకేళీసచివుఁడు వీణావాదనలాలస యైనయొకయలివేణినిఁ గంటి నని చెప్పుటలో గానమహిమచేత నచేతనము లైనరాళ్లు గరఁగుట, మోళ్లు చిగుర్చుటయును, సచేతనము లైననరపశుమృగాదులు పరవశతను బొంది నిశ్చేష్టితము లగుటయును గవిసంకేతసిద్ధము. ఇదియే " కవిసమయము "

గిరికావర్ణనయందు, కంఠము నుత్ప్రేక్షించి వ్రాయుటలో శంఖగతదక్షిణావర్తత్వమును బ్రదక్షిణగమనముగా నుత్ప్రేక్షించుట నిజముగా నుండుదానిని లే దని చెప్పుట కవిసమయము.

చ. విలసితమార్తికంబులు స విభ్రమరేఖలు నున్నని సాటిరాఁ
దలఁచి మహోద్ధతిన్ మొరసి తన్మృదునాదవిలాసకౌశలం
బలవడమిన్ ముడింగి దరమై తనలో వివరం బెఱింగి యా
వలమురి దాఁ బ్రదక్షిణము వచ్చెనొ యాసతికంఠలక్ష్మికిన్.

గిరికావనవిహారవర్ణనలో—

సొఖముశాలరసాలమిది పికపాలిపాలిటి యమశ్శాలము, గేలిఁ గేలిడి లమునఁ బొందుచుఁగిల్లి గిల్లుము తత్ప్రవాళము—

అనువృషభగతిరగడలోను, సఖులు పరస్పరము విలాససంభాషణఁ
జేయుచు విరులను సంగ్రహించుసమయమందు-

సీ. కలికి నీచేపట్టు గలది మాకందంబు సతి నీవు గనునది సరసతిలక

యను పద్యములోను కరస్పర్శాదిదోహదక్రియలు జరిగించి రసాలాది వృక్షముల పుష్పములను గ్రహింపు మని చెప్పుట స్త్రీలపదతాడనతో నశోకము, వారిదృష్టిపాతముచేతఁ జంపకము, గండూషసంపర్కముచేత వకుళము (పొగడచెట్టు) నందు, పల్లవకుసుమోత్పత్తి యకాల మందైనను గలుగు నని వర్ణించుటయే "కవిసమయము".

ఇట్టికవిసమయమును జక్కగాఁ దెలిసికొనినఁ గాని యీవర్ణనావైభవము హృదయంగమము కానేరదు. ఔచిత్యము బయల్పడదు.

పైఁజెప్పిన యుదాహరణములచేతఁ గవిసమయ మిట్టిదని కొంతమట్టుకుఁ దెలిసికొనవచ్చును. ఇప్పుడు "కవిసమయము" లోకానుభవముచేత నిరూపింపఁదగినది గాదు. ఆగమపురాణేతిహాసచోదితము గాదు. మఱి యేమన? జాతి, ద్రవ్య, క్రియాగుణాశ్రయమై, అలంకారాశ్రయమై, రసాశ్రయమై వ్యంగ్యాశ్రయమై యలరారుచుండునది యని చెప్పనగును.

ఈకవిసమయము పరంపరాప్రాప్తమైనదిగా నుండవచ్చు ననుటకుఁ జాలినన్ని దృష్టాంతములు గలవు. అదెట్టు లన? పరంపరాప్రాప్తము గానియెడల, ఔచిత్యహాని, రసభంగము, కావ్యోత్కర్షప్రతిబంధకములు పుట్టును గనుక యొకకవిసంకేతమును మఱియొకఁ డనుమోదింపక వేఱుగాఁ బ్రవర్తించినచోఁ గీర్త్యపకీర్తులు దృశ్యపదార్థములు గావు గాన కీర్తికి ధావళ్యమును, అపకీర్తికిఁ గార్ష్ణ్యము నిచ్చి వర్ణించుట కవిసంప్రదాయము. ఆసంప్రదాయము నుల్లంఘించి యొకకవి కీర్తికి నల్లనివన్నెను, అపకీర్తికిఁ దెల్లనివన్నెను నిచ్చి వర్ణించినాఁ డనుకొందము. అప్పు డేమగును?

ప్రాచీనకాలమునుండియుఁ బలుగ్రంథములయందు వచ్చినసంప్రదాయము విపరీతమైనట్లు గానవచ్చును. చిరకాలమునుండి వచ్చినసంకేతము మాఱుపాటగును. రసభంగమగును గాన నిది పరంపరాప్రాప్తమైనవిషయము.

కవితనభావమును స్పష్టముగాఁ దెలుపక వర్ణనచేఁ బాఠకు లూహించుకొనునట్లు చేయవలెను. అప్పుడు గదా కవీశ్వరునిభావమునం దౌచిత్యము ప్రకటమగును. అందువలనఁ గవిసమయము పరంపరాప్రాప్తము గాకుండ

నుండినయెడలఁ గవిభావము వ్యక్త మగుట కష్టము. ఔచిత్యహాని సంభవించును.

ఇదిగాక కవుల ప్రతిభావికాసమునకు స్పర్థయే కారణము. స్పర్థయే యభివృద్ధికిఁ గారణ మని లోకమునందు వెల్లడియగుచుండుటవలన గావ్యాభివృద్ధికి స్పర్థ యవసరము. ఒకకవి యిట్లు వర్ణించియున్నాఁడు. దానికంటెను నే నతిశయ మగునట్లు వర్ణింపవలెను అనుస్పర్థ జనించుట ముఖ్యము. ఒక కవి తనకుఁ దోఁచినట్లు వర్ణించినచో వానిమార్గము వేఱే యగును. ఉత్సాహము పుట్టఁజాలదు.

పాఠశాలయందు, పలువురిజతలోఁ జదువువానికిని, ఒంటరిగాఁ జదువువానికి నుండు తారతమ్య మీవిషయమునందుఁ గలుగును. అందఱు నడచిన త్రోవనే తానునడచినఁ దనకు నితరులకు నుండువ్యత్యాసము వెల్లడియగును.

ఇట్లుండుటవలన దారతమ్యజ్ఞానము గలిగి కవులయందు నేను ముందు నేను ముం దనుస్పర్థ పుట్టుటకుఁ బ్రాచీనకవిసంకేతము ననుకరించుచు రావలెను. కవులస్పర్థను జూడుఁడు.

సీ. నలినసంభవువాహనము వారువంబులు కుముదసాములు మాకుఁ గువల

యాక్షి-యని శ్రీనాథుఁడు

చిన్నివెన్నెలకందువెన్నుదన్ని సుధాబ్ధిఁ బొడమినచెలువ తోఁబుట్టుమాకు

-అనియల్లసాని పెద్దన

ఒకరిని మించి యొకరు వర్ణనాచమత్కృతిఁ జూపినట్లు స్పష్ట మగుచున్నది.

కవిసమయముల సీరీతిగానే చెప్పవలె ననుట కేమి ప్రమాణము? కీర్తిని దెల్లగాను, అపకీర్తిని నల్లగాను నెందుకు వర్ణింపవలెను. ప్రతాపానురాగముల కరుణవర్ణము నెందు కీయవలెను? హిమవన్నగమందు భూర్జవృక్షము, మలయపర్వతమునందు చందనవృక్షము, పుట్టుచున్నవి గాని యితరస్థలములయందుఁ బుట్టినను బుట్టవని నియమ మెందుకుఁ జేయవలెను? చందనవృక్షమునందుఁ బుష్పఫలము లున్నను లేవని యెందుకుఁ జెప్పవలెను? హస్తమును జిగురుటాకులతోఁ బోల్పవలయు ననునిర్బంధ మెందుకు? ఈ మొదలగునవి—

ఇట్లే కవిసమయములు పుట్టుటకుఁ గారణ మే మైనను గలదా? లేక వట్టిసంకేతమా? అను ప్రశ్నలు గలుగవచ్చును. కవిసమయసంబంధనల కన్ని

టికిని గారణములను నిరూపించుటకు సాధ్యము గాకపోయినను బలువిశములగు నిదర్శనములు చూపింపవచ్చును? ఎట్లన :—

సమస్తప్రవృత్తి నివృత్తులు సుఖదుఃఖముల నిబంధనరూపములై యున్నవనుట స్పష్టము. కీర్త్యపకీర్తులు, సుఖదుఃఖనిమిత్తములు, దృష్టిగోచరము గానివి. వీనిని గంటిఁగోఁ జూచినవానివలెఁ గవి స్పష్టముగాఁ జెల్పవలసి వచ్చును.

సుఖము గల్గువిషయములో శ్రోత్రేంద్రియముతో నాస్వాదించుటకంటెను ఒకవస్తువు చక్షురింద్రియ ప్రత్యక్షమైనయెడల దానిసంస్కారము చిరస్థాయియై, యెక్కువసౌఖ్యము నొసగఁగలదు. కావున నమూర్తద్రవ్య మగుకీర్తికి ధావళ్యమును నపకీర్తికిఁ గార్ష్ణ్యమును నారోపించి చెప్పుటయం దౌచిత్యము గలదు.

ఎచ్చట నేది యెక్కువగా నుండునో యచ్చట నన్నియు నున్నవని చెప్పుట స్వభావము. ఒకనియం దనేకసద్గుణము లుండి యొకటిరెండు దుర్గుణము లున్నను వానిని సద్గుణి యనియే చెప్పెదరు. అట్లే మలయపర్వతమునందు శ్రీగంధవృక్షము లెక్కువగాఁ బెరుఁగుటవలనను హిమవత్పర్వతమందు భూర్జమే యధికముగాఁ బెరుగుటవలనను మలయగిరియందే శ్రీగంధము పుట్టుచున్న దనియు, హిమవన్నగమందే భూర్జము పుట్టుచున్న దనియుఁ జెప్పుట యనెడు కవిసమయము పుట్టి యుండవచ్చును. ఇట్లే వసంతమునందే కోకిలరుతము, వర్షర్తువునందే మయూరనృత్యము- ఇత్యాది కవిసమయములు పుట్టి యుండుటకుఁ గారణము లూహించుకొనవచ్చును.

శుక్లపక్షమునం దంధకారమే లేదనుట యొకకవిసమయము. కృష్ణపక్షమునందు వెన్నెల బొత్తిగా లేదనుటయుఁ గవిసమయము.

కవుల వర్ణన సుఖోత్పత్తికి సాధనముగాన నీవిధమగుకవిసమయమునం దౌచిత్య మున్నది.

గుణసామ్యము గలరెండువస్తువులయం దొకవస్తువును జూచిన మఱియొకవస్తువు స్మరణకువచ్చును. ఆహ్లాదవిషయమునందుఁ జంద్రుఁడు, ముఖము నొక్కతరగతియందే యున్నవి. వైశాల్యచాంచల్యములయందు హరిణనేత్రములకు, ఉత్తమస్త్రీనేత్రములకు సాదృశ్యము గలదు. వేణికిని సర్పమునకును జాల పోలికలు గలవు. వీనియం దొక్కటి మనోదృష్టికి గోచరమైనచో

డల సమానధర్మము గలమఱియొకవస్తువు స్మరణకు వచ్చుట నైజము. తలంపునకువచ్చిన మాత్రాన పోల్చియే చెప్పవలె ననునియమ మెందుకు? అట్లు పోల్చిచెప్పుటలో రెండుప్రయోజనములు గలవు. ఒకవస్తువు విషయమై యన్యూనాతిరిక్తమైనజ్ఞానము గలుగవలసినయెడల దానితోఁ బోల్పఁదగిన, అనఁగా నేభాగమునందైనను సమానగుణము గలిగియుండు మఱియొకవస్తువుతోఁ బోల్పవలెను. మఱియు వానికుండుపరస్పరవ్యత్యాసమును గూడఁ దెల్పవలయును. ఒకవస్తువువిషయమునందు మనకిట్లు చెప్పినఁగాని వేఱువిధముగా స్పష్టముగాఁజాలదు. ఇంతియగాక మనకుఁ బరిచితమైనవస్తువునకే పోలికను జేయవలయును. అపరిచిత మగువస్తువునందు సంపూర్ణ మగుపోలిక యున్నను దానిపోలికచేతఁ బ్రయోజనము లేదు. ఇట్లు కవిసమయనిబంధనలకుఁ గారణ మూహింకసాధ్యము. ముఖ్యముగా నాహ్లాదాదులే కవిసమయనిబంధనకు హేతు వని చెప్పక తప్పదు. ఇటులుండ సమయము నుల్లంఘించినచో నాభాసము గల్గు ననుటకు సందియము లేదు.

కాఁబట్టి కవిసమయముల యేర్పాటునందు సౌకర్య మెక్కువ గలదు. ఆనందము గలదు. "మహాజనో యేనగత స్స పంథా" అనెడు మర్యాదచొప్పునఁ బెద్దలు నడచినమార్గముననే నడచుట యుత్తమ మని తోఁచుచున్నది. అయిన సహృదయహృదయాహ్లాదకముగాను, ప్రాచీనకవులను మించునట్టుగాను నవీనమార్గమునందు బ్రవర్తించుశక్తి గలవారికి మాత్రము, ఈసమయనిబంధనల నింకను హెచ్చించుటలోఁ బ్రయోజన మగును. వారు సర్వస్వతంత్రులు. ముస్ముందు లోకమే వారిననుసరించుచు వచ్చి వారిపథమే సుపథమగును—

అయిన నున్నదానిని లేదనియు, లేనిదాని నున్నదనియు, సాధ్యము నసాధ్యమనియు, నసాధ్యమును సాధ్యమనియు, నొకసంకేతము నేర్పఱచుకొని, అనఁగా, నొకసమయనిబంధనము నాశ్రయించి, కావ్యమును వ్రాయుటకంటె నున్న దున్నట్టుగా వ్రాసినఁ జాలదా? లోకస్థితి కనురూపము గానేరదా? ఆహ్లాదాదులు జనింపవా? స్వభావోక్తి లేక లోకమును యథావస్థితముగా నిరూపించుట హృదయంగమము గానేరదా? ఇంపు పుట్టింపదా? "సిద్ధమన్నం పరిత్యజ్య భిక్షా మటతి దుర్మతిః" అనునట్లు సంకేతముపై నాధారపడియుండుట మతిలేని చొరవ. విరోధప్రవృత్తి యెంతమాత్రము సుఖదాయకము గాదని కొందఱాక్షేపింపవచ్చును.

ఈయాక్షేపణ కవిహృదయజ్ఞానముఁ దెలిసినవారిమాట గాఁజాలదు. కావ్యజ్ఞానము, లోకజ్ఞానము పొందినవారు నిన్నిటికిని జెప్పఁజాలరు. స్వభావోక్తియే ముఖ్య మని యంగీకరించువారు సయితము కవిసంకేతమును సర్వథా త్యాజ్య మని చెప్పరు. దాని నెక్కువగా నుపయోగింపఁ గూడ దని వారి యభిప్రాయము. స్వభావోక్తిచేత సాధ్యముగాని యనేకసంగతులు కావ్యజ్ఞానమునకు ముఖ్యావలంబనములై యున్నవి. దానికిఁ గవిసంకేత మవసరము— కవిసంకేతములను జాఱవిడిచినఁ గావ్యానంద మఱుఁగాఱియగును. సమయాశ్రితము లగువర్ణనలు కావ్యశోభాకరములు. అయ్యవి కావ్యరసము నాస్వాదింపఁజేయును మధురపదార్థముల నారగించునపుడు నడుమనడుమ నితరరసములగు, ఉప్పు, కారము, పులుసులపై నెట్లాశ సహజముగాఁ బుట్టునో వాని నాస్వాదింపకపోయిన నామధురపదార్థముల రుచి యెట్లు విసుగుఁబుట్టించునో, అశ్లేషయలంకార జాతి ద్రవ్య క్రియాగుణాత్మక మగువర్ణనలసాహాయ్యము స్వభావోక్తికి నత్యావశ్యకము. వానిచేతనే స్వభావోక్తికి రంగువచ్చును. ఇట్లుండుటవలన స్వభావోక్తిపక్షపాతులు సయితము కవిసమయప్రాశస్త్యమును బొగడక విడువఁజాలరు.

దీనిచే స్వభావోక్తియొక్కటే యుత్తమ మనియు దానిచేతనే కావ్యరసాస్వాదన గల్గు ననియు నాయభిప్రాయము గాదు. కేవల ముపమోత్ప్రేక్షాదు లున్నను రుచింపదు. కేవలము స్వభావోక్తిమాత్రమే చవిఁ బుట్టింపదు. అన్నియు యథాయోగ్యముగాఁ గావ్యమునందుఁ బ్రవేశింపఁజేయవలెను. చవులను బుట్టించువిషయమునందు క్లుప్తనుగుసూత్రము నొక్కదానిని జెప్పుట యసాధ్యము గాన సందర్భానుగుణముగా వానియం దెచ్చుతగ్గులు గలుగవలెను. అట్లుండిననే సొగసు, సుఖము.

ఇట్టిసుఖమును లోకమునకు దానముచేయుచుండు కవిపుంగవులే యీ విషయము నిదమిత్థ మని నిర్ణయింప సమర్థులు. ఇతరులకు సాధ్యము గాదు.

నానావిధంబు లగుసంకేతనిబద్ధంబు లగువర్ణనావైఖరిని మనోరంజకమగునట్లు చేయుట కీక్రిందియుదాహరణమును బరికింపుఁడు.

ఉ. ఎంతతపంబు సేసి జనియించినవారొకొ మర్త్యభామినుల్
కాంతుఁ డవజ్ఞసేసినను గాయము వాయుదురే నమర్త్యలై

చింతలవంతలం జవికి సిగ్గటితిష్ట మృతిలేని నాడుచె
ల్వింతయు శూన్యగేహమున కెత్తినదీపిక యయ్యె నక్కటా.

(మనుచరిత్రము)

ఈపద్యమునందు, కవి ఉత్ప్రేక్ష, లేశ, పరికరాంకుర, నిదర్శనాదుల నెట్లు చిత్రించి హృదయంగమము నొనరించి యున్నవాఁడో చూడుఁడు.

ఇఁక రససంకేతమును గుఱించి యొకింతవిచారింతము. కారణము లేక యేకార్యము జనింపదు. ఒకకార్యము సిద్ధించిన దానికొకకారణ ముండియే తీరవలెను. ఇయ్యది లోకానుభవసిద్ధము. రసజ్ఞులు:—"విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః ఆనీయమానస్వాదుత్వం స్థాయీభావో రసః స్మృతః" అని పల్కుచున్నారు. వారియభిప్రాయముమేరకు రసము జనించుటకు స్థానము మానస మాయెను. ఎవరి మనస్సునందు ? ప్రేక్షకుల మనస్సునందా ? లేక నాయికానాయకులమనసునందా ? యనువిచారమునందు భిన్నాభిప్రాయములు గలవు. (అది యిచ్చట నప్రస్తుతము) అది యెట్లుండినను రసావిర్భూతస్థానము మన స్సనునది నిజము, దీనియుత్పత్తికి వేఱుకారణములు గూడఁ గలవు. రస మనువృక్షమునకుఁ గొన్ని బీజములై యున్నవి. కొన్ని యెరువు, నీళ్లవంటివై యున్నవి. కొన్ని వృక్షరూపమును జూపించుచున్నవి. వీనిని విభావ, అనుభావ, సాత్త్వికసంచారీభావము లని పేర్కొని యున్నారు. కారణము లనేకమున్నను ఫల మొక్కరీతిగాఁ గనఁబడదు. ఫలించినచోటులందును దారతమ్యములు గానవచ్చుచున్నవి. ఇట్లుండుటవలన రసవిషయమునందు సుప్తమైన కార్యకారణభావమును నిరూపింప నలవిగా దని తోఁచుచున్నది. అయినప్పటికిని గవులు రసవిషయమునందు, కార్యకారణభావములు నియమముగా నుండునట్లు సంకేతము నేర్పఱుచుకొని యున్నట్లు దెలియుచున్నది. చూడుఁడు ? శృంగారరసమున కుద్దీపనవిభావములగు గిరి, వనము, చంద్రోదయము, కోకిలాలాపము మున్నగునవి కొందఱిహృదయములయందు శృంగారరసమును బుట్టించుచున్నవి. కొందఱియందుఁ బుట్టింపవు. కొందఱియందెక్కువగాను కొందఱియందుఁ దక్కువగాను బుట్టించుచున్నవి. ఇట్లు కార్యమునందుఁ దారతమ్య సద్భావమునకు స్త్రీపురుషుల యవస్థాభేదమే కారణ మని కొందఱు తలంచుచున్నారు. అది సమ్మతము గాదు. ఎందుకన ? కప్పలవణ న్యాయెఖరి యీయభిప్రాయము నకు భిన్నమై యున్నది.

గిరికాదేవికార్శ్యావస్థను వర్ణించుచు "రామరాజభూషణుఁడు" గిరికాదేవికి వసురాజవిషయమైన విరహాతిశయముచేత నిట్టూర్పు లుదయించె ననియు, స్తనములు తామరతూండ్లచేతఁ గప్పఁబడియె ననియు, శరీర మంతయుఁ జెమట పుట్టె ననియు, తాపముచేత హారసంబంధములైన ముత్యములు పెటిలిపోయెననియు, మూర్ఛ గ్రమ్మి కన్ను లరగన్నులువడియె ననియు వర్ణించియుండుటఁ జూడ రసప్రాదుర్భావ మగుచున్న దని తెలియుచున్నది. దీని నతిశయోక్తి యనిచెప్పుటకు వలనుపడదు. కవు లందఱు, కొంచె మెచ్చుతక్కువలుగా నిట్లే వర్ణించుచున్నారు. ఇది లోకానుభవమునందుఁ గలదా యనినఁ గొన్నియంశములయందు నిజమైనను నింతటిస్థితి సంభవింపదు. రసోద్రేకమే యగుట లేదని చెప్ప వీలులేదు. ఇప్పటికిని గొంతకొంత యనుభవమునందున్నది.

రౌద్రరసమునందు మాత్రము కవులు నిరూపించినట్లిప్పటికిని దద్రసజన్యము లగు కార్యములు యథారీతిగా నున్నవి. ఆలకింపుఁడు. భా- ఆరణ్యపర్వమునందు—

మ. ఘనపక్షాహతులం బ్రకాండపరిఘాఘాతంబులం దీవ్రశా
తనఖోచ్ఛేదములం బ్రదీప్తశరవేధక్రీడలం గ్రూరచం
చునిపాతంబులఁ బ్రౌఢకుంతముఖవిస్ఫోటంబులం దక్షిగేం
ద్రనిశాటేంద్రులపోరు సాధనసమత్వస్ఫూర్తి నొప్పెంగడున్.

ఇందారభటివృత్తిచే ద్వంద్వయుద్ధము వీరరసోద్రేకముగా వర్ణింపఁబడినది. కరుణారసమున కుదాహరణమును జూడుఁడు?

చ. అడవికి నేగునాఁడు మనువంపఁగ నెంతయు దవ్వు వచ్చి య
ప్పుడు దనమోము దైన్యమునఁ బొందెను నశ్రులుమాచి చూచి య
ట్లోడఁబడి డించిపోవలసె నుమ్మలికంబున గొంతి యింతకున్
బడుగయి పాలలోఁ బడినబల్లివిధంబున నుండకుండునే.

ఇం దుపమానాలంకారంబుచేఁ బోషింపఁబడిన కరుణారస మెంతయు జాలిపుట్టించుచున్నది. రౌద్రరసమున కుదాహరణము—

మ. కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ చూచుచుండన్ మదో
ద్ధురుఁడై ద్రౌపది నిట్లు సేసినఖలున్ దుశ్శాసనున్ లోకభీ
కరలీలన్ వధియించి తద్విపులవక్షశ్శైలరక్తౌఘని
ర్ఝర ముర్వీపతి చూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్.

దీనియందు, కవి భీముని యమితకోపమును, అతనిబద్ధప్రతిజ్ఞను నెంతటి రౌద్రరసావిర్భావ మగునట్లు చిత్రించియున్నాఁడో చూడుఁడు?

ఇట్లుండ నొక్కొకరసమునందుమాత్రము లోకానుభవమునకుఁ గొంచెమైనను వ్యత్యాసము లేకుండఁ గొన్నియంశములయందైన నుండుటను జూచుచున్నారము. ఒక్కొకదానియందుఁ గనఁబడదు. కాని, రసమును వర్ణించుపట్ల ప్రతిరసమునకు నాలంబనవిభావులైన స్త్రీపురుషులస్థితిని గమనింపక యొకతే రీతియైన కష్టసంకేతముచేతనే కవులు వర్ణించునట్లు తోఁచుచున్నది. అందువలన రసవిషయమునందుఁ గూడఁ గవిసమయము నంగీకరింపవలయును.

కాని లోకానుభవ మిందులకు విరోధముగా నున్నది. పూర్వికులకుండినట్టి శక్తిసామర్థ్యాదు లిప్పటిజనుల కేకరీతిగా లేవు. అందువలన రసకార్యములు కావ్యములయందుఁ జెప్పినరీతిగాఁ గనఁబడవు. కొన్నిచోట్లఁ గొంత కనఁబడియు, కొన్నిచోట్లఁ గానఁబడకయు, నుండుటయే దీనికిఁ గారణము, గాని, రసవిషయమునందు సంకేత మున్నదనిఁ జెప్పుటకు వలనుపడదని కొంద ఱాక్షేపించుచున్నారు. వీరు చెప్పునది సమంజసముగా నున్నది గాని సిద్ధాంత మని చెప్పుటకు వీలులేదు. ఎందుకన? జనులయందు శక్త్యాదులు తక్కువ యైనను భూతములవ్యాపార మింకను నొక్కరీతిగానే యుండుటఁ బట్టి మానవునిస్థితి మార్పుఁ జెందలేదనునమ్మకము విశేషముగా బాధించుచున్నది. గాన నీశృంగారరసోత్కర్షవిషయము స్వానుభవైకవేద్యము.

ఇట్లు వ్యంగ్యవిచారమునందును, ఆనందవిచారమునందును సంకేతములు గలవు. వాని కన్నిటికి నుదాహరణ మిచ్చుటకు వ్యాసవిస్తరభీతి విరమించితిని.

ఇఁకఁ గథావిషయమునందు లోకానుభవమునకుఁ గవిస్థితికిని వ్యత్యాసమును జూపింప నుద్దేశించి శాకుంతలనాటకకథను విమర్శించుచు, మహాభారతకథకు, నాటకకథకు, భేదమును జూపుచు, రసవిచారమునం దట్టివ్యత్యాసములకుఁ గారణమును నిరూపించుచుఁ గవిసమయశక్తి నుదాహరించెదను.

కథ యనఁగా-ఒకని, లేక, యనేకుల జీవితకాలమందు జరిగినవిషయములను సంగ్రహించిచెప్పుట- నిజముగా నొకనిజీవితకాలమందు జరిగినవిషయమునకు, కవు లాజీవితమును వర్ణించుస్థితికిఁ జాల భేదము గలదు. ఉద్గ్రంథములయందు నిరూపితమైన మహాపురుషులచరిత్రముచేత నీభేదమును దెలిసి

కొనవచ్చును. గొప్పకార్యమునకుఁ జిన్నకారణము నమ్మకమును బుట్టింపదు. కార్యకారణములకుఁ దగినట్లు నమ్మకము గల్గించుటకుఁ దగినసంగతులను గల్గించుటకుఁదగినసంగతులను గల్పింపవలసివచ్చును, గానఁ గవులు క్రొత్తసంగతులను గల్పించియో, జరిగినసంగతులను గాలవ్యత్క్రమమును లక్ష్యమునకుఁ దేక జతఁగూర్చియో నిరూపింతురు. ఒకపురుషుని వర్ణించునప్పుడు వానిసహజస్థితిని బ్రాయికముగాఁ దెలుపరు. అట్లు దెల్పుట కవులయుద్దేశ మని తోఁపదు. మహాపురుషులను వర్ణించుపట్ల లోకము వారినడతల ననుకరింపవలె ననుటయే కవులవర్ణనకుఁ దాత్పర్యము. లోకకంటకులవర్ణనమందు వారిదుర్గుణముల నందఱుఁ బరిత్యజింపవలె ననుటయే కవులయుద్దేశము.

కథ, ఐతిహాసిక మనియు, కల్పిత మనియు మిశ్ర మనియు మూఁడు తెఱఁగులు. రామాయణ, భారతములయందుఁ జెప్పఁబడిన మహాపురుషుల చరిత్ర మైతిహాసికము. కవి బుద్ధికల్పితము కల్పితము; ఉభయాత్మక మైనది మిశ్రము. కాదంబరి, మాలతీమాధవము మున్నగునవి కల్పితములు శాకుంతలము ఉత్తరరామచరిత్రము మున్నగునవి మిశ్రములు.

లోకమునందుఁ బ్రతియత్నమునందు నేదో యొకయుద్దేశము ప్రాధాన్యమై యుండునుగదా ? అట్లే కవికృతికిఁ గూడ నొక్కయుద్దేశము లేకయుండదు. కావ్యమందు సంతోషజననము, కృత్యాకృత్యవివేచనము, ధర్మోపదేశము మున్నగునవి యుద్దేశములేకదా ? చిత్రలేఖకునకు భిత్తి యాశ్రయమై యుండినట్లు కవుల కొకకథాశ్రయ ముండవలెను.

వెనుకఁ జెప్పిన యీ కావ్యోద్దేశములు ఫలింపవలయునన్న-కవి యేర్పఱుచుకొన్నకథ యతనియుద్దేశమును బ్రకాశపఱుచునదిగా నుండవలెను. కథ యనుభిత్తి నాశ్రయించుకొని హృద్య మగుచిత్రమును రచింపవలెను. కథ జనుల విశ్వాసమును జనులమనోరంజనమును జేయునదిగా నుండవలెను. రామకృష్ణాదిమహాపురుషుల చరిత్రము లిందులకు నిదర్శనములు, తక్కినకథలు వీరి చరిత్రములవలె జనులయనురాగమును జూఱగొనుటలేదు. ఇటులే గ్రీక్, ల్యాటిన్, జర్మన్, ఇంగ్లీషు మొదలగు ప్రసిద్ధమైన పరభాషలయందుఁగూడ నుద్గ్రంథము లాయాదేశముల యైతిహాసికపురుషుల చరిత్రము నాశ్రయించుకొని యున్నవి.

కావ్యోద్దేశములను దెలిసికొనుటకు శాకుంతలనాటకకథను విమర్శించి చూతము.

దుర్వాసశాపము, అంగుళీయకప్రదానము, శక్రతీర్థమునందు దాని భ్రంశము, మెనక శకుంతలను బిలుచుకొని పోవుటయు, అంగుళీయకదర్శనముచేత దుష్యంతునకు శకుంతలాస్మరణము, ఇంద్రలోకగమనము, వచ్చుమార్గమందుఁ బుత్రదర్శనపూర్వకశకుంతలాసంగమము, కవిచేతఁ గల్పింపఁబడిన ముఖ్యభేదములు.

ఇవి కవిసామర్థ్యమును జూపుచున్నవి. ఈనాటకమునందు ధర్మము, లోకవ్యవహారము, వీనిఁ దెల్పుచు మానవసుఖమునకుఁ గారణభూతమైన యనురాగప్రపంచము వెల్లడిచేయుటయే ముఖ్యోద్దేశమై యుండవచ్చును. కాఁబట్టి యీనాటకము శృంగారరసప్రధానమైనది. మహాభారతకథాప్రకార మనుసరించియుండిన కరుణారసము ప్రధాన మగుచుండెను. శకుంతలాదర్శనమువలన నాకస్మికముగా శృంగారరస మంకురితమైనను, పరిపక్వదశఁ జెందుట కచ్చటి కథయందే యాధారమును లేదు. అందువలనఁ గవిబ్రహ్మ కథకు నూతనమైన సందర్భములనుఁ సృజించి విస్తరింపఁజేసి శృంగారరసము వెల్లివిరిసి నల్దిక్కులయందు వ్యాపించునట్లు చేసియున్నాఁడు. ఎట్లనఁగా ? దుష్యంతుని, కణ్వాశ్రమమును బ్రవేశింపఁజేయునప్పుడు శృంగారరస మనెడువిత్తనము ను బ్రేక్షకులహృదయమునందు నాటెను. కాళిదాసమహాకవి దుష్యంతుని వారియొద్దకుఁ బంపుటకుఁ జేసినచమత్కారము ప్రేక్షకులను నిమీలితనేత్రు లగున ట్లొనర్చెను. అనురాగాభివృద్ధికిఁ బరస్పరవియోగము కారణ మని యూహించి సైనికుల యార్భటముచేత నరణ్యగజ మాశ్రమమును బ్రవేశించె ననెడుసంవిధానమును గల్పించి శకుంతలాదుష్యంతులకు వియోగమును గావించెను.

దుర్వాసుని శాపకల్పన, అంగుళీయకప్రదానము మున్నగుకల్పన లత్యపూర్వములు. శకుంతల గర్భవతియై పతిసాన్నిధ్యముఁ బొంది తిరస్కృతురాలై మేనకను జేరువఱకును గల్పించినసందర్భసామర్థ్యమును వెల్లడించుటకుఁ గాళిదాసునివంటివాఁడే గావలెను. లేక యామహాకవియే యవతరింపవలెను.

మారీచాశ్రమమునందు శకుంతలాసమాగమమునకు భరతునిపాత్రఁ దెచ్చియుండుట కవిసామర్థ్యము వెల్లడియగుచున్నది. దానియందును దుష్యంతుఁ డున్నచోటికి శకుంతలనే వచ్చునట్లు చేసిన చమత్కారరహస్యము కాళిదాసునికే తెలియును.

ఇట్లు కవిసమాగమసందర్భము శృంగారరసప్రధానమై పుట్టినరస మనెడువిత్తనము వలన జనించిన ఫలము నాస్వాదించుసమయము.

కాన నీకల్పనయందు వ్యాసునిశకుంతలకుఁ గాళిదాసుని శకుంతలకుఁ జాల భేదముగలదు.

ఇట్లు కవి కల్పితోద్దేశములు లోకానుభవమును వెల్లడిపఱిచి నీతిని బోధించుచున్నవి.

ఇంత విచారించినను గవిసమయ మనఁగా నేమి యని మరల నడుగ వచ్చును. కావ్యము కళలసముదాయమునందుఁ జేర్పఁ దగినదియై యున్నది. కళలకు సౌందర్యము ప్రధానము, ఏది మనుష్యుని మోహితుఁ డగునట్లు చేయునో దానినే కళయందురు. సంగీత, నృత్య, శిల్ప, చిత్రాదులు కళావిదుల నైపుణ్యముచేతనే జనమనోరంజనము నొసఁగుచున్నవి. ఆనైపుణ్య మయ్యేకళలయందు యుక్త మగుసందర్భములను యోజించి సౌందర్యమును బుట్టించు కార్యమైయున్నది. ఆకార్యముచేతనే యాయాకళలు జనులమనస్సు నపహరించునవి యగును. కావ్యకళయందును సౌందర్యోత్పాదక మగునైపుణ్యము గలదు. అదే కవిసమయము. ఈసంకేతము నాశ్రయించుకొని జాతి, ద్రవ్య, గుణ క్రియాదులు, ఉపమాద్యలంకారములు, రసోత్పత్తినిరూపకములైన విభావాదులు, కథాసంవిధానములు, పాత్రౌచిత్యగుణవర్ణనములు, వెలయుచుండును. కావ్యజ్ఞానమునకుఁ గవిసమయ మత్యవసరము, కవిసమయజ్ఞానము కావ్యకళాభిజ్ఞులకు సుఖదాయకము.

ఇట్లుండుటవలన గావ్యరసాస్వాదనమునకుఁ గారణమైన యుక్తసమ్మేళనమం దౌచిత్యజ్ఞానము లభించుటకుఁ దదాశ్రయమైన కవిసమయజ్ఞాన మత్యావశ్యక మని వేఱుగాఁ జెప్ప నక్కఱలేదు. దీనిని సక్రమముగా నభ్యసించినఁ గావ్యరసాస్వాదనసౌఖ్యము ననుభవించుటకు వీలగును.

# విస్మృతదత్తమండలకవులు.

—. పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు. —



"నమ ఋషిభ్యో మన్త్రకృద్భ్యో మన్త్రపతిభ్యః"—అరుణమ్.

తా॥ మంత్రములఁ జేసినట్టియు మంత్రములను సంప్రదాయములతోఁ గాపాడినట్టియు ఋషులకు నమస్కారము.

శ్లో॥ "నా ఋషిః కురుతే కావ్యమ్"

తా॥ ఋషికానివాఁడు కావ్యముఁ జేయలేఁడు.

నే నీదత్తమండలము లనఁబడు "కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురము" మండలములలో శ్రీపిఠాపురపు మహారాజావారి యానతిని ప్రాచీనగ్రంథములను సంపాదించుటకయి రెండుమూఁడుసారులు సంచరించి కొన్నిగ్రంథములను సంపాదించితిని. ప్రాచీనకాలమున "విద్యారణ్య" ముద్భవించినట్టియు, ఆంధ్రభోజాదివిద్వత్ప్రభువులును, ఆంధ్రకవితాపితామహాది మహాకవులు సంచరించిన యీమండల మిపుడు, బెజవాడ మొద లనంతపురమువఱకు విద్యకు సహారాయెడారి సదృశముగా నున్న దని కొందఱనుచున్నను శోధించినకొలఁది సహారాలోని సీటిపట్టులు (ఒయాసీస్) వలెను దక్షిణాఫ్రికాలో నరణ్యమయమై శోధించుటచే "కింబర్లీ, జొహానస్‌బర్గు" ప్రాంతములలోని, వజ్రసువర్ణాదిఖనిజములవలెఁ గొన్నియుద్గ్రంథములు లభించుచున్నవి. ఆగ్రంథములవలనఁ బ్రాచీనమహాకవుల చరిత్రములు కొన్ని తెలియవచ్చుచున్నవి. ఇప్పటివారిదృష్టి నీప్రదేశములు సహారాగానున్నను బ్రాచీనకాలమున నివి సహారాగా లేవని నాతలంపు. మనభాషకుఁ బ్రథమమున నాంధ్రకవులచరిత్రమునువ్రాసి మహాదుపకృతిం జేసిన మహానుభావులు మహారాజశ్రీ గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారును, రావుబహద్దరు కందుకూరి వీరేశలింగముపంతులుగారు నై యున్నారు. అందువీరేశలింగముపంతులుగారి గ్రంథము విపులమైయున్నది. ఇప్పటివలె నాధారములు విశేషముగా లేనిసమయమున రచించిన యొకటిగ్రంథమును విపులముగాఁ జేయ నెంచి వీరేశలింగముపంతులుగారు ప్రథమభాగమును విపులముచేసి తక్కిన రెండుభాగములు వ్రాయకముందే యాంధ్రలోకముయొక్క దురదృష్టవశమునఁ బరలోకగతులైరి. ఆకవులచరిత్ర తక్కినకవుల

ను "విస్మృతకవులు" అని వ్రాసితిని. కొంద ఱాకవులచరిత్ర కెక్కినను జరిత్రలో మార్పుండుటచేఁ గూడఁ దిరిగి వ్రాసినందులకు మన్నింతురుగాక.

(1) వెణుతుర్ల వద్దెయ్యకవి.

ఈతఁడు "శృంగారరసాలవాల" మనుశృంగారరసప్రధానగ్రంథముఁ జేసెననియు, కవిత్వము మంచిదనియు నితనిని వీరేశలింగముపంతులుగా రధునాతనకవులలోఁ జేర్చిరి. ఈతని "బాలగోపాలవిలాసము" అను మఱియొక గ్రంథము నాకు లభించినది. అది నందవరీకబ్రాహ్మణుఁడును "విశ్వామిత్రగోత్రికుఁడు నగు ఎరుగోలు శేషమంత్రి" కంకితముగా నీయఁబడిన మూఁడాశ్వాసముల శృంగారరసప్రబంధము. గాధ కూచిమంచి తిమ్మకవియొక్క "నీలాసుందరీపరిణయ"గాథయే. తిమ్మకవికంటె నీకవి రెండుశతాబ్దములకుముందుండినవాఁడై కృష్ణదేవరాయలకాలపువాఁడై యుండె నని కృతిపతింగూర్చి చెప్పినయీక్రిందిపద్యముచే స్పష్ట మగుచున్నది.

శా. శ్రీరామప్రతిముం ద్వదగ్రజు యశశ్శ్రీకృష్ణభూపాలభూ
భారాశేషవిశేషపాలనకళాపారీణు సత్యవ్రతో
దారారంభవిచారుని౯ హరిపదధ్యానైక నిష్ఠాగిరి
స్థారూఢాత్ముని రామమంత్రివరు నెంచన్ శక్యమే యిద్ధర౯.

శేషమంత్రి యన్న రామమంత్రి శ్రీకృష్ణభూపాలుని భూభారాశేషవిశేషపాలనకళాపారీణుఁడు" అనుటచే నదేని శ్రీకృష్ణభూపాలునికడ నుద్యోగమునుఁ జేసియుండు నని తోఁచుచున్నది. నంద్యాలప్రభు వగు కృష్ణరాజుంకొకఁడు కలఁ డని వింటిమి. కాని కవిస్తుతిలోఁ గూడఁ బెద్దనాదులను నుతింపకపోవుటచే నీతఁడు పెద్దనాదులకు సమకాలీనుఁ డనియే స్పష్ట మగుచున్నది. కవిస్తుతి నిటులఁ జేసియున్నాఁడు.

చ. వరరచనప్రదారచన వన్నిక గాంచిన నన్నయార్యునిం
బరమకవిత్వసద్రఢిమ పట్టగు తిక్కనఁ దోషితక్రియా
భరితపచాభిరాము లగు భాస్కరసోముల సన్నుతించి యి
ద్ధర మఱి గల్గునాంధ్రకవితావిదితాత్ముల నాత్మ నెంచెద౯.

ఆశ్వాసాంతగద్య మిట్లుండెను.

"ఇది శ్రీమద్రామభద్రవరప్రసాదలబ్ధకవితావిచిత్ర కౌండిన్యసగోత్ర వేంగనామాత్యపౌత్ర సత్యచారిత్ర మంగళగిరిపుత్ర వినయగుణవిధేయ వద్దెయ్య

నామధేయ ప్రణీతంబైన "బాలగోపాలవిలాసంబ"నుమహాప్రబంధంబునందు" —ఆశ్వాసము. అని కలదు. కృష్ణదేవరాయలకాలమున నింకొకమహాకవి కలఁడనుట యొకవిశేషము. ఈతఁడుదత్తమండలవాసియగుట మఱియొకవిశేషము. గ్రంథవిస్తరభీతిచేఁ గవిత్వపుసొంపుఁ దెలుపుపద్యములను వ్రాయలేదు.

(2) చిదంబరకవి — అంగదరాయభారము.

మహారాష్ట్రులీదత్తమండలములలోఁ గొంతభాగమునఁ గొంతకాల మధికారమును వహించియున్నారు. లార్డు క్లైవు ఆర్కాడును ముట్టడించినపుడు "మురారిరావు" అను మహారాష్ట్రవీరుఁడు "గుత్తి"ని బాలించుచున్నటులఁ దెలియనగుచున్నది. ఆమహారాష్ట్రులలో నాంధ్రభాషాభిమానము కలవారు కొందఱుండిరి. అందు, చిదంబరుఁ డొకఁడు. ఈతఁడు, అంగదరాయభార మను నేకాశ్వాసగ్రంథమును రచించెను. కవిత్వ మెటు లుండినను, ఆంధ్రేతరుఁ డాంధ్రభాషలో గ్రంథముఁ జేసెననుట మనకు ముదావహము కాదా ? చిదంబరునకు బమ్మెర పోతనామాత్యునిపై నభిమానము మెండు. ప్రసిద్ధ సంస్కృతాంధ్రకవులను రెండుపద్యములలో నుతించి పోతనామాత్యుని బ్రత్యేక మొక పద్యములో నిటులు నుతించియున్నాఁడు.

మ. పదలాలిత్యము పాకశుద్ధి భగవద్భక్త్యగ్ర సంశ్రేయమున్
బదమత్యున్నతముం మహాశుభదమున్ బద్మోద్భవానందమున్
జిదచిద్రూపవిభాగభాగవతమున్ జింతింతు నాంధ్రంబుగా
సదయం జెప్పిన పోతరాజపదముల్ సన్నుతేమ నే మ్రొక్కెదన్.

పోతరాజునందత్యాదర ముండుటచేఁ దనగ్రంథములోఁ బెక్కుచోటుల నాతని ననుకరించి యున్నాఁడు. ఒకపద్యమును మాత్ర మిట నుదాహరించుచున్నాఁడను.

సీ. తాటకి మర్దించి తపసిజన్నము గాచి రాతిని బణఁతిగా రంగుపఱిచి
భూతేశువిలుద్రుంచి సీతను బెండ్లియై తండ్రిపంపున ఘోర తపసియగుచు
దండకాటవిఁజేరి దైత్యులఁ బొరిగొని వైదేహి వెదకుచుఁ బంపయందు
హనుమంతుఁబొడగని యాదిత్యసుతుఁగూడిశక్రసూనునిజంపివిక్రమమున
గీ. సీత వెదకంగఁ బావనిఁ జీరి పనిపి, సకలవానరసేనతో శంక లేక
తోయనిధిఁజేరి యవ్వల త్రోవఁగోరి, రాముఁ డుండెను రాక్షసభీముఁడగుచు.

ఈపద్యము భాగవతషష్ఠస్కంధములోని "తాటకమర్దించి" యను సీసపద్యమునకు సంపూర్ణానుకరణము. గ్రంథాంతగద్య మిటులుండెను.

" ఇది శ్రీనందనందనకరుణాకటాక్షవీక్షణాసాదిత సంస్కృతాంధ్ర కవితాధారేయ ప్రజ్ఞాధురంధర వినయగుణబంధుర మహారాష్ట్రదేశీయ సులక్షణ లక్ష్మణాచార్యసుపుత్ర వసిష్ఠగోత్రపవిత్ర బుధారాధన సుకవివర చిదంబరాఖ్య ప్రణీతంబగు నయంగదరాయభారంబునందు సర్వంబు నేకాశ్వాసము."

(3) భారతుల వేంకటరామభట్టకవి (వంధ్యాచలమాహాత్మ్యము.)

ఈకవి నూఱేండ్లకు ముందు కర్నూలుమండలములోని మార్కాపురమున నుండువాఁడు. ఈకవి "త్రిపురాంతకమాహాత్మ్యము, "చిరమానిపురమహిమ" యనుకథలను ద్విపదకావ్యములుగాను, "వంధ్యాచలమాహాత్మ్యము" అను స్థలపురాణమును బద్యకావ్యమునుగాను రచించియున్నాఁడు వంధ్యాచలమాహాత్మ్యము మాత్రము నాకు లభించియున్నది. కవి యిటులు గ్రంథాదినిఁ జెప్పియున్నాఁడు.

గీ. అందుత్రిపురాంతకస్థలంబందుఁగల్గు, మహిమకొంతయుఘనచిరమానిపురము మహిమకొంతయునీరెంటుమహిమలొక్క, ద్విపద కావ్యంబు చేసితాదేవుకృపను.

గీ. మరలనిప్పుడు వంధ్యాద్రిమహిమ భక్తి, మీఱఁ జెప్పఁగఁబూనియానీరజాక్షు
వేఁడినను హరి నునుపటి విధముగాను, జెప్పి చనినను సంతస ముప్పతిల్ల.

ఈవంధ్యాచలము శ్రీశైలపర్వతశాఖ. రామభట్టకవి కవిత్వము మృదుమధురము. గ్రంథవిస్తరభీతిచేఁ బద్యముల నుదాహరింప లేను.

(4) హొసూరు అన్నయ్య.

ఈకవి "లక్షణలక్షణము" అను నొకగ్రంథమును రచియించెను. అన్నయభట్టీయ మను వ్యాకరణగ్రంథమును "చౌడేశ్వరీవిలాస" మను స్థానికపురాణమునుఁ జేసెననియు నవి రెంటును నన్నయకృతిము లని కాలాంతరమున శబ్దసామ్యముచే వాడుకొనఁబడె ననియుఁ బ్రతీతి కలిగియున్నది. ఎలకూచి బాలసరస్వతి కాంధ్రశబ్దచింతామణి లభించుట "మతంగగిరి" దగ్గఱఁగదా! ఈమతంగగిరి "హంపి" సమీపమున నున్నది. హొసూరుకూడ, కర్ణాటాంధ్రమధ్యస్థదేశమున నొక్కచోటున నుండెను. బాలసరస్వతి కూడ దత్తమండలకవియే. ఈతని కేసన్న్యాసియో యన్నయకృత మగు "నాంధ్రశబ్దచింతామణి" నీయఁగా దాని కాతఁడు చిలువలు పలువలు పెంచి గ్రంథము నల్లి యుండును. లేక సన్న్యాసియే యన్నయది నన్నయ దని చెప్పినను జెప్పియుండును. ఈయంశమును బండితులు చర్చింతురుగాక. అన్నయకృత మగుజ్యోతిషగ్రంథము మఱియొకటి కాన్పించుచున్నది.

### (5) పెహూసూరు వీరభద్రకవి—(వీరభద్రీయము)

ఈకవి యాంధ్రశబ్దచింతామణికి వ్యాఖ్యగాఁ బద్యగ్రంథము నొకదానిఁ జేసియున్నాఁడు. వీరభద్రీయ మని దానిపేరు. అన్నయ, వీరభద్రకవు లొక యూరు పేరు కలవా రగుటయు, వీరభద్రకవి తనగ్రంథమునకు "వీరభద్రీయము" అని పేరుంచుటయు నది యాంధ్రశబ్దచింతామణి కాంధ్రపద్యరూపమగు వ్యాఖ్యాన మగుటయుఁ జూడఁగా, అన్నయభట్టు అన్నయభట్టీయ మనుటచేఁ దాను వీరభద్రీయ మని యేకగ్రామనాము లగుటచేఁ జేసి యుండెనేమో యని మఱి యొకసందియము కూడఁ గలుగుచున్నది. వీరభద్రీయము యొక్క పీఠిక లేనిగ్రంథమే నాకు లభించుటచే నింతకంటె నుడువ లేనందులకుఁ జింతించుచున్నాను.

### (6) నాదెండ్ల గోపప్రధాని *

ఈతఁడు ప్రసిద్ధికెక్కిన మంత్రి తిమ్మరుసునకు మేనల్లుఁడు- నాదెండ్ల యప్పామాత్యునిసోదరుఁడు. కొండవీడుప్రాంతములలో రాజప్రతినిధిగా నుండువాఁడు. "గయోపాఖ్యాన" గాథను మొదట నాంధ్రమునఁ "కృష్ణార్జునచరిత్రము" అని రచించినవాఁ డీగోపప్రధానియే యని తలఁతును. గోపప్రధాని సంస్కృతమునఁ బ్రబోధచంద్రోదయనాటకమునకు వ్యాఖ్యానముఁ గూడఁ జేసియున్నాఁడు.

### (7) రత్నాకరము † గోపాలకవి.

ఈతఁడు క్షత్రియుఁడు. ఏప్రదేశమునకో ప్రభువుగాఁ గూడ నుండెనని యాతనివర్ణనముచేఁ దెలియఁగలదు. భాగవతములోని దశమస్కంధపూర్వభాగమును మాత్రము "ద్విపద" గా రచించెను.

### (8) ఓరుగంటి రామయామాత్యుఁడు.

ఈతనివంశజు లిప్పుడు కల్యాణదుర్గముతాలూకా గన్నవరమున నున్నారు. కవి నూటేండ్లకు ముందువాఁడు. ఈతఁడు పెక్కుగ్రంథములను రచించెను.

కొన్నిసంవత్సరములకు ముందు మహామారి (ప్లేగు) యాగ్రామమున నుద్భవించినపుడు పోలీసువా రాగ్రామములోని తుక్కుతోపాటు ఓరుగంటివారి తాళపత్రగ్రంథములఁ గూడ నగ్నిపాలు సేయుటచే నెన్నియో గ్రంథములు హుతాశనార్పితము లయ్యెను. హుతశేషగ్రంథములలో నాకు లభించినవి—

---

* ఈతఁడు దత్తమండలమువాఁడు కాఁడు. † ఈయింటిపేరుగలబట్టురాజులు కాళహస్తిప్రాంతమున నున్నారు. ప. అ.

(1)సుభద్రాపరిణయము. (2)శకుంతలాభ్యుదయము. (3)కవిత్వాలక్షణ సారఛందస్సు. (4) తపతీసంవరణోపాఖ్యానము. 2 శతకములు.

(9) బొమ్మగంటి శ్రీకృష్ణకవి.

ఈతఁడు "ధర్మాంగదచరిత్రము"ను ద్విపదగా రచించెను. బాణాల శంభుదాసు మొదలగువారీధర్మాంగదచరిత్రనే ద్విపదగా రచించుట నీతియుక్తముగా నాగాధయుండుటయే కారణమై యుండును. శ్రీకృష్ణకవి యెప్పటివాఁడో తెలియదు.

(10) పుట్టిపాక ఓబయకవి.

అహోబలశబ్దము "ఓబయ" గాఁ బరిణమించినది. ఈతఁడు గయోపాఖ్యానపుకథను "కృష్ణార్జునసంవాదము" అనుద్విపదగ్రంథముగా రచియించెను. ఈతఁడెప్పటివాఁడో యేకాలపువాఁడో పీఠిక లేనిగ్రంథము నాకు లభించుటచే నిర్ణయింపలేను, కాని, యీతని నామాదికముచేతను, ఈతని కృష్ణార్జునసంవాదముల రెండుప్రతులును దత్తమండలములలోనె లభించుటచేతను, ఈతఁడును దత్తమండలపువాఁడె యని నాతలంపు కవిత్వ మింపుగా నుండును.

(11) వేదపెకలి వేంకటకవి.

ఈతఁడు "రామభీష్మసంవాద" మను వీరరసప్రధానగ్రంథమును రచించెను. ఈతఁడు కృష్ణార్జునసంవాదముయొక్క గాధంబోలెఁ దనగ్రంథమును బెంచి పరశురామభీష్ములగాధను బద్యకావ్యముగా రచించియున్నాఁడు.

(12) శ్రీనిధి.

ఈమహాపండితుఁడు అనంతపురముజిల్లాలో "తాడిపత్రి" ప్రాంతవాసి. ఈతఁడించుమించు కృష్ణదేవరాయల కాలఁపువాఁడుగాఁ దద్వంశీకుల చరితముచే నూహింపఁబడుచున్నది. ఆంధ్రమున నీతఁడు "సుదంతాపరిణయము" అను ప్రౌఢప్రబంధమును వ్రాసి యున్నాఁడు. గ్రంథముయొక్క శిథిలపు ప్రతిమాత్రము నాకు లభించియున్నది. మఱియు నీతఁడు "సిద్ధాంతచింతామణి" యనునొక వేదాంతశాస్త్రగ్రంథము (విశిష్టాద్వైత ప్రతిపాదక మయినది) కూడ రచించియున్నాఁడు. అందీతనిపాండిత్యము ప్రస్ఫుటమగును. ఈతనివంశీకులు తాడిపత్రిప్రాంతమునను, గిద్దలూరుతాలూకాలోను గలరు.

(13) కుండ గోపాలకవి.

ఈకవి బళ్లారిజిల్లాలోని రాయదుర్గప్రాంతపువాఁడుగా నాకు గ్రంథము నిచ్చినవారు చెప్పియున్నారు.

ఈతఁడు "సౌగంధికాపహరణము" అను ద్విపదకావ్యముఁ జేసియు న్నాఁడు. సౌగంధికాపహరణమున భీమసేనుఁడు కథానాయకుఁడు. మహా భారతములోని యరణ్యపర్వాంతర్గత మగు సౌగంధికాపహరణమే యితి వృత్తము.

మఱియు "గౌడపురాణము"ను రచించిన మల్లికార్జున శివయోగి "కుముద్వతీపరిణయము" ను రచించిన బొమ్మిడి వీరయ్య "ప్రభులింగలీల"ను రచించిన బసవకవి మొదలగు పెక్కండ్రు కవు లాంధ్రకవులచరిత్రమున కెక్క క విస్మృతులుగాఁ బరిగణింపఁబడుచున్నారు. పామరజనులలో మిగుల వ్యాపిం చిన చరిత్రము, కవిత్వముం గలయొకమహానుభావుని గుఱించిమాత్ర మిట సూచించి విరమింతును.

ఆంధ్రదేశమునఁ బండితపామరులచే సమానగౌరవము నొందిన మహా కవి పోతనామాత్యుఁడు. గాయకులచే నతిగౌరవము నొందిన మొదటియాంధ్ర గాయకుఁడు, త్యాగరాజు. పాండిత్యవిశేషముచేఁ గాక భక్త్యుద్బోధకముగా స్త్రీపురుషులచే సమానముగా గానముసేయఁబడు గీతావళి గల గాయకకవి "రామదాసు." ఈతని కవిత్వము సమస్తవర్ణముల వారిలోను వ్యాపించి యే యున్నది. ఈతనిచరితము నాటకరూపముగా వ్యాపించుట ప్రశంసనీయముగా దా? ఇపు డిపుడు శ్రీనాథునిచరితము రచింపఁబడెనే గాని యేకవి చరితము నిటులు నాటకరూపముగా వ్యాపించి యుండలేదు. సిద్ధయోగి రామదాసువలె విశేషవ్యాప్తి నొందలేదు గాని "దూదేకుల సిద్దప్ప" యను నొకయోగి యొక్క వేదాంతగీతికలు పామరజనులలో వ్యాప్తి నొందియుండుటఁ గనుచు న్నాము. ఆసిద్దప్ప "దూదేకులసాయబు" అని జనసామాన్యము తలఁతురు. కాని యాతఁడు దూదేకులసాయబు కాఁడు. లింగాయతమతస్థుఁడు. తప్పుల కుప్పలుగాఁ బాటలను మాత్రమే రచించినవాఁడు కాఁడు. "యోగీశ్వరవిలా సము" అనుమూఁడాశ్వాసముల ద్విపదకావ్యముఁ జేసినవాఁడు. మృదుమధు రమైనపదములతో నాంధ్రభాషను బాగుగాఁ దెలియని తురుష్కునకు శైవ మతము, బోధించుటకై యోగీశ్వరవిలాసము రచింపఁబడెను. వీరశైవమతము న జాతిమతవివక్షత యుండదు. "భాజఖాను" అను మహమ్మదీయునకు శైవ మతదీక్షత నిచ్చి యాశిష్యునితో సహపంక్తి భోజనాదికముఁ జేయుటచే నీసిద్ధ యోగిని పామరులు సిద్దప్ప యనియు, స్థూలదృష్టిని భ్రష్టుఁడుగాఁ గాన్పించు

టచే దూదేకులవాఁడనియుఁ జెప్పుచుందురు. మఱియు సిద్ధయోగి బమ్మెర పోత నవలెఁ బూర్వాశ్రమమున వ్యవసాయకుఁడై ప్రత్తిపండించువాఁ డగుటచే దూదేకుల సిద్ధప్ప యని యాతని కన్వర్థాభిధానము కలిగినది. అంతియ గాని యీతఁడు నిజముగ దూదేకులకులస్థుఁడు కాఁడు. ఈతఁడు కర్నూలుమండలాంతర్గత మగు "నందికోట్కూరు" నివాసి. ఈకవిబంధుకులమున నచట "నీలకంఠశాస్త్రి" యను పండితుఁడిప్పుడును గలఁడు. సిద్ధయోగి రమారమి రెండు శతాబ్దములకు ముందుండువాఁడు. "ఖాజిఖాను" అను కర్నూలునవాబు సరదారు నానతిని బ్రహ్మేశలింగమున కంకితముగాఁ దన గ్రంథ మిచ్చెను. "తపతీసంవరణోపాఖ్యానము, యయాతిచరిత్రము" అనునాంధ్ర గ్రంథములే కాక "యోగీశ్వరవిలాసము" కూడ మహన్మదీయనామాంకితముగా నుండుట మఱి యొకవిశేషము. గ్రంథారంభమున నిట్లుండెను.

ద్విపద — శ్రీమానిచత్తరాజీవద్విరేఫ । మై మహానందవిద్యాప్రాప్తిఁ బేర్చి
నీలతోయదములో నిల్చినమెఱుపు । లీలఁ గన్గొనలమేలిమి నటియించి
స్ఫటికభాండంబులోపలఁ బెట్టినట్టి । చటులప్రభాజ్యోతి సరణి గాత్రమున
నేవేళ వెలుఁగు బ్రహ్మేశుని హరుని । దేవదేవుని మహాదేవుని భవుని
శ్రీసదాశివుని నంచితభక్తిఁ దలఁచి... శ్రీగురుండైనట్టి చిక్కయ్యఁ గొలిచి
యోగీశ్వరవిలాస మొప్పంగ నేను । సిద్ధయోగీశ్వరస్థిరనామ మొంది
సిద్ధసత్కీర్తి "ఖాజిత్కానుమియ్య"యనుమతి ద్విపదకావ్యంబుగాఁ గూర్చి
ఘనతబ్రహ్మేశలింగమునకంకితము । గానొనరించిమోక్షపుఁ ద్రోవ గాంచి
ధీనిధుల్ యోగప్రదీపిక యనఁగ । నూతనవాక్ప్రౌఢి నుడివెదఁ దెనుఁగు
రీతి వర్ణించి శ్రోత్రియులు మెచ్చంగ॥ అని చెప్పియున్నాఁడు.

దత్తమండలసోదరులారా? మొదట నాంధ్ర గ్రంథశోధనము మాయుత్తరాంధ్రమునను నెల్లూరు మండలముననే విస్తారముగా జరిగియుండుటచే నచటికవులచరితమే ప్రసిద్ధివడసినది గాని దత్తమండలముననే మహాకవులు పెక్కండ్రు కల రని మూఁడుసారులు మాత్రమె స్వల్పకాలము సంచరించిన నాస్వల్పానుభవముచేఁ జెప్ప సాహసించుచున్నాఁడను. గవర్నమెంటు ఓరియంటల్ లైబ్రరీవారు కాని, ఆంధ్రసాహిత్యపరిషత్తువారు గాని, మఱియొకరు గాని యీదత్తమండలములలోఁ బ్రాచీనగ్రంథాన్వేషణమునకై, కడంగలేదు. ఈదత్తమండలములు రోగిభూయిష్ఠము లని మావారి తలఁపు. ఇచట సంచరించిన యీశా

నాంధ్రులు రుక్పిడిత్తు లగుదు రని నాయనుభవముచేఁ జెప్పఁగలను. ఇచటి వారే ప్రాచీనగ్రంథాన్వేషణమునకై, కడంగినచో సోమునివసంతవిలాసము, పెద్దన్న హరికథాసారము, తిమ్మన్నవాణీవిలాసము, సూరన్నగరుడపురాణము మొదలగు ననర్ఘగ్రంథములు లభించుటయే గాక కొన్నిపదులు విస్మృతకవుల గ్రంథములు కూడ లభింపఁగలవు. కుందుప్పి, బెలూం, పెద్దచిగుళ్ళరేవు మొదల గుచోటులనుండిన లిఖితగ్రంథములలో నే కోహినూరుమణిసదృశగ్రంథములు కలవో వానిని బైటకుఁ దెచ్చుభారము మీదత్తమండలములవారిపై నున్న దని విన్నవించుచు విరమించుచున్నాను.

# సూక్తిసుధానిధి - విద్యావిలాసము - తత్కర్త

—: జనమంచి శేషాద్రిశర్మగారు :—



ఏతద్గ్రంథకర్త కొమ్మద్ది సుబ్బరాయకవి. ఇతఁడు కౌండిన్యసగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుడు. ఈయనఁ దన్నుఁగుఱించి యిట్లుచెప్పుకొన్నవాఁడు.

మ. పటుకౌండిన్యసగోత్రసంభవుఁడు నాపస్తంబసూత్రుండు ది
క్తటవిభ్రాజితకీర్తివర్ధనుఁడు మేధాసత్త్వధర్మక్రియా
ఘటితుం డార్యజనాంఘ్రిపూజితుఁడు సంగ్రామైకపారీణస
ద్భటకొమ్మద్దిపురీనివేశుఁ డగుసుబ్బారాయఁ డూహింపఁగన్.

దీనింబట్టి యీగ్రంథకర్త కవిత్వము మొదలగు వానియం దాఱితేఱి కీర్తి గడించినవాఁ డనియు మేధాసత్త్వసంపన్నుఁ డనియు ధర్మక్రియాతత్పరుం డనియుఁ బెద్దలయందు భక్తిగలవాఁ డనియుఁ దేటపడుచున్నది. యుద్ధశూరులు గల కొమ్మద్దిపురవాసి యనియుఁ దెలును.

మఱియు నీగ్రంథమును బరికింప నీమహాకవి జ్ఞానప్రసూనాంబికా పాదభక్తుఁ డనియుఁ జిదానందయోగీంద్రుని శిష్యుఁ డనియుఁ దెల్లంబగు.

మ. వరయోగోజ్జ్వలలీలఁ బెంపొదవు దివ్యజ్ఞానసన్ముద్రచేఁ
బరమానందమరందకందళిత హృత్పంకేజ చిత్కర్ణికాం
తరసీమం గళ లంటి యంటి విమలాంతర్లక్ష్యభావక్రియో
పరతిం గన్నగుహాత్తముం గొలుతు సద్భక్తిం జిదానందునిన్.

అని చెప్పుకొన్నందునఁ జిదానందయోగీంద్రుని యనుగ్రహమునకుం బాత్రుఁడనియుఁ దోఁచును. ఈసత్కవి భాగవతమును దెనిఁగించిన బమ్మెర పోతనామాత్యకవిచంద్రు నిట్లు పొగడెను.

ఉ. సమ్మతమైన భాగవతసారవియన్నది సంస్కృతాంతరి
క్షమ్ముననుండఁ దన్నదిని జయ్యన భూమికిఁ దెచ్చి ఘోరపా
పమ్ము లడంపఁగాఁ దెలుఁగుఁబఱ్ఱిన *మత్స్యులపావనుండు నా
బమ్మెర పోతనార్యుఁడను భవ్యభగీరథు నాశ్రయించెదన్.

ఈపద్యముంబట్టి నెట్టన నెమకఁగా బమ్మెరవారు కొమ్మద్దిపురమునఁ గాఁపురంబుండి కొంతకాలమున కందుండి మఱియొకగ్రామమునకుఁ గాఁపురము

* మత్స్యులకర్తయైన యా- పా.

సేయఁ బోవఁగాఁ గొమ్మద్దివారు గా మాఱి రనియు మఱికొంత కాలమునకు మరల నాకొమ్మద్దిగ్రామమునకే యరుదెంచి యట గ్రామోద్యోగము సంపాదించుకొని రనియు స్పష్టము. ఇంటిపేరు లిట్లే మార్పు నొందుట లోకమున స్వభావమే గాని విపరీతము కాదు. ఆవంశమున జనించిన యీసుబ్బరాయకవి యోగాభ్యాసనిరతుఁడై యొంటిమిట్టప్రాంతముల నున్న తమబంధువులగృహములకుం బోయి యుండుండఁగాఁ బూర్వజన్మపుణ్యపరిపాకమునఁ జిదానందయోగీంద్రుఁడు దర్శన మొసంగి యోగవిద్య నుపదేశించె ననియు దాన నితఁడు యోగియై సూక్ష్మతనువిద్యావిలాసమును సకలవిద్యార్థానుభవ మనునామాంతరముగల యీగ్రంథమును నాలుగాశ్వాసములుగా రచించె ననియు నొక సిద్ధాంతము పొడసూపును. చిదానందయోగి బమ్మెర పోతనామాత్యునకు గురువను నానుడి యుండెడుఁగదా. కావున బమ్మెరవారును గొమ్మద్దివారు నొక్కయింటిపేరు గలవా రనియు నద్దాననే మద్వంశపవిత్రుఁ డగుపోతనామాత్యుని దలంచెద నని చెప్పుకొన్నాఁ డనియుఁ గులాభిమానము లేనిచో నట్లు మత్కులపావనుఁ డని చెప్పుకొనఁ డనియు విస్పష్ట మగును. దీనింబట్టి యీకను నూహింపఁగా నొంటిమిట్ట యందు బమ్మెరవా రుండి రనియుఁ బోతనామాత్యుఁ డటఁ దెలుఁగుభాగవతమును రచించె ననియుఁ దోఁపకమానదు.

ఓరుగల్లు పోతనామాత్యునకు భాగవతరచనయందు నివాసమును నూత్నసిద్ధాంతమును బట్టి యాలోచించిన నచ్చటివా రెవ్వరో కడపమండలమున కరుదెంచి కొమ్మద్దివా రైరని చెప్పినను జెప్పవచ్చును. ఈవాదము నడ్డువా రెవ్వరునుండరు. కాని యీసిద్ధాంతము ద్రావిడప్రాణాయామము వంటిది. చిదానందయోగి యుపదేశమునకుఁ బాత్రుఁడు పోతన యనునానుడి దీనిచే నెగిరిపోవును. ఈనానుడి యేశాసనమునుబట్టి పుట్టుకొంచె నన్నఁ బలుకనేరను గాని యోరుగల్లు నివాస మని యేశిలాతామ్రశాసనమును బట్టి తెలిసదయ్యా యనిమాత్రము ప్రశ్నింపఁగలను. ఇట్టి ప్రశ్నోత్తరముల కేమి గాని బమ్మెర వారు కొమ్మద్దివారుగ మాఱి రనుట చలింపనిసిద్ధాంతము.

కొమ్మద్ది యనుగ్రామ మోరుగల్లు ప్రాంతమున వెదకిన నెందైనఁ జేలకుండునా యని ప్రశ్నింపవచ్చును. కాని దానికి సమాధాన మొసంగుట కష్టముగాదు. ఏలయనఁ జిదానందయోగి తనకుఁ దత్త్వ ముపదేశించి దీనిని "భాగీరథీసమానభాసమాన బాహుదానదీతీరం బగుతిమ్మసాగరాభిధానగ్రామంబున

నాలూరివంశజుఁ డగుసుబ్రహ్మణ్యబ్రహ్మచారి కుపదేశింపు మనియె"నని చెప్పికొన్నాఁడు. అంతియగాక పినాకినీతీరవిరాజమాన శ్రీపుష్పగిరిక్షేత్రమును వర్ణించెను. ఈ రెండు నోరుగల్లు చెంతనుండఁగూడదా, అందొకచోట నున్నవాఁగునకుఁ బినాకిని యనుపే రుండెనఁట యన్న ననవచ్చును. కాని, పుష్పగిరిపీఠాధిపతు లగు శ్రీమదభినవోద్దండవిద్యానృసింహభారతీస్వాములను వర్ణించియుండుటచే నాయుక్తి పొసఁగదు. ప్రొద్దటూరు చెంత నున్నముక్తిరామేశ్వరక్షేత్రమహిమము వర్ణింపఁబడుటయు నొకయాధారముగాఁ గడపమండలముననే యున్నయట్లు నిశ్చయింపవలయును. అభినవోద్దండ విద్యానృసింహ భారతీస్వాములే యీగ్రంథరచనకుఁ దన్నుఁ బురికొల్పి రనియును గవియే చెప్పుకొన్నవాఁడు. వీని నన్నింటిని బట్టి పరికింప నీకొమ్మద్ది కడపమండలమున నున్నదే యనియు బమ్మెర పోతనామాత్యకవికులతిలకుని వంశజనితుఁ డగు నీసుబ్బరాయకవి పూర్వు లెవ్వరో కొమ్మద్దియను నింటిపేరు గలవారుగా నుండి రనియుఁ దనవంశగౌరవమును జెప్పుకొనుచుఁ బోతనకవిచంద్రుని వర్ణించి కృతార్థుఁ డయ్యెననియుఁ దేటపడకమానదు.

ఈగ్రంథము నాలుగాశ్వాసములుగా భాగింపబడినది. ప్రథమాశ్వాసమున ముక్తిరామేశ్వరమహిమము, పుష్పగిరిపీఠము, తన్మహిమము లోనగువిషయములు గలవు. ద్వితీయాశ్వాసమున భక్తియోగము విస్తరింపఁజేయఁబడినది. తృతీయాశ్వాసమున జ్ఞానయోగము కర్మయోగము వర్ణింపఁబడినవి. చతుర్థాశ్వాసమున వైరాగ్యపద్ధతి ప్రధానముగాఁ గీర్తింపఁబడినది. ఈగ్రంథమునఁ బద్యసంఖ్య యేనువందలకు మించియుండును. మచ్చునకై యొకటిరెండుపద్యంబుల వ్రాయుచున్నవాఁడను.

క. ముద్రాలక్ష్యవిచక్షణ, నిద్రారంభంబునందు నిల్కడఁగనినన్
క్షుద్ర మగువిషయవాసన, ఛిద్రంబై యాత్మసౌఖ్యసిద్ధి వహించున్. ౯౦

క. ఈనిద్రామహిమంబున, నానందము నొంది యుండు టది మే లనుచున్
ధ్యానించు తత్త్వయోగులు, మానసములఁ గర్మభక్తి మత మెన్నుదురే.

గీ. సూక్ష్మవిద్యావిశేషతసూరుఁడైన, యోగిసంసారజలధిలో భోగియగుచు
నిహపరంబుల విహరించు సహజలీల, నీతనేర్చినవానికి లోఁతుఘనమె.

తాఁటియాకులప్రతియందును వ్రాఁతప్రతియందును నందందుఁ దప్పులు గలవు. ఇంకను దాఁటియాకులప్రతులు గలవు. వానిని మఱికి శుద్ధముచేసి ముద్రింప నెంచితి నని విన్నవించువాఁడను.

# పరిషత్స్వాగతపద్యములు.

—: ౧ కే. సంజీవమూర్తిరావుగారు. :—



శా. శ్రీరామామణి భార్యయై ప్రజలకుం జేకూర్ప సౌభాగ్యముల్
నీరేజాసనురాణికోడ లయి సంధింపంగ విజ్ఞానమున్
గారామొప్ప జగంబులన్ మనుచు శ్రీనారాయణుం డాశ్రితా
ధాముం డీపరిషత్సభన్ గురుకృపాధారేయతం బ్రోచుతన్. 1

గీ. ఓసుధీమణులార విశ్వాస మెంచి, మాపిలుపుగాంచి పూర్ణాభిమానముంచి
యమితదూరప్రయాణకష్టముసహించి, యరుగుదెంచినమీకుసుస్వాగతంబు

సీ. శ్రీరామపదసరసీరుహాంకితరజోభూతిచేధన్య మౌ [illegible]
శబరియెంగిలిపండ్లఁ జవిఁజూచి రాముండు పరితృప్తి గనిన పావనతలంబు
మారుతి మోదాశ్రుపూరితాక్షుల మున్న రాముఁ గాంచిన పవిత్రస్థలంబు
చెలఁగి మైపులకింప సీతాశిరోరత్నమును రామచంద్రుండు గనినతావు
ధాత్రి దక్షిణకాశికాక్షేత్రమనఁగఁ, జనువిరూపాక్షసుక్షేత్రమునువహించి
భూరిపుణ్యప్రదేశమై పేరుగన్న, మండలము గాదె బళ్లారిమండలంబు. 3

సీ. నిరుపమపాండిత్యగరిమచే నలరారు మహితవిద్వచ్ఛిఖామణులతోడ
సకలదిగంతవిశ్రాంతసత్కీర్తిచే మలయుసత్కవిపితామహులతోడ
రాజ్యప్రజావనక్రమముచేఁ బెంపల కాచార్యశాధానధీశ్వరులతోడఁ
బహువీరహృదయభీకరపరాక్రమముచేఁ బరఁగెడుసద్వీరవరులతోడ
రాజ్యతంత్రసూత్రములగరంబులఁగొని, జగమునాడించుసచివతంసములతోడ
మహిమ గనె నంచు బళ్లారిమండలంబు, పెక్కుగతులఁ జరిత్రలకెక్కలేదె.

చ. అమృతపుసోనవోలె హృదయంగమమౌ తనదివ్యవాఃప్రపూ
రములను దుంగభద్రయె నిరర్గళతం బ్రవహింపఁజేయఁ ద
ద్విమలజలంబు ద్రావిన కవిప్రవరుల్ మురళీస్వనంబుతోఁ
డమకవితామనోహరసుధం బ్రవహింపఁగఁజేసి రీస్థలిన్. 5

సీ. పలుగ్రంథములపతిత్వము గాంచి యలరారుఘనునాంధ్రభోజునిగన్నచోటు
తొలుతఁ బ్రబంధబంధురతనించినయాంధ్రకవితాపితామహుఁ గన్నచోటు
ప్రతిపద్యమతిరసాస్పద మన్ననుతిగన్న ఘటికాశతగ్రంథుఁ గన్నచోటు

బలుముద్దుముద్దుపల్కులనాంధ్రభాషకుఁ గఱపినకవివర్యుఁ గన్నచోటు
మఱియునాంధ్రనాటకపితామహునియశము, గనినచరితనాటకకర్తగనినచోటు
నాఁటికిని నేఁటి కాంధ్రరత్నముల గనికి, నెలవుగాదె బలారిమండల మొప్పెరె.

ఉ. మానితపాండితీయుతుల మంజులసత్కవితావిహారులన్
జానగు నీసభన్ విబుధసన్నుతుఁ డీనృపుఁ డగ్రపీఠ నేఁ
డానుట యష్టదిగ్గజసమావృతుఁడై తగుకృష్ణభూపునా
స్థానము చెల్వు నాస్మృతిపథంబులఁ బాఱఁగఁజేసె జిత్రమై. 7

ఉ. శ్రీయును వాణియున్ సహజసిద్ధవిరోధము మాని ప్రీతిమై
రాయలకాలమం దెచట రాజిలి రట్టిబలారిమండలం
బోయనఘాత్ములార తన యోపినయంత సభక్తికంబుగా
నీయఁగ నేర్చు స్వాగత మిదే కరుణించి పరిగ్రహింపరే. 8

మ. గురుకారుణ్యవిలాసభాసురత మాకున్ దర్శనం బిచ్చి యీ
కరణిన్ ధన్యులఁ జేసినారలు నమస్కారంబు లర్పింతు మీ
పరిషత్కార్యములెల్ల సాంగములు గా వర్ధిల్ల నేతత్సభల్
చిరకాలంబు జనోపకారపరతం జెల్వొందెడుం గావుతన్. 9

—: శ్రీ దోమా వెంకటస్వామి గుప్తగారు :—

ఉ. శ్రీకరమౌ త్రిలింగములఁ జెన్నలరారు పవిత్రభూమిలో
వాకొనఁబొల్చి, దైవతపు బాసకు బాసటగా నెసంగుచుం
జీఁకును జింత నాఁపి, రహిఁ జేకొనఁజేయు తెలుంగుఁ బాసకున్
వీఁక నిరంతరంబు శుభనిస్తులతాప్తి చెలంగుఁ గావుతన్. ౧

సీ. ఏభాష మహనీయహృద్యగీర్వాణభాషామతల్లికకు గారాముబిడ్డ ?
"దేశభాషలయందుఁ దెలుఁగు లెస్స"యనంగ భాష యెయ్యది కృష్ణపతిని జవిపె
ఎడ "నిటాలియ నాఫ్టి యీస్ట"నఁ బరఖండపండితులను దన్ని భాష యెద్ది?
అరవదేశమునందుఁ ద్యాగరాజు కృతుల కేభాష మెచ్చి వరించినాఁడు?
అట్టి తెలుఁగుభాషపయి దీవ్యన్మహోధి, కారమొసఁగిన ధీరు లఖండపండి
తు లిటఁ జేరిన వారికిఁ దోరమయిన, స్వాగత మ్మిది పరఁగు సుస్వాగతమ్ము

ఉ. గ్రామ్యమె హెచ్చొ? గ్రాంథికమె గణ్యమొ? యింక మఱొక్కఁ డేదియో
సౌమ్యమొ? నిర్ణయించుటకుఁ జయ్యనఁ బెద్దలు మీరలెల్ల ధీ

గమ్యుల రిందుఁ జేరితి; రిఁకందగ మీఁదగు చర్చయెంతయున్
నవ్యముగా వ్రతక్ జగమునందలి పండితమండలింగడున్. 3

ఉ. భాసకు మించినట్టి దెది పర్వము దేశహితైకసాధనం
బీసడి పెద్దలారయనిదే? కనుకన్ మన తెల్గుబాసకున్
భాసురరీతిఁ దొంటివలె భవ్యసుగౌరవ మొప్పునట్లుగా
వాసిగఁ బండితోత్తమసభాంతర మిద్ది యొనర్చుఁ గావుతన్. ౪

సీ. బమ్మెరపోతన భక్తశిఖామణి రహి నట్టిఁ డయ్యలరాజురామ
భద్రుఁడు; పెద్దన్న భవ్యాంధ్రకవితాపితామహుఁడు; డింకను, రామరాజ
భూషణుఁడు చతురముఖ్యుఁడు; నంది తిమ్మన మృదువాగ్వైభవవిశిష్టుఁడు
కృష్ణరాట్కవిమణి కృష్ణమూర్త్యం డాంధ్రనాటకబ్రహ్మయుం; దగ్రశాస్త్ర
సాగర శ్రీనివాసాఖ్యబుధేంద్రుఁడు; నాంధ్రవాల్మీకి సుబ్బాభిధుండు
నభినవవాల్మీకి యయిన శేషాద్రిశర్మాభిధానుం డిట్టి యనఘులెంద
ఱేనిఁ బ్రోదిఁ బెంచిరి, సెంతురింకఁ; గాన, దెలుఁగు బాసకు దత్తమండలము మిగుల
నెలమిఁ గూర్చునందులకీవులలినిఁ గొలువ, వలయునో యాంధ్రసాహిత్యపరిషదంబ.

సీ. ఏమండలిం దొల్లి నెసఁగినపండితకవు లాంధ్రభాషకు గరిమ మీఱు
దోహద మొసఁగి? రా తోరహా దత్తమండలిమించు పురమణిబలరిపుపుర
మున నిటఁ జేరిన బుద్ధిబృహస్పతు లందఱ్ త్రిలింగభాషాఖ్యకల్ప
లత వృద్ధినందెడి లలిఁ గూర్తురనుటకు నెందేని సందేహ మొసఁగు నొక్కొ?
అందులకు నబ్జభవురాణి యమలసత్త్వ, పాకటాతుపాతముతోడుపఱఁగఁగాత
తగఁగవీంద్రావృతిశుభమ్ము తనరిమిగుల, మెఱయుమీ యాంధ్రసాహిత్యపరిషదంబ.

మ. సొరిదిం గంజములెల్లఁ జెల్వునగనున్ సూర్యప్రసాదాప్తి నా
సరణిం బండితమానసాంబుజములుం జక్కన్ వికాసంబు మిం
చురిచిం జాలఁగఁ గాంచు నేఁ డధిపుఁడౌ సూర్యప్రసాదేశుఁడిం
దురహి న్మించుటఁ జేసి యం చనఁగ నొందు న్నందియుంబుండునే.



# గ్రంథవిమర్శన పద్ధతి.

—: కేతవరపు వేంకటశాస్త్రిగారు :—



(గతసంచిక శేషము.)

## ఇందువచ్చు ముఖ్యపాత్రలు.

ప్రవరుఁడు—ఇతఁడు నైదికబ్రాహ్మణుఁడు. సోమయాజి. కర్మాసక్తుఁడు. నిరతాగ్నిహోత్రి. జ్ఞాని. ధీరుఁడు. అతిథిసత్కారశీలుఁడు. అప్రతిగ్రహీత. తీర్థసేవాతత్పరుఁడు. ఈమొద లగుసద్గుణము లతనియం దనేకములు గలవు. అట్టిసద్గుణముల నాయాతావుల వర్ణించి కవి యీపాత్రమును జక్కఁగఁ బోషించెను. తనయిల్లు చేరినసిద్ధు నాదరించుపట్టున నతిథిసత్కారప్రియత్వమును నతనితోఁ జేసినప్రసంగమువలనఁ దీర్థసేవాపరత్వమును వరూథినితో నతఁ డొనర్చిన సంభాషణమువలన జ్ఞానవైరాగ్యకర్మనిష్ఠలును రూపొందినసౌందర్యము వలె నున్న వరూథిని యతనిని బలిమిని గౌఁగిలించినప్పు డతనిధైర్య శాంతగుణములును హవ్యవాహనప్రసాదమువలన నతఁ డిల్లుచేరె ననుటచే నతనిసతతాగ్నిపూజాప్రభావమును గవిచే బాగుగా వెల్లడిసేయఁబడినవి. పెద్దనకవి ప్రవరుని రూపొందిన సత్కర్మపుంజముగాను మూర్తిమంత మగుశాంతగుణముగాను దనగ్రంథమునఁ జిత్రించినాఁడు. ఈపాత్రమువలన శాంతగుణము పూర్తిగాఁ బోషింపఁబడినది. ఈవిషయమున శ్రీబ్రహ్మయశాస్త్రిగారు మారనగ్రంథమందువలె మనుచరిత్రమునందు నిక్క మగుశాంతము వెల్లడికా లే దనిరి. కాని మారనకంటెఁ బెద్దనయే ప్రవరుని సంభాషణాదులవలన శాంతరసము నెక్కుడుగాఁ బ్రవహింపఁజేసి యుండ వా ర ట్లేల వ్రాసిరో తెలియకున్నది.

సిద్ధుఁడు—ఇతనిగుఱించి విశేషముగాఁ జెప్పవలసినది లేదు. కాని, పెద్దన యొనర్చినయితనివర్ణన మత్యంతసహజముగా నున్నది. ఆపద్యము చదివిన సిద్ధుఁడు కన్నులకుఁ గట్టినట్లుగా నుండును.

వరూధిని—ఈమె యువతి. అచ్చర. మిక్కిలి సౌందర్యవతి. ఎందఱో గంధర్వకుమారులు వచ్చి తన్నుఁ బ్రేమించినను నిరసించిన సౌందర్యాభిమానిని. సామాన్యముగాఁ గామనిహత లగువెలకాంతలు పురుషులను లోఁబఱుచుకొను విలాసములును శృంగారచేష్టలను జక్కఁగా వర్ణించి కవి యీపాత్రము

ను బాగుగాఁ బోషించినాఁడు. మఱియు నామె ప్రవరునితో సంభాషించు సందర్భమునఁ దదీయవాక్చమత్కృతులును, యుక్తులును, బాగుగాఁ జూపఁ బడినవి. ఈపాత్రయందు వీసమంతయును లోపము గానరాదు.

మాయాప్రవరుఁడు—ఇతఁడు కలి యనుగంధర్వుఁడు. ఇతఁడు కాముకుఁడు, స్త్రీలోలుఁడు, చిరకాలమునుండి వరూధినిని బ్రేమించి యామెచే నిరాకృతుఁ డయినవాఁడు. కలి యట్లు తిరస్కరింపఁబడియు నిరాశుఁడు కాక "స్త్రీలు చపలచిత్తలు గాన వారొకమాఱు పురుషులను దిరస్కరింతురు, మఱొకమా ఱాదరింతురు. ఆమె యొనర్చిన తిరస్కారమును మది నెంచుకొనరాదు. కాన, ప్రవరవేషమను నుపాయముచే నామెను వశపఱచుకొందు" నని తలఁచి వరూధిని యారామమునకు వచ్చి కామరూపి యగుటచేఁ బ్రవరరూపమును దాల్చి యిష్టసిద్ధిని బడసినవాఁడు. సాధారణముగాఁ గాముకులకు వంచనములు నన్నృతములు స్వభావసిద్ధములు. మఱియు వారలకు వాక్చమత్కారము మెండుగా నుండును. పెద్దనగారు మాయాప్రవరునిపాత్రము నుండవలసినట్లు చిత్రించినారు. ఆగంధర్వుఁడు మంచివాఁడా చెడ్డవాఁడా యనువిషయముతో మనకుఁ బనిలేదు. వాఁడు కాముకుఁడు గాన పెద్దనగారు వానికిఁ గాముకలక్షణములను గూర్చినారా లేదా? యనునంశము మాత్రమే మన మాలోచింపవలెను. కలి వరూధినిని దనరూపముచేతను సంభాషణములచేతను, వంచించినాఁడు. మఱియు మాయాప్రవరుఁడు తుదను వరూధినిని నొప్పించి వెడలిపోవ నిశ్చయించి,

సీ. పైపరామరికచొప్పడమిఁ బక్వముదప్పి, పండఁబాఱినపోల మెండఁబాఱె...

అని యిట్లు చెప్పించుట "ఏభూపాలుఁ డీవచ్చినన్ సాలగ్రామము మున్నుగాఁ గొనఁ"డనుదానికి విరుద్ధముగా నున్న దని కొందఱనిరి. కాని యట్లసత్యము చెప్పించుటయే కలిపాత్రకుఁ బోషకముగా నున్నది. కలి దివ్యజ్ఞానముచేఁ బ్రవరునియథార్థవృత్తాంతమును దెలిసికోఁగల్గినను దానిని మఱుగుపఱిచి తనయింటియొద్దఁ బెక్కుచిక్కులు సంభవించె నని చెప్పి యామెహృదయమును గరఁగింప నిట్టియసత్యములు చెప్పియున్నాఁడు. అట్లు చెప్పకపోయిన నతఁ డంతసులభముగా నంతనిరపాయముగా వరూధినిచెంతనుండి తప్పించుకొనఁగల్గునా? కవి మాయాప్రవరునికిఁ దగిన ట్లిచ్చటఁ జెప్పినాఁడు. ప్రవరుని యుత్తమత్వమునకుఁ దగువిధమున "ఏభూపాలుఁ"డని యచ్చటఁ జెప్పినాఁడు. పద్యార్థమంతయును మాయాప్రవరుఁడు కల్పించి చెప్పినదే. ఇందు సత్య మే

మియును లేదే లేదు. అంతయు నసత్యమై యుండఁగా "గ్రహణసంక్రమణాదుల" ననునది మాత్రము సత్య మెట్లగును? అది సత్యము కానిచో వెనుకటి దానితో నెట్లు విరోధించును? కావున విరోధము లే దనియే నానిశ్చయము.

స్వరోచి—ఉత్తమ నాయకునియం దుండవలసినయుత్తమగుణము లన్నియు—అనఁగా ధీరత్వము, పరాక్రమము, పరదుఃఖాసహిష్ణుత, పరోపకారము, స్వార్థత్యాగము, సాహసము, యుద్ధచాతుర్యము మొదలగునవి—కవి చక్కగా వర్ణించెను. స్వరోచి కిరాతసైన్యమును దోడుచేసికొని రాక్షసునిఁ జంపె నని చెప్పుటకంటె నసహాయుఁడై రాక్షసునిఁ జంపె నన్నమూలకథయే మిక్కిలి సమంజసముగా నున్న దని శ్రీ బ్రహ్మయశాస్త్రిగారు సమర్థించిరి. కాని యీ యాక్షేపణము సరిగా దని నాయభిప్రాయము. వేఁటనిమిత్తము వచ్చిన కిరాతసైన్యము స్వరోచికిఁ దోడున్నట్లు పెద్దన వర్ణించుట సత్యమే కాని యీ సైన్య మారాక్షసునిఁజూచి పాఱిపోవుచుండెను. ఆసైనికులు సామాన్యు లందరా? కారు. వీరు స్వరోచివెనుక వచ్చునప్పుడు పల్లినవంతములు చూడఁగా మంచిశూరులవలె నున్నారు. వారు రాక్షసునిభయంకరాకృతిని గాంచి బెదరి పాఱిపోవుచుండిరి. స్వరోచి వారికిఁ బ్రోత్సాహము గల్గించి రాక్షసునిపైకి మరల్చుట సత్యమే. కాని యేమి లాభము? వారు రాక్షసు నేమియుఁ జేయఁజాలక పోవుటయే కాక యతని కాహార మైరి. తుదకు స్వరోచి యొక్కఁడే రాక్షసునితో యుద్ధమొనర్చి జయించెను. ఇందువలన స్వరోచిపరాక్రమాదులకు లోపము గలుగునా? వీరు లగుసైనికు లెందఱో కలిసి జయింపఁ జాలని రాక్షసుని నొక్కఁడే చంపె ననుటచే స్వరోచిశౌర్యాదులకు మఱింతయు శ్లాఘ్యతయే కలుగునుగాదా?

మనోరమ—ఈమె యిందీవరాక్షుని కుమారిక. సద్గుణవంతురాలయ్యును, బాల్యచాపలంబున నొకతపసిని ధిక్కరించి రాక్షసానుధావిత యగునట్లు శాప మందెను. ఈమె యార్తురా లయి స్వరోచికి శరణుసొచ్చి యతనివలన బాధను దొలఁగించుకొనియెను. ఈమె స్వరోచిని బెండ్లియాడెను. ఈమె తన చెలికత్తెలకుఁ దనవలన సంభవించినయాపదకు మనసులోఁ గుందుచు నాయుర్వేదాభిజ్ఞుం డగుస్వరోచిచే వారిదుఃఖములను బాపఁ దలంచి సమయమునకు వేచి యుండెను. వివాహ మైన పిమ్మటఁ దన్నుఁ బతిచెంతకుఁ బంపినపుడు తన యందధికానురాగము గలతనపతికిఁ దనకోర్కిని దెలిపి తనచెలికత్తెలకు శా

పవిముక్తి గల్గించెను. "స్వయం తీర్ణః పరాన్ తారయే" త్తనున ట్టీమె తా ను దుఃఖవిముక్తురాలై తనచెలుల దుఃఖములను గూడఁ బాపెను. తనకు సం ప్రాప్త మగుచున్న సుఖమును సరకుగొనక తనచెలులదుఃఖనివృత్తియే ముఖ్య ముగా నెంచుకొనుట మనోరమపాత్ర కెంతయుఁ బోషక మగుచున్నది.

ఇట్లే కళావతీప్రముఖపాత్రములును జక్కగా నడిపింపఁబడినవి.

రసము—మనుచరిత్రమునందుఁ బ్రధానరసము శృంగారము. వీర కరు ణాహాస్యశాంతాదు లంగములు. అంగి యగుశృంగారము సర్వవిధముల సమ గ్రముగఁ బోషింపఁబడినది. కాని కొందఱుపండితు లీప్రబంధమందు శృంగార రసాభాసము కాని సక్కపుశృంగారము లే దనిరి. వారిలో శ్రీబ్రహ్మాయ శాస్త్రిగారు రసవిషయమున మనుచరిత్ర మధమాధమగ్రంధ మని కొన్నికా రణముల నిరూపించి నిశ్చయించిరి. ఆకారణము లేవో పరిశీలించెదను. వారు వ్రాసినదాని సారాంశ మిది.

"కావ్యమునకు రసము జీవితము. మనుచరిత్రమున శృంగార మంగి, తక్కినరసము లంగములు. పెద్దనకవి తనకావ్యమును శృంగారమయము చేయఁ దలంచి శృంగారాభాసము గావించియున్నాఁడు. వరూధినీప్రవరులలో వరూధి నికే యనురాగముకలదు. కాని ప్రవరునికి లేదు. కలివరూధినులలోఁ గలికే కాని వరూధినికి లేదు. ఇట్లేకత్రానురాగ మగుటచే నిందున్నది రసాభాసము కాని రసము కాదు. అట్లే మనోరమాస్వరోచులవృత్తాంత మన్ననో స్వరోచికి బహునాయిక లుండుటచే నిదియు రసాభాసమే కాని రసము కాదు. మఱియు నాయికను, గర్భాధానపుగదిలో నేడ్పించుటచే నది మఱింత రసాభాస మైనది. కవి శృంగారరసాభిమానిగాఁ గన్పించుచు దానినే విశేషముగాఁ బాడు చేసినాఁడు. ఉత్తమకావ్యములం దుండవలసిన యుత్తమశృంగార మిందు లేదు."

ఈవిషయ మాలోచింప మనుచరిత్రమందుఁ బ్రధాన మగుశృంగారము చక్కగాఁ బోషింపఁబడినది యనియే నాతలంపు. నాయికానాయకులు వీరే యని నిర్ణయింప వీలులేకున్నను నాయాతావ్రుల శృంగారరసస్ఫురణము సము చితముగానే యున్నది. అంతియకాని శ్రీశాస్త్రిగారు సెలవిచ్చినట్టు లీగ్రం థమున నున్నది శృంగారరసాభాసముకాదు. వారు చూపిన "ఏకత్రైవానురా గశ్చేత్తి"నులక్షణమున కీగ్రంథము విషయము కాలేదు. వరూధినికిఁ బ్రవ రునియందును నతనిరూప మనుకరించిన మాయాప్రవరునియందును నిష్కప

టానురాగమే కలదు. వరూథినియందుఁ బ్రవరునికి, లేకపోయినను మాయాప్రవరునకు దృఢానురాగమే కలదు. కావున వరూథినీమాయాప్రవరుల యనురాగము పరిపూర్ణ మయిన దని చెప్పుటకు సందియము లేదు. మఱియు వీరల యనురాగమున కెందును భంగము గలుగలేదు. మాయాప్రవరుఁడు తననేర్పుచే నామెను సమ్మతింపఁజేసి వెడలిపోయెను. ఆ వెడలిపోవునప్పు డయినను వారికి విరుద్ధాభిప్రాయము లున్నట్లు కనఁబడదు. వరూథిని మూఢత్వమే కానిందు మాయాప్రవరుని వంచనలే కానిండు. ఏమైనను సజప్రవరునికి వరూథినియం దనురాగ ముండి యామెను జేపట్టినప్పుడు శృంగార మెట్లుండునో యిప్పుడు నట్లే యైనది. ఇఁక నిందు రసాభాసమునకుఁ దావెట్లు ?

మఱియు శ్రీ వెన్నేటి రామచంద్రరావుపంతులుగారు వరూథినీమాయాప్రవరుల యనురాగము సీతారావణుల యనురాగమువంటి దనిరి. కాని యదియు సమంజసముగాఁ జూపట్టదు. సీతకు రావణునియం దనురాగ మెప్పుడును లేదు కాని రావణునికి సీతయందుఁ గలదు. ఈగ్రంథమునం దట్లు కాలేదు. ప్రవరరూపము దాల్చినకలికి వరూథినియం దనురాగము గలదు. వరూథినికిఁ గలియందు లేకున్నను బ్రవరరూపము దాల్చిన యతనియందు దృఢానురాగమే కలదు. ఇట్లు వారియనురాగము దృఢమగుటచేతను సఫల మగుటచేతను నిది సీతారావణుల యనురాగసామ్య మెన్నఁటికిని బొందనేరదు.

కావున మనుచరిత్రమునందు శృంగార మంగి, తక్కినకరుణాద్భుతహాస్యశాంతాదు లంగములు; కావ్యమునం దంతట నాయారసములు చక్కఁగాఁ బోషింపఁబడినవి; వాని నన్నింటిని సోదాహరణముగాఁ జర్చింప మిగులఁ బెద్దవ్యాస మగునను భయంబున దిఙ్మాత్రముగా నిందుఁ జూపెదను.

కరుణరసము—ప్రవరతిరస్కృత యగువరూథినీప్రవర్తనమువలన సువ్యక్త మగుచున్నది. పరిపూర్ణానురాగమున కాస్పదుఁ డగుప్రవరుఁ డగ్నిసాయమున నంతర్ధానము చెందఁగనే వరూథినికి శోక మావేశించినది. కావున దైవనిందాదులగు ననుభావములతోను నిర్వేదమోహాదు లగువ్యభిచారిభావములతోను శోకము స్థాయిగాఁగల కరుణము పోషింపఁబడినది. మను 3 ఆ 5 వ పద్యము మొదలుకొని చూడఁదగును.

అద్భుతము—విస్మయము స్థాయిభావముగాఁ గలదియు, లోకాతివర్తులగుచేష్ట లాలంబనముగాఁ గలదియు నగునద్భుతము స్వరోచియౌవనచేష్టలను

వర్ణించు “గ్రుద్దన్ గోత్రాచలంబు” లనెడి పద్యమునందు వ్యక్తీకరింపఁబడినది.

హాస్యము—హాసము స్థాయిభావము గల యీరసము మాయాప్రవరునిఁ బ్రవరుఁ డనుకొని వరూధినీసఖులగు రంభాదులమాటలవలన వెల్లడియగుచున్నది. మఱియు “ఊసరవెల్లి చందనము” నను పద్యమునఁ జేసిన జీర్ణముని వేషమువలనఁగూడ హాస్యము వ్యక్తమగుచున్నది.

శాంతము—ఈగ్రంధమున శృంగారము తరువాత నంతగాఁ బోషింపఁబడిన దీరసమే యని చెప్పనొప్పును. పరస్పరవిరుద్ధము లగు శాంతశృంగారరసములకు ద్వంద్వయుద్ధమును గల్పించి తుదకు శాంతమునకే గెలుపు నొసంగి దానిని జక్కగాఁ బోషించెను. వరూధినీప్రవరులసంభాషణమునందుఁ బ్రవరపాత్రముచేఁ బాగుగ వ్యక్తీకరింపఁబడినది. అట్లే యిది స్వారోచిషుని తపోభక్తి వైరాగ్యములవలనఁ గూడ బాగుగ వర్ధింపఁబడినది.

వీరము—దీనికి స్థాయిభావ ముత్సాహము. ఆస్యనేత్రాద్యలం దుండుననుణిమ యుద్ధవీరత్వమునకుఁ బ్రధానలక్షణము. ఇట్టివీరము మనోరమాసంరక్షణపరాయణుండై రాక్షసునిపైఁ గవయుచున్న స్వారోచిపాత్రమువలన స్ఫుటమగుచున్నది.

రౌద్రము—దీనికిఁ గ్రోధము స్థాయి. దానికి శత్రువు, ఆలంబనము. తదీయచేష్ట లుద్దీపనము. ఇట్టిరౌద్రము రాక్షసునితో యుద్ధమొనర్చు స్వారోచిపాత్రమువలన వ్యక్తమగుచున్నది.

భయానకము—దీనికి భయము స్థాయి, భీకరవ్యక్తి దీనికాలంబనము. దానిచేష్ట లుద్దీపనము. వైవర్ణ్యగద్గదస్వరాదు లనుభావములు. శరీరకంపాదులు వ్యభిచారిభావములు. ఇట్టిభయానకము రాక్షసానుధావిత యగు మనోరమాపాత్రమువలనఁ బరిస్ఫుట మగుచున్నది.

బీభత్సము—దీనికి జుగుప్స స్థాయి. మాంసపూయరుధిరాదు లాలంబనము. క్రిమిపాతాదు లుద్దీపనము. నిష్ఠీవనాదు లనుభావములు. అపస్మారమరణాదులు వ్యభిచారములు. ఇట్టిబీభత్సము వేటయందును రాక్షసవేషవర్ణనమందును రాక్షసవధయందును వ్యక్తీకరింపఁబడినది.

ఈవిధముగఁ బెద్దన తనకావ్యమును నవరసభరితముగఁ జేసియు నందు శృంగార మంగిగాఁ జేసి సరసజనహృదయాహ్లాదిగా నొనరించెను. ఇట్లు కావ్యము సలక్షణమును రసవంతమును నగుటచేత నే యిప్పటిపండితులే కాక పెద్దనస

మకాలికు లగుపండితులుగూడ దాని కగ్రస్థానము నిచ్చిరి. కావ్యము మిక్కిలి గుణభూయిష్ఠము కాక పోయినచో నమకాలికు లగుకవీశ్వరు లంతగాఁ బొగడియుండరు. పొగడుటయే కాదు. ఆతని పద్ధతి ననుకరించినారు.

ఇంకఁగావ్యగుణదోషములను సోదాహరణముగాఁ జర్చించినఁ బెద్దవ్యాస మగును. కావున వానిని నేను బ్రత్యేకముగా వ్రాయుచున్న "పెద్దన్నకావ్యరచనానైపుణి" యనువ్యాసమునందుఁ బూర్తిగావివరింపఁదలంచుటచే నిం దావిషయము విడిచి మఱికొన్నియంశములు చర్చించి వ్యాసమును ముగించెదను.

పూర్వరచనానుకరణము — తమకంటెఁ బూర్వకవుల గ్రంథములను బఠించి యందలిసరసరచనముల ననుకరించుట సంస్కృతకవులలోను దెనుఁగుకవులలోనుగూడఁ గలదు. ఇది గ్రంథచౌర్య మని కొంద అభిప్రాయపడుచున్నారు. కాని యది సమంజసముకాదు. పూర్వకవుల కవిత్వమందలి యభిమానముచే న ట్లనుకరించుటకవుల స్వభావము. ఇంతియకాక కొన్నిశబ్దములు కొన్నిసమాసములును మన ముపయోగించినప్పు డవిపూర్వకవుల కవితకు ఛాయలవలెఁ గన్పించును. అందులకు మనభాషలోని వృత్తములును యతిప్రాసములును గొంతవఱకుఁ గారణము లగుచున్నవి. అఘమర్షణస్నాన మనుపద మొకటి పూర్వకవులు వాడియున్నారు. ఆపదము నొకపద్యములోఁ జేర్పవలె నన్నచో సీసములోమాత్రమే యిముడును. అందు యతిచెడకుండ వ్రాయవలె నన్నచో నఘమర్షణస్నానపదమునకుఁ దోడుగా నాచరించు ననుపదము కూడ నుండకతీఱదు. అట్లు వ్రాసినచో నదికేవల మనుకరణముగా నుండక తీఱదు.
" త్ర్యంబికాచలకన్యకాంబుపూరంబున నఘమర్షణస్నాన మాచరించి- కాశీ"
"సచ్ఛాత్రుఁడగుచునిచ్చలునేగియొయ్యేట నఘమర్షణస్నాన మాచరించి-మను.

మఱియు నఘమర్షణస్నాన మనుసమాసమున మూఁడుపదములున్నవి. ఆపదములలోఁ గొన్నింటిని మార్పు చేయవలసినచో "పాపమర్షణ, పాతకమర్షణ" యని కాని స్నానపదము తీసివైచి యభిషేకపదమును జేర్చి పాపమర్షణాభిషేక మని కాని వ్రాయవలయును. కాని యది మిక్కిలి విరసముగా నుండును. ఇట్లే యేకవిషయమును వర్ణించినప్పుడు పోలిక లుండుట సహజము. మఱియు లోకోక్తులను బద్యములలో వ్రాయవలసినప్పుడు కూడ నిట్టిచిక్కే సంభవించును. ఇట్టివి గ్రంథచౌర్య మనరా దని నాతలంపు.

శ్రీ బ్రహ్మయశాస్త్రిగా రీవిషయమును జర్చించుచుఁ బూర్వరచనాను

కరణమందుఁ బెద్దన కున్నంతనేర్పు మఱియొకరికి లేదని చెప్పుచు నది గ్రంథచౌర్యముగా వక్కాణించిరి. మఱియుఁ గొందఱుకవులు పరులకావ్యములలోని పదములను మాత్రమే దొంగిలించిరి కాని పెద్దనకవి పద్యములే యపహరించె నని వ్రాయుచు "నీలమేఘముడాలు డీలుచేయు" ననుపద్యము నుదాహరించిరి. అది కృష్ణరాయల యాముక్తమాల్యదయందును మనుచరిత్రమునందును గూడఁ గన్పడుచున్నది. మనుచరిత్రముకంటె నాముక్తమాల్యదారచనము ముందు గావున, పెద్దన రాయలగ్రంథములోని పద్యమును దొంగిలించె నని వ్రాసిరి. కాని యది సమంజసముకా దని నామతము. ఆలోచింపఁ బెద్దనకును రాయలకును గలయనుబంధము తక్కినకవులకును, రాజులకును, గలయనుబంధమువంటిది కాదు. వారల కొకరియం దింకొకరి కమితగౌరవము. అట్టిచో నాపద్య మెవ్వరి దెవ్వరు స్వీకరించినను నది రెండవవారియందలి గౌరవాదరములచేతనె యని గ్రహింపవలయును గాని యది గ్రంథచౌర్య మనరాదు. పెద్దనది దొంగతనమే యైనచో నతఁడు దొంగవస్తువును దదధికారులకే యిచ్చుట హాస్యాస్పదము. ఇంతటి వెఱ్ఱిదొంగ యెచ్చటనైన నుండునా ? మఱియుఁ బెద్దప్రబంధము వ్రాసినమహాకవి పెద్దన యొక్కసీసమునకుఁ గక్కుఱితి పడె ననుట శోచనీయముగాదా ?

మఱియు శ్రీశాస్త్రిగా రనుకరణవిషయమును జర్చించుచు శ్రీనాథుని "కమలేందీవరషండమండిత" యనుపద్యము ననుకరింపఁ దలఁచి పెద్దన మూలములో వరూథిని ప్రవరునిఁ జూచె నని యుండఁగా దానిని మార్చి ప్రవరుఁడే వరూథినిని జూచినట్లు వ్రాసి యున్నాఁడు. ఇతఁ డనుకరించుటకై మూలమును గూడ మార్చివేసియున్నాఁ డని వ్రాసి లోపమును నిరూపించినారు. కాని యది యనుకరణాసక్తితోఁ జేసినది కా దని నాయభిప్రాయము. ఇట వరూథిని ప్రవరునిఁ జూచిన దనుటకంటెఁ బ్రవరుఁడే వరూథినిని జూచె నని చెప్పుటయే మిక్కిలి సమంజస మని భావించి కవి యట్టిమార్పు చేయవలె నని యే చేసియుండును. అం దెంతో యౌచిత్యమున్నది. ప్రవరుఁడు కర్మఠుఁడు, హిమాలయమున నిర్జనారణ్యమునఁ జిక్కికొనెను. తనగ్రామమునకుఁ బోవ దారి తెలియకున్నది. సూర్యుఁ డస్తమింపనున్నాఁడు. తనకర్మకలాపమంతయుఁ జెడనున్నది. ఇట్లాతురుఁ డయినవాఁడు చుట్టుపట్ల నెచ్చట నైనను మనుష్యు లుందురేమో యనియు నున్నచో వారినడిగి మార్గము తెలిసికొని

యిలు చేరవచ్చు ననియు నెంచి పలుతావులు వెదకుట యుక్తము కదా ? అట్టి చోఁ బ్రవరుఁడే వరూధినిని జూచె ననుట యుచితము కాదా ? ప్రవరునివలె వరూధిని యొకులకై వెదక నవసరము లేదే ? అప్పటికి వరూధినికిఁ బ్రవరుఁ డనువాఁ డొకఁడున్నాఁ డనియు నచ్చటి కతఁడు వచ్చెననియుఁ దెలియనే తెలి యదు. కావునఁ బ్రవరునియాతురత చూపుటకై కవి యిట్లు మార్చె ననుట యే సుసంగతము.

మనుచరిత్రములోని వర్ణనము లత్యంత సమంజసములు. సరసములు. నైసర్గికములు. ఆవర్ణనములు చదివినచో వర్ణ్యము చిత్తరువున లిఖింపఁబడి నట్లు కన్నులకుఁ గట్టుచుండును. ఆవిషయ మందఱు విమర్శకులుఁ గూడ నంగీ కరించినదియే. ఒకటిరెం డుదాహరణములు పేరొందుపఱిచెదను.

చ. అటు చని కాంచె భూమిసురుఁ డంబరచుంబిశిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లురదభంగతరంగమృదంగనిస్వన
స్ఫుటనటనానురూపపరిఫుల్లకలాపకలాపిజాలముం
గటకచరత్కరేణుకరకంపితసాలము శీతశైలముౝ.

ఇందు మూఁడుపాదములకుఁ జాలిన దీర్ఘసమాస మున్నను, నందలి పదము లన్నియును, సులభములు. మఱియు వాడుకలోనివి. అం దొకటియుఁ గ్లిష్టపదము లేదు. ఇట్లుండ నిట్టిసమాసములను బట్టి మనుచరిత్రకవిత్వము క్లిష్టపదభూయిష్ఠ మనియు, నారికేళపాక మనియుఁ గొందఱు పండితులు చెప్పినయంశము సత్యమునకు దూర మని నాతలంపు. మఱియుఁ బాకవిషయ మున వ్రాయుచు శ్రీబ్రహ్మాయశాస్త్రిగారు మనుచరిత్ర యిక్షుపాకమునఁ బడి న దని వ్రాసిరి. అనఁగా నారికేళపాకముకంటెను గఠినతర మనునభిప్రాయ మును దెల్పిరి. అది వారికే గోచరముః కావలెను. పెద్దనచేసిన వర్ణనము లన్ని యు దీర్ఘసమాసభూయిష్ఠములు గావు. ఈవర్ణనము చూడుఁడు.

సీ. నిడుదపెన్నెఱిగుంపు జడగట్ట సగరుమున్నను మందు తపము సైకొనినచోటు
జరఠకచ్ఛపకులేశ్వరు వెన్ను గానరా జగతికి మిన్నేఱు దిగినచోటు
పుచ్చడికతనంబు పోఁబెట్టి గిరికన్య పతిఁగొల్వ నాయాసపడినచోటు
వలరాచరాచవాఁ డలికాక్షుకనువెచ్చఁ గరఁగిన యాలకనికరపుఁజోటు
గీ. తపసియిల్లాండ్రచెలువంబు తలఁచితలఁచి
మున్ను ముచ్చిచ్చును విరాళి గొన్నచోటు

కనుపపులు వేల్పుపడవాలుఁ గన్నచోటు
హర్షమునఁ జూచి ప్రవరాఖ్యుఁ డాత్మలోన.

ఇందలి పదములకూ ర్పెంత హృద్యముగా నున్నదో గమనింపుఁడు! ఇం దొకపదమును దీయుటకుఁ గాని వేయుటకుఁగాని యవకాశ మింతేనియులే దుకదా ?

శ్రీబ్రహ్మయశాస్త్రిగా రీపద్యరాజమునందుఁ గూడ దోషారోపణము ను గావించిరి. ఎట్లనఁగా:-

"కర్తయఁ డగుప్రవరుఁడు కన్పడి సోకనముఁ జేయుటలో "వలరాచ రాచవాఁడు.........కనికరపుఁజోటు" మున్నగునవి చూచె ననుటలో సార స్యము లేదు. కవిశృంగారరసైకప్రియుఁ డగుటచే నిట్టివర్ణనములఁ జేసినాఁడు. ఔచిత్యము చూచుకొనలేదు. ఈపద్యము మతప్రధానము లగుపవిత్రస్థలముల విశేషములను జూపునదిగా లేక విరసముగా నున్నది. మఱియు "పుచ్ఛడీకత నంబు పోఁబెట్టి గిరికన్య పతిఁగోర్వ నాయాసపడినచోటు"

ఇది స్థలవిశేషమును దెల్పుటకుఁ జెప్పినదో పరిహసించుటకుఁ జెప్పిన దో తెలియవచ్చుటలేదు. సతి పతికై తపస్సుచేసినచో టనినఁ జాలదా? ఆయా సపడినచో టెందుకు ?..................పవిత్రనుగుతపశ్శబ్దము తీసివేసి యా యాసపడినచో టనుటచే సారస్యము చెడినది. బాలపై ప్రేమాతిశయము గలత ల్లిదండ్రులు మున్నగువారు తప స్సొనరించు కూతుఁ గని యాయాసపడుచున్న దనిన ననవచ్చును. కవిదాని నాయాసమాత్రముగాఁ జెప్పరాదు. పతిని గోరి యొకయువిద తపంబునొనరించుటకై పుచ్ఛడీకతనంబు వహింపవలసి యుం డునా? ఇది పెద్దవింత! తపస్సుచేసె ననుటకు బదులుగా నాయాసపడె నని యెట్లు వ్రాసెనో, పెద్దన్నకుఁ దపస్సులు గిపస్సులు కిట్టవు గాఁబోలు ననవలసివ చ్చుచున్నది"

శ్రీబ్రహ్మయశాస్త్రిగారు వ్రాసినయంశములు సముచితములుగా లేవని నాయభిప్రాయము. వలరాచరాచవాఁ డని వ్రాసినంతమాత్రమున శృంగారమ గునా ? ఈశ్వరుని కంటిమంటలచే శృంగారరసనిధాన మగుమన్మథుఁడు భస్మ మయినచో టనుటచేఁ గరుణరస ముప్పతిల్లును గాని శృంగారము గల్గునా ? ఇందుఁ బెద్దనగారి శృంగారప్రియత్వ మేమియో తెలియరా కున్నది. ఇట్లు చెప్పుటలో సారస్యములే దఁట ! ఏమో ? పవిత్రస్థలములఁ జూపలే దన్నారు.

ఇది పవిత్రస్థల మైనను గావచ్చును గదా ! మనకుఁ బ్రధానదేవత యగునీశ్వ రుఁడు కామమును జయించినచో టనుటవలనఁ బవిత్రత వెల్లడి కాకపో లేదే, అరిషడ్వర్గములో మొదటి దగు కామమును దహించె ననుటచేఁ బరమపవిత్రస్థ ల మని యెంచఁదగును గదా ?

అట్లే దీనిపై రెండవయాక్షేపణము గూడ సరిగా లేదు. ఇట శ్రీశాస్త్రిగారు చక్కగా నాలోచింపలే దనుట స్పష్ట మగుచున్నది. పార్వతి మొదటఁ బరమేశ్వరునికిఁ బరిచర్య చేసినది. మన్మథదహన మైనతర్వాతఁ దనసౌందర్యము శంకరుని మెప్పింపఁ జాలకపోయె నని వగచి తల్లిదండ్రు లెంతచెప్పినను వినక పార్వతి తపస్సుచే శంకరుని వశపఱుచుకొనఁ దలఁచి తపస్సు చేసినది. పెద్దన పార్వతి యీశ్వరునికిఁ బరిచర్యను జేసి యాయాసపడిన చోటును వర్ణించెను గాని పార్వతి తపస్సుచేసినచోటును వర్ణింపలేదు. ఈవిషయమున శ్రీశాస్త్రిగారు పొరపడి పెద్దనకవిని నిందించినారు. ఇ దెంతబాగున్నదో పండితు లూహింతురుగాక.

విమర్శనసారాంశము.

మనుచరిత్ర భాషావిషయములో నుత్తమగ్రంథము. సలక్షణము. రచనయం దుత్తమస్థానమున కర్హము. నిష్ఠాగరిష్ఠుఁ డగుప్రవరుని ప్రవర్తనమును గాపాడుటచే నిది యెంతయు నీతిదాయకము. కాని తారాశశాంకమువలె దుర్నీతిదాయకము కాదు. ఆయూతావుల రీతులును వృత్తులును జక్కగా గమనింపఁబడినవి. వర్ణనములయం దిది యుత్తమము. శృంగారాదిరసములు చక్కగాఁ బోషింపఁబడినవి. కాన రసవిషయమున నిది ప్రథమస్థాన మలంకరింపఁ దగినది. ఇప్పటి నవనాగరకులు గుటగించుకొనునట్టి సంభోగాదివర్ణనము లున్నంతమాత్రమున గ్రంథ మధమ మనవీలు లేదు. పదునాఱవశతాబ్దమందలి కవులయుఁ, బ్రభువులయుఁ, బ్రజలయు నభిరుచి యట్లుండె నేమో? ఎవ రెఱుఁగుదురు ? అచ్చటచ్చట దీర్ఘసమాసము లున్నంతమాత్రమున నిది నారికేళపాక మనియు నిక్షుపాక మనియుఁ జెప్పరాదు. ద్రాక్షపాకమున కర్హ మైనది. ఈవిషయము మఱియొకవ్యాసము లో వివరించెదను. కథ చక్కగా నడుపఁబడినది. అందు చేసినమార్పులు మూలకథకంటె సముచితముగా నున్న వని నా యభిప్రాయము.



# పెద్దనార్యుని మనుచరిత్రమునందలి మెఱుంగులు.

—: సోమంచి సూర్యనారాయణశాస్త్రిగారు :—



మనుచరిత్ర మనుక్షీరవారాశిని జ్ఞాన మను మందరమునకు విమర్శక తాశక్తి యనువాసుకిం జుట్టి మథింపఁగా నుద్భవించిన యనేకామూల్యసుగుణ విశేషము లాకవిమర్శనమునందు సువ్యక్తము చేయఁబడి పెద్దనార్యుని ప్రతిభా దికము ప్రశంసింపఁబడినది. అందుండి యాయాభాగముల నెత్తి చూపుచు న్నాఁడను.

పెద్దనప్రసిద్ధి :—ఆంధ్రకవితాపితామహుం డని పేరందినట్టియుఁ గవి రాజును రాజకవియు నగుకృష్ణదేవరాయనిచే మిగుల మన్ననఁ బడసినట్టియు నాంధ్రమహాకవి యగుపెద్దనార్యుఁ డాంధ్రలోకమునఁ జాల సుప్రసిద్ధమహాకవి గా నున్నాఁడు.

క. పెద్దనవలెఁ గవిచెప్పినఁ, బెద్దనవలె నల్పకవిని బెద్దనవలెనా
మొద్దనవలె మొద్దనవలె, గ్రద్దనవలెఁ గుందవరపు కవిచౌడప్పా.

ఉ. ఇద్దఱు జోడు నన్నకవి యెఱ్ఱన తిక్కనసోమయాజి దా
నుద్దగు వారికిన్ ముగురి కొక్కఁడె దీటగు నల్లసాని మా
పెద్దన "

కణాదపెద్దన-

అనుపద్యము లీతని ప్రసిద్ధిని వెల్లడింపఁగలవు. ఈతఁ డిట్లు ప్రసిద్ధకవిగా నుననే నే నీతని గ్రంథవిమర్శనమునకుఁ గడంగితిని. పాలసముద్రముం దఱచి నప్పుడు గదా యమృతమైనను హాలాహలమైనను బుట్టుట !

* * * * *

పెద్దనార్యుని కవితాపుత్రికయొక్కమూర్తి :—శబ్దార్థంబులు కావ్యక న్యకు మూర్తి యని లాక్షణికులు వచించియున్నారు. "శబ్దార్థౌ మూర్తిరా ఖ్యాతౌ" అని విద్యానాథుఁడు వచించె. "తను వగుశబ్దార్థంబులు" అని మూర్తి పలికె. కావునఁ బెద్దనార్యుని కవితాకన్యయొక్క మూర్తి యెట్లున్నదో యనఁగా రచన మెట్లున్నదో ముందుగా విచారింతము. పదములకూర్పులోఁ బెద్దనార్యుఁడు చాల నేర్పు కలవాఁడు. అపార మగునుభయభాషాజ్ఞాన మీతని కిఁ గలదు. శబ్దజాల మంతయు నీతని జిహ్వాగ్రమున నటించుచుండె. ఆయా

పదముల నేర్చి కూర్చుటలోఁ గూడ నీతనికి మంచి సామర్థ్యము కలదు. ఈవైశద్యమే యీతనికిఁ జాలఁ బ్రఖ్యాతిని దెచ్చినది. ఆయాకవుల వైదగ్ధ్యమును వర్ణించుటలోఁ బాంచాలీపరిణయకర్త యగు కాకమాని మూర్తికవి :—

"గీ. అల్లసానివానియల్లిక జిగిసొంపు, ముక్కుతిమ్మనార్యుముద్దుపలుకుఁ
బాండురంగవిభుని పద్యంబుహరువును, గాకమానిరాయ నీకె గలదు"

అని యల్లసానివాని నల్లికకు మెచ్చుకొనియున్నాఁడు. గణపవరపు వేంకటకవియును బూర్వకవులవిశేషముల వర్ణించుటలో :—

గీ. "ఆంధ్రకవితాపితామహు నల్లికబిగి......అప్పయవేంకటసుకవిచంద్ర."

అని యల్లికనే మెచ్చుకొనియున్నాఁడు. ఇతరమునం దీతనికిఁ బ్రజ్ఞ లేదనుభావము కాదు గాని యీతనిముఖ్యప్రజ్ఞ యల్లికబిగి యని రూఢిపఱచుచున్నది. ఇందులో నీతనిని మొదటితరపుకవి యని చెప్పవచ్చును.

ఈతని రచనమునందుఁ గొన్నిదోషము లెంచెదరు. ఆముక్తమాల్యదయందు నెంచఁబడిన విసంధిదోషాదు లిందును గొంతవఱకుఁ గలవు గాని యవి నెరసులు. అంతగాఁ బాటింపఁదగినవి కావు"

ఇందలిభాష :—"ఇందలిభాష చాల సలక్షణమైన గ్రాంథికభాష. లక్షణవిరుద్ధము లగుప్రయోగము లతివిరళములు. ఈతఁడు చమత్కారమునకై యొకకొన్ని నియతస్థలముల నన్యభాషాపదములఁ బ్రయోగించె. ఈక్రిందిపద్య మందుల కుదాహరణ మగు.

"సీ. పచ్చసిహురుముంజిపనివాగెపక్కెర..................సైంధవంబు."

ఇది యన్యభాషాపదప్రయోగమున కుదాహరణము గా నేరదు. ఇందితరదేశనామములు మాత్ర మున్నవి.

ఇందలి "పారసి" మున్నగుపదముల ప్రయోగ మన్యభాషాపదముల స్వభాషలో వాడవలె ననునభిలాషచే వచ్చినది కాదు. ఇం దున్నవిదేశనామములు పెద్దనార్యునినాఁటి కాయాదేశముల వస్తువులయందుఁ దమి హెచ్చుగా నుండుటచే నాయాదేశసంబంధవస్తువులు వాడుకలో నున్న వని తెల్పుటకై కవి యీపద్యమును సరసముగాఁ జెప్పినాఁడు. ఈతఁడు తనకుఁ బూర్వమునం దున్ననన్నెచోడుఁడు సమకాలమున నున్న రాయలవారు, ధూర్జటి మున్నగువారివలె మనుచరిత్రములోఁ గర్ణాటభాషాపదములు లోనగువానిని వాడియుండ లేదు. ఇప్పటివారివలె భాషాసాంకర్యము చేయ నిచ్చఁగలవాఁడు కాఁడు."

వీరరసము :—"మనకవి వీరమునకుఁ దావు నీయకపోలేదు. మహాకావ్యలక్షణమునందు యుద్ధము, వేఁటమున్నగు వాని వర్ణన ముండవలయు ననియున్నది. కేవలశృంగారమునే పట్టుకొని ప్రాఁకులాడు మని లేదు. పెద్దనార్యుఁడు మహాకావ్యలక్షణముల నన్నిటిని జెప్ప ననువగు కథాసమూహమును దీసికొని తనగ్రంథమును వ్రాసినాఁడు. మనుచరిత్రకథలో యుద్ధవీరమున కవకాశము కలదు గాన, గవి దానిని సంగ్రహముగా వర్ణించియున్నాఁడు. అది యెంత సంగ్రహ మైనను వీరాగ్రేసరుండగు కృష్ణదేవరాయని యాస్థానకవి యెట్లు వర్ణింపఁ దగినదో యట్లే వర్ణించియున్నాఁడు. మానవుని మానవంతునిగాఁ జేయునది వీరము. ఇది రసరాట్టు. మనకవి ధైర్యగుణము నీరీతిఁ జక్కఁగా వర్ణించినాఁడు కనుఁడు—

సీ. "బుద్ధీంద్రియక్షోభములకుఁ బెట్టనికోట విపదంబురాశికుర్వీకృతి కోడ
ఖలదురాలాపమార్గణవజ్రకవచంబు రణమహీస్థలికి శ్రీరామరక్ష
శాత్రవదుర్గర్వసంస్తంభనౌషధి మొనయుచింతాశ్రేణిమూఁకవిప్పు
యోగాదిసంసిద్ధు లొనగూర్చుపెన్నిధి తూలునేకాకులతోడునీడ
సకలసుగుణప్రధానంబు సకలకార్య, జాలసాఫల్యకరణైకసాధనంబు
ధైర్యగుణ మట్టిధైర్యంబుదక్కి పోరఁ, దత్తరింతురె యకటమీఁతరమువారు"

పూర్వ మీదేశ మిట్టిధైర్యలక్ష్మి కాలవాల మై యుండెడిది. కావుననే సకలలక్ష్ములు నిచటఁ దాండవమాడుచుండెడివి. పిఱికితన మిట్లు చక్కఁగా నిరసింపఁబడియున్నది.

ఉ. "కైదువు సున్న పూజ్యములు కంకటఖేటశిరస్థలత్రముల్
లే దరదంబు తత్తడి హుళిక్కి సహాయము సర్వమంగళం
బీదనుజుండు చిక్కె భయమేటికి లుబ్ధకులార! యాత్మకుం
బేదతనంబు మేలె మఱి మృత్యువు డాఁగెడిచోట లేదొకో!"

హిందూవీరు లెట్టి యూహలఁ గలిగి యుండెడివారో కనుఁగొనుఁడు. పిఱికితనమును బూనెడివాఁడు మానవశబ్దవాచ్యత కర్హుఁడు కాఁడు. చావు వచ్చు ననుభయమునఁ బిఱికిపందలై యుండినను జావు దప్పదు. మఱియు సంప్రాప్తమగునన దుర్మరణము సంభవించును. ధైర్యలక్ష్మీసమేతులై చావునకుఁ గూడఁ జంకక ధైర్యస్థైర్యములతోఁ బూనిన పూన్కి నెఱవేర్చుకొనఁ బ్రయత్నిం

చువారో దైవకటాక్షమునకుఁ బాత్రు లై బాగుపడుదురు. ఆయంశ మిట్లు తెల్పఁబడినది:—

కం. "చావుఁ దలపోసి మానవుఁ, డేవగ దుష్కీర్తిఁ బొరయకే దినములుపాం
దైవెడలు నట్లు నడవఁగ, దైవం బటుమీఁద మేలు తాన ఘటించున్."

అతిస్వల్ప మైనను పీరరస మిందు నున్నంతవఱకు నుచితముగానే యున్నది."

వర్ణనములు:—"వర్ణనములు కావ్యకర్తయొక్క వాక్చాతుర్యము లన వచ్చును. ఆచాతుర్యము లిం దెట్లున్నవో విచారింతము. ఏదే నొకవిషయమును దీసికొని వర్ణింపు మనిన మనకవి మిగుల నిపుణముగా వర్ణించును. వస్తువివరణము చేయుచు వర్ణించుటలో నితని కున్న నేర్పు మిక్కిలి వర్ణనీయము. ప్రతిబింబపట మొకవస్తువుయొక్క రూపము నెట్లు సరిగఁ బొడకట్టఁ జేయునో యీతని వర్ణనాచాతుర్య మట్లు పొడకట్టఁజేయును. ప్రవరవర్ణనముఁ గనుఁడు. అవయవవర్ణనమును జేయుచు ముక్కుపై మూఁడుపద్యములు, నాస్యముపై నైదుపద్యములు, పదములపైఁ బదిపద్యములు, తొడలపైఁ దొమ్మిదిపద్యములు చెప్పి చదువరులకు విసువు పుట్టించి యుండలేదు."

ప్రవరవర్ణనము:—"అర్ధచంద్రుని తేట నవఘళించు లలాటపట్టిఁ దీర్చిన గంగమట్టితోఁడ" అనుపద్యరాజమునందునఁ గవి శృంగారనాయకుఁ డగువిప్రవర్ణనమును నెట్లు చిత్రించెనో యిదివఱకుఁ జూపితిని. ఆవిప్రునియందముం దెల్పుపద్య మిఁక నొకదాని నిం దుదాహరించెదను:—

సీ. "వదనప్రభూతలావణ్యాంబుసంభూతకమలంబు లన వీనికన్నులొప్పె
నిక్కి సీనులతోఁడ నెక్కసక్కెములాడు కరణినున్నవి వీనిఘనభుజములు
సంకల్పసంభవాస్థానపీఠికవోలె వెడఁదయై కనుపట్టు వీనియురము
ప్రతిఘటించు చిగుళ్లపై నెఱ్ఱవారిన రీతినున్నవి వీనిమృదుపదములు

గీ. నేరెటేటియసల్దెచ్చి నీరజాప్తు, సానఁబట్టిన రాపొడిఁ జల్లి మెదపి
పదను సుధనిడి చేసెనో పద్మభవుఁడు, వీనిఁగాకున్నఁగలదెయీ మేనికాంతి"

ఇందలి యెత్తుగీతమునందు నతిశయోక్తి యతిశయముగానుండినను మొత్తముమీఁద సౌందర్యవర్ణనము సరసముగ నున్నది. ఇట్టి వర్ణనాచాతుర్యము రామరాజభూషణాదులయందుఁ గానరాదు. రామరాజభూషణుండు తనకథా

నాయకుని వర్ణించుచు నలరాజు వలరా జని చెప్పినపద్యము రసహీనముగా నున్నది."

ఔషధసిద్ధవర్ణనము:—సీ. "ముడిచినరయొంటి కెంజడ మూయ మువ్వన్నె మెగముతో లుకిరీటముగధరించి...చేరె దద్దేహ మౌషధసిద్ధుడొకడు."

— । రక్కసుని వర్ణనము । —

సీ. "విసమానములు గాగ వసతోడ బెనవెట్టి నెట్టెంబుగా బ్రేవు జుట్టినాడు ................, ........ఉసుఱు గొన వెంట దిరిగెడు నసురయొకడు"

ఇట్లు వివిధరూపవర్ణనములు చక్కగా గావింపబడినవి.

— । హిమాచలవర్ణనము । —

కవి హిమాచలవర్ణన మీ క్రిందిరీతిగా ప్రారంభించినాడు:—

చ. "అట నని కాంచె భూమిసురు డంబరచుంబిశిరస్సరజ్ఝరీ
పటల............................శీతశైలముఖ్."

ఈపద్యము చాల మనోహరముగా నున్నది. ఇందలి దీర్ఘసమాసము శీతశైలముయొక్క యౌన్నత్యమును జెప్పకయే చెప్పుచున్నది. ఇట్టితావులనే దీర్ఘసమాసము లుండదగినవి."

— । లోయవర్ణనము । —

"లోయవర్ణనము బహుసరసముగా నున్నది. అది చదువునప్పుడు పాఠకులకు హిమవన్నగమునందలి హృదయంగమ మగు లోయలో నున్నట్లే తోచును.

సీ. కులిశధారాహతి పొలుపున బైనుండి యకుగుచూవగ జేగురైనతటుల.
చం. నికటమహీధరాగ్రతట నిర్గతనిర్ఝరధార బూసిలో......
శా. తావుల్ క్రేవల జల్లు చెంగలువ కేదారంబు తీరంబునన్......

ఈవర్ణనము చాల హృద్యముగా నున్నది. ఇట్టియాహ్లానందదాయకము లగు వర్ణనము లనేకములు గలవు. ప్రకృతిని వర్ణించుటలో గవి కున్న నేర్పు వర్ణనాతీతము. కవి యుద్ధసైంధవవర్ణనమును "పచ్చనిహురుముంజిపని వాగెపక్కెర" యనుపద్యములో జక్కగా జేసియున్నాడు.

సూర్యోదయ సూర్యాస్తమయాది వర్ణనములు చేయునప్పుడు కవి చాల ప్రౌఢతను జూపినాడు. కథానుకూలము లగునంశను లావర్ణనములందు ధ్వనించుచుండునట్లు చేసినాడు. ధ్వని కావ్యజీవిత మని మనపెద్దలు చెప్పియుండిరి. అట్టిధ్వనులం గనుడు:—

సీ. "ఏవిహంగముగన్న నెలుఁగించుచును సారెకును సైకతంబుల: గూడఁదారుఁ
దారి కన్గొని యది తనజోడు గాకున్న మెడయెత్తి కలయంగ మింటనరయు
ఇది వరూథిని చర్యనంతను ధ్వనింపఁజేయుచున్నది. కథానుగుణముగా వర్ణనము చేయుటఁ గనుఁడు.

గీ. "అసురవరుఁ డైనయిందీవరాక్షు మేన
నంటుకొన్న స్వరోచిబాణాగ్నిఁబోలె
నంత గనుపట్టె శుకతుండకాంతిఁ దెగడి
సాంధ్యరాగంబు పశ్చిమాచలమునందు."

*　　*　　*　　*　　*

సెలయేటి నీటిధారలచే నభివృద్ధినందుచుండు చిత్రతరోద్యానములో రమ్యతర మగుమందిరమును బెట్టి యందు సుందరీమణి యగునచ్చరలేమను బెట్టి యందలి పూఁదోఁటలో నాపాటలాధరి పాటలఁ బాడుచుండునట్లు చేసి యాతఁడిని బ్రవరుని నచటికిఁ దీసికొనిపోయినాఁడు. చాలసరసముగా నున్నది. వరూధినీపాత్రమును జిత్రించుటలో మనకవి చాల నిపుణుఁడై మెఱసె. ఈతని కవిత్వమున కిదియే కేంద్రస్థానము. మనుచరిత్రములో నీభాగమునే లోకులు విశేషముగాఁ జదువుచుందురు.

శాస్త్రవేత్తృత్వము:—మనుచరిత్రముంబట్టి చూడఁ గవి బహుశాస్త్ర రహస్యముల గ్రహించినట్లు కాన్పించుచున్నది.

మనకవి వైద్యశాస్త్రరహస్యములను గూడఁ దెలిసికొని తనగ్రంథము నందు వానిని సువ్యక్తము చేసినమాట నిజ మని "కాయబాలగ్రహోర్ధ్వాంగక ములు నాల్గు" అనుపద్యము ఋజువు చేయుచున్నది.

పైదానినిబట్టి వైద్యాదిశాస్త్రములు ము న్నెట్టియున్నతస్థితి నంది యుండె డివో యవి యెట్లు కలుపఁబడెడివో బాగుగా బోధపడఁగలదు."

అలంకారములు:—"మనుచరిత్రమునందు నలంకారశోభ చాల కల దు. ఆవిషయమై యంతగా వ్రాయం బనిలేదు. రసజ్ఞులు మెచ్చుకొను స్వభా వోక్త్యలంకారాదులు మెండుగఁ గలవు."

ధర్మములు:—"గృహస్థాదిధర్మములఁ గొన్నిటిని బాగుగా వర్ణించి నాఁడు. గృహస్థధర్మవర్ణనము:—

సీ. "కలఁకుల నున్నతంగెటిజున్ను గృహవేధి యజమానుఁ డంకస్థితార్థవేటి
పండినపెరటికల్పకమువాస్తవ్యుండు దొడ్డిఁబెట్టిన వేల్పుగిడ్డికాఁపు......

గృహస్థాశ్రమముయొక్క ఘనతను గవి యెట్లు వర్ణించినాఁడో కనుఁడు. మనకవి గృహస్థాశ్రమ మెందుల కని చెప్పినాఁడు ? పరోపకారార్థ మని చెప్పినాఁడు. ఈపద్యరాజము చాల రమణీయముగా నున్నది. మఱియు నేమి చెప్పుచున్నాఁడో "వానిది భాగ్యవైభవము" అను పద్యముం గనుఁడు.

ప్రవరగృహిణి యెట్టిదిగా వర్ణింపఁబడినదో చిత్తగింపుఁడు.

గీ. "వండనలయదు వేవురు వచ్చిరేని, నన్నపూర్ణకు నుద్దియౌ నతనిగృహిణి
యతిథు లేవేళ నడికిరేనైన నెట్టి, వలయుభోజ్యంబు లింటన వారిగాఁగ."

రాజధర్మములు: — సూర్యాస్తమయవర్ణన మిమమీఁద రాజధర్మమును గవి యిట్లు "వికసిల్లం బ్రజ" యనుచుం జక్కఁగా వ్యక్తపఱిచినాఁడు.

ప్రభువుయొక్క ప్రధానలక్షణము ప్రజారంజన మని పలుతావులఁ గవి వ్యక్తపఱిచినాఁడు. ఇది క్రొత్తవిషయము కాదు. మనగ్రంథము లన్నియు నట్లే చెప్పుచున్నవి. దానినే మనకవియు వ్యక్తపఱిచినాఁడు. శత్రువులపై శరపరంపర, ప్రజలపైఁ గటాక్షపరంపర వినియోగించువాఁ డెవ్వఁడో వర్ణాశ్రమధర్మ రక్షణము చేయువాఁ డెవ్వఁడో వాఁడు నిక్క మగురా జని మనకవి వ్యక్తపఱిచినాఁడు. సత్ప్రభుపరిపాలనకాల మెట్లుండునో గ్రంథాంతమున నిట్లు సువ్యక్తము కావించినాఁడు.

సీ. "వానలుసరవితో వర్షించె సస్యముల్ వేళ్ళఁగొల్చుగ విజ్రుమీఁగఁ బండె
నారోగ్యపుత్రపౌత్రైశ్వర్యవంతులై బ్రతికిరి నూఱేండ్లు పంచజనులు
పూఁబోఁడులు పతిదేవతలై రగ్నిభయతస్కరవ్యాధిభయము లడఁగె
ఫలపయఃకుసుమాదిబహుపదార్థంబులు రసగంధసామగ్రి నెసకమెసఁగె
గీ. నీత్యుపద్రవమృత్యురాహిత్యయుక్తి, ధర ప్రజావృద్ధి తామరతంపరయ్యె
న్యాయపథమునస్వారోచిషాఖ్యమనువు, శ్రీలఁ బెంపొందిపాలించుకాలమందు."

కృష్ణదేవరాయపరిపాలనము పైరీతి నుండెడిది కాఁబోలు ! ఇట్టి స్తవనీయాంశము లీకవి బాగుగా వ్యక్తపఱిచినాఁడు.

పైదానింబట్టి యీవిమర్శనమునం దనేకవిషయము లెత్తికొని వానిలోఁ బెద్దనాసుకవి ప్రతిభావిశేష మెట్లు ప్రకాశించినదో చక్కఁగఁ జూపఁబడియున్న సంగతి విదితముకాఁగలదు.

ఇది బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారిచేఁ జేయఁబడిన విమర్శనము. ఇందు మనుచరిత్రమునందలి గుణము లనేకము లుద్ఘాటింపఁబడియున్న

వి. ఇట్టి దీనినే బ్రహ్మశ్రీ కేతవరపు వేంకటశాస్త్రిగారు పెద్దనార్యునియందలి ద్వేషముచే వ్రాయఁబడిన విమర్శనమని నిందించిరి. ద్వేషభావ మెవ్వరికిఁ గల దో యాలోచింపవలయును. వేంకటశాస్త్రిగారు విమర్శనములు పక్షపాతరహితములుగ నుండవలె నని తలంచినట్లుగా విమర్శనవిమర్శనములుఁ బక్షపాతరహితములుగా నుండవలె నని గ్రహించుకొనినటులఁ గాన్పింపదు. ఏమన, గుణదోషముల రెండిటిని సువ్యక్తముచేసిన బ్రహ్మయ్యశాస్త్రిగారివిమర్శనము నెత్తికొని యందుఁ జేయఁబడియున్నపై గుణోద్ఘాటనమును కప్పిపెట్టి యం దెన్నఁబడినవి దోషములుమాత్రమే యని లోకమునకుఁ జూపఁజేయఁ బ్రయత్నించిరి. గుణగణనముమాట నెచ్చటను దలఁపరైరి. ఇది యుచితమా ?

—। పెద్దనార్యుని సమర్థించుట. ।—

శ్రీబ్రహ్మయ్యశాస్త్రిగారు మనుచరిత్రమునందలి గుణములఁ గొనియాడుటయే గాక దానిపై నితరులు గావించిన యాక్షేపణములను సాధ్యమగునంతవఱకు ఖండించి పెద్దనార్యుని తమవిమర్శనములో సమర్థించియుండిరి. చూడుఁడు :—

1. "పెద్దన ప్రవరునిఁగూర్చి వర్ణించుటలో మొదట "ఏభూపాలుఁడీ వచ్చినక్ష్మాలగ్రామము మున్నుగాఁగొనఁడు" అని వ్రాసినపిమ్మటఁ గపటవిప్రునిచేఁదద్వృత్తాంతముఁ జెప్పించుటలో "గ్రహణసంక్రమణాదుల రాచనగరఁ గాసువీసంబు వెడలమి గ్రాసమునకు నాధివెట్టిరి క్షేత్రంబులందుఁ గొన్ని" అని పలికించుట పరస్పరవిరుద్ధ మని కొందఱు తలంచుచున్నారు. లోకములో వేషధారులు సందర్భము లన్నియు వివరించుటలోఁ దప్పిపోవుట సహజమే. కాని మనకవి దివ్యజ్ఞానము నొకదానిని దెచ్చి దానిద్వారముగా గంధర్వుఁడు ప్రవరవృత్తాంతమును నెఱిఁగె ననుటచే నిటఁ దేలిపోవుట దివ్యజ్ఞానపాటవంబునకు భంగమును గలిగించుచున్న దందురు. అయినను దివ్యదృష్టివిషయములోఁ గూడ స్థూలదృష్టిచే విశేషము లన్నియు సరిగా గ్రహింపలే రనియు మాఱువేస మెంతటివానినైన నొక్కచోఁ దప్పిపోవునట్లు చేయు ననియు నిది సూచించుచున్నది. కాన దోషము లేదు."

ఈసందర్భమునఁ బరులు దోషారోపణము చేసియుండఁగా నాయారోపణము తప్పని బ్రహ్మయ్యశాస్త్రిగారు పెద్దనార్యునిపక్షమూని వానిని ఖండించిరి గదా ! ద్వేషభావము గలవా రిట్లొనర్తురా ?

2. " పచ్చనిహులురముంజి " అనుపద్యములోఁ బెద్దనార్యుఁ డన్యభాషాపదములఁ బ్రయోగించె నని విమర్శకు లధిక్షేపించుట కలదు. దీనిని సమర్థించుట నిదివఱకే తెలిపియున్నాను. ద్వేషబుద్ధి యట్టిదైయుండునా ? " విమర్శనపద్ధతి " తెలిపినవారి కది యేల బోధముకాదో !

3. పెద్దనను సమర్థించినయంశముల విమర్శనపద్ధతికారులు తెలిసికొనకపోవుటయే కాక యాయంశమునే దోషారోపణకరణముగాఁ గూడ నొనర్ప సాహసించిరి.

గ్రంథచౌర్యము :— విమర్శకులు కొందఱు పెద్దనార్యుఁడు శ్రీనాథాదుల గ్రంథములనుండి చౌర్య మొనరించె నని వ్రాసియుండ నవి గ్రంథచౌర్యములు కావనియు ననుకరణములే యనియు నట్టియనుకరణములను కాళిదాసాదులును గావించి రనియు బ్రహ్మయ్యశాస్త్రిగారీక్రిందరీతిని సమర్థించిరి.

" ఈతనియందు గ్రంథచౌర్యదోష మొకటి మోపఁబడియున్నది. ఈమహాకవి శ్రీనాథుని గ్రంథములనుండి యు, మారనకబ్బమునుండి యుఁ బినవీరన్న పొత్తములనుండి యుఁ గృష్ణదేవరాయని పుస్తకమునుండి యు మఱికొన్ని యితర గ్రంథముల నుండి యుఁ గొంతపదార్థసంగ్రహము చేసినమాట నిజము. తుదకు గోపాలునిరామకవి కవిత్వమునుండి కూడఁ బెద్దనార్యుఁడు పదార్థసంగ్రహణము చేసినట్లు మనవారు వ్రాయుచున్నారు. ఇది చౌర్యమని కొందఱును, గాదని కొందఱును వాదించుచున్నారు. గ్రంథచౌర్యము గాదు కాని పెద్దయనుకరణము. ఇది మనసారస్వతముయొక్క గమనికను దెలుపునది. దీనింగూర్చి కొంత యిచ్చట వ్రాయవలసియున్నది.

మనవాఙ్మయము భాషాంతరీకరణముతోఁ బ్రారంభమైనది. నన్నయాదులీభాషాంతరీకరణమును గావించిరి. ఒక సంస్కృతగ్రంథమును బుచ్చుకొని దానిని దెలుంగులోనికి దింపుచువచ్చిరి. తరువాత ననుకరణము ప్రారంభమైనది. అది పెద్దనాదులనాఁడు కలిగినది. వీరు పూర్వులవలె నొకసంస్కృతగ్రంథమును దీసికొని తెలుఁగులోనికి వరుసగా దింపక యాయాపూర్వకవుల వ్రాతల ననుసరించి తమగ్రంథములఁ బూరించుకొనుచు వచ్చిరి. కొన్నియెడల సందర్భానుసారముగాఁ బూర్వసంస్కృతగ్రంథములలోని శ్లోకములఁ దెనిఁగించి తమ గ్రంథములలోఁ బెట్టుకొనుచు వచ్చిరి. కొన్నియెడలఁ బూర్వపుటాంధ్రకవుల వ్రాతల ననుకరించుచు వచ్చిరి. పెద్దన యిట్టి యనుకరణము చాలఁ జేసినాఁడు.

ఇట్టి యనుకరణములను గాళిదాసాదులును గావించిరి. వాల్మీకిప్రాంతలఁ గాళిదా సనుకరించెను. షేక్సుపియరు నట్లె పూర్వుల ననుకరించెను.

పరికించి చూడ నితరుల గమనికల ననుసరించుటయే కాక పరులపద్యముల నున్నవి యున్నట్లే మనకవి తన గ్రంథమునఁ గొన్నితావుల నెక్కించియున్నాఁ డని కూడఁ జెప్పవలసివచ్చుచున్నది. ఈతఁడు కృష్ణదేవరాయల యాముక్తమాల్యదనుండి పయిరీతి సంగ్రహము చేసినాఁడు. ఇందుల కొకయుదాహరణముం దీసికొందము ;—

సీ. "నీలమేఘముడాలు..............................కౌస్తుభముతోడ."

రాజున కానందము గలుగుటకై యాతనిపద్యములనే స్వీకరించి తన మనుచరిత్రములో వేసికొనియె ననుటయే యుచితము.

పైవాక్యములలో బ్రహ్మయ్యశాస్త్రిగారు పెద్దనార్యుఁ డొనర్చినది కాళిదాసాదులు చేసినట్టి యనుకరణము గాని గ్రంథచౌర్యము గా దని నొక్కిచెప్పియున్నారు. చౌర్యము కాదు. అనుకరణము అని వ్రాసిరి. లోకులు దీనిని గ్రంథచౌర్య మనుచుండఁగా నిది చౌర్యము కా దని బ్రహ్మయ్యగారు పెద్దన పక్షమున నిలిచి వాదించినవారగుచున్నారు గాని యామహాకవియందు, చౌర్యదోషారోపణము గావించినవా రగుచున్నారా ? అట్లెంచవలసినదా ? ఎవరైన, పెద్దనార్యునియందు చౌర్యారోపణము చేసినవా రున్నారా యందురేని పలువురు కలరు. గ్రంథవిస్తరభీతిచే నొక్క చిన్నియుదాహరణము.

"గీ. మారనకథావిధానముఁ జూఅలాడి,కోరి శ్రీనాథు తెరువులఁ గొల్లఁగొట్టి,
కొఅంతఁబసు నని కుకవిని గొసరిపెట్టి,పెద్దనయొనర్చినట్టితప్పిదమునిదియె."

ఇట్లు పెద్దనను లోకము నిందించుచుండ దాని నుండి యాకవిని దప్పించుటకై బ్రహ్మయ్యశాస్త్రిగారు పైవిధమున నొనర్చినప్రయత్నము నంతను మన వేంకటశాస్త్రిగారు విపరీతార్థముపాల్సేసి యెవఁడైన తానెవని సొత్తు దొంగిలించెనో వానికే దానిని సమర్పించునా యని గేలిసేసిరి. ఇది వేంకటశాస్త్రిగారికిఁ దగదు. బ్రహ్మయ్యగారు పెద్దనది చౌర్యమని నిర్ణయింతురేని తా మట్లు పరిహాసించిన భాగుండును. రాయలవారి పద్యమును పెద్దనార్యుఁడు తద్గౌరవబుద్ధితోఁ దనపొత్తమునఁ జేర్చికొన్నట్లు బ్రహ్మయ్యశాస్త్రిగారు స్పష్టముగా వ్రాసిరి. అది సరికాదనునెడ 'నీలమేఘముడాలు' అనుపద్యమును బెద్దనార్యుని గ్రంథముచుండి రాయలు హరించె ననఁగలరా ? ఎంత నీచప్రభుఁడైనఁ దనసభాస్థలి

యందు బహిరంగముగా నుంచఁబడిన పరులకోశమునుండి చౌర్యముసేయుట కు సాహసింపఁజాలరుగదా! రాయలంతటివాఁ డట్టిపని నొనర్చె ననుట పొసఁగునా? పెద్దనయందలి గౌరవముచే రాయ లాపద్యమును దీసికొనె నన్నను ననవచ్చును. కాని, పెద్దనార్యుఁడు చేసినది చౌర్యము కాదనియుఁ దొలుత టికవులు సలిపినరీతి యనుసరణ మనియు మాత్రమే బ్రహ్మయ్యశాస్త్రిగారు వ్రాసియుండఁగా వారు చౌర్యారోపణముగావించినట్లు గా లోకమునకుఁ దట్టఁ జేయ యత్నించుట పద్ధతికారులకుఁ బాడిగాదు. అదిగాక వారు సమయము వచ్చినపుడెల్లను బెద్దనార్యుని కవితాప్రతిభను గొండాడుచున్నట్టులు వారు వ్రాసిన "పెద్దనవలె నేఁడు పెరులోయతోఁటలో నింపారు వనితఁ జిత్రింపఁగల మె" అను మొదలగు పద్యమువలనఁ దెల్ల మగుచునే యున్నది. బ్రహ్మయ్య శాస్త్రిగారు ప్రయోగించిన అనుకరణ, అనుసరణ శబ్దములే పనికిరా వనియు నట్లు చెప్పుటే చౌర్యమను టగుననియు వీరెంతురా, పెద్దనయందు తామును చౌర్యదోష మాపాదించినవా రగుదురు.

ఏమన, పెద్దన శ్రీనాథుననుసరించి నట్టుగా తమ శృంగారనైషధోపోద్ఘాతములో మన కేతవరపు వేంకటశాస్త్రిగారే యిట్లు వ్రాసిరి:—

"పెద్దనాదికవు లితని కవితాధోరణి ననుసరించినట్లు పూర్వకవుల నను సరించినట్టు కనుపట్టును."

తుదకుఁ దమవిమర్శనపద్ధతింబట్టి తామే నిందార్హు లగుచున్నా రనవల సివచ్చుచున్నది. ఏమన, తాముచేసినపనినే బ్రహ్మయ్యశాస్త్రిగారును చేసి యున్నను, దానిని తప్పని తెగడఁదొడఁగిరి. పక్షపాతబుద్ధి వహించి లేనిదోషముల నారోపింప మొద లిడిరి. బ్రహ్మయ్యశాస్త్రిగారు పెద్దనదోషము లని కొన్నిటి నుద్ఘాటింపలేదా యందురేని యుద్ఘాటించిరి. అయూహలను విపుల ముగాఁ దమకుఁ దోఁచినన్నిటిని వెల్లడించిరి. గుణదోషముల రెండిటిని జూపు పని గదా విమర్శకునిది. గుణముల విడిచి దోషముల నెన్నుటట్లు పక్షపాతమో దోషములను విడిచి గుణములను మాత్రమే గణించుటయుఁ బక్షపాతమే యనిపించుకొనదా? కాననే యట్లు ధారాళముగాఁ దమయభిప్రాయము లెల్ల వెలువరించి రని తెలియనగుచున్నది.



# గ్రంథస్వీకారము.

## 1. సాహిత్యమీమాంస.

ఇది రాజమహేంద్రవరములో స్థాపింపఁబడిన "అభినవాంధ్రగ్రంథమాల"లో వెలువడిన విమర్శగుచ్ఛము మొదటిసుమము. మొదట శ్రీయుత పూర్ణచంద్రవసుగారిచే "సాహిత్యచింత" యనుపేర వంగభాషలో వ్రాయఁబడిన దానిని శ్రీమాన్ కావ్యతీర్థ పండితరామదహీనమిశ్రగారు హిందీభాషలోనికిఁ గొంత కుదించి మఱికొంత పెంచియు వ్రాసిరి. దానిని శ్రీయుత శ్రీపాద కామేశ్వరరావుగారు తెనిఁగించిరి. వీరు కొంత పెంచిరి. ముగ్గురు పండితులు పనిబూని విశేషములఁ గూర్చి వ్రాసిన యీసాహిత్యమీమాంస సాహిత్యాభిలాషులు చదువఁ దగి యున్నది. ఇందేడు ప్రకరణములు గలవు. ఉపోద్ఘాతము. 1. సాహిత్యాదర్శము, 2. సాహిత్యమున రక్తపాతము, 3. సాహిత్యమున దివ్యప్రేమ, 4. సాహిత్యమున పాశవప్రేమ, 5. సాహిత్యమున మానవప్రేమ, 6. సాహిత్యమున వీరత్వము, 7. సాహిత్యమున దేవత్వము ననునవి. ఈ యభినవాంధ్రగ్రంథమాలయొక్క యుద్దేశము మంచిది. ఇందుత్తరాయణమున మూఁడుగ్రంథములు దక్షిణాయనమున మూఁడుగ్రంథములును వివిధభాషలలోనుండి తెనిఁగించి ప్రకటింపఁ దలఁచినారు. ఆయాసాహిత్యవిషయముల నిందాంగ్లగ్రంథములయందలి విషయములతోఁ బోల్చి చూపఁబడుచున్నవి. ఉభయభాషలయందుఁ బ్రవేశముగలవారికి మఱికొంత యుత్సాహజనక మగుచున్నది. చందా సంవత్సరమునకు రు 6-0-0.

## 2. నాటకవిమర్శ.

ఇదియునుఁ బైయభినవాంధ్రగ్రంథమాలలో వెలువడినదియే. రెండవ సుమము. ద్విజేంద్రలాలుగారి మూలమునకు బ్ర॥ శ్రీపాద కామేశ్వరరావుగారి యాంధ్రీకరణము. పీఠికలో వివరింపఁబడిన మాటలు కొన్ని యిచటఁ జూపిన నీగ్రంథముయొక్క యుపయోగము దెలియవచ్చు నని వివరించుచున్నారము.

''ఈవిమర్శకు సంస్కృతమున అలంకారశాస్త్ర మని పేరు. దీని నభ్యసించేవారిసంఖ్య ప్రస్తుతమున చాలాతక్కువ......నాటకాంతం హి సాహిత్యమ్ అనేవాక్యమువల్ల నాటకరచన సాహిత్యమున కుత్కృష్టఫల మని తేలినది. కాబట్టి నాటకవిమర్శకూడా విమర్శకళకు చరమసీమ......సంస్కృతవాఙ్మయ

మెరిగినవారికి అభిజ్ఞానశాకుంతలము ఉత్తరరామచరితమున్నూ సుపరిచితము లైనా ఆనాటకములగొప్ప ఏమని ప్రశ్నిస్తే పండితు లందలి కవిత్వ ముత్తమ మనీ భావములు హృద్యము లనీ చెప్పుదురు......నాటకము నాడెము నెంచేట ప్పు డేయే విషయములు పరీక్షించవలె నని వారినడిగితే దశరూపకము ప్ర తాపరుద్రీయము చదువు మందురు......ఆంగ్లేయనాటకములపై విమర్శ విపు లముగా సలుపబడినది నట్టపరీక్ష నిచ్చినవారందరూ అవిచదివితీరవలెను. ఇట్టి వారు సంస్కృతవిమర్శనియమములనెరిగి రెండింటికీ కల తారతమ్యము తెలు గుననిరూపించ యత్నించకపోవడ మతిశోచనీయము......ఆంధ్రభాషాభ్యాస కులకు విమర్శనియమము లన్నీ తెలియవు. ఏమి ప్రారబ్ధమో కాని ఆంగ్లవిద్య నభ్యసించినవారిలో చాలామందికి తెలుగుపుస్తకములు చదువడమంటే తల నొప్పి ఆంధ్రపండితులు వీటిని అసలే చదువరు......కావున మంచిగ్రంథములు తగినన్ని ప్రచురింపబడలేదు." కాఁబట్టి యీలోపమును గొంతవరకు సవరిం చవలెనని వ్రాయుచున్న వీరియుద్యమము కొనియాడఁదగినది. దీనివెల మేలు ప్రతి రు 2-8-0. సాదా ప్రతి రు 2-0-0.

"ఈగ్రంథమున కొన్ని వ్యావహారిక పదములు యథేచ్ఛముగా వాడి నాము. అవి సత్త్వవులు వాడినవి కావున ప్రయోగార్హము లని అచిరకాల మున రుజువుకాగలదు." అని సాహిత్యమీమాంసలో వ్రాసినారు. ఏసత్త్వవులు వాడినవో అచిరకాల మెప్పుడు వచ్చునో తెలిసికొనుట ముఖ్యము.

3. వసురాయచాటుప్రబంధము.

ఇది రాజమహేంద్రవరములో నున్న విఖ్యాతపండితు లగు బ్ర॥ వడ్డా ది సుబ్బారాయకవిగారిచే సుమా రొకయర్ధశతాబ్దమునుండి యప్పుడపుడు వివిధప్రస్తావముల రచించుచువచ్చినట్టివి...బహుజనులకుఁ గంఠస్థము లైనట్టివి యు సహస్రాధిక మైనపద్యములుగల యొకకోశము. ఇందు 1 ప్రశంసాప్రకర ణము 2 ప్రకృతిప్రకరణము 3 ప్రాస్తావికప్రకరణము 4 ప్రకీర్ణప్రకరణము 5 స్వవిషయప్రకరణమును గలవు. ఈయైదుప్రకరణములను సించుమించునూఱు విషయములంగూర్చిన పద్యము లున్నవి. మచ్చునకుఁ గొన్నిపద్యములు:—

మ. సరసాగ్రేసర ! రామచం॥ సబురిజస్ట్రార్ రామలింగేశ్వరా !
పురబాహ్యంబున గున్న నేరెడులు సీపోల్చిన్ సదా నమ్రతం
బరమాతిథ్యము సత్ఫలాదులనిడుం బాంధాళికిం జేరరా;
గురులో, శిష్యులొ, నీకు నవ్వి తెలియం గోరెదా వ. సుం. జానతీ.

ఉ. ఈయసమానసౌరభము నెవ్వఁడొసంగెనొ నీకు వాఁడయో
పోయక పోయె నేమి యొకొ పూర్ణశమం బగునట్టియాయు వా
హా యెఱుఁగంగనయ్యె; భవదల్పతమప్రణయంబె లోకముం
బాయఁగరాని నెవ్వగల పాల్పఱుచుం జిర మేల మల్లికా.

శా. నూయీ ! నేజయనామకాబ్దమున నిన్నుం ద్రవ్వఁగాఁ బూని తెం
కాయల్ గొట్టితి వానితోయము లెతత్కాలప్రభావంబుచే
నా యెం గావలె నక్షయంబు లిట నీయందుం ద్వదర్థంబు రూ
పాయల్ సూర్వ్యయపెట్ట నీవమృతకుంభం బైతి మాపాలికిన్.

304 పుటలుగల యీపుస్తకము వెల రు 1-8-0. ఇదిగాక వీరు మొదటినుండి రచించిన వేణీసంహారాదులగు 21 గ్రంథములు వీరియొద్ద విక్రయమునకు దొరకును. గ్రంథములపట్టిక అణాబిళ్ల పంపి తెప్పించుకొనవచ్చును.

(4) శ్రీమద్యోగానందాంధ్రరామాయణము.

తూర్పుగోదావరిజిల్లా రాజోలు బోర్డుహైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయులు, మధ్వశ్రీ చిల్లరిగి యోగానందయ్యపంతులుగారిచే రచియింపఁబడినది. ప్రథమసంపుటము బాలాయోధ్యాకాండములు. ఇం దెచ్చుతక్కువగ 2700 పద్యములున్నవి. కవిగారికిఁ గలభక్త్యతిశయముచే రామచరితము స్వకపోలకల్పనమున బహుశ్రమపడి రచియించినారు. వారిచేతిలోని పని వారు కావించిరి. ప్రకటించుట రామభక్తు లగునాంధ్రజనులలో నున్నది. శ్రీరామప్రసాదమునఁ గొందఱు మహాత్ములకుఁ బుట్టినసద్బుద్ధివలన నీభాగము బైటఁబడినది. తక్కినవి పడనున్నవి. ఈరామకథ నెందఱుకవు లెన్నివిధముల రచించిన భక్తపాళికిఁ జదువుట కంత యానందము గల్గుచుండును. కావునఁ బదింబదిగఁ గవిగారి కన్నివిధములఁ బ్రోత్సాహము గావింపఁ గోరుచున్నారము. నిర్దుష్టములు మృదుపదభూయిష్ఠములు నగుచక్కనిపద్యములు, కథలోఁ గల్పనలు మనోహరముగా నున్నవి. కొన్నిపద్యములువినుఁడు.

ఉ. మేరువునేని దోఁకమూఁడి మీటఁగలాఱు వనాటతల్లజుల్
వారిధి నొక్క హజ్జన జవంబున దాఁటఁగలార లుద్ధతిన్
ధారణి నింగినిం గలిపి తాళము వేయఁగలార లుగ్రతన్
గోరికఁ గామరూపు లఁబు క్రస్ఫురశక్తి గలార లెయ్యెడన్ — బాల- 374

మ. దితి మేల్కాంచిన వజ్రపాణి యెటులై దీవ్యత్క్షపాంభోనిధీ
నతియన్న న్నభయస్థ మామె యిడి యన్నా దేవతానాథ నా

వ్రతభంగ మ్మొనరించితే యవ్వను దుర్మాలిన్యనై యుండుటన్
హితబుద్ధిం దగు శిక్షఁ జేసితివి నే నింకేల చింతిల్లుటల్ — బాల- 781

చ. ఎవరికి నెట్టిశిక్ష విధియింపు మటందువొ యట్లొనర్తుఁ గా
కెవరికి నెట్టికోర్కి వెలయింపు మటందువొ దానిఁ గూర్తుఁ గా
కవమతి సేన చేయునెడ నన్మవిధిన్ క్షమియింప వేఁడుదున్
భవదనురక్తి దీర్చుటకుఁ బ్రాణములు న్విడుదు న్నిజమ్ముగా — అయో- 259

ఈసంపుటము వెల రు 5.

(5) ఐరావతి — ప్రతిబుధవారమును శనివారమును రంగూనునుండి మ. శ్రీ. వి. వి. రెడ్డిగారివలనఁ బ్రకటింపఁబడుచున్నది. ఇతరదేశములం దుండియు నాంధ్రులు స్వభాషాభిమానమును బోషించుకొనుటకై చేయు నట్టియుద్యమమున కాంధ్రదేశస్థు లెల్లరుఁ బ్రోత్సాహము చేయవలయును. ఇందు విశేషముగా బర్మాదేశవృత్తాంతములు మనకుఁ దెల్పఁబడుచున్నవి, చందా సంవత్సరమునకుఁ బోష్టుకర్చులతోఁ గూడ రు 6-8-0. కావలసినవారు రంగూన్ 37-37 వ వీధిలోనున్న పత్రికాధిపులకు వ్రాయవలెను.

(6) వచనాంధ్రకాదంబరి: — (ఉత్తరభాగము.) ఇది కీ॥ శే॥ సత్యవోలు సోమసుందరకవిగారిచే నాంధ్రీకరింపఁబడినది. సకలానందగ్రంథమాలికలో 7 వ పుష్పముగాఁ బ్రకటింపఁబడినది. ఈకవిగారింతకుఁబూర్వ మనేకగ్రంథములు రచియించియుండిరి. దీనిపూర్వభాగమునుగూడఁ దెనిఁగించిరి. భాషాంతరీకరణము మూలమునకు సరిగానుండును. తెనిఁగింపు భాషకుఁ దగినట్లున్నది. శైలి మనోహరముగానున్నది. 250 ప్రతులే ముద్రించినట్లు ముఖపత్రము తెల్పుచున్నది. పాఠకులాలస్యముచేసినఁ బ్రతులు దొరకకపోవచ్చును. వెల రు 1-0-0. ఈగ్రంథము కవిగారి కుమారుఁడగు సత్యవోలు రాధామాధవరావుగారియొద్దఁ గాకినాడలో దొరకును.



# ద్రావిడభాషాతత్త్వవిమర్శనము.

(ధా తు వు లు.)

—: కోరాడ రామకృష్ణయ్యగారు ఎం. ఏ :—



"శ్రీలక్ష్మీరమణం నౌమి గౌరీరమణరూపిణమ్
స్ఫోటరూపం యత స్సర్వం జగదేత ద్వివర్తతే"

భిన్నము లగు వస్తువులం దభేదమును జూపుటయే తత్త్వనిర్ణయము నకు మార్గము. శాస్త్రము లెల్లపుడు భేదమునం దభేదమును జూపుటకే యత్నించుచుండును. లోకమున భిన్నములై పరిదృశ్యమానము లగుబాహ్య ప్రపంచవస్తువులయం దభేదబుద్ధి గలిగి, వానియం దాత్మస్వరూపమును గాంచఁగలుగుటయే పరమపురుషార్థముగ నెన్నఁబడుచున్నది గదా! సమస్తశాస్త్ర ములయొక్కయు ముఖ్యలక్షణం బిది యై కన్పట్టువానికన్నిటి కిది యె పరమ ప్రాప్యంబు. రసాయనశాస్త్రమును దీసికొందము. ప్రాపంచికస్థూలవస్తువు లన్నియుఁ గొన్నిమూలవస్తువుల సంయోగముచే నేర్పడిన వనియు, "సంయోగా విప్రయోగాంతాః" అన్నట్లు సంయోగముచే నేర్పడినవస్తువులు మరల వియో గమును బొంది మూలవస్తువులుగా మాఱుట సహజమే, కావున, నేవస్తువు లేయేమూలవస్తువులసంయోగముచే నేర్పడినవో కనుఁగొని, యామూలవస్తు వులయొక్క నైజస్వభావమును దత్త్వమును గనిపెట్టుటయే రాసాయనికశాస్త్ర ముయొక్క పరమలక్షణ మై యున్నది. ఇంతవఱకు సుమారు తొంబదియాఱు మూలవస్తువులు (Elements) కల వనియు నావస్తువులయొక్క సమ్మేళనమే యీ ప్రపంచమునందలి బాహ్యవస్తువుల కన్నిటికిఁ గారణ మనియు నాశాస్త్ర ము చెప్పుచున్నది. కాని యీశాస్త్రముయొక్క పరమలక్షణ మింకను బ్రాప్తము కాలేదు. దానికొఱకై యింకను ననవరతోద్యోగము సలుపఁబడుచున్నది. అణువులు పరమాణువులై- ప్రస్తుతము "ఎలెక్ట్రాన్స్" Electrons లోనికి దిగినవి. ఏవస్తువును-డి తక్కినమూలవస్తువు లని యిప్పుడు తలంపఁబడునవి యేర్పడియుండునో- ఆపరమమూలవస్తువు- ఆమూలప్రకృతి కనిపెట్టఁబడిన చో, నీరసాయనశాస్త్రముయొక్క పరమలక్ష్యము సిద్ధించిన దగును. ఇట్లే (Physics) పదార్థవిజ్ఞానశాస్త్ర మనఁబడునది పదార్థముల స్వరూపము యొక్కయు, వానియందు లీనమైయున్న యంతశ్శక్తులయొక్కయు మూలతత్త్వ

మును గనిపెట్టుటకై యత్నించుచున్నది. ఆయాదిశక్తుల (Energy) స్వరూప పరిణామములను గ్రహించి యవి యేమూలశక్తినుండి బయలుదేఱినవో నిశ్చయింపఁగలిగినచో నీశాస్త్రముయొక్క లక్ష్యము సిద్ధించినట్లే. జీవశాస్త్రము (Biology) జీవతత్త్వమును దెలిసికొనుటకై యత్నించుచు, ప్రపంచమునందలి జీవరాసులలోఁ గలభేదములను సాదృశ్యములను విమర్శించి, జీవపరిణామ సూత్రములను గనిపెట్ట యత్నించుచున్నది. సాక్షాచ్చైతన్యము నగపఱుచు వానపురుగు మొదలుకొని యుత్తమపురుషునివఱకుఁ గలజంగమములందే గాక స్థావరములలోఁ జేరినవిగాఁ దలంపఁబడు వృక్షలతాదులు గూడ జీవసహితములే యనియుఁ దక్కిన జంగమములందువలె వానియందును జీవచైతన్యము పరిస్ఫుటంబై యున్న దనియు శాస్త్రప్రయోగపద్ధతిని గనిపెట్టఁబడుచుండుటచే, నిప్పటికి జీవశాస్త్ర మొకముందంజ వేసిన దైన దని చెప్పవచ్చును.

“చేతనంబులనే గాదచేతనముల, జీవకలఁజూపి బ్రహ్మాండసృష్టి యెల్లఁ
బరమపురుషుని ప్రతిబింబభావ మగుటఁ, జాటుచుండెఁ జగదీంద్రచంద్రబోసు”

ఇఁక ముందు వృక్షలతాదులందువలెనే, వానికంటె స్థావరతరము లని తలంపఁబడు పర్వతపాషాణాదులయందుఁగూడ సూక్ష్మచైతన్యము కల దనియు స్థావరజంగమాత్మక మగునీప్రపంచము నంతను సూక్ష్మస్థూలరూపముల నావరించియున్న దంతయు నావిశ్వచైతన్యరూపమే యనియు, నీజీవశాస్త్రము కనిపెట్టఁగల్గినచో “ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్” అని చెప్పిన ప్రాచీనమహర్షుల యుపనిషద్విజ్ఞానము ప్రయోగమూలమున సార్థకము గాఁగలదు. అదియే జీవశాస్త్రముయొక్క పరమప్రాప్యము.

ఇట్లు ప్రకృతిశాస్త్రముల ప్రయోగపద్ధతిని (Experimental method) ప్రకృతియొక్క మూలస్వరూపమును, లేదా, మూలప్రకృతియొక్క నిజస్వరూపమును, తెలిసికొనుటకుఁ బ్రయత్నములు సలుపుచుండ, ప్రపంచమునఁ దలి మతములు, అనుభవపద్ధతి నా ప్రకృతిపురుషులకుఁ గలసంబంధమును గూర్చియు, వానితోఁ దమకుఁ గలసంబంధమును గూర్చియు, విమర్శించుచు విశ్వచైతన్యమును (Universal Consciousness) ప్రతివ్యక్తియుఁ దనయందు సాక్షాత్కరింపఁజేసికొనుటకుఁ దగినసాధనముల నారయుచున్నవి. ఇఁక సంగీతశాస్త్రము భిన్నము లగుస్వరములసమ్మేళనముమూలమున నాదబ్రహ్మస్వరూపమును దెల్పి, తదనుభవమువలనఁ గలుగు నానందము మూలముగా బ్రహ్మానం

దానుభవము నించుక చవిఁ గొలుపుచున్నది. శబ్దశాస్త్ర మన్ననో సుశబ్దాప శబ్దజ్ఞానమూలమున శబ్దస్వరూప మగుస్ఫోటబ్రహ్మతో సాయుజ్యమును గలుగఁజేయ యత్నించుచున్నది. ఈవిషయమునె-

"సక్తుమివ తితఉనా పునంతో, యత్ర ధీరా మనసా వాచ మక్రత

అత్రాసఖా యస్స ఖ్యానిజానతే, భద్రైషాం లక్ష్మీర్నిహితాధివాచి."

అని శ్రుతి తేటపఱిచినది.

ధీరులైన యేశబ్దశాస్త్రవేత్తలు జల్లెడచేఁ బిండిని జల్లించినట్లు, తమ మనస్సులచే లేక బుద్ధిచే నపశబ్దములనుండి సుశబ్దములను వేఱుపఱిచి, శబ్దతత్త్వమును దెలిసికొనుచున్నారో యట్టిపండితులు శబ్దరూపబ్రహ్మతో సాయుజ్యమును బొందుచున్నారు. వీరివాక్కునందు శుభప్రకురా లగుశబ్దలక్ష్మి నివసించియుండును, అని దీనితాత్పర్యంబై యున్నది. అనఁగా సుశబ్దాపశబ్దవివేచనము, తజ్జ్ఞానపూర్వకప్రయోగము నివియే శబ్దబ్రహ్మతోడి సాయుజ్యమునకు సహాయకారు లని తెలియుచున్నది. ఈవిషయమునే "ఏక శ్శబ్దస్సుప్రయుక్త స్సమ్యజ్ఞాతః స్వర్గే లోకే కామధు గ్భవతి" అనుశ్రుతికూడ ననువదించుచున్నయది. ఇది శాస్త్రపూర్వకముగా నర్థజ్ఞానపూర్వకము నగుశబ్దప్రయోగమును సాధించుటకుఁగాఁ జేయఁబడినధర్మనియమము, "లోకతః అర్థప్రయుక్తే శబ్దప్రయోగే శాస్త్రేణ ధర్మనియమః క్రియతే" అని భాష్యకారుఁడు పతంజలి చెప్పినారు. శబ్దప్రయోగము శాస్త్రపూర్వకము గాని యర్థజ్ఞానపూర్వకము గాని కాకున్నచో-అనఁగా- లోకమున సర్వాంగీకారము- లేదా పలువురయంగీకారమూ నైనను బడయునిచో నాశబ్ద మితరుల కంగీకారము కాకుండును. భాష కనవస్థ వాటిల్లును. కావుననే ప్రతిభాషకు నేకాలమందైనను సర్వజనాంగీకారముఁ బడసిన ప్రామాణికస్వరూప మొకటి (Standard Form) యుండి యుండును. ఉండక తప్పదు. మనచే గుర్తింపఁ బడకున్నను అనుక్షణము మాఱిపోవుచుండుటచే భాష కనవస్థ రాకుండఁ గొంతకాలమువఱ కైనను నొకకాలమందలి దాని ప్రామాణికస్వరూపమును నిలువఁబెట్టు నుద్దేశముతోడ నే యీధర్మనియమము చేయఁబడినట్లు తలంపఁదగి యున్నది. ఇదియే ధర్మనియమముయొక్క ప్రయోజనము. కాని, యీప్రామాణికరూప మెల్లపుడు నిలుచునది కాదు. ఒకకాలమున నేర్పడిన యీప్రామాణికమును(Standard)ఏమాత్ర మతిక్రమించినను, అట్ల

తిక్రమించిన రూపము లా వెనుకటిప్రమాణమును బట్టి చూచినచో నపశబ్దము లగుచుండును. జీవజంతువులకు వలెనే జీవద్భాషలకును మార్పు సహజమగుటచే శబ్దములరూపము లెల్లపుడు మార్పునకు లోనగుచునే యుండును, గావున, నొకకాలమున సుశబ్ద మని యంగీకరింపఁబడిన దాని కాకాలముననే భిన్నదేశముల భిన్నరూపములు గలుగుచుండుటయు నీరూపములు సామాన్య వ్యవహారమున నర్థబోధ కలవై యుండినను శిష్టజనాంగీకారము సర్వజనాదరణము వాఙ్మయావలంబనమును బడసినఁగాని ప్రామాణికరూపములుగా గ్రహింపఁబడవు; గావున నట్టివి యట్టిప్రామాణ్యమును బొందువఱకుఁ గలయీమధ్యకాలములోనివి యపశబ్దము లని యపభ్రంశము లని వ్యవహరింపఁబడుచుండుటయుఁ దటస్థించుచుండును. అత్తవలనిపోట్లుఁదినకోడలును మఱికొంతకాలమునకుఁ దాను నత్తయై సర్వాధికారిణియు నెఱపునట్లే, యొకకాలమున నపభ్రంశములుగాఁ బరిగణింపఁబడిన పదములే మఱికొంతకాలమునకుఁ బ్రామాణికత్వమును బడసి సుశబ్దములై స్వర్గలోకమున కామధుక్కులే యగుచుండును. దీనినిబట్టి సుశబ్దాపశబ్దముల స్వరూపనిర్ణయమునందు కాలమునకుఁగూడ గొంతప్రాధాన్య మున్న ట్లగపడుచున్నది. "సర్వాధారః కాలః" అనునట్లు సర్వమునకు నాధారము కాలము. కాలమే మంచివస్తువును జెడ్డదిగను జెడ్డవస్తువును మంచిదిగాను, ఒకవస్తువునే యొకమాఱు మంచిదిగను మఱియొకమాఱు చెడ్డదిగను జేయుచున్నది గదా! కావునఁ దక్కినప్రాపంచికవస్తుజాలము విషయమునవలె, నీశబ్దజాలము విషయమునఁగూడ మంచిచెడ్డలను నిర్ణయించుటలోఁ గాలమే ముఖ్యసాధన మగుచున్నదని తలంపఁదగి యున్నది. బాహ్యప్రపంచమునందలి ప్రతివస్తువునందు నీశ్వరచైతన్యమును నీశ్వరస్వరూపమును గాంచఁగలిగిన వానికి మంచిచెడ్డలభేద మేమియు లేక యది యేకరూపముగా నెట్లు భాసించుచుండునో, అట్లే శబ్దజాల మంతయు స్ఫోటబ్రహ్మస్వరూపమే యని తలంచినవానికిఁ దాత్కాలిక మగుసుశబ్దాపశబ్దవిభాగము కాల్పనికమే గాని వాస్తవము గా దనువిషయము పొడకట్టకమానదు. కావున, కేవల మొక కాలమం దొకభాషలోని శబ్దములసాధుత్వాసాధుత్వజ్ఞానమే గాక శబ్దార్థములఁ గూర్చిన తత్త్వజ్ఞానముగలవారే, అనఁగా శబ్దార్థములసంబంధము నిత్య మనియు నీశబ్దార్థములు రెండు నాయనాదిబ్రహ్మాయొక్క భిన్నస్వరూపములె యనియు నిశ్చయజ్ఞానము కలవారే యాశబ్దబ్రహ్మతోడి సాయుజ్యమును బొందు

దురు. అని చెప్పుటయే "అత్రాసభా య స్సభ్యాని జానతే" అనుదాని కర్థము గాఁ దెలిసికొనఁదగియున్నది. శబ్దార్థము లొకవస్తువుయొక్క భిన్నస్వరూపము లే యనువిషయము-

"అనాదినిధనం బ్రహ్మ శబ్దతత్త్వం ప్రచక్షతే
వివర్తతేఽర్థభావేన ప్రక్రియాజగతో యతః."

అనువాక్యమువలనఁ గూడ వ్యక్తమగుచున్నది లోకమున, పేరు లేని, అనఁగా శబ్దముచేఁ జెప్పఁదగని వస్తువు లేదు. అర్థప్రతిపాదకముగాని, అనఁగా నొకయర్థమును సూచింపనిశబ్దమును లేదు. శబ్దమునకును, శబ్దమనిపించుకొనుదాని కెల్లను, అర్థమును ప్రతియర్థమును జెప్పుట కొకశబ్దము నుండకతీరదు. ప్రతిశబ్దము నొకయర్థమును జెప్పును. ప్రతియర్థము నొకశబ్దముచేఁ జెప్పఁబడును. మనకుఁ గనఁబడువస్తువు లన్నియు నీశ్వరస్వరూపములే యైనవు డా వస్తువులను జెప్పెడిశబ్దము లన్నియుం గూడ నాయీశ్వరస్వరూపములే కావలయును. ఇట్లు శబ్దార్థములు రెండును గూడ ననాదినిధనుం డగు పరమపురుషునియొక్క భిన్నరూపములే యగుచున్నవి. ప్రాపంచికార్థము లన్నియు విరాట్పురుషునందు లీనమైనట్లే తద్వాచకములు శబ్దము లన్నియు శబ్దబ్రహ్మయందు లీనమగుచున్నవి. కావుననే వాగర్థముల కభేదమును, ఏకత్వమును గూడ సిద్ధించుచున్నది. కావుననే మహాకవి కాళిదాసు పార్వతీపరమేశ్వరులకు-లేదా ప్రకృతిపురుషులకు గలసంబంధము వాగర్థములకు గలసంబంధమువంటిదేయని తెలుపుచు, ఆదిని సంకల్పరూప మగుపరబ్రహ్మసృష్టివంటిదే కవిబ్రహ్మయగు తనవాగ్రూపసృష్టియు నని సూచించువాడువలెనే గ్రంథాదిని-

"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతఃపితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ."

అని యాపురాణదంపతుల సంబంధస్వరూపమును స్మరించియున్నాఁడు. ఇట్లు శబ్దశాస్త్రమును భిన్నము లగుశబ్దములకును భాషలకును గూడ నేకత్వమును సాధించుటకే యత్నించుచున్నదానివలె నున్నది.

మొట్టమొదట నేకమై నియమభిన్నమైన శబ్దబ్రహ్మరూప మగువాక్కు, అఖండమై యుండఁగాఁ గాలక్రమమున నీయఖండవాక్కు భేదమును బొంది, ఖండములై వ్యాకృతమైనట్లు ఋగ్వేద మిట్లు చెప్పుచున్నది.

"వాగ్వై పరాచీ అవ్యాకృతా అవదత్ తే దేవా ఇంద్ర మబ్రువన్.

ఇమాం నో వాచం వ్యాకురు తాం ఇంద్రో మధ్యతోవక్రమ్య వ్యాకరోత్. తస్మా దియం వ్యాకృతా వాగుద్యతా॥ దీనికే శాయనాచార్యులిట్లు వ్యాఖ్య చెప్పినాఁడు. "అగ్నిమీళే ఇత్యాది వాక్ పూర్వస్మిన్ కాలే పరాచీ, సముద్రాది ధ్వనివ దేకాత్మికా సతీ (అవ్యాకృతా) ప్రకృతిఃప్రత్యయఃపదంవాక్యం ఇత్యాది విభాగరహితా ఆసీత్ తాం వాచం (మధ్యేవక్రమ్య) ప్రకృత్యాదిరూపేణ విభజ్య (వ్యాకరోత్) ఇతి॥ ఏవంచ అసత్యారుంధతీదర్శనేన సత్యారుంధతీదర్శనవత్ పంచకోశాదిన్యత్వాదనన్యాయేన మిథ్యావస్తుపరిహారేణ అఖండసచ్చిదానంద ప్రతిబోధనవచ్చ, అసత్యభూత ప్రకృతిప్రత్యయార్థనిరూపణేన సత్యభూతాఖండవాక్యార్థబోధనం వ్యాకరణాదినా క్రియతే ఇతి బోధ్యం."

దీనినిబట్టి యొకకాలమున నవ్యాకృత మగు నఖండవాక్య ముండఁగా నది మఱికొంతకాలమునకు వ్యాకృతమై భేదింపఁబడుటచే "నామాఖ్యాతోపసర్గనిపాత" లనియు, ప్రకృతిప్రత్యయను లనియు విభాగము లేర్పడినట్లు కనఁబడుచున్నది.

ప్రస్తుతము చీనాదేశస్థుల భాష యీయఖండ భాషా స్వరూపము యొక్క ఛాయను గొంతవఱకైన సూచింపఁగలదేమో-ఏలయనఁగా-నాభాష యిప్పటికి నవ్యాకృతమై యున్నట్లు చెప్పఁబడుచున్నది. తక్కినభాషలలోవలె దానియందు నొకవాక్యములోని భిన్నపదముల విభాగము గాని పదమువందు ప్రకృతిప్రత్యయవిభాగనిరూపణము గాని చేయుట కవకాశము లేదు. ప్రతి పదము సంపూర్ణార్థద్యోతక మగునొకసంపూర్ణ వాక్యమే. వాక్యమే భాషావయవము గాని పదములు కావు. వాక్యమునందుఁ బదవిభాగము, అన్వయము, ఆకాంక్ష మొదలగునవి లేనట్లేపదమునందు, ప్రకృతిప్రత్యయవిభాగము విభక్తినిరూపణము మొదలగునవి లేవు. కావుననే దీనిని (Monosyllabic or radical language) ధాతురూప పదభాష యని చెప్పుచున్నారు. ఒక కాలమందు తక్కినభాషలు కూడ నీయవస్థయందే యుండెడి వనియుఁ గాలక్రమమునపై నుక్కనందుఁ జెప్పఁబడి నట్లుగా నీయఖండ వాక్యములు వ్యాకృతము లగుటచే నామాఖ్యాతోపసర్గనిపాత లనెడి భిన్న పదములజ్ఞానము, ఆపదములనింకను విడఁగొట్టుటచే భిన్నపదసంయోగముయొక్క గాని ప్రకృతిప్రత్యయముల యొక్క గాని జ్ఞానమును కలుగుచు వచ్చిన దనియుఁ దలంపఁబడుచున్నది. ఇట్లు భాషలు వ్యాకరింపఁబడఁగా వచ్చిన మూలరూపములే ధాతువు లని

(Roots) చెప్పఁబడుచున్నవి. భాషయందలి యఖండవాక్యములను విడఁగొట్టి యొకవాక్యమునందలి భిన్నఖండములకుఁ గల పరస్పరసంబంధమును, అఖండ రూపము లగు పదములలోని భిన్నధ్వనులకుఁ గల సంబంధమును, ఏర్పఱిచి చెప్పునదే వ్యాకరణము. "వ్యాక్రియంతే వివిచ్య ప్రదర్శ్యంతే అనేనశబ్దాః" ఇతి వ్యాకరణమ్. అని భాష్యకారుం డగు పతంజలి నిర్వచించినాఁడు. భాషను వ్యాకరించి (Analyse) శబ్దముల రూపనిష్పత్తిక్రమమును గూర్చి పరిశీలన చేయుసందర్భమున నీపదజాల మంతయుఁ గొన్ని మూలధ్వనిరూపముల నుండి (Elemental Phonetic forms) యేర్పడి పెరుఁగుచు వచ్చిన దని ప్రాచీన హైందవవైయాకరణులు, ఇప్పటికి సుమారు రెండువేలు నేనూఱుసంవత్సరములకుఁ బూర్వమే కనిపెట్టియున్నారు. ఆమూలరూపములకు (Elemental forms) ధాతువు లనుపేరు పెట్టఁబడుటయే కాక యివి భావప్రధానము లనియుఁ గ్రియార్థద్యోతకము లనియుఁ జెప్పఁబడియున్నవి.

"భావప్రధాన మాఖ్యాతం సత్వప్రధానాని నామాని" అని యాస్కాచార్యులు చెప్పియున్నాఁడు. "భావో భావనా ఉత్పాదనా సాచ అసత్వభూతో ధాత్వర్థోత్ర గృహ్యతే. ఇయ మేవ చ సాధ్యత్వే నాభిధీయమానాక్రియే త్యుచ్యతే.

"ధాత్వర్థో భావనా సైవోత్పాదనా సైవచ క్రియా". సాధ్యత్వం చ క్రియాన్తరాకాంక్షోత్థాపకతావచ్ఛేదకో ధర్మః తద్రూపత్వమేవ అసత్వభూతత్వం లింగా ద్యనన్వితత్వం తు వ్యుత్పత్తినిమిత్త మాత్రం అన్యదేవ హి శబ్దానాం వ్యుత్పత్తినిమిత్తం అన్యచ్చ ప్రవృత్తినిమిత్తం (యథా గోః గమనకర్తృత్వం- గచ్ఛతీతి గౌరితి వ్యుత్పత్తేః ద్వితీయం శృంగ సాస్నాది మత్వం.)

దీనినిబట్టి లింగాద్యనన్వితంబై స్వతంత్రం బగుభావమే ధాత్వర్థం బగుచున్న దని స్పష్టము. ఈనిరుక్తకారుని యభిప్రాయమే వైయాకరణభూషణసారమున ధాత్వర్థనిర్ణయసందర్భమున నిట్లు చెప్పఁబడినది.

"భావప్రధాన మాఖ్యాతం సత్వప్రధానాని నామానీతి నిరుక్తాత్ భూవాదిసూత్రాదిస్థక్రియాప్రాధాన్యబోధకభాష్యాచ్చ ధాత్వర్థభావనా ప్రాధాన్య మధ్యవసీయతే భావకాలకారకసంఖ్యా శ్చత్వారోఽర్థాః ఆఖ్యాతస్య-తత్ర భావః ప్రాధాన్య మితి."

అనఁగా లింగము కాలము, కారకము, సంఖ్య, మొదలగు భేదములకు లోనుగాక దేనిని బొందక, ప్రత్యేకించి స్వతంత్రవ్యవహారమున కనుపడక, భాషయం దనేకపదములకు మూలభూతమై, కేవలము మనోవీధిం మాత్రమే భాసించుచుండెడి భావమాత్రమే ధాత్వర్థ మని తేలుచున్నది. భాషలో వీనికి స్వతంత్రప్రయోగము లేదు. ఒకభాషయందుఁ గాని భిన్నభాషలయందుఁ గాని సమానరూపార్థములు గల (Cognate words) పదములను వ్యాకరింపఁగా (Analyse) మిగిలిన సామాన్యమూలరూపములు- ఈధాతువులు.

"They are the last result of linguistic analysis, the elements out of which the material of speech is formed, like the elementary substances of the chemist. Roots as Professor Max Mullor called them are phonetic types; the moulds into which we pour a group of words allied in sound and meaning. Such a root could not, of course, have found any actual expression in speach; it was an unexpressed, unconsciously felt type which floated before the mind of the speaker, and determined him in the choice of the words he formed."

ఈధాతువు లేకాలములో నైన వ్యవహారములో నుండి యున్నవా, ఈ ధాతువులతో నెప్పుడైన నెవరైన మాటలాడుకొని యుందురా, అనఁగా "ధాతురూపభాష"—(The language of roots) అనెడి దొకటి యుండియుండునా యన్నవిషయము వివాదగ్రస్తమై యున్నది. ధాతువులకు శప్ తి జ్ఞానులం జేర్చినంగాని, వానికి స్వతంత్రముగఁ బ్రయోగార్హత లేదని కొందఱనుచుండ, ఏకాలమునను, ఈధాతువులకుఁ బ్రయోగార్హత లేనిచో—అనఁగా నీరూపములే యొకకాలమున నాదిజనులచే వ్యవహరింపఁబడక పోయినచో, ఈమూలరూపమున కాయర్థము, దీనినుండి తక్కినపదము లనేకములు బయలుదేఱుట యెట్లు సంభవించు నని మఱికొందఱు అనుచున్నారు. మొత్తముమీఁద నివి భాషాపదములను వ్యాకరించుటచే నేర్పడినవి గావునను, సామాన్యముగా ననాగరకజాతులభాషలలోఁ బ్రత్యేకవస్తువులను దెలుపుపదములే విశేషముగ గనఁబడుచు, ఆయావస్తువుల సామాన్యధర్మమును దెలుపుపదములు తక్కువలై యుండుటచేతను, సామాన్యభావమును దెలుపునట్టి యీధాతువులు వ్యవహారమున నుండె ననుట సమంజసముగా లేదని పలువురు తలంచుచున్నారు. మఱియు నీధాతువులే మానవుని వ్యక్తధ్వనిరూప మగు భాషను

తక్కిన జంతుజాలముయొక్క యవ్యక్తధ్వనులనుండి వేఱుపఱుచుచున్నవి. ఏల యనఁగా జంతువుల ధ్వనులకు మూలరూపముల నన్వేషించుట వ్యర్థప్రయాసము. కాని, భూభాగమున నేప్రదేశమందలి జనులభాషల నైనను వ్యాకరించి పరిశీలించినచో నందలి పదజాల మంత యుఁ గొన్ని మూలరూపములు-లేక ధాతువులనుండి యేర్పడుచున్నట్లు తెలియ వచ్చుచున్నది. ఈమూలధాతువులు భిన్నదేశముల భిన్నజాతులభాషలలో భిన్నరూపములఁ జెందియుండ వచ్చును. ఆర్యభాషలలో నివి చాలవఱకు ఏకాజ్ధాతువులుగా నున్నవి. మఱికొన్నిభాషలలో నివి, ద్వ్యచ్కములు గాని త్ర్యచ్కములు గాని కావచ్చును. మఱికొన్నిటిలో ధాతువులు హల్సముదాయమాత్రకము లై యుండి యాహల్లులమధ్యమునఁ జొప్పించెడి స్వరములభేదమును బట్టి భిన్నపదము లై యర్థభేదమును దెల్పుచుండుటయుఁ గలదు. సెమిటిక్ (Semitic) భాషలలో, అనఁగా, బాబిలోనియన్, హీబ్రూ, అరబిక్, మొదలగు వానిలోని ధాతువులు మూఁడు హల్లులతోఁ గూడినవై మధ్యఁ జేర్పఁబడు నచ్చులమూలమున భిన్నార్థములు గలభిన్నపదము లగుచున్నవి. ఉదాహరణము. Katal. అనఁగా వాఁడు చంపెను. 'కొశేల్'-చంపుట; కాటూల్-చంపఁబడెను. ఇట్టిపదముల నుండి ధాతువులను విడఁదీసినచో 'k-t-l'అనున దేర్పడుచున్నది. చీనాభాషలలోఁ గూడ ధాతువులలో నచ్చులు లేక కేవల హల్సముదాయ రూపము లై యున్నవి. పోలినీషియన్ కుటుంబములో ప్రతి హల్లుతరువాత నొక యచ్చు వచ్చి తీరవలయును. ఆర్యకుటుంబము, లేదా ఇండోయురోపియన్ కుటుంబములోని ధాతువులు సామాన్యముగా నేకాచ్ధాతువు లై యున్నవి. కావున, భిన్నకుటుంబములకుఁ జెందిన యాయాభాషలకుఁ గలవ్యాకరణపద్ధతులు వాక్యరచనారీతులు, నెట్లుభిన్నము లై యొకకుటుంబమునకుఁ జెందినభాషలను దక్కినవానినుండి వేఱుపఱుచుచుండునో, యట్లే యీధాతువులు భిన్నకుటుంబములందు భిన్నరూపములను జెందియుండి, యాయాభాషలను వ్యవహరించిన జాతులయొక్క మనస్తత్వమును, భావవైఖరులను సూచించు చుండు నని శబ్దశాస్త్రవేత్తలమత మై యున్నది. అనఁగా నేభాషాకుటుంబమునకుఁ జెందినధాతువు లాభాషాలక్షణము లను గలిగియుండు ననుట. సెమిటిక్ధాతువులు మూఁడుహల్లులతోఁ గూడియుండ, ఫిన్నో ఉగ్రియన్ భాషలలోని ధాతువులలోఁగూడ నాభాషలకు విలక్షణ మగుస్వరసామ్యము (Vowel Harmony)

గనఁబడుచుండె నని చెప్పుచున్నారు. ఆర్యభాషలలోని ధాతువులు, ఇణ్-గతౌ, యు, భూ, పద్ మొదలగునవి యేకాచ్ ధాతువులుగనే యున్నవి. కాని, యుధ్, అను నది, యు, ధా, అను రెండుధాతువులచేరికచే నేర్పడినను, ఒకధాతువుగనే గ్రహింపఁబడినది. అనఁగా 'యుధ్' అనుధాతువునకు సంగ్రామార్థము రాకపూర్వము చాలకాలము యు, ధా, అనుధాతువులు ప్రత్యేకముగా నుండెడి వనియు, నాధాతువులు రెండు నీప్రత్యేకార్థమునఁ గలిసి యొక్క ధాతువుగా నెన్నఁబడుట కొంతకాలము తరువాత జరిగియుండు నని యూఁదలంపఁదగియున్నది. ఇంకను ద్వ్యక్షరధాతువులు దీధీఙ్ దీప్తిదేవనయోః వేవీఙ్ వేతినాతుల్యే దరిద్రా-దుర్గతౌ జాగృ- నిద్రాక్షయే- ఈమొదలగునవి యనేకములు కలవు గాని, యివి ద్విర్భావమును (Reduplications) బొందిన ధీ, వే, దృ, గృ మొదలగు నేకాచ్ ధాతువులై యుండు నని తోఁచుచున్నది.

మొత్తముమీఁద నిప్పటికి శబ్దశాస్త్రజ్ఞులచే గనిపెట్టఁబడిన భిన్నభాషాకుటుంబములు భిన్నము లగు వ్యాకరణపద్ధతులతో, వాక్యసంఘటనారీతులతో నెట్లు బయలుదేఱినవో, అట్లే భిన్నరీతులు గలధాతువులతోఁగూడ బయలుదేఱినట్లు కనఁబడుచున్నది. వాక్యసంఘటనము విషయమున ఆయాజాతుల మనోవృత్తులకుఁ దద్భాషావ్యాకరణపద్ధతులకు నెట్టిసంబంధమో, ధాతువులకు నందలి పదజాలస్వరూపముతో నట్టిసంబంధమే కలదు. కావున సన్నిహితసంబంధము కలభాషలకు వ్యాకరణ పద్ధతులయందే గాక ధాతువులవిషయమునఁ గూడఁ బోలిక యుండవలయును. దీనినిబట్టి యొకభాషలోని పదముల కన్నిటికిని దానికి సంబంధించిన మఱియొకభాషలో సజాతీయపదములు గాని ధాతువులు కాని దొరికి తీరవలయు నని లేదు. ఏల యనఁగా భాషలు విడిపోయిన పిదప నొకదానిలోని పదములు రూపములు వ్యవహారములో మాఱిపోవుట జాఱిపోవుటయుఁ గూడఁ దటస్థించుచుండును. ఆంధ్ర తమిళ కన్నడములలోని విభక్తిప్రత్యయములను బోల్చి చూచినచోఁ గొన్నిటిలో సామ్య మేమియుఁ గనఁబడదు. తమిళమున తృతీయాప్రత్యయమగు ఆల్—'మరత్తాల్' అను దానికిని తెలుఁగు చేత అనుదానికి కన్నడం 'ఇంద' మరం దింద" అను దానికి సంబధము కనఁబడదు. తమిళమున సప్తమీవిభక్తిప్రత్యయములుగా సుమారు 26 పదములు వాడఁబడుచున్నవి. తెలుఁగున అందున కన్నడమున అల్లి మరదల్లి అని రెండు మూఁడుమాత్రమే కలవు. తెలుఁ

గున రా రమ్ము, రాఁడు రాక అనురూపము లున్నవి. దీనికి ధాతు వేది యనఁగా 'వచ్చు' యనునది చెప్పుచున్నాము. వచ్చుధాతువునకు 'రా'యను దానికి సంబంధ మేమిరా యని సందేహమును నాశ్చర్యమును గలుగవచ్చును. కాని మన కట్టిసందేహము సామాన్యముగాఁ గలుగదు. మన మద్దానిని బరి శీలింపము గనుక అలవా టైనది గనుక వ్యాకరణములు తిరుగవేసినచోఁ దె చ్చునకు తేతేరు లగునట్లు గా నే వచ్చునకు 'రా రమ్ము.' అని సూత్ర ముం డును. ఈసూత్ర మున్న దానిని దెలుపునదే గాని సంబంధమును గూర్చి తెలు పునది కాదు. కావున దీనిమూలధాతు వేదో తెలిసికొనుట కితరసన్నిహిత భాషారూపములను గ్రహింపవలయును. తమిళమున "ఇంగవా" "అంగపో" అని యనుట విని 'వా' అనునది వచ్చు ధాతువుతో సంబంధించిన దేమో యని తలంపవచ్చును, గాని, యాభాషలోని "వా" ఇక్కడ 'రా' ఎందు కయి నది యనుసందేహము విడవ లేదు. ఆభాషలో వ్యతిరేకార్థమయిన రూప మొకటి వరాదు అనుదానిని జూచినచో దీనియందు "వ" "రా" లు రెండు నుండుటచే వీనిని మన "వచ్చు" 'రాము' లతో సమన్వయించి చూచుకొనిన చో 'వర్' అనుధాతు వొకటి మూలధాతువై యుండవచ్చు ననియు నందు లో మొదటి 'వ' కారమును తమిళులు చివరరేఫను తెలుఁగువారును లాగు కొని పంచుకొన్నారనియు వర్ అనుదానికే మఱియొక 'చు' అను ప్రత్యయ మును జేర్చి వర్ + చు వచ్చు ధాతువు నొకదానిని వీరు కల్పించు కొన్నా రనియుఁ దెలిసికొనవలసి వచ్చుచున్నది. ఒకధాతువుయొక్క రూపమే మాఱి భిన్నధాతువులై మూలరూపములతోఁ గుర్తుపట్టలేనట్టి నూతనరూపములు గలుగుచుండుటచే వీనిసంబంధముఁ గనిపెట్టుట యంతసుసాధ్యము కాకున్నది. ఈవర్ + చు=వచ్చుధాతు వైనట్లే చొర్ + చు=చొచ్చు, తెర్ + చు = తెచ్చు, ఎర్ + చు= ఎచ్చు (Cf తమి. ఏరుంగు అప్పు) పుర్ + చు=పుచ్చు Cf పురువు (గు) అయియుండును. ఇట్టి వింక ననేకధాతువులు భిన్నభాషల భిన్నరూపములను బొందినవి. కావున వానిమూలరూపముల నారసి పోల్చి చూడవలయును.

ఇట్లే యేభాషలయందలి పదజాల మంతయుఁ గొన్ని మూలధాతువుల నుండి యేర్పడిన దని చూపుట కవకాశ ముండునో యట్టిభాష లన్నియు- వాని లోని వ్యాకరణరీతులు కూడ సరిపోయినచో— నొక్కకుటుంబమునకే చెందిన

వని నిర్ధారణ చేయ బడుచున్నది. ఇంతేగాక, ఆయాభాషలలో నే భాషలోని పదములు మూలధాతువులకుఁ జేరికగాఁ గనఁబడుచున్నవో యాభాష మూల భాషకుఁ దక్కినవానికంటె దగ్గఱసంబంధము కల దని చెప్పుచు నిట్లే యుండిన పదములు పొందిన మార్పులను బట్టి వానిపౌర్వాపర్యమును పరిశీలించి య నాభాషల పౌర్వాపర్యమును — అనఁగా జన్యజనకభావసంబంధము లేదా సోదరభావసంబంధమును నిర్ణయించి యొకకుటుంబము గాని భాషలవంశవృక్షమును తయారుచేయఁగలుగుచున్నారు. మానవకుటుంబములకుఁ గలసంబంధమునుబట్టి వంశవృక్షములు వ్రాసినట్లే యీభాషాకుటుంబములలో వానికిఁ గల సంబంధమును బట్టి వంశవృక్షములు వ్రాయుట కవకాశ మున్నదను భావము సూచించుటకే భాషాకుటుంబము లని కుటుంబపదమును జేర్చి చెప్పుచున్నారు. ఇట్లిదివఱ కేర్పఱుపఁబడిన కుటుంబములలో ఇండోయురోపియన్ సెమిటిక్ ఊరల్ ఆల్టాయిక్ మలయా పాలినీషియన్ మొదలగు కుటుంబములు కలవు. దక్షిణహిందూదేశమందలి భాషలుకూడ నొకకుటుంబమే యను విషయము చెప్పఁబడుచున్నను ఇండోయురోపియన్ కుటుంబమునందలి భాషలకువలె వీనిపరస్పరసంబంధమును గూర్చియు మూలభాషకు వీనికిఁ గలసంబంధమును గూర్చియు నిశ్చయజ్ఞాన మింకను గలిగినట్లు లేదు.

ఈద్రావిడ భాషలలోని ధాతుస్వరూపముయొక్క విశేషలక్షణముల నింక పరిశీలింతము.— చీనాభాషలో నిధాతువులు వాక్యమున నెట్టిమార్పును బొందక అనఁగా నర్థభేదమును సూచించుటకుఁ గాను బూర్వమునందుఁ గాని పరమందుఁ గాని యెట్టిపదములును లేదా ప్రత్యయములను గ్రహింపక స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడుచున్నందున నట్టివి ధాతురూపపదభాష లని చెప్పఁబడుచున్నవి. సెమిటిక్ భాషలలో హల్సముదాయరూపకధాతువులలో జేర్పఁబడెడి యచ్చులనుబట్టి యర్థభేదము సూచింపఁబడుచున్నది. ఇఁక ఇండోయురోపియన్ సిథియన్ భాషలలో ధాతువులకుఁ జేర్పఁబడెడి ప్రత్యయములు లేక పదములే యర్థభేదమును సూచించుచున్నవి. వీనిలో గలభేద మేమనఁగా సంస్కృతము మొదలగు ఇండోయురోపియన్ భాషలలో ధాతువులకుఁ జేర్పఁబడెడి ప్రత్యయములు స్వతంత్రార్థబోధకములు స్వతంత్రవ్యవహారయోగ్యములును గాక కేవల లింగవచనవిభక్త్యాది సంజ్ఞాబోధకంబులై యర్థరహితములై ప్రత్యయావస్థను బొంది ధాతువుతో సమ్మేళ

నము ఁ బొందునప్పై యుండ సిథియన్ భాషలలోను, ద్రావిడభాషలలోఁ గూడ నీధాతువులకుఁ జేర్పఁబడునవి, చాలవఱకు నర్థరహితములును బైప్రత్యయముల వంటివి కాక స్వతంత్త్రార్థబోధకంబు లగుపద-బులే యయ్యును, వాక్యము నందు విశేషార్థబోధకములకై ధాతువున కొకదానిపై నొకటి చేర్పఁబడుచుండ గును ఇట్టిపదములలోఁ గొన్ని వాని మూలార్థములను గోలుపోయి ప్రత్యయా వస్థను బొందుచున్నవి కూడఁ గలవు. కావుననే వీనిని సంశ్లిష్టపదరూపభాష లనుట తటస్థించినది. (Agglutinative languages)

సంస్కృతాదిభాషలలోని ధాతువులకు స్వతంత్రప్రయోగము లే దని చెప్పఁబడియెఁ గదా! ద్రావిడభాషలలో ధాతువు లట్లు గాక క్రియారూపము లుగను నామరూపములుగను వ్యవహరింపఁదగి యున్నవి. అనఁగా ధాతు వని వ్యవహరింపఁబడుచున్న రూపమే యొకవాక్యమునఁ బ్రత్యయాదుల నేమియు గ్రహింపకయే యొకప్పుడు క్రియగాను మఱియొకప్పుడు నామవాచకముగను వ్యవహరింపఁబడుచున్నది. కావున నిట్టినామములు ధాత్వర్థముతో సంబంధించియే యుండినను ధాతువులనుండి యేర్పడినవి యని చెప్పుట కవకాశము లేదు. 'ఒప్పు' అను ధాతు వొకటి కలదు. ఇది క్రియారూపముగను నామ రూపముగను గూడఁ బ్రయోగింపఁబడుచున్నది. 'ఒప్పుగునో తప్పునో యిప్ప టికిం దోఁచుకార్యమిది- భార- అరణ్యా- నీవాపనిచేయుట యొప్పు- ఒప్పును- తగును అను నర్థములో వాడుచున్నాము. ఇట్లే తప్పు- క్రియార్థమున నిప్పుడు సామాన్యముగాఁ దప్పుకొను అగును. తప్పు- నామము క్రియ యను రెండువిధములను వాడుచున్నాము. కట్టు- కట్టుట యని క్రియార్థ ము కట్టుట కుపయోగించు సాధనము, త్రాడు మొదలైనవి. నామవా చక మైనపు డర్థము, cf 'ఒకకట్టుకట్టు' పట్టుపట్టు, చుట్టుచుట్టి, తట్టుతట్టి etc. ఇంకను, తట్టు, చుట్టు, పట్టు, (ఒకపట్టుపట్టి) నెట్టు, పుట్టు మొ దలైనవి ధాతువు లనేకములు గలవు. తమిళమున 'శొల్' అనుదానికి మా టాడుట మాట అను రెండర్థములును గలవు. 'తతె' యను తమిళధాతువు నకు, తొడుగు, ఖండించుట అనియె యర్థము. కొయ్యాభాగము అనునర్థము కూడఁ గలదట. ఆంధ్రమునఁ గూడ నీధాతువు క్రియానామార్థముల రెంట ను వ్యవహరింపఁబడుచునే యున్నది. కూరతతుకుగుబ, నేతిలో తఱుగొంత వచ్చి నది. అన్నప్పుడు నామవాచకార్థము. ఇంతే గాక యీధాతువుల ప్రయోగము

లవిషయమున మఱియొకవిశేషణ మేమనఁగా ద్రావిడభాషలలో నామమునకు
ను విశేషణమునకును స్థానభేదము దక్క విశేషభేద మేమియులేదు. అనఁగా
రెండుపదములు లేదా ధాతువులు నొకదాని తరువాత నొకటి చేర్చినచో
రెండవదానికి మొదటిదివిశేషణ మగుచుండును. వెండిచెంబు- వెండి చెంబునకు
విశేషణ మైనది. పదములను మార్చి చెంబువెండి యనినచో చెంబు, వెండికి
విశేషణ మైనది. కాని రెండును నామవాచకములు. ఇఁక నొకధాతువే క్రియ
గాను నామముగాను వ్యవహరింపఁబడుట కవకాశ మున్నప్పు డానామవాచక
మగుధాతువు విశేషణముగఁ గూడ నుండవచ్చును, గాన, ఒకధాతువె యెట్టి
వైరూప్యమును జెందకుండఁగాఁ గ్రియగాను నామముగాను విశేషణముగాను
గూడ వ్యవహరింపఁబడుట కవకాశము గలుగుచున్నది. తఱుగు- వెండి తఱిగి
పోయినది- (క్రియ) తఱుగువెండి ఎంత (విశేషణము) ఆవెండితఱుగు నేనొ
ప్పను. (నామము) 'ఒప్పు' అనునది యిచ్చట- క్రియ. నీవొప్పుకొనుము- ఒప్పు
కొనుము అనునది క్రియగా వాడఁబడుచున్నను, ఒప్పును- అనఁగా ఒప్పుదలను-
నీవుకొనుము- గ్రహించుము. అని దాని కర్థముగావున 'ఒప్పు' నిజముగా నచ్చ
ట నామమే. మఱియు 'ఒప్పులకుప్ప' ఇక్కడ విశేషణము గదా!—కుప్ప
లయొప్పు- ఒప్పువిశేష్య మైనది. ఒప్పుట- ఒప్పిదము- ఏది మనమున కొప్పి
దమై యుండునో యది యందమైనది గావున- ఒప్పునకు అందము అనునర్థము
వచ్చినది. తమిళమున కడునడై- చురుకైననడక. కడువాయి అనఁగా పెద్దపులి.
కడు=చులుకుగా నుండు; ఇచ్చట క్రియ (verb) దీనిని బట్టి [illegible]కొనవలసిన
విషయ మే మనఁగా- ద్రావిడభాషలలో ధాతువులకుఁ గ్రియానామవాచకములు
గను విశేషణవిశేష్యవాచకములుగను వ్యవహరింపఁబడుటకుఁ దగినశక్తి గల
దను విషయమే యైయున్నది. అనఁగా, ప్రాచీనద్రావిడభాషలలో మాటలాడుకొ
నినవారు, ఈధాతువులతోనే మాట లాడికొనియుండవచ్చు ననియు, భావభేద
ములను దెలియఁజేయుటకు వారొకధాతువు తరువాత మఱియొక ధాతువును,
ఇంక మఱియొకధాతువును ఇట్లు చేర్చుచుండెడి వారే గాని ఇది యంగము,
ఇది ప్రత్యయము, ఇదివిశేషణము, ఇదివిశేష్యము, ఇది క్రియ అనుభేదబుద్ధితో
వానిని బ్రయోగించెడివారు కారనియు నొకధాతువే క్రియావిశేష్యవిశేషణ
రూపముల నభేదరూపమును బొందియుండఁ గొంతకాలమునకు విశేషణవిశే
ష్యభావసంబంధము తెలియవచ్చుటయు; నింకఁ గాలక్రమమున నీవిశేషణరూ

పములకు సర్వనామములను జేర్చుటచేఁ గ్రియారూపము లిటీవలి కాలమున నేర్పడిన వనియు మన మూహించుట కవకాశము గలుగుచున్నది. ఒప్పు అను ధాతువు, దీనికి కొను చేర్చినారందము; కొనుధాతువు తెనుఁగున నేర్పడినను తమిళమున 'కొళ్' కనఁబడుచుండుటచే 'కొళ్' ఏ దీనిప్రాచీనరూపముగాఁ దలంపవచ్చును. 'ఒప్పుకు' కొళ్' చేర్పఁగా 'ఒప్పుకొళ్' అయినది. ఈ రెండు ధాతువులను విడివిడిగా గ్రహించినచో దేని కది క్రియ, నామము, విశేషణము కావచ్చునుగదా. రెంటిని నామములుగా గ్రహించినచో 'ఒప్పు' యొక్క 'కొనుట' అనునర్థములుగా గ్రహించినచో 'ఒప్పు' యొక్క 'కొనుట' అను నర్థము వచ్చును. ఆపదము నంతను నామముగా గ్రహించినప్పటిరూపమునుండియే ఇప్పటి 'ఒప్పుకోలు' వచ్చినది. ఈ 'ఒప్పుకొళ్' అనునది క్రియగా గ్రహింపఁబడిన సంప్రదాయమునుండియే తెనుఁగులో ఒప్పుకొను అనుక్రియ యేర్పడియుండును. 'ఒప్పుకోలు' అని లాంతముగా నున్నరూపము నామవాచకముగనే గాని క్రియారూపముగఁ దెనుఁగున వాడుకలో లేకుండుటఁబట్టి యాంధ్రము తక్కినద్రావిడభాషలనుండి విడివడిన తరువాత నాభాషలో లాంతరూపము గూడ క్రియావాచకముగా వ్యవహరింపంబడు నలవాటు పోయినదని తలంపవలసియున్నది. ఈభాషలో'ఒప్పుకోలు'అనునది మూలభాషనుండి వచ్చిన నామవాచకరూపము 'ఒప్పుకొను' అనునది యిది స్వతంత్రభాషయైన తరువాత 'ల' కారము 'న' కారముగా మాఱి యేర్పడినరూపము. కాని యిదినామమా లేదా, క్రియయా అని విచారింపఁగా మొదటిరెండుధాతువులను జేర్చుటచే నేర్పడినదే కావున, ధాతుసముదాయమే కావున నిదియు ధాతువే. 'ఒప్పుకొను' ధాతువు. కాని మొదటినుండియు నిది క్రియాభావముతో వచ్చినది గావున దీనికిఁ గ్రియాసంబంధం బెక్కువైనది. కావుననే దీనికి సర్వనామములను జేర్చినప్పుడు- అనఁగా ఒప్పుకొను + వాఁడు; ఒప్పుకొను + వారు;ఒప్పుకొను + అది, ఒప్పుకొనునట్టివాఁడు, ఒప్పుకొనునట్టిది, ఒప్పుకొను నేను- ఒప్పుకొన్నాను, ఒప్పుకొన్నాఁడు, ఒప్పుకొన్నది- అని యిట్లు క్రియారూపము లిటీవల నేర్పడినవి. మొత్తముమీఁద ఒప్పు' నకు 'కొళ్' చేర్చినప్పుడును, ఒప్పుకొను' నకు వాఁడు, వారు మొదలగు పదములు చేర్చినప్పుడుఁ గూడ నీపదములకుఁ గలసంబంధము విశేష్యవిశేషణభావ సంబంధమే కాఁబట్టి మూలభాషయంతయు అనఁగా, ప్రాచీనద్రావిడభాష యొక ధాతువునకు

మఱియొకధాతువును జేర్చుటవలన నేర్పడినరూపము గలదై యున్న దనియు, నాధాతువులలో నేయొంటికైనను స్థానమునుబట్టి విశేషణవిశేష్యభావసంబంధమే కలిగియుండె ననియుఁ, గాలక్రమమున నీధాతుసంయోగముచేఁ దక్కిన రూపము లన్నియు నేర్పడియున్న వనియుఁ దెల్లంబగుచున్నది. ఇట్టివిషయమునే-అనఁగా ద్రావిడభాషలలోని వాక్యములయందలి భిన్నావయవములకు లేదా పదములకుఁ గలసంబంధ మంతయు విశేషణవిశేష్యభావముమీఁద నాధారపడియున్న దనియు విభక్తిప్రత్యయముల స్వరూపమును గూర్చి విమర్శించుచు "విభక్తినిరూపణము" అనునావ్యాసమున నింతకుఁబూర్వ మొక పరిషత్సభయందు నిరూపించి యున్నాఁడను. ఈధాతుస్వరూపవిమర్శనయు నావిషయమునే బలపఱుచుచున్నది. దీనినిబట్టి ప్రాచీనద్రావిడభాషాస్వరూపముయొక్క ముఖ్యలక్షణ మొకటి మనకుఁ దెలియవచ్చిన దని తలంపనగును. అనఁగా నామూలభాష స్వతంత్రార్థబోధకము లగుధాతువుల సంయోగముచేతనే యేర్పడిన దనియు, నాధాతువుల నొకదానిప్రక్క నొకటిఁ జేర్చి వాక్యములను నిర్మాణముచేసినప్పు డాభిన్నభాగములకుఁ గలసంబంధము విశేషణవిశేష్యభావరూపంబై యుండె ననియు, నాభాషలోని ధాతురూపపదములకుఁ బ్రకృతిప్రత్యయభేదవిభాగము గాని వాక్యమునందలి యవయవముల కాకాంక్ష గాని లేకుండె ననియు నూహించుట కవకాశము కలుగుచున్నది. ఇట్లె లింగభేదవిషయమును గూడ విమర్శించినచో నీద్రావిడభాషలయందు లింగవివక్ష కాలక్రమమున నేర్పడి పెరుఁగుచు వచ్చినది గాఁ గనఁబడుచుండుటచే, మూలభాషలో లింగభేదముకూడ నంతగా లేదేమో యనుసందేహము కలుగకమానదు. కావున భాషాతత్త్వజిజ్ఞాసువు లగువారీద్రావిడభాషల విశేషలక్షణములను బరిశీలించి వీనికన్నిటికిని మూలమగు ప్రాచీనభాషయొక్క స్వరూపలక్షణములను గుర్తింపఁ బ్రయత్నింతురుగాక యని పండితప్రకాండులను వేఁడుకొనుచు నింతటితో విరమించుచున్నాఁడ.

---

ఓమ్.

# జీవితనాటకము.

—: అత్తిలి సూర్యనారాయణగారు :—



సాహితీసంపన్ను లయిన సకలదేశకవిశిఖామణులును జీవితము నెల్ల [illegible]ముగా, (జగన్నాటకముగా), గ్రహించి, దానిని యథారూపమునఁ జిత్రింపఁ గడంగు చుందు రనువిషయము మనలోఁ బెక్కండ్రకుఁ దెలియనిది కాదు. అయినను, మనము ప్రాయికముగాఁ బృథగ్భావములోనే ప్రకృతిని సందర్శించి దాని నభివర్ణింప నలవడియుండినందున, మొత్తముమీఁద ఖండకావ్యములే మెండుగా బయలువెడలుచు సామాన్యాదరమునే పడయఁ గలుగుచుంట చూచుచున్నామె కాని, సమగ్రజీవిత పరివర్తనమున కవి తోడ్పడుచుంట గనఁ జాల కున్నాము. పగలును రాత్రియుఁ గలసియె నిజముగా నొక్క దినమగుచుండు [illegible] నెరనివారు రససంశ్లిష్టతను దర్శించి, రూపింప నేర్తురా? చిరనూతన విలాసములతో, గంభీరరసభావములతో, సంయోగవియోగములతో, విషామృతములతో, నమోఘశక్తిప్రేరణమున, సంతతసూత్రధారణమున నేనాటకము సాగిపోవుచున్నదో యద్దానిని హృదయనేత్రముతో నీక్షించి, బహురూపములఁ బ్రదర్శించి గానము చేయనోపుట ఘనతపఃఫలముకదా!

మన గృహములలో శిశూదయముతో భగవంతుఁడు సహిత మవతరించు చున్నాఁ డనుపరమసత్యమును దొలుదొల్త గ్రహింప నగును. ఆదివ్యసౌందర్యము, ఆ[illegible] సుసార్యము, పితరు లొసంగినవి కావు. ఈశరీరముతో మన మేయల్పచాలన మొనరించినను, విశేషముగాఁ బ్రకృతికిని కారకత్వము కలదు. మనము చేయెత్తుచున్నము ; ఈ యల్పకార్యమునను మనకెండరముల కట్టిశక్తి నొసఁగఁ దోడుపడు సూర్యశక్తికే యధికతర ప్రమేయమున్నట్టు సామాన్యప్రకృతి శాస్త్రజ్ఞానముచేతనే గ్రహింప వచ్చును; మన యాహారపదార్థములును, తజ్జనిత శక్తులును, తన్మూలముననె సంభవము లగుచున్నవి. ఒక్కయడుగు పెట్టుచున్మేని, ముందునకు దేహమును నడుపు కార్యమున మరల సూర్యశక్తియు గోళాకర్షణమునే, మనశక్తిని మించియె యధికముగాఁ బాల్గొను చున్నవి. ఒక్కపల్కు పలుకునప్పుడైనను, ధ్వనియొనర్చుటకై మనచేయు ప్రయత్నమున కంటె నెంతో యెక్కుడుగానే యందునకు వలయు

గాలిని సమకూర్చియు, కంపనములఁ గలిగించియు, మఱి ప్రకృతియె విశేష
ముగా బాసట యగుచున్నది. ఇట్లు మనము సాధారణముగా జరగుచుండఁ
జూచిన యే చిన్నపనియం దైనను, కర్తృత్వము మనదె యని చెప్పికొను నట్టి
యే యింతవ్యవహారమునం దైనను, జీవాత్మను మించి పరమాత్మయె యుత్తర
వాదిత్వము వహించుచున్నాఁడు. ఈక్రియాకలాపములో విశేషముగా నార్భ
టము చేయువాఁడు జీవుఁ డగుటచేత, సకలవిషయములయందును ప్రాయికము
గాఁ దనదే కర్తృత్వ మని యతఁడు తలపోయుచున్నాఁడు. కేవల స్థూలశరీర
విషయమున నెట్లో యాత్మవిషయములయందు నట్లే జీవాత్మపరమాత్మల నిరం
తర సాహచర్యముతో జీవితము వర్తిల్లిపోవుచున్నది. ఇది గ్రహింప నేర్చిననె
కాని జీవితరూపకమును నిర్దుష్టముగా, నిపుణముగాఁ జిత్రింప నేరము.

ఈజీవితనాటకమును బరికింపవలయునన్న, మహాపురుషుల జీవనచరిత
ములనే మనము పరిశీలింపఁ బనిలేదు; మఱి, యద్భుతము లైన యసామాన్య
సంకటావస్థలనే విమర్శచేయ నవసరములేదు. వసంతోదయమున వన సౌంద
ర్యస్ఫురణమునకు ముఖ్యహేతు వైన మహాశక్తియే, ప్రచండము లయిన
బలుతుపానుల భయానకప్రేంఖణములందును, భీష్మగ్రీష్మాతపోల్బణములందు
ను, సుప్రకాశిత మగుచున్నది; మఱి, విశేషరూపమున, వర్షాగమవేళ
'లోయకుఁ దలక్రిందుగా మలఁకలై దిగుకాలువలవెంటఁ' బ్రస్ఫురిత మగు
చున్నది; యుపత్యకాప్రదేశములఁ బచ్చపచ్చ నైన తరుగుల్మలతాదులతోఁ
బ్రకృష్టరాగమున గొబ్బిళ్ళు గనిసి యాడుచున్నది; సకల గహనసీమలఁ
గ్రొన్ననలతోఁ బులకించు చున్నది; తులకించు చున్నది; ఈచందముననె మన
మానవ సమస్తజీవితానుభవములయందును, విశ్వశక్తి నిగూఢ మయ్యును
నెయ్యము వీడక విస్తారక మై నిఖిలమును నివ్వటిల్లఁ జేయుచున్నది. అనురాగ
మూలమున, తల్లిపిల్లలను, అన్నచెల్లెండ్రను, ఆలుమగలను, సకలబంధుమిత్రు
లను, మఱియిరుగు పొరుగులవారిని, విశ్వశక్తియే బంధించు చున్నది; బహు
విధాత్మాభివృద్ధిసాధక మగుచున్నది. జడతను, స్వార్థపరత్వమును, దూరము
చేయుచున్నది, సేవాభిరతిప్రేరక మగుచున్నది. మఱి, వింతలో వింత, తొల్త
స్వార్థముగా, సంకుచితముగాఁ దోఁచుప్రవృత్తియె పదపడి యాత్మవికాసహేతు
వగుచున్నది! సమిష్టిధర్మమును గాపాడుచునె యొయ్యొయ్య వ్యక్తిసంపోషణ
మొనరించుచున్నది.

అంతరాత్మవిషయము నాలోచించినను జీవితనాటకము సహితము ప్రకటముగాఁ బ్రదర్శితమగును. శైశవమున నంతరాత్మ మాయామరకలు లేక యెంత నిర్మలముగా వర్తిల్లుచున్నది! తల్లిపొత్తిళ్లలోని యామాపసికందునకు, ఆజొత్తుపాపకు ఆయాత్మకిశోరమునకు ఒకయేఁడు గడచిపోవును. రెండేండ్లు కడచనిపోవును. మూఁడేండ్లు [illegible]ప్రవు; అంత జీవితవిపులార్థస్ఫూర్తి నిట్టవాడుచును.

క. ఇట నభ మిట భూవలయం, బిట బలిసద్మంబు చుండు నిరవు లివి యనన్
బట్టుపులగు వలులచెలువునఁ, బుటపుటనై యున్న చిన్నిబొజ్జగదలఁగా.
(పాండురంగమాహాత్మ్యము)

గంతులు వేయఁజొచ్చును. అట్టి వారియమాయికత్వము, సరళహాసము చూపఱకర్కశహృదయములకుఁ గోమలత్వ మొసఁగూర్చు దివ్యౌషధమగును. బుసబుస పాలబుగ్గల నిగ్గులతో మూఁడునాలుగేండ్లు వెరుకఁబట్టి పోవును. ఐదాఱేండ్లు పైఁబడును. ఆ నునుఁజెక్కిళ్ళపై నరుణకాంతు లెం దుండియో యవతరించును. మంచిసెబ్బరల గుబులు తెలుఁగ నబ్బును. సిగ్గున బెదరున సింగార మొదవును. తప్పు చూపట్టును; ఓడిన యామొంగారుబుగ్గల నరుణిమ తలసూపును. అదెవ్వలోదవె? నీకిది విధియని శాసింతుము. విధిశబ్దార్థ మా బిడ్డ యెట్లు గ్రహింపఁగల్గు? నిషేధమును నిజమే యని యెట్లులామోదింపఁ గల్గును? తనయూహాకన్న మున్నె పరమాత్మ ధీవివేచన మానసికోత్తేజన తంతువులతో జీవితపటము నల్లుచునె యున్నాఁడు. పంచాబ్దంబులనుండి ద్వాదశవర్షంబులవఱకును బాలబాలికలె మనకన్నఁ మిన్నగా గుణదోష విమర్శ చేయనోపుచున్నారు; బాలసాధువులై ధర్మాధర్మవిచారము చేయనేర్చుచున్నారు; గృహపవిత్రతను గాపాడఁగల్గుచున్నారు.

మఱి పెద్దలయిన యనంతరము చిరపరిచితమైన పాపానుభవము జీవితనాటకమున సమగ్రముగాఁ బ్రదర్శితమగుచున్నది. ఈపాపానుభవము పూర్ణముగా నేడంకములనాటకము. ఇది లోకసామాన్యమైనది. ఈనాటకరచనము నం దుదఱును గాళిదాసులే; షేక్స్పియరులే. ఇందేయంకమందైన నభినయించునవి రెండే ప్రధానపాత్రములు. భవరంగస్థలమున జీవాత్మతోఁగూడి పరమాత్మయు సదా పుణ్యపాపకర్మముల నభినయించుచుండును. మనకృత్యములచే దోషము పాలైనవారము, మనయకార్యములన్నిఁ గనుచుండు లోకులును,

వీరే యాత్మవిషాదనాటకఖేలనమునఁ బ్రేక్షకులు. ఈనాటకస్వార్థప్రస్తావనలో, ప్రథమాంకములో, జీవితాదర్శములు భగవత్ప్రేరణమున హృదయమునఁ బ్రవేశించును. పరమోత్కృష్టము లైన యాయాదర్శములనె జీవితలక్ష్యములుగా గ్రహింతుము.

అంత, ద్వితీయాంకము మొదలుపెట్టును. ఏగృహమో, యేవీథియో, యేకార్యస్థానమో, యప్పుడు రంగస్థల మగును. ఇందు మనము ముందు గ్రహించియుండిన యాదర్శము (జీవితలక్ష్యము) "ఇదిగో! తరుణము. నన్ననుసరింతువా? యనుసరింపవా? యని ఖండితముగా నిలువఁబెట్టి యడుగును. తోడనే యనువర్తింపుము. తప్పదని దివ్యవాణి వినవచ్చును. ఆవిధివాక్యము ననుసరింప మనము వెనుదీసి నిరాకరింతుము. దానికి బోకడఁబెట్టుదుము. ఈ నిరాకరణమే మనపతనమున కారంభము. ఇది యుత్కృష్టము, ఇది నికృష్టము, నని రెండుపథము లుండఁగా, నవి యట్టివె యని మనము లెస్సగా విశ్వసించియుండియు బుద్ధిపూర్వకముగా మన మాదివ్యవిధిని పాటింపక యుత్తమమార్గము నొత్తిగిలఁజేసి యధమమార్గమునే యనుసరింతుము. పాప మనఁగా నిదే. అభిరుచితో మనమీరెంట నేదివరించి చరించినను వివేచింపఁదగుశక్తియె మనకు మానవస్వసిద్ధిస్ఫూరక మగుచున్నది. యథేచ్ఛాస్వాతంత్ర్యమన, నిదే. ఈపాపాచరణప్రవృత్తియే మనకు లేకయుండెనా, మనము పశుసములమే; యంతకన్న హీనముగా యంత్రతుల్యులమే!

తృతీయాంకము. లజ్జామయము. ఇట వ్రీడాజనితమనోవేదన బయల్వెడలును. ఇదియె మనకుఁ దారకచిహ్నము. ఈజీవికి వినాశము లేదు. పరిత్రాణము కలదు. అని సూచనచేయు ఫాలపట్టికయే లజ్జ యనఁగా. గ్రహ యెప్పు డుదయించునో యప్పుడు భగవానుఁడు దర్శనమిచ్చుచున్నాఁడన్న మాటయే. నరకలోకమున మన మత్తమిల్లియున్నను, ప్రబోధచంద్రోదయము చేరువనెయున్నదని వెల్లడిచేయుటకై మనతోడనే రక్షకుఁ డున్నాఁడని యాంతరవంపులె సూచనచేయును. పాపాచరణమున్నతోడనే పాపచింత యున్నతోడనే స్వస్వపా... తగ్గినవెంటనే యపాయ మతిశయించుచున్నదన్న చిన్నె బయలువడును.

అంత, మందగతితో, మిక్కిలి పెద్దదగు చతుర్థాంకము ప్రారంభమగును. సుశిక్షాప్రదమై, యంకములలో నెల్ల దీర్ఘమైనయది యిదే. పశ్చాత్తాపముతో, అడుగడుగునను పెనఁగులాటతోఁ బ్రపంచెడిదే యిది. ఈశ్వరసాన్ని

ధ్యమునకు, వెదువెదుక మరల్చుకొని పోవునట్లై యుండి, యున్నతపదవినే లభ్యముచేయున దిది. పాపకూపమునుండి యుద్ధరించి, నవజీవన మొనగూర్చున దిది. సకలవైరూప్యప్రక్షేపణ మొనర్చి, సుందరసందర్శనము ప్రాపింపఁజేయున దిది.

చ. దురితముచేసి తాపమునఁ దూలిన, నింకిటుసేయ నన్నతిన్
బొరసిన, ధర్మసంచరణబుద్ధియు మేలని యూఁదినన్, గృపా
పరుఁ డమమేలుచేసినను, బాదము పాదముగాఁ గ్రమంబుగా
విరియు సమస్తముం దదభివిష్టకళంకము నిర్భయంబుగన్.

(శాంతిపర్వము.)

అనంతరము, పంచమాంకము. సంపూర్ణమైన యాత్మార్పణము; స్థిరసంకల్పజనితశాంతి.

"త్వయాహృషీకేశ హృదిస్థితేన యథానియుక్తోస్మి తథాకరోమి."

(సకలేంద్రియప్రవర్తకుఁడవైన యోపరమాత్మా! నీవు నాహృదయమందే నిల్చినన్నుపనిచిన, నటు చేయఁగలను.)

ఇట్టి యీశ్వరాధీనతతో నాత్మశాంతి యుపలభ్యమౌను, భక్తవత్సలుఁడు క్షమించినాఁడన, స్వాగత మొసఁగినాఁడని యర్థము. పశ్చాత్తప్తులకెల్ల నీశ్వరకారుణ్యమున నిది లభించితీఱును. మానసమున జనించెడి యీఆర్ద్రవత్వావస్థ యాయామానవుల యాత్మావస్థలను బట్టి శీఘ్రముగనో యాలస్యముగానో కల్గుచునెయుండును.

'కనక కాంస్య లోహవత్ మానసికపరివర్తనమ్ భవతి' కొందఱిమానసములు స్వల్పపాపసంతాపమునకే ద్రవత్వ మందుచుండును. మఱికొన్ని ఘనపాపతాపములవలనఁగాని ద్రవీభావమందనేరవు. అన్యము లన్ననో, క్రూరామితపాపానల జ్వాలలచేఁగాని ద్రవతనందనేరవు.

పశ్చాత్తాపమునఁ బరిశుద్ధుఁడగు మానవుఁడు దివ్యతేజస్సుతో నొప్పి, వినీతభావముతోఁ బరమమందిరద్వారమున కరుదెంచును. అంత, షష్ఠాంకము. పరమాద్భుతము. ఎన్నెన్నియవస్థలో యనుభవించిన వెనుకఁగాని, క్రమానుభవాభివృద్ధు లంది యుండినవె కాని, యీయవస్థయె పరమసత్యము, ఫలితార్థము, నని మనము తెలిసికోనేరము. అపుడు, అప్పుడు, నిట్టూర్పుతో - నిండారు కృతజ్ఞతతో నిజముగా నొకింత యాత్మాభివృద్ధి నందఁజూచి, శాంతాగారమున

మెలఁగఁగలిగి, 'హా! పరిత్రాణమా!' యని ప్రత్యాహ్వానము చేయనోపుదుము. శ్రేయోమార్గమున, నాత్మవిశ్వాసముతో, నాత్మగౌరవముతో, నుచ్చతరపదవు లందఁదగు చిరనూతనపదములఁ బట్టి పోవఁగడంగుదుము.

'నాయమాత్మా బలహీనేనలభ్య' యను ఋషివాక్యమున కర్థము గ్రహింతుము.

త్రుంచు నని బెగడందిన పాపమే యహహా! యెట్టిమెట్టు లెక్కించినది! జ్ఞానదృష్టితోఁ జూచిన, నీవిశ్వమున నేది యాత్మాభివృద్ధిసాధనము కాకయుండును? ధన్యుఁడు, పరమేశ్వరుఁడు! కృతార్థులము, మనము, పాపులము!

అంత, ననంతమైనయంతమున సప్తమాంకము.

ఇంతవట్టును గల్గినయాత్మపరిత్రాణమును మనము పరమాదరముతోఁ స్వీకరించునది కేవల స్వప్రయోజనమునకే యగు నెడల, నది యచిరకాలముననె యిట్టింకులపాలై పోవును. పాపసాధనమున మనమిటు పరివర్తనమంది, ప్రభావమొంది, వినీతభావముతో విశ్వహితసాధన చేయనోపుదుము. మానవుఁడై జనియింపనౌను; గాని, మానవత్వసిద్ధినందుట దుర్లభము గదా! విశ్వజనీన ప్రేమయు, విశ్వహితసాధనయుఁ, బెనఁగొని, మూలమైన భక్తికి శక్తిపరిణతులఁ బ్రసాదింపనేర్చును, పూర్వాంకమున సూచించిన చిరనూతనపథములఁ, జిరకళ్యాణమయుని యనుగ్రహమున, నిటుచెంగలించుచు, సీమసీమల సేవాభిరతితో, ననంతజీవయాత్ర గావింప లభించును.

'మృత్యోర్మా అమృతం గమయ' యను సంప్రార్థనమునకు సముచిత [illegible]మైన యమృతమయజీవనమె యాత్మగత మౌను.

మన సాహిత్యసేవవలన, నట్టియమృతఫల మాంధ్రదేశమునకే కాక, సకలమహీజనులకుఁ గలుగుటం గని, నారదవచనానుసారము—

'మోదంతిపితరో, నృత్యంతిదేవతా, స్సనాథాచేయం భూర్భవతి'

# కౌటిలీయార్థశాస్త్రము.

## వినయాధికారికము.

## 2. విద్యాసముద్దేశము.



### ఆన్వీక్షికీస్థాపనము. (1)

ఆన్వీక్షికియు వేదత్రయంబును వార్తాశాస్త్రంబును దండనీతియు విద్యలనంబడు. ఆన్వీక్షికి వేదత్రయవిశేషం బగుటచే, దండనీతియు వార్తాశాస్త్రంబును వేదత్రయంబును మాత్రము విద్య లని మనుధర్మశాస్త్రానుసారుల మతము. లోకయాత్రావిదులకు వేదత్రయంబు సంవరణమాత్రం బగుటచే వార్తాదండనీతులే విద్య లని బార్హస్పత్యు లందురు. సర్వవిద్యాయోగక్షేమంబులును దండనీతియందుఁ బ్రతిష్ఠితంబు లగుట నదియే విద్య యని యౌశనసులమతము. విద్యలు నాల్గని కౌటిల్యునిమతము. వానివలన ధర్మార్థంబులు దెలియఁబడుటచే వానికి విద్యాభిధానము సిద్ధించినది.

సాంఖ్యయోగలోకాయతంబు లాన్వీక్షికివలనను ధర్మాధర్మంబులు వేదత్రయంబువలనను అర్థానర్థంబులు వార్తాశాస్త్రంబువలనను నయాపనయ బలాబలంబులు దండనీతివలనను దెలియంబడు. వేదత్రయాదివిద్యలచేఁ బరీక్షింప నాన్వీక్షికి వ్యసనాభ్యుదయముల మనోదృఢత్వమును బ్రజ్ఞావాక్యక్రియావైశద్యము నొసంగుచు లోకమున కుపకరించుచున్న దని స్పష్టపడఁగలదు. ఆన్వీక్షికియే సర్వవిద్యలకుఁ బ్రదీపంబు; సర్వకర్మంబుల కుపాయభూతంబు; సర్వధర్మంబుల కాశ్రయంబు.

### (3) త్రయీస్థాపనము.

ఋగ్యజుస్సామవేదంబులు వేదత్రయంబు; అథర్వేతిహాసములఁ గూడి వేదము లనంబడు. వానికి శిక్షాకల్పవ్యాకరణనిరుక్తచ్ఛందోజ్యోతిషంబు లంగంబులు; చతుర్వర్ణ చతురాశ్రమంబుల స్వస్వధర్మ స్థాపనంబుచే వేదత్రయం బాపకారికంబు.

అధ్యయనము, అధ్యాపనము, యజనము, యాజనము, దానము, ప్రతిగ్రహము బ్రాహ్మణులకు స్వధర్మంబులు. అధ్యయనము యజనము దానము

(1) ఆన్వీక్షికి యన తర్కతత్త్వపరీక్షణమును బ్రయోజనముగాఁ గలది.

శస్త్రజీవిక భూతరక్షణము క్షత్రియధర్మంబులు. అధ్యయనము యజనము దానము కృషి పశుపాలన వాణిజ్యంబులు వైశ్యధర్మంబులు. ద్విజశుశ్రూషయుఁ గృషిపశుపాలనవాణిజ్యంబులును శిల్పకుశీలవత్వంబులును శూద్రధర్మంబులు.

స్వకర్మజీవనంబును, దుల్యభిన్నగోత్రజులతో వివాహసంబంధంబును ఋతుగామిత్వమును దేవపిత్రతిథిభృత్యులయందుఁ ద్యాగంబును శేషభోజనంబును గృహస్థునకు ముఖ్యధర్మంబులు. స్వాధ్యాయంబును అగ్నికార్యాభిషేకంబులును భిక్షాటనంబును బ్రాణంబును నైతము లెక్కసేయని గురుభక్తియు గురుఁడు లేనియెడ గురుపుత్రసబ్రహ్మచారులయందట్టిగురుభావమున మెలంగుటయు బ్రహ్మచర్యంబున ననుష్ఠింపవలయు.

వానప్రస్థంబున బ్రహ్మచర్యము భూశయనము జటాజినధారణంబు అగ్నిహోత్రాభిషేకంబు దేవపిత్రతిథిపూజ వన్యాహారభక్షణంబు లనుష్ఠేయంబులు. జితేంద్రియత్వము నైష్కర్మ్యము నిష్కించనత్వము సంగత్యాగము వివిధగృహభిక్షాన్నసేవనము బాహ్యాభ్యంతరశౌచంబులు అరణ్యావాసంబును, బరివ్రాజకధర్మంబులు.

సర్వవర్ణాశ్రమంబులకు నహింస, సత్యము, శౌచము, అసూయలేమి, అనృశంసత్వము, క్షమయు సమానధర్మంబులు.

స్వధర్మానుష్ఠానంబు. పరలోకసుఖంబును మోక్షంబును నొసంగును. స్వధర్మాతిక్రమణంబువలన లోకము సాంకర్యముచే నశించును. కావున రాజు తనప్రజల స్వధర్మచ్యుతి నొందకుండ రక్షింపవలయును. సదాచారనియమములను వర్ణాశ్రమధర్మంబుల ననుసరించుచు స్వధర్మంబుల ననుష్ఠించుమనుజుఁడిహపరలోకముల సుఖంబు నొందును. వేదత్రయరక్షితంబగులోక మభివృద్ధి నొందును గాని నశింపదు.

## 4. వార్తాదండనీతిస్థాపనము.

కృషి పశుపాలనము వాణిజ్యవిషయకము వార్తాశాస్త్ర మనఁబడు. ధాన్యపశుహిరణ్య కుప్య[1] విష్ట్యాదు[2] ల సేకరించుటకీ శాస్త్ర ముపకరించును. వార్తాశాస్త్రలభ్యము లగుకోశదండంబులవలన రాజు స్వపక్షపరపక్షవశీకరణ మొనర్పఁగలఁడు.

---

1. కుప్యమనుటచే స్వర్ణరజతాతిరిక్త మగుతామ్రాదులును ఆరణ్యక వస్తువిశేషములును ధ్వనితము
2. విష్టి-కూలిపని; కూలిపనిచేయువాఁడు.

ఆన్వీక్షికీ త్రయీ వార్తాశాస్త్రంబుల యోగక్షేమసాధనము దండశాస్త్రము. ఆశాస్త్రమున నుపపాదింపఁబడు నీతియే దండనీతి నాఁబడు. దండనీతి వలన నలభ్యార్థంబులు లభియించును; లభ్యములు రక్షితంబు లగును; రక్షితంబు లభివృద్ధి నొందును; వర్ధితంబులు తీర్థాదికంబుల వినియోగింపఁబడును. లోకయాత్రయే దండనీతిపై నాధారపడియుండుఁ, గావున లోకయాత్రార్థు లగు మనుజులు నిత్య ముద్యతదండులై యుండవలయును. (1)దండమువలె సర్వభూత వశీకరణసాధనము వేఱొండు లే దని యాచార్యులమతము.

కౌటిల్యమతానుసార మది సరి కాదు. ఉగ్రదండనమును విధించెడిరాజు ప్రజల కుద్వేగజనకుఁ డగును. మృదుదండనవిధానమువలన రాజు పరిభవింపఁబడును. అర్హదండవిధానము వలన నాతఁడు పూజ్యుఁ డగును. సువిజ్ఞాతప్రణీత మగు దండమువలనఁ బ్రజలు ధర్మార్థ కామంబుల యోజింతురు. అజ్ఞాన కామ క్రోధంబులచే దుష్ప్రణీత మగుదండనము వానప్రస్థపరివ్రాజకులకుసైతము క్రోధజనక మగును. గృహస్థులవిషయమున నిఁకఁ దెలుప నేల? దండనాభావము వలన మాత్స్యన్యాయ ముద్భవించును. దండనాధికారి లేమి బలవంతుఁడు బలహీనులను (2)బీడించును. సుప్రణీతదండ రక్షణము వలన దుర్బలులు బలయుక్తు లగుదురు-

రాజదండపాలితు లగుచోఁ జతుర్వర్ణాశ్రమంబుల మెలఁగుప్రజలు స్వధర్మానుష్ఠానపరులై సుఖంబుగ నుందురు.

5. వృద్ధసంయోగము.

ఆన్వీక్షికీత్రయీవార్త లను విద్యాత్రయం బందునవే దండాధీనం బని తెలియనగు; ప్రాణుల యోగక్షేమావహం బగుదండనీతియు వినయంబు(3)పై నాధారపడి యుండు.

వినయము కృతక స్వాభావికంబుల రెండు విధములు. శాణఘర్షణాది సంస్కారణంబుచే ఖనిజం బగుద్రవ్యంబును సంస్కరింప నగుఁ గాని శిలాఖండంబుల సంస్కరింప వలను పడదు. అటులే శుశ్రూష, శ్రవణ, గ్రహణ, ధారణ, విజ్ఞాన, ఊహా, పోహా, తత్త్వాభినివేశగుణసంపన్నులు దక్క నితరులు వినయంబుచే సంస్కరింపఁబడరు.

---

1. మూలమున దండశబ్దము దండనము, చతుర్విధోపాయంబుల నొకయుపాయమగు దండము, దండనమును విధించెడిరాజు అనునర్థములఁ బ్రయోగింపఁబడినది.

2. గ్రసతే- గ్రసించును అని మూలము, 3 శిక్షణవ

ఆచార్యప్రమాణంబుచే విద్యాభ్యసనకాలమున శిష్యులకు నియమశిక్షణంబులు కలుగును.

నిర్వృత్తచౌలకర్ముం డై గణితంబును, లిపియు, నుపనయనసంస్కారానంతరము శిష్టులవలన వేదత్రయాన్వీక్షికీవిద్యల నధ్యక్షుల(1) వలన వార్తాశాస్త్రంబును బ్రవచనప్రయోగకుశలు లగుశాస్త్రజ్ఞులవలన దండనీతియు నభ్యసింపవలయు.

షోడశవర్షప్రాయంబువఱకు బ్రహ్మచారి యై యనంతరము గోదానం బొనర్చి వైవాహికంబు వడయవలయు. శిక్షణం బెవ్వరివలన లభియించునో యట్టివిద్యావృద్ధుల నిత్యము సేవించుచు వినయవృద్ధి నొందవలయును.

పూర్వాహ్ణమున గజాశ్వరథప్రహరణవిద్యాశిక్షణంబు నొందుచు నపరాహ్ణము నితిహాసశ్రవణంబునఁ గడపవలయు. పురాణము, ఇతివృత్తము, ఆఖ్యాయిక, ఉదాహరణము, ధర్మశాస్త్రము, అర్థశాస్త్రము, నితిహాసంబు లనంబడును. శేషించిన యహోరాత్రంబుల నూతనవిషయగ్రహణంబును గృహీతచింతనంబు నగృహీతపునఃపునఃశ్రవణంబును జేయవలయును.

శ్రవణంబువలనఁ బ్రజ్ఞయుఁ బ్రజ్ఞవలన యోగంబును(2) యోగంబువలన సత్త్వాతిశయంబును గలుగుచున్నవి. ఇదియే విద్యవలనఁ గలుగుఫలంబు.

విద్యావినీతుఁడును, బ్రజాశిక్షణాసక్తుఁడు నై సర్వభూతహితంబును గోరు నృపుఁ డనన్యం బగుపృథివీసామ్రాజ్యము ననుభవించును.

### 6. ఇంద్రియజయము- అరిషడ్వర్గత్యాగము.

విద్యావినయహేతు వగునింద్రియజయంబు కామక్రోధలోభమానమదహర్షత్యాగంబువలన లభించును. శబ్దస్పర్శరూపరసగంధంబులయందుఁ గర్ణత్వగక్షిజిహ్వాఘ్రాణేంద్రియంబు లవిరుద్ధప్రవృత్తి నొందుటయే యింద్రియజయంబు. శాస్త్రార్థానుష్ఠానంబు నదియె. ఏలయన శాస్త్రంబులచేఁ బ్రతిపాద్యమానంబగునది యింద్రియజయమే.

ఇంద్రియంబుల విరుద్ధవృత్తివలనఁ జతుస్సముద్రముద్రితధరావలయపాలకుం డైనను రాజు శీఘ్రముగ నశించును. దాండక్యాపరనాముఁ డగు భోజుఁడు కామంబుచే బ్రాహ్మణకన్య నపహరించి వైదేహుఁ డగుకరాళునివలె

1. అధికారులు.

2. అనుష్ఠానమున శ్రద్ధవహించుట.

నే సబంధురాష్ట్రంబుగ నశించెను. కోపంబుచే బ్రాహ్మణభృగువులయెడ నప రాధ మొనర్చి జనమేజయతాళజంఘులును లోభంబుచేం జాతుర్వర్ణ్యధనంబుల నపహరింప యత్నించి సౌవీరుం డగు యజబిందుండును, ఐలుండును వినాశ మొందిరి.

మానంబుచేం బరదారరాజ్యాంశంబుల నొసంగక రావణదుర్యోధను లును మదంబుచేం బ్రజల నవమానపఱిచి దంబోద్భవహైహయార్జునులును హర్షంబుచే నగస్త్యుని వంచింపం దలంచి వాతాపియు, వ్యాసశప్తులై యాదవు లును నశించిరి.

మఱియుం బలువురు రాజులు జితేంద్రియత లేమి శత్రుషడ్వర్గపీడితులై బంధురాష్ట్రములతోం వినాశము నొందిరి. శత్రుషడ్వర్గమును జయించి జితేంద్రి యులై జామదగ్న్యుం డగు నంబరీషుండును నాభాగుండును మహీచక్రమును జిరకాల మనుభవించిరి.

## 7. ఇంద్రియజయము- రాజర్షివృత్తము.

అరిషడ్వర్గత్యాగంబుచే నింద్రియజయము నొందవలయు. వృద్ధసంయో గంబుచేం బ్రజ్ఞను, జారులచే నక్షియుగవ్యాపారంబును, ఉద్యోగంబుచే యో గక్షేమసాధనంబు ను గార్యానుశాసనంబుచే స్వధర్మస్థాపనంబు ను విద్యోప దేశంబుచే వినయంబును అర్థసంయోగంబుచే లోకప్రియత్వమును వడసి సర్వ జనహితంబుగ లోకయాత్ర నొనరింపవలయును. అటులు విజితేంద్రియుండై పరస్త్రీ ద్రవ్య హింసాకర్మంబులను స్వప్నములం గూడ ననృతము చపలత యవి నీతవేషధారణము ననర్థసంయోగము నధర్మానర్థసంయుక్తంబు లగు వ్యవహా రంబులను వర్జింపవలయును.

ధర్మార్థంబుల కవిరోధంబుగం దృతీయ పురుషార్థం బగు కామంబును సేవింపవలయు. సుఖరహితుండై యుండుట చనదు. త్రివర్గంబు లన్యోన్యానుబం ధంబు లగుటచే వానిని సమంబుగ సేవింపవలయును. ధర్మార్థకామంబులయం దేదైనను విపరీతంబుగ సేవితం బగునేని యది శేషించిన పురుషార్థద్వయంబు ను బీడన మొనరించును.

ధర్మకామంబు లర్థసాధ్యంబు లగుటచే నర్థమే ప్రధాన మని కౌటిల్యు నిమతము.

అపాయస్థానంబుల వారించుచు ఛాయానాళికాప్రతోదనము(1)ల రహస్యప్రమాదములను నివారణ మొనర్చెడి యాచార్యామాత్యవరులను వారివారిస్థానముల నియమింపవలయును.

చక్రాంతరసహాయంబు లేక నేకచక్రం బెట్లు లుపకరింపదో యటులే సచివసహాయంబు లేక రాజ్యతంత్రము నిర్వహింపఁబడదు. కావున సచివుల నేర్పఱిచి రాజు వారల యభిప్రాయ మెఱుంగవలయును.

### 8. అమాత్యోత్పత్తి.

శౌచసామర్థ్యంబులఁ బరిశీలించి యుండుటచే సహాధ్యాయుల నమాత్యులుగ నొనర్పవలయు. అట్టివారే విశ్వాసయోగ్యు లగుదురు. ఇది భారద్వాజుని మతము.

విశాలాక్షుని మతానుసార మిది సరికాదు. వారితోఁగూడి బాల్యక్రీడ లొనర్చి యుండుటచే, వారు రాజును బరిభవింతురు. ఎవరు సమానశీలవ్యసనాత్మకులో, ఎవరిరహస్యములు రాజునకుఁ దెలియునో, యట్టివా రమాత్యులుగ నుండఁదగును. స్వరహస్యభేదనభయంబుచే వారు రాజున కపరాధ మొనర్పరు.

అట్టిభయం బుభయులకు సమానంబు. తనరహస్యంబులు వారలకుఁ దెలిసియుండుటచే వారికృత్యాకృత్యంబుల రా జనుసరింపవలసివచ్చును. ఎవరికిఁ దనరహస్యంబుల నెఱుకపఱుచునో యట్టివారలకు రాజు వశుఁడగును. ప్రాణాపాయసమయంబుల నెవ్వ రుపచరింతురో యట్టివిదితానురాగుల నమాత్యులఁ జేయవలయు నని పరాశరులు వచించుచున్నారు.

అది ప్రభుభక్తిజనితము గాని బుద్ధిగుణవిశేషంబు గాదు. ఎవరు ద్రవ్యోత్పత్తిమార్గంబుల నియుక్తులై యాదిష్టానుసారము గాని విశేషంబుగఁ గాని యార్జింతురో యట్టిపరిశీలితగుణసంపన్నుల నమాత్యవరులుగ నియోగింపవలయు నని పిశునమతము. అది సరి కా దని కౌణపదంతుఁ డిట్లు వచించుచున్నాఁడు. వారికి శోభించిన గుణము లలవడవు. పితృపైతామహక్రమాగతంబుగ నెవ రనుభూతాపధానంబుల(2)చే నమాత్యపదవికర్హులగుదురో యట్టివారి

1. కార్యాంతకాలాతిపాతసూచనంబుచే నిష్టకర్మంబులకు విఘ్న మొనరించి మనోవ్యథ నొసంగుట ప్రతోదనశబ్దముచే సూచింపఁబడె.

2. కులక్రమాగతరాజ్యసంబంధానుభవంబులు.

నెన్నవలయును- వారు పరిచయవిశేషంబుచే, రాజు తమయెడ నపరాధ మొనరించినను సైరింతురు. అమానుషంబులగుజంతువులయందు సైత మిట్టిది గన్పడుచున్నది. గోవులు పరిచితగోగణంబులఁ జేరును గాని యపరిచితగోగణంబుల నెన్నఁడును జేరవు గదా.

అట్టివారు రాజ్యవిభవంబు నపహరించి స్వతంత్రు లగుదురు. కావున నూతనంబుగ నీతికోవిదుల నమాత్యులఁ జేయవలయు. నూతను లగుట రాజును యమునివలె నుగ్రదండధరునిగా భావించి యపరాధ మొనర్ప యత్నింప రని వాతవ్యాధునిమతము.

బహుదంతీపుత్రునిమతానుసారము కేవలము శాస్త్రజ్ఞాన సంపన్నులై యనుభవము లేనియమాత్యులవలన రాజు విషాదము నొందును. గుణంబు ప్రధానం బగుటచే నభిజనప్రజ్ఞాశౌచశౌర్యానురాగయుక్తు లగుపురుషుల కమాత్యపదవి నొసంగవలయును.

కార్యసామర్థ్యంబులచేఁ బురుషతారతమ్యంబు నిర్ణీత మగుట నిదియే యుత్తమపద్ధతి యని కౌటిల్యునిమతము- దేశకాలకర్మానుగుణం బగుఁ గార్యసామర్థ్యంబుచే నమాత్యగుణంబుల నరసి యట్టివారల నమాత్యులుగా నొనరింపవలయుఁ గాని మంత్రులఁ జేయఁజనదు.

### 9. (1)మంత్రిపురోహితోత్పత్తిక్రమము.

జానపదుండును, విశుద్ధాన్వయుండును, స్వవగ్రహుండును(2), శిల్పశాస్త్రజ్ఞుండును, అర్థశాస్త్రవిశారదుండును, ప్రాజ్ఞుఁడును, జ్ఞాపకశక్తిగలవాఁడును, దక్షుండును, వాగ్మియు, ప్రగల్భుఁడును, ప్రతివక్తృత్వప్రతికర్తృత్వసామర్థ్యములు గలవాఁడును, ఉత్సాహప్రభావయుక్తుఁడును, క్లేశమును సహించువాఁడును, శుచియు, మిత్రుఁడును, దృఢభక్తియుతుఁడును, శీలబలారోగ్యసత్త్వసంయుక్తుఁడును, స్తంభచాపల్యవర్జితుండును, సౌమ్యుండును, వైరంబుల నుత్పాదింపనివాఁడు నగు పురుషుని ప్రధానామాత్యునిఁ జేయవలయును. పైగుణంబులఁ జతుర్థాంశహీనుండు మధ్యముండును, అర్ధగుణహీనుం డధముండు నగును.

అందు జనపదత్వావగ్రహంబుల నాప్తులవలనను, శిల్పాదిశాస్త్రజ్ఞానమును దుల్యవిద్యావిశారదులవలనను, ప్రజ్ఞయు, జ్ఞాపకశక్తియు, దక్షతయుఁ గార్యానుష్ఠానంబువలనను, వాగ్మితయుఁ బ్రగల్భతయు, ప్రతిభానవత్త్వంబును

---

1. ప్రధానామాత్యుఁడు.
2. సుఖంబుఁ బ్రమాదములఁ దప్పించుకొనువాఁడు.

గార్యకథనప్రసంగంబువలనను, ఉత్సాహప్రభావక్లేశసహిష్ణుత్వంబుల నాపదలందును, శౌచంబును, మిత్రస్థానమును, దృఢభక్తియు సమాచరణంబువలనను, శీలబలారోగ్యసత్త్వంబులును, స్తంభచాపల్యరాహిత్యమును సహవాసజనుల వలనను, సౌమ్యతయు వైరరాహిత్యమును బ్రత్యక్షముగను దెలియవలయును.

రాజవ్యవహారంబు ప్రత్యక్ష పరోక్షానుమేయంబులపై నాధారపడి యుండు. అందు స్వయముగఁ జూచి గ్రహించినది ప్రత్యక్షము నాఁబడు. ఆప్తవాక్యావగతంబు పరోక్ష మనఁబడు. అనుష్ఠితంబు లగుకర్మలవలనఁ జేయఁబోవుకర్మల పరిణామంబు గ్రహించు టనుమేయంబు.

రాజకార్యంబులు వివిధములై, వివిధదేశానుష్ఠానంబు లైనను దేశకాల వ్యత్యాసంబు లేక జరుపుటకు రాజు తన పరోక్షమున నమాత్యవరుల నియోగింపవలయును. ఇదియే యమాత్యులధర్మము.

ప్రశంసనీయకులశీలసమన్వితుఁడును, వేదషడంగ, శకునజ్యోతిషంబుల శిక్షితుండును, దైవమానుషకృతంబు లగునాపదల నథర్వమంత్రప్రయోగంబులచేఁ బ్రతిఘటింప సమర్థుండు నగువానిని బురోహితునిఁ జేయవలయును. ఆచార్యుని శిష్యుఁడును, జనకునిఁ బుత్రుండును, యజమానుని భృత్యుఁడును వలె రాజు పురోహితు ననుసరింపవలయును.

పూర్వోక్తగుణసంపన్ను లగుపురోహితామాత్యులచే వర్ధితమై, శాస్త్రోక్తానుష్ఠానంబు నొనర్చు క్షత్రియకులంబు శస్త్రరహిత మైనను నజేయమై మిక్కిలి యభివృద్ధి నొందును.

## 10. అమాత్యపరిశోధనము.

మంత్రిపురోహితసహితుఁడై సామాన్యాధికారపదంబుల నియోజించి రాజు తనయమాత్యుల వక్ష్యమాణవిధంబుగఁ బరిశోధింపవలయును.

అయాజ్యయాజనాధ్యాపనముల(1) నియుక్తుఁడై కుపితుఁడగుపురోహితుని రాజు తొలఁగింపవలయును. అట్టిపురోహితుఁడు గూఢపురుషులచే నమాత్యవరుల నొక్కొక్కరిని భేదోపాయమువలన విడఁదీయుటకై శపథపూర్వకముగ వారి కిట్లుపదేశింపఁ జేయవలయును. మనరా జధార్మికుఁడు. కావున నాతనిస్థానమున ధార్మికునిగాని తత్కులసజాతునిగాని, యాటవికుఁ డగుసామంతునిగాని, కులీనుఁడును, బూజార్హుఁడు నగు మఱియొకనినిగాని బందీకృతుని

1. యాజన మొనర్పనర్హు లగువారల యాజనాధ్యాపనముల నియుక్తుఁడై-

మధ్యాహ్న వేళను మందిరంబున కొచ్చి దాహము దెమ్మంచు దరుప్రలికుచు
మాధవు చరితలు మఱచినాఁడవు నీవు రచియింపుమీ చాల రమ్యముగను
వినుము మాపల్కులన్నియు వీనులలరఁ, గనుము మోక్షము శ్రీహరికథలవలన
మనుము సుజ్ఞానినైచాల మన్నుమఱచి, మనసుర జిల నిట్లనె మహీసురుండు
క నడవడి గలిగిన యప్పుడె, పడయఁగవలె విష్ణుభక్తి పదిలుఁడనైతే
వినువక కృష్ణునిచరితలు, కనువేడుక వెన్నముద్దగణపతిపెద్దా.

వ. అనుచు నానతిచ్చి యదృశ్యుండైనఁ బరమేశ్వరుండని నిశ్చయించి చూచి యేఁగూర్చుండి భాగవతార్థంబున దశమస్కంధంబున నేను రచియింపం బూనిన గోపాలవిలాసంబను యక్షగానంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన నెటువలెను.

సీ. అభిమన్యుపుత్రుండు హస్తంబుకోడను శుకయోగరాయని జూచిపలికె...

ఈపైవాక్యమువలనఁ గవియభిప్రాయము తేటపడినది. కథాసందర్భమును దెలిసినది. "కనువేడుక వెన్నముద్ద గణపతిపెద్దా" యను మాటలోఁ గవి గణపతి కొడుకు పెద్దన కవియేమో యని యోజింపవలయును. ఇంతకంటె నాతనివిషయము తెలియరాలేదు. కథాభాగములోని కొన్ని వాక్యములు:—

త్రిపుట- బింకమున గాల్ద్రవ్వి అంకెలు పెల్లుగా మ్రోయించు వృషభము వంకఁజూచిన యప్పుడె గ్రక్కున తెంకిద్రోపెా...

జిట్టిజిట్టిన న్నట్టులెత్తుక గుట్టములవలె దుమికి కోడెలు నట్టుకట్టలు నడిచె. గదుపులనడుమ నప్పుడు......

వ. అట్టిగదుపులముందలు కుమర్చుకొని పాలు పిండుచు నీళ్ళు...దినదినంబును వింతలు గులుకుచు నావులమేపుచున్న రామకృష్ణులు ప్రలంబ తృణావర్తబకధేనుకవత్సాసుర మొదలైనరాక్షసుల...

జంపె. ఓదేవ మీయాజ్ఞ నుల్లంఘింపఁజిల్లై నావిన్నపంబొకటి నలినాక్షవినుము।
వాదుచే గిరుసుండు వైరంబు మదినుంచి భేదించునను జాల భీతిఁ జెందెదను.

వ. అనినఁ గృష్ణుండిట్లనుచున్నాఁడు.

జంపె. మాపాదములు నీకమస్తకంబున నిలిచె నాకత్రిజాజు నిన్నలయింపఁ డింకను.

చిట్టచివర మంగళహారతియు న్వాలాశ్వభ్రలుపద్యమును గలవు.

చిత్రభానునామసంవత్సర కార్తిక శు ౯ శనివారము కార్తికి నెల ౧౦ తేదివఱకు వ్రాసిన కాళింగచరిత్ర గరటయసెట్టికి ముత్తరాజు కృష్ణయ్య వ్రాసి

యిచ్చినది. మొదటి యొత్తుపుటమీఁద "విఠోబా కాళింగచరిత్ర యెత్తినవారు చదివి యిచ్చేది. యయ్యేకపోతే కొట్లో వేశి కొట్టు శెలువుతో తీశియిచ్చేది. అని యున్నది. ఈవిఠోబా యెవ్వరో తెలియదు. దక్షిణదేశప్రతి- పుదుకోట వేంకటేశయ్యగా రిచ్చినది.

(29) రామశతకము- గ్రం. సం. 136.

ఇది యొక కందపద్యశతకము. కాని యిరువదియొక్క పద్యములు మాత్రము గలవు. కవిపేరు తెలియదు- నైచ్యానువేదప్రకరణము, నిష్ఠురోక్తిప్రకరణము, అంతఃకరణదోషనివేదనప్రకరణము, చిత్తశుద్ధిప్రార్థనాప్రకరణము, నవిప్రకరణమునకైదేసిపద్యములు వ్రాయఁబడినవి. కొన్నిపద్యములు-

శ్రీరమణా నీచరితము, ఘోరము లగుపాపములను గొట్టుటచేతన్
సారతమ మైననామము, తారకమని తలఁతు మదిలొ దయగలరామా.

సరసుఁడ నీనామముచే, స్థిరముగ వేడంగఁజేయు దీనశరణ్యా
కరతలుఁడు గావె భక్తుల, మఱవక ననుగావు సుగుణ మతిగలరామా.

తామసగుణంబుచేతనె, పామరుఁడుగఁ దిరిగినాను పరమాత్మక నీ
ప్రేమను గలిగెడి యతులిత, నామసుధన్ గ్రోలఁజేయు నరవరరామా.

ఇదియును బై వేంకటేశయ్యగా రిచ్చినదే.

(30) పాండవాశ్వమేధవృత్తాంతము- గ్రం. సం. 138.

జైమినిభారతము- అశ్వమేధపర్వము కథ- వచనము. మొదటి ౧౩ పత్రములు లేవు. మొదటిది యమునాసురునికథ, రెండవది నీలధ్వజునియుద్ధము. మూఁడవది యమృతధ్వజునికథ- ఇతనికుమారుఁడు సుధర్ముని కథ, నాలుగవది సురతునికథ, ఈసురతుఁడు సుధర్మునితమ్ముఁడు, అయిదవది వరాహదేశకథ, ఆఱవది బృహల్లీలకథ, ఈబృహల్లీలస్త్రీ- ఏడవది బభ్రువాహనునికథ. ఏడు భాగములు. ౨౬౬ పత్రములు. భాష వ్యావహారికభాష. దానికిఁదోడు వ్రాఁత తప్పులు. కవిపేరు తెలియుట కాధారము లిందేమియుఁ గనఁబడవు. అఱవము చదివిన దక్షిణాది తెలుఁగువారు వ్రాసినది. ఉన్నదున్నట్లు వరాహదేశకథలోని కొంతచిత్తగింపుఁడు.

" అటుపిమ్మట అశ్వం సంరక్షణకొఱకు వచ్చిన అర్జునుడు అమృతధ్వజరాజున చుట్టంచేసుకొని సకలమైనరథగజతురగపదాదులతోకూడా అర్జునుడు రథారూఢుడై అశ్వం వెనకపార్శ్వముగా నడిచి దేశం దాటి అవతల పొయ్యే

టప్పుడు అనేకమైనవాళ్లూ వచ్చి నోరుతెరచుకొని చూచి అష్టాదశవాద్యఘోషముల శబ్దములు విని భయపడి కిరీటిదండుచు జూచి భ్రమశి పరుగెత్తిరి. దండు రెండామడదూరం అవతలనడిచి పొయ్యేటప్పుడు అక్కడ వకదండకారణ్యావనం కనిపించును. అందుకు అవతల దక్షిణముగా నడిచి పశ్చమ దిక్కుగా పొయ్యేటప్పుడు వరాహదేశ మని వకదేశం ఆదేశం యొక్క వర్తమానం యేలాగంటేను అందులోవుండే మొగవాండ్లు ఆడవాండ్లు నిర్మాణముగా వృక్షశాఖలులో గబ్బిలమువల వేలాడుకొని వుండేదిన్ని పిగులు ముప్పైన్ని వృక్షములమీద తొత్తుకొని వుండేదిన్ని ఆ స్థమానమునకు సంచారములు చేశేదిన్ని ... ... ... అర్జునుడు అమృతధ్వజరాజును అడుగగా వినవయ్యా కిరీటిమహారాజా తెలుస్తున్నదే ఆపట్నం బ్రహ్మదేశం ఆదేశములో నాల్గు విధములు గల్గినకొమ్ములు వుండే మనుష్యులు వుందురు. అనిపల్కరించగా అశ్వం ఆపట్నం సమీపమున పొయ్యేటప్పుడు రణబేరి శబ్దం విని అందులో వుండేజనులు బయలుదేరి వాళ్ళకు వొకరికి వొకకొమ్ము నొకరికి రెండుకొమ్ములు వొకరికి మూడుకొమ్ములు ... ... వాళ్లూ వెయి రెండువేలు మూడువేలు యీప్రకారంగా వచ్చి దూరముగా నిల్చి చెతుటుకట్టుకొని కొమ్ములచాత పొడిచేభావముగా కొమ్ములు ఆడించుకొని నిల్చివుండగా అర్జునునిదండు జూచి భయపడి ... ... ... ...

బృహల్లీలలోని కొన్ని వాక్యములు:—"వినవయ్యా కిరీటిమహారాజా యీఅశ్వంపొయ్యేది మదనమండలదేశమని వొకదేశం ఆదేశం యెటెటువంటిది బృహల్లీలయనె ఆడది- ఆదేశములో ఆడవాండ్లువినాగ మొగవాండ్లు మందుకుకూడా తగలదు. అటువంటి బృహల్లీల తపస్సుజేశి సర్వాస్త్రఘాతి అని అస్త్రము పరమేశ్వరుని దగ్గరతీసుకొని వచ్చింది. కాబట్టి యీఉత్తరకురుక్షేత్రములో వుండతగ్గ రాజాధిరాజులు దేశాధిపతు లందరున్ను బ్రహ్మరుద్రాదులున్ను నేటివఱకున్ను దానిం జయించింది లేదని అమృతధ్వజుడు చెప్పగా— అర్జునుడు విని పరమేశ్వరుడు మహావంచనజేశిరి నేను పోయి అడిగినందుకు పాశుపతాస్త్రము ఇచ్చను నాకు ఆ అస్త్రము యియ్యరాదా ... ..." ఆంధ్రజైమినిభారతములో- సురథుఁడనిన- దీనసుతుఁడని, ప్రమీలకే కావచ్చును- బృహల్లీలయని- వృక్షదేశమునకు వరాహదేశమని యుండుట కథల భేదముచే నటివగ్రంథ మొక్కటి యున్నదేమోయని తలంపుగలుగుచున్నది.

(31) శ్రీపతీయమ్. సవ్యాఖ్యానమ్ గ్రం. సం. 143.

శ్లో॥ జగదుదయస్థితిసంహృతికారణ మవికారి సచ్చిదానందమ్।
శ్రీమంతం కృష్ణాఖ్యం తేజో మే హృది సదా స్ఫురతు॥
ఆచార్య శ్రీపతికృతా జాతకర్మాఖ్యపద్ధతిః।
వ్యాఖ్యాయతేమ.......... ......దేవేనయజ్వనా॥
పశ్యంతు త మిమం గ్రంథం శాస్త్రవ్యాయోపబృంహితమ్
పూర్ణం జాతకశాస్త్రాణా మలంకారం విపశ్చితః॥
శ్రీపతి రాచార్యో భీష్టదేవతానమస్కారపూర్వకం శౌతిక.........
త్యాఖ్యం గ్రంథకరణం శ్లోకేన ప్రతిజానీతే। నత్వేతి॥

శ్లో॥ నత్వా తాం గురు దేవతాం త్రిసమయజ్ఞానోద్గతేః కారణం
తత్పాదాంబురుహప్రసాదవికసద్బోధో బుధః శ్రీపతిః
శిష్యప్రార్థనయా విచార్య సకలాన్ హోరాగమార్థాన్ బహూన్
వక్ష్యే జాతకకర్మపద్ధతి మహం హోరావిదాం ప్రీతయే॥

నత్వేతి జాతకర్మపద్ధత్యాఖ్యం గ్రంథం జాతకజ్ఞానాం ప్రీత్యర్థం కరిష్యామి॥ అత్రజాతకశబ్దేన యవన బాదరాయణ విష్ణుగుప్త వరాహమిహ రాదికృతాని జాతక శాస్త్రాణ్యుచ్యంతె। తైరుపాదీయమాన భావాద్యానయనోక్తం గణితకర్మ జాతకర్మ తస్యపద్ధతిః తదపేక్షిత గణితకర్మానుపూర్వప్రతిపాదకో గ్రంథో జాతకర్మపద్ధతి రిత్యన్వర్థా సంజ్ఞా......

జాతస్యాయుర్దశావిపాకాది తనుపయోగాని యాని జ్ఞాతవ్యాని తాని ద్వితీయేనశ్లోకే నానుక్రామతి.

శ్లో॥ క్షేమో త్ర ప్రథమాహి జన్మసమయచ్ఛాయాదియంత్రైః స్ఫుటం
తత్కాలప్రభవావిలగ్నసహితాం కార్యాస్తతశ్చ గ్రహాః
సిద్ధాంతోక్తపరిస్ఫుటోపకరణైస్తైర్భావాసకృల్లగ్నతో
భావాః షడ్బలమత్రతో బలానిచతతః తేషాం విచింత్యానిషట్॥

ఇత్యాదిగా ౧౫ పత్రములు గలప్రాంతపుస్తకము దక్షిణదేశప్రతి. వ్యాఖ్యాతపేరు తెలియుటకు ధారములేకుండ మొదటం గొన్నిపంక్తులు పోయినవి.

(32) లీలావతీదండకము- గ్రంథసంఖ్య 151.

ఈదండకమును శేషయార్యుఁడు రచించెను. కచ్చిరంగరాజదండకము చంద్రావనాదండకాదులు చదివినవారి కిది చదివిన దండకములు పూర్వకాల

మునవారు రచించు ప్రణాళిక బోధపడఁగలదు. ఇందును రాజువర్ణన లేవఁగనే యద్దముచూపుట, తర్వాత సాముచేయుట, స్నానముచేసి భోజనానంతరము సభలోఁ గూర్చుండి కొంతసేపైనపిమ్మట గుఱ్ఱమెక్కి బైలుదేఱుట, వీధిలో నొక్కతె చూచి రాజును మోహించుట, దానివిరహము నిత్యాది- ఈదండకములోఁగూడ రాజుపేరు మొదటవ్రాసి పిమ్మట నాయాతావుల దుడిచివైచి రామస్వామిక్షితీంద్రుండు, ఆనందపృథ్వీంద్రపుత్త్రుండు, అని సవరించినాఁడు, కారణము తెలియదు. పలుతావుల దిద్దుఁబాట్లు జాగ్రత్తగాఁ బరిశీలించి వెలికిఁ దీయఁగా "శ్రీమూకరాజాస్యమాంభోధి సంపూర్ణచంద్రా" డని యొక్కచోటను. "శ్రీవేంకట పెరుమాళ్ళ్రాజుభూనాయకుం" డనియొక్కచోటను దోఁచినవి. ఇందలి రామస్వామిక్షితీశుఁ డెవ్వరోగాని దండకాంతమునఁ గ్రొత్తగా నీతనిపైఁ జెప్పఁబడిన పద్యములు చేర్పఁబడినవి. అవి పిమ్మటఁ గనఁబఱుపఁబడును. ఈ దండకకవిత్వము పటుత్వము గలది.

శ్రీజానకీమంజులాస్యోద్యదానందసంజాతమందస్మిత శ్రీనిదానీకృతాత్మీయవక్షస్స్థలీలావహద్దివ్యతేజః పదద్వంద్వసేవాధురీణుండు......వారాశికన్యామణీ నృత్తరంగాయితాపాంగవీక్షాకృతైశ్వర్య సంతోషితార్యాతిచాతుర్య ధుర్యానివార్యత్స్ఫురత్సాహితీమార్గసంశోభితాత్మీయకీర్తి ప్రభావుండు... ("భాస్వచ్చిదానందపత్త్రాంబుజానంద పృథ్వీంద్ర") ఇంతవఱకు గ్రొత్తగాఁ జేర్పఁబడినది- పుత్త్రుండు, శ్రీరామస్వామిక్షితీంద్రుండు......తానొక్కనాఁ డక్కజంబైన రంగారు బంగారు మేలద్దపు న్నీడతో నంబుజాక్షీవికాసస్ఫురద్గంధసంబంధి మందానిలాంకూరముల్వీవ......నిద్రమేల్కాంచి కాంచీకనత్కింకిణీకంకణంబుల్ క్వణింపంగ నచ్చెంగట న్నిల్చి......చీనాపనీహార్మ్యలన్నిగ్గులన్ ముద్దులంగుల్కు మేలద్దమున్ ముందట న్నిల్పి...నించువిల్కానివారించుచందంబుతో దంతపుం బల్కపా వాలోయారంబు గా మెట్టి...... కెంబట్టుదట్టి న్నొలంగట్టి- బన్నీలు గర్తాపురాల్ కొంతసాధించి జోడీలునున్ సంగడాల్ లోడులం దీసి గోతాము పైకెత్తికొట్టనులాసించి.. ప్రొద్దెక్క బెంజెట్టితో మల్లుపోరాడి...పట్టాను చిల్లోడి

కేడెంబుతో బూనిమాష్టిలితోఁ జేరభంగాయమానంబులౌ కాయమానమ్ములం జేసి తత్తాహ తద్ధిక్కు తధైయ్య తద్ధిమ్మి తజ్జంత తక్కిణ్ణు తద్ధోం తదోయంచు... నటుబంగ్లాపు బోటిం దగందిద్దుచందాన భారెంట మూరెంట జేసెంట దుత్తెంట బెత్తెంట వేద్రిప్పుచో మేలుమాజ్సావహో భళా చాంగు దాదా యటం

చుం గకుం బ్రీతిఁ దారంగిరు ల్లచ్చ వాహ్యాళిగా వచ్చు నన్వేమకన్ దర్పు గుల్కం బదార్వన్నెబంగారపున్నేసలన్ ఘుమ్మఘుమ్మంచు నెత్తావులంగుల్కు నక్కల్వపూచప్రపు న్నీడల న్వెన్నెలల్ బోలు చిర్నవ్వు చెక్కిళ్లపైం గుల్కు నెమ్మేను శృంగారముల్ చిల్క...విల్చూడి కన్పందునై చూచు నప్పారవారాంగనాకోటిలో మేటి నెత్తావికిం బేటి పూవిల్తు మేల్బొన్న పూఁబోండ్లకున్నిన్న... (ఒక్క తెప్రార్థింపఁగా) లాలించి తేలించి మెప్పించుచున్...సుఖానన్ చిరంజీవిగా వేడ్కనున్నాఁడటంచున్ జగద్గీతచర్యాతివిస్తారుపేరన్ గుణ ధాముపేరన్ సంపన్నిదానీకృతాక్షయ్యపద్మాక్షసేవాధురీణోల్లసన్మాన సాంభోజుపేరం గలాంభోజుపేరన్.........కవీంద్రు ల్నుతింపంగ నుద్దండవిద్వత్కవిత్వాఢ్యుఁడైనట్టి శ్రీశేషయార్యుండు కైసేయఁ శృంగారిణీదండకం బుర్వి నాచంద్రతారార్కమై వర్ధిలుంగాత !"—

దండకముపేరు మొదట లీలావతీదండకమని యొత్తుపత్రము మీఁదనున్నది దండకము చివర శృంగారిణీదండక మని చెప్పఁబడినది. ఈకవి కుద్దండుఁ డని బిరుదముగలదఁట. ఈదండకమంతయు ౧౩ పత్రములలోఁ గలదు.

ఈదండకము తరువాయిని విశేషముగా ననేకులు రాజులపేర నంకితములైన చాటుపద్యములు గలవు.

(1) పైరామస్వామినృపునిమీఁది పద్యములు.

శా. శ్రీరంజిల్లగఁ బ్రాణభర్తయెడఁ దోఁచే స్వానురాగోదయం
బాహ్లాదిం దనలోన నిండి వెలికిం బైఁబర్వెనా నాఁగరం
గారున్ లేఁదొగరొప్పు మేనుగల శ్రీకాంతాంబుజాతాక్షిగం
భీరుండై తగు రామసామినృపునిం బ్రీతిం గృపం బ్రోవుతన్. ౧

మ. ధరలో నాజికుమారవృత్తి విబుధత్రాణోత్సుకస్ఫూర్తి శం
కరధర్మాహృతసారశక్తి సుమనఃకాంతాత్మవిఖ్యాతిచే
వరల న్నీవలరామమూర్తివె యనన్వర్ధిల్లి తౌరార మేల్
స్మరసౌందర్యనిదాన దానఖని రామస్వామి భూపాగ్రణీ. ౨

శా. నీమాస్యం గటిరీవి ? గనినంతే యాహిరణ్యోదరుం
డేమో యాహరినాభిగహ్వరము నందేదాఁగె నంతన్ హరిన్
ధామాంచద్భువదేకభక్తిదహారాంతర్లీనుఁడైనిల్చె శ్రీ
రామస్వామి నృపాలచంద్ర యిది చిత్రం బయ్యెడిం జెల్వుమా. 3

కొన్ని పత్రములు విఱిగిపోయినవి. అందుఁ బెక్కుసీసములు విమలగుణ హార యానందవిభుకుమార, సరసవాగ్ధార శ్రీరామస్వామిధీర ? అని యేమో కలవు నింపుపద్యములు వ్రాయవలను లేదు. ఇట్టివి ౨౦ పద్యములున్నవి.

(2) అభ్గురిచామధీరునిపై పద్యములు.-

సీ. శ్రీనారాసింహ రాజీవాక్షుపదభక్తి భూరిసత్కవులను బ్రోచుశక్తి
సకలవిద్యలయందు సంతతం బనురక్తి నీతిధర్మములందు నింపుయుక్తి
కలిదోషవిజయవిఖ్యాతియం దాసక్తి శిష్టులయందెల్ల శీతలోక్తి
తరుణులయందుఁ గందర్పకాభివ్యక్తి యిష్టులతోఁగూడి యెపుడు భుక్తి
యెసఁగ వెలసితి వౌరౌర యిపుడిలను, నగజాకార కల్పద్రుమావతార
భళిర శ్రీలండకదిరి భూవరకుమార, సంగరకుమార యభ్గురిచామధీర. ౧

సీ. చక్కరపొంగలే సమరాన నెదిరించు మదవద్విరోధులమాంసరాశి
కమ్మనికూరలా కక్కసంపుతుటారి కుటిలవిద్వేషులగుండె లెల్లఁ
దాళఫలమ్ములా దంటగొంటరి వీరమాస్టీల కుండలమస్తకములు
కజ్జాయరాసులా గడెమనేదారుల మేనుక్రొవ్వులు మెచ్చుమందఁ
జానకంబా రణాంగణవైరిభటుల, రాశిగావించు శిరముల రక్తధార
ధరను నీకత్తి యనెడు బేతాళునికిని, సంగరకుమార యభ్గురిచామధీర.

ఇట్టివి ౧౩ పద్యము లున్నవి. నకుమ మూఁడాకు లిందు లేవని వ్రాసినారు. తొమ్మిదవ పద్యమునుండి ౧౩వ పద్యమువఱకు దానిలోఁ బోయినవి.

రఘునాథరాజు మీఁది పద్యములునుగలవు. ఈపద్యములమకుటము కలితగుణపేటి కవికోటికల్పవాటి రమ్యవాగ్ధాటి రఘునాథరాట్కిరీటి॥ కచ్చియమ్మాతభూపాలుసునకుమార విమతకవిచంద్రరఘునాథమేదినీంద్ర॥ మొ।

కొన్నిపద్యములు పూర్ణముగా లేవు.

మ. స్థిరలో యభ్గురిచామభూమిపతి హేరీ నీవు ఘోరాజిరం
బరరాజన్యనుపు బింబములు శేరంగంటిసే యుంగ భా
స్కరబింబుబును జంద్రబింబము వియత్కంజాతపత్రేక్షణా
ధరబింబంబును గంటివె చెలఁగెఁ జిత్రం బేకవాక్యోన్నతిన్.

(3) చంద్రశేఖరనృపాలునిపై పద్యము.

శా. శృంగారాస్పదమైన సక్కురుణచే శ్రీరంగనాథుండు మా
తాగోత్తుంగతురంగముఖ్యబహుళార్థశ్రేణి నీకిచ్చెనో

గాంగేయోపమ నీతిశౌర్యయుత వేడ్కం గచ్చిసద్వంశజా,
రంగాధీశ్వరుచంద్రశేఖరనృపాలా పాలితార్థివ్రజా.

ఈప్రాసములో మూఁడునాల్గు చరణలు మకుటముగాఁ గొన్నిపద్యములున్నవి.

ఉ. తెల్లమిగాఁగ ధీయనుచుఁ దేజినిమీటి పిరంగికత్తిచేఁ
బెల్లునఁ దాఁకి శాత్రవుల పిక్కలు డొక్కలు జెక్కులక్కులుం
జిల్లులు చేసి వేసితివి చెంగటిరాజులు మేలుమేలనన్
వల్లభముద్దురంగనరనాయకచంద్ర సురేంద్రవైభవా.

ఇట్టిమకుటముతో ౧౫ పద్యములున్నవి.

మ. దినమధ్యోద్భటసూర్యశౌర్యగుణసధ్రీచీనసంభావితచే
తను శత్రుక్షితిపాలజాలముల సంధుల్ సందుల్ గొందులం
దున ఘూకావళిచొప్పున న్నిలిపి తోడ్తో మేలుగన్నావహో
విను సర్వేశ్వరవిశ్వనాథ సుకృతీ విస్తారవాగ్గీష్పతీ.

ఇట్టిపద్యములుకొన్నిగలవు.

చ. వరవిజయాభిరామ శుభవైభవవిక్రమవిక్రమార్క నీ
గురుతరకీర్తికాంతకుచకుంభముల న్విలసిల్లుస్వర్ణపు
స్వరమణిహారజాలముల వైపునభాసిలె సబ్జహాండముల్
స్థిరమనుబ్రోలురంగఘనశిష్టనృపాల కృపారసోజ్జ్వలా

ఉ. దానదయాస్వరూపబలధర్మపరాక్రమచాపనైపుణిన్
ధీనిధిరంగరాజఘనతిష్టనృపాలుఁడు పోలుఁ జగ్రృశన్
వానిమఱంది వానిసుతు వానిపితృవ్యుని వానిబావనున్
వానరుజన్ము వానరుజు వైఖరిమీఱఁగ ధామణీస్థలిన్.

ఇట్టివి పెక్కుపద్యములున్నవి.

చ. ఘటనమొనర్చి స్వామిహితకార్యముతప్పక నిర్వహించి వి
స్ఫుటముగఁ గీర్తిఁగాంచె మును పొందుగ మంత్రియుగంధరుండు ది
క్తటముల వానిచందమునఁ గంటివి కీర్తిని పత్తికొండవేం
కటపతినప్పయప్రభుశిఖామణి దానకళానరున్మణీ.

ఈప్రాసముపైఁ గొన్ని పద్యములున్నవి.

—( కాళింది నీలవేణికిఁ దనయభిప్రాయంబుఁ జెప్పుట )—

ఉ. కూఁతురు పుట్టినన్ జగతిఁ గోరికతోఁ దలిదండ్రు లెల్లెడన్
ఖ్యాతిదనర్చు మేల్వరుని బంధులలో వెదకంగఁ జూతు రి
ట్లీతతి *సత్ప్రయత్నగతి నిట్టివిభుండు లభించు నప్పు డ
య్యో తలిదండ్రు లేలొకొ నయోచితిఁ గూర్పఁగఁ జాల రంగనా. ౭౯

ఉ. తల్లి ధనాఢ్యు సచ్ఛ్రుతునిఁ దండ్రియు బంధులు సత్కులీనుఁ గా
నెల్లరు నోదనప్రదుని నెన్నఁగఁ గన్నియ రూపవంతుఁగా
నెల్లెడఁ గోరు నిన్నియును నేర్పడఁ గల్గినకృష్ణుఁ గూర్ప లే
రుల్లము రంజిలం దన కయోగ్యుల యిట్టి యయోగ మారఁగన్. ౮౦

శా. ఎన్నాళ్లో గొలె నాకుఁ గూర్మి గలవారేకా చెలు ల్వీరలై
నన్నున్ డెందమునందుఁ బొందుపఱుపంగాఁజాల రై రక్కటా
నన్నుం గాంచిన తండ్రిగా తపనుఁ డైనం దాఁ బ్రసన్నుండుగా
కున్న న్వెన్నుని మన్నన న్ననయుఁగా నూహించువా రెవ్వరో. ౮౧

చ. తమమది నెన్నరే వరుని దార్చినకన్యలబుద్ధి నెట్లుగా
నమరునొ యంచుఁ గాదె జను లట్ల స్వయంవరకల్పితిఁ గాంతు రిం
తమనికితంబు లేక యిటు నాథుని మాధవుగాఁగఁ గోరికొం
టి మది గరంగి తండ్రియు వడిన్ ఘటియింపఁ డి దెట్టిభాగ్యమో. ౮౨

ఉ. కాఁకలు ముంచికొన్నమెయి గాంచినవానికి జన్మమంది నేఁ
గాఁకలు ముంచికొన్నమెయి గాంచితి హేతుగుణంబు గార్యము
న్నోఁకదె తప్పనంటిఁ గొఱనోములు నోఁచిననాక యిట్టి బ
ల్కాఁకలు గాక యాఁజమున కాఁకలు గాంచెనె సూర్యజాత నై. ౮౩

చ. గ్రహములు గన్నవారు గ్రహరాజకుమారిక సాటి గాంతు రే
రహిం నని తోడ నాడఁగ విరాజిలుదు న్మది నట్టివారె ప్ర
త్యహ మవియుక్త లై కువలయాప్తశిలామయసౌధవీథిలో
బహువిధసౌఖ్యము ల్గనఁగఁ బంకజలోచన నేనె చూచెదన్. ౮౪

వ. అని యిట్లొత్తలపడి పలుకు నమ్మిత్త్రకాళిని చిత్తంబు పురుషోత్తమాయత్తం
బగుట యెఱింగి యన్నీలవేణి యప్పువ్వుఁబోణి కిట్లనియె. ౮౫

*సంప్రయత్న-మూ.

క. ఇపు డేను బోయి రవికిం, గృపపుట్టఁగఁ దెలియఁబలికి కృష్ణుని బిలువం
జపలాక్షి పంపి వచ్చెదఁ, జపలత వోనాడి స్థిరతసంధిల*వమ్మా. ౮౬

గీ. అనిన సమ్మతించి యతివ ధైర్యంబూని, చలన ముడిగి కొంత శాంతిఁబొంది
స్నానపానవిధులు సలుపుచు నొకరీతిఁ, జెలులఁ గలసి మెలఁగి చింతదేఱె.

ఉ. అంతట నీలవేణి చెలు లందఱ కవ్విధ మెల్లఁ జెప్పి మీ
రెంతయు నాటఁ బాట మఱి యింపుల గానవిశేషవైఖరిన్
ఇంతికిఁ గృష్ణుపై మమత యించుక మైనను దోఁపకుండునా
వింతలు చూపుచుండుఁ డిట వేగమె యేఁ జని వచ్చునంతకున్. ౮౮

—॥ నీలవేణి ఛాయాదేవికిఁ గాళిందివృత్తాంతముఁ దెలుపఁబోవుట ॥—

సీ. అని నీలవేణి యి ట్లతివలతోఁ జెప్పి కాళింది నూరార్చి కడఁకమీఱ
నతిరయంబునను ఛాయాదేవికడ కేగి సరవి నాయమ కుపచారవిధులు
సలుపుచు సుతవార్తఁ దెలిపి వే వెలుఁగున కావార్తఁ దెలుపంగ నవసరంబు
వడయక సందడిఁ బడియుండె నిచటఁ గాళిందియుఁ దమకూర్చు లేమగముల
యాటపాటల వింత సయ్యాటములను, హంసగతులను కేకినాట్యములఁ జిలుక
పలుకులనుమఱపుపుట్టింపఁబడియుఁబడక, వంతమరుఁ డేఁచ మన్మథావస్థఁ జెంది.

చ. బయలును గౌఁగిలింపఁ గయిబారలు సాఁచు వికావిక న్నగుం
బయఁటఁదొలంగి కన్పడుఘన స్తనగుచ్ఛము లప్పళించుచు
న్నయమఱి పాదుదప్పి ధర నల్లుదు మైకొను పువ్వుఁదీఁగెఁ బో
లి యొరలి సజ్జపైఁ బొరలి లేచు వగ న్మరుబారి కగ్గమై. ౯౦

క. చదల శశాంకుని గనుఁగొని, మదిలో శ్రీకృష్ణు వదనమండల మనుచున్
ముద మొదవ సువదనామణి, వదనం బాగి వాంచి ప్రేలవసుధన్ వ్రాయున్.

చ. వలపులు గుల్కుపంకజము వారిజలోచను వక్త్రమంచుఁ దా
వలపులు బల్పు మైకొనఁగ వాసనచూడఁ దదంతరాళస
మ్మిళదళి వే చుఱుక్కునఁగ మెత్తనివాతెఱ నంట నొచ్చెరా
తలతలలోరి ధూర్త యని తన్వి మొగం బెగఁద్రిప్పు వేమఱున్. ౯౧

చ. చెలువలు మేనిపూఁతకయి చెంగటఁ బెట్టు మృగీమదంబుఁ దాఁ
నొలయక †యొల్లమీఱి వికచోత్పలలోచన రోషపీకణాం

* గమ్మా. † నొల్లమీరి వెనుకన్ వికసితోత్పల-మూ.

చలములఁ జుచ్ఛరం గను నిజప్రియనీలతనూపమంబుగా
మలయజగంధి గన్గొను సమందరసావహదృష్టిలీలలన్. ౯౩

క. ఘనసారరజముఁ జూడఁగ, వనజేక్షణ వెలిచి శౌరివరహాసశ్రీ
తనకు నని తలఁచి వేడుకఁ, గనుఁగొను నొకకాంతతడవు కడుమోదమునన్

ఉ. సిగ్గున మోము వాంచి సుచుఁజెక్కులఁ జెమ్మట గ్రమ్ముదేఱ మే
లగ్గుమిటారిగుబ్బచనుజక్కవ లుక్కున నిక్కి గ్రక్కునన్
లొగ్గక పైఠణీరవికలో నుమటూరఁగ సారసాక్షి చే
నిగ్గులతళ్కుఁ ద్రిప్పు హరినిద్దపుఁగ్రైసు శివాలు *డంబుగన్. ౯౪

సీ. మృదులఫాలమునందు మృగమదంబు ధరించి యొప్పుగాఁ జారురత్నమ్ముఁ బూని
నాసికాగ్రమునందు నవ్యమౌక్తిక మూని కరమున రత్నకంకణము లూని
కరతలంబున వేణుకాండంబు ధరియించి నెమ్మేన హరిచందనమ్ముఁ దాల్చి
కంఠదేశమున ముక్తాస్రజంబులు గూర్చి రాణించుపీతాంబరంబు గట్టి
కొంతతడవు సుఖించు కోమలాంగి, యాత్మనాయకకమలాసహాయవేష
సముచితాలంక్రియావస్తుసమితిఁ గొనుచు, నార్తి చేఁగొంత సేపు నకవియుఁగినియు.

గీ. మాధవుని పొందునకు నేను మనసుపడితి
నింపు గాకున్న నతఁడు నన్నేలఁడేని
అక్కటా యిద్ది కథయు దృష్టాంత మగుచుఁ
బరఁగునో యేమొ యిల రసాభాసమునకు. ౯౫

సీ. ఏగతి నతనిపొం దే నందనమ్యోద బహువల్లభాప్రియుఁ బడయు నేమి
నీరజాక్షుని గన నేన పోయెద వేగ నీయెడ నింకేమి సేయుదాన
నిటలాననిభుఁ డిటకేలమినే సెంచెఁగా యితనిమోము గనంగ నెనయుదుమతి
వేళ్ఁబ కావలె వెన్నునిఁ గోఁ బొందు నింతలో సీసౌఖ్య మేల కల్గు
నిట్టిచెలువుని మొలఁగడు నింతివిడుచు, మనసు గైకొన వెఱ్ఱియే మాధవుండు
ననుచు మన్మథవేదన నబ్బనదన, భావభేదంబులను జాల బడలుచుండు. ౯౬

గీ. ఇట్లు దరి లేని వేదన నింతి యోఁటిల, నింతనంత మెలంగెడు నిగురుఁ†బోండ్లు
మిగులనగ నూరుమనసుల మేలుదక్కి, భామ వినకుండ మెల్లనఁబల్కుకొనిరి.

గీ. తలఁప జగతి నయోగశేషంబు గాంచు
వెలఁదులను గన్నయది లేటా వినఁగ లేదో

---

*దంబాగన్. †బోట్లు.

మనచెలి యయోగవేదన గనఁగ నరిది
గడనసేయుచు విరహదుఃఖంబు నైన. ౧౦౦

క. మగబొమ్మఁ జూడనొల్లని, మగువ మగఁడు గావలె నని *మరుగుచు వేర
మ్మగుసిగ్గు మూలముట్టుగ, దిగఁద్రోచెను గాక యింతతీండ్రము గలదే. ౧౦౧

చ. అనుచుఁ దొడంగునిందుముఖుఁ లందఱు నెవ్వగఁ జెంది యొ†ల్లొకో
వనరుహపాణి నివ్వెతలఁ బాపుచుపాయము నీలవేణి వ
చ్చినతరువాత నన్నియును జెల్వగుఁ జేరకపోయె నంచు ని
ల్వనఁ దలపోయువారలకు లోలవిలోచన డాసి నిల్చెసన్. ౧౦౨

వ. ఇట్లు నిలిచిన నచ్చెలు లందఱు నీలవేణి మనమాటలోనె వచ్చె నింక నేల
వలవనివలవంత చింత లనుచుఁ గచ్చుకొని తన్నుఁ జుట్టుకొని గజిబిజిపడు
నగ్గజగమనలం గనరుకొని తనతరువాతిప్రోడ యగుశుకవాణి నిది యేమి
యో యని యడిగిన నప్పడంతి యప్పొలంతి కి ట్లనియె. ౧౦౩

—॥ కాళిందివిరహమును శుకవాణి నీలవేణికిఁ జెప్పుట ॥—

ఉ. కప్పురవీడ్య మొల్ల దొసఁగన్ జిలుగున్ జిగివల్వ గట్టఁ గా
నొప్పదు చామరంపువిస రోపఁగఁ జాలదు పూలదండలం
గొప్పున నున్పఁగానియదు క్రొన్నిలుటద్దముఁ జూడ ‡దింక నే
మప్పరొ యూడిగంపుఁబనులప్పను లన్నియు మాను నింతికిన్. ౧౦౪

చ. దిరిసెపుఁబువ్వువంటి నునుదీఁనబంగరుమేను కాఁకచేఁ
దెరలఁగఁ బాఱె నైనసదుదేర విభూషలు జాఱెఁ §జెఱ్ఱులుం
గఱకటివాఱె గుబ్బచనుగట్లు వణంకఁగ వేఁడియూపుల్
దఱచులు మీఱె నీకొలఁదనం గనరాని విరాలిఁ గూరెడిన్. ౧౦౫

క. ఎక్కడితాపము చెలువకు, నక్కజ మిది చూడ ముక్కువందలిముత్యం
బెక్కుడునూరుపుఁగాఁకల, స్రుక్కుచు బలవైరినీలరుచి స్రుక్కించెన్. ౧౦౬

ఉ. చక్కనిపెన్నిటిం గొన విచారము సేయఁగఁ గార్యసిద్ధికి
న్నిక్కము చాలఁ దప్ప నటునిల్వఁగ నంటునఁ గందు దీనిమే
నక్కెడ నిట్టితాపభర మెక్కడఁ గప్రపుఁదావు లీను నీ
చక్కనికొమ్మ నెమ్మనము చాల మహానలకీల లీనెడున్. ౧౦౭

---

*మగనిమరువేరెమ్మగు- †ట్లకో- ‡జింతయే- §చైవులు-మా-

టన్నగు కన్ని గేదఁగితుటారిమిటారికటారిఁ దాఁగటా
యెన్నికఁ దీసి యాయమున నే యదరంటఁగ దానిఁ గృష్ణ దే. ౧౧౯
గీ. అయిన నిట్టిమాట యావెలందుకయొద్ద, ననిన డిల్లగుచుచు నట్లు గాన
నరయుచను పనుడని యతివలాదిఅ దాను,నింతియింటి కేగి యెనుటనచట.
క. కనుఁగొను నెడ నచ్చేడిమ, తనమది మదనానలంబు దరికొని కాల్పన్
వనటం బొగులుచుఁ గృష్ణుఁడు, తనకన్నులఁ గట్టినట్లు దసరినఁ బెలుచన్.

—। కాళింది మనసునఁ దోఁచినకృష్ణుని బ్రార్థించుట. ।—

క. పలుకుం జెలి నునుముంజేఁ, బలుకుంజిగి ముద్దుఁజిలుకపలుకులఁ బ్రోవం
బలుకుఁగులుకొలుకుపలుకులు,పలికెం బాలుకళ్ళాడ్చిలుకు భావముఁగొలఁకన్.
ఉ. కాయము మారుబా(ణముల) గాయముల న్వగఁ బొంది వేఁడఁగా
దాయవు మోముఁ జూపవుగదా యనుగుండియ పూని యేఁపఁగా
నాయము గాదు సిగ్గు విడ నాయముగా దని మిన్నకుండఁగాఁ
జేయదు పాప మీవలపు చిత్తము తత్తఱ మారాజఁజేరవే. ౧౨౦
సీ. ఇపుడుగా కనుగల్వ లింపుసొంపులుమీఱి వెలసె నీరాకకు విబుధచంద్ర
యిపుడుగా యీమేన నెనయుతాపం బాఱె నినుఁజూడ సత్కాంతినీరవాహ
యిపుడుగా హృత్పద్మ మెసఁగె సామోదమై సరస నీవుమెలంగ సాధుసూర్య
యిపుడుగా మానసం బేర్చుభేదతమంబు స్రుక్కె నీచే సుతేజోహుతాశ
యిపుడుగా కామినీమాత్ర మెనయలేసి, సౌఖ్యసంపదఁ [illegible] ధాన
యిపుడుగా సౌమనస్యంబుసిరప్రుకొనుచు,సొబగుమీఱఁగనలరెదసురభిచరిత.
సుగంధి. మానరా చలంబు నిన్ను మాని యన్యుఁ బూనరా
పూనరా నిజార్తి మాన్పఁ బుణ్యమెంచు గానరా
కానరా కృపం దనర్చి కావు నేను దీనరా
దీన రాసికీర్తి లేదు దేవ నీకుదానరా. ౧౨౨
ఉ. చొక్కితి నీదుముద్దుజిగి చొక్కపుఁబ్రాయపు రూపుమేల్మికిం
జిక్కితిఁ గమ్మఁజేనె జడిచిల్కుటఁ (జిక్కెను) మారుబాకికి
దక్కితి నీకు వాఙ్మయసుధారసధారలు గ్రుప్పఁగింపఁగా
గ్రక్కున గారవింపు బిగికౌఁగిట జాగితు లేల నేలరా. ౧౨౩
చ. మనమెుగి సర్వకాలమును మానక నిన్నె భజింపఁ దద్బలం
బున భవదాకృతిం గనియెఁ బుణ్యవరేణ్య మనంబు కూర్మియున్

మనసిజవేదనాభరము మానుగ దేవరకేల లేవొ యి
ట్లనఁ దగు నొల్ల నీవు ఘటితాఘటనాకృతివౌదు వీశ్వరా. ౧౨౮

చ. స్థిరత గనంగఁ జాల దొగి జిత్తము బాహ్యవిశేషవస్తుసం
సరణము గాంచు నంచుఁ బలుజంపులు సేయుచుఁ బ్రోవకుండెదో
యరయ నణుప్రమాణ మగునట్టిమనంబు సమస్తకుక్షి వై
పరఁగెదు నీవు మించికొన బాహ్యముఁ జేరఁ జరింప నేర్చునే. ౧౨౯

ఉత్సాహ. వగపు జాఱ నగలు మీఱ వలపు లూరఁ జేరరా
నగవుసోన మొగముతోన నలువుపూనఁ బల్కరా
తగవు మానఁ జనదు గాన తలఁపులూనఁ గూడరా
బిగువుఁజన్ను లురము చెన్నుఁ బెరయ నన్ను నంటరా. ౧౩౦

క. కరుణ వహిం డమ సీకరణిం, గరుణ స్వనతఁ బలుక మదిఁ గనఁబడు మాయా
తరుణుం బూరకయుండిన, దరుణీమణి హృదయసీమఁ దలకొనునలుకన్.

గీ. నెనరుచేఁ బొలొసంగు నెలఁతపాలు, విసముగాఁ దలపోయుచుఁ బిన్ననాఁడు
అకట తెగఁ ద్రాగ్చపసివాఁడ నౌటఁ దెలిసి, వెండి నినుఁ గోరు పెల్లను వెఱ్ఱిగాదె.

చ. కల నయినం బయిం గనుట గానని వ్రేతలనెల్ల శీలముం
దొలఁగ విరాళి మించి రతిఁ దోఁగఁగఁ జేసితి వాదియందు ని
వ్వల బలిమాలినం దిరిగి వంగియుఁ జూడ వటన్న విన్కని
న్నలయఁగఁ గూడ దా వలపు గట్టిగఁ బట్టె న దేమిసేయుదున్. ౧౩౧

క. అగుణుఁ డరూపుఁ డనాముం, డగుట న్నాకతఁడు లక్ష్మయా యని శ్రుతులే
తెగి చాటి చెప్పఁ దెలిసియుఁ, దగని తగులునకు మనంబుఁ దాఁ బరువెత్తెన్.

చ. మునుపటిపుట్టుక న్భువనమోహిని మైథిలకన్య (కూర్మి) నిం
డినవలనభార్యఁ జిచ్చున వడింబడఁ జేసెను నిర్దయాత్ముఁ డై
నను నిపు డప్పనోభవునవారతబాణపరంపరాహుతా
శనఘనకీల ముందర నిడఁ *జాలఁడె తాళఁడె పీఁడు జాణఁడే. ౧౩౨

గీ. ఒటులు చిట్టు కృష్ణుఁడ బెటుంగక దూఱు, కొనుచు మోహావశతఁ గూరుచున్న
తరణితనయఁ జూచి తరుణులు మది మీఱు, నార్తి డాయవచ్చి యతివ కనిరి.

క. వచ్చె మనసీలవే ణిచ, మచ్చికఁ గను విచ్చి చూడు మనికిత మెల్లఁ
విచ్చును సత్యం బడెద, మొచ్చెము లే కిచ్చు తెల్ల నోదవెమఁ దల్లీ. ౧౩౩

* జా లెదు--మూ--

వ. అని పలుక నచ్చెలుకలకొలికి యించుక కన్నువిచ్చి హెచ్చు మనోజవేదనాభ
రంబున. ౧౩౪

చ. అదె సఖులార పట్టుఁడు మదంతరశాంతిసితాంతరాగసం
పదలు హరించి చోరుఁ డటు మాయమునుఁ జెందు నటంచుఁ బల్కఁగా
ముదితరొ విచె యా నవ్వును ముద్దియకో యని తారకాణగా
మది సరిపుచ్చుకొంచు నడుమాననినెవ్వగ నీలవేణియున్. ౧౩౫

ఉ. డాయఁగవచ్చి యమ్మరుకటారికి డాయఁగవచ్చు నెచ్చెలిం
బాయనికూర్మిఁ గౌఁగిటికిఁ బాల్పడఁజేయుచుఁ దల్లి చింత నీ
కీమెడ నేల చింతిత మొక్కుచుకనాఁడు సహింపఁ జేకుటుం
గా యజునాన నానకృప గల్గఁగఁ గల్గని దేమి నీకగున్. ౧౩౬

క. పరమాణుమధ్య వినుమా, పరమాణుద్రష్టలేని పట్టఁగ నిది మా
తరమా యనఁదగునట్టిది, పరమార్థం బైన దొరకుఁ బరమార్థముగన్.

క. తరళేక్షణ పరిమాణ, స్వరసంధిక్రియ విపత్రిఁజను పటుధైర్య
స్ఫురణము తద్ధస్మాంచ, త్స్వరసంగతి సాటి శోకసంగతి కమరున్. ౧౩౮

గీ. ఇట్లు నీలవేణి యొంతేని నెనరున, జెలులతోడఁ గలసి చింతదేర్చు
చుచితమైనయట్టియుపచారములు చేయు, చుండియుంచు కడయనొకదినమున.

క. ఇంతి యయోగవ్యథచే, నెంతయుఁ దెలుపెక్క మేన నెనయు త్రియామా
కాంతద్యుతులుం దెలియు ని, తాంతోష్ణిమచేత మిగులు తాఁ తక్కనిన్.

క. మొగు తెలుఁగనిబలుచిత్తడి, మిగుల నొగి లెఁగన్నుదోయి మెలఁతకు దానన్
మిగులుచు నస్మాయితాపము, తొగకంటికిఁజిత్రమరయఁదొలఁగక నిలిచెన్.

—। కాళింది చెలుల మొఱఁగి యుద్యానమున కేగుట ।—

వ. అప్పు డమ్మోహనాంగి సొంపు దొఱంగి కుసుమశరుండు కుసుమశరాసనం
బు గుడుసువడ భసలగుణంబునం బొసంగించి మించి కుసుమశరవిసరంబు
లు విస్మయగతిం గసరి ముసురుకొనఁ బరఁగింప వెఱఁగుపడి విరహపరితా
పశరధిఁ దరియు దరి లే దని తమద్భటభట చటులమపహారిచిం బడి వడిం ద
ద్విశిఖశిఖిశిఖాసంఘాతంబుల నిడి యొడలు విడుతు నని కడిందిసాహసంబున
నుడిగంపుఁబడంతులఁ గన్నెమదలుల నెఱుంగ నీయక యెల్లెఁ బమకింటి
లోని పాన్పు డిగ్గి వెడలి చనుపమయం బున. ౧౪౨

క. అత్యుద్ధతకుచజఘన, ప్రత్యుక్తం బగుచుఁ గ్రశపడు నవలగ్నం
బత్యంతదుర్బలం బై, యత్యుద్ధతు లొదవఁ జేద కబ్బనె సుఖముల్. ౧౪౩

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము |
|---|---|---|---|
| ఓరసిలు<br>ఓరసిల్లు<br>ఓరసించు | అ | ఏకపార్శ్వగమనే | ఒక ప్రక్కకుఁ బోవుట |
| ఓరు<br>ఓర్చు | స | సహనే<br>జయేచ | సహించుట<br>జయించుట |
| ఓలలాడు | అ | జలక్రీడాయాం | జలక్రీడలాడుట |
| ఓసరిలు | అ | ఏకపార్శ్వగమనే | ఒక ప్రక్కకుఁబోవుట |
| ఓసరించు | స | ఏకత్రోనోదనే | ఒక ప్రక్కకుఁద్రోయుట |
| ఓహటించు | అ | పరాగతౌ | వెనుకదీయుట |
| ఔడుగఱచు | అ | కోపేనోష్ఠదంశనే | కోపముచేతఁ బెదవులు గొఱికికొనుట |

## క

| | | | |
|---|---|---|---|
| కక్కు | స | వమనే | వమనము సేయుట |
| కచ్ | స | అక్షవ్యాపారే | సొగటాలు మొదలైనవి నడుపుట |
| క్రచ్ | స | కాంక్షాయాం | కాంక్షించుట |
| కట్టు | స | బంధే | బంధించుట |
| | అ | గవాదీనాంగర్భధారణేచ | ఆవులు మొదలైనవి చూలాలౌట |
| | అ | తిరశ్చామవశకునేచ | తిర్యగ్జాతులవశకునమౌట |
| కటకటంబడు<br>కటకటపడు | అ | సంతాపే | సంతాపపడుట |
| కడుగు | స | ప్రక్షాళనే | ప్రక్షాళనము సేయుట |
| కడచేరు | అ | పారగమనే | తుదముట్టుట |
| కడలుకొను | స | ఆక్రమణే | ఆక్రమించుట |
| కడుగొను<br>కడఁగు<br>కడంగు | అ | ఉద్రేకే | ఉద్రేకించుట |
| కత్తరించు | స | కర్తనే | కత్తెరతోఁ ఛేదించుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
|---|---|---|---|
| కతకు | | | |
| కతుకు | | | |
| కదకు | స | శునఆస్వాదే | కుక్కయాస్వాదించుట |
| కదుకు | | | |
| కదుము | స | నోదనే | అవతలఁద్రోయుట |
| కదుముకొను | స | స్థలాక్రమణే | స్థలమాక్రమించుట |
| కదియు | అ | సన్నిధానే | సమీపించుట |
| | స | ప్రాప్తౌచ | పొందుట |
| కదలు | | | |
| కదులు | అ | చలనే | చలించుట |
| కదించు | స | స్వర్ణరజతశలాకాప్రసారణే | బంగారుగాని, వెండిగానిసాగఁదీయుట |
| కందు | అ | ఊష్మణావర్ణాంతరప్రాప్తౌ | వేఁడిచేతమాఱురూపౌట |
| కనలు | అ | కోపే | కోపించుట |
| | | ఊష్మణావర్ణాంతరప్రాప్తౌచ | వేఁడిచేతమాఱురూపౌట |
| కను | స | దర్శనే | చూచుట |
| | | మానుషాదీనాం ప్రసవేచ | మనుష్యాదులుప్రసవించుట |
| కనుపించు | అ | దర్శనవిషయతాయాం | అగపడుట |
| | స | ప్రదర్శనే | చూపుట |
| | స | ప్రసవకరణేచ | ప్రసవింపఁజేయుట |
| కనుఁగొను | స | దర్శనే | చూచుట |
| కనుక్కొను | స | ప్రయాసదర్శనే | ప్రయాసముచేతఁజూచుట |
| | | ప్రసవేచ | ప్రసవించుకొనుట |
| కనుపెట్టు | స | ప్రతీక్షాయాం | ప్రతీక్షించుట |
| కనిపెట్టు | స | దర్శనావస్థానేచ | చూచుచునుండుట |
| కనుపడు | | | |
| కనుపట్టు | అ | దర్శనవిషయే | అగపడుట |
| కనుబ్రాము | | | |
| కప్పు | | | |
| కనుమొఱగు | స | ఆచ్ఛాదనే | ఆచ్ఛాదించుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| కమ్ము | స | తిరోధానే | తిరోధానము చేయుట |
| కముచు | స | గిళనే | మ్రింగుట |
| కమ్మిదీయు | అ | స్వర్ణరజతయోర్లతాకరణే | బంగారుగాని వెండిగాని కమ్మిగాఁదీయుట |
| | | పలాయనేచ | పరుగెత్తుట |
| క్రమ్మఱు | అ | పర్యావర్తనే | మఱలుట |
| కమరు<br>కమలు<br>కములు | అ | ఊష్మణావర్ణాంతరప్రాప్తౌ | వేఁడిచేత మాఱురూపాట |
| కరఁగు | అ | ద్రవనిష్పత్తౌ | ద్రవించుట |
| కరఁగు గ్రా | స | ద్రవనిష్పాదనేచ | ద్రవింపఁజేయుట |
| కఱ, కఱు | స | దాశనే | కొఱుకుట |
| కఱచు | స | అభ్యాసే | అభ్యసించుట |
| కలఁగు<br>కలతపడు<br>కలకపాఱు<br>కలఁగుపడు | అ | కాలుష్యే | కలుషమౌట |
| కలుగు | అ | లాభే | లభించుట |
| | | ఉత్పత్తౌ | పుట్టుట |
| | | కాలుష్యేచ గ్రా | కలుషమౌట |
| కలియు | స | ప్రాప్తౌ | పొందుట |
| | అ | సంయోగేచ | కూడుట |
| కలుపు | స | సంయోజనే | కూర్చుట |
| | | కలుషీకరణేచ గ్రా | కలుషముగఁజేయుట |
| కలువరించు<br>కలవరించు | అ | స్వప్నభాషణే | స్వప్నములో మాటలాడుట |
| కలగను | అ | స్వప్నప్రాప్తౌ | స్వప్నమొందుట |
| కవియు | అ | అభిముఖకలహోద్యోగే | అభిముఖముగాఁ గలహమునకుద్యుక్తుఁడౌట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము |
|---|---|---|---|
| కసురు, కసరు | స | ఉపాలంభే | తిట్టుట |
| కసుగందు | అ | పుష్పాదీనామీషత్ మ్లానౌ | పుష్పాదులు కొంచెముగా వాడిపోవుట |
| కాఁగు | అ | తప్తతాయాం | తప్తమౌట |
| కాంచు | స | దర్శనే | చూచుట |
| కాచు | స | ఫలనివృత్తౌ | ఫలించుట |
| | స | ప్రతీక్షాయాం | ప్రతీక్షించుట |
| | స | గవాదిపాలనే | ఆవులు మొదలైనవానిని బాలించుట |
| | అ | జ్యోత్స్నాతపయోః ప్రకాశేచ | వెన్నెలగాని, యెండగాని ప్రకాశించుట |
| కా | స | అపరాధసహనే | అపరాధము సహించుట |
| | | ప్రజాపాలనేచ | ప్రజలఁబాలించుట |
| కాఁచు | స | తప్తకరణే | తప్తముసేయుట |
| కాచుకొను | స | ప్రతీక్షాయాం | ప్రతీక్షించుట |
| | | అగ్న్యాతపసేవాయాంచ | నిప్పునుగాని యెండనుగాని సేవించుట |
| కాడుపడు | అ | స్మృతిభ్రంశే | స్మృతితప్పుట |
| కాన్పించు } | అ | దర్శనవిషయే | అగపడుట |
| కానిపించు } | స | ప్రదర్శనే | చూపుట |
| కానుపించు } | స | ప్రసవకరణేచ | ప్రసవింపఁజేయుట |
| కాపాడు | స | రక్షణే | రక్షించుట |
| కాయు | స | ఫలనే | ఫలించుట |
| | స | పశ్వాదిపాలనే | ఆవులు మొదలైనవానిని బాలించుట |
| | అ | జ్యోత్స్నాతపయోః ప్రకాశేచ | వెన్నెలగాని యెండగాని ప్రకాశించుట |
| కారు | అ | స్రావే | స్రవించుట |
| | | శ్లేష్మోద్గాహకంఠఖాత్కారే | శ్లేష్మమును బయటికిఁదీయుటకై కంఠమునఖాత్కారముచేయుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| కారించు | స | పీడనే | పీడించుట |
| కార్కొను<br>కారుకొను | స | కృష్ణతయావరణే | నల్లఁగాఁగ్రమ్ముకొనుట |
| కాలు | అ | దాహే | దగ్ధమౌట |
| క్రాలు | అ | ప్రకాశే | ప్రకాశించుట |
| కాల్ద్రొక్కు | స | వివాహే | వివాహమౌట |
| కావించు | స | కరణే, కారణే చేత్యేకే | చేయుట, చేయించుట |
| కావరించు | అ | మదే | మదించుట |
| క్రిక్కిరియు | అ | అతిసమ్మర్దే | మిక్కిలికదియుట |
| కికురించు | స | లాలనే | లాలనసేయుట |
| కిట్టు | స | అనుకూల్యే | అనుకూలించుట |
| | | సన్నిధానేచ | సమీపించుట |
| కినియు | అ | కోపే | కోపించుట |
| కిఱుపు | స | నేత్రసంజ్ఞాయాం | నేత్రముసంజ్ఞగాఁగదలించుట |
| కిలారించు<br>కిలకిలారించు<br>కిలాఱ్చు | అ | కోలాహలకరణే. గ్రా- | కోలాహలధ్వ  స్నేయుట |
| కీడ్వడు<br>కీడుపడు | అ | కష్టప్రాప్తౌ | కష్టమునొందుట |
| కుక్కు | స | ప్రహారే | ప్రహరించుట |
| | | నోదనేచ | త్రోయుట |
| క్రుంగు, కుంగు | అ | భారాదినాబుధ్నాధో గమనే | భారాదులచేత మొదలు క్రిందికిఁ బోవుట-దిగఁబడెననుట |
| క్రుచ్ | స | శలాకాదీనా మంతఃప్రవేశనే | కడ్డి మొదలగునవి లోపలికిఁ దూఱ్చుట |
| క్రుంచు, కుంచు | స | హీనకరణే | తక్కువచేయుట |
| | | ఆకుంచనే | ఆకుంచనము చేయుట |
| | | అధఃప్రాపణేచ | క్రిందికిఁ బొందించుట |
| కుట్టు | స | సీవనే | బట్టకుట్టుట |
| | | వేధే | చెప్పులు కుట్టుట |
| | | దంశనేచ, (పిపీలికాదీనాం) | చీమకుట్టుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| కుంటు | అ | విషమగమనే | కుంటుగా నడుచుట |
| కుడు | స | భక్షణే | భక్షించుట |
| | | ప్సాతౌచ | చప్పరించుట, (చన్నుగుడిచెనని) |
| కుతిలపెట్టు | స | బాధనే | బాధపెట్టుట |
| కుందు | అ | మనోదుఃఖే | మనస్సున దుఃఖపడుట |
| | | మృతౌచ | చచ్చుట |
| కుందుకొను | అ | స్వయమంతర్దుఃఖే | తనలోఁదాను దుఃఖించుట |
| కుదురు | అ | సంభవే | సంభవించుట |
| | | సమ్యగ్భావేచ | లెస్సయౌట |
| కుదియు | అ | హ్రాసే | హ్రస్వమగుట |
| కుదించు / కుదియించు | స | హ్రాసకరణే | తగ్గించుట |
| | | చాలనవిశేషేచ | సెనగలు మొదలైనవానిని గుదిలించుట |
| కుదియవేయు | స | ఉత్థాప్యపాతనే- దార్వాదీనాం | ఎత్తి క్రిందవేయుట |
| | | పరితక్ష్యసంయోజనేచ | కాష్ఠాదులు మొనకొట్టివేసి కూర్చుట |
| కుదిలించు | స | పురఃపశ్చాచ్చాలనే | ముందటికి వెనుకకుఁ గదలించుట |
| కునుకు | అ | నిద్రాయాం | నిద్రించుట |
| కుప్పించు | అ | ఉత్పతనోద్యమే | ఎగయుట కుద్యుక్తుండౌట |
| కుప్పటించు / కుప్పళించు | స / గ్రా | వాసస్సంహత్యపాణిభ్యాంనిర్ణేజనే | బట్ట-ముద్దగాఁజేసి రెండుచేతులతో నుదుకుట |
| కుమ్ము | స | అవహననే | దంచుట |
| | | పశ్వాది విపోథనేచ | ఆవు మొదలైనవి పొడుచుట |
| కుములు | అ | అంతరేవనిర్దాహే | లోఁగానే నిశ్శేషముగాఁ గాలిపోవుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| కుమ్మరించు | స | కుంభాదీనవపాత్ర్య తదం తస్థధాన్యాదినామధః క్షేపే | కుండ మొదలయినవానిని బోర్లించి దానిలోనుండు ధాన్యాదులను గ్రింద పోయుట |
| క్రుమ్మఱు | అ | సంచారే | సంచరించుట |
| కురియు | అ | వర్షస్రావే | వాన స్రవించుట |
| | స | వర్షణేచ | మేఘము వర్షించు |
| కుట్టు | స | ఉపాలంభే | తిట్టుట |
| కుఱుకొను | అ | త్వరాయాం | త్వరపడుట |
| కులుకు | అ | శృంగారచేష్టాయాం | శృంగారచేష్ట సేయుట |
| కుళ్ళగించు | స | కించిత్ఖననే | పాది మొదలైనవి కొంచెముగాఁ ద్రవ్వుట |
| కుళ్ళు | అ | ద్రవశైథిల్యే | మురిగిపోవుట |
| | | ప్రచ్ఛన్నరోదనేచ | తనలోఁ దా నేడ్చుట |
| కుసలఁబడు | అ | విశీర్ణపతనే | విఱుగునట్లు పడుట |
| | | ఉద్వేగేచ | దిగులుపడుట |
| కూఁకు-గ్రా | అ | అస్తమయే | అస్తమించుట |
| కూఁకొను-గ్రా, కూచుండు | అ | ఉపవేశనే | కూర్చుండుట |
| కూడు | స | ప్రాప్తౌ | పొందుట |
| | స | ఏకత్రగణనాయాం | ఒక్కకలియఁగూడు |
| | | సంయోగే | కలియుట |
| | అ | యోగ్యతాయాంచ | యోగ్యమగుట |
| కూయు | అ | శ్వరవే | కుక్క యఱచుట |
| | స | ఆహ్వానే(దాక్షిణాత్యానాం) | పిలుచుట |
| కూరు | అ | నిద్రాయాం | నిద్రించుట |
| | స | ప్రాప్తౌ | పొందుట |
| | స | ఖాతాదిపూరణేచ | గాతము మొ॥ పూడ్చుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| కూర్కు | అ | నిద్రాయాం | నిద్రించుట |
| కూర్చు | స | సంయోజనే | కూడునట్లు చేయుట |
| | | పత్త్రాపత్త్రనిర్మాణేచ | విస్తరిగుట్టుట |
| కూర్చుండు | అ | ఉపవేశనే | ఉపవిష్టుఁడగుట |
| కూలు | అ | మృతౌ | చచ్చుట |
| | | వృక్షాదిపతనేచ | చెట్టు మొదలైనది పడుట |
| కూలఁబడు | అ | విశీర్ణపతనే | కుసలఁబడుట |
| కెడయు | అ | మృతౌ | చచ్చుట |
| కెలుకు | స | లోడనే | కలియఁబెట్టుట, కుళ్ళగించుట |
| కెడలు, కెరలు, కెర్లు, క్రెళ్ళు (గ్రా) | అ | ఉద్రేకే<br>కోపేచ | ఉద్రేకించుట<br>కోపించుట |
| కేకరించు | స | అంతశ్శ్లేష్మాకర్షణే | లోపలనుండు శ్లేష్మము నాకర్షించుట |
| కేటాయించు-గ్రా | స | పృథగ్భావే | పృథక్కరించియుంచుట |
| కేరు | అ | అత్యుత్సాహేనహాసే | అత్యుత్సాహముచేత నవ్వుట |
| కొంకు | అ | హ్రీమాభయే | లజ్జచేత భయపడుట |
| కొట్టు | స | ప్రహారే | ప్రహరించుట |
| | | ఛేదనేచ | ఛేదించుట (తలకొట్టు-చెట్టు కొట్టు) |
| కొట్లాడు | అ | కలహే | కలహించుట |
| కొండాడు | స | స్తుతౌ | స్తుతియించుట |
| కొణుగు | స | ఉపాంశుజల్పనే | మెల్లగా మాటలాడుట |
| కొతుకు, కొదుకు | అ | భయవికారే | భయవికారము నొందుట |

